# స్పార్టకస్

హొవర్డ్ ఫాస్ట్

తెలుగు: ఆకెళ్ల కృష్ణమూర్తి

ముందుమాట: రాచకొండ విశ్వనాథశాస్త్రి





హైదరాబాద్ బుక్ ట్రస్ట్

I

# స్పార్టకస్

హొవర్డ్ ఫాస్ట్

తెలుగు : ఆకెళ్ల కృష్ణమూర్తి

ముందుమాట : రాచకొండ విశ్వనాథశాస్త్రి



హైదరాబాద్ బుక్ ట్రస్ట్

II



సంపాదకుడు: చేకూరి రామారావు

వెల:

సాదా ప్రతి: రూ. 13-50

మేలు ప్రతి: రూ. 20-00

తొలి ముద్రణ: 1955

మలి ముద్రణ: 1981

ముఖపత్ర రచన: సూర్య

ముద్రణ:

క్రాంతి ప్రెస్,
2, ఫ్రాన్సిస్ జోసెఫ్ స్ట్రీట్, మద్రాసు 600 001.

ప్రతులకు, వివరాలకు:

హైదరాబాద్ బుక్ ట్రస్ట్,
3-6-694 హిమాయత్ నగర్,
హైదరాబాద్ 500 029.

III

# అమరజీవి స్పార్టకస్ గురించి

రాక్షసి బొగ్గులే ఒకానొక పద్ధతిలో వజ్రపురాళ్లు అవుతాయని అంటారు. మనుష్యులు విప్లవ వీరులుగా ఆ పద్ధతిలోనే అవుతారని స్పార్టకస్ చరిత్ర మనకి నిరూపిస్తుంది. పీడన శక్తి వస్తువుల్నే కాదు, మనుషుల్నికూడా మారుస్తుంది.

అయితే, సైన్సు బోధించడానికి కాని, చరిత్ర చెప్పడానికి కాని నేను సిద్ధంగా లేను. సైన్సు నాకు రాదు. తెలియవలసినంతగా చరిత్ర నాకు తెలియదు. నిజం చెప్పాలంటే స్పార్టకస్ గురించి ఏమాటైనా చెప్పడానికి నాకు అర్హత లేదు. కానైతే, చెప్పు చెప్పమని మిత్రులు బలవంతం చెయ్యడంవల్ల ఈ సాహసంలోకి నేను దిగవలసి వచ్చింది.

అయితే, అందరికీ కొన్ని కొన్ని సంగతులు తెలిసినట్టుగానే నాకు కూడా కొన్ని భోగట్టాలు తెలుసు.

లోకంలో మనిషికి నిత్యావసరమైన వస్తువులన్నింటినీ మనుష్యుల్లో కాయకష్టం పడేవాళ్లే ఉత్పత్తి చేస్తుంటారు. ఆ శ్రమ ఫలితం మాత్రం వాళ్లకి దక్కదు. అది స్పష్టంగా అందరికీ కనిపిస్తున్నదే. కాని, అలా దక్కకపోడానికి కారణం రాముడిమీదో రహీముడిమీదో, లేక పూర్వజన్మల మీదో, మరి దేనిమీదో దేనిమీదో తోసేస్తారు. అలా ఎవరు తోసేస్తారు? అని ప్రశ్నిస్తే, ఆ శ్రమపడేవారి కష్టఫలితాన్ని ఎవరైతే దోచుకొంటున్నారో వారే నని సమాధానం చెప్పవలసి ఉంటుంది. దోపిడీచేసే వర్గాలే దాదాపు ప్రతి దేశంలోనూ పాలకవర్గాలుగా ఉంటూ వస్తున్నాయని చరిత్ర ఏమాత్రం చదువుకున్నా మనకి తెలుస్తుంది.

మనం ఎవరి కష్టంమీదైతే బతికేస్తామో, ఎవరి కష్టం తాలూకు ఫలితాన్నయితే దోచుకుంటామో వారిని గడ్డిపోచల్లా చూస్తాం, వారిని చూసి అసహ్యించుకుంటాం. వారు మనకంటె బలహీనులనో, తెలివితక్కువ

వారనో, మనకంటె నల్లగానో తెల్లగానో ఉన్నారనో, మనకంటె తక్కువ జాతివారనో మనకి మనం చెప్పుకొని, ఆ కారణంవల్లనే వారి అవస్థ అలా ఉన్నదని సమాధానాలు చెప్పుకొని, వాళ్ళ "తక్కువ"తనానికి తప్పుడు కారణాలు అంటగట్టి, మన దోపిడీని మట్టుకు నిరాటంకంగా సాగించుకొందికి మనం సర్వప్రయత్నాలూ చేస్తూ ఉంటాం.

అయితే—

దోపిడీ కాబడేవాడు ఎప్పుడో ఒకప్పుడు తప్పక తిరుగుబాటు చేస్తాడని ఈ ఇరవయ్యో శతాబ్దపు ప్రతిదేశపు దోపిడీ పాలక వర్గానికీకూడా స్పష్టంగా తెలుసు. కాని, ఈ నిజాన్ని స్పార్టకస్ తిరగబడేవరకూ కూడా ఆనాటి రోమన్ పాలకవర్గం కనుక్కోలేక పోయింది. అందువల్ల తొల్త దెబ్బతింది. తరవాత, నిలదొక్కుకొని తిరుగుబాటుని అణచివేయ గలిగింది.

పాలకవర్గం స్పార్టకస్ నించి పాఠాలు నేర్చుకొంది. స్పార్టకస్ తరవాత ఈ రోజుకి కూడా పాశ్చాత్య దేశాల పాలకవర్గాల ఏకైక లక్ష్యం (ఇప్పుడు మన దేశంలోని పాలకవర్గపు లక్ష్యంలాగే) ఏమిటీ అంటే :

శ్రామికవర్గాన్ని ఎన్నటికీ అధికారంలోకి రానివ్వకూడదు. వారిని ఎల్లకాలం అణచి ఉంచాలి. అందుకు ఎల్లప్పుడూ సర్వసిద్ధంగా ఉండాలి.

అదీ ఆ లక్ష్యం.

అందువల్లనే స్పార్టకస్‌కి అంత ప్రాముఖ్యత.

అతను ఓడిపోయేడు, చనిపోయేడు. క్రీస్తుకి పూర్వమే పుట్టేడు, గిట్టేడు. కాని అతని పేరు చెప్తే దోపిడీవారులందరికీ ఇప్పటికీ బెదురు. ఎందుకంత బెదురు? ఎందుకా? వారు శ్రామికవర్గాల జనాన్ని పందులకంటె హీనంగా చూస్తారు. కాని ఆ జనాలు ఉగ్రనరసింహులుగా మారి విజృంభించగలరన్న సత్యాన్ని చరిత్రలో మొదటిసారిగా చాటి చెప్పినవాడు స్పార్టకస్. అతను ఆ సత్యాన్ని పుస్తకం విప్పి చెప్పలేదు, కత్తి ఎత్తి చెప్పేడు. అందుకే, ఇరువర్గాలవారికీ కూడా అతను ముఖ్యుడు. ఇరు

వర్గాలవారూ అతణ్ని గుర్తించుకుంటారు—శ్రమించేవారు ఆశతో, దోపిడి దార్లు పగతో.

ప్రధానంగా బానిసల కష్టాన్ని ఉపయోగించుకొని బాగుపడిన రోమన్ పాలకవర్గం, ఆ బానిసలని ఎంత నీచంగా హేయంగా చూసి వారియెడల ఎంత దుర్మార్గంగా దారుణంగా అమానుషంగా ప్రవర్తించేదో ఈ నవల చదివితే తెలుస్తుంది. ఇప్పటికికూడా దోపిడీపాలక వర్గాలు శ్రామికవర్గాల యెడల ప్రవర్తిస్తున్నవని ఇప్పటి దోపిడిదేశాల ఏ చరిత్ర చూసినా తెలుస్తుంది. అయితే ఈ దానవులు ఆ దానవుల్లా ఉండకపోవొచ్చు. ఏమైతేనేం? దానవులు వేరైనా దానవత్వం ఒక్కటే.

చరిత్రాత్మకమైన నవల రాయడం చాలా కష్టం. రాసి ఒప్పించగలగడం ఇంకా ఎక్కువ కష్టం. కాని, ఈ నవల రాసిన హోవార్డ్‌ఫాస్ట్‌గారు అందర్నీ ఒప్పించి సఫలీకృతులయేరని చెప్పక తప్పదు, ఒప్పుకోక తప్పదు. డికెన్స్ మహాశయుడు "ఎ టేల్ ఆఫ్ టూ సిటీస్"లో ఫ్రెంచి విప్లవాన్ని చిత్రీకరించేడు. కాని, అలా చిత్రీకరించగలగడానికి అదంతా ఆయనకి దగ్గర చరిత్రే. అందులోకూడా అతని పాత్రలు చరిత్రలో ఉన్న పాత్రలు కావు. కాని, ఇందులోని స్పార్టకసే కాదు, క్రాససే కాదు, వరీనియావే కాదు, ఆఖరికి బేటియాటస్‌కూడా చరిత్రలో వారితోపాటు ఉన్నవాడే. రెండువేల సంవత్సరాల క్రిందటి వ్యక్తుల్ని మన కళ్ళకి కట్టినట్టు చూపించగలగడమే కాకుండా, ఆనాటి ఆర్థిక రాజకీయ సాంఘిక జీవితాన్ని యావత్తూ కళ్ళకి కట్టినట్టు చూపించగలిగేరు హోవార్డ్ ఫాస్ట్‌గారు.

ఇది నిజాయితీతో రాసిన నవల. ఇది ఆవేదనతో రాసిన నవల. ఇది ప్రయోజనంతో కూడుకొన్న నవల, విప్లవాలనీ వాటి కారణాలనీ నగ్నంగా చూపెట్టే నవల, సామాన్యుడు అనన్య సామాన్యుడెలా అవుతాడో చూపెట్ట గలిగిన నవల. ఇది సామాన్య జనానికి సాయుధ విప్లవమే శరణ్యమని నిరూపించి చాటి చెప్పే నవల. ఈ నవల చదువుతూంటే మీరు ఏదో ఒక సైడు ఉంటారు. ఉండక తప్పరు.

ఇటువంటి నవల అనువదించగలగడం చిన్న ఫీటు కాదు. బాగా అనువదించగలగడం పెద్ద ఫీటు. ఆ ఫీటు శ్రీ ఆకెళ్ల కృష్ణమూర్తిగారు

అద్భుతంగా చేసేరని అందరూ అంటున్నారు. ఆ మాటే నేనూ అంటున్నాను.

"స్పార్టకస్" సినిమా నేను చూసేను. అందులో స్పార్టకస్‌కి వారు న్యాయం చేకూర్చేరు. ఈ నవల్లో స్పార్టకస్ న్యాయం ధర్మం మనకి కనిపిస్తాయి. జీవితమే అతనికి అన్యాయం చేసింది. కానైతే, చరిత్రమాత్రం అతనికి న్యాయమైన స్థానం ఇచ్చి, పేదవారి తిరుగుబాటు జెండాగా అతణ్ని ఎగరేసి నిలబెట్టింది. అందుకే, ఆ జెండా అంటే పెద్దలకి గడగడ, చిన్నలకి మిలమిల.

9-7-1981
విశాఖపట్నం-2

రాచకొండ విశ్వనాథశాస్త్రి

''ఇతిహాసపు చీకటి కోణం
అట్టడుగున పడి కాన్పించని
కథలన్నీ కావాలిప్పుడు
దాచేస్తే దాగని సత్యం''

—శ్రీశ్రీ

1

# మొదటి భాగం: మే నెలలో రోమ్ - కేపువా రహదారిలో కైయస్ క్రాసస్ ప్రయాణ విశేషాలు.

శాశ్వతమైన రోమ్ నగరం నుంచి - వైశాల్యంలో కాకపోయినా అందంలో యేమాత్రం తీసిపోని కేపువా పట్టణానికి పోయే రహదారి మార్చినెల మధ్యలో రాక పోకలకు తిరిగి తెరవబడింది. అంటే దీనర్థం జనసంచారం పూర్వపు యథాస్థాయికి చేరుకుందని మాత్రం కాదు. ఆ మాటకొస్తే దేశంలో ఎక్కడా, యే రహదారిమీదా ముమ్మరంగా లాభసాటి వర్తక వాణిజ్యాలనేవి జరగనేలేదు. ఉండాల్సిన మేరకి జన సంచారమూ లేదు. దేశవ్యాప్తంగా కొద్దో గొప్పో అలజడి, కల్లోలం తలెత్తే వున్నాయి. రోమ్ - కేపువా రహదారి యీ కల్లోలానికి చిహ్నం. రహదార్లని చూసి రోమ్ ఎలా వుందో చెప్పవచ్చు. రహదార్లు శాంతి సౌభాగ్యాలలో ఓలలాడితే, రోమ్ నగరంకూడా అంతే.

ఏదేనా కార్య వ్యవహారాలమీద కేపువా వెళ్ళవలసిన వాళ్ళకి మాత్రం యే ఆటంకమూ లేదు. విలాసయాత్రలు మాత్రం యిప్పుడప్పుడే అనుమతించబడవని ప్రభుత్వం ప్రకటించింది. కొద్ది నెలలు గడిచి, కోమల కమనీయ వసంతం ఇటలీ భూభాగం మీద అడుగుపెట్టాక యీ నిర్బంధాలు సడలింపబడ్డాయి. మళ్ళీ, కేపువా పట్టణ సుందరభవనాలు, సురుచిర దృశ్యాలు రోమన్ పౌరుల్ని ప్రలోభపెట్ట సాగాయి.

కాంపేనియా పల్లెపట్టుల సహజసౌందర్యంతోబాటు తక్కువ వెలకి గిట్టు బాటయ్యే పరిమళద్రవ్యాల్ని ఆస్వాదించే వాళ్ళు కేపువాలో లాభ, సౌఖ్యాలు రెంటినీ దక్కించుకున్నారు. ప్రపంచంలోకెల్లా అద్వితీయమైన పరిమళ ద్రవ్యోత్పత్తి కర్మా గారాలు కేపువాలో నిర్మించబడ్డాయి. అరుదైన ఎన్నో రకాల వాసననూనెలూ, అత్తరువులూ, షెబా తామరపూల సారమూ, గంధపుచెక్కా, రోజ్‌వుడ్ యింకా అనేకానేక నానావిధ పరిమళ వస్తువులెన్నో కేపువాకు ఎగుమతి అవుతాయి.

రోమ్ నగరంలోకన్నా సగానికి సగం తక్కువ ధరకి కేపువాలో సెంట్లు లభిస్తాయి. సువాసన ద్రవ్యాలంటే పడి చచ్చే స్త్రీ పురుషులు యావన్మందికీ యీనాడవి

అత్యవసర వస్తువులైపోయాయి. వేరొకందుకు కాకపోయినా కేవలం వీటికోసమైనా కేపువాకు ప్రయాణం కట్టేవాళ్ళు.

## 2

రోమ్ - కేపువా రహదారిమీద మార్చిలో మళ్ళీ రాకపోకలు ప్రారంభమైన రెండు మాసాల తర్వాత మే నెలలో కైయస్ క్రాసస్, అతని చెల్లెలు హెలీనా, ఆమె స్నేహితురాలు క్లాడియా ఓ వారం రోజులపాటు బంధువుల్తో గడిపిరావడానికి కేపువాకు ప్రయాణం కట్టారు. దారిలో జరగబోయే అద్భుత సాహసకార్యాల్ని ఊహించుకుంటూ ప్రయాణోత్సాహులైన ఆ ముగ్గురూ ఓ ప్రశాంత సుప్రభాతాన రోమ్‌నుంచీ బైల్దేరారు. కైయస్ క్రాసస్‌కు పాతికేళ్ళుంటాయ్. ఉంగరాలు తిరిగిన నల్లటి జుట్టు, ఆకర్షణీయమైన ముఖం, అందమైన విగ్రహం. కులీనుడుగా, అందగాడుగా అందరిచేతా గుర్తింపు పొందాడు. క్రిందటి పుట్టినరోజున తండ్రి కానుకగా యిచ్చిన తెల్లగుర్రమెక్కి అతనూ, పల్లకీల్లో కూర్చుని అమ్మాయిలూ బైల్దేరారు. నడకకి, మోతకి అలవాటుపడి, విరామం ఎరక్కుండా యేకబిగిని అధమం పదిమైళ్ళయినా సునాయాసంగా పోగల నలుగురు బానిసలు ఒక్కొక్క పల్లకీని మోస్తున్నారు.

అయిదురోజుల ప్రయాణంలో ప్రతీ సాయంత్రం యే బంధువు భవనంలోనో, స్నేహితుని యింట్లోనో గడుపుతూ హాయిగా ఉల్లాసంగా కేపువా చేరుకుందుకు వాళ్ళు అన్ని యేర్పాట్లూ చేసుకున్నారు. దారి పొడుగునా శిక్ష చిహ్నాలు తారసపడతాయని వాళ్ళకి ముందుగానే తెలిసినా, అవి తమని కలవరపెట్టగలవని వాళ్ళు అనుకోలేదు. నిజానికి, ఆ ఆడపిల్లలిద్దరూ శిలువల్ని గురించి విని ఉత్తేజితులైపోయారు. కైయస్‌కు మొదట్నుంచీ అటువంటి వంటే ఓ సరదా; అవి అదోరకమైన ఇంద్రియ వికారం రేపేవి. ఆ దృశ్యాలు నన్నేం చికాకు పెట్టగలవులే అనే ధీమా అతనికుంది.

“శిలువ ఎక్కటంకన్నా దానికేసి చూడ్డమే బాగుంటుంది” అన్నాడు ఆ ఆడపిల్లల్తో.

“ముందు తిన్నగా ప్రయాణం కానిద్దాం” అంది అతని చెల్లెలు హెలీనా.

క్లాడియా చూడచక్కని చిన్నదేగాని ఆమె శరీరచ్ఛాయలో మెరుపు లేదు; ఆ కళ్ళల్లోకాంతి లేదు. ఉదాశీనంగా వుంటుంది. ఉత్తినే ఆపసోపలు పడ్డం కావాలని అలవాటు చేసుకుంది. క్లాడియాకన్నా హెలీనాయే అందంగా వుంటుంది. అందం,ఆకర్షణ వున్నా కైయస్ కళ్ళకి క్లాడియా మందమతిలా కనిపించింది. ఆమెలోని యే విశేషం తన చెల్లెల్ని ఆకర్షించిందో అతనికి అర్థం కాలేదు. ఆ అయిదురోజుల ప్రయాణంలో

దాని అంతు తేల్చిపారేద్దా మనుకున్నాడు. లోగడ అనేకసార్లు తన చెల్లెలి స్నేహితురాల్ని లొంగదీసుకుని పాడుచేద్దామని నిర్ణయం చేసుకున్నాడుగాని ఆమె అనాసక్తిముందు అతని నిశ్చయం అడుగంటిపోయింది.

రోమ్ దాటి కొద్దిమైళ్ళు గడిచాక శిక్షచిహ్నాలు ప్రారంభమయ్యాయి. కొద్దిమేర రాళ్ళు యిసుకమయమైన బంజరు వుంది. దానికి ఆ రోడ్డు అడ్డంగా పోయే మొదట్లో ఒక శిలువ పాతేసి వుంది. శిక్షచిహ్న ప్రదర్శనశాఖ అధికారి ఎవడోగాని చూపరులు దిగ్భ్రమచెందేటట్లు ప్రత్యేకంగా ఆ నిర్దిష్టస్థలంలో శిలువను పాతేయించాడు. ఆ శిలువ తాజాగా కోసిన దేవదారు కర్రతో చేయబడింది. శిలువ వెనక భూమి పూర్తిగా పల్లంలోకి దిగిపోయి వుంటంవల్ల స్వచ్ఛమైన ఉదయాకాశం కింద అది మొండిగా బోడిగా నిలబడి దృష్టి నాకర్షిస్తుంది. కాని దానిపై వేలాడే మనిషి మాత్రం మనకు చప్పున కనిపించడు. తల బరువుతో వాలే అన్ని శిలువల మాదిరిగానే యిదీ కొంచెం ముందుకు వేలబడి అద్భుతంగా అమానుషంగా కన్పిస్తోంది. కైయస్ గుర్రాన్ని శిలువ వేపు నడిపించాడు. హెలీనా బానిసలకి సైగచేసి అన్న వెనకాల పొమ్మని ఆదేశించింది.

ఆ శిలువముందు వాళ్ళు ఆగిపోయినప్పుడు హెలీనా పల్లకీ మోసే బానిసొకడు, "అమ్మగారూ! అమ్మగారూ! కొంచెంసేపు విశ్రాంతి తీసుకోమా!" అని అణకువతో నెమ్మదిగా అడిగేడు. అతను స్పెయిన్ దేశస్థుడు. కనుకనే వచ్చీరాని లాటిన్ భాషలో అడిగేడు. "తీసుకోండి" అంది హెలీనా. తన కుటుంబంలోని అందరి ఆడవాళ్ళకున్నట్లే ఆమెకూ కొన్ని నిశ్చితాభిప్రాయాలున్నాయ్. మృగాలనయినా, బానిసలనయినా, పెంపుడు జంతువుల నయినా నిర్దయగా చూడ్డం ఆమె అసహ్యించుకునేది.

బానిసలు పల్లకీలు దింపారు. కృతజ్ఞతాపూర్వకంగా వాటిపక్కన చతికిల పడ్డారు. శిలువకు కొద్ది దూరంలో ఓ పందిరి కింద పేముకుర్చీలో స్నేహపాత్రుడుగా కనిపించే ఓ లావుపాటి పెద్దమనిషి కూచుని వున్నాడు. అతన్లో పెద్దరికమూ, పేదరికమూ ఉట్టిపడుతున్నాయి. పెద్ద బొజ్జ. ఒక గడ్డంలా కాక అనేక గడ్డాలు కనబడే చిబుకం అతని ప్రాముఖ్యాన్ని చాటుతోంటే; మాసిన దుబ్బుగడ్డం మురికి బట్టలు, ఘోరంగా కనబడే చేతిగోళ్ళు అతని పేదరికాన్ని బైటపెడుతున్నాయి. రాజకీయాలు వృత్తిగా చేపట్టిన వేత్తలు తగిలించుకునే చిరునవ్వు మొహం తగిలించుకున్నాడు. కనుకనే, చూసీ చూడగానే స్నేహపాత్రుడుగా కనిపిస్తాడు.

"మిమ్మల్ని చూసి కూడా లేవకుండా యిల్లాగే కూర్చున్నందుకు మీరు నన్ను క్షమించాలి. కాని హృదయముందే హృదయం...." అంటూ ఆ బొజ్జమీద చెయ్యి పెట్టి చూపించాడు, హృదయం అక్కడెక్కడో వున్నట్లు.

"మీరు చాలా పెందరాళ బైల్దేరేరు. ప్రయాణాలకు యిల్లానే బైల్దేరాలి. కేపువా కేనా?"

"కేపువా కే" అన్నాడు కైయస్.

"అల్లా చెప్పండి. కేపువా నిజంగా ఆకర్షణీయమైన పట్టణం, అందాల నగరం, సొగసరి ఊరు, మణిపూసలాంటి నగరం. బంధు దర్శనానికేనా? అనుమాన మేముంది!"

"అనుమాన మేం లేదు" అన్నాడు కైయస్.

ఆడపిల్ల లిద్దరూ చిరునవ్వులు నవ్వారు. సరదా అయిన మనిషే. బలే విదూష కుడు. ఈ పిల్లలముందు విదూషక వేషమే మేలు, లాభం. ఈ వ్యవహారంలో యే మూలో డబ్బుకూడా యిరుక్కుని వుంటుందని కైయస్ అనుమానం. అయినా అతను దాన్ని ఖాతరు చెయ్యలేదు. అతని సరదాలకి, చాపల్యాలకి సరిపడా డబ్బు అతని కెప్పుడూ అందుతూనే వుంటుంది. కాబట్టి ఆ యిబ్బందిలేదు. ఆ ఆడపిల్లల ముందు యీ బొండాంహాస్యగాణ్ని అడ్డంపెట్టుకుని తన ప్రపంచజ్ఞానం ప్రదర్శించు కోవాలని ముచ్చటపడ్డాడు.

"బైటినుంచీ యీ కొత్తచోటి కొచ్చేవాళ్ళకి అన్నీ చూపించి విడమర్చి చెబుతుంటాను. కథకుడ్ని కూడా. చిన్నచిన్న తగూలు, తంపుల్లో తీర్పులు, శిక్షలు చెబుతుండేవాణ్ని. ఇంతకన్నా న్యాయాధికారి మాత్రం చేసేదేముంది? ఉద్యోగం తేడా; సిగ్గుపడాల్సిందే అనుకోండి. కాని, అడుక్కుతినటం కన్నా మీబోటివాళ్ళ కేదైనా పనిచేసిపెట్టి ఒక్క దీనారమైనా సంపాయించుకోడమే మేలు...." అని ఆ లావుపాటాయన స్వీయపరిచయం చేసుకున్నాడు.

శిలువపైన వేలాడే మానవ కళేబరాన్ని ఆ ఆడపిల్ల లిద్దరూ కన్నార్పకుండా చూస్తున్నారు. అది వాళ్ళ కట్టెదుట ఎత్తుగా, దగ్గరగా వుంది. పక్షులు పీక్కుతిని, ఎండకు ఎండి నల్లబడ్డ ఆ నగ్న మృతకళేబరంమీద వాళ్ళచూపులు నిలిచిపోయాయి. ఉండి వుండి కాకులగుంపొకటి దానిమీద వాల్తుంది. శిలువపైన ముందుకు వాలి పోయిన అతని కళేబరాన్ని చూస్తూవుంటే ముందుకు పడిపోదామని అతనికున్నట్లు, మృత్యువికారం పుట్టించే చలనంలో వున్నట్లు అనిపిస్తుంది. అతని తల ముందుకు వాలిపోయి వుంది. అతని ముఖం ఎంత భయంకరమైందోగాని అతని పొడుగాటి జుట్టు ఆ ముఖాన్ని కప్పివేసింది.

కైయస్ ఆ స్థూలకాయుడికి ఓ కాసు పడేశాడు. పుచ్చుకున్నవాడుకూడా అవ సరమైన మేరకే కృతజ్ఞత చెప్పాడు. పల్లకీ బోయీలు నోరుమెదపకుండా కూర్చు

న్నారు. శిలువకేసి పొరపాటునకూడా వాళ్ళు కన్నెత్తి చూడలేదు. వాళ్ళ కిచ్చిన శిక్షణ అటువంటిది! అందుకే ఆ మౌనం, ఆ నిర్లక్ష్యం.

"చెపాల్సివస్తే యీ శిలువ ఒక సంకేతం. ఇది అమానుషమనికాని, భయంకరమనికాని అనుకోకండమ్మా. రోమ్ యిస్తుంది; రోమ్ తిరిగి తీసుకుంటుంది. అదీగాక యీ శిక్ష నేరానికి తగ్గదే. ఒంటరిగా వేలాడుతున్న వీడు యికముందు తారసపడే వాటివేపు మీ దృష్టిని మరల్చలేడు. ఇక్కడ్నుంచీ కేపువా దాకా యిటువంటివెన్నో తెలుసా?" అనడిగాడు ఆ లావుపాటివాడు.

వాళ్ళకు తెలిసినా, అతనే చెప్తాడుకదా అని వాళ్ళు వూరుకున్నారు. భయంకర విషయాల్ని గురించే చెబుతున్నా, అతని కథనంలో ఓ నిక్కచ్చివుంది. అవే మంత భయంకర విషయాలు కావనీ, అతి సహజమైనవే ననీ అనేటందుకు అతనే ఒక నిదర్శనం. అతనో అంకె చెప్పాడు. అది సరయినదైనా, కాకపోయినా తకీ మని ఖచ్చితంగా చెప్పేశాడు.

"ఆరువేల నాలుగువందల డెభై రెండు."

బానిసల్లో కొందరు కదిలేరు. వాళ్ళు విశ్రాంతి తీసుకోడంలేదు. బిగుసుకుపోయి కూర్చున్నారు. వాళ్ళకేసి ఎవరయినా చూస్తే, వాళ్ళు తెలుసుకునే వారే; కాని వాళ్ళకేసి చూసే వాళ్ళెవరు!

"ఆరువేల నాలుగువందల డెబ్భైరెండు" పునరుద్ఘాటించాడు స్థూలకాయుడు. నిజాన్ని నిర్లక్ష్యంగా చెప్పేవాడిలా అడిగేడు కైయస్. "అంతా కలిపేనా?" హెలీనాకు తెలుసు ఆ మాటో నాటకమని. ఆ హాస్యగాడు మాత్రం ఆ ప్రశ్న బాగున్నదన్నట్లు తలూపేడు. ఒక చిన్న బెత్తంతో శిలువను చూపిస్తూ చెప్పుకుపోతున్నాడా వృద్ధ విదూషకుడు.

"అది ఒక చిహ్నం మాత్రమే. చెప్పాలంటే ఒక చిహ్నానికి చిహ్నం మాత్రమే."

క్లాడియా ముసిముసినవ్వులు నవ్వింది.

"ఆసక్తి కలుగుతుంది. ప్రాముఖ్యంకూడా వుంది. హేతువాదాన్ని ప్రక్కన పెట్టండి. హేతువాదమే రోమ్. రోమ్ సహేతుకమైనది." అతనికి సూక్తులంటే సరదా.

చటుక్కున "అతనేనా స్పార్టకస్ అంటే" అని అడిగింది క్లాడియా; అతను మాత్రం ఓపిక పోగొట్టుకోలేదు. అతను పెదిమలు చప్పరించిన పద్ధతిచూస్తే, అంత పెద్దతనంలోకూడా యేదో ఉద్రేకం లేకపోలేదు. అందుకే కైయస్ 'ఓరి ముసలి పశువా' అనుకున్నాడు.

"స్పార్టకస్ కాడమ్మా."

"అతని శవం కనపడలేదు" అన్నాడు ఓర్పుకోల్పోయిన కైయస్. "ముక్కల కింద కోసిపారేసేరు" అన్నాడా లావుపాటి మనిషి డాంబికంగా. "ముక్కముక్కల కింద నరికిపారేసేరమ్మా. మీవి సున్నితమైన హృదయాలు. విషయాలు చూస్తే హృదయవిదారకమైనవి. కాని దానిలో ఉన్ననిజం అది."

క్లాడియా కంపించింది రమ్యంగా. పూర్వమెప్పుడూ అతని కగుపించని కాంతి ఆమె కన్నులలో మెరిసింది. దాన్నే చూశాడు కైయస్. "బాహ్యమైన నిర్ణయాల నుండి జాగ్రత్తపడు" అని అతనితండ్రి యెప్పుడో చెప్పిన జ్ఞాపకం. చెప్పినా ఎంతో ముఖ్యమైన విషయాల నాయన దృష్టిలో వుంచుకొని చెప్పివుంటాడేకాని, క్లాడియా గురించి అంచనావేసే సందర్భంలో కాదు. అతను ఆ స్థూలకాయుడివైపు చూస్తూన్నట్లు తనవైపెన్నడూ చూడలేదు క్లాడియా అని అనుకొంటుండగా అతను చెప్పుకు పోతున్నాడు.

"దానిలో వున్న నిజం అది. ఇప్పు డంటారు స్పార్టకస్ అనేవాడు ఎప్పుడూ లేడని. నేనున్నా? మీరున్నారా? కేపువానుండి యిక్కడిదాకా ఏపియన్ మార్గంలో ఆరువేల నాలుగువందల డబ్భైరెండు కళేబరాలు శిలువలపై వేలాడుతున్నాయా, లేదా? అవన్నీ ఉన్నయా, లేదా? ఉన్నాయి. అయితే నన్నొకటడగనియ్యండి మిమ్మల్ని: అన్ని యెందుకు? శిక్షకు చిహ్నంఅంటే, శిక్షకు చిహ్నమన్న మాటేకద! అయితే ఆరువేల నాలుగువందల డెబ్భై రెం డెందుకు?"

"ఆ కుక్కల కది తగ్గశాస్తి" అంది హెలీనా, నెమ్మదిగా.

"వాళ్ళు తగ్గుతారా?" కుతార్కికుడిలా యెత్తేడు తలని. అతను ప్రపంచం పోకడలు తెలిసినవాడు. ఇది స్పష్టం అయింది. వాళ్ళ సంఘంలో యితనికన్న చాలా ఉన్నతస్థాయిలో వుంటేనేం. తను చెప్తే వినే కుర్రాళ్ళే వాళ్ళింకా. "ఇక్కడున్నాడే వీడు" తన కర్రతో ఆ కళేబరాన్ని చూపిస్తూ అంటున్నాడు: "చూడ్డానికి బాగానే వుంటాడు. గాలేజాతికి చెందినవాడు. ఫైర్‌ట్రాక్స్ అని చాలా ముఖ్యుడు స్పార్టకస్‌కు చాలా దగ్గరగా వుండేవాడు. వాడు చావడం నే నెరుగుదును. వీడు చావడానికి నాల్గు రోజులు పట్టిందంటే నమ్మండి. దున్నపోతులాటి మనిషి! ఎంతబలం అనుకున్నారు. చెప్పినా నమ్మరు. కాని వీడిబలం తగలెయ్య, మూడోహర్దుకు చెందిన సెక్టస్ దగ్గర నుంచి ఈ కుర్చీ పట్టుకొచ్చేను; ఆ సెక్టస్ మీకు తెలుసా. అతను మహాయోగ్యుడు, పెద్దమనిషి, మర్యాదస్తుడు. ఎంత మంచివాడో, నే నంటే ఎంత అభిమానమో. వీడ్ని చూడ్డానికి బోల్డుమంది వచ్చారు. తీర్థంలా వచ్చేసేరు, చూడతగిన వ్యవహారం మరి.

నేనేం వసూలు చెయ్యాల్సినంత వసూలు చెయ్యనేలేదు ఆమాటకొస్తే. అయినా ప్రతి ఫలాన్నిబట్టి ప్రజలు ముట్టచెప్పకపోతారా; చెపితే ఆశ్చర్యపోతారు. కాని యీ స్పార్టకస్‌తో జరిగిన యుద్ధాలనుగురించి ప్రజలలో యెంత అగాధమైన అజ్ఞానంవుందో మీకు తెలుసా? చూడండి యీ దృష్టాంతం: ఈ చక్కనిచుక్క యీమె నన్నడుగుతుంది యితనేనా స్పార్టకస్ అని. ప్రశ్నచూస్తే సహజమైనదే. కాని వీడేకనుక స్పార్టకస్ అయివుంటే యెంత అసహజమో గుర్తించారా? పెద్దింటివాళ్ళు మీరు, ప్రపంచాన్నుంచి దూరంగా యెక్కడో కాలం వెళ్ళబుచ్చుతుంటారు. అదేకాకపోతే స్పార్టకస్ తాలూకు ఒక్క వెంట్రుక కూడా యెవరికీ అగుపడకుండా అతడ్ని ముక్కలు ముక్కలు చేసేరని యీమె కీపాటికి తెలిసే వుండును. ఇత న్నలా చెయ్యలేదే. కొద్ది నాట్లుపడిన మాట వాస్తవం. ఇదిగో యిక్కడ."

ఆ కళేబరం ప్రక్కలోవున్న పొడుగాటి చార నొకదానిని కర్రతో చూపించాడు.

"ఈ నాట్లు చాలానే వున్నాయి, ముందుభాగంలో వున్నాయి. పక్కనున్నాయి. కానీ ఒక్కటీ వెనకతట్టునలేదు. మీ కివేం ఆసక్తి కల్గించవేమో కాని నిజం చెప్పాలంటే——"

పల్లకీ బోయీలిప్పు డతనికేసి చూస్తూ వింటున్నారు. వాళ్ళ కళ్ళు నల్లనిజుట్టు వెనుక దాగి మెరుస్తున్నవి.

——"వీళ్ళే యిటలీ భూభాగంలో సంచరించిన శక్తివంతులయిన సైనికులు. ఇక మనవాడి విషయానికొద్దాం. ఇతనికి నాలుగురోజులు పట్టింది చావటానికి. అప్పుడయినా ఒక రక్తనాళాన్ని కోసి రక్తాన్ని పైకి ప్రవహింపజేసేరు కనుక చచ్చాడేకాని లేకపోతే యెంతకాలం బతికేవాడో. రక్తం పైకి పోనివ్వకపోతే వుబ్బిపోతారు వీళ్లు. జాగ్రత్తగా రక్తం పైకితీసేస్తే బాగాయెండి, ఒక నెలపాటు యేవిధమైన దుర్వాసనా వెదజల్లకుండా కొద్దిపాటి కంపుతో యిల్లా పడివుంటారు. మాంసంమీద ఎండబెట్టి జాగ్రత్తచేయంమనం. అల్లాగే, వీడూ నిజంగా భయంకరమైనవాడే; నిర్లక్ష్యం, గర్వం అన్నీవుండేవి. ఇప్పు డవేంలేవు వీడిమొహ నికి. మొదటిరోజు అక్కడ వేలాడుతూ చూద్దానికి వచ్చిన ప్రతి మర్యాదస్తుడైన పౌరుడినీ తెగతిట్టాడు. అసహ్యమైన బూతులు. అటువంటి పదజాలం ఆడవాళ్ళ చెవిని పడటానికి యెవరూ సహించరు. ఏమీ మంచి పుట్టుకకాదు. ఎల్లాగైనా బానిస బానిసే; అందుకు నాకేం కోపంలే దతనంటే. ఇక్కడ నేనూ, అక్కడ వాడూ, ఎప్పుడయినా నేనే అనేవాడ్ని నీ దురదృష్టం నా అదృష్టం అని. నువ్వు సరియైన చావు చావడంలేదు. నేనో సరియైన జీవితవిధానం లేక చస్తున్నాను. నేనేం చాలినంత ఆర్జించడంలేదు. నీ తిట్టుమాత్రం నువ్వుమానవు.

నా మాటలు అతన్నేమీ కదిలించలేదు. కాని మర్నాటి సాయంకాలానికల్లా బిర్రబిగిసి పోయాడు. వాడన్న ఆఖరిమాట లేమిటో మీకు తెలుసా?"

"ఏమిటి?" గొణిగింది, క్లాడియా.

"నే వస్తా. లక్షోపలక్షలై తిరిగొస్తా! ఏం? తమాషాగా లేదూ? ఆ మాట?"

"ఏమిటి చెప్మా వాడి ఉద్దేశం?" కైయస్ ఆశ్చర్యపోయాడు. అతనికి తెలియకుండానే స్థూలకాయు డతన్ని మంత్రముగ్ధుడిగా చేసేసేడు.

"వా డనుకున్న దేమిటంటారు మీరు? మీకన్న నాకేం ఎక్కువ తెలియలేదు. పోనీ వాడు మళ్ళీ ఒక్కమాట ఆడినపాపాన పోలేదు. ఆ మర్నాడు నే నతనిని కొంచెం పొడిచి చూసేను. యేమైనా అంటాడేమోనని, వాడి నోటివెంబడి యే సూక్తీ రాలేదింక. చంపేసేవాడిలా చూసేడు రక్తపు కళ్ళల్లోంచి, అత నింక యెవరినీ చంపే స్థితిలో లేడు.

"చూసేవమ్మా" అని క్లాడియావైపు తిరిగి "వాడు స్పార్టకసే కాడు, స్పార్టకస్‌కు దగ్గఱవాడే. మంచి గట్టిపిండం. స్పార్టకస్ అనుచరులలో ఒకడే కాని అంత గట్టివాడు కాడు. స్పార్టకస్ అందరిలోకి గట్టివాడు. అతన్ని మీరు రోడ్డుమీద కలుసుకోలేరు. చచ్చి యెక్కడో కుళ్ళుతూ ఉంటా డీపాటికి. ఇంకా యేమైనా తెలుసుకోవాలనుందా మీకు?"

"వినవలసిందంతా విన్నామనే నా అభిప్రాయం" అని దీనారం అనవసరంగా ఖర్చయినందుకు విచారిస్తూ "యింక మేం బయలుదేరాలి" అన్నాడు కైయస్.

# 3

ఆ రోజుల్లో రోమ్ ప్రపంచమంతటికీ తన రహదార్లగుండా రక్తాన్ని ప్రసరింపచేసే హృదయంలా గుండేది. వెయ్యి సంవత్సరాల గడువిచ్చినా యింకే దేశమైనా సరే యిందులో మూడోవంతు పనితనం గల రోడ్లుకూడా నిర్మించగలిగి వుండేదికాదు. రోమ్ సంగతే వేరు. "మా కో రోడ్డు కావాలి" అనేది సెనేటు. రోమన్ల కా పనితనం వుండేది. ఇంజనీర్లు ప్లాను తయారుచేసేవారు. కంట్రాక్టర్లు పని చేయించేవారు. ఎక్కడికి కావాలంటే అక్కడికి బాణంలా తిన్నగాపోయే రోడ్డును శ్రామికులు నిర్మించేవారు. రోడ్డువేసే మార్గంలో ఒక కొండవుంటే ఆ కొండపని సఫా; లోతైన లోయవుంటే దానిపై ఒకబ్రిడ్జి తయారు. నది కనుక వుంటే దాని కో వంతెన. రోమ్‌ను ఆపగలిగినదీ లేదు, రోమను రోడ్డు నాపగలిగినదీ లేదు.

ఉల్లాసభరితులైన ఆ ముగ్గురూ రోమ్ నుంచి దక్షిణంగా ప్రయాణం చేస్తున్న రహదారిని ఏప్పియన్ మార్గమంటారు. ఒక వరస అగ్నిపర్వతపు మన్ను వగైరా, మరో వరస చిన్న కంకర, దానిపై రాతి పేర్పు - యీ విధంగా ఆ రహదారి కల కాలం వుండాలని నిర్మించినటువంటిది. రోమన్లు యేదేనా రహదారి వేశారంటే అది ఒకయేడు, రెండేళ్ళని కాకుండా శతాబ్దాల పర్యంతం చెక్కుచెదరకుండా వుండేది. అట్లా నిర్మించబడ్డదే ఏప్పియన్ మార్గం.

మానవజాతి పురోగమనానికి అదొక చిహ్నం; రోమ్ ఉత్పాదక శక్తికి తార్కాణం; రోమన్ ప్రజల కార్యశూరతకు ప్రతీక. రోమన్లు సృష్టించిన వ్యవస్థ సర్వోత్కృష్టమైనదని అది స్పష్టపరుస్తుంది. సక్రమం, విజ్ఞానవంతం, న్యాయశాస్త్ర సమ్మతం అయిన రోమన్ వ్యవస్థ అన్నిటినీ మించిపోయిందని అది ఉద్ఘాటిస్తుంది. విజ్ఞానం, క్రమం అత్యున్నతస్థాయిలో వున్న వనడానికి సాక్ష్యాలు ఎక్కడ పడితే అక్కడ కనిపిస్తాయి. ఆ రహదార్లమీద ప్రయాణించేసే ప్రజలకు రోడ్లవల్ల కలగ వలసిన సమస్త సౌకర్యాలు కల్గాయి కాబట్టే, ఫలానివిధంగా యిది బాగుందా లేదా అన్న అంశం ఆలోచనలోకే రాదు.

ఉదాహరణకు దూరం సూచించే యేర్పాటు ఖచ్చితంగా వుంటుంది. ప్రతి మైలుకు కొలిచినట్లుండే మైలురాళ్ళుంటాయి. ఇంకా ఊరు యిన్ని మైళ్ళుంటుందేమో ననే అంచనాలక్కర్లేదు. ప్రయాణీకులకు కావలసిన సమాచారమంతా ప్రతి మైలురాయి యివ్వనే యిస్తుంది. రోమ్‌నుంచి యెంత దూరంలో ఉన్నారో, అల్లాగే ఫార్మేయినుంచి యెంతదూరం వచ్చారో అన్న విషయం ఎప్పటి కప్పుడు తెలుస్తూనే వుంటుంది. ప్రతి ఐదేసి మైళ్ళకూ ఒక సత్రం, గుర్రాల సాలలూ, ప్రయాణీకులకు అనువైన గుర్రాలూ, భోజన పదార్థాలూ వగైరా వుంటాయి. కావాలంటే రాత్రిళ్ళు విశ్రాంతి తీసుకోడానికి సదుపాయాలుంటాయి. అలసి సొలసి వచ్చే యాత్రీకులకు స్నానాలు, హాయిగా నిద్ర పోదామనుకున్నవాళ్ళకు పడకగదులూ, ఒకటేమిటి సకల సౌకర్యాలు వున్నాయి. ఈ మధ్య కట్టినవి కొన్ని శిల్పంలో గ్రీక్ దేవాలయాలను పోలి, మార్గంలో మన మానం దించే సహజ సౌందర్యాన్ని యినుమడింపచేస్తున్నవి. ఆ రోడ్డుమీద సైనికులు రోజుకు ముప్పై మైళ్ళ చొప్పున కవాతు చేసికొనిపోగలరు. సామానుబళ్ళకు లెక్కా, జమా. ప్రవాహంలా పోయేవవి. దేశంలోని వివిధ వస్తుసంపదలనూ మోసుకుపోయేవవి. బార్లీ, గోధుమ, పోతరించిన పందులు, యినుము, టేకుకలప, బట్టలు, ఉన్ని, ఎన్నో రకాల నూనె పదార్థాలు, పళ్ళు, వెన్న, వండిన, వండని అనేకరకాల మాంస పదార్థాలు, ఒకటేమిటి లెక్కలేనన్ని అల్లాపోతూ వుండేవి ఆ రోడ్డమ్మట.

బాధ్యతాపరులైన పౌరులు, తమ తమ పల్లెప్రాంతాలను చూసిపోదామని వచ్చే మర్యాదస్తుల వర్గానికి చెందిన సంపన్నులు, వర్తక వ్యాపారాల రీత్యా తిరిగేవాళ్ళు, సరదాగా కాలం వెళ్ళబుచ్చడంకోసం ప్రయాణం చేసేవాళ్ళు, నానానేక దేశాలకూ జాతులకూ సంబంధించిన ప్రజలు, సక్రమ పద్ధతిని సాగే రోమను పరిపాలనా స్థిరత్వాన్ని చవిచూచేవారీ రోడ్డుపై ప్రయాణం చేసిన సందర్భంలో—

రోడ్డు పొడుగునా ప్రతి కొద్ది అడుగుల దూరానికీ ఒక శిలువ పాతబడి వుంది. పాతిన ప్రతి ఒక్క శిలువపై ఒక మానవకళేబరం వేలాడుతోంది.

## 4

కైయస్ అనుకున్నట్లే వాతావరణం వుంటుందా? అనుకున్న దానికన్న ఆరోజు వుదయం వేడిగానే వుంది. పొద్దెక్కినకొద్దీ శవాల కంపు ఎక్కువౌతోంది. ఈ స్త్రీలు ఆ కంపు భరించలేరు. భరించలేక చేతిరుమాళ్ళు అత్తరువులలో తడిపి మాటి మాటికీ వాసన చూసేవారు. అంతమాత్రాన వుండి వుండి వచ్చి చచ్చేలా ముక్కులు బద్దలుకొట్టే కంపుకెరటాలు ఆగనూ లేదు; వాటి దుర్వాసన వీళ్ళ బాధను హెచ్చించకనూ మాన లేదు. ఆ అమ్మాయిలకు వెగటుపుట్టి వాంతి వచ్చే పర్యంతం అయింది. కైయస్ ఆ దుర్వాసన బారినుండి తప్పించుకునేందుకు రోడ్డు ప్రక్కగా పోయేడు. దీని మూలాన ఆ రోజు అసహ్యంగా తయారయింది.

అదృష్టవశాత్తూ వాళ్ళారోజున భోజనానికి వెళ్ళిన హోటలుకు అరమైలులోపున త్రోవను కాపలాకాస్తూ ఒక్క శవమూ లేకపోవడంమూలాన ఆకలి యెప్పుడో చచ్చినా, వెగటుమాత్రం తగ్గింది. ఆ హోటలు గ్రీకు పద్ధతిని కట్టిన ఒంటి అంతస్తు భవనం. వరండా చక్కగా వుంటుంది. మేజాలమర్చిన ఆ వరండా క్రిందిభాగం ఒక చిన్న సంమలాగుండి, ఆ సంమలో ఒక చిన్న వంక పారుతూవుంటుంది. దీని కభిముఖంగా వున్న గుహచుట్టూ పరిమళాన్ని వెదజల్లే పచ్చని దేవదారు చెట్లున్నవి. ఇక్కడ బరువైన తీయని చల్లని వృక్షాల వాసనలు తప్ప మరేవాసనా లేదు. మెల్లిగా మాట్లాడుకునే భోజనప్రియుల సంభాషణా మృదునాదమూ, పారే సెలయేర్లు పాడే సంగీతమూ తప్ప మరోశబ్దం వినం. "ఎంత చక్కని ప్రదేశం" అంది క్లాడియా. పూర్వం యిక్కడాగిన పరిచయమున్న కైయస్, వాళ్ళు కూచుందుకో చోటు చూసి, కావలసిన పదార్థాల్ని అధికారపూర్వకంగా ఆజ్ఞాపించి, తెప్పించడం ప్రారంభించాడు.

అక్కడి ద్రాక్షరసం గ్లాసులలో తళతళలాడుతూ, త్రాగిన వెంటనే పోయిన ఆకలిని తిరిగి తెచ్చేదిగా వుంది. ఇతర దేశస్థులు, సైనికులు మొదలైనవాళ్ళు కూచునే

గదికాక, వీళ్ళున్నగది వేరుగా వుంది. ఇక్కడ చల్లగా నీడగా హాయిగా ఉంటుంది. ఎప్పుడైనా, యెవరైనా యిక్కడ కూచోడానికి కావల్సిన అర్హతలనుగురించి ప్రశ్నిస్తే, అది యోధులకూ, కులీనులకూ అని తెలుసుకునేవారు. అంతమాత్రాన సరిపోయేదా? ఎంతో మంది యీ యోధులనబడేవాళ్ళు, వర్తకులు, వ్యాపారస్తులు, ఉత్పత్తిదారులు, బానిస వ్యాపారం సాగించేవాళ్ళు వస్తూ పోతూ వుండే హోటలు హోటలే; అది యే కొద్దిమంది కోసమో పరిమితమై యెల్లా వుండిపోతుంది. అనుకరణ ఒకటి యేడ్చిందిగా. దానివల్లనే యీ యోధులు కులీనుల ననుకరించి అధిక ప్రసంగాభిలాషణ నణచుకొని, చెవులు బ్రద్దలయ్యే మాదిరిగా మాట్లాడకుండా వాచస్తంగా ఉండకుండా తమ ప్రవర్తనను సంస్కరించుకుంటూ వచ్చారు.

చల్లని ఉడకబెట్టిన బాతును, నారింజపండ్లనూ తీసుకురమ్మన్నాడు కైయస్. అవి వచ్చేలోపున రోమ్‌లో ఆ మధ్య ఆడబోయే నాటకం గురించి మాట్లాడడం మొదలెట్టాడు. ఆ రోజులలో చాలా వాటిలో గ్రీసు ననుకరించేవారు. ఆ విధంగానే ప్రదర్శింపబోయే ఆ సుఖాంతనాటకంకూడా గ్రీకు నాటకానికి అనుకరణ తప్ప మరేం కాదు. దాని కథావస్తువిది: ఒక నీచమైన, అసహ్యమైన ఆడది ఒక్కనాటి దర్జాకోసం, సరదాకోసం, కులాసాకోసం తన భర్త హృదయాన్ని కోసి దేవతల కియ్యడానికి అంగీకరిస్తుంది. భర్తకోసం తీరా చూడబోయేసరికి, అతను ఒక దేవుని యిల్లాలితో బాటు ఆమె శయనాగారంలో వుంటాడు. ఇక్కడినుంచి కథ పగ తీర్చుకోడంమీద ఆధారపడి వుంటుంది. హెలీనా అభిప్రాయం మాత్రం అంతే. కైయస్ కాదంటాడు. లోతైన విషయపరిశీలనాపటిమ లేకపోయినా అతని ఉద్దేశం ప్రకారం దీనిలోకూడా యెన్నో అందమైన ఘట్టాలున్నాయని.

"నాకు నచ్చింది", క్లాడియా చెప్పి వూరుకుంది. "ఒక విషయం యేం చెప్పిందో చూడాలికాని, యెలా చెప్పిందా అని యెందుకు చూడాలి అంటాను నేను" అన్నాడు కైయస్. చిఱునవ్వు నవ్వేడు. "నామటుకు నేను యేదో ఆనందిద్దామనే నాటకాలకు పోతాను. ఎవరైనా జీవన్మరణ నాటకాన్ని చూడాలనుకుంటే, మల్లయుద్ధ రంగస్థలానికి పోయి అక్కడ ఒకళ్ళ నొకళ్ళు యెల్లా పొడుచుకు చస్తారో చూడొచ్చు. నేను స్వయంగా చూసేను. ఈ మల్లయుద్ధం చూడాలని పోయేవాళ్ళందరూ యేమంత గంభీరులూ కారు; ప్రత్యేకించి జ్ఞానులూ కారు. ఏదో సరదాకోసం పోతారు అంతే."

"నువ్వు పిచ్చి రాతల్ని మన్నిస్తున్నావు కైయస్" హెలీనా వ్యతిరేకించింది.

"ఎన్నటికీ కాదు. నాటకశాలలో లక్షణానికి యేమంత ప్రాధాన్యం ఉంటుం దనుకోను. పల్లకీబోయీ కిచ్చేదానికన్నా తక్కువ వెలకే గ్రీకు రచయితను కొను

క్కోవచ్చు ననుకో. అంతమాత్రాన నేను గ్రీకు సంస్కృతిని పోషిస్తానా? పోషించను."

ఇల్లా వాళ్ళు మాట్లాడుకుంటూ ఉండగా, తమ బల్లవద్ద యెవరో ఒక వ్యక్తి తారట్లాడ్డం చూసేడు కైయస్. తక్కిన బల్లలన్నీ నిండిపోయాయి. ఆ వ్యాపారస్థుడు వాళ్లు తన నక్కడ కూచోనిస్తారా అని ఆలోచనలో పడ్డాడు.

"ఏదో కాస్త నోట్లో పడేసుకుపోదామని, నాయీ చొరబడటాన్ని మీ రన్యథా భావించకుంటే."

అతను పొడగరి, ఎత్తుకుతగ్గ శరీరం, ఖరీదయిన యీ దుస్తులనుబట్టి చూస్తే ధనవంతుడనే అనిపిస్తుంది. ఉన్నతకుటుంబాలకు చెందిన యువకులకు తప్ప తక్కిన వాళ్ళ కతనేం తేడాపాడాలుకల మనిషిగా కనిపించనే కనిపించడు. పూర్వం యీ యోధులు కులశ్రేష్టుల నీ విధంగా చూసేవారు కాదు. ధనమేనా సంపాదించ కలిగేరే కాని, మంచి వంశగౌరవమన్నది సంపాదించడానికి బజారులో తూచి అమ్మే వస్తువేం కాదని తెలిసిపోయింది. తద్వారా దాని విలువ హెచ్చిపోయింది. తనూ, తన స్నేహితుల లాగే, వీళ్లు గట్టిగా అరిచే ప్రజాస్వామిక అభిప్రాయాలకూ, వీళ్ళ నిజమైన వర్గ వాంఛలకూ మధ్యనున్న వైరుధ్యాన్ని గురించి చెప్పేవాడు.

"నా పేరు గేయస్ మార్కస్ సెన్వియస్. నేను కూచోడంవల్ల యిబ్బంది కల్గుతుందని మీ రనుకున్న పక్షంలో అనుమానించక చెప్పెయ్యండి. యేం ఫరవా లేదు" అన్నా డా యోధుడైన వర్తకుడు.

"దయచేసి కూచోండి" హెలీనా సమాధానంగా చెప్పింది. కైయస్ తననీ, తనతో వున్న ఆ అమ్మాయిల్నీ పరిచయం చేశాడు.

"మీ కుటుంబాలతో నాకు వ్యవహారాలున్నాయి" అన్నా డతను.

"వ్యవహారాలా?"

"ఔను, పశువుల వర్తకం; అంటే నే నొక కైమా వర్తకుడ్ని; కైమా తయారుచేయిస్తా. నాకు రోమ్‌లో ఒకటి, టిరేసినాలో ఒకటి యంత్రాగారా లున్నాయి. అక్కడినుంచే నే నిప్పుడు వస్తున్నాను. మీ రెప్పుడైనా కైమా తిని ఉంటే మేం తయారుచేయించినదే తినివుంటారు."

"మిమ్మల్ని కలుసుకున్నందుకు చాలా సంతోషం, మీ రడిగారని మా నాన్న గారితో చెప్తాలెండి" అంది; హెలీనా మృదువుగా, తీయని ఒక నవ్వు నవ్విం దతన్ని చూసి. ఆమెకేసి అదోమాదిరిగా చూసేడతను. 'గౌరవ కుటుంబానికి చెందినా, చెందకపోయినా నువ్వు మాత్రం ఒక ఆడదానివే' అనుకున్నా డతను.

'నాతో ఒక రాత్రి గడిపితే యెల్లాగుంటుందంటావు? గుంటముండా' అని అతను భావించినట్లనుకున్నాడు కైయస్. ఆ వర్తకుడూ, హెలీనా ఒకళ్ళ నొకళ్ళు చూసి నవ్వుకున్నారు. ఒళ్లు మండిపోయింది కైయస్‌కు. తన చెల్లెలంటే మరింత అసహ్యం పుట్టింది.

"మీ సంభాషణకు అంతరాయం కల్పిద్దామని కాదు నా ఉద్దేశం. మీ పని మీరు చూసుకోండి" అన్నాడు సెన్వియస్.

"ఒక విసుగైన నాటకం గురించి మాట్లాడుకుంటున్నాం. ఆఖరుకి విసుగొచ్చింది."

భోజన పదార్థాలు వచ్చాయి. క్లాడియా బాతుమాంసంముక్క నొకదాన్ని నోట్లో పెట్టుకోబోతూ ఒకమాటంది. తరువాత కొంతసేపటికి యీ ప్రశ్న యెందుకు వేసిందా అని కైయస్‌కు ఆశ్చర్యం కల్గింది.

"మీ కాశిక్షా చిహ్నాలు చాలా చిరాకు పుట్టించినట్లున్నాయి" ఆమె వర్తకుడితో అంది.

"చిహ్నాలా?"

"అవే ఆ శిలువేసేరే; అది."

"చిరాకా?"

"అంత తాజా మాంసాన్ని వృధా చేసినందుకు" అంది క్లాడియా తెలివిగా కాకపోయినా. అన్నదేదో కాస్త నెమ్మదిగా అంది; అని తినడం ప్రారంభించింది. కష్టంమీద కైయస్ నవ్వాపుకో గలిగాడు. మాంసం పేరు చెప్పి, తనను హాస్యం చేయడానికి పూనుకున్నారా అని సెన్వియస్ ముఖం యెఱ్ఱబారింది. తను అన్నదాని పరిణామాన్ని ఊహించుకోలేని క్లాడియా తినడంలో నిమగ్నురాలైంది. క్షమా ఉత్పత్తి చేయించే యీ వ్యక్తి పైకగుపించేటంతటి మెత్తని స్వభావం కలవాడుకాడని గ్రహించినది హెలీనా ఒక్కర్తే. ఏం జరుగుతుందో అని ఆమె చూస్తోంది. అతను మాటకుమాట అందిస్తే వ్యవహారం రసకందాయంలో పడుతుంది. చూసి సంతోషించవచ్చు ననుకొంది, అతనూ ఊరుకోలేదు.

"చిరాకని కదూ మీరంట" సెన్వియస్ అన్నాడు. "నేను దుబారా అంటే సహించను."

"దుబారానా?" నారింజతొన ఒక్కొక్కటి పైపొర ఒలుస్తూ జాగ్రత్తగా అందంగా పెదిమలమధ్య పెట్టుకుంటూ, అతనన్న మాటనే ప్రశ్నగా ఉపయోగించుకుంది క్లాడియా. "దుబారా?" కొందరికి ఆమెయందు సానుభూతి, మరికొందరికి

అమితమైన కోపం కలుగుతుంటాయి. కాని ఆమెను నిజంగా అర్థంచేసుకొన్నవాళ్ళు చాలా తక్కువ.

"స్పార్టకస్‌గాడి మనుష్యులున్నారే వాళ్ళు బాగానే వున్నారు. శుభ్రంగా మేసేరు, సగటున ఒక్కొక్కడి బరువు నూటయాభై పౌనులనుకోండి. వాళ్ళు ఆరువేల నాలుగువందల డెబ్భైరెండుమంది ఉన్నారు. అంటే తొంభై లక్షల పౌనుల తాజామాంసమున్నదన్నమాట—పోనీ ఒకప్పుడైనా ఉండేదన్నమాట?"

'అతను కావాలని అని ఉండడీమాటలు' అనుకుంది హెలీనా. ముందు రాబోయే దేమిటా అని ఆశ్చర్యంతో ఆలోచించింది. క్లాడియాకు తెలుసు. అత నన్నవన్నీ కావాలని అన్నమాటలేనని. కైయస్ అడిగాడు.

"అలాంటప్పుడు మీరు కొంటాననలేకపోయారా?"

"అన్నాను."

"అమ్మలేదా మరి?"

"చచ్చిచెడి రెండు లక్షల యాభై పౌనులు కొనగలిగేను."

'వీడి ఉద్దేశ్యం యేమిటి? మమ్మల్ని హడలగొడదామనా? వాడి నీచమైన మొరటు పద్ధతిలో క్లాడియాను తిప్పికొడదామని వాడి ప్రయత్నం లాగుంది' అనుకున్నాడు కైయస్. అతని మాటలలోని నిజానిజాలు తెలుసుకుంది హెలీనా. మంద మతి క్లాడియా యేదో ఒకటి చేస్తున్నందుకు కైయస్ సంతోషించేడు.

"మనిషి మాంసమేనా?" నెమ్మదిగా తాపీగా అడిగింది, క్లాడియా. వేదాంతి సిసిరో మాటలలో చెప్పాలంటే పరికరాలది. ఎందుకూ పనికిరాని పరికరాలు. వాటిని ఉడకబెట్టించి, కైమా చేయించి పందిమాంసంతో మిళాయించి, ఉప్పు, ఏలకులూ చల్లించేను. సగం ఈజిప్టుకీ, మరో సగం గాల్ దేశానికీ పంపించాను. ధరకూడా బాగానే వుంది."

"మీ హాస్యం అపహాస్యం అయిందనుకుంటాను" కైయస్ గొణిగాడు. అతను కుర్రవాడు. అందుకే ఈ మాంసకారి మాటలో పదునుకు తట్టుకోలేకపోయాడు. ఆ వర్తకుడు తనకు క్లాడియావల్ల జరిగిన పరాభవాన్ని జీవితాంతం మరిచిపోలేడు. అతను అమ్మిన మాంసం తిని, తననే వేళాకోళం చేసినవాళ్ళని అతను సహించగలడా మరి. కైయస్ అక్కడే వున్నాడు కాబట్టి, అతన్నికూడా దీనికి కారకుడుగా భావించ కనూ మానడు.

"నే నేం హాస్యం చేద్దామనుకోలేదే" అన్నాడు సెన్వియస్ యధాలాపంగా. "ఆమె నన్నో ప్రశ్న అడిగింది. దానికి నేను సమాధానం చెప్పేను; రెండు లక్షల

యాభై పౌన్ల బానిసల మాంసాన్ని కూరకని, వర్తకానికని నేను కొన్నాను, అంతే!"

"మీ రేమిటంత భయంకరంగా మాట్లాడేస్తున్నారు. ఇప్పుడు మీరన్నారే వర్తకానికని కొన్నానని. అదే అసహ్యించుకో తగ్గమాట, నేనెన్నడూ అటువంటిది వినలేదు. మీ సహజమైన అనాగరిక లక్షణాన్ని పోగొట్టుకున్నారు కాదు" అంది హెలీనా.

వర్తకుడు లేచాడు. అందరికేసీ చూసేడు. "క్షమించండి కావాలంటే మీ పిన తండ్రి సల్లియస్‌ను అడిగి చూడండి; ఆయనే యీ వ్యవహారమంతా పరిష్కరించేడు. ఏవో కొద్ది రాళ్లు మిగుల్చుకున్నాడు కూడా."

అని వెళ్ళిపోయేడు. నారింజకాయ తింటూనే వుంది క్లాడియా.

"ఎంత అసందర్భపు మనిషో అతను" అంది.

"ఐనా అతను చెప్పేది నిజమేనా" అంది హెలీనా.

"ఏమిటీ?"

"పోనీ అత నల్లాటివాడే అనుకో. నీకెందుకూ ఆ గాభరా?"

"మనకోసం సృష్టించిన పదహారణాల పచ్చి అబద్ధం" అన్నాడు కైయస్.

"మన కిద్దరికీ వున్న తేడాయే అది, ఎవరైనా నిజం చెప్తే నే నిట్టే తెలుసుకో గలుగుతాను," హెలీనా చెప్పింది.

అసలే పాలిపోయినట్లు కనబడే క్లాడియా దీనికి కారకురాలిని నేనేకదా అని మరింత పాలిపోయింది. లేచి విశ్రాంతి తీసుకొనే గదిలోకి నడచి వెళ్ళింది హంస గమనంతో. హెలీనా తనలో తనే చిరునవ్వు నవ్వుకుంది.

"హెలీనా! అటువంటి మాటలు వింటుంటే నీకేం అనిపించలేదూ?" కైయస్ అడిగాడు.

"ఎందుకనిపించాలి, యేమనిపించాలి?"

"కనీసం యిప్పటినుంచైనా నే నీ కైమా తినను."

"నే నెప్పుడూ తిననేలేదు" అంది హెలీనా.

## 5

వాళ్ళు ప్రయాణం సాగిస్తున్నారు. మధ్యాహ్నం అవుతుంది. సిరియా దేశస్థుడు ముజర్ షెబాల్, వాళ్ళను త్రోవలో కలుసుకున్నాడు. 'తృణగ్రాహి' అనే రత్నవర్తకం చేస్తాడతను. ఆ రాయి సూదంటురాయిలా గడ్డిపోచలను తనవైపాకర్షించుకుంటుంది. కాటుక నలుపు గెడ్డం; దానికి సెంటు రాసేడు. నలుపెక్కువై మరింత మెఱుస్తోం దా

గడ్డం. అందంగా లతలు, పువ్వులు మొదలైన కుట్టుపనితో నిండిన అతని నిడుపాటి అంగరఖా అతనెక్కిన తెల్లని గుఱ్ఱాని కిటూ అటూ వేలాడుతోంది. వేళ్ళకు వజ్ర వైడూర్య ఖచితమైన ఉంగరాలు పెట్టుకున్నాడు. అతని ననుసరించి యీజిప్షన్, బిదోయిన్ బానిసలు వెంట నడుస్తున్నారు. బానిసల తలలపై బరువైన మూటలు. లోకం పోకడల నెరిగిన ఆ వర్తకునితో కైయస్ సంభాషణ కుపక్రమించేడు. ఈ సంభాషణలో అప్పుడప్పుడు తలూపడంవఱకే కైయస్ పాత్ర. రోమన్ వ్యక్తిని కలుసుకోడమంటేనే షెబాల్‌కు గర్వకారణం; అందులోను కైయస్‌వంటి పెద్దింటి రోమన్లను కలుసుకుంటే యింక చెప్పనక్కర్లేదు. రోమన్లంటే చాలు అతనికి బ్రహ్మాండమైన, అగాధమైన ఆనందం. అసలు ప్రాచ్యులకు రోమన్లంటే కొన్ని అనుమానాలుండేవి. రోమన్లు చేసే పనులన్నీ తూర్పుదేశస్థుల ఆమోదం పొందినవి కావు. ఉదాహరణకు రోమను స్త్రీలు పరాయి మొగాడన్న అనుమానం లేకుండా, ఏ పురుషుడితోనయినా సరే స్వేచ్ఛగా అమరిక లేకుండా భుజం భుజం కలిపి తిరుగుతారు. అల్లా యెల్లా తిరగ్గలరో? ఈ విషయం వీళ్ళకేం అంతు చిక్కలేదు. షెబాల్ మాత్రం ఆ అనుమానానికి దాసుడు కాలేదు. రోమనువాడి నొకడిని కోసి చూస్తే, లోపల లోహపు రక్తనాళా లుంటాయి వాడికి. దానికి సాక్ష్యం, ఆధారం కావాలా? ఇవిగో ఈ శిక్షా చిహ్నాలు. ఈ చిహ్నాలు చూసి, తన బానిసలు కూడా బుద్ధి తెచ్చుకోగలరని అతని నమ్మకం. ఈ చిహ్నాలు వాళ్ళకు పాఠం నేర్పగలిగినందుకు అతను సంతోషించాడు.

"అయ్యా! చెపితే నమ్మరుకానండి, మా దేశంలో చాలమంది స్పార్టకస్ రోమ్‌ను జయిస్తా డనుకునేవారంటే నమ్మండి. దాంతో మా దేశంలో కూడా దాని ఛాయలు పడకమానలేదు. కొద్దిమంది బానిసలు తిరగబడ్డారు. వాళ్ళ పప్పు ఉడకనివ్వలేదు మేం. మరి లేవకుండా అణచిపారేసేం. రోమ్‌ను మీ రెంతగా అర్థం చేసుకోలేక పోతున్నారు అని చెప్పేను, నేను. పూర్వంలాగానే ఉన్నదనో, మీ చుట్టూవున్న విషయాలతో పోల్చిచూచుకునో, మీరు రోమ్‌ను తప్పు డంచనాలు వేస్తున్నారే కాని, రోమ్ అన్నది అధునాతనమైన వినూత్న సృష్టి అని గ్రహించలేకపోతున్నారు అని ఖచ్చితంగా చెప్పేనునేను. రోమ్‌దేశస్థుడు ధర్మశాస్త్రాధ్యయనపరుడు, సన్మార్గానికి పుట్టినిల్లు, పరిశ్రమ, క్రమశిక్షణ, పోడిమి, ప్రజాస్వామ్యం మొదలైన దివ్యపదజాలమే రోమ్ అని నా భావం. శాంతి సౌభాగ్యాలకు ఆటపట్టయిన రోమను రోడ్డుకూ, రోమన్ పరిపాలనా దక్షతకూ యిదే కిటుకు, మూలరహస్యం. కాని వీటి నన్నిటినీ ఆ జడులకు యెల్లా బోధపరిచేది? మీరే చెప్పండి. నా మటుకు నేనూ, యీ శిక్షాచిహ్నాలను చూసి చాలా సంతోషించాను. సంతృప్తి చెందాను. రోమ్ యెప్పుడైనా అల్ప విషయాలయం దాసక్తి చూపిందీ?

నేరానికి తగ్గ శిక్ష విధించడం ద్వారా రోమన్ న్యాయం విస్తృతకీర్తి నార్జిస్తుంది. వాడి ధైర్యం మండ, ఆ స్పార్టకస్, ప్రపంచంలోని మంచినంతనీ, ఔన్నత్యాన్నంతనీ బరిమీదికి లాగి సవాలు చేసేసేడు. పోనీ వాడు తెచ్చిపెట్టిన దేమిటయ్యా అంటే అరాజకం, దోపిడీలు, గృహదహనాలు, ఖూనీలు, అల్లకల్లోలం, నానాభీభత్సము. రోమ్ క్రమశిక్షణాబద్ధమైనది కనుకనే, రోమ్ వాడ్ని తిరస్కరించి తీసిపారేసింది....'' ఇంక ప్రవాహానికి అడ్డులేనట్లు చెప్పుకుపోతున్నాడు 'షెబాల్'. లాటిన్ భాషలో అత ననర్గళంగా మాట్లాడగల్గినా, ఆ భాష అత నుచ్చరించే పద్ధతి మాత్రం వింతగా వుంటుంది.

విని విని విసుగెత్తిపోయేడు కైయస్. అతనికి తెలియకుండానే అతని కళ్ళు విసుగుదలను బైటపెట్టడం జరిగింది. ఇది చూసి గ్రహించిన షెబాల్ క్షమాపణ కోరుకుని, హెలీనా, క్లాడియాలకు తనవద్దనున్న తృణగ్రాహి రాళ్ళు పొదిగిన హారాలను రెండింటిని బహూకరించి వెళ్ళిపోతూ, వాళ్ళ కుటుంబాలకు, రాళ్ళు కొనే కుతూహలమున్న తదితర స్నేహితులకు, తన గురించి తనవద్ద నున్న రాళ్ళను గురించి, సరసమైన ధరలను గురించి చెప్పవలసిందిగా అర్థించి వెళ్ళిపోయాడు.

''కృతజ్ఞత చూపించు'' అన్నాడు, కైయస్.

''అబ్బ, యేం నిజాయితీ'' నవ్వింది, హెలీనా.

# 6

రాత్రికి బసచేయాల్సిన హోటలుకు వాళ్ళు బయలుదేరి వెళ్ళే మార్గమధ్యంలో ఒక సంఘటన జరిగింది. ఆ సంఘటన వాళ్ళ విసుగుదలను తగ్గించింది. త్రోవను కాపలా కాయాల్సిన మూడవదళానికి చెందిన సైనికులు కొందరు అక్కడ ఆగేరు. కోసేముందు జొన్నచేలో కొన్ని కొన్ని మొక్కలు కలిపి కట్టేమాదిరిగా యీటెలు సైనిక గుడారాలలో నిలబెట్టి వాటికి డాళ్ళు, కత్తులూ, కఠార్లూ అన్నీ తగిలించారు. సైనికులంతా ఒకచోట చేరారు. పందిరివలె ఒక గుడారం వేసి దానికింద కర్రగిన్నెల్లో సారా సేవిస్తూ కూచున్నారు. వాళ్ళు మోటైనవాళ్ళు. ఢక్కామక్కీలకు తట్టుకుని, వాళ్ళశరీరాలు రాటుదేరినవి. వాళ్ళ తోలుపంట్లాములు, చొక్కాలు చెమటతో, తడిసి కంపుకొడుతున్నాయి. గట్టిగా అరవడమేకాని సున్నితంగా మాట్లాడడం అన్నది వాళ్ళకు తెలియదు. ఆ మాట్లాడే మాటలుకూడా చాలా తక్కువ; అవీ బూతులు మాత్రమే. అంతకు మించి వాళ్ళకు సాహిత్యం శూన్యం. వాళ్ళకుకూడా వాళ్ళ కవసర

మైన కొన్ని విషయాలు తెలుసు. ఏది, తెలిసినా తెలియకపోయినా ఒక్క విషయం వాళ్ళకు అనుభవైకవేద్యం అయింది. ఆ శిలువలు, వాటిపై వేలాడే కళేబరాలు, వీళ్ళ నిర్వాకమే అన్నది వాళ్ళకు బాగా తెలుసు.

కైయస్, ఆ వనితలు సైనికులను చూస్తున్నారు. సైనికుల అధికారి ఒకచేత్తో సారా గ్లాసు పట్టుకుని, మరో చేత్తో అట్టహాసంగా అభివందనము తెలియచేస్తున్నాడు. స్త్రీలుకూడా అక్కడున్నారు కాబట్టి ఆ స్త్రీలదృష్టి తనవైపు మరల్చుకోవడం యువ కుడుగా తన బాధ్యత కాబట్టి చేతిని తెగ ఊపుతున్నాడు, సైనికోద్యోగి సెల్లస్ క్వింటి యస్ బ్రూటస్. కైయస్‌కు ఒకప్పటి స్నేహితుడు. కొత్తగా ఉద్యోగంలో ప్రవేశించిన వాడు. నిర్భయంగా అవకాశాలను, పరిస్థితులను తన కనుగుణ్యంగా త్రిప్పుకొని ముందుకు పోగల్గినవాడు. దీనికి తోడు అందమైనవాడు. హెలీనాతో అతని కంతకు పూర్వమే పరిచయముంది. తన సైనికు లెల్లాగున్నారని వాళ్ళ నడిగేడు. కొత్తగా ఉద్యోగంలో ప్రవేశించినవాడికి అంతా ఉద్యోగం గొడవే. ఆ ప్రశ్నలో అతని ఉద్యోగ లక్షణం ధ్వనించింది.

“గట్టిగా అరిచే ఛాండాలపుమూక” కైయస్ కటువుగా సమాధానం యిచ్చేడు.

“అవొచ్చు. కాని మంచివాళ్ళు.”

“వాళ్ళు కూడా ఉంటే నేనేం భయపడను. కాని వాళ్ళు” అంది క్లాడియా.

“వాళ్ళు మీ బానిసలు. కావాలంటే మీ వెంట వస్తారు. ఎక్కడికి?” అన్నాడు బ్రూటస్ డాంబికంగా.

“ఈ రాత్రికి మేం సలేరియా భవనంలో బసచేస్తాం. నీకు జ్ఞాపకముందీ? ఇక్కడనుండి ఓ క్రోసుడుదూరంలో యీ రోడ్డు రెండుగా చీలుతుంది” అన్నాడు కైయస్.

“అయితే రెండు మైళ్ళవరకు ప్రపంచంలో దేనికీ మీరు భయపడనక్కర లేదన్నమాటే” బ్రూటస్ యీ మాట గట్టిగా అని హెలీనా నడిగాడు:

“సైనికవందనం సమర్పించే దళంతో మీ రెప్పుడైనా”—

“అబ్బే, అంత గౌరవం పొందడానికి నే నేమంత ప్రాముఖ్యం కలదాన్ని.”

“నాకు మీరే ముఖ్యులు” చెప్పే డా ఉద్యోగి. “నా కో అవకాశం యిచ్చి చూడండి. వాళ్ళందరినీ మీ పాదాలపై వాలేలా చేస్తాను. ఆ దళం మీది” ద్రాక్షసారా పూర్తిచేసి గ్లాసును బానిసవైపు విసిరాడు. అతని మెడలో వేలాడే వెండిబిగులు తీసేడు.

“వాళ్ళను నా పాదాలపై వాలేలా చేసుకుందుకు నే నిష్టపడను.”

సారా త్రాగడం పూర్తయాక ఆ వెండి బిగులూదడం ప్రారంభించాడు. మంత్ర ముగ్ధంచేసే నాలుగు ఆరోహణ, అవరోహణ స్వరాల కంపనం వినిపించింది. ఆ స్వరాలు సైనికుల్ని అధికారపూర్వకంగా పిలుస్తున్నాయి. దీనికి సమాధానంగా సైని కులు మిగిలిన సారాను ఒక గ్రుక్కలో మ్రింగి తమలో తామే తిట్టుకుంటూ, యిద్ద రిద్దరి చొప్పున యీటెలు నిలబెట్టిన చోటుకు వెళ్ళి ఆయుధాలను తీసుకుంటున్నారు. బ్రూటస్ తిరిగి అవే స్వరాలను పలికించేడు, అదేపనిగా కదలవలసిందిగా నిర్బంధి స్తున్న ఆ శబ్దం సైనికుల నరాలపై, మెదడుపై ఒత్తిడి కలుగజేస్తోందా అనిపిస్తుంది. బిగు లూదడమేమిటి, ఒకమారు చలనం కనిపిస్తుంది. క్రమశిక్షణ కన్పిస్తుంది. వాళ్ళంతా సంసిద్ధులయ్యారు. చిన్న జట్లుగా చేరారు. బూట్లు టకటకా చప్పుడయాయి. కవాతు చేశారు. మళ్ళీ విడిపోయారు. కొంద రటూ కొంద రిటూ చేరారు. రెండు వైపులా ఆ రెండు వరుసలూ నిలబడ్డాయి. ఉట్టిగా నిలబడ్డానికి యెంత యంత్రతుల్య మైన క్రమశిక్షణ; ఈ గొడవ ఆడపిల్లలకు బాగా నచ్చింది. చేతులు విరిగేలా చప్పట్లు కొట్టేరు. స్నేహితుని చేష్టలు తన కేమీ నచ్చకపోయినా సైనిక శిక్షణ కచ్చేరువందిన కైయస్ కూడా మెచ్చుకోక తప్పలేదు.

"అంత బాగానూ యుద్ధం చేయగలరా వాళ్ళు?" కైయస్ అడిగాడు.

"స్పార్టకస్‌నే అడగవోయ్" అన్నాడు బ్రూటస్.

"బలే! బలే!" గట్టిగా అంది, క్లాడియా.

బ్రూటస్ వంగి ఆమెకు సలాం చేసేడు. ఆమెకు నవ్వాగలేదు. అంత గౌరవం ఆమె యెన్నడూ పొందలేదు. ఆనాటి ఆమె ప్రవర్తన ఆమెకే అలవాటులో లేనిదను కున్నాడు కైయస్. వాళ్ళు కవాతు చేస్తున్నంతసేపూ ఆమె కళ్ళల్లో అంతులేని ఆనం దావేశాలు మెరుస్తున్నాయి. ఒక కొత్త రంగొకటి ఆమె బుగ్గలపై అలముకొని, ఆమె ముఖంలో మార్పు తెచ్చింది. బ్రూటస్‌తో ఆమె అంత చనువుగా మాట్లాడుతుంటే, కైయస్‌లో ఆశ్చర్యం కన్న మరో భావం, ఒక అనుమానం మరింతగా పనిచేసింది. బ్రూటస్ పల్లకీల నడుమగా నడుస్తూ యీ జనసమూహాన్నంతటినీ నడిపించడం తన పనిగా పెట్టుకున్నాడు.

"వాళ్ళింకా యేం చెయ్యగలరు!" క్లాడియా అడిగింది.

"కవాతు చేయగలరు; దెబ్బలాడగలరు; తిట్టగలరు—"

"చంపగలరా?"

"చంపడమా? ఓ వాళ్ళు చంపగలరు. ఏం? అల్లా కనబడరా?"

"వాళ్ళ తీరు, నాకు బాగా నచ్చింది" అంది క్లాడియా.

బ్రూటస్ ఆమెను జాగ్రత్తగా పరీక్షగా చూసేడు. చూసి మెల్లిగా అన్నాడు:

"నిజంగా నీ కిష్టమనే అనుకున్నాను."

"ఇంకేం చేస్తారు?"

"ఇంకేం కావాలి?" బ్రూటస్ ప్రశ్నించాడు: "వాళ్ళ పాట వినాలని ఉందా?" అని వాళ్ళవైపు తిరిగి "పదం పాడుతూ కదంతొక్కండోయ్!" అని అరిచేడు. వాళ్ళ బండగొంతుకలు అరవడం ప్రారంభించాయి. ఆ పదానికి అవరోహణ మొక్కటే ఉంటుంది.

"ఆకసం, భూమి, రోడ్డు, రాయి, ఉక్కు కోసేస్తుంది, ఎముకవఱకు!" ఛందస్సు వగైరా విషయాలను పాటించని ఆ పాట వాళ్ళందరి నోళ్ళల్లోనూ పడి అస్పష్టంగా, గొడవగా అంతా కలిసిపోయి యేదో ఒకే శబ్దంగా తయారయింది. మాటలు వినబడనీయకుండా పాటపాడుతున్నారు వాళ్ళు. పాడడమేమిటి? అరుస్తున్నారు.

"ఏమిటి దీని అర్థం?" తెలిసికోవాలని హెలీనా అడిగింది.

"అర్థం యేముంటుంది? కవాతు చేసేటప్పుడు పాడేపాటల కో అర్థంకూడానా? ఆకసం, భూమి, రోడ్డు, రాయి - ఏముంది దీన్లో ఏమీ లేదు; ఈ పాట బానిస యుద్ధంలో తయారుచేసేరు. ఒకటి, వాళ్ళు బాగా కవాతు చేయగలరు, అంతే. కొన్ని స్త్రీలు వినకూడని పాటలుకూడా వున్నాయి."

"అది నేను వినొచ్చు" క్లాడియా చెప్పింది.

"అయితే అవి నీ చెవిలో నెమ్మదిగా చెప్తా," అని అతను నవ్వేడు. నడుస్తున్న ఆమె చెవిలో వినకూడని పాటలు అని వినిపించాడు. వినిపించడం అయాక తిరిగి టంచెన్‌గా నడుస్తున్నాడు. అతన్ని తేరిపార జూచింది, క్లాడియా. తిరిగి రోడ్డును శిలువ లలంకరించేయి, జపమాలలోని పూసలవలె. వాటికేసి చూచి బ్రూటస్ ఆమె నడిగేడు: "యింతకన్న వీటిని బాగా చెయ్యాలంటారా! అది యీ సైనికుల పని. మా వాళ్ళో ఎనిమిదివందలమందిని శిలువేసేరు. అంత బాగుండకపోవచ్చుకాని, మావాళ్ళున్నారే మహా మొండిఘటాలు; చావును యిచ్చి పుచ్చుకోడంలో వెనకాడరు."

"అందుకే నేమిటి, ప్రపంచంలోకల్లా గొప్ప సైనికులని వీళ్ళు పేరు సంపాదించినది?" హెలీనా అడిగింది.

"అందుకు కాక మరెందుకు?"

"ఒకళ్ళ నిక్కడకు పిలిపించండి" క్లాడియా అడిగింది.

"ఎందుకు?"

"నే నడిగేను కాబట్టి."

"అల్లాగే" అని సైనికులవైపు తిరిగి గట్టిగా అరిచేడు: "సెక్టస్, దళంవదలి యిక్కడకు రా!"

ఒక సైనికుడు కవాతు చేసుకుంటూ వచ్చి, ఉద్యోగికి సలాంచేసి అతని ముందుగా నడుస్తున్నాడు. క్లాడియా పల్లకిలో కూచుని చేతులు కట్టుకుని తదేకధ్యానంతో ఆ సైనికుడ్ని పరిశీలనగా చూస్తోంది. ఒక మోస్తరు పొడుగూ, బలంగా కండలు తిరిగిన శరీరమూకల ఆ సైనికుడు గోధుమరంగులో వున్నాడు. మంచి శరీర పటుత్వం కలవాడు. నిటారుగా నిలబడి చెమటలు కక్కుతున్నాడు. అతని చేతిలో బలమైన యీటె వుంది. అతను యినుప బిళ్ళలు తగిలించిన తోలుచొక్కా తొడుక్కున్నాడు. రెండో చేతిలో బరువుగా, దళసరిగా వుండే స్పానిష్ కత్తి పట్టుకున్నాడు. వీపుమీద భోజనాది అవసర సామగ్రి భద్రపరిచే సంచి ఒకటుంది. దానిమీద నాల్గడుగుల వ్యాసం కల్గిన పెద్ద డాలు వేలాడుతోంది. తలపై ఉక్కు శిరస్త్రాణం అమరి వుంది. బరువైన బూట్లూ, తోలు పంట్లాం, డాలూ మొదలైనవన్నీ అతని బరువును మరింతబరు వెక్కిస్తున్నాయి. ఇన్నిటిని మోస్తూకూడా అంత సులభంగా యేమీ కష్టంలేకుండా యెల్లా కవాతు చేస్తున్నాడు. వీడో ఉక్కుమనిషిలాగున్నాడే అనిపిస్తాడు చూచిన వాళ్ళకు. అతను మోసే ఉక్కు సరుకు నూనెతో నిండి వుంది. కవచమూ నూనె మయమే. యంత్రాలు కొన్ని కొన్ని వ్యాపార వస్తువులూ ఒక రకమైన వాసన వెద జల్లుతాయి. ఆ విధంగానే చెమట తోలు, నూనె కలిసి అతను కంపుకొడుతున్నాడు.

వాళ్ళ వెనుకగా ప్రయాణం చేస్తున్న కైయస్‌కు క్లాడియా ముఖం ఒక చెంప కనిపిస్తోంది. నోరు తెరచుకొని, నాలికతో పెదిమలను తడుపుతూ, సైనికుడ్ని అదే పనిగా, యెగా దిగా చూస్తోంది.

"అతన్ని నా పల్లకీ దగ్గఱకు పంపండి" బ్రూటస్‌ను మెల్లిగా అడిగింది క్లాడియా.

అతనాశ్చర్యపోయేడు. అర్థంకాక భుజా లెగరేసి చేతులు త్రిప్పి సైనికుడ్నాజ్ఞా పించేడు, ఆమె కోరినవిధంగా. సైనికుడు వెనుదిరిగి యీమె పల్లకీ ప్రక్కకు వచ్చేడు. క్రమశిక్షణను ప్రక్కకునెట్టి చిన్న చిరునవ్వొకటి అతని పెదవుల నాక్రమించుకుందా మనుకున్నది. కాని క్రమశిక్షణది పైచెయ్యికాగా అది వైదొలగింది. ఒక్క క్షణం అతనామె కళ్ళల్లోకి చూసేడు. కాని యింతలో క్రమశిక్షణ జోక్యం కల్గించుకుని ఆమె ప్రసక్తిలేని చూపులనే అతను చూసేలా చేసింది. మోకాలుమీద నిక్కరుకింద మంచి బలమైన కండ వంపు తిరిగి వుంది. ఆమె ఆ కండను అంటీ అంటనట్లుగా తాకింది.

"అతన్ని పొమ్మందు బాబూ! చెడ్డకంపు కొడుతున్నాడు."

హెలీనాకు యిదేమీ అర్థం కాలేదు. ఈమారు బ్రూటస్‌కు అసలే అర్థం కాలేదు. ఎందుకు రమ్మందో, ఎందుకు పొమ్మందో! భుజాలెగరేసేడు. చేతులు తిప్పేడు. ఆ సైనికుడ్ని పోయి శ్రేణిలో చేరమని ఆజ్ఞాపించెడు.

# 7

ఈ సలేరియా భవనం అన్న పేరులో కొంత పరిహాసం యిమిడి వుంది. ఒకప్పుడు రోమ్‌కు దక్షిణంగా వున్న చిత్తడినేలనూ, అక్కడి విపరీతమైన మలేరియా దోమలనూ, వాటి నివాసాన్ని జ్ఞాపకం తెస్తుందా పేరు. అటువంటి ప్రదేశం కాలక్రమేణా, క్రమేపీ బాగుపడింది. రాజమార్గంనుండి ఈ భవనంవరకూ జమీందారుగారి స్వంత రోడ్డుంది. ఈ రోడ్డు ప్రధాన రాజమార్గాని కేమీ తీసిపోదు. ఆ చుట్టుప్రక్కల ప్రదేశం బాగా బాగుపడిందనడాని కారోడ్డే ఒక తార్కాణం. అక్కడి భూములకూ, యీ భవనానికీ యజమాని ఆంటోనియస్ కైయస్ అనే ఒక జమీందారు. కైయస్, హెలీనాలకు అతను తల్లివైపు బంధువు. పట్నం చేరువనే వుండడం వల్లనో, మరెందుకనో సలేరియా భవనం మరీ విశాలమైనదీ, పెద్దదీ కాదు. కాకపోయినా ఆ తోటల, పొలాల అందమే దాని రామణీయకతను వృద్ధి చేసింది.

ఏపియన్ మార్గం వదలి, జమీందారుగారి రోడ్డుకు మళ్ళేచోటినుండి నాలుగు మైళ్ళు ప్రయాణంచేస్తే సలేరియా భవనాన్ని చేరుకోవచ్చును. అల్లా మళ్ళడంతోనే యెంతో మార్పు కనిపిస్తూ వుంటుంది. పూర్వం ప్రయాణంచేసి వచ్చిన ప్రదేశానికీ యీ ప్రదేశానికీ మధ్య ఎంతో తేడా వుంటుంది. ఇక్కడ ప్రతి అంగుళం భూమీ యెంతో శుభ్రంగా, ప్రతిమొక్కా అందంగా కత్తిరింపబడి, పోషింపబడి, తోటలన్నీ యెంతో చక్కగా చక్కబెట్టబడి కన్నులవిందైన ఉద్యానాల్లా కనిపిస్తాయి.

ఆ నాటి యీ సమయానికి పశువులమందలు యిళ్ళకు చేరుకుంటున్నాయి. ఆవుల మెడలలోని చిరుగంటల శబ్దాలు, మాటిమాటికీ కాపరు లూదే కొమ్ముల ధ్వనులూ కలిపిన సంగీతం వినవస్తూంది. మందలనుండి విడివడి యిటూ, అటూ పరిగెత్తే పశువుల నదలిస్తూ వాటి వెనుక పరువెట్టే థ్రేషియన్, ఆర్మీనియన్ గోచిపాతరాయళ్ళను చూచిన కైయస్‌కు ఆ మేకలు, గొఱ్ఱెలలోనా, వాటివెనుక పోతున్న యీ నర పశువులలోనా మానవత్వపు ఛాయలుంట అని ఆశ్చర్యపోయాడు. ఇంతకు పూర్వంలాగే యిప్పుడు కూడా కొన్ని ఆలోచనలు తన మెదడులో పని ప్రారంభించేయి. ఒక ఆలోచన నగదు రూపంలో, తదితరచరస్థిరాస్తుల రూపంలో, తన మామ మొత్తం ఆస్తి యెంతుంటుందో అన్న అంచనావెయ్యడం ప్రారంభించింది.

ఉన్నతకుటుంబాలు వర్తక వ్యాపారాలలో భాగస్వాములు కాకూడదని న్యాయశాస్త్రం విధించింది. వర్తక వ్యాపారాలలో దిగి తమ కుటుంబ శ్రేష్ఠతను, తద్వారా తమ కుటుంబ గౌరవానికి భంగం కల్గించరాదని న్యాయశాస్త్ర విధులు విధించాయి. కాని యీ విధి విధికృతమా? న్యాయశాస్త్రాన్ని మనిషి సృష్టించాడా, మనిషినే న్యాయశాస్త్రం సృష్టించిందా? ఇన్ని ఆలోచించేడు కాబట్టే ఆంటోనియస్ కైయస్, తన మామ, ఎందరో తన సమకాలికుల లాగానే యీ న్యాయశాస్త్రాన్ని ఒక ముసుగుగా ఉపయోగించి పనిచేసుకుపోయాడే కాని, దాన్ని యెదురుగా పెట్టుకు కూచుని కర్తవ్యతావిమూఢుడు కాలేదు. అసలుకీ, వడ్డీకీ తేడా ఉండడం సుతరామూ కిట్టని వ్యక్తి ఆయన. అందుకే కాబోలు నూటికి యేడాది ఒక్కంటికి నూరు రూపాయల చొప్పున వడ్డీ పుచ్చుకుని సంపాదించిన డబ్బు ఏ మాత్రమో ఒక కోటి రూపాయలకు తక్కువుంటుందని అంచనా. ఎంతోమంది యేజంట్ల ద్వారా పధ్నాలుగు పెద్ద పెద్ద వ్యాపార సంస్థల్లో అతనో ప్రధాన భాగస్వామి అని అంటారు. స్పెయిన్‌లోని వెండి గనులలో సగభాగ మీయనదే. యోధులు, వీరులు నడిపే సంస్థలలో కూడా యితని మాటకు యెంతో విలువ యిస్తారు. దాన్ని ఆచరించి అనుసరిస్తారు.

అతని ఆస్తిని గురించి అంచనా వేయడం అసాధ్యమయిన పని. చుట్టూ పది వేల యెకరాల పొలము. తోటలో వున్న సలేరియాభవన మందమైనదే అయినా వైశాల్యంలో, శిల్ప సౌందర్యంలో అద్వితీయమని చెప్పలేం. ఇంక తన మామ యెంతో మంది ధనవంతులవలె విశేష భోగలాలసుడు కాలేదు. డబ్బు మింగేసే మల్లయుద్ధ ప్రదర్శనల జోలికి పోలేదు. ప్రాచ్యదేశ పాలకులవలె ఘనమైన విందులూ, విపరీతమైన వినోదాలు యేర్పాటుచేసి తన ధనాధిక్యతను ప్రదర్శించే అలవాటుకు లోబడలేదు. ఏమీ పటాటోపం లేకుండా, శుద్ధ నిరాడంబరంగా జీవించేవాడతను. అల్లాగని అతని విందులలో సమృద్ధికి, సంతుష్టికి లోటుండదు. కాని కొంతమందిలా దూరదేశాలనుండి తెప్పించే అరుదైన ఆహార పదార్థాలను తన అతిధులకు కుడువబెట్టడం అతనికి కిట్టదు. ఈ పాటి ఖర్చు కూడా అతనికి చిరాకు కల్గించేది. దాంతో కనుబొమలు ముడివడేవి గొణుక్కోడమూ ఉండేది. కాని ఆ కుటుంబ వ్యవహారాలు యెన్నడూ బజారున పడ లేదు. ఈనాడు జీవించే రోమను సనాతనుడతను. సాంప్రదాయ సిద్ధమైన రోమను పద్ధతులను, ఆచార వ్యవహారాలను అతను పాటించుతూ తక్కినవాళ్లు కూడా అల్లాగే పాటించాలనే భావం కల్గి ఉండేవాడు. అతనంటే కైయస్‌కు భయమున్నది కాని భక్తి లేదు. అతని యెదుట నిలబడడమే కష్టంగా ఉంటే.

తన మామ ముందు కైయస్ అంత యిదై పోవడానికి కారణాలు లేకపోలేదు. ఒకటి—ఆంటోనియస్ కైయస్ ప్రపంచంలో సాధారణంగా చలామణీ అయ్యే తెగకు, తరహాకు చెందిన వ్యక్తి కాడు. ఉద్యోగం పురుషలక్షణం అన్నారు. తనకా యే ఉద్యోగం, సద్యోగం లేదు. రోమన్ కులీనుడు వుండవలసిన రీతిగా తాను వుండడం లేదని మామ భావిస్తున్నాడేమో నని అతని భయం. అతని ఊహలే అతన్ని హడల గొట్టి మామ ముందు నిలబడలేని పరిస్థితి కల్పించాయి.

సక్రమమైన రోమన్ యువకునికుండవలసిన మంచి లక్షణాలు తనలో మృగ్య మయ్యాయని మామ అనుకుంటున్నాడేమో నని కైయస్ ఆందోళన. ఆ మంచి లక్షణా లేమిటో మననం చేసుకున్నాడు. పౌర విధులకు బాధ్యతలకు అంకితమైపోవాలి. సామాన్య సైనికుడుగా చేరి క్రమంగా పెద్ద సైనికోద్యోగి అయిపోయేదాకా శ్రమిం చాలి. ఆదర్శ రోమన్ స్త్రీని పెళ్లాడి కుటుంబాన్ని పోషించుకుంటూ సంసారసాగరాన్ని యీదాలి. స్వార్థాన్ని విడనాడకుండాను, స్వార్థరహితంగాను, దేశసేవ చేసి పెద్ద పెద్ద పదవులు సంపాదించి చక్రవర్తికో సలహాదారు కాగలగాలి. డబ్బూ, బిరుదులూ పొందిన పెద్దమనుషుల గౌరవ మన్ననల్ని చూరగొనాలి. పెద్దవాళ్ళే గాక సామాన్య జనం సైతం అతన్ని ప్రశంసించాలి. ఇవిట సక్రమ రోమన్ యువకుని సల్లక్షణాలు! అటువంటి లక్షణాలున్న యే ఒక్క యువకుడూ కైయస్ దృష్టి పథంలో తటస్థపడ్లేదు. రోమ్‌లో తనతో పరిచయం వుండి, తన చుట్టూ మూగి తిరిగే యువకుల్లో కొందరు ఆడవాళ్ళ జాతక చక్రాలకు అంకితమైపోయారు. మరికొందరు ధనదాహంతో అక్రమ మార్గాలద్వారా ఎడాపెడా డబ్బు సంపాదిస్తున్నారు. యింకా కొంతమంది తమ తాతలు తండ్రులు రాణించిన వార్డు రాజకీయాలు చేబట్టి వోట్లు కొనటం, లంచాలివ్వటం, ముఠాలుకట్టి ముమ్మరంగా ఎన్నికల ప్రచారాలు చేయటం, ప్రజలకు అరచేతిలో వైకుంఠం చూపిస్తామని వాగ్దాన పరంపర చేసి, తీరా అధికారంలోకి వచ్చాక మొండి చెయ్యి చూపడం యిత్యాది కార్యకలాపాల్లో తీరికలేకుండా తిరుగుతున్నారు. ఇవేవీ చేతకానివాళ్ళు తిండిపోతులుగా, సోమర్లుగా, వాగుడుగాయలుగా తయారయ్యారు. తిని కూర్చునే జరుగుబాటు లేనివాళ్ళు తప్పనిసరై సైన్యంలో చేరారు. కైయస్ బడు ద్ధాయిల సంఘంలో ప్రముఖుడై పోయి నిష్పూచీగా కాలం దొర్లించేస్తున్నాడు. తన జీవిత పద్ధతిని సమర్థించుకుందుకు కొన్ని సిద్ధాంతాలు, సూత్రీకరణలు సృష్టించుకుని వాటిని జాగ్రత్తగా పెంచి పోషించుకుంటున్నాడు. "నువ్వు బ్రతుకు; మరొకడ్ని బ్రతకనియ్యి" అన్న దొక్కటే నాగరికమైన ఆచరణయోగ్యమైన తత్వమని అతని మతం.

ఆ ప్రాసాద ప్రాంగణంలో ప్రవేశించిన కైయస్‌కు, ఆ తోటలో, భవనం ముందరి పెరడులో మొదటి అడుగు వేసేటప్పుడు మెదడులో మెదిలిన భావాలివే. ఆ భవనంయొక్క సాంప్రదాయసిద్ధమైన ప్రశాంత నైర్మల్య వాతావరణాన్ని భగ్నం చేయలేనంత దూరంలో, వేఱుగా వేర్వేరుగా ఆ తోటల పారిశ్రామిక పునాది అయిన విశాలమైన ధాన్యాగారాలు, సామాను గదులూ, బానిసల బారకాసులూ నిర్మించబడ్డాయి. ఉన్నతమైన ప్రదేశంలో ఒక చిన్న చెఱువుచుట్టూ నలుచదఱంగా కట్టబడ్డ భవనమది. వెల్లవేసి, యెర్రని పెంకుల యింటి కప్పుగల దానిచుట్టూ వున్న దేవదారు వృక్షాలూ, బూరుగు చెట్లూ బొమ్మలోగీసిన గీతలవలె వుండి, ఆ యింటి శోభని యినుమడింప చేస్తున్నాయి. గుబురుగా పెరిగిన పుష్పభరిత గుల్మవాటికలతో, పసిరిక బయళ్ళతో, వేసవిలో కాలం గడపడానికని కట్టిన రంగురంగుల చలువరాతి బసలతో, ఉష్ణదేశాల నుండి తెప్పించిన రంగురంగుల రకరకాల చేపలకోసం కట్టించిన కాంతి ప్రసారకములైన పాలరాతి తొట్టెలతో, బానళ్ళతో, పాలరాతి జలదేవతావిగ్రహాలతో, నదీకన్యల, గంధర్వుల బొమ్మలతో ఆ ప్రదేశం అయోనియన్ పద్ధతిని దివ్యప్రతిభావిలసితమై ఒప్పుతుంది. కోడిపెట్టలనూ, మేకమాంసాన్నీ కొన్నట్లుగా రోమన్ బజార్లలో శిల్పుల్ని భవననిర్మితాల్ని కొనవచ్చు. వాళ్ళను యెంత ధరైనా పెట్టి కొనగల బేరగాడని ఆంటోనియస్ కైయస్‌కో పేరుంది. ప్రాచ్యదేశ రాజభవనాల వంటి భవనాలెన్నో వున్నా సలేరియా భవనమే కైయస్‌కు అందమైన దనిపించింది. క్లాడియా యిందు కంగీకరించింది. గేటుదాటి, భవనంలోకి తీసుకుపోయే ఇటుక రోడ్డుపై కాలుపెట్టేసరికి ఆశ్చర్యం పట్టలేని క్లాడియా హెలీనాతో అంది:

"నే నెప్పుడూ యిటువంటిది చూడలేదు! గ్రీకు పురాణాల్లో వర్ణింపబడ్డ దానిలా లేదూ నిజానికి?"

"చాలా బాగుంది" ఒప్పుకున్నది హెలీనా సమాధానమిచ్చింది.

ఆంటోనియస్ కైయస్ కూతు ళ్ళిద్దరు, చిన్నపిల్లలు పరుగు పరుగున వచ్చి, వాళ్ళకు నమస్కరించి పలకరించేరు. వాళ్ళవెనుక పిల్లలతల్లి జూలియా వచ్చి నమస్కరించి అతిధుల్ని ఆహ్వానించింది. ఆమె లావుగా వుంది. కూడా ముగ్గురి నెవరినో వెంటబెట్టుకుని ఆంటోనియస్ కైయస్ వచ్చాడు. అతను మర్యాద యిస్తాడు, ఆ విషయంలో ప్రతి స్వల్పంశాన్నీ రవ్వంత హెచ్చుతగ్గులు లేకుండా పాటిస్తాడు. మర్యాద పుచ్చుకోడంలో కూడా అంతే. ఇతరులు తనకు మర్యాదయిచ్చేటప్పు డంతజాగ్రత్తగానూ ప్రవర్తించితీరాలన్న స్వభావమతనిది. కైయస్‌నూ, అతని చెల్లెలు హెలీనానూ, ఆమె స్నేహితురాలు క్లాడియానూ గంభీరమైన గౌరవంతో పలకరించి తన వెంట

వచ్చిన ముగ్గురినీ వీళ్ళకు పరిచయం చేశాడు, చెయ్యాలికనుక. అందులో యిద్దరిని కైయస్ యింతకు పూర్వమే యెఱుగును. ఒకడు పట్టణ రాజకీయవేత్త లెంటులుస్ గ్రాఘూస్. మరొకడు ఆ రోజుల్లో రోమను ప్రజలు విశేషంగా ప్రశంసించే బానిస విప్లవ విజేత, రోమను సేనాని లిసినియస్ క్రాసస్. మూడో వ్యక్తి కైయస్‌కు అపరిచితుడు. తక్కినవారికన్న వయస్సులో చిన్నవాడు, కులీనుడు. రోమను మేధావులకుండే యుక్తిరహితమైన గర్వం అతనికుంది. ఒక మాదిరిగా అందంగానే వున్నాడని చెప్పాలి. అతనికి పరిచయం చేయబడ్డ వారిని అంచనా వేస్తున్నట్లున్నాడు. అతన్ని పరిచయం చేస్తున్నప్పు డతడ్ని గురించి చెప్పిన కొద్దిపాటి ప్రశంసావాక్యాలను అబ్బే యేముందిలెండి, దానికేం అన్నట్లు భేషజంలేకుండా తుడిచివేసేడు. పేరు మార్కసే టుల్లియస్ సిసిరో. మనుష్యుల స్వరూపాన్నే కాని, స్వభావాన్ని చూడలేని కైయస్‌కు కూడా సిసిరోలో జిజ్ఞాస ఉన్నట్లు కన్పడింది. వాళ్ళ నతడు పరిశీలిస్తున్నట్లు, విలువ కడుతున్నట్లు, వాళ్ళ పరిస్థితి ఊహించుతున్నట్లు, కుటుంబంయొక్క మొత్తం ఆస్తి గురించి అతను అంచనావేస్తున్నట్లు, వాళ్ళకున్న పేరు, ప్రభావాల గురించి అతనాలోచిస్తున్నట్లు గ్రహించాడు కైయస్.

అద్భుతావహమైన ఆ సుందర భవనానికీ, అంతులేని అన్నివేల యెకరాల తోటలకు, యజమానియైన ఆంటోనియస్ కైయస్ యెంతో వాంఛనీయుడైన పురుషుడుగా కనబడ్డాడు క్లాడియాకు. నాకుమాత్రం తెలియదాయేం అనుకుని చెప్పుకునేందుకు తెలునుకున్న కొద్దిపాటి రాజకీయ జ్ఞానం, యుద్ధాన్ని గురించి యేదో సందిగ్ధభావం కల్గిన క్లాడియా గ్రాఘూస్, క్రాసస్‌లకు తన మనస్సులో స్థానం యివ్వలేదు. ఆమెకు సిసిరో గురించి ఏమీ తెలియదు. తెలియకపోవడంవల్ల నష్టమేమీలేదని అనుకుంది కూడా. ఈ సిసిరో మేం యోధులమంటే, మేం వీరులం అని చెప్పుకు తిరుగుతున్న వాళ్ళజాతికి చెందినవాడేమోనని ఆమె అనుమానం. డబ్బంటే పడిచచ్చే వాళ్ళని నామె అసహ్యించుకోవడం ఉగ్గుపాలతో నేర్చుకుంది. జూలియా అప్పుడే వీలయినప్పుడల్లా తన శరీరాన్ని కైయస్ శరీరానికి ఆన్చుతూ, తగిలిస్తూ, నొక్కుతూ తనంతటతానే యేదో బాధపడిపోతోంది. కదలడం కష్టంగా వుందనిపించేటట్లుండే పెద్ద గండుపిల్లిలాగుందామె. అతనామెకు యిష్టుడు. కైయస్‌కన్న క్లాడియా ఆంటోనియస్‌ను సరియైన అంచనావేసింది. కొక్కెంలా వంపుతిరిగిన ముక్కు బాగా కండలున్న శరీరమూ కల ఆంటోనియస్ కైయస్‌లో అసంతృప్తిచే అణగారిన వాంఛలూ, తీరని కోర్కెలూ, యెంతో తీరని తృష్ణ వున్నట్లు గ్రహించింది క్లాడియా. తెచ్చిపెట్టుకున్న పవిత్రతను ప్రదర్శించే అలవాటు కలవాడతను: అంతేకాక ఆ ప్రదర్శించడం, దాన్ని తెచ్చిపెట్టుకోవడం తన

ఒక్కడి హక్కే అన్నట్లుంటాడు. అటువంటి ఆంటోనియస్ కైయస్‌లో కని పించని కామం కమ్ముకున్నట్లు కనిపెట్టింది క్లాడియా. పైకి శక్తివంతులుగా కనబడడానికి ప్రయత్నించినా నిజానికి అశక్తులైన మనుష్యులంటేనే ఆమెకు ఆసక్తిమెండు. ఆమె ఉద్దేశ్యంలో అత నేమీ చిరాకుపెట్టే స్వభావం కలవాడు కాడు. అశ్రద్ధగా నవ్వి, ఆ నవ్వుద్వారా అతని గురించి తనకంతా తెలిసినట్లతనికి తెలియ జేసింది.

ఎదురేగిన, గృహస్తు, అతని వెంట వచ్చిన అతిధులూ, అతని భార్యాపిల్లలూ, ఈ అభ్యాగతులూ అంతా భవనాన్ని సమీపించారు. కైయస్ గుఱ్ఱాన్ని యీజిప్షియన్ బానిసొకడు వచ్చి తీసుకువెళ్ళేడు. అంతదూరం మోస్తూ, నడుస్తూ రావడంవల్ల వచ్చిన అలసటవల్ల, పల్లకిమోసిన బానిసలా పల్లకి ప్రక్కనే గడ్డిలో పడుక్కుని సాయంత్రంతోబాటు వచ్చిన చలితో వణుకుతున్నారు. నీరసించినప్పుడు జంతువులు బాధపడ్డట్టే, అలసటవల్ల అవి వణికినట్టే ఆ బానిసలు బాధపడి వణుకుతున్నారు. వాళ్ళ కేసి యెవరూ చూడలేదు. గుర్తించలేదు. ఏం కావాలని అడిగిన పాపాన పోయినవారు లేరు. వాళ్ళల్లో యిరవైయేళ్ళకు మించని బాని సొకడు దుఃఖాన్ని ఆపుకోలేక వెక్కి వెక్కి యేడ్చాడు. తక్కినవా ళ్ళతనికేసి చూడనైనాలేదు. అరగంటయాక మరో బానిస వచ్చి వాళ్ళను ఆతిధ్యం యివ్వడానికి బారకాసుకు తీసుకుపోయాడు ఆ రాత్రికి తిండీ, బస అక్కడే.

## 8

సేనాని లిసినియస్ క్రాసస్‌తోబాటు, కైయస్ స్నానశాలకు వెళ్ళేడు. ఇతనిలో మంచిపిల్లవాడి లక్షణాలన్నీ ఉన్నాయా, లేదా అనే లెక్కలు కట్టే రకానికి చెందిన వాడు కాడు కాబట్టి లిసినియస్ క్రాసస్ అత న్నేమీ గాభరా పెట్టలేదు. క్రాసస్ అతనికి సరదా అయినవాడుగా, సహృదయుడిగా, స్నేహపాత్రుడుగా కనబడ్డాడు. అవతల వాడికి ప్రాముఖ్యం అన్నది ఉన్నా, లేకపోయినా ఆ ఆసక్తితో సంబంధం లేకుండానే, అందరితోనూ ఆప్యాయంగా, కలిసికట్టుగా మాట్లాడి, వాళ్ళ వాళ్ళ అభిప్రాయాలను ఎంతో ఆసక్తితో అడిగి తెలుసుకునే అలవాటు కలవాడు. అతనిలోని ఈ గుణమే అందరినీ అతనివైపు ఆకర్షిస్తుంది. అత్తరువులు, సువాసనలు వెదజల్లే లవణాలు కలిపిన పన్నీటి తొట్టెలలో వాళ్ళు కాళ్ళు బారచాపుకుని కూచున్నారు. దాన్లో మునిగేరు. చేతులు చాచి నీటిని త్రోసేరు. అరచేతులతో నీటిపై మర్దించేరు. మధ్యవయస్కుల శరీరాలలో ఉండే కొవ్వుపదార్థం క్రాసస్ శరీరంలోలేదు. మధ్యవయస్కుడే అయినప్పటికీ, అతని

శరీరం కండలు తిరిగి గట్టిగా వుంది. రోమ్‌నుండి రాజవీధిని ప్రయాణం చేసే వచ్చారా అని కైయస్ అత న్నడిగాడు.

"అవును. ఆ త్రోవనే వచ్చాం. రేపు కేపువాకు వెళ్తాం."

"శిక్షా చిహ్నాలను చూసి మీరేమనుకున్నారు—" అన్నాడు సేనాని.

"మాకు చాలా తమాషాగా కన్పించాయి. అంతే కాని నిజం చెప్పాలంటే వాటిని చూసి మేమేమీ అనుకోనే లేదు. ఇక్కడా అక్కడా రోడ్డుప్రక్క పక్షులు పీక్కుతిన్న శవాలుండి చెడ్డకంపు కొట్టేయి. గాలి మావైపు వీచినపుడల్లా ఆ కంపు మాకు చాలా అసహ్యం కల్గించేది. మా వాళ్ళు తెరలు దింపుకునేవారు. అయినా అది తగ్గుతుందీ! అదొక్కటే బాగులేదు. కాని పల్లకీ బోయీలు మాత్రం దెబ్బ తినేసేరు. వికారంపెట్టి చచ్చేవారు" అన్నాడు కైయస్.

"వా ళ్ళో వేళ శిలువలమీద వేలాడే వాళ్ళని గుర్తుపట్టేరేమో!"

"పట్టినా పట్టచ్చు. బానిసలలో కూడా అంత పరిజ్ఞానం ఉంటుందంటారా? మా పల్లకి మోసిన బానిసలంతా కొరడా విరిగేలా దెబ్బలు తిని మన వద్దనే పెరిగినవాళ్ళు. జంతువులుకన్న వాళ్ళేమైనా నయమా? ఏమీ కాదు. వాళ్ళు గుర్తించ గల రంటారా? బానిసలందరిలోనూ ఒకే రకమయిన భావా లుంటాయంటే నమ్మడం కష్టం. బానిసలందరికీ స్పార్టకస్ యందు సానుభూతి ఉందంటారా?"

"ఉందనే నా అభిప్రాయం."

"సరి, అయితే పీకులాటే."

"ఏమీ లేకపోతే యీ శిలువ గొడవ యెందుకు తలబెడతాం. తలబెట్టకనే పోదుం; అది శుష్కదండుగ. వృథాగా చంపెయ్యడమంటే నాకు సుతరామూ కిట్టదు. అల్లా విపరీతంగా చంపెయ్యడం ఉందే అది బెడిసిగొట్టుతుంది. ఇప్పుడు కాకపోతే మరొకప్పుడైనా యిదంతా యిది మనకేదో ఒకటి చేస్తుందనే నా అభిప్రాయం."

"ఏమిటీ? బానిసలే" అనుమానించాడు కైయస్.

"సిసిరో యెన్నోమార్లు యిష్టపడి చెప్పే విషయం తెలుసా? బానిస ఒక వాక్పరికరమని అంటే వాగగల పనిముట్టు. నోరుగల పనిముట్టు. జంతువు సగంమటుకే నోరు గల పనిముట్టు. మామూలుగా మనం ప్రతినిత్యం ఉపయోగించే పనిముట్లున్నాయే అవి జడ పరికరాలన్నమాట. అంటే నిర్జీవమైన పనిముట్లు. ఇదీ వస్తువులను, విషయాలను అతను విడమర్చి చెప్పే పద్ధతి. సిసిరో మంచి తెలివైనవాడేనని నా ఉద్దేశ్యం. కాని అతనికి స్పార్టకస్‌తో ముఖాముఖి యుద్ధం చెయ్యాల్సిన అవసరం మాత్రం కలగలేదు. దాన్ని గురించి ఆలోచించే పరిస్థితి గూడా యేర్పడ లేదతనికి.

ఆ బానిసలతో బాహాబాహి యుద్ధం చేయవలసి వచ్చినప్పుడు మాత్రం బానిసలు ఉట్టి వాగగల పనిముట్లు మాత్రమే కాదనీ వాళ్ళల్లో యింకేదో శక్తి అవ్యాహతంగా ప్రభవిస్తుందనీ అనిపిస్తుంది."

"అతన్ని మీ రెరుగుదురా? అంటే వ్యక్తిగతంగా తెలుసా అని?"

"అతనంటే?"

"అదుగో, ఆ స్పార్టకస్‌ని."

సేనాని ఆలోచనా పూర్వకంగా నవ్వేడు. "నిజానికి నే నెరుగను." ఆ మాట కూడా ఆలోచిస్తూనే చెప్పేడు. "తెలిసినమట్టుకు విషయాలన్నిటికీ అతికి అతని సంపూర్ణ స్వరూపం తెలుసుకుందామనే ప్రయత్నించాను. అతన్ని గురించి యెవరికీ బాగా తెలియదు. ఎల్లా తెలుస్తుంది? పెంపుడుకుక్క తిరుగబడుతుందనుకో. తిరుగబడ్డా, తిరుగబడకపోయినా కుక్క కుక్కేకద. అట్లాగే కుక్కగానే ఉంటూ తెలివిగా తప్పించుకుని గొడవ చెయ్యడం మొదలెడితే మనం యెల్లా తెలుసుకోగలం? స్పార్టకస్ యొక్క స్వభావమేమిటా అని ఊహించాను. అంటే అతడిని చిత్రించ పూనుకున్నానని మాత్రం కాదు. ఎవడూ ఆ పని చేయలేడు. అల్లా అతని సంపూర్ణస్వభావనిర్ణయం చెయ్యగలవాళ్ళంతా యేప్పియన్ మార్గంలో శిలువల నలంకరించారు. ఆ మనిషే ఒక కలలా వచ్చి కలలాగే కరిగిపోయాడు. మెఱుపులా వచ్చి, వచ్చినట్లే మాయమయాడు. అతన్ని మళ్ళీ మనం ఒక బానిసగా తయారుచేసుకోవాలి. అంటే అనగనగా ఒక బానిస అని మొదలెట్టి అతన్ని గురించి ఆలోచించాలి."

"ఇంతకీ అతనసలు బానిసేగా" అన్నాడు కైయస్.

"అవునవును. నా అభిప్రాయం కూడా అతను బానిసేనని."

ఈ విధంగా తీవ్రమైన విషయాలను గురించి మాట్లాడుతూ సంభాషణను కొనసాగించడం కైయస్‌కు కష్టమయింది. యుద్ధాలలో అతనికి అనుభవం లేకపోవడం కాదు దీనికి కారణం. అస లతనికా యుద్ధాలంటే ఆసక్తి శూన్యం. న్యాయానికి యుద్ధం అన్నది అతని వర్గంయొక్క విధ్యుక్తధర్మం. జీవితంలో అతను చేయాల్సిన పని. అతని కర్తవ్యం. తన గురించి క్రాసస్ యేమనుకుంటున్నాడో? అతనేమనుకోనీ. కైయస్ కుటుంబం, యేమంత తక్కువగా చూడవలసింది కాదు. నిర్లక్ష్యం చెయ్యవలసిందీ కాదు. పాపం క్రాసస్‌ని అదృష్టం పరిహాసం చేసింది. దాన్ని పరిహాసం అనక మరేం అనగలం. ఎందుకంటే రోమను చరిత్రలో యెన్నడూ జరుగనంత ఘోరయుద్ధం జరిగింది. ఈ బానిసయుద్ధంలో ఎంతో కష్టపడి విజయం సాధించిన క్రాసస్‌కి యే కారణంచేతనో రావలసినంత కీర్తి రాలేదు. రావలసినంత పేరూ

ప్రతిష్ఠా రాలేదు. బానిసలు రోమ్‌ను తమ గుప్పెట్లో పెట్టుకుని గజగజలాడించి సర్వనాశనం చేసిన రోజుల్లో వాళ్లు వేసిన ప్రతి యెత్తుకూ, పైయెత్తువేసి యెంతో కష్టపడి వాళ్ళతో యుద్ధంచేసి రోమ్‌ను కాపాడేడు. ఆ బానిసలను నాశనం చేసేడు. ఇంత ఘనవిజయం సాధించినా రావలసినంత యశస్సు రాలేదు. ఇదంతా ఒక వింతైన విరుద్ధం. దానికి కారణం యేమైనా, యెవరైనా క్రాసస్ మాత్రం కొంత చిన్నబుచ్చుకుని బాధపడ్డాడు కూడా. ఈ క్రాసస్ బానిసయుద్ధ విజేత; విప్లవ ప్రతీఘాత శక్తికి నాయకుడు. క్రాసస్ గురించి ప్రజలు గాధలుగా చెప్పుకోరు. అతని కీర్తి పదం, పద్యం పట్టినిలువదు. బానిసలతో యుద్ధం చేసేమన్న సంగతి జ్ఞాపకం వుంచుకోడం కాని, దాన్ని గురించి చరిత్ర వ్రాయడం కాని స్వతంత్రులైన రోమన్లకు చిన్నతనం కాదా. అందుకే వాళ్ళు అటువంటి యుద్ధమొకటి జరిగిందనే సంగతే మరిచిపోవ ప్రయత్నించేరు. మరచిపోవాలి కూడా. ఆ మరచిపోవాల్సిన అవసరమే క్రాసస్ సాధించిన విజయాన్ని ఒక చిన్నచూపు చూసింది. ఆః ఏముందిలే అనేటట్టు చేసింది.

స్నానం పూర్తిచేసి వాళ్ళు బయటి కొచ్చేరు. స్నానశాలలోని బానిస స్త్రీలు తువ్వాళ్ళు తెచ్చి వీళ్ళ చుట్టూ కప్పి తుడుస్తున్నారు. ఈ భవనం కన్న యెంతో ఆడంబరంగా కనపడే భవనాలు బోలెడుండచ్చు. కాని యెక్కడా ఆంటోనియస్ యింట జరిగే సౌకర్యాలలో సగంకూడా జరుగవు. అతను ముందుగానే అతిధుల అవసరాల నూహించి అన్ని యేర్పాట్లూ చేయిస్తాడు. తుడుస్తున్నంతసేపూ యీ విధంగా ఆలోచించాడు కైయస్. పూర్వం అతనోమారు ఒక దేశంగురించి చదివేడు. ఆ దేశంలో చిన్న చిన్న రాజులూ, భూస్వాములూ వుండేవారు. కాని, వాళ్ళకు ఆంటోనియస్ జీవితపద్ధతి యేమీ తెలియదు. పోనీ యీ ఆంటోనియస్ రోమ్‌కు అధినాధుడా అంటే అదీకాదు. అతనో పెద్ద భూస్వామి. ఒక రోమన్ పౌరుడు. అంతే. ఏమైనా అనండికాని రోమన్ల జీవితవిధానం బాగా అర్హులైనవారి, దిట్టమైన పరిపాలనాదక్షత కలవారి ప్రతిబింబమే ననిపిస్తుంది.

"ఆడాళ్ళచేత యీ విధంగా ఉపచారం చేయించుకునే అలవాటు నేనింకా చేసుకోలేదు. నీ కిష్టమేనా?" అడిగేడు క్రాసస్.

"నేను దాన్నిగురించి పెద్దగా ఆలోచించనే లేదు" కైయస్ సమాధానమిచ్చేడు. కాని దానిలో నిజం తక్కువ. ఎందుకంటే బానిస స్త్రీలు యీ విధంగా అవయవాలన్నిటినీ తుడుస్తుంటే యీ విధమైన పరిచర్య చేస్తుంటే ఒక రకమైన ఆనంద్ధం, ఒక ఆవేశం, ఉద్రేకం అన్నీ కచ్చితంగా కలిగితీరాయి. అతని తండ్రి స్త్రీలచేత పరిచర్య చేయించుకొనే యీ పద్ధతిని వ్యతిరేకించేవాడు. కొందరెవరో ఆ

కాలంలో యీ విషయాన్ని యేవగించుకుని కోపగించుకునేవారు కూడా. కాని యీ మధ్య ఐదారు సంవత్సరాల నుండి యీ విషయంపట్ల వైఖరిలో చెప్పుకోదగ్గ మార్పు వచ్చింది. బానిసలలో మానవత్వపు ఛాయలే ఉండవని అతని స్నేహితుల నమ్మకం. వాళ్ళతో స్నేహం చేసిన యితని నమ్మకంకూడా అదే. పరిస్థితులకు, బజారులో చెలామణీ అవుతున్న భావాలకు దాస్యం చేయడమే తప్ప స్వతహాగా ఆలోచించడం అరుదు. ఈ సమయంలో అతనా ముగ్గురు బానిస స్త్రీలను గురించీ ఆలోచించడమే లేదు. ఎవరైనా నిలబడ్డ పాటున నీకు పరిచర్య చేసిన బానిస స్త్రీ లెల్లాగుంటారు? అని ప్రశ్నిస్తే చెప్ప లేకపోవును. సేనాని ప్రశ్న యితన్ని వాళ్ళకేసి చూసేలా చేసింది. ఆ బానిస స్త్రీలు స్పెయిన్‌లోని యే జాతికో చెందినవాళ్ళు. ఏమంత అనాకారులు కారు. నిండు యౌవనంలో వుండి బాగుండకపోలేదు. వాళ్ళకి పాదరక్షలు లేవు. పొట్టి దుస్తులు ధరించేరు. ఆవిరివల్ల బట్టలు చెమ్మగిల్లేయి. దానికితోడు స్వేదబిందువులుకూడా బట్టలను తడుపుతున్నాయి. వాళ్ళముందు యితను దిగంబరుడు. తన దిగంబరత్వమే అతని నుద్రేకపరిచింది. ఒకత్తెను దగ్గఱగా తీసుకున్నాడు క్రాసస్. ఛండాలంగా ప్రవర్తిస్తూ ఆమెను తన యిష్టం వచ్చినట్లు నలిపేస్తున్నాడు. ఆమెకేసి చూసి అదోమాదిరిగా నవ్వుతున్నాడు. ఆమె అతని దయ సంపాదించుకొనేందుకు ప్రయత్నిస్తోంది. ఏమీ అభ్యంతరం చెప్ప నేలేదు.

కైయస్‌కు ఆశ్చర్యం పుట్టుకొచ్చింది. స్నానశాలలో బానిస స్త్రీల నీ విధంగా తడుముతూ, నీచంగా ప్రవర్తిస్తున్న సేనానిని చూసేసరికి కైయస్‌కు అమాంతంగా కోపం వచ్చింది. అటు చూడకూడదనే నిశ్చయానికి వచ్చాడు.

అక్కడున్న ఒక బల్లమీద అతను పడుకున్నాడు. కొంతసేపటికి క్రాసస్‌కూడా అతనితో వచ్చి చేరేడు. "చూడవోయ్ బాగుంది" అన్నాడు సేనాని. ఈ క్రాసస్ ఆడవాళ్ళ విషయంలో శుద్ధ వెర్రివెధవా యేమిటి చెప్మా? అనుకున్నాడు కైయస్. క్రాసస్ ప్రవర్తనలో మార్పులేదు. ప్రసక్తి తిరిగితెస్తూ "స్పార్టకస్ నీ కెంతటి చిక్కు ప్రశ్నో నాకూ అంతే. నే నతన్నెన్నడూ చూడలేదు. వెర్రెత్తిన దెయ్యాన్ని గెంతేటట్లు గెంతించేడు నా చేత."

"అతన్ని మీ రెన్నడూ చూడలేదా?"

"ఎప్పుడూ చూడలేదు. అంతమాత్రంచేత అతన్ని గురించి నాకేమీ తెలియదని కాదు. చెప్పేగా ప్రతిముక్కా సంపాదించి వాటి నన్నిటినీ అతికి అతని ఆకారాన్ని సమకూర్చుకున్నాను. నాకదే నచ్చింది. కొందరు సంగీతాన్నీ, తదితర కళలనూ కూర్చుతారు. నేనేమో స్పార్టకస్ ఆకారాన్ని సమకూర్చుకున్నాను."

సాచుకుని పడుకుని మర్దన చేయించుకుంటూ ఆనందిస్తున్నాడు క్రాసస్. ఒకర్తె గంధపు గిన్నెలాటి దాన్లో అత్తరువు పోసి తీసుకొచ్చింది. మర్దన చేసేచోట అత్తరువు వేస్తోంది. పిసుకుతున్న వేళ్ళు అతని శరీరంలో ఆనందాన్ని తట్టి మేల్కొలుపుతున్నాయి. మత్తెక్కించే అత్తరువుల ఘుమఘుమలు, శుభ్రంగా స్నానం చెయ్యడం వల్ల వచ్చిన సంతుష్టి, తన దిగంబరత్వం, ప్రక్కనున్న బానిస స్త్రీలు ఒకటేమిటి యీ వాతావరణమంతా ఆవేశంతో ఉద్రేకంతో కూడిన యేదో ఒక వాంఛాపూరితమయిన ఆనందాన్ని రేకెత్తిస్తున్నాయి. బిగిసిన కండలను, నరాలను ఒదులు చేస్తున్న మర్దన అతని ఒంటిలోని నొప్పిని తీసేసి సుఖాన్నిస్తున్నది.

"అతనెల్లాగుంటాడు - మీరు కూర్చిన దాని ప్రకారం?" కైయస్ అడిగేడు.

"అతను నన్నే విధంగా ఊహించుకొనేవాడా అని ఆశ్చర్యపోతుంటాను నేను," క్రాసస్ పండ్లిగిలించాడు. "తుది సమరంలో ఆఖరున ఎప్పుడో నన్ను పిలిచాడని అంటారు. ప్రమాణంచేసి నే నా విషయం చెప్పలేననుకో. కాని అతనరిచాడట 'ఒరే క్రాసస్! వస్తున్నా కాసుకో! లంజాకొడకా!' అనో అల్లాటిదే మరేదో అరిచాడని అంటారు. నాకు నలభై యాభై అడుగుల దూరంలోనే వుండి నన్ను చంపడానికి తోసుకొచ్చేస్తున్నాడు ముందుకి. అతనేం దయ్యంలాంటి మనిషీ కాదు, మహాశక్తివంతుడూకాదు. కాని త్రినేత్రుడినయినాసరే యెదర్చగల క్రోధోద్దీపితమానసం మాత్రం వుంది. రోషం వుంది. అతను యుద్ధం చేస్తుంటే క్రోధం, బ్రహ్మాండమైన కోపం ఉగ్రస్వరూపం దాల్చి యుద్ధరంగంలో ప్రవేశించిందా అనిపిస్తుంది. నా దగ్గఱకు సగం దూరం రానే వచ్చేశాడు. ఆ అంతిమపోరాట సమయంలో, ఆ క్షణాలలో తన చేతులతో పది పదిహేనుమందినైనా హతమార్చాడు. ముక్కలకింద నరికేసే వరకూ తన పని తను మానలేదు."

"అయితే అతని శవం దొరకలేదన్న సంగతి నిజమేనన్నమాట!" కైయస్ అడిగేడు.

"నిజమే, అతను ముక్కలు ముక్కలయ్యాడు. ఇంకేం మిగల్లేదు. శూన్యంలో నుంచి వచ్చి శూన్యంలోకి పోయాడు. మల్లయుద్ధ రంగస్థలం నుండి వచ్చి మహాయుద్ధవధ్యశాలలోకి పోయాడు. కత్తితో బ్రతికి, కత్తితో చచ్చేవాళ్ళం మేము. స్పార్టకస్ కూడా అంతే. అందుకే అతనికి నా అభివందనాలు."

సేనాని చెప్పినమాటలు కైమావర్తకుడు చెప్పిన మాటలను జ్ఞప్తికి తెచ్చేయి. అడుగుదామని నాలుక చివరిదాకా వచ్చింది కాని బాగా ఆలోచించి,

"మీ కతనంటే ద్వేషం లేదా?" అని అడిగేడు కైయస్.

"ఎందు కుండాలి? అతను మంచి సైనికుడు. ఇంతా చేసి ఒకబానిస. అటువంటి వాడ్ని ప్రత్యేకించి అసహ్యించుకునేందు కేముంది? పైగా అతను చచ్చిపోయాడు. నేను బ్రతికున్నాను." మర్దన చేస్తూన్న వేళ్ళకింద చేతుల కింద అతను సంతోషంతో మెలికలు తిరుగుతున్నాడు. మర్దన చేస్తున్న బానిస గురించి చెప్పుతూ ఆమె విషయం కాదన్నట్లు మాట్లాడుతున్నాడు. "ఇది నాకు నచ్చింది సుమా. నా అనుభవం పరిమిత మైనదే అనుకో, మీరు మాలా అనుకోరు. అనుకుంటారా. మీ తరం వాళ్ళు విషయా లను మరోలా చూస్తారు. బజారు ముండలని కాదు నా ఉద్దేశ్యం. ఇటువంటి అందమైన వాళ్ళను గురించి, ఏం? ఇది అందంగా లేదంటావా? పని జరుగుతుందంటావా?"

అతను చెపుతున్న దేమిటో మొదట్లో యేమీ అర్థంకాలేదు కైయస్‌కు; క్రాసస్ కేసి ప్రశ్నార్థకంగా చూసేడు. సేనాని శరీరంలో విపరీతమైన మోహం విద్యుత్ప్రవాహ వేగంలో వ్యాపిస్తూంది. ఉబ్బివున్న అతని మెడ నరాల్లో ఆ కామమే రయ్యిమని పరిగెట్టుతోందా అనిపిస్తుంది. కైయస్ కెందుకో భయమేసింది. ఆ గది వదిలి వెళ్ళి పోదామనుకున్నాడు. కాని తెలివిగా బైటపడగలిగే మార్గంలేక అక్కడే వుండి పోయాడు. అదైనా అక్కడేం జరుగుతుందో అని కాక అతని సమక్షంలోనే అతను చూస్తుండగానే ఆ పని జరుగుతుందేమోనని అతని బాధ.

"ఆమె నడుగుతారా?" ఎల్లాగో ఒకలాగు ప్రశ్నించాడు.

"ఆమెనడగడమా? ఆ ముండ లాటిను మాట్లాడుతుందనా నీ అభిప్రాయం?"

"కాద్దో గొప్పో వాళ్ళంతా మాట్లాడగలరు."

"నేరుగా ఆమె నడగమనా నీ ఉద్దేశ్యం?"

"కూడదా?" అని గొణిగేడు కైయస్, చూడలేక బోర్లపడుకుని కళ్ళు మూసు కున్నాడు.

# 9

స్నానం ముగించుకుని, అత్తరువు పట్టించి, ఉంగరాల జుట్టుకు వాసన నూనె రాసుకుని, అందంగా తలదువ్వుకొని, శుభ్రమైన దుస్తులు ధరించి, భోజనానికి పిలుపు వచ్చేలోపున కొద్దిగా ద్రాక్షసారా సేవించడానికని బయల్దేరేడు కైయస్. తోట గది గులాబీరంగు వేయబడ్డ ఫోయినీషియన్ పెంకులతో కప్పబడింది. ఆ గదిలో కైయస్ ప్రవేశించేసరికి అక్కడి ఒక పాలరాతి వేదికపై యిటో కూతురినీ, అటో కూతురినీ కూర్చుండ బెట్టుకుని జూలియా వుంది. తెల్లని గౌను తొడుక్కుంది. చేతులు తన కిరు

వైపులా కూర్చున్న పిల్లలచుట్టూ వేసింది. చూడగానే గౌరవింపదగిన దర్జా అయిన మాతృమూర్తిలా కన్పడింది. ఆమెలో ఆ కుర్రతరహాయే లేకపోతే ప్రాచీమాత చిత్రాన్ని తలదన్నేదే అనుకున్నాడు కైయస్. "జూలియా బాగున్నావు" అని ఆమెను ప్రశంసిద్దామనుకున్నాడు. కాని తీరా అల్లా చెయ్యడంవల్ల యెక్కడ పీకట్టుకుంటుందో అని ఆ ఉద్దేశ్యాన్ని దిగమింగేడు. ఎప్పుడూ ఆమె విచారంగా వుంటుంది. కాని విరోధాన్ని మాత్రం ప్రకటించదు. "ఇలావచ్చేవే కైయస్!" అందామె ఆశ్చర్యం ఆనందం పెనుగొన్న భావంతో. "నీవిక్కడ వుంటావనుకోలేదు జూలియా!" క్షమాపణపూర్వకంగా అతనన్నాడు. "అయితే యేం. ఉండు. దయచేసి వెళ్ళకు. నీ కో గ్లాసుడు ద్రాక్ష సారా అందించనీ." "సరే" అని అంగీకరించాడు. కాని ఆమె పిల్లల నక్కడినుంచి పంపి వెయ్యడానికి పూనుకున్నప్పుడు మాత్రం "వాళ్ళకు వుండాలని వుంటే వుండనీయకూడదా—" అన్నాడు.

"వాళ్ళకి భోజనానికి వేళ అయింది" వాళ్ళు వెళ్ళేక ఆమె చెప్పింది.

"వచ్చి నా ప్రక్కన కూచో, వచ్చి కూచో కైయస్," అతనామె ప్రక్కన కూచున్నాడు. ఆమె అతనికి తనకూ రెండు గ్లాసుల్లో సారాపోసి తనగ్లాసు నతని గ్లాసుకు తగిలించి అతనివైపు అదేపనిగా చూస్తూ తాగుతోంది.

"ఎంత అందంగా వున్నావో అంతమంచిగానూ వుండు కైయస్."

"నాకు మంచిగా వుండాలనిలేదు జూలియా."

"కైయస్! అసలు నీకు కోరికనేది వుంటుందీ? ఉంటే ఏమికావాలనివుంటుంది?"

"ఆనందం" ఏమీ దాపరికం లేనివాడిలా అనేసేడు.

"యౌవ్వనంలో వున్న నీకది కష్టమైపోతోందికదూ?"

"ఔను, జూలియా! నేను విచారంగా కనిపిస్తానా? కనిపించనుకదూ?"

"సంతోషంగామాత్రం కనబడవు."

"అస్ఖలిత బ్రహ్మచారిగా వుండటం యేం బాగుంటుంది జూలియా?"

"కైయస్! నువ్వు నాకన్న చాల తెలివైనవాడివి. కాని నీకున్నంత కాఠిన్యం నాకు లేదు."

"నాకుమాత్రం కఠినంగా వుండాలని వుంటుందా జూలియా?"

"నాకో ముద్దిచ్చి నువ్వన్నదీ నిజమని ధృవ పరుచుకుంటావా?"

"ఇక్కడే?"

"ఇక్కడే, ఆంటోనియస్ యిక్కడకు రాడులే. మీతో వచ్చిన పిల్లను మజా చెయ్యడానికి గుఱ్ఱాలు పొర్లడం అదీ చూపిస్తున్నాడు."

"ఏమిటీ? క్లాడియాకా? కాదు, కాదు," తనలో తనే యెందుకో కైయస్ కులుకుతున్నాడు.

"ఏం మొగాడివోయ్ నువ్వు. నన్నో ముద్దు పెట్టుకోవూ?" అంటీ అంటనట్లు తనామె పెదవులపై ముద్దుపెట్టుకున్నాడు.

"ఇంతాచేసి అంతేనా? ఈ రాత్రి—ఏమంటావ్ కైయస్?"

"నిజంగా. జూలియా—"

"వద్దనిమాత్రం చెప్పకు" అతన్ని మధ్యలోనే ఆపిన జూలియా అంది.

"ఎందుకు బాధ? నీ క్లాడియా యెల్లాగూ యీ రాత్రి నీకు దొరకదు."

"నా క్లాడియా యేమిటి, ఆమె నా స్వంత ఆస్తియేం కాదు. ఆమె నాకీ రాత్రి అక్కర్లేదు కూడాను."

"అయితే మరి—"

"సరే. జూలియా దాన్నిగురించి యింక మాట్లాడుకోవద్దు."

"ఇంతకీ వద్దంటావా నువ్వు—"

"నాకక్కర్లేదనీకాదు, పాడూకాదూ. దాన్నిగురించి మనం మాట్లాడుకోవద్దు జూలియా."

# 10

సర్వం జగన్నాధం అవుతున్న రోజులలో కూడా సలేరియా భవనం పాత ఆచారాలకు, అలవాట్లకూ ఆటపట్టయి కొత్త పద్ధతులకు మార్పుకు ప్రతిఘటన, వ్యతిరేకత చూపుతుంది. ఆ యింటి తక్కిన పద్ధతులవలెనే అక్కడి విందులు కూడా నూతనమైన మార్పులను చొరనీయవు. అతని విందులో భక్ష్య, భోజ్య, చోస్య, లేహ్య, పదార్థాలు, రకరకాల పళ్ళు మొదలైనవెన్నో వడ్డింపబడినా కొందరి రోమన్ ప్రభువుల విందులలో వుండే నానారకాలైన ఫలహారాల్నీ, పిండివంటల్నీ అతను ఇష్టపడడు. భోజనకాలంలో సంగీతమన్నా, నాట్యమన్నా అతనికి గిట్టదు. అతనికి కావల్సిందల్లా మంచి సంభాషణ; మంచి మధువు, మంచి భోజనం. తాత తండ్రులు బాగా చదవకల్గినవారు. వ్రాయకల్గినవారు. తను కూడా విద్యాధికుడే. బానిసలతోపాటు పని చెయ్యడానికి తాత పొలానికి పోయినప్పుడు యితను తన స్వంత ఆస్తిని ఒక యువరాజులా యేలేవాడు. ఒక విజ్ఞానవంతుడైన రాజుతో తనను పోల్చుకునేవాడు. గ్రీకు చరిత్ర, వేదాంతం నాటకశాస్త్రం అధ్యయనం చేసేడు. దానికి తోడు కొంత సమర్థతతో వైద్యం చేయగలిగేవాడు. భోజనాలయాయి. తోటలోని బంగళాలోనికి పోయారు

స్త్రీలు. ఇతని అభిరుచులను ప్రతిబింబించేవాళ్ళే యితని అతిథులు. సుష్టుగా భుజించి కుర్చీలకు జేర్లబడి నమ్మకంగా కూర్చున్నారు. వాళ్ళే పట్టుదలతో, సమర్థతతో నేర్పుతో రోమ్‌ను పాలించే రోమను సమాజ శిరోభూషణములని అనిపించింది కైయస్‌కు.

తను కూడా తలమానికం అవుదామన్న కోరిక అతనికి కలగలేదు. కనుక ఆ విషయాన్ని గురించి ఊరుకున్నాడు కైయస్. వాళ్ళ ఉద్దేశ్యంలో యితను తినడానికీ, పడుకోడానికీ తప్ప మరెందుకూ పనికిరాని నిరర్థక వ్యర్థజీవి. ఇటువంటివాళ్ళు ఒకటి రెండు తరాలు యీ మధ్యకాలంలో తయారవుతున్నారు. కొన్ని పెద్దపెద్ద కుటుంబాలతో సత్సంబంధాలు కలవాడు కనుకనే యితనికి ఆ మాత్రం గౌరవమైనా లభ్యమయింది. అదే లేకపోతే వాళ్ళెక్కడ తనను గౌరవించడమెక్కడ! తండ్రి స్వర్గస్తుడయేనాటికి అతను ధనవంతుడు కావలసిందే కాని కొద్దిలో తప్పిపోయింది. తనకూ రాజకీయ ప్రాధాన్యం లభించేదే కాని చూస్తుండగా అదృష్టం ప్రక్కతోవ తీసుకొని తనకు దూరంగా తొలగింది. అందుకే మామూలుగా వాసన నూనెలు రాసుకుని, అత్తరువులు పట్టించుకుని, మంచిబట్టలు తొడుక్కుని బుర్రలేకుండా తిరిగే యువకులను చూసినట్లు చూడక యితనియందు కొంత సహనం, కొంత గౌరవం కూడా చూపుతున్నారు.

వాళ్ళంటే కైయస్‌కు భయం. వాళ్ళకో జబ్బుంది; ఆ జబ్బు వాళ్ళ ఆరోగ్యాన్ని పాడుచెయ్యదులాగుంది. షడ్రసోపేతమైన విందారగించి ద్రాక్షసారా సేవిస్తూ కూర్చున్నారు. వీళ్ళ శక్తిని యెదిరించినవాళ్ళు ఏపియన్ మార్గంలో శిలువలపై వేలాడుతున్నారు. స్పార్టకస్ మాంసం ముద్దయిపోయాడు. శిలువ వేయడానికి పనికి రాని మాంస ఖండమైపోయాడు. కసాయివాడి దుకాణంలో దిమ్మమీద వుండే మాంసం ముద్దలా అయిపోయాడతను. బానిసను చూసినంత నిర్దయగా యే గుఱ్ఱాన్ని చూసినా అది సహించదు. కనుక గుఱ్ఱాన్ని పూన్చడం కన్న నాగలికి యిద్దరు బానిసలను కట్టడమే బాగుంటుందని వాదిస్తూ గుఱ్ఱాలను గురించి మాట్లాడుతూ నిర్విచారంగా, నమ్మకంగా కూర్చున్నాడు ఆంటోనియస్ కైయస్. ఇతన్నెవరైనా శిలువ వేయగలరా?

సిసిరో నవ్వు వినిపించింది. తక్కిన వాళ్ళంతా ఒక యెత్తు. ఈ సిసిరో ఒక్కడూ ఒక యెత్తు. ఇతనే కైయస్‌ను మరింత గాభరాపెట్టేడు. ఎవరైనా యీ సిసిరోని యెల్లా యిష్టపడగలరో? తనకు సిసిరో అంటే యిష్టంలేదా? "అబ్బాయ్! లోపలా, బైటా, క్రిందా, మీదా, ముందూ, వెనుకా, యిటూ, అటూ, అంతా నీ గురించి నాకు తెలుసు" అనీ తనకేసి చూసి సిసిరో అనుకున్నట్లుగా భావించాడు కైయస్. తక్కినవాళ్ళుకూడా సిసిరో అంటే భయపడతారా? ఆశ్చర్యపోయాడు కైయస్.

సిసిరో జోలికి పోకుంటే సరి. 'అరి దేవుడా! వీడి నో కంట కనిపెడుదు బాబూ' అని తనలోనే అనుకున్నాడు. క్రాసస్ వినయం ఉట్టిపడేలా కూచున్నాడు. వింటున్నాడు. కూచున్నా, నిలబడినా మిలిటరీవాడిలా టంచెన్‌గా ఉంటాడు. బల వంతుడుగా కనిపిస్తాడు. కంచు విగ్రహం లాంటి మనిషి. నల్లని జుత్తు, నలుచదరపు ముఖం కల్గి రోమన్ సైన్యాధికారిని ముమ్మూర్తులాబోలి ఉంటాడు. సేనాధిపతి అంటే వీడు అనిపిస్తాడు. స్నానాల గదులలో క్రాసస్ ప్రవర్తన జ్ఞాపకం వచ్చింది కైయస్‌కు. కుంచించుకుపోయాడు. అతనే యితను. స్నానశాలలో అంత నీచంగా యెల్లా ప్రవర్తించగలిగేడు చెప్మా? అనుకున్నాడు. కైయస్‌కు ఎదురుగా కూర్చున్నాడు గ్రాఛూస్. మహావృక్షమంతటి మనిషి. అతని బొంగురు గొంతులోంచి పిడుగులుపడ్డట్లు వస్తున్నాయి మాటలు. లావైన మెడకు దగ్గరగా. అతుక్కుపోయినట్లుంది మెడ. అసలు మెడ అనేది ఉందా లేదా అనిపిస్తుందందుకనే. లావాటి రోమమయమైన చేతులు, వేళ్ళకు ఉంగరాలు, రాజకీయవేత్తలు యెల్లా ఆలోచించి, జాగ్రత్తగా, ఎక్కడా యిద మిత్థమని తేల్చకుండా సమాధానాలు చెప్తారో అల్లాగే సమాధానం యిస్తాడు. నవ్వితే పెంకు లెగిరిపోతాయి. ఏదైనా ఒప్పుకోవాల్సి వస్తే పూర్తిగా, హృదయపూర్వకంగా ఒప్పేసుకుంటాడు. కాదని తన వ్యతిరేకత తెల్పేటప్పుడు మాత్రం జాగ్రత్తగా ఆలోచించి, పర్యాలోచించి ప్రతి మాటనూ, విషయాన్నీ తూచి మరీ మాట్లాడుతాడు. అతని అభిప్రాయప్రకటన డాంబికంగా కన్పిస్తుంది. కాని దానిలో తెలివితక్కువ మాత్రం ఉండదు.

గ్రాఛూస్ వ్యతిరేకించాడు. "బానిసలను నాగలికి కట్టడంవల్ల పని జరుగుతుం దన్నారు. జరిగితే జరగవచ్చు" అన్నాడు సిసిరో. "ఆలోచించగల జంతువు, ఆలో చించలేని జంతువుకన్న అన్నివిధాలా నయం. నా మట్టుకు సహేతుకంగా కన్పిస్తుంది. గుఱ్ఱం కూడా ఉపయోగమైన జంతువే. మనమీద గుఱ్ఱాల గుంపులు యెప్పుడూ తిరగ బడలేదు. వాటితో మనం యుద్ధం చేయవల్సిన అవసరమూ యేర్పడలేదు. ఒకటి, గుఱ్ఱాలను మనం కొని ఉపయోగించితే బానిసలు వాటిని తగలేస్తారు."

"నాకల్లా తోచదు" గ్రాఛూస్ అన్నాడు.

"ఆయ న్నడగండి తెలుస్తుంది" అన్నాడు సిసిరో, ఆంటోనియస్‌ను చూపించి.

"అది నిజమే. బానిసలు గుఱ్ఱాల్ని తగలేస్తారు. అదే అన్న మాటేమిటి? యజ మాని తాలూకు యే వస్తువునూ, అతని ఆస్తి సంతటినీ వాళ్ళు ధ్వంసం చేస్తారు. తమను తప్ప, యజమానికి చెందిన దేన్నీ వాళ్ళు గౌరవించరు." మరో గ్లాసుడు

సారా పోసుకున్నాడు ఆంటోనియస్. "ఈ బానిసలను గురించే మాట్లాడుకుంటూ కూచోవాలిలాగుంది."

"ఎందుకు కూడదు" ఆలోచిస్తూ అన్నాడు, సిసిరో. "వాళ్ళెప్పుడూ మన తోనే ఉన్నారు. మనమే యెప్పుడూ వాళ్ళతో ఉన్నాం. ఆ మాటకొస్తే, నిజం చెప్పాల్సివస్తే మనం బానిసలచేత బానిసత్వంచేత తయారుకాబడ్డ విచిత్రమైన ఉత్పత్తి. ఉన్నది ఉన్నట్లు చెప్పాలంటే రోమన్లను బానిసలే సృష్టించారు. ఈ మన గృహస్తు వందల యెకరాల రమణీయమైన యీ తోటల్లో నివసిస్తున్నాడంటే బానిసల దయ వల్లనే. అందు కాయనమీద నాకు అసూయగా ఉంది. క్రాసస్ సేనాని గురించి రోమ న్లెందుకు చెప్పుకుంటున్నారో మీరే ఆలోచించండి. ఆయన బానిసల తిరుగుబాటు నణచి, విజయం సాధించారు కాబట్టి. అల్లాగే గ్రాఛూస్, ఆయన ఆర్జించిన ధనమంతా బానిస వర్తకంలోనే. తను నెగ్గిన వార్డులోనే ఆ వర్తకమంతా జరుగుతోంది. ఆయన సంపాదన లెక్కగట్టి చెప్పలేనంటే చాలు ఆయ నెంతగా ధనార్జన చేసేడో. ఇదిగో యీ యువకుడు,"—కైయస్‌ను తలతో చూపిస్తూ, నవ్వుతూ చెప్పేడు—"బానిసలచే తయారుకాబడ్డ విచిత్రమైన ఉత్పత్తి అంటే యీయనే అనిపిస్తుంది. వాళ్ళీయనను పెంచేరు. తిండి పెట్టేరు, గాలిలో షికారుకు తీసుకుపోయేవారు, మందూ మాకూ వేసేవారు—"

తనను గురించి సిసిరో అన్న మాటలకు కైయస్ ముఖం యెఱ్ఱబారింది. గ్రాఛూస్ విపరీతంగా నవ్వుతూ "మరి నువ్వో సిసిరో?" అన్నాడు.

"బానిసలు ఒక సమస్యగా తయారయింది నా విషయంలోనే. ఎవరైనా రోమ్‌లో మర్యాదగా, దర్జాగా బ్రతకదలచుకుంటే, అధమం పదిమంది బానిసలయినా ఉండాలి. వాళ్ళను కొనాలికదా. కొన్నాక తిండిపెట్టి మేపాలి. ఉండటానికి బస యేర్పాటుచెయ్యాలి. ఇవన్నీ నన్నెదుర్కొన్న సమస్యలు."

గ్రాఛూస్ నవ్వుతూనే ఉన్నాడు. క్రాసస్ సంభాషణ నందుకున్నాడు. "బానిసలే రోమన్లను సృష్టించారన్న వాదనను నే నంగీకరించను." గ్రాఛూస్ ఉఱుములు పడు తున్నట్లు నవ్వుతూనే ఉన్నాడు.

ఒక బానిసపిల్లను గురించి వివరంగా, ప్రతి విషయాన్నీ విపులంగా వర్ణించి చెపుతున్నాడు. ఆ కథలో అర్థంలేదు సరికదా, మోటుగా ఉంది అనుకున్నాడు కైయస్. నిజానికి ఆసక్తితో వింటున్నా, ముఖంలో పవిత్రతను ప్రకటిస్తూ వినాలికాబట్టి, విధి లేక వింటున్నవాడిలా నటిస్తూ, వింటున్నాడు ఆంటోనియస్. క్రాసస్ ఆ కథల్లో లీనమైపోయాడు. వింటున్నంతసేపూ సిసిరో పెదాలమీద నవ్వులు విరిశాయి.

"మీరెన్ని చెప్పండి. సిసిరో చెప్పినదాన్నే తీసుకుందాం" అన్నాడు క్రాసస్. సిసిరో చెప్పిన విషయాన్ని విమర్శిద్దామనే పట్టుదల సేనానిలో తగ్గలేదు.

"ఏదో చెప్పి, నేను మిమ్మల్ని బాధించానా?" సిసిరో ప్రశ్నించాడు. "ఇక్కడ యెవరూ యెవర్నీ బాధించడం అన్నది ఉండదు. మనమంతా నాగరికులం" ఆంటోనియస్ సంభాషణ తీవ్రవాదంగా పెరుగుతుందేమోనని, దానికో అడ్డుకట్ట వేయడాని కన్నాడు.

"అబ్బే కాదు. బాధ కాదు. మీరు నన్ను బాధించలేదు. గాభరాపెట్టేరు" అన్నాడు క్రాసస్.

"ఇది చాలా ఆశ్చర్యంగా ఉంది. మనచుట్టూ నే నన్నదానికి ప్రబల నిదర్శనాలు లెక్కలేనన్ని ఉన్నాయి. ఆ నిదర్శనాలలోని తర్కాన్ని మనం ఒప్పుకోపోతే ఎలాగ? గ్రీకులను తర్కం వరిస్తుంది. అందుకు వాళ్ళు అడ్డు చెప్పరు కూడా. 'రా అమ్మా, రా, మమ్మల్ని వరించు' అని చేతులు సాచి దాన్ని ఆహ్వానిస్తారే కాని, దానివల్ల వచ్చే ఫలితా లెల్లాగుంటాయా అనే ఆలోచనే వాళ్ళకుండదు. కాని మన సుగుణ మేమిటంటే పట్టుదల. దానికేంగాని, మనచుట్టూ చూడండి. మనకు కావలసింది చూడడానికి ఒక బానిస టేబిలువద్ద నిలబడివున్నాడు. మరొకడు ఖాళీ అవుతున్న మన గ్లాసులలో యెప్పటికప్పుడు సారా తెచ్చి పోస్తున్నాడు. ఇంకొకడు పళ్ళూ, వక్కలూ తెచ్చి యిస్తున్నాడు. దీనర్థం యేమిటి? మన జీవితసారం యేమిటి? మనం మరొకళ్ళం, మరొకళ్ళం కాము; రోమన్‌లం. సంపూర్ణంగా, అన్నివిధాలా బానిసల నుపయోగించుకోగల్గుతున్నాము కనుకనే మనం రోమన్లం కాగలిగేము."

"రోమ్ ఉండకపూర్వం కూడా బానిసలుండేవారుగా" అన్నాడు ఆంటోనియస్ కైయస్.

"ఇక్కడో కొద్దిమందీ, అక్కడో కొద్దిమందీ వుంటే వుండొచ్చు. గ్రీకులకూ ఉండేవి తోటలు. కార్తేజికీ అంతే. మనం గ్రీసునీ, కార్తేజినీ కూడా జయించాం. ఎందుకు? మన తోటలను వృద్ధిచేసుకొందుకే, మనం మరొకర్ని నాశనం చెయ్యాలిసొచ్చింది. తోటలూ, బానిసలూ రెండూ ఒకటే. ఒకదానిమీద ఒకటి ఆధారపడి వున్నాయి. మరొకడు ఒక్క బానిసచేతనే పనిచేయించే చోట, మనం యిరవై మందిచేత పనిచేయించాం. ఇది చాలదూ, మనం బానిసల దేశంలో బ్రతుకుతున్నామనడానికి? మనం సాధించిన మహత్తర విషయమేది? స్పార్టకస్. మనం స్పార్టకస్ లాటివాడ్ని చేజేతులా తయారుచేసేం. ఏమంటారు క్రాసస్? మీకు స్పార్టకస్‌తో సన్నిహిత సంబంధం ఉండేది, కనుక అడుగుతాను. మరే యితర దేశమైనా స్పార్టకస్ వంటివాడిని సృష్టించగలదంటారా?"

"స్పార్టకస్ తలెత్తడానికి మనమా కారకులం?" ఆశ్చర్యం, వ్యతిరేకత ఒక్క ప్రశ్నలో తెలియజేసేడు. క్రాసస్ అంహస్సు చెందేడు; మరీ గంభీరంగా ఆలోచించడం క్రాసస్‌కు చేతగాదనీ, సిసిరోవంటి వాడితో తలపడి వాదించడం అతనికి మరీ కష్టమనీ అనుకున్నాడు కైయస్. ఆ యిద్దరికీ అంగీకారం అసాధ్యం అనుకున్నాడు.

"స్పార్టకస్ నరకకూపంలోంచి వచ్చాడని నా అభిప్రాయం" సంభాషణ పెంచేడు క్రాసస్.

"నేనల్లా అనుకోను."

ఏమీ లేనట్లు నవ్వుతూనే ఉన్నాడు గ్రాఘుస్. ఇంకా తాగుతున్నాడు. తనొక దేశభక్తికల రోమన్ పౌరుడు కనుక వేదాంతిని కాలేకపోయానన్నాడు సిసిరోతో. "ఏది ఏమయినా రోమ్ ఉంది. బానిస లున్నారు. వీళ్ళతో యేం చెయ్యదలుచుకున్నావు సిసిరో?"

"దా న్నర్థం చేసుకోవాలంటాను నేను" సిసిరో సమాధాన మిచ్చేడు.

"ఎందుకు?" అడిగేడు ఆంటోనియస్.

"లేకపోతే వాళ్లు మనను నాశనం చేస్తారు కాబట్టి."

క్రాసస్ నవ్వేడు. కైయస్ కళ్ళల్లోకి చూసేడు. ఈ క్రాసస్ అల్లా అతనికేసి చూడడం అదే మొదటిసారి. ఆ చూపులో ఏదో మోహం వుంది. కైయస్ వళ్లు జల్లుమంది. అతనిలో యే ఆవేశం ప్రవేశించిందో? క్రాసస్ బాగా త్రాగుతున్నాడు. కైయస్ ఎప్పుడూ త్రాగకూడదనుకున్నాడు.

"మీ రా రోడ్డుమీదే ప్రయాణంచేసి వచ్చారా?" క్రాసస్ ప్రశ్నించాడు.

సిసిరో తల ఊపేడు. కత్తి ఝళిపించడంవల్లనే పనులన్నీ జరుగుతాయనుకోవడం శుద్ధ పొరపాటు అని మిలిటరీ మనుష్యులకు చెప్పి, వాళ్ళచేత ఒప్పించడం కష్టం. "కసాయి దుకాణంలో ఆలోచించే ఆలోచనా పద్ధతి గురించి నా కనవసరం. ఇక్కడో పద్ధతి ఆచరణలో ఉంది. మీరేమీ అనుకోకుండా ఉంటే నే చేప్తా. ఆంటోనియస్ యిప్పుడున్న తోటలలో పూర్వం మూడువేల కుటుంబాలైనా ఉండేవి. ఒక్కొక్క కుటుంబానికి అధమం అయిదుగురు మనుష్యుల చొప్పున కట్టితే, మొత్తం పదిహేనువేల మంది ఉండేవారన్నమాట. ఆ రైతులంతా మంచి సైనికులయారు. ఏమంటారు క్రాసస్?"

"వాళ్లు మంచి సైనికులే. ఇంకా అల్లాటివాళ్లు చాలామంది ఉంటే బాగుండు ననిపిస్తుంది" క్రాసస్ అన్నాడు.

"మంచి సైనికులే కాదు. మంచి రైతులు కూడా" సిసిరో చెప్పుకుపోతు న్నాడు. "పచ్చికబయళ్లూ, యేవో, యేవేవో తోటలూ కాదు. బార్లీ తీసుకోండి. బార్లీయే—ఆ బార్లీ తినే రోమన్ సైనికుడు కవాతు చేస్తాడు. పూర్వం రైతు కష్టపడి బార్లీ పండించేవాడు. అతను ఒక్క యకరం భూమిలో పండించే పంటలో సగం పంటైనా పండే ఒక్క యెకరంచెక్క మీ కుందా ఆంటోనియస్?"

"దాన్లో నాలుగో వంతు పండే భూమి కూడా లేదు" ఆంటోనియస్ చెప్పేడు.

ఈ సంభాషణ కైయస్‌కు విసుగనిపించింది. అతని మెదడులో భావాలు పందెపు గుఱ్ఱాలలా దౌడుతీస్తున్నాయి. ఆ గుఱ్ఱాలపై యితను స్వారీ చేస్తున్నాడు. అతని ముఖం వేడెక్కింది. ఎఱ్ఱబడింది. యుద్ధంలోకి వెళ్ళబోయే సైనికుడి స్థితి తన ప్రస్తుత స్థితిలోనే ఉంటుందనుకున్నాడు. క్రాసస్‌కేసి చూస్తూ అనుకున్నాడు: విసుగు పుట్టించే చెత్తవిషయాల్ని సిసిరో యింత పట్టుదలగా వాదిస్తాడేమా అని.

"అయితే యెందుకల్లా అయిందంటారు. పూర్వం పండినంత బార్లీ యిప్పుడు పండదెందుకని?" సిసిరో తన అభిప్రాయాల ఉక్కుచట్రంలో వీళ్ళందర్నీ యిమిడ్చి పారేద్దామనే ప్రయత్నంలో ఆవేశంతో ప్రశ్నిస్తూ, తన వాదనను సమర్థించుకుంటు న్నాడు.

"బానిసలకు పని చెయ్యాలని వుండదు" ఇప్పటికైనా యీ ప్రసంగానికీ, అందులోను యీ విషయానికీ స్వస్తి పలుకుదామనే ఉద్దేశంతో ఆంటోనియస్ అన్నాడు.

"అదీ. సరిగ్గా అంతే, వాళ్ళకు పనిచెయ్యాలని వుండదు. ఎందుకు చెయ్యాలి? ఎవడో యజమానికోసం పనిచేయాల్సివస్తే ప్రతివాడూ పని యెగవేయడమే ఒక సాధనగా పెట్టుకుంటాడు. నాగళ్ళు పదునుచేద్దామని వుండదు. వాటిని బండగా తయారు చేద్దామని వుంటుంది; కొడవళ్ళు విరగ్గొడదామని వుంటుంది; ఇటువంటి పెనుభూతాన్ని మనంతట మనమే సృష్టించుకున్నాం. ఇక్కడ పదివేల యెకరాలున్నాయి. పూర్వం యిదే భూమిమీద ఆధారపడి పదిహేనువేలకు తక్కువకాకుండా జనం బ్రతికేవారు. ఇప్పుడో ఇప్పుడిక్కడ వున్నదల్లా ఒక వెయ్యిమంది బానిసలూ, ఆంటోనియస్‌గారి కుటుంబం. ఇక్కడ ఒకప్పుడు బ్రతికిన రైతులు ఇప్పుడు రోమను రోడ్లమీద, సందుగొందులలో యెందుకూ కొరగాకుండా తిరుగుతున్నారు. మన కిదంతా చాలా చిన్న విషయంలా కనిపించొచ్చు. కాని దీన్నే మనం సరిగ్గా అర్థం చేసుకోవాలని మనవి చేస్తున్నా. సైనికుడుగా మారిన రైతు యుద్ధాన్నించి తిరిగివచ్చి చూసుకునే సరికి, అతని కగుపించిన దేమిటి? డొంకలతో, ముళ్ళపొదలతో, కలుపు మొక్కలతో

బీడుపడిన పొలం అతనికి ప్రత్యక్షమయింది. డబ్బిచ్చిన ప్రతివాడికీ, శరీరాన్నిచ్చిన భార్య కనిపించింది. తనను ఆనమాలుపట్టలేక, వీధివెంట ముష్టికి బయలుదేరిన పిల్ల లగుపించేరు. దీనికంతకూ, అతని భూమికీ నష్టపరిహారముగా ముదరాగా మనం అతని చేతిలో కొద్దిగా డబ్బుపడేసేం. రోమను వీధుల్లో స్వేచ్ఛగా, యధేచ్ఛగా బ్రతకరా బాబూ అన్నాం. తత్ఫలితమే మనం బానిసల దేశంలో బ్రతకాల్సిన పరిస్థితి యేర్పడడ మన్నది. ఇదే మన జీవితపు పునాది. బానిసలనెల్లా చూస్తాం? వారిపట్ల మన వైఖరి యెల్లాగుంటుంది? అన్నదానిపైనే మన స్వాతంత్ర్యం, మానవ స్వాతంత్ర్యం మన రాజ్యాంగమే కాకుండా భవిష్యత్తులో మానవజాతియొక్క నాగరికతా సర్వస్వం ఆధార పడి వున్నాయి. ఈ భూమిమీద సంచరించే, సంభాషించే ప్రతిదానికీ సమానత్వ మివ్వాలన్న గ్రీకు భావాల చెత్తనుండి మనం విడివడాలి. ఇంతకీ సంచరించగల, సంభాషించగల యీ బానిస యెవరు? నా దో నిర్వచన ముంది. బానిస అంటే మాట్లాడ గల పనిముట్టు. ఇటువంటి ఆరువేల పనిముట్లు రోడ్డుపక్క వేలాడుతున్నాయి. అది వృధాకాదు. అవసరం. కొందరీ స్పార్టకస్‌ను ఆకాశం యెత్తున పొగుడుతున్నారు. నా కీ స్పార్టకస్ ధైర్యసాహసాలగురించి వినడం చెడ్డ చావుగా వుంది. అతను మంచి అరిందా అయినవాడట. తన యజమాని కాళ్ళనే కరిచే పెంపుడుకుక్కలో అరిందా తన మేమిటి? ధైర్యసాహసా లేమిటి?''

సిసిరో నిర్దయ చల్లబడలేదు. అతనిలో ఆ నిర్దయ నల్లగా కమిలిపోయేటంత కోపంగా మారింది. బానిసలంటే అతనికి ఒళ్ళుమంట. శ్రోతలు తను చెప్పిన విషయం గురించి తను చెప్పినట్లే ఆలోచించేలా చేసేదాకా అతనికి మనశ్శాంతి వుండదు. తనను వాళ్ళకు గురువుగా చేయగలిగింది అతనిలోని ఆ కోపమే. వా ళ్ళతన్ని తెల్లబోయి చూసేరు. సగం భయంవల్ల; సగం అతని తార్కానికి ముగ్ధులయి.

మాటిమాటికీ గ్లాసులు సారాతో నింపుతూ, పండ్లు మొదలైనవి వారి కందిస్తూ, ఆ టేబిలుచుట్టూ తిరుగుతున్నారు బానిసలు. ఆ బానిసలలో మాత్రం యీ సంభాషణ కాని, సిసిరోయొక్క వాదనాపటిమకాని ఏ విధమైన సంచలనమూ కలిగించలేదన్న సంగతి గ్రహించాడు కైయస్. విషయలోలుడైన అతనిలో యేవేవో శరీరవాంఛలు తలలెత్తినవి. అతని కీ ప్రపంచం మరోవిధంగా యథాస్థితికి సంబంధం లేకుండా కన్పించేది. వాళ్ళనుగురించే యింతసేపూ మాట్లాడుకున్నా, ఆ బానిసల ముఖాలలో యేవిధమైన మార్పుకాని, భావంకాని కన్పించలేదు. ఎంత మందకొడిగా, నిర్జీవంగా, ఆసక్తిలేకుండా వాళ్ళు పనిచేస్తున్నారో యిప్పుడతను తెలుసుకోగలిగేడు. అయితే సిసిరో యథార్థమే చెప్పేడన్నమాట. మాట్లాడగలిగి, నడువగలిగినంతమాత్రాన

బానిసలు మనుష్యులుకాగలరా? ఈ భావం ఎందుకు కలిగిందోకాని అతనిలో కొంచెం ఉపశమనం కలిగింది.

# 11

అల్లా తాగుతూ మాట్లాడుతూ, కూచున్నారు వాళ్ళింకా. వాళ్ళ మాటలను వింటూ కూచుంటే పిచ్చెత్తిపోతుందేమో అనుకున్నాడు. కూచోడం శరీరానికీ, మనస్సుకూకూడా కష్టంగానే వుంది. ప్రయాణ బడలికవల్ల యీ విధంగా వుందని తనకుతాను సమాధానపరుచుకున్నాడు. భోజనశాల విడిచి వచ్చేసరికి చల్లగాలిలో కాస్సేపు ప్రశాంతంగా కూచుందామనిపించిం దతనికి. వెనుకగుమ్మం దాటి బైట కొచ్చాడు. అక్కడి ప్రదేశమంతా పాలరాతిమయమే. మధ్యనమాత్రం చలువరాతితో కట్టిన చిన్న చెఱువుంది. ఆ చెరువు మధ్యన ఒక జలదేవతా విగ్రహం వుంది. ఆ విగ్రహం చేతిలో ఒక శంఖం వుంది. ఆ శంఖపు గుల్లనుండి నీరు పైకి చిమ్ముతోంది. ఎంతో ఎత్తుగా చిమ్ముతోంది. ఆ నీరు చంద్రకాంతిలో మెరుస్తూ నృత్యంచేస్తోందా అనిపిస్తోంది. నల్లనిలావాతో చేయబడ్డ పెద్దపెద్ద కుండీలున్నాయి. ఆ కుండీలలో తమాల వృక్షాలున్నాయి. చంద్రకాంత శిలావేదికలు నిర్మించబడ్డాయి. ఇంత విపరీతమైన విశేష వస్తుసంపదనూ తన యింటి పెరడులో దాచుకోడం ఆంటోనియస్ కైయస్‌కే చెల్లింది.

అప్పు డతను ఆలోచిస్తున్నదల్లా ఒక్కటే. తనకేసి క్రాసస్ ఆదోలా చూడ్డంలో కల అంతరార్ధం యేమిటా అని అత నాలోచిస్తున్నాడు. వృక్షాగ్రాలతోబాటు వంపులు తిరిగిన చంద్రకాంతిని చూస్తూ, అతనల్లా చూస్తుండగా అతని ఆలోచనా ప్రవాహానికి యెవరిదో కంఠస్వరం అడ్డుపడింది.

"కైయస్?"

ఆ సమయంలో అతను యెవరితోనైనా వుండటానికి యిష్టపడును కాని యీ జూలియాతో మాత్రం ఒక్కక్షణం అక్కడుండటానికి అతను యిష్టపడడు.

"ఇక్కడికి నే రావడం మంచిదే అయింది కైయస్!"

అర్థంకానట్లు చేతులూపేడు. అదే అతని సమాధానంకూడా. ఆమె అతని వైపుకు దగ్గరగా నడచివచ్చింది. రెండు భుజాలమీదా చేతులేసింది. గోముగా అతని ముఖంలోకి చూసింది.

"కైయస్, నన్ను ఆదరంగా చూద్దూ పుణ్యముంటుంది" అంది.

'ఈమెని ఆదరంగా చూస్తే పుణ్యం వుంటుందట పుణ్యం! ఎందుకీముక్కడం? మూల్గడం కట్టిపెట్టదో,' అనుకున్నాడు కైయస్ తనలో.

"నువ్వు నాకిచ్చే దేమంత పెద్దదికాదు. కష్టమూ కాదు. కాని ఎంత చచ్చినా ఆడదాన్నా? ఆడదాన్నై నేనే ముందుగా అడగడం ఎటువంటిదో ఆమాత్రం నువ్వు అర్థం చేసుకోలేవా?"

అతనన్నాడు: "జూలియా! నాకు చాలా బడలికగా వుంది. వెళ్ళి పడుకోవాలనుంది."

"బహుశా నే నందుకు తగుదునేమో" ఆమె గొణిగింది.

"అల్లా అనుకోకు, జూలియా!"

"మరెల్లా అనుకోను?"

"నాకు బడలికగా వుంది—అంతే."

"అంతే యెల్లాగయింది కైయస్? నీకేసి చూసినప్పుడల్లా, నీ సంగతి యేమిటా అని ఆలోచిస్తూ వుంటాను. నన్ను నే నసహ్యించుకొంటుంటాను. నువ్వు ఎంత అందంగా వున్నావో—అంత ఛండాలంగా"—

అత నామెకు అభ్యంతరం చెప్పలేదు. మనస్సులో వున్న అక్కసునంతా కక్కనిస్తే, దీని గొడవ త్వరగా వదుల్చుకోవచ్చు. ఇదే అతని ఉపాయం—

ఆమె చెప్పుకుపోతోంది: "కాదు—అందరికన్న నువ్వేమంత ఛండాలుడివి కాదనుకుంటా. నీకొక్కడికే చెప్తా. మనందరిలోనూ వుంది ఛండాలం. మనందరిలోనూ వుంది జబ్బు. మనందరిలోనూ వుంది చావు. మనం చావుతో నిండిన సంచులం; మృత్యువు మూటలం. మనం చావునే ప్రేమిస్తాంకదూ, కైయస్. నువ్వు ప్రేమించవా కైయస్. అందుకేగా ఆ శిక్షచిహ్నాలంటామే వాటిని చూడాలనే కోరికతోనేగా నువ్వా రోడ్డుమీద ప్రయాణంచేసి వచ్చావు? శిక్ష! శిక్షట శిక్ష! మనం మృత్యువును ప్రేమిస్తాం కనుకనే, ఆ శిక్షనుకూడా ప్రేమించగలిగేం. ఏదైనా పని చేస్తావనుకో, ఆ పనియందు నీకు యిష్టం వుంటుంది కాబట్టే, నువ్వాపని చేస్తావు. చల్లని యీ వెన్నెలలో యెంత అందంగా వున్నావో తెలుసా? ప్రపంచమంతటికీ శిరోభూషణం కాగల నిండుయవ్వనంకల రోమన్ యువకుడవు. ఔనులే! ఒక ముసలిదానికోసం నీలాటి వాడికి తీరిక యెక్కడిది? నువ్వెంత ఛండాలుడివో నేనూ అంత ఛండాలమైనదాన్నే కైయస్. కాని నేను నిన్నెంతగా అసహ్యించుకుంటానో అంతగానూ ప్రేమిస్తున్నాను. నువ్వు చస్తే బాగుండుననిపిస్తుంది. దౌర్భాగ్యమైన నీ దుర్బలహృదయాన్ని యెవడైనా కత్తితో కోసిపారేస్తే యెంత బాగుండును!"

చాలసేపు నిశ్శబ్దం ఆవరించింది. తొందరలేకుండా తాపీగా అడిగాడు, కైయస్.

"అంతేనా! యింకా యేమైనా వుందా జూలియా?"

"లేదు లేదు. అయిపోలేదు. ఇంకా వుంది. నేనుకూడా చస్తే బాగుండును."

"నిస్సందేహంగా యివి రెండూ తీరే కోరికలే" అన్నాడు కైయస్.

"ఓరి ఛండాలపు—"

"వస్తా జూలియా" కైయస్ తెగేసి అన్నాడు, నెమ్మదిగా అనవలసిన యీ కాస్తమాటనూ. డాబా వదిలి వెళ్ళేడు. ఏదో ప్రశాంతంగా కాస్సేపు కూచుందామని వస్తే యింత గొడవైంది. అత్త ప్రేలాపనలో ఆవంత అర్థం లేదు. చెడ్డ చిరాకు వచ్చింది. ఆమెకేకాని యేమాత్రం యింగితజ్ఞానం యేడ్చినా, యెంత అసహ్యంగా తను తయారవుతున్నదీ, ఎంత ఛండాలంగా ప్రవర్తిస్తున్నదీ తెలుసుకోగల్గును. జూలియా కా యింగితజ్ఞానం వుంటేగా? అందుకే ఆంటోనియస్ కైయస్ ఆమెతో వేగలేకపోతున్నాడు.

కైయస్ తనకోసం కేటాయించబడ్డ గదిలోకి వెళ్ళాడు. యౌవనంలో వున్న యిద్దరు ఈజిప్షియన్ బానిస లక్కడున్నారు. గదిలో దీపం వెలుగుతోంది. వాళ్ళను పొమ్మన్నాడు. బట్టలు విప్పుకున్నాడు; జరిగిన సంఘటన వల్ల వచ్చిన కోపంతో అతను వణుకుతున్నాడు. మందంగా వాసనవేసే అత్తరువును రాసుకున్నాడు. శరీరంమీద పౌడరు అద్దేడు. పడుకోబోయేటప్పుడు తొడుక్కొనే బట్టలు తొడిగేడు. దీపమార్పి మంచంమీద వాలేడు. చీకటికి బాగా అలవాటుపడ్డాడు. కిటికీలోంచి పడుతున్న తెల్లని చంద్రకాంతిలో అతనికి గదిలోనివన్నీ బాగా కన్పించసాగేయి. గది చల్లగా, హాయిగా వుంది. చుట్టూవున్న పూలచెట్లూ, అత్తరువూ ఆ గదిని పరిమళంతో ముంచెత్తాయి.

అల్లా అతను పడుకొని పదినిముషాలైనా కాలేదుకాని, ఆ పది నిముషాలు పది యుగాల్లా అనిపించిం దతనికి. అప్పుడు యెవరో తలుపు మెల్లిగా తట్టేరు.

"రావచ్చు" అన్నాడు కైయస్.

క్రాసస్ ప్రవేశించాడు. తలుపుమూసి లోనికి వచ్చాడు. ఆ మహాసేనానిలో యింతకు మున్నెప్పుడూ కనిపించనంత పురుషత్వం తొణికిసలాడుతోంది. తన రాకకై యెదురుచూస్తున్న యీ యువకుణ్ని చూస్తుంటే అతనిలోని యీ పురుషత్వం మరింత కట్టలు తెంచుకుంది.

## 12

గదిలో పేలికలా పడుతున్న చంద్రకాంతి తన స్థానాన్ని మార్చింది. అసలే బడలికగావున్న కైయస్ మరింత అలసిపోయాడు. ఈ అలసట అతనిలో సంతృప్తి కల్గించింది. ఇంద్రియలోలుడైన కైయస్ సాచుకు పడుకున్న పిల్లిలాగున్నాడు. తను

ఆ విధంగా ఉన్నట్లు కైయస్ తన గురించి తనే అనుకుంటూ ఉంటాడు. మొత్తం మీద ఆ ఉపమానం మరెవ్వరికీ చెందదు తనకు తప్ప.

"నా కా సిసిరో అంటే అసహ్యం."

క్రాసస్ ఆత్మసంతోషం పొందేడు; మృదువుగా పితృభావంతో కైయస్ నడిగేడు: "నువ్వు సిసిరో నెందుకు అసహ్యించుకుంటావు - న్యాయబుద్ధిగల సిసిరోని? ఏం? ఎందు కతనంటే నీ కంత అసహ్యం?"

"అత న్నెందు కసహ్యించుకుంటానో నాకే తెలియదు. ఎవరినైనా అసహ్యించు కుంటే ఎందు కసహ్యించుకోవాలో తెలియాలా? కొందరంటే యిష్టం. మరికొంద రంటే ద్వేషం."

"ఆ శిక్షాచిహ్నాలకు, ఏపియన్ మార్గంలో ఆరువేల పైచిలుకు శిలువలు పాతించ డానికి—పూర్తిగా యితను కాకపోయినా చాలామటుకు—యితనే కారకుడనా నీ కత నంటే అంత ద్వేషం?"

"కాదు."

"ఆ శిలువలను చూస్తే నీకేమనిపించింది?" సేనాని అడిగేడు.

"అప్పుడప్పు డాసక్తిగానే కన్పించాయి. కాని మొత్తంమీద నాకు నచ్చలేదు. ఆడపిల్లలకు నచ్చినట్లుంది."

"ఆహా?"

"రేపు నే నింకోలా అనుకోవచ్చు" చిరునవ్వు నవ్వేడు కైయస్.

"ఏం?"

"ఆ శిలువలను మీరే అక్కడ పెట్టించారు కాబట్టి."

"అబ్బే, నేను కాదు—ఆ సిసిరో, మరి కొందరూ, ఎల్లాగైనా నాకు లెక్కలేదు. పొడిచి చంపినా, శిలువమీద చంపినా, నాకేం పెద్ద తేడా కనిపించదు."

"మొత్తంమీద మీరు స్పార్టకస్‌ని సర్వనాశనం చేసేసేరు."

"ఆఁ యేముంది?"

"అందుకే నాకు మీరంటే ప్రేమ—వాడ్ని నే నసహ్యించుకుంటాను."

"స్పార్టకస్‌నా?" అడిగేడు క్రాసస్.

"అవును. స్పార్టకస్‌నే."

"అతన్ని ను వ్వెరుగవుగా?"

"ఎరిగుంటే యేం; ఎరగకపోతే యేం? అదో పెద్ద విషయంకాదు. సిసిరోని అంతగా అసహ్యించుకోను కాని, యీ స్పార్టకస్ అంటేనా, నాకు చెడ్డమంట. సిసిరో

అంటే నాకో లెక్కా, జమా. కాని వాడ్ని, ఆ బానిస ఉన్నాడే, వాడ్ని నేను బాగా అసహ్యించుకుంటాను. అతన్ని మీరు పట్టుకుని నా దగ్గరకు తీసుకొచ్చి యిడుగో కైయస్; వీడ్ని గుండెల్లో పొడిచి చంపు అని అంటేనా! మీరు కనుక అల్లాగేచేస్తే''—

''ఇప్పుడు నువ్వో చంటిపిల్లాడిలా మాట్లాడుతున్నావు.''

మందలించుతున్నట్లు మాట్లాడేడు సేనాని.

''నేనే? ఎందుకు మాట్లాడకూడదు?'' కైయస్ అడిగేడు. అతని ప్రశ్నలో మూలుగు వినబడింది. ''నేను చంటిపిల్లా డ్నెందుకు కాకూడదు? ఏం పెద్దవాడవడం లాభదాయకమా యేమిటి?''

''నువ్వెప్పుడూ చూడని స్పార్టకస్‌ని యెందుకంత అసహ్యించుకోవాలి?''

''నే నతన్ని చూసేననుకోకూడదూ. మీ కెరుగుదురా నేను నాలుగేళ్ళ క్రితం కేపువా వెళ్ళేను. అప్పుడు నాకు యిరవై ఒక్క యేళ్ళే. బాగా కుర్రాడ్ని.''

''ఇప్పటికీ నువ్వు కుర్రాడివే'' సేనాని చెప్పేడు.

''అబ్బే-అంత కుర్రాడ్ని కాదు. అప్పుడు మరీని; మొత్తం ఐదారుగురం కలిసి వెళ్ళేం. మేరియస్ బ్రాకస్ నన్ను తనతోకూడా తీసుకెళ్ళేడు. అతనికి నే నంటే ఎంత యిదో!'' కైయస్ యీ మాటలు కావాలని అన్నాడు. వీటి వెనుక ఒక ప్రయోజనం ఉంది. మేరియస్ బ్రాకస్ బానిసయుద్ధంలో చచ్చిపోయాడు కాబట్టి అతన్ని గురించి యేం చెప్పినా యిబ్బంది ఉండదు. కాని క్రాసస్ తెలుసుకోవాలి. అతనే మొదటివాడు కాదనీ, యింతకు పూర్వం యెంతమందినో తను చూసినవాడేననీ అతను తెలుసుకోవడం మంచిది. ఆ మాటలు విని క్రాసస్ మరింత టంచెన్‌గా కూచున్నాడు. ఏమీ మాట్లాడలేదు. కైయస్ చెపుతున్నాడు:

''అవును. నేనూ, మేరియస్‌బ్రాకస్, అతని స్నేహితుడొకడు. ఆ స్నేహితుని భార్యా, వాళ్ళిద్దరి పేర్లు నాకు జ్ఞాపకం లేవు.''

''అతనంటే నీకు లెక్కేనా?''

''పాపం! అతను చచ్చిపోయాడు, అందుకు నే విచారిస్తుంటాను'' అని కైయస్ యెందుకో చేతులు తిరగేసేడు.

'ఓరి జంతువా! యెంత నీచమైన జంతువ్వేరా నువ్వు!' అనుకున్నాడు క్రాసస్.

''మేం కేపువా వెళ్ళేం. బ్రాకస్ మా కో గమ్మత్తయిన సర్కస్ చూపిస్తా నన్నాడు. అప్పు డది యిప్పటికంటె చాలా వ్యయంతో కూడిన పని. అటువంటిది చూడాలంటే యెంతో డబ్బుండాలి. ఐనాసరే బ్రాకస్ యెంత హుందాగా ప్రవర్తించా డనీ. డబ్బంటే అతనికో లెక్కా!''

"అప్పు డక్కడ వెంటలుస్ బేటియాటస్ అనేవాడి కో మల్లశిక్షణ కేంద్రం ఉండేది కదూ?" క్రాసస్ ప్రశ్నించాడు.

"ఔను ఉండేది, ఇటలీ కంతటికీ అదే పెద్దదనేవారు. పెద్దదీ, బాగా డబ్బు ఖర్చయేదీకూడా అదే. అక్కడ ఇద్దరు మల్లుల్ని పోరాడించడానికి ఖర్చయే సొమ్ముతో ఒక యేనుగును కొనవచ్చునని చెప్పుకునేవారు. ఈ వర్తకంలో ఆ బేటియాటస్ ఓ లక్ష సంపాదించాడంటారు. లక్షొచ్చినా, యేమొచ్చినా అతనో పంది, మీ రెరుగుదురా అతన్ని!"

క్రాసస్ తల పంకించేడు. "అతన్ని గురించి చెప్పు; నాకు వినాలని ఉంది. ఇది జరుగుత స్పార్టకస్ తిరుగబడకముందుగదూ?"

"స్పార్టకస్ యిక యెనిమిది రోజులకు తప్పించుకుపోతాడనగా జరిగిందని జ్ఞాపకం. ఎంతోమంది బానిస స్త్రీలచేత పడుపువృత్తి చేయించేవాడని బేటియాటస్ కో పేరుండేది. ఔనుమరి, అంత నడిబజారులో చేయించడ మేమిటి వాడి మొఖం కాని. ఏదో మారుమూల ఏడవాలి కాని నడిబజార్లో చేస్తే అందులో ఉండే హాయి యేమిటో వాడికే తెలియాలి. కాని యేమిటో మరి అతనల్లాగే చేసేవాడు. కుర్రాళ్ళని కనిపించ డానికీ, గుంటల్ని కనడానికీ ఉపయోగించేవాడు. అంతా బాగానే ఉందికాని దేనికైనా ఓ పద్ధతి అంటూ ఏడిసింది కదా చేసినదేదో కాస్త సున్నితంగా చెయ్యాలా వద్దా? ఎద్దు లాటి మనిషి, లావుగా ఉండేవాడు. నల్లనిజుట్టు నల్లని పెద్దగడ్డం. అతనిబట్ట లెంత మురికిగా వున్నాయో, ఆ బట్టలమీద యెక్కడెక్కడ కోడిగ్రుడ్డు సొనపడిందో నాకు జ్ఞాపకముం దింకా. మాతో మాట్లాడుతూ ఉంటే కోడిగుడ్డు సొన సరిగ్గా వాడి చొక్కామీద పడింది."

"అబ్బ! నీ కెంత జ్ఞాపకం!"

"అంతా జ్ఞాపకమే. బ్రాకస్, నేనూ కలసివెళ్ళేం. రెండు జతల మల్లులు చచ్చే దాకా పోరాడాలని బ్రాకస్ అన్నాడు. బేటియాటస్ చచ్చేదాకా జరిగే పోరాట ప్రదర్శన యేర్పాటు చెయ్యమంటే చచ్చినంత వెల కాస్తాడు. కాలక్షేపంకాక రోమ్‌నుంచి వచ్చే డబ్బున్న పెద్దమనుష్యులు తమకు తోచినట్లల్లా ద్వంద్వయుద్ధరీతులలో, సాంకేతికంలో మార్పులు తేడానికి ప్రయత్నించడం నా కిష్టం ఉండదంటాడు బేటియాటస్, కాని డబ్బు బ్రాకస్ జేబులో ఉంది. డబ్బే మాట్లాడుతుంది, నిర్ణయిస్తుంది."

"అల్లాటి వాళ్ళతో డబ్బే మాట్లాడుతుందిలే" అన్నాడు సేనాని. "వర్తకులంతా అసహ్యించుకోదగ్గవాళ్ళే. అందులోనూ యీ బేటియాటస్ ను వ్వన్నట్లే ఒక పంది. నీకు తెలుసా? వాడికి రోమ్‌లో మూడు పెద్దపెద్ద అద్దెకొంప లున్నాయి. నాలుగోది

కూడా ఉండేది. ఒక మంచిరోజు చూసుకుని ఆ కొంప కూలిపోయింది. దాన్లో కాపుర ముంటున్నవాళ్ళల్లో సగంమంది చచ్చిపోయారు. వాడు డబ్బుకోసం యేమైనా చేస్తాడు.''

''మీ రత న్నెరుగుదురని నాకు తెలియదు.''

''నే నతనితో మాట్లాడేను; స్పార్టకస్ గురించి అతనికి సముద్రమంత సమాచారం తెలుసు. అస లీ స్పార్టకస్ గురించి యేమైనా తెలిసినవాళ్ళు ఒక్కరైనా ఉంటే, యిత నొక్కడేనని నా ఉద్దేశ్యం.''

''చెప్పండి, చెప్పండి.''

''అహ! నువ్వు చెపుతున్నావుగా, బహుశా నేను స్పార్టకస్‌ని చూసే నేమోనని!''

''చెబుదురూ'' కొంచెం చిరాకుగా అన్నాడు, కైయస్.

''ను వ్వొకొక్కప్పుడు అచ్చు ఆడపిల్లలాగే ఉంటావు సుమీ.''

''అల్లాగే అనదన్నానా! మీ రల్లా అనడం నా కిష్టం ఉండదు'' అన్నాడు కైయస్. పిల్లిలా నిక్కబొడుచుకుని బిర్రబిగిసేడు.

''నేను నీకు కోపం వచ్చే మాట యేమన్నానని?'' సేనాని అతన్ని లాలించడం మొదలెట్టేడు. ''బేటియాటస్ గురించి చెప్పమనికదూ నువ్వడిగింది? అదేం పెద్ద విశేషం కాదు. కాని నువ్వడిగేవు కాబట్టి చెప్తా. ఒక ఏడాది క్రితం అనుకుంటా, బానిసలు మనని పట్టుకు చావగొట్టేస్తున్నారు. అందుకే యీ స్పార్టకస్ యెవరు? ఇతని స్వరూప స్వభావా లెటువంటివి? అని తెలుసుకునేందుకు ప్రయత్నించాను. శత్రువు అనుపానులు తెలిసివుంటే వాడ్ని మరోదెబ్బ కొట్టచ్చు''—

వింటూన్నంత సేపూ కైయస్ ముఖం నవ్వుతో మెరిసిపడింది. మొత్తంమీద అతనికి తెలియదు స్పార్టకస్‌ను తనెందుకు ద్వేషిస్తున్నాడో. కాని, ఒక్కొక్కప్పుడు అతను ప్రేమలోకన్న ద్వేషంలోనే అమితమైన సంతృప్తి పొందేవాడు.

**రెండవ భాగం :** "నాకు సేనాధిపత్యం కట్టబెట్టేక యిదీ జరిగిన విషయం" అంటూ కైయస్ పక్కన శయనించిన క్రాసస్ చెప్పుకు పోతున్నాడు. "అదెటువంటి గౌరవం అంటే చిటికెలో మనిషిని కాటికి పంపుతుంది—మన సైన్యాల్ని ఆ బానిస వెధవలు చీల్చి చెండాడుతున్న రోజు లవి. ఆ వెధవలే ఇటలీకి అధినాథులై కూర్చున్న కాలమది. నా పరమశత్రువులు కూడా నన్ను గౌరవించేవాళ్లు. సిస్-ఆల్పైన్‌గాల్ అనే చోట సైన్యాలతో సహా మకాం వేశాం. నీ బొండాం మిత్రుడు బేటియాటస్‌కు కబురు పంపాను."

బేటియాటస్ ఆ రోజుల్లో కేపువాలో ఖడ్గమల్లుల శిక్షణాకేంద్రం నడుపుతుండే వాడు.

---

బేటియాటస్, సేనాని క్రాసస్ విడిదికి చేరుకునేటప్పటికి సన్నగా వాన పడుతోంది. ముచ్చటైన స్వంత యింటినీ, వెచ్చని కేపువా ఎండనీ విడిచిపెట్టి నిప్పచ్చరమైన యీ అధ్వాన్న సీమకు రావలసివచ్చినందుకు మహానొచ్చుకున్నాడు. కనీసం, డోలీలో కూర్చుని వచ్చే సౌకర్యానికైనా తను నోచుకోలేదు. బక్కచిక్కిన ఓ పచ్చగుర్రం మీద వస్తూ ఆలోచిస్తున్నాడు.

"సేనానులు వ్యవహారాలు నడిపిస్తే నిజాయితీపరులు వాళ్ళాడించినట్లల్లా ఆడాలి. నీ జీవితం నీ అధీనంలో వుండదు. నావద్ద ఏవో కొద్దిపాటి రాళ్ళున్నాయన్న సంగతి నలుగురికీ తెలుసు. అందుకేగా, నే నంటే అసూయ. కాని నువ్వే ఒక యోధుడవయితే యెంత డబ్బయినా దగ్గఱ ఉంచుకోవచ్చునట. నువ్వొక రాజకీయ వేత్తవే కనుక అయివుంటే గొప్ప ధనవంతుడవడానికి కావలసిన అర్హత కలవాడి వన్న మాట. ఈ రెంటిలోను నువ్వేదీకాకుండా నిజాయితీగా డబ్బు సంపాదించు కొనేవాడివే ఐతే ఒక్క నిముషం గుండెలమీద చెయ్యి వేసుకుని విశ్రమించలేవు. లంచం ఇవ్వకుండా ఇనస్పెక్టరుగాడ్ని తప్పించుకుంటే, రాజకీయవేత్తను తప్పించు కోలేవు కదా. ఈ యిద్దరి కబంధహస్తాల నుండీ తప్పుకున్నా, నీ చెల్లించవలసిన చిఠాలోకి ట్రిబ్యూన్ తయారు. ఎప్పుడు నువ్వు మేల్కొని చూసినా, యే కత్తో

పెట్టి నిన్ను నిద్రలో ఎవరూ పొడిచి చంపనందుకు నిన్ను నీ వభినందించుకోవా ల్సిందే. ఈ సేనాని వెధవ, వీడెవడో, యిటలీ భూభాగంలో సగంమేర న స్నీడ్చు కొస్తున్నాడు, వాడి మకాంలోకి. ఏవో ప్రశ్న లడుగుతాడట, ప్రశ్నలు. నా పేరే కనుక ఏ క్రాసస్, గ్రాఘస్, సిలేనియస్, మీనియస్ అనో ఉంటే, కథాకమామీషు యీ విధంగా ఉండేవి కావు. దాన్నే రోమన్ న్యాయం, రోమన్ సమానత్వం అనే అనేక పర్యాయపదజాలంతో, సహస్రనామాలతో పిలుస్తారు, రోమన్ రిపబ్లిక్కులో."

ఒక రోమను సేనానిగురించీ, రోమను న్యాయశాస్త్రం గురించీ హర్షించదగని విధంగా ఆలోచించాడు లెంటులుస్ బేటియాటస్. సైనిక గుడారాల యీవలగా త్రోవను కాపలా కాస్తున్న ఏ కాపలా సైనికుడో యితని ఆలోచనా ప్రవాహానికి ప్రశ్నార్థకపు అడ్డుకట్ట వేసేడు. విధేయత ఉట్టిపడేలా తన గుఱ్ఱాన్ని ఆపి, చల్లని రమ్యమైన ఆ వర్షంలో కూర్చున్నాడు. ఇద్దరు సైనికు లితన్ని సమీపించి, తనిఖీ తతంగం కానిస్తు న్నారు. ఎల్లాగా వాళ్ళు వర్షంలోనే నిలబడాలి. ఇల్లాగే కాపలా కాయాలి యెంత సేపైనా; అందువల్ల అవతలవాడు వర్షంలో నిలబడ్డాడే పాపం అనే భావం వాళ్ళకు కల్గదు. వాళ్ళ చూపుల్లో అనాదరణ. ఆ చూపులు ఆవాహనా తెల్పవు, నిరసనా తెలియ చెయ్యవు. అతన్ని పేరడిగేరు.

"నన్ను లెంటులుస్ బేటియాటస్ అంటారు."

ఆ సైనికులు అమాయకులైన రైతుబిడ్డలు. కనుకనే ఆ పేరు గుర్తించలేక పోయారు. అత నెక్కడికి పోవాలనుకున్నాడో మాత్రం అడిగేరు.

"ఈ త్రోవ మకాంలోకే పోతుందిగా?"

"పోతుంది."

"అయితే నేను మకాంలోకే పోతున్నాను."

"దేనికి?"

"సేనాధిపతితో మాట్లాడడానికి."

"అదా సంగతి. నువ్వేం అమ్ముతుంటావు?"

'ఏ మమ్మితే యెందుకో వెధవలకి' అనుకున్నాడు లోపల. పైకి మాత్రం సహనంతో "నేనేమీ అమ్మను. ఆహ్వానంమీద వచ్చాను" అన్నాడు.

"ఎవరు పిలిచారు రమ్మని?"

"సేనాధిపతి" అని తన వద్ద సేనాని సంతకంతోవున్న అనుజ్ఞాపత్రం చూపించాడు.

వాళ్ళది చదవలేరు. ఎవడైనాసరే యేదో కాగితంముక్క పట్టుకొస్తేచాలు. లోపలికి పోగలడు. బక్కచిక్కిన ఆ గుర్రాన్ని నడిపించుకుంటూ మకాం చేరు కుంటున్నాడు. ఆ రోజులలో వృద్ధిలోనికి వస్తున్న చాలామందిలాగే బేటియాటస్‌కూడా తను చూసిన ప్రతిదాన్నీ అణా పైసలలోకి మార్చి చూసే అలవాటుగలవాడు. ఇటు వంటి రోడ్డు నిర్మాణానికి యెంతవుతుందా అని ఆశ్చర్యపోయాడు. మకాంలోని సైనికులు ఉపయోగించుకునేందుకు వేసిన తాత్కాలికమైన రోడ్డది. తమ కేపువాలో శిక్షణకేంద్రం వరకూ వేయించిన రోడ్డుకన్న చాలానయం. మట్టి, కంకరమీద సుల భంగా తయారయిన గులకరాతిపలకలతో వేసేరు దీన్ని. ఒక మైలుదూరం బాణంలా తిన్నగా పోయేరోడ్డు.

'ఈ సేనాని వెధవలు రోడ్లగురించి కాక, యుద్ధంగురించి కనుక ఆలోచించి వుంటే మన కీ దుర్గతి పట్టేదికాదు' అనుకున్నాడతను. ఎందుకో అతనిలో గర్వం మిణుకు మిణుకుమంటూనే వుంది. వర్షంలో, బురదలో అసహ్యంగాతోచే పరిస్థితిలో కూడా రోమను నాగరికతాప్రతిభ నీ కగుపించకమానదు. దాన్నిగురించి అనుమానించ వలసినదీలేదు.

అతను మకాం సమీపించాడు. ఈ సైన్యాల తాత్కాలిక మకాములు మహా నగరాలను పోలివుండేవి. సైన్యాలెక్కడికిపోతే, నాగరికత కూడా అక్కడికి పోయేది. సైన్యాలు, ఒక్కరాత్రికైనా సరే యెక్కడ మకాంచేస్తే అక్కడ నాగరికత విల సిల్లేది. ప్లానులోని గీతలలా అరమైలు వైశాల్యంగల చదరం. దాని చుట్టూ కందకం. బలిష్టమైన ఒక గోడ, వెళ్ళగానే పన్నెండడుగుల లోతూ, అంతే వెడల్పూ వుండే కందకం వుంటుంది. దాని వెనుక పన్నెండడుగుల ఎత్తున్న బరువైన గుంజల పేర్పు ఉంటుంది. కందకానికి అడ్డుగా రోడ్డు పోయేచోట పెద్ద దర్వాజా వుంటుంది. అది మంచి దట్టమైన కర్రతో చేయబడినది. ఇతను వెళ్ళగానే ఆ దర్వాజా తెరవబడింది. ఇతని రాకని తెలుపుతూ బాకా మోగింది.

అది అతని గౌరవార్థం కాదు. క్రమశిక్షణ; క్రమశిక్షణ కోసమే ఆచరించే క్రమశిక్షణ. ఈ క్రమశిక్షణలో రోమను సైన్యాలు ప్రపంచమంతటిలో అద్వితీయం, అసమానం అని యెవరైనా అంటే అది యేమీ తోచక చెప్పుకునేవాడి అతిశయోక్తి అని తోసిపారెయ్యడం మంచిదికాదు. దెబ్బలాటలూ, యుద్ధం, రక్తప్రవాహాలూ అంటే అమితమైన యిష్టం కలవాడే (అందుకే యీ కిరాయి సైనికులంటే కిట్టదు) క్రమశిక్షణ గురించి శిక్షణకేంద్రాధిపతిగా సర్వమూ తెలిసినవాడే అయినా, ఈ క్రమ శిక్షణ మాత్రం అతడ్ని ముగ్ధుడ్నిగాచేసి పారేసింది.

ఆ రోడ్డూకాదు; అంత యెత్తునావున్న గుంజలూకావు; మకాంలో వేయబడ్డ వెడల్పాటి వీధులూకావు. ఆ కందకమూకాదు. రోడ్లమధ్య గులకరాతి పలకలతో వేసిన చప్టాలూకావు; రోమన్ల బహువిధ బహుముఖ జీవితమూ, వారిలోని కదలికా, పట్టాలు తప్పని ఆ క్రమశిక్షణా యివేవీకావు అతడి నాకర్షించినవి. ఒకచోటు నుంచి మరొకచోటికి పోతూ రాత్రులు సల్పినకృషీ, చేసిన యత్నమూ, మానవ వివేచనా శక్తిఫలితంగా యివన్నీ సిద్ధించాయన్న ఒక్కసంగతే అతని ఆలోచనకు పాత్ర మయింది. ఇటువంటి సైన్యాలు మకాం చేసివుండగా ఏ రాత్రిపూటో చూచినంత మాత్రాన బర్బరులు సులువుగా ఓడిపోయేవారేకాని, ఆ సైన్యాలతో యుద్ధంచేసి మాత్రం కాదు అని చెప్పిన కబురు ఆషామాషీకబురు కాదు.

జీనుమీద మోపిన తన శరీరభారం దులుపుకుంటూ బేటియాటస్ గుఱ్ఱం దిగేడు. ఒక ఉద్యోగి వచ్చి అత నెవరో, వచ్చిన పనేమిటో అడిగేడు. అడిగినవా డొక యువకుడు.

"లెంటులుస్ బేటియాటస్. కేపువావాడ్ని!"

"ఓహో! అవునవును" అంటూ సాగదీసేడు ఆ యువకుడు. అతని వయస్సు యిరవై పైబడదు. సెంటు రాసుకుని, అందంగా, చక్కగా తల దువ్వుకుని తయారయే పెద్ద కుటుంబాలకు తగినవాడే ఆ ఉద్యోగి. "లెంటులుస్ బేటియాటస్, కేపువా! అవునవును!" అతడెరుగు! కేపువావాసి లెంటులుస్ బేటియాటస్ అంటే యెవరో, అతను దేనికి ప్రాతినిధ్యంవహిస్తాడో, యిప్పుడిక్కడకు యెందుకు పిలవబడ్డాడో అతనికి తెలుసు.

'అవునులే. నువ్వు న న్నసహ్యించుకుంటావు, కాదుమరీ? కుర్రగాడిద కొడకా? అక్కడ నిలబడి నన్ను ను వ్వసహ్యించుకుంటున్నావు, కాని నీలాటివాళ్ళే సుమీ నన్ను తయారుచేస్త. నువ్వు కొంచెం నయంలాగే కన్పిస్తున్నావు. నా గాలి సోకినంతమాత్రాన మైలపడిపోతా నేమోనన్న సంకోచం నీకున్నట్లు కనిపించదు. కుర్ర కుంకా!' పైకి మాత్రం తలఊపి ఊరుకున్నాడు.

"సేనాని మీరొస్తారనే అనుకుంటున్నారు. నా కది తెలుసు; వచ్చిన వెంటనే తనవద్దకు మీరు రావాలని ఆయన చెప్పేరు. తీసుకువెళ్తా రండి."

"ఏమైనా తినాలనీ, కొంచెం విశ్రాంతి తీసుకోవాలనీ వుంది."

"సేనాని ఆ యేర్పాట్లన్నీ చేయిస్తారు. ఆయన చాలా ఆలోచనాపరుడు" అని ఆ యువకుడు చిరునవ్వు నవ్వేడు. ఒక సైనికుడ్ని తట్టి, "వారి గుర్రాన్ని తీసుకెళ్ళి మేతవేసి, నీళ్ళుపట్టి పడుకోనీ" అన్నా డా ఉద్యోగి.

"ఉదయ మెప్పుడో తిన్నదితప్ప యింకేంలేదు" అన్నాడు బేటియాటస్.

"ఇంతవరకూ ఆగగలిగిన సేనాని నాకోసం మరికాస్సేపు ఆగలేడంటారా?"

కొంచెం కళ్ళు చిట్లించినా గొంతులో యేమార్పూ రానీయకుండా "అది వారే చెప్పగలరు" అన్నా డా యువకుడు.

"మరి గుర్రానికి ముందుగా మేతవేసేరుగా!"

ఆ ఉద్యోగస్తుడు మరో చిరునవ్వు నవ్వి, తల టకాయించి "రండి నాతో" అన్నాడు.

"నేను మీ సైన్యానికి సంబంధించినవాడిని కాను."

"మీరు సైన్యం మకాంలోనే వున్నారు."

ఈవిధంగా సంభాషణ కొంతసేపు జరిగింది. వానలో నిలబడి యిల్లా వాదనలో దిగడంవల్ల సాధింపబడే ప్రయోజనం శూన్యమని గ్రహించాడు బేటియాటస్. లాభం లేదన్నట్లు చేతులుతిప్పేడు. తడి కండువా చుట్టూ కప్పుకున్నాడు. తా నసహ్యించు కుంటూ, ఎందుకూ పనికిరాని వాడనుకున్న కులీనుడైన ఆ యువకోద్యోగిని అనుస రించాడు. హుం, వెధవ! తను ఒక్కపూట చూసినపాటి రక్తాన్ని, రక్తప్రవాహాన్ని పెదవులపై తల్లిపాలతడి ఆరని యీ పెంపుడుకుక్క తన జీవితమంతటిలోనూ చూడ గలడా? అత నేమనుకున్నాకాని, బేటియాటస్ మాత్రం వధ్యశాలలోని కసాయివాడి మాదిరిగా తయారయాడు. అతనికి ఒకే ఒక్క ఊరట వుంది. ఈ సైన్యాల నిక్క డకు రప్పించిన శక్తితో తనకు సంబంధం లేకపోలేదు.

శిబిరం ముఖద్వారం వద్ద యిరువైపులా కావలా సైనికులు నిలబడి పహరా కాస్తున్నారు. వీళ్ళచేతిలో పెద్దపెద్ద ఖడ్గాలులేవు. ఈటెలూ, వర్తులాకారమైన డాళ్లనూ థ్రేషియన్లుపయోగించే వంపు తిరిగిన కత్తులమాదిరిగా వున్న కత్తులనూ వాళ్ళు పట్టు కున్నారు. తెల్లని ఉన్ని వస్త్రాలు ధరించి, వర్షం శిరస్త్రాణాలపైబడి ముఖంమీద నుంచి జారి బట్టలను తడుపుతున్నా, నిర్జీవ పదార్థాలపై వర్షంపడితే యే విధంగా అవి చలించవో, అదే విధంగా శిలాప్రతిమలలా కదలక మెదలక నిలబడ్డారు సైనికులు. ఎందుకోకాని యీ దృశ్యంమాత్రం బేటియాటస్ హృదయాన్ని హత్తుకుపోయింది.

వాళ్ళు శిబిరాన్ని సమీపించేసరికి కావలావాళ్ళు సలాం కొట్టేరు. డేరా తెర తొలగించేరు. దీపకాంతిలో బేటియాటస్, ఆ ఉద్యోగి లోన ప్రవేశించారు. శిబిరం ముందుభాగం నలభై అడుగులపొడవూ, యిరవై అడుగులవెడల్పూ వుంటుంది. దానిలో సామాను బహుకొద్ది. పొడుగాటి ఒక టేబిలూ, దానిచుట్టూ ఒకడజను మడత కుర్చీలూ వున్నాయి. మోచేతులు టేబిలుమీద ఆన్చి, దానికి ఒక చివర పరచివున్న

చిత్రపటాన్ని చూస్తున్నా డొక సైనికోద్యోగి. అతనే మహాసేనాని మార్కుస్‌లిసిని యస్ క్రాసస్.

వీళ్ళు వెళ్ళగానే సేనాని లేచి నిలబడ్డాడు. వెళ్ళి అభివాదపురస్సరంగా కర చాలనం చేసేడు. ఇదికూడా బేటియాటస్‌కు బాగా నచ్చింది.

"కేపువా వాస్తవ్యుడు లెంటులుస్ బేటియాటస్ అనుకుంటాను" అన్నాడు సేనాని కరచాలనంచేస్తూ.

బేటియాటస్ ఔనన్నట్లు తలవూపి తన చేతినిసాచి, కరచాలనాన్ని స్వీకరిం చాడు. ఈ సేనానిమాత్రం నిజంగా సుందరవిగ్రహుడు. అందానికి అందమూ వుంది, మగతనానికి మగతనమూ వుంది. చూడగానే వీడురా నిజమైన మొనగాడు అనిపించేలా వున్నాడు.

"మిమ్మల్ని కలుసుకోగల్గినందుకు చాలా సంతోషిస్తున్నా" అన్నాడు బేటి యాటస్.

"మీరు చాలాదూరంనుంచి వ్యయప్రయాసలకోర్చి ప్రయాణంచేసి వచ్చారు. పోన్లెండి. చాలా మంచిపని చేసేరు. మీరు చాలా అలసిపోయారనీ, ఆకలితో వున్నా రనీ నాకు తెలుసు."

క్రాసస్ చెప్పినమాటలలో యేదో కాస్త సంశయం కన్పించింది. ఐనా అత నీ విషయం తనకు సంబంధించినదే అన్నట్లు మాట్లాడేడు. అందుకే బేటియాటస్ సంతృప్తిచెందేడు. అతన్ని సేనానివద్దకు తీసుకొచ్చిన ఉద్యోగిమాత్రం యింకా అదే అహంభావంతో చూస్తున్నా డీ స్థూలకాయుడిని. సేనానికి తనముం దో కార్యక్రమం వుంది. ఉద్యోగి కేముంది? అత నీ బేటియాటస్‌లాటి వాళ్ళముందు పెద్దమనిషి తర హాగా ప్రవర్తించాలి అంతే.

"నా పరిస్థితి సరిగ్గా అల్లానే వుంది. బాగా తడిసేను. విపరీతంగా అలసి పోయాను. పైపెచ్చు చచ్చేటంత ఆకలి ఒకటి. అందుకే నే నీ యువకుడ్ని యేమైనా తినడానికి వీలుంటుందా అని అడిగేను. ఆయనకు నా కోరిక నిష్కారణమైందిగా కన బడింది" అన్నాడు బేటియాటస్.

"సైన్యంలో యే ఆజ్ఞనయినా సరే, యెవరైనాసరే, యే పరిస్థితిలోనయినా సరే తు, చ తప్పకుండా పాటించాలి. మీరు రాగానే నావద్దకు తీసుకురావల్సిందిగా నే నాజ్ఞాపించాను. ఇప్పుడు మీ ప్రతికోరికా నేను తీరుస్తాలెండి. ప్రయాసతోకూడిన ప్రయాణంలోని కష్టం నే నెరుగుదును. వెంటనే పొడిబట్టలు తెప్పిస్తా; స్నానం చేయా లని వుందా?"

"స్నానాన్ని ఆపొచ్చు. ఈ కడుపులో యేదో ఒకటి పారేద్దామని." మంద హాసంతో ఆ వుద్యోగి శిబిరం వదలి వెళ్ళేడు.

## 2

ఉడికించిన కోడిగ్రుడ్లూ, చేపలూ వాళ్ళు తిన్నారు. బేటియాటస్ కోడిమాంసం ఆరగిస్తున్నాడు. ప్రతి ముమ్మా నిశ్శేషంగా ఊడుస్తూ, పాయసం వున్న కర్ర గిన్నెలో మాటిమాటికీ ముంచుతూ, పదార్థాలను ద్రాక్షసారాతో తడపుతూ సుష్ఠుగా పట్టిస్తున్నాడు. ద్రాక్షసారా, కోడిమాంసం, పాయసం యివన్నీ అతని నోటికి అంటు కున్నాయి. క్రాసస్ యిచ్చిన తెల్లని రుమ్మాలుమీదకూడా పడ్డాయి. చేతులు ఎంగి లయ్యాయి.

క్రాసస్ యితడ్ని పరిశీలిస్తున్నాడు. ఎంతోమంది ఆ కాలపు రోమన్ ఉన్నత వర్గ ప్రజలమాదిరిగనే యితనుకూడా యీ వర్తకజాతిని ప్రత్యేకించి కావాలని అస హ్యించుకునేవాడు. అందులోనూ యీ మల్లులనూ, సాముగరడీలవాళ్ళనూ తయారు చేసి, అమ్మి, ధనార్జనచేసే యితనంటే అసహ్యం మరింత. అమితమైన డబ్బువుండి, లావుగా తనముందు కూచున్న యితనివంటి వర్తకజాతి యిటీవలి యీ యిరవైయేళ్ళ లోనేగా ఒక ఆర్థిక, రాజకీయ శక్తిగా పరిణమిస్త. ఏదీ ఒకతరంకూడా కాలేదు. ఈ మల్లయుద్ధాలు అక్కడక్కడ, అప్పుడప్పుడు ప్రదర్శింపబడుతూ వుండేవి. అప్పు డింత ప్రాముఖ్యంలేదు వీటికి; కాని హఠాత్తుగా యిదో పిచ్చికింద, వేలంవెర్రికింద పరిణమించింది. ఎంత చిన్నపట్నంలోనైనా సరే అధమం ఒక కర్రతో కట్టిన మల్ల యుద్ధ రంగస్థలమైనా లేని ఊరంటూలేదు. దేవాలయం లేని ఊరుంటుందా అన్నట్లే రంగస్థలం లేని ఊరుకూడా వుందీ అనే ఆశ్చర్యం ప్రజల్లో కల్గుతోందంటే చాలు, యివి యెంతగా వ్యాపించాయో తెలియడానికి. ఈ మల్లయుద్ధాలంటే ప్రజల కెంత ఆసక్తి వుందో చూడాలంటే మారుమూల పల్లెటూళ్ళని చూచినా తెలుస్తుంది. ఒక జెట్టీల జంటతో ప్రారంభమైన ఈ ప్రదర్శన పోరాటాలు వందల, వేలజంటల పోరాట ప్రదర్శనలవరకూ పెరిగి ఒకేజంట నెలలతరబడి అదేపనిగా ప్రదర్శన యిచ్చేటంత స్థాయికి పెరిగింది. వీటికి అంతు అనేది కనిపించదు. పోనీ, వీటివల్ల యీనాటికి ప్రజలకు సంతృప్తి కలిగింది అని చెప్పడానికి వీలులేదు. రానురాను వీటియందు ప్రజలకు మోజు హెచ్చిందేగానీ, తగ్గుదల సూచనలే కానరాలేదు.

సంస్కృతియొక్క అపరావతారాలా అనిపించే పెద్దయింటి యిల్లాండ్రు మొదలుకొని బజారు రౌడీలదాకా ఒకే వేలంవెర్రి. ఒకే పిచ్చి యివంటే. ఈ

ప్రదర్శనలూ, యీ మల్లయుద్ధాలూ కొత్తపదజాలాన్ని సృష్టించాయి. ఆ పదజాలం వచ్చి భాషార్ణవంలోచేరి యధాశక్తి సాహిత్యసేవ చేసింది. పదివేలమంది నిరాశ్రయులైన, నిరుద్యోగులయిన పౌరులు ప్రత్యేకం వీటిని చూస్తూ ఉండడానికే జీవిస్తున్నారు అనిపిస్తుంది. ఒకప్పుడు సైన్యంలో పనిచేసిన వాళ్ళు ప్రస్తుతం ప్రజలు పెట్టిన భిక్షాన్ని తింటూ యీ మల్లయుద్ధ రంగస్థలాలను పట్టుకువేళ్ళేవారు. శాశ్వతమైన రోమ్ శరీరం అంతా కళ్ళు పెట్టుకుని యీ ప్రదర్శనలు చేస్తూవుండేదా అన్నట్లు తోచేది. మల్లుల నమ్మడంవల్ల మంచి ధర వచ్చేది. ఇదిచూసి ఎన్నో మల్లశిక్షణ కేంద్రాలు తెరువబడ్డాయి. అల్లా వచ్చినదే కేపువాలోని లెంటులుస్ బేటియాటస్ యొక్క శిక్షణకేంద్రం. దేశంలో వాటన్నిటికన్న యిది పెద్దది; లాభసాటియైనది. కొందరమ్మే ఆవులన్నా, గేదలన్నా ప్రజలెంత నమ్మకంతో కొంటారో అల్లాగే మల్లయుద్ధ రంగస్థలాల యజమానులు కేపువాలోని బేటియాటస్ శిక్షణకేంద్రంలో తర్ఫీదు పొందిన మల్లులనే ప్రశస్తమయిన సరుకుగా భావించి కొనుక్కొనేవారు. అక్కడి మల్లులనే కొనడానికి యిష్టపడేవారు. వీధుల్లో తిరుగుతూ, యెందుకూ కొరగాని వాడనిపించుకున్న బేటియాటస్ యీ వేలంవెర్రి రాగానే, ఒక్కదెబ్బని ధనవంతుడు కావడమే కాకుండా, ఇటలీలోని మల్లశిక్షకులలో ప్రసిద్ధికెక్కినవాడై యశోధనాన్ని కూడా సంపాదించాడు.

"ఏమైనా వీడొక కృత్రిముడు, నీచుడు, తంత్రగొట్టు, అసభ్యమైనవాడు" అనుకున్నాడు క్రాసస్ యితనికేసి పరీక్షగా చూచి. "ఎల్లా తింటున్నాడో!" నిర్ధనులుగా, నిరర్థకులుగా పుట్టిన యెంతోమంది చూస్తుంటే ధనవంతులైపోతారు. వీళ్ళంతా అంత ధనాన్ని యెల్లా ఆర్జించగలరు అన్న విషయం అతనికిగాని, కులీనులైన ఆతని మిత్రులకుగాని యెన్నటికీ అర్థంకాదు. తెలివితేటల్లో తనూ, తన స్నేహితులూ బేటియాటస్‌కన్న ఏమాత్రమూ తీసిపోరు. అతని విషయమే చూద్దాం. ఒక సైనికుడుగా తన విలువ నెరిగినవాడు. రోమను సంపద అయిన పరిపూర్ణతా, బ్రహ్మాండమైన పట్టుదలా అతనిలో మంచిపాళ్ళల్లోనే వున్నాయి. పోనీ, అతనేమైనా యీ సైనిక వ్యూహరచనా నైపుణ్యమన్నది మానవుడికి సహజంగా లభించే అంతర్గతమైన బుద్ధివిశేషమని భావించి, ఆ నైపుణ్యం తనలో వుంది కదా అని గర్వించేవాడా అంటే అదీలేదు. గ్రీక్ చరిత్రకారుల గ్రంథాలన్నీ క్షుణ్ణంగా చదివి జీర్ణించుకున్నవాడు; విపులంగా, వివరంగా ప్రతిచిన్న విషయానికీ యెంతో ప్రాధాన్యం యిచ్చి, యెంతో జాగ్రత్తగా ఆలోచించి తనకు విశ్వాసం, సంతృప్తి కల్గేదాకా యేదాడినీ ప్రారంభించడు. పోనీ యీ యుద్ధంలో యింతకుముందు పాల్గొని అపజయంతో అపఖ్యాతి

పాలయిన తన పూర్వపు సైనికాధిపతులవలె స్పార్టకస్ అంటే నిర్లక్ష్యంచేసేవాడా అంటే అదీకాదు. అతని శక్తిని తక్కువ అంచనా వెయ్యనేలేదు. ఇదిగో యీ అతికాయుడిముందు మాత్రం తనో తక్కువ్వాడినేమోనని బాధపడసాగేడెందుకో.

"స్పార్టకస్‌కూ, మీకూ ఉన్న సంబంధం గురించి కాని, యీ యుద్ధం గురించి కాని ముందుగానే కొన్ని అభిప్రాయాలకు వచ్చినవాన్ని కాను, నే నేమీ నీతిశాస్త్ర కోవిదున్ని కాను; ఇతరులు చెప్పలేని ముఖ్యవిషయాలు మీరు చెప్పగలరనే ఉద్దేశంతోనే మిమ్మల్నిక్కడకు ఆహ్వానించాను" అన్నాడు క్రాసస్.

"ముఖ్య విషయాలంటే?" బేటియాటస్ ప్రశ్నించాడు.

"నా శత్రువుయొక్క స్వభావం."

మరింత ద్రాక్షసారా గ్లాసులో పోసుకుంటూ, కళ్ళు చిన్నవి చేసి క్రాసస్ వైపు ఓరచూపు చూసేడు బేటియాటస్. చీకటి పడుతోంది. టేబిలుమీద రెండుదీపాలు పెట్టి వెళ్ళేడో సైనికుడు.

దీపకాంతిలో బేటియాటస్ పరోలా కనుపించసాగేడు; సంధ్యచీకట్లు అతని కింతవరకూ తన నిజస్వరూపాన్ని బైటపడకుండా తోడ్పడ్డాయి.

తువ్వాలుతో తుడుచుకుంటున్న అతని ముఖంమీద కాంతిపుంజాలు యిటూ అటూ కదుల్తున్నాయి; అతని శరీరం వంపులు తిరిగినచోట్ల కండలను పట్టుకుని చీకట్లు వేలాడుతూనే వున్నాయి. అతనిది పెద్ద బొంగరముక్కు; ఆ ముక్కు ఒకమారిటూ ఒకమా రటూ, అటూ యిటూ, ఆగకుండా కదులుతూనే ఉంటుంది. అతని కళ్ళల్లోంచి అనుమానాస్పదమైన ఒక కాంతి, ఒక చూపు తొంగిచూస్తూ ఉంటుంది. దాన్నిబట్టే క్రాసస్ అనుకున్నాడు, ఏహో అల్లాటప్పా మనిషికింద యితన్ని జమకట్టడం శుద్ధ తెలివితక్కువ అని. ఏ మూర్ఖుడూ అల్లా చెయ్యలేదు కూడా.

"మీ శత్రువు గురించి నాకేం తెలుసునంటారు?"

బైటనుంచి బాకా చప్పుడు వినిపించింది. సాయంత్రం కవాతు ముగిసినట్లుంది. బూట్లు తొడిగిన సైనికుల లయబద్ధమైన పదధ్వని స్పష్టంగా వినిపిస్తోంది. భూమి కంపిస్తోందా అనిపిస్తోంది.

"నాకున్న శత్రువల్లా ఒక్కడే. అతనే స్పార్టకస్" జాగ్రత్తగా చెప్పేడు, క్రాసస్ ప్రతిమాటనూ తూచి.

రుమ్మాలు ముక్కు కడ్డంపెట్టి చీదేడు అతికాయుడు.

"మీరు స్పార్టకస్ నెఱుగుదురా?"

"భగవత్సాక్షిగా నే నెరుగుదును."

"ఇంకెవరికీ తెలియదు మీకు తప్ప. స్పార్టకస్‌తో యింతకు పూర్వం యుద్ధం చేసినవా ళ్ళెవరూ అతన్నెఱుగరు. బానిసలతో యుద్ధమనుకుని బయలుదేరేరు. బాకా ఊది, బాజా బజాయించి, కత్తి ఝళిపిస్తే యీ బానిస వెధవలు పారిపోతారని వాళ్ళు భ్రమించారు. ఎన్నిమార్లు చావుదెబ్బలు తిన్నా, వీళ్ళ సైన్యాలను బానిస లెన్నిమార్లు చీల్చి చెండాడి తరిమికొట్టినా, బానిస లేమిటి, యుద్ధమేమిటనేగాని, సరిగ్గా ఆలోచించ లేకపోయారు. అనుకున్నట్లు జరుగలేదు; చివర కీ రోజున రోమ్ అటో యిటో తేల్చి పారెయ్యదలుచుకుంది. అటయితే రోమ్ ఉండబోదు; సర్వనాశనం. మీకే యీ విషయం నాకన్న బాగా తెలుసుననుకుంటాను."

పట్టుతప్పిన పెద్ద ప్రభలా పొట్ట చేతబట్టి, అదే పనిగా నవ్వడం ప్రారంభించాడు విపరీతంగా.

"ఇది మీకు హాస్యంగా తోచిందా?" ఆశ్చర్యపోయిన సేనాని అడిగేడు.

"నిజం యెప్పుడూ హాస్యంగానే ఉంటుంది."

అవమానం వల్ల కల్గిన కోపాన్ని పైకి రానీయకుండా, ఆ నవ్వు వెలిసేదాకా ఆగేడు క్రాసస్.

"రోమ్ ఉండనే ఉండదు—స్పార్టకస్ ఒక్కడే ఉంటాడు," కడుపు చెక్కలయ్యే నవ్వు అణిగింది. ముసిముసి నవ్వుల్లోకి దిగింది. అతని కేసి చూస్తున్న క్రాసస్‌కి యితను తాగి మాట్లాడుతున్నాడా; కాక స్వతహాగా ఆ స్వభావమే అంతా అన్న విషయం అర్థంకాలేదు. ఆశ్చర్యపోయాడు. ఎటువంటెటువంటి వాటిని భూదేవి సృష్టిస్తోంది. ఇతను? ఇతనేగా; మామూలు మనుష్యులకు శిక్షణ యిచ్చి మల్లులుగా తయారుచేసి, పోరాట ప్రదర్శన లేర్పాటుచేసేది. తనుకూడా మనుష్యులను యుద్ధ సామగ్రిగా, పోరాట పరికరాలుగా తయారుచేసినవాడే.

మరో గ్లాసుడు ద్రాక్షసారా పోసుకున్నాడు బేటియాటస్, దయాభిక్ష వేడుకునే వాడిలా మాట్లాడ్డం ప్రారంభించాడు: "మీరు నన్నరితియ్యాలేకాని, వూరికే మేప కూడదు."

"నే నొక కల కన్నాను" తిరిగి పూర్వపు విషయంపైపే సంభాషణను మరల్చుదామనే ఉద్దేశ్యంతో క్రాసస్ అన్నాడు; "అదో పెద్ద పాడు కల. ఈ కలనే యింతకు పూర్వం చాలామార్లు చూసిన జ్ఞాపకం ఉంటుంది."

అర్థం చేసుకున్నవాడిలా తలాడించేడు బేటియాటస్.

"ఇదుగో యీ కలలోనే నేను కళ్ళకు గంతలుకట్టుకుని యుద్ధం చేస్తాను; అది చాలా అసందర్భంగానే కనిపించవచ్చు కాని తర్కానికి విరుద్ధం కాదుగా. ఏదైనా కల

వస్తే యీ కల ఫలితమేమిటా అని పంచాంగం చూసే రకంకాదు నేను. అదో శకున మని భావించే ఛాందసుడనూ కాను. కొన్ని కలలు నిద్రపోయేదాకా మనం ఎదుర్కొనే సమస్యల ప్రతిబింబాలుగా మాత్రమే ఉంటాయి. స్పార్టకస్ మాత్రం అపరిచితుడు. అతని గురించి నా కేమీ తెలియదు. అదుగో అతనితో చేసే యుద్ధమే కళ్ళకు గంతలు కట్టుకుని చేసే యుద్ధం. తక్కిన యే పరిస్థితులలోనూ—యెంత విషమ పరిస్థితులయినా సరే—అల్లాగుండేది కాదు. గాల్ ప్రజలు వాళ్ళెందుకు యుద్ధం చేస్తారో నాకు తెలుసు. అట్లాగే గ్రీకులు, జర్మన్లు, స్పానియర్డులు. వీళ్ళ యుద్ధోన్మాదం నే నెరుగుదును. వాళ్ళ యుద్ధోన్మాదానికి కారణాలు కొద్దిపాటి సహజ మైన తేడాలున్నా—మనకు తెలియనివేం కావు. కొత్తవి కావు. కాని వీళ్ళున్నారే ఈ బానిసలు, వీళ్ళకు యుద్ధమేమిటి? నా కర్థంకానిదల్లా యీ బానిస ప్రకటించిన యుద్ధమే. ఎందుకు వీడి కీ యుద్ధం? ప్రపంచంలోని చెత్తనంతటినీ, అల్లరిమూక నంతటినీ, అలగా జనాన్నందరినీ కూడగట్టుకుని మరే యితర దేశమూ సృష్టించ లేని, గర్వింపదగ్గ అద్భుతమైన రోమన్ సైన్యాన్ని వీ డెందుకు నాశనం చెయ్య తలపెట్టేడు. ఐదేళ్ళు అహర్నిశలు అవస్థపడితే ఒక సైనికదళ నిర్మాణం జరుగు తుంది. ఐదేళ్ళు పడుతుందంటే నమ్మండి. 'నాకీ దళంతప్ప వేరు ప్రపంచం లేదు. దళమే నేను: నేనే యీ దళం. దళమే నా జీవిత సర్వస్వం: ఏ ఆజ్ఞనయినా సరే జవదాటక తు, చ తప్పక శిరసావహించాలి' అని ఒక సైనికు డనుకునే స్థితి తీసుకురావాలంటే ప్రతి రోజూ, రోజుకు పదిగంటలబాటు కఠోరశిక్షణ యివ్వాలి. అల్లా అయిదేళ్ళపాటు యిచ్చేక, అగాధపు అంచులుదాటి కవాతు చేసుకుపో అనేసరికి మరో ఆలోచనలేకుండా కవాతు చేసుకుపోతారు. అఘాతంలోకైనా సరే. అటువంటి బ్రహ్మాండమైన రోమను సైన్యాలను బానిసలు నాశనం చేశారు. ఏమిటా యిదని తెలుసుకుందుకే యీ స్పార్టకస్ గురించి అంతా తెలుసుకుందామనే మిమ్మల్ని కేపువానుంచి యిక్కడకు రావలసిందిగా పిలిపిస్త. అప్పుడుగాని నా కళ్ళ కున్న గంతలు తొలగిపోవు."

ఆలోచనాపూర్వకంగా తల పంకించేడు బేటియాటస్. కొద్దిగా మెత్త బడ్డాడు. పడడా మరి! గొప్ప సైన్యాధిపతులకు తనో నమ్మకస్తుడైన సలహాదారు డయ్యాడు.

"మొదట అతన్ని గురించి చెప్పండి: ఎల్లాగుంటాడతను, మీ కెక్కడ తటస్థ పడ్డాడు?" క్రాసస్ అడిగాడు.

"ఎల్లాగుంటారో అల్లాకనబడరు మనుష్యులు."

"నిజం. అత్యద్భుతమైన సత్యం. — అదే మీరు గ్రహించిన రోజున మనుష్యులను మీ రర్థం చేసుకోగలరన్నది నిర్వివాదాంశం." ఈ పొగడ్తకు ఉబ్బి తబ్బిబ్బయాడు బేటియాటస్.

"అతను పెద్దమనిషి తరహాగా, చాలా పెద్దమనిషితరహాగా, విధేయుడుగా కనబడే థ్రేషియన్. ఇంతమటు కతన్నిగురించి చెప్పేది నిజం." బేటియాటస్ ద్రాక్షసారాలో వేలుముంచి వేలుకొనలతో టేబిలుమీద వ్రాయిస్తున్నాడు. "అత నో బ్రహ్మ రాక్షసిలాగుంటాడని కొందరంటారు. కాదుకాదు! కానేకాదు! అతనేం రాక్షసుడూ గాడు; ఏమంత పొడుగయిన మనిషీ కాడు. నల్లగా ఉంగరాలు తిరిగిన జుట్టూ, గోధుమ రంగు కళ్ళూ; అతని ముక్కు ఎప్పుడో పగిలింది. అది ఒక్కటి మినహాయిస్తే అత నో అందమైన వ్యక్తే అని చెప్పవచ్చు; ఆ పగిలిన ముక్కే అతనికి గొఱ్ఱెలా కనుపించే ముఖవైఖరి తెచ్చిపెట్టింది. విశాలమైన ముఖం, మృదువైన స్వభావం యివన్నీ చూసేవాళ్ళను మోసగిస్తాయి. అతని నిజవైఖరిని మోసగిస్తాయి. అతను చేసినట్లు చేస్తే మరెవరినయినా నే నీపాటికి చంపేసి ఉందును."

"అత నేంచేసేడని?" క్రాసస్ ప్రశ్న.

"ఆఁ"—

"ఏమీ దాచకుండా అతన్నిగురించి చెప్పాలనే నా కోరిక. లేకపోతే యితన్ని గురించి ఉన్నదున్నట్లు తెలుసుకోగలుగుతానా నేను? నాతో చెప్పిన విషయాలు యితరుల కేమీ తెలియకుండా రహస్యంగా ఉంచుతానని హామీ యిస్తున్నాను" క్రాసస్ నెమ్మదిగా మాట్లాడుతున్నాడు. బేటియాటస్ చెప్పిన విషయం ప్రస్తుతాని కటుంచి మరో ప్రస్తావన తెచ్చేడు. "అతని పూర్వచరిత్ర కావాలి. అతన్ని మీరు ఎక్కడ కొన్నారో అతనప్పటి కేంచేసేవాడో అన్నీ చెప్పాలి."

"మల్లుడంటే ఎవరు?" నవ్వుతూ చేతులతోకూడా ప్రశ్నించాడు బేటియాటస్. "వాడు బానిసమాత్రం కాడు, తెలిసిందా. కేపువాలోని మల్లులు మటుకు బానిసలు కారు. వాళ్ళ కో ప్రత్యేకత ఉంది. కుక్కలచేత దెబ్బలాడించాలనుకోండి, అందుకు మీరు అమ్మాయిలు ఆడుకుందుకు పెంచుకునే కుక్కపిల్లల్ని కొనుక్కుంటారా? అల్లాగే మనుషులచేత దెబ్బలాడించాలంటే పిసలైన మనుష్యులె కావాలి. వాళ్ళు కోపంతో పళ్ళు పటపట లాడించగలగాలి. ఎదుటివాడిని అసహ్యించుకోగలగాలి. క్రోధ పూరితులు కావాలి. అందుకు నా యేజంట్లకు నే నేం చెప్తాను. అబ్బాయిలూ! పూరా కోపంకలవాళ్ళను యేరుకురండిరా అని వాళ్ళకోసమే బజారులోకి కొనడానికి వచ్చాను

అని చెప్తాను. అటువంటి బానిసలు యిళ్ళల్లో చాకిరీ చెయ్యడానికీ పనికిరారు; అమ్మేద్దామన్నా పనికిరారు!"

"అమ్మెయ్యడానికి యెందుకు పనికిరారు?"

"మనసు విరిగిన మనిషి మనకెందుకూ! నా కక్కర్లేదు. దానికి విరుగుడు కనిపెట్టకపోతే, ఆ మనిషిని అంతం చెయ్యవలసిందే కాని, అతనిచేత పని చేయించలేం. కూసేగాడిద మేసేగాడిదను చెరుస్తుంది. వాడు చెయ్యడు; మరొకడ్ని పనిచెయ్యనివ్వడు. అటువంటివాడు అంటురోగంలాంటివాడు."

"అయితే యెందుకూ పనికిరాడంటారుకదా. అటువంటి వాడు యెందుకు దెబ్బలాడుతాడు?"

"అదీ! అల్లా అడగండి. ఆ ప్రశ్నకు సమాధానం చెప్పలేకపోతే మల్లునిచేత పనిచేయించుకోడం కష్టం. పూర్వం ప్రదర్శనలలో పోరాడేవారిని మరోలా పిలిచేవారు. పోరాడడంఅంటే వుండే ప్రీతికొద్దీ వాళ్ళు పోరాడేవారు. తలకాయ పాడుచేసుకున్నవాళ్ళూ వుండేవారు. వాళ్ళు బహుకొద్దిమంది పైగా బానిసలుకారు." తన తలను సార్థకంగా చూపిస్తూ, "ఇక్కడ కొంచెం వుంటేనేకాని ఎవడూ రక్తాలు కారేవరకూ దెబ్బలాడడు-ఎవడికీ యిష్టం వుండదు, మల్లుడు దెబ్బలాడడానికి అసలు యిష్టపడనే యిష్టపడడు. అయితే యెందుకు దెబ్బలాడుతాడంటారు మీరు. కట్లువిప్పి ఆయుధం చేతిలోపెట్టి క్షణికమయిన స్వాతంత్ర్యం వాడి కిస్తాంకనుకనే వాడు దెబ్బలాడుతాడు. ఆ ఆయుధం వాడిచేతిలో వున్నంతసేపూ, చేతికి సంకెళ్ళు లేనంతకాలం నేనొక స్వేచ్ఛాజీవినని భ్రమిస్తాడు. వాడి కంతకన్న కావలసిందేముంది? చేతిలో ఆయుధం, స్వేచ్ఛనుగురించి కలగనడం. అప్పుడే మన బుద్ధివిశేషానికి వాడి బుద్ధి ఒక సవాలు విసురుతుంది. ఎందుచేత? వా డో దెయ్యం కనుకనే, మనమో పిశాచం కావాలి."

"అల్లాటివాళ్ళు మీ కెక్కడ దొరుకుతారు?" సేనాని ప్రశ్నించాడు. బేటియాటస్‌కి తన గొడవ తనకు బాగాతెలుసు. సంగతులన్నీ చాలా సూటిగా, జాగ్రత్తగా చెప్పేడు. దానితో సేనాని అతని వలలో పడ్డాడు.

"నాకు కావలసిన మనుష్యు లున్నారే-వాళ్ళుండే ప్రదేశమొకటుంది. ఒక్కటే వుంది. గనులు, గనుల్లోనే. మీ సైన్యం, కఠోర క్రమశిక్షణ, భీకర సంగ్రామం యివన్నీ భూతలస్వర్గంగా, ఉరిస్తంభం పెళ్ళిపీటగా, కరుణారస ప్రపూరితంగా కనుపించేవా ళ్ళెవరయినావుంటే వాళ్ళు కావాలి మనకు; మా యేజంట్లకు గనులలోనే కనుపించా రటువంటివాళ్ళు. అక్కడే అగుపించాడు స్పార్టకస్; అత నొక 'కోరూ'. 'కోరూ' అంటే ఏమిటో తెలుసా? అదొక యీజిప్షియన్ మాట అనుకుంటా."

తల పంకించాడు క్రాసస్.

"అంటే మూడుతరాల బానిసలన్నమాట; బానిసయొక్క మనుమడు, ఈజిప్ట్ భాషలో ఆ మాటకు యేహ్యమైన జంతువు అనే అర్థంకూడా వుంది. ఒక పాకే మృగం. జంతువులే తాకడానికి అసహ్యించుకునే జంతువు. 'కోరూ' మనం అడగొచ్చు ఇది ఈజిప్ట్‌లోనే యెందుకు తలెత్తిందీ అని. అదీ చెప్తాను. వ్యాపారస్తుడు కావడంకన్న కనిష్టమయిన పనులున్నాయి. నేను మీ మకాంలోకి వచ్చినప్పుడు మీ ఉద్యోగులు నన్నుచూసి నవ్వేరు. ఎందుకు? ఏం? మనమంతా కసాయివాళ్ళమేగా? కాదామరి. కోసిన మాంసంముద్దలమ్మే కసాయివాళ్ళం కాదా? మరెందు కా నవ్వడం?"

అతను తప్ప త్రాగి ఉన్నాడు. కేపువాలో శిక్షణకేంద్రం నడిపే బేటియాటస్ తనంటే తానే బాధపడి జాలిపడుతున్నాడు. అతనికీ ఒక ఆత్మ ఉంది; బాది, చంపి కైమా చేసేందుకై కర్రకు తల్లక్రిందులుగా వేలాడగట్టి తీసుకుపోయే పందికీ ఉంది ఒక ఆత్మ.

"అయితే స్పార్టకస్ ఒక 'కోరూ' అన్నమాట. అతను ఈజిప్ట్‌వాడా?"

"థ్రేషియన్. కాని ఈజిప్ట్‌నుండి తీసుకొచ్చాం. ఈజిప్ట్ బంగారు వర్తకులు ఏథెన్సునుండి కొంటారు. వాళ్ళకే విలువ యిస్తారు. ఆ 'కోరూ'నే కొంటారు."

"ఎందుకు?"

"వాళ్ళనుగురించి ఒక గాథ వుంది; కొన్ని నమ్మకాలున్నాయి. వాళ్ళే భూమి అడుగున బాగా పనిచేయగలరట."

"ఓహో! అదా! అయితే స్పార్టకస్‌ను గ్రీస్‌లో ఎందుకు కొనాల్సి వచ్చింది?"

"నా కతన్ని యెక్కడ కొన్నారో మాత్రమే తెలుసు. అదైనా నేను కొన్నాను కాబట్టి, థెబిస్‌లో. నన్ననుమానిస్తారా? నేను అబద్ధాలు చెప్పేవాడిననా? ఒంటరిగా గాల్‌లో, ఈ వెధవ వానలో కూచున్న వర్తకుడ్ని, స్థూలాకాయుడైన వర్తకుడ్ని, ఐనా ఒంటరిగా నేనెందుకు జీవిస్తున్నట్లు? నన్ను చిన్నచూపు చూడ్డానికి మీకున్న హక్కేమిటంటా? మీకు తోచినట్టు మీరు, నాకు తోచినట్టు నేను బతుకుతున్నాం."

"మీరు నాకు గౌరవనీయులైన అతిథులు; మిమ్మల్ని నేను తక్కువగా చూడను."

బేటియాటస్ నవ్వి క్రాసస్‌వైపు వంగేడు. "నాకేం కావాలో మీకు తెలుసా? నా అవసరమేమిటో మీ రెరుగుదురా? మనిద్దరం లౌక్యులం. నా కో ఆడది కావాలి యీ రాత్రికి." ఏదో అర్థించే వాడిలా ప్రాధేయపూర్వకంగా బ్రతిమాలేడు. అతని బొంగురు గొంతు మృదువుగా మారింది. ఆ కంఠస్వరంలోనే యేదో వాంఛ ధ్వనించింది. "నాకు

ఆడది యెందుకు కావాలి? కామం అంటారేమో. అది కాదు. ఒంటరితనాన్ని బట్టి, గాయాలు మాన్పడానికి, ఒంటిమీద కనబడని గాయాలు హృదయాన్ని బాధిస్తాయి తెలుసా. వాటిని మాన్పాలంటే ఆడది కావాలి. మీ వద్ద స్త్రీ లున్నారు. మొగాళ్ళు స్త్రీల నుండి విడివడలేరు."

"నాకు స్పార్టకస్ గురించీ, ఈజిప్ట్ గురించీ చెప్పండి ముందు; ఆ తరువాత ఆడాళ్ళగురించే మాట్లాడుకుందాం" అన్నాడు క్రాసస్.

# 3

మతోపన్యాసాలలో, మతగ్రంథాలలో వినబడే, కనబడే క్రిష్టియన్ నరకం అనబడేదానికి పూర్వంకూడా మనుష్యులు చూచిన, బాగా గుర్తించిన, తెలుసుకున్న ఒక భూతలనరకమనేది ఉండేది. తను చూచినదే, చేసినదే వ్రాసే స్వభావంకలవాడు మానవుడు; తను వ్రాసేది ఒకప్పుడు తనచే సృష్టింపబడ్డదాన్ని గురించే.

జూలై మాసంలో భయంకరంగా మండే యెండల్లో, యెండే మంటల్లో థెబిస్ నుండి నైల్‌నది ఎగువకు వెళ్ళు. మొదటి జలపాతంవరకూ పో. అప్పుడే నువ్వు భూతాలభూమిలో, దెయ్యాలదేశంలో అడుగుపెట్టేవన్న మాట. నదిప్రక్కన ఉన్న ఆకుపచ్చని చారలు, ఎల్లా యెండిపోయాయో, మాడిపోయాయో చూడు. ఆ ఎడారిలోని కొండలూ, గుట్టలూ ఎల్లా తెల్లని, మరీ తెల్లని సన్నని యిసుకగా మారిందో చూడు. పొగ, పొడి. ఇక్కడ దాన్ని గాలి స్పృశిస్తుంది. అంతయెత్తున లేస్తుంది. కబంధ హస్తాల్ని ఎక్కడెక్కడికో చాస్తుంది; వేసవిలో నది నెమ్మదిగా, నీరసంగా ప్రవహిస్తుంది. ఆ నదిలో నీటిమీద తెల్లనిపొడి చల్లబడి ఉంటుంది. సర్వమూ అదే. అప్పుడే తాపం అధికమౌతోంది.

అయినా, అక్కడ గాలి అనేదైనా ఉంటుంది కొద్దో గొప్పో. అప్పుడు నువ్వది దాటి న్యూబియన్ యెడారి ప్రవేశించు. అది తూర్పు దక్షిణాలకు వ్యాపించి వుంటుంది. నీతో నైల్‌నదివద్ద పరిచయం చేసుకున్న గాలిని వదలి, అది నిన్ను తాకని చోటుకు, ఆ యెడారి మధ్యకు వెళ్ళు; బాగా లోపలకు; కానీ ప్రవేశం; ఎర్రసముద్రం నుంచి వచ్చే గాలి నీకు తగిలే పర్యంతం మాత్రం పోకు; అప్పుడు దక్షిణంగా మళ్ళు.

అంతే. హఠాత్తుగా వాయుప్రసారం స్తంభిస్తుంది. భూమి చచ్చిపడివుంటుంది. గాలి మాత్రం వుంటుంది: కాని కదలదు. ఎండ దానికి మెఱుగుపెడుతుంది. ఆ గాలి యెండతో మెఱుస్తూ వుంటుంది. మనిషి శరీరం అక్కడ పనిచెయ్యదు. అక్కడ ప్రతీదీ మామూలుగా కనబడదు. వంగి వక్రమై వుంటాయి ఏవైనా వుంటే. ఎడారి

కూడా మారిపోతూ వుంటుంది. కొందరనుకుంటారు; యెడారి యెక్కడైనా ఒకలాగే వుంటుందని. అది తప్పు. ఎడారి ఎందుకవుతుంది? నీరు లేదా ఈ నీటికరువు యెన్నో డిగ్రీలలో మారుతూ వుంటుంది. ఆ భూమినిబట్టి, చుట్టుప్రక్కల ప్రదేశాన్నిబట్టి, ఎడారి కూడా మారుతూ వుంటుంది. రాతి యెడారి ఉంది; కొండల యెడార్లున్నాయి; ఇసుక యెడారి, పెట్లుప్పు యెడార్లు, అగ్నిపర్వతపు లావా యెడార్లు ఉన్నాయి. భయంకరమైన వడగాడ్పులు వీచే యిసుక తుపానుల యెడారి అన్నిటికన్న మృత్యువును పంచిపెట్టడంలో ఈవిగలదాత. ఇక్కడ యేమీ మొలవదు. రాతి యెడారులలో ఉండే మెలికలు తిరిగి యెండిపోయినట్లగుపించే డొంకలు, పొదలూ కూడా యిక్కడ కనబడవు. ఇసుక యెడార్లలో అక్కడక్కడ కనిపించే కలుపుమొక్కలవంటివీ ఉండవు, ఏవీ వుండవు.

ఈ యెడారిలోకే వెళ్ళు. దీన్లోంచి శరీరభారా న్నీడ్చుకుంటూ పో; తాపం, వడగాల్పులు కెరటాలు, కెరటాలుగా నీ వెన్నును చరుస్తూ ఉంటాయి ప్రతి క్షణం. ఎంత వేడిగా ఉండాలో అంత వేడిగానూ ఉంటూ మనిషిని చావకుండా మాత్రం మిగులుస్తుంది. ఉద్వేగపయిన భీషణ ఉష్ణోదధిలో, యీ యెడారిలో తోవ తియ్యి; ఇక్కడ నీకగుపించే దేమిటి? కాలం, వైశాల్యం, సరిహద్దులూ లేక యిక దీనికి అంతు లేదా అని భయపెడుతుంది నిన్ను; నరకమంటే యేమిటి? ఎక్కడ దీ నరకం? జీవితంలో అత్యవసరమైన ప్రతి నిత్యకృత్యము, ప్రతి చిన్నపనీ, భయంకరంగా పరిణమించినచోట నరకం ప్రారంభమౌతుంది. మనిషి భూమిని నరకంగా మార్చడం చూసిన అన్ని తరాలవాళ్లూ యీ విషయాన్ని గ్రహించారు. గ్రహించి విజ్ఞానాన్ని పంచుకున్నారు. ఇప్పుడక్కడ నడవడం కష్టం. భయం వేస్తుంది. గాలి పీల్చడం కష్టం, చూడడం కష్టం, ఆలోచించడం కష్టం.

చివరిదాకా యిల్లాగే ఉండదు; ఇంతట్లో నీ కగుపిస్తుంది నరకచిత్రపు మరో వైపు; వింతైన, హడలగొట్టే నల్లని పర్వతశ్రేణులగుపిస్తాయి నీకు. ఇదే నల్లపర్వత శ్రేణి; ఆ నల్లరాతివైపు చూడు, తెల్లని మెటిసే చారలు, పాలరాతి నరాలవంటి చారలు కనిపిస్తాయి. అబ్బ! ఎంత ప్రకాశవంతంగా ఉందీ పాలరాయి! దివ్యతేజాన్ని వెదజల్లే ఈ చలువరాయి యెల్లా మెఱుస్తోందో! అవును; దానికి దివ్యతేజమే ఉంది. స్వర్గంలో మార్గాలన్నీ బంగారు వికారమైనవేగా! ఈ తెల్లని పాలరాయి బంగారంతో నిండివుంది. అందుకే యిక్కడకు మానవునిరాక, అందుకే నీ రాక, పాలరాయి బంగారంతో నిండినది కనుకనే మనరాక.

మరింత దగ్గరగా వెళ్ళిచూడు; ఈజిప్షియను వర్తకులు యెప్పుడో కనిపెట్టేరీ యెడారి మధ్యలోని నల్లపర్వతశ్రేణిని; ఆ రోజులలో వారికి రాగి, యిత్తడి పనిముట్లుండేవి. అందుకే ఉపరిభాగంలో మాత్రం చెక్కగలిగి, గోకగలిగి ఉండేవారు; అల్లా తరాలతరబడి గోకగా గోకగా బంగారం వచ్చింది. అల్లా రావడానికి నల్లరాతిని త్రవ్వి పాలరాతిని తీయవలసి వచ్చేది. రాతియుగం పోయి యినుపయుగం వచ్చింది. కాబట్టే ఇనుప గునపాలు, గూటాలు, సుత్తులూ, పద్దెనిమిది పౌన్ల సమ్మెటలూ, యెన్నో యినుపపనిముట్లూ రావడమే సులభసాధ్యం చేసింది పనిని.

కాని ఒక క్రొత్తరకపు మనిషి కావలసి వచ్చేడు. వేడినీ, ధూళినీ, శారీరక వికారాలనూ తట్టుకొని, రాతి లోలోతులలోకి మెలికలు తిరుగుతూపోయే బంగారపు నాళాలను త్రవ్వి తీయగలగడానికి యిథియోపియానుండి కాని, యీజిప్ట్‌నుండి కాని తీసుకురాబడే రైతు పనికిరాడు. మామూలు బానిస ఖరీదు హెచ్చు. పైగా యిక్కడ వేగంగా చస్తాడు. బానిసకు పుట్టి, బానిసలను కని, బానిసలయే పద్ధతికి తట్టుకోగలిగిన మొండి కోరూలను యుద్ధోన్మాదమహాపిశాచం ఆవహించడంవల్ల మతిపోగొట్టుకున్న సైనికులు మాత్రమే ఇక్కడ ఉపయోగపడతారు. సన్నని, లోతైన నల్లరాతి గోతులలో పనిచేయడానికి పిల్లలు కూడా కావాలి. అక్కడ పిల్లలే పని చేయగలరు; గోతులు చిన్నవిగా, లోతుగా ఉండటంవల్ల.

పూర్వపు ఈజిప్టు భూస్వాముల రోజులు పోయాయి. నవాబుల ధనాగారాలలో ధనం క్షీణించింది. అప్పుడా గనులపై బలిష్ఠమైన రోమనుహస్తం పడింది. బానిస వ్యాపారం సాగించే రోమన్లు తిరిగి గనిపని ప్రారంభించారు.

స్పార్టకస్ వచ్చినట్లే నువ్వుకూడా గనులదగ్గఱకు రావడం జరిగింది. మెడకూ మెడకూ యినుప గొలుసులు తగిలించిన నూటయిరవైముగ్గురు థ్రేషియన్లు తాపంచే, తపించే యినుపగొలుసుల నీడ్చుకుంటూ మొదటి జలపాతం దగ్గఱనుంచి యింత దూరమూ నడిచివచ్చారు. ఒకరివెనుక నొకరుగా నడిచేవాళ్ళలో పన్నెండోవాడు స్పార్టకస్. తక్కిన అందరిలాగానే యితనుకూడా యించుమించు దిగంబరుడు. త్వరలోనే రాబోతోంది సంపూర్ణ దిగంబరత్వం; అతనిచర్మం తోలులా పావంగుళం దళసరెక్కింది. అయినా మండే ఆ యెడారి యిసుక కదోలెక్క; అందుకే యివ్వగలిగినంత సౌకర్యాన్ని యిస్తామని అతను చినిగినవైనా చెప్పులు తొడుక్కున్నాడు. ఒక చిన్న గోచీగుడ్డ, పొడగాటి అట్టలు కట్టినజుట్టు; అందరికీ ఉన్నట్లే ఓ గడ్డం.

స్పార్టకస్ అనే యీ మనిషి ఎలాగున్నాడు? ఎడారిలో గొలుసుని యీడుస్తూ నడుస్తున్న అతని వయస్సు యిరవైమూడేళ్ళు వుండవచ్చు. ఆ వయస్సు తాలూకు

చిన్నెలేవీ అతన్లో కనిపించవు. అతనిలాంటి మనుషులకు అనంతమైన శ్రమ తప్ప వేరేమీలేదు. ఆ శ్రమకి బాల్యం, యౌవనం, వార్ధక్యం అనే తేడాలు లేవు. అది అనంత, నిరంతర శ్రమ. ముఖం, జుట్టు, గడ్డం సమస్తం తెల్లటి యిసుకపొడితో నిండిపోయి వున్నాయి. ఆ యిసుక వెనక అతని చర్మం భగభగ మండుతోంది. తెల్ల తోలు, పసుపురంగు జుట్టు వుండే ఉత్తరాది బానిసలయితే ఆ ఎండవేడికి ఆగలేక అమాంతం చచ్చి వూరుకుంటారు. స్పార్టకస్ వంటి గోధుమరంగువాళ్ళు బ్రతగ్గలరు. ఆ రంగు జీవానుగతమైంది.

గొలుసులు మోసే మనుష్యులు పొట్టిగా ఉన్నారో, పొడుగ్గా ఉన్నారో చెప్పడం కష్టం. సంకెళ్ళు తగిలించిన మనుష్యులు నిటారుగా నిలబడరు. వంగి నడుస్తారు. వాళ్ళ శరీరాలు ఎండకు బాగా యెండి, మొరటుబారి యేమీ నీరు లేనట్లుగా కనిపిస్తవి, కాని కండలకు లోటుండదు.

థ్రేస్ కొండలలో జీవించడమంటే మాటలు కాదు. శతాబ్దాల తరబడి ఏరేసి, చెరిగేసి, దులిపేస్తే యేది మిగుల్తుందో అదే మిగిలిందక్కడ. ఆ మిగిలినవి యెంత మొండిఘటాలో ప్రాణాన్ని యెంత గట్టిగా పట్టుకుని వేలాడతాయో అర్థమవుతుంది. ప్రతిరోజూ ఏదో పిడికెడు గోధుమగింజలే అతని ఆహారం. బార్లీ, రొట్టివున్నా అది బాగా యెండిపోయి రాయిలా తయారయి కూచుంది. అక్కడికి ఆ ఆహారమే అతని జీవికను నిలబెడుతూవచ్చింది. కండలున్న మెడ బలిష్టంగానే వుంటుంది. కాని యిత్తడి, ఇనుము మొదలయిన లోహాలు స్పృశించేచోట, బరువులు ఆనేచోట కురుపులున్నాయి. అవి రసికారుతుంటాయి. కండలు తిరిగిన భుజాలుండి వాటికి సరిపడేలాగే శరీరం వుంటుంది. కొంచెం చిన్నదిగా కనిపిస్తుందతని శరీరం. విశాలమైన ముఖం ఒకప్పుడు మేస్త్రీ యినుపఊచతో కొట్టడంవల్ల పగిలి బల్లపరుపుగా కనబడే ముక్కు— కళ్ళకు మధ్యదూరం అవసరమైన దానికన్న కాస్త దూరంగా వున్నదా అనిపిస్తుంది.

ముఖంలో మృదుత్వం కనిపిస్తుంది. మొత్తంమీద గొర్రెను పోలిన ముఖవైఖరి మనకగుపిస్తుంది. మాసినగెడ్డంలో, ఆ గెడ్డాన్ని నింపిన యిసుక వెనుక అతని నోరు పెద్దదిగా, ఆతనో సూక్ష్మగ్రాహి అని తెలియచేసేదిగా ఉంటుంది. అతను పెదిమలు కదిలిస్తే నవ్వడంవల్ల మాత్రంకాదు.—అతని పలువరుస స్వచ్ఛంగా అందంగా ఉంటాయని తెలుస్తోంది. అతనిలో అందమైన విషయమొక్కటే ఉంది. అవి అతని చేతులు; బలంగా, పెద్దవిగా ఉంటాయా చేతులు.

ఒక బానిసకొడుకైన బానిసకు పుట్టిన థ్రేషియన్ బానిస స్పార్టకస్ ఆ విధంగా వుంటాడు. అతని గమ్యస్థానమేమిటో యెవరెరుగుదురు? పుస్తకం చదివినట్లు చదువ

లేంగా భవిష్యత్తుని. పోనీ ఆతని గడచిన కాలమో! అంతా శారీరక శ్రమ, బండ చాకిరీ. అంతే ఆ గతమైనా నానావిధ బాధల అగాధంలో, కారుమబ్బులు కప్పి కను విప్పి చూచినా యీషణ్మాత్రం అగుపించని కాలగర్భంలో కలిసిపోయినదే. అయితే యితనే స్పార్టకస్; గతకాలపు మధురస్మృతి లేకపోగా, భవిష్యత్తుని గురించి, తీయని కలల గురించి భగవంతు డెరుగు! అసలు ఆలోచించని వ్యక్తి కాడు బానిస స్పార్టకస్; మానవుడు నిష్ఫలంగా శ్రమించడం వినా పరొకటుంటుందని అతని కెప్పుడూ తలపునకు రాలేదు. అత నెప్పుడూ అనుకోలేదు కొరడా దెబ్బలు తినక్కర్లేకుండా, కొరడా వెన్నంటి తిరగకనక్కర్లేకుండా మానవుడు కష్టపడి పనిచేసే రోజొక టుంటుందని.

శరీరభారాన్నీడుస్తున్న ఆ వ్యక్తి యేమనుకుంటున్నాడు. ఏ మాలోచిస్తున్నాడు? బాగుంది, ఈ మాత్రం మనం తెలుసుకోవద్దా. మెడలో గొలుసులు తగిలించిన మనిషి పెద్దగా ఆలోచించే విషయాలుండవనీ, తనెప్పుడు మళ్ళీ తింటాడో, తాగుతాడో, కునుకు తీస్తాడో, యీ విషయాలు తప్ప మరింకేం ఆలోచించడనీని. స్పార్టకస్‌లో, అతని థ్రేషియన్ సహచరులలో క్లిష్టమైన రకరకాల భావాలులేవు. వాళ్ళకున్నదల్లా ఒకే ఒక వస్తువు. వాళ్ళు పంచుకున్నదల్లా ఒకే ఒక వస్తువు. అదే ఆ గొలుసు. మనుష్యులను రాక్షసులుగా తయారుచేసి దేవతలను గురించి ఆలోచించ మంటే ఆలోచిస్తారంటావా? గచ్చకాయలకు తెచ్చిన గుర్రం అగడ్తను దాటుతుందా?

ఇక యిప్పుడు పగలుకాదు. మార్పువస్తోంది. ఇటువంటి మనుష్యులు ఏ కొద్ది పాటి మార్పువచ్చినా హుషారుగా వుంటారు. తలయెత్తి చూచేడు స్పార్టకస్. ఏముంది! ఎదురుగా నల్లని పర్వతశ్రేణి అగుపడింది. బానిసలకుకూడా తెలిసిన భూగోళ శాస్త్రమొకటి వుంది. పర్వతాగ్రాల కొలతలు తెలియకపోవచ్చు. నదులు, అవి ప్రవహించే ప్రాంతాలు వాళ్ళకు అంతుబట్టని విషయం కావచ్చు. సముద్రాల సరిహద్దులు వాళ్ళకు తెలియకపోవచ్చు. దేశ జనాభాలెక్కలు వాళ్ళు లెక్కకట్టలేకపోవచ్చు. కాని స్పెయిన్‌దేశపు వెండిగనులు, ఉత్తరాఫ్రికా ఇనుపగనులు, అరేబియా బంగారుగనులు, గాల్‌దేశపు తగరపుగనులు, కాకసస్ కొండల నడుమనున్న రాగిగనులు-వీటి గురించి బానిసలకు బాగా తెలుసు. వాళ్ళకి, వాళ్ళ భయానికొక అకారాది నిఘంటువున్నది. దానిలో వాళ్ళున్న ప్రదేశంకన్న భయంకరమైనదేదో తెలియడంలేదు. నిజానికి వాళ్ళున్న న్యూబియా నల్లపర్వతప్రాంతంకన్నా అధమమైనది ప్రపంచంలో ఎక్కడా చూడం.

దానికేసే చూసేడు స్పార్టకస్. తక్కిన వాళ్ళు కూడా చూస్తారు. ఆ బారు బారు ఆగుతుంది క్షణకాలం. బాధల బరువును, బరువైన బాధలను యీడ్చుకుపోతున్న వాళ్ళు ఆపుతారు కష్టాలు కదలిక నొక్కక్షణం. గోధుమ, నీరు మోసే ఒంటెలు కూడా ఆగుతవి. మేస్త్రీలు కూడా తమ కొరడాలతో, అంకుశాలతో ఆగుతారు కాస్సేపు. నరక సన్నిభమైన నల్లపర్వతశ్రేణిని చూస్తారు. అంతా చూస్తారు ఆ నల్లని నల్లపర్వతశ్రేణిని బోలిన నరకకూపాన్ని. అంతలో వీళ్ళకు తెలియకుండానే ప్రయాణం సాగిపోతుంది. ప్రయాణాన్ని వెన్నంటి సాగిపోతారు వాళ్ళు.

ఆ నల్లనిరాళ్ళు ప్రకాశిస్తున్న సూర్యుడినే మింగేసేయి; మరింత నల్లబడి భయంకరంగా రాబోయే దౌర్భాగ్యాన్ని సూచిస్తున్నాయి. ఆ నాటి పని ముగిసింది. భూమిని ఛేదించుకుని, గని గోతులనుండి బైటపడ్డారు మనుష్యులు.

"వాళ్ళెవరు? వాళ్ళెవరు?" స్పార్టకస్ అనుకున్నాడు; ఆలోచించాడు.

తన వెనుకనున్న మనిషి గొణిగేడు: "భగవంతుడా నన్ను రక్షించు."

కాని భగవంతు డిక్కడ యెవరినీ రక్షించడు. అసలు భగవంతు డిక్కడ ఉండడు. దెయ్యమూ, దేవుడూ చొరలేని, చొరనశక్యమైన ప్రదేశమిది. ఒకవేళ వుంటే ఏం చేస్తుంటా డీభగవంతుడు? తన కగుపించేది ఎడారిలో నివసించే ఒక రకమైన వింతజాతి కాదని తెలుసుకున్నాడు స్పార్టకస్. తనలాటి మానవమాత్రులే వాళ్ళు. ఒకప్పుడు తనున్నట్లే ఉన్న పిల్లలు కూడా వున్నారు వీళ్ళల్లో. తమ లోపల, వెలుపల వున్న పరిస్థితులచే తయారయిన మనుష్యులు వాళ్ళు. వాళ్ళను మనుష్యులుగా కాక, మరోలా తయారయేలా చేసిన, పరిస్థితులను సృష్టించిన శక్తులున్నాయే, శక్తులు వాటికి లోపలనుంచి ఒక సమాధానం వస్తుంది. ఏమి టా సమాధానం? మానవత్వం అనే దో కోరికగాగాని, ఆ అవసరంకాని పూర్తిగా అంతరించిపోవాలి, వాళ్ళకేసి చూడండి. చూడండి తెలుస్తుంది! కొన్ని సంవత్సరాలుగా మారుతూ రాయిగా ఘనీభవించిన స్పార్టకస్ హృదయం భయంతో, ఆందోళనతో ముడుచుకుపోయింది. తనలో ఒకప్పుడుండిన జాలి, కరుణ యింకిపోయాయనుకున్నాడతను. కన్నీటి బావులు కనుపించవిక అనుకున్నాడు. కాని నీరులేనట్లగుపించే అతని శరీరంలో కన్నీటి బిందువులకు కొఱత లేకపోయింది. ఒక్కమారవి తమ ఉనికిని ధృవపరచుకునేందుకు కనుకొలకులనుండి జలజలా రాలుతవి. వాళ్ళకేసి చూస్తాడు. కొరడా అతని వెన్నుచరచి హెచ్చరిస్తుంది కదలమని కదలిపొమ్మని. కాని అల్లాగే చూస్తూ నిలబడిపోతా డతను మిత్రుని మాట పెడచెవిని పెట్టి.

ఆ గని గోతులలోనికి వాళ్ళు పాకుతూ, బంగురుకుంటూ పోతారు. పైకి వచ్చేటప్పుడూ అంతే. అక్కడికి వచ్చేరు కాబట్టి. వాళ్ళు వచ్చినప్పటినుంచీ స్నానం చేసి యెరుగరు. ఇకముందు చెయ్యరు. నల్లని యిసుకా, తెల్లనియిసుకా కప్పిన శరీరం వాళ్ళది. వాళ్ళజుట్టు పొడుగ్గా, వాళ్ళలాగే చిక్కులుపడి అట్టలుకట్టి వుంటుంది. పిల్లలు కానివాళ్ళకు పెద్దగడ్డాలున్నవి. కొందరు నల్లవాళ్ళు; కొందరు తెల్లవాళ్ళు. కాని ఇక్కడ ఎవరూ వీళ్ళు తెలుపూ, వాళ్ళు నలుపూ అనే విషయం చూడలేరు. నల్లగా వున్నా, తెల్లగావున్నా బానిస బానిసే. ఐనా అది అనవసరం. మోకాళ్ళమీద, మోచేతులమీద చర్మం నల్లబడి చాలదట్టంగా, అసహ్యంగా వుంటుంది. వాళ్ళంతా దిగంబరులు. దిగంబరత్వమే చూసి సిగ్గుచేత తలవంచుకునేటంత దిగంబరులు కాక మరేమిటి? బట్టలు వాళ్ళకు ప్రాణంపోసి మరింతకాలం బ్రతికిస్తాయా? ఈ గనులవల్ల సాధింపబడే ప్రయోజనం ఒక్కటే ఒక్కటి వున్నది. రోమన్ గని యజమానులకు విపరీత లాభాలు ఆర్జించిపెట్టాయా గనులు. అంతేకాక, ఎంత అడవా సరుకు బట్టలైనా వాటికీ ఒక ఖరీదనేది యేడుస్తుంది కదా.

అక్కడి వాళ్ళు ధరించే వస్తు వొకటుంది. వాళ్ళ నల్లని రాతిగోతుల నుండి వచ్చేసరికి గొలుసులతో బంధించడానికని ప్రతి ఒక్క బానిస మెడలోనూ యినపదో, యిత్తడిదో ఒక మెడపట్టీ ఉంటుంది. ప్రతి మెడపట్టీకి మేస్త్రీ ఆ గొలుసు తగిలిస్తాడు. అల్లా ప్రతి యిరవైమందినీ ఒక గొలుసుతో బంధించి వాళ్ళబసకు పంపుతారు. ఇంతకుపూర్వం ఏ ఒక్కడూ న్యూబియన్ ఎడారినుంచి తప్పించుకుపోలేదు. ఇకముందెన్నడూ, ఎవడూ తప్పించుకు పారిపోలేడు. ఆ విషయం గమనార్హం. ఒక యేడాదిపాటు గనులలో పనిచేసేవాడి కింక ప్రపంచమేమిటి? మానవసమాజమేమిటి? ఆ గొలుసు ఒక అవసరమే కాదు. ఒక చిహ్నం-ఒక సంకేతం-

మనిషి బానిసగా మారినప్పుడు, తక్కిన తనబోటివాళ్ళను తన మందలోవారే, తన జాతివారే అనుకుంటాడు. స్పార్టకస్ కూడా తన జాతికేసి, తన మంద కేసి తెల్లబోయి చూసేడు: "మాట్లాడండి" అతనిలో అతననుకున్నాడు. "ఒకళ్ళతో ఒకళ్ళెందుకు మాట్లాడకూడదో!" వాళ్ళు మాట్లాడరు. మృత్యువులా మౌనంగా వుంటారు వాళ్ళు. "నవ్వండి" అతనిలో అతనే తర్కించుకుంటాడు, కాని యెవ్వరూ నవ్వరు.

అవసరమైన పనిముట్లన్నీ, సుత్తులు, గునపాలు, పారలు, పలుగులు, ఉలులు వగైరా అన్నీ వాళ్ళు మోసుకుపోతారు. అందులో చాలామందికి తలచుట్టూ కట్టబడి పనితనం కనిపించని నాటుదీపాలుంటాయి. సాలెపురుగుల్లా సన్నంగా వున్న ఆ పిల్లలు

వుండివుండి తటాలున శరీరాన్ని గుంజి లాక్కుపోతున్నట్లు నడుస్తారు. ఈ పిల్లలు యెన్నటికీ ఎదగరు. పైగా నానాటికి క్షీణిస్తారు. వాళ్ళిక్కడ రెండేళ్ళకన్న యెక్కువ కాలం పనిచేయలేరు. గనులగోతులు సన్నగిల్లి మెలికలు తిరిగేచోట్ల వీళ్ళు పనిచెయ్యక తప్పదు. థ్రేషియన్ల ప్రక్కవాళ్ళూ యీ గొలుసులాగుతూ పోతారు. కొత్తవాళ్ళ రాక వాళ్ళలో ఆసక్తి, తెలుసుకుందామన్న పిల్లలకుండే సహజమైన ఆకాంక్ష కల్గించదు. అవి యెన్నడో నశించాయి. ఎవరు వచ్చినా, ఎవరుపోయినా వాళ్ళకేం లెక్కలేదు. అది నిర్లక్ష్యంమాత్రం కాదు. అది వాళ్ళ కనవసరం.

స్పార్టకస్‌కు తెలుసు; "అనతికాలంలో నాకూ అనవసరమే" తనలో తనే అనుకున్నాడు. ఇదే మరింత విషాదకరమైన విషయం.

ఆ బానిసలు తినడానికి పోతున్నారు. థ్రేషియన్లు వారివెంట తీసుకుపోబడ్డారు. నల్లరాతికొండకు చేర్చి పూర్వమెప్పుడో కట్టబడ్డ బారకాసుకు వాళ్ళు వెళ్ళేరు. నల్లరాతి పలకలతో కట్టేరు దాన్ని. ఆ పలకలు చదునుగలేవు. ఆ బారకాసు గాలికి, వెలుతురుకు వెలియై ఒకవైపే తెరుచుకుని వుంది. ఎంత కాలంనుండో తుడవకపోవడంవల్ల చెత్తా, చెదారం అన్నీ ఆ నేలకు తాపడమైపోయాయి. మేస్త్రీ యెప్పుడూ దీనిలోనికి రాడు; లోపల ఏదైనా గొడవ సంభవిస్తే వాళ్ళకి తిండీ, నీరూ బంద్ చేస్తారు. దాంతో ఆకలికి మాడలేక, దాహానికి ఆగలేక బానిసలు లొంగి ఆ గుహలోంచి బైటకు పాకి వస్తారు. లోపల ఎవరైనా చస్తే తక్కినవాళ్ళాశవాన్ని మోసుకొస్తారు. ఒక్కొక్కప్పు డాచీకటి కోణంలాగుండే బారకాసు లోపల యెక్కడో ఎవరైనా కుర్రాడు చచ్చినా శవం కుళ్ళి దుర్గంధం ముక్కులు బ్రద్దలుకొట్టేవరకూ వాళ్ళకు తెలియనే తెలియదు. అటువంటి దౌర్భాగ్య ప్రదేశమా బారకాసు.

లోనికి పోయేటప్పుడు మాత్రమే బానిసలకు గొలుసులుండవు. లోపలికి వెళ్ళే ముందే వాళ్ళకి తినడాని కొక కర్ర గిన్నె, నీటి కొక తోలు సంచి యివ్వబడతాయి. తోలుసంచిలో ఒక శేరు నీళ్ళదాకా పడ్తాయి. అదే వాళ్ళకొక రోజు రేషను; నాలుగు శేర్ల నీళ్లుకూడా అటువంటి మండుయెడారిలో నాలిక తడపడానికైనా చాలవు. ఆ విధంగా బానిసల శరీరాలు నీరులేక యెండిపోయేవి. త్వరగా వాళ్ళకు మూత్రకోశం చెడేది. బాధవల్ల వాళ్లు పని చేయలేకపోతే, పనిచేయలేని బానిస ఎందుకూ పనికిరాడు కాబట్టి, చావమని యెడారిలోకి తోలేస్తారు. చంపడాని కదో మార్గం.

ఇవన్నీ స్పార్టకస్ యెరుగును. బానిసలగురించి అతనికి బాగా తెలుసు. అతనిది బానిసజాతి; ఆజాతిలోనేపుట్టి, పెరిగి, పెద్దవాడౌతున్నాడతను. బానిసలయొక్క బానిసత్వంలోని మూలరహస్యా న్నెరుగునతను. అదొక వాంఛ—ఆనందంకోసం

కాదు, సౌఖ్యం గురించి కాదు. రుచికరమైన ఆహార విషయమై కాదు, గానసుధను ఆలకిద్దామని కాదు; సంతోషంకోసం ప్రాకులాడేదికాదు, ప్రేమనుగురించి ప్రాకులాడేదికాదు, స్త్రీలు, సారా వీటివేటినీ గురించీకాదు—అదొక వాంఛ. కష్టసహిష్ణుత అలవర్చుకుని ఎల్లాగో ఒకలాగు జీవించడం కోసం. అంతే, అంతకన్న మరేంకాదు; చావకుండా బతికివుందామనే ప్రబలమైన వాంఛ.

ఈ వాంఛ యెందుకో అతనెరుగడు. దీని కో కారణమూలేదు; అర్థమూలేదు. పైగా విజ్ఞానం, సహజంగా దానంతటది లభించేసేది కాదు. దానికోసం కష్టపడాలి. ఏ పశువూ యీ విధంగా జీవించకలేది కాదు. జీవిత విధానం తమాషా అయినదీ కాదు సూక్ష్మమైనదీ కాదు. సమస్య లన్నిటిలోకీ, మానవు డ్నెదుర్కొన్న సమస్య లన్నిటిలోకీ యిదే ఆలోచనీయమైన, కష్టమైన, క్లిష్టమైన సమస్య. ఆ సమస్య నెదుర్కొన్న మానవులందరికీ అదో చిక్కు సమస్య, గడ్డుసమస్య; దానికి కూడా ఏదో కారణముంటుంది. స్పార్టకస్‌కు సరిగ్గా తెలియని దదే కారణం; అత నా కారణాన్ని యెరుగడు.

తను చావకూడదు. అందుకే అతను అలవాటుపడుతూ, అవసరమైనట్లు సాగుతూ, పరిస్థితులకు దాసుడౌతూ, వాతావరణానికి అనుకూలంగా మారుతూ, అదే సమయంలో యిదంతా గ్రహిస్తూ జీవిస్తున్నాడు. జీవిస్తూ గ్రహిస్తున్నాడు. ఎల్లా పడితే అల్లాగ జారగల, వంగగల, సాగగల స్వభావమతనిది. గొలుసు మెడను చుట్టుకుని లేనప్పుడు సంపాదించిన స్వేచ్ఛ నతడు జాగ్రత్తగా భద్రపరుస్తాడు. కాని సముద్రాలను దాటి, నైల్ మహానదిని దాటి, యెంతదూరం యీ యెడారిలో తనూ, తన సహచరులూ యీ గొలుసును మోసుకొచ్చారో! వారాలతరబడి అదే గొలుసు. ఇప్పుడే అతనికి కొంచెం స్వేచ్ఛ. ఆ స్వేచ్ఛాసమయంలో సంపాదించిన శక్తినిమాత్రం వృథా చెయ్యకూడదు. ఎన్నో వారాలు అతను కంటితోనైనా చూడలేనంత నీరు, ఆ నీటి నతను స్వీకరిస్తాడు. ఒక్కమారు దాన్ని ఒక్క గుక్కలో తాగి విసర్జించి పారెయ్యడు; గంటల తరబడి ప్రతి నీటిచుక్కనూ త్రాగుతాడు. తన శరీరంలోని ప్రతి కణంలోకీ, ప్రతి అణువులోకీ ఆ నీరు పోవాలని అతను భావించినట్లుంది. అత నాహారం తీసుకుంటాడు. గోధుమ, యెండిన మిడతలువేసిన బార్లీ పులుసు-యిదీ అతని ఆహారం. ఎండిన మిడతలు శక్తినిస్తాయి. గోధుమ బార్లీ అతని కండరాలు. అంత కన్న చెత్తకూడా తిని బ్రతికేడతను. అన్నం పరబ్రహ్మస్వరూపం; ఆహారాన్ని గౌరవించాలి, పూజించాలి. ఆ పరబ్రహ్మ స్వరూపాన్ని దూషించినవాడికి దాన్ని మనోవాక్కాయకర్మలచే అసహ్యించుకొన్నవాడికి, ఆ తిండికూడా దొరకదు. అదీ లభ్యం

కాకపోతే మరణం సంప్రాప్తమవడం తథ్యం. తమస్సు బారకాసై, ముఖద్వారం ఆ తమస్సుకి నోరై తెరుచుకుకూచుంది. ఆ బారకాసు చీకటిలోనికి అతను వెళ్తున్నాడు. దుర్గంధతరంగం అతని నాసికారంధ్రాన్ని ఛేదించుకుపోయి మతి చెడగొడుతుంది. వాసనవల్ల ఎవడైనా చస్తాడూ? వాసన భరించలేక వాంతి చేసుకునేవాడు ఉట్టి వెర్రి వెధవయి వుండాలి. అతని కడుపులోని ఒక్క తులం ఆహారం కూడా ఆవిధంగా బైటికి పోనివ్వడం అతని కేమాత్రం యిష్టం లేదు. దుర్గంధంతో ద్వంద్వయుద్ధం చెయ్యదలచుకో లేదతను. అటువంటివాటికి యెదురు తిరిగి సాధించే ప్రయోజనం శూన్యం. దానికి బదులు అతను దుర్గంధాన్ని ఆహ్వానిస్తాడు; కౌగలించుకుంటాడు. శరీరం అంతటా ప్రవేశించమంటాడు. దాంతో దాని క్రౌర్యం చస్తుంది.

చీకట్లో నడుస్తున్నప్పుడు అతన్ని అతని కాళ్ళే తీసుకుపోతాయి. ఆ కాళ్ళే అతని కళ్ళు. అతను పడకూడదు, తూలకూడదు, తూలినా, పడినా రెండుచేతుల లోనూ ఉన్న నీరో, ఆహారమో పడిపోతుంది. రాతిగోడదాకాపోయి అక్కడ దానికి జేర్లపడి కూచుంటాడు. ఇక్కడే అన్యాయం ఒక మెట్టుదిగింది. అతను జేర్లబడ్డ రాయికి అతనంటే యెంతోజాలి; చల్లగావుంది. తింటున్నాడు. మధ్యమధ్యన జాగ్రత్తగా తాగుతున్నాడు. అతనిచుట్టూ కదలిక వుంది. ఉచ్ఛ్వాస, నిశ్వాసలు వినిపిస్తున్నాయి. జాగ్రత్తగా వింటే వాళ్ళ హృదయాల స్పందన కూడా వినొచ్చునేమో. తనలాగే తింటున్న పిల్లలు, పెద్దలు నమిలేటప్పుడు దవడలు చేసే చప్పుడు వినిపిస్తోంది. శరీరంలోనివి, పైవి అన్ని భాగాలూ తిన్న ఆహారాన్ని జాగ్రత్తగా పంచుకుంటున్నాయి. ఆఖరుముద్ద అన్నం అతిజాగ్రత్తగా తింటున్నాడతను. ఆఖరు చుక్క నీటిని ఆప్యాయంగా తాగాడు. కర్రగిన్నె నాకి మరీ తింటున్నాడు. ఆకలి అతన్ని నాశనం చెయ్యలేదు. ఆహారమే బ్రతుకు; ఆహారంలోని ప్రతి అణువూ అతని ప్రాణం.

అందరూ తిన్నారు. కొందరు చాలనందుకు నిరాశ చెందేరు. మరికొందరు సంతుష్టి చెందేరు. అంతమాత్రాన నిరాశ కిది నివాసం కాదని కాదు. అది అక్కడ అల్లాగే యెల్లాగూ వుండితీరుతుంది. ఆశ నశించితేనేం. నిరాశ చాలా పట్టుదల కలది. అసలు ఆశ నశించినచోటే నిరాశకు పుట్టిన స్థలం. మూలుగులూ, కన్నీళ్లూ, నిట్టూర్పులూ అక్కడ వుండనే వున్నాయి. ఎవరో వెక్కివెక్కి ఏడుస్తున్నారు; మూల్గుతున్నారు. గట్టిగా, మరీగట్టిగా, చీకటిని కోసుకుని చెవులబడుతోం దా యేడుపు. కొంచెం మాట్లాడుకుంటున్నారు కూడా; ఎవరో నెమ్మదిగా వచ్చీ రాని భాషలో అడుగుతున్నారు.

"స్పార్టకస్ - యెక్కడున్నావు నువ్వు?"

"ఇక్కడా, ఇక్కడున్నానోయ్ థ్రేషియన్" అన్నాడతను.

"ఇక్కడున్నావా థ్రేషియన్" మరో గొంతు అడిగింది. 'థ్రేషియన్' 'థ్రేషియన్' యెన్నో గొంతు లన్నాయి. అక్కడున్న మనుష్యు లతని చుట్టూ చేరతారు. తక్కిన బానిసలు కూడా వింటూ వుండొచ్చు. మొత్తంమీద అక్కడ నిశ్శబ్దం వినిపిస్తోం దిప్పుడు. నరకంలోకి క్రొత్తగా వచ్చిన వాళ్ళంతేనేమో, తమకన్న ముందుగా యిక్కడకు వచ్చిన వాళ్ళప్పుడే యీ యెడారి సౌఖ్యాన్ని అనుభవించేస్తున్నారు. జీవితం యెడారిలోనే ప్రారంభమైందని వాళ్ళనుకుంటారు. అల్లా అనుకుంటేనే నయం. కాని యెడారికి బానిసలుగా రాకపూర్వం తమ జీవిత స్మృతులను జ్ఞప్తికి తెచ్చుకొని నెమరు వేసుకుంటే-అల్లావేసుకోడమనేదే ఒకటుంటే-యెంత విషాదకరంగా వుంటుంది. ప్రస్తుత జీవితవిధానం యెంత బాధావహంగా, భయావహంగా వుంటుంది. అందుకే వాళ్ళు స్మృతులంటే భయపడతారు. వాళ్ళు దేనికి భయపడతారో అదే యీ కొత్తగా వచ్చినవాళ్ళు చేస్తూ కూచున్నారేమో, తమ జీవితాలలోని స్మృతులను పునశ్చరణ చేసుకుంటున్నారేమో, కొందరికి 'అటిక్' భాష తెలుసు. మరికొందరికి తెలియదు. బహుశః కొందరికి థ్రేస్, అక్కడి హిమవత్ పర్వతశిఖరాలూ, వరప్రసాదమా అనిపించే చల్లని చల్లదనమూ, ఆకుపచ్చని దేవదారు అడవులూ, వాటిలో ప్రవహించే యేళ్ళూ, సెలయేళ్ళూ ఆనందంతో హాయిగా, నిర్విచారంగా గంతులేసే నల్లని మేక పిల్లలూ ఆ రాళ్ళల్లో తిరుగుతూ, మేస్తూవుండే మేకలూ జ్ఞప్తికివస్తే రావచ్చు. నల్ల రాతిగుండెలలో బసచేసే మనుష్యుల హృదయాలలో యేముంటుందో, యేయే స్మృతులూయెల లూచుతాయో యెవ రెరుగుదురు?

అతన్ని వాళ్ళు 'థ్రేషియన్' అని పిలుస్తారు. వాళ్ళందరూ అతని చుట్టూ అన్ని వైపులా కూచుని వున్నారు. చేత్తో తడుముతా డతను. ఒకరి ముఖం తగులుతుంది, అన్నీ కన్నీళ్ళే. అరె! కన్నీళ్ళు. శుష్కదండుగ.

"మన మెక్కడున్నాం స్పార్టకస్! మన మెక్కడున్నాం?" ఒకడు గుసగుసలాడేడు.

"మనం యెక్కడికీ పోలేదు? ఇక్కడికి యెల్లాగొచ్చామో జ్ఞాపకముందీ?"

"ఐనా మన నెవరు జ్ఞాపకముంచుకుంటారు?"

"మనం యెక్కడికీ పోలేదు" అని తిరిగి అదే మాటంటాడతను,

*"మన నెవరు జ్ఞాపకముంచుకుంటారులే!"*

ఆ మాదిరిగా మాట్లాడడం కష్టమే. అతను వాళ్ళకు తండ్రిలాగున్నాడు. పూర్వపు తెగల సాంప్రదాయమది. రెట్టింపు వయసున్న వాళ్ళయినా సరే తాము గౌరవించే వ్యక్తిని 'నాయనా' అనీ, 'తండ్రీ' అనీ సంబోధిస్తారు. ఆ సాంప్రదాయం ప్రకారమే అతను వాళ్ళకు తండ్రి, వాళ్ళంతా థ్రేషియన్లే; కాని అతన్నే 'థ్రేషియన్' అంటారు. అందుకే అతను మృదువుగా పాడుతాడు, పిల్లలకు కథ చెప్పే తండ్రిలా.

తీరంపై దెబ్బతీయ మథియించిన నీరంలా
పశ్చిమ వాయువుతో కలిసి చేసిన వ్యూహరచన
ఉదధి లోతు లోతుల్లో బాగా మథియింపబడిన
ఉవ్వెత్తుగలేచి తరగ తీరంతాకిన విధాన
శ్వేతకాంతి వెదజల్లుతు నురుగులు కక్కే-రీతిని
ఆ రీతినే వ్యూహంతో దానా న్లీ రోజుననే
దూకిరిగా అని మొననే—

వాళ్ళను ముగ్ధులను చేసేడతను. వాళ్ళ దైన్యాన్ని కాస్సేపు వేరే వుంచుతాడు. తనలో అనుకుంటాడు: "పాత పద్యంలో యెంత కొత్తదనం ఊరుతుంది." ఈ అంతులేని చీకట్లోనుంచి వాళ్ళను కాపాడతా డితను, ట్రాయ్‌లో ముత్యాలారబోసిన సముద్రతీరానికి తీసుకుపోతాడు వాళ్ళని—అవిగో ఆ తెల్లని గోపురాలు, వాళ్ళే హేయమయంగా అగుపించే కంచు ట్రాయ్‌యోధులు, ఆ మృదువైన గీతం యెక్కడికో అంతరిక్షమార్గంలోకి పోతూ యింతలోనే కిందికి దిగుతూ భయాందోళన లనే కట్లు విప్పుతోంది. ఆ చీకట్లోకూడా చలనం కనిపిస్తోంది, అంత చీకట్లోనూ కదలిక గోచరిస్తుంది. బానిస లందరికీ గ్రీకు భాష రాదు. అదీకాక థ్రేషియన్ భాషకూ, అటిక్ భాషకూ తేడావుంది. పరీక్షా సమయాలలో ఉత్తేజం కల్గించడానికని పూర్వమెప్పుడో ఒకజాతి తన విజ్ఞానాన్నంతటినీ ఒక భద్రగీతిగా రచించి జాగ్రత్తపెట్టినట్లుం దాగీతం. దాన్నిమాత్రం వాళ్ళు భాషలతో సంబంధం లేకుండా అర్థం చేసుకోగలరు. అది సకల భాషాతీతమైన మహోత్కృష్ట భావమేమో మరి.

కొంతసేపటికి స్పార్టకస్ నిద్రపోతాడు. నిద్రలేమి అతన్ని యెప్పుడో ఒకమారు యెదుర్కొంది. దాన్ని మార్కొని జయించా డతను. యువకుడు, నెమ్మది మీద అతను మరింత నెమ్మదిపడతాడు. చిన్ననాటి సంఘటనల స్మృతిపథంలో విహరిస్తున్నాడు. చల్లని ప్రశాంతమైన, ప్రకాశవంతమైన నీలిమాకాశం కావాలతనికి. చల్లగా మెల్లగా వీచే మలయమారుతం కావాలతనికి. అవన్నీ అక్కడ లభ్య

మవుతాయి. మేకలనుకాస్తూ దేవదారు అడవిలో ముసాలి వృద్ధునిప్రక్క అతను పడుకున్నాడు. ముదుసలి అతనికి చదువు నేర్పుతున్నాడు. ప్రతి అక్షరాన్నీ యిసుకలో వ్రాసి, తన చేతికర్రతో వ్రాసి చూపిస్తున్నాడు. "చదువుకో, నేర్చుకో నాయనా, నా బంగారు బాబూ" వృద్ధుడంటున్నాడు. "అది చేస్తేనే బానిసలైన మనంకూడా ఒక ఆయుధాన్ని దగ్గర వుంచుకోగలం, అదే లేనిరోజున అడవులలో పశువులలా మన బ్రతుకు వృధా. అనగా అనగా యెన్నో రోజులక్రితం ఒకనాడెప్పుడో మంచిరోజులుండేవి. దాన్ని స్వర్ణయుగం అనేవారు. ఆ యుగంలో భగవంతు డూహించిన ఊహలను, ఆలోచనలను జ్ఞప్తికి తెచ్చుకుని వ్రాయగల్గి, చదవగల్గి ఉంటారనే ఉద్దేశ్యంతోనే నిప్పు నుపయోగించగల శక్తి నిచ్చిన భగవంతుడే మానవునకు తన భావాలను, వ్రాయగల శక్తిని కూడా ప్రసాదించాడు. ఆ రోజుల్లోనే మనుష్యులు దేవునికి దగ్గరగా వుండి అతనితో ముఖాముఖి మాట్లాడగల్గి వుండేవారు. అప్పుడు బానిసలు లేరు. అలాంటి రోజు తిరిగి వస్తుంది."

ఆ విధంగా స్పార్టకస్ జ్ఞాపకం చేసుకుంటున్నాడు. అతని ఆ స్మృతిపథ విహారం కలగా మారుతుంది. నిద్రాదేవత ఒడిలో నిద్రిస్తాడు.

ఉదయాన్నే ఒక పెద్ద శబ్దం అతన్ని నిద్రనుండి లేపుతుంది. బారకాసు ముఖద్వారంవద్ద నగారా మ్రోగిస్తారు. ఆ శబ్దం ఆ కొండలమధ్య ధ్వనించి ప్రతిధ్వనిస్తుంది. అతను లేస్తాడు, అక్కడున్న తోటి బానిసలంతా లేస్తారు. చీకటిని నెట్టుకుంటూ గుమ్మం దగ్గరకు చేరతారు. కర్రగిన్నె, నీటిసంచీకూడా పట్టుకుపోతాడు స్పార్టకస్. అవికూడా లేకపోతే ఆరోజుకు తిండిలేక తిప్పలు మిగులుతాయి. బానిసత్వంలో వుండే చిన్న చిన్న మార్పులు అతను గ్రహించలేనివాడు కాడు. బానిసల పద్ధతులలో బాగా ఆరితేరినవాడు. కదులుతూ తన చుట్టూ కదులుతున్న వాళ్ళ శరీరాల కదలిక గుర్తిస్తాడు. అతని ప్రసక్తి లేకుండానే అతని శరీరం చుట్టూవున్న కదలికతోపాటు కలిసి కదిలింది. ఇంతసేపూ ఈ బాజా వాయిస్తూనే వుంటారు కొంప మునిగినట్టు.

ఎప్పుడూ వుండనంత చల్లగావుంది యెడారి. ఇంకో గంటకు కాని సూర్యోదయంకాదు. ఈ కాస్సేపూ యెడారి మనతో స్నేహంగా వుంటుంది. ఆ నల్లని బండ రాళ్ళుకూడా చల్లని గాలిని పీలుస్తున్నాయా అనిపిస్తుంది. ఏమో, అవికూడా ఆనందిస్తున్నాయేమో! ఇంతఘోరమైన యెడారిలోనూ కూడా స్త్రీలను జ్ఞప్తికి తెచ్చే అందమైన నక్షత్రాలు ఒక్కొక్కటే ఉదయాన్ని సూచిస్తూ తమ పని ముగిసిందన్నట్టు మెల్లమెల్లగా జారుకుంటున్నాయి. ఆకాశం నీలంగా స్వచ్ఛంగా వుంది. ఇక జీవితంలో యెన్నటికీ ప్రపంచపు ముఖం చూడశక్యంకాని న్యూబియా యెడారి, ఆ

యెడారిలోని బంగారపు గనులు, వాటిలో పనిచేస్తున్న బానిసలకు కూడా యేదో కొద్ది ఉపశమనం వుంటుంది. ప్రకృతి ప్రాతఃకాలం ద్వారా ఆ వుపశమనాన్ని వాళ్ళ కందిస్తుంది; మధురాతిమధురమైన భావాలు వాళ్ళ హృదయాలలో మెదిలి వాళ్ళ ఆశలను పునరుద్ధరిస్తాయి.

రొట్టెలు తింటూ, నీళ్ళు తాగుతూ మేస్త్రీలు ఒకవైపు గుమిగూడి వున్నారు. బానిసలకు మాత్రం మరో నాలుగు గంటల దాకా యేమీ యివ్వరు. మేస్త్రీగా వుంచే ఒకటి, బానిస అయితే మరొకటి. ఉన్నివస్త్రాలు కప్పుకుని మేస్త్రీ ఒక బరువైనకర్ర, ఒక కొరడా పట్టుకొని ఉంటాడు. ఒక నిడుపాటి కత్తి అతని మొలలో వేలాడుతూంది. వీళ్ళెవరు? ఈ మేస్త్రీ జాతికి చెందిన వీళ్ళెవరో? స్త్రీలులేని ఈ భయంకరమైన యెడారిలోకి వచ్చి వాళ్ళల్లా తమ కాలాన్ని వృధా చేసుకుంటా రెందుకు?

వాళ్ళది అలెగ్జాండ్రియా. మొరటు బారిన బండమనుష్యులు వాళ్ళు. స్వభావం అతితీక్ష్ణమైనది. హెచ్చుజీతాలు గిట్టే అవకాశం ఉంది కనుకా, బంగారం గనులలో కొంత భాగం వాళ్ళకు యివ్వబడుతుంది కనుకనూ వాళ్ళిక్కడకు రానిచ్చగిస్తారు. వాళ్ళుకూడా జీవితాన్ని గురించీ, భవిష్యత్తు గురించీ కొన్ని కలలు కన్నవాళ్ళే. అందుకని కష్టే ఫలే, అన్న సూత్రాన్ని వల్లించి, జీర్ణం చేసుకుని ఆచరణలో పెట్టేసేరు. ఈ గనుల సంస్థలో అయిదేండ్లు కష్టపడితే, తక్కిన జీవితశేషాన్ని కులాసాగా, నిర్విచారంగా ధనవంతులుగా గడపవచ్చునని వాళ్ళ ఆశ. ప్రస్తుతం వాళ్ల భవిష్యత్తులోనే జీవించే ఆశాజీవులు. రోమ్‌నగరంలో ఒక సుందర భవనాన్ని అద్దెకు తీసుకొని, అనుభవించడానికీ, వంటకూ అయిదారుగురు నక్కుల్లాంటి బానిసయువతులను కొనుక్కొని, ఆ లోటు కూడా తీర్చుకుంటూ, స్నానశాలలో, ఆట పాటలలో కాలాన్ని వెళ్ళబుచ్చుతూ, ప్రతినిత్యం తాగగలిగినంత తాగి, ఆడగలిగినన్ని తందనాలాడగలం కదా అనీ, రోమన్ పౌరసత్వంకూడా లభిస్తుంది కదా అనే ఆశ వాళ్ళ నీ యెడారిలో కలలు కనేలా చేస్తాయి. ఈ యెడారి నరకరూపంలో యెంత లోతుగా దిగబడితే ఆ రోమన్ భూతల స్వర్గరామణీయతకు అంతబలమైన పునాదివేసి ఎంతో యెత్తుగా నిర్మించుకోలేమా అని వారి ఉద్దేశ్యం. ఇది మాత్రం నిజం. వారి భవిష్యజ్జీవితం యేలాగున్నా, ప్రస్తుతం వాళ్ళు జైలరు పని చెయ్యాలి. అత్తరువు, ఆడది, సారాబుడ్డీ సంగతి యెలా వున్నా, బానిసల కాపలామాత్రం లలాటలిఖితమై అక్షరాలా పాటింపబడుతోంది నేడు.

గ్రీక్, అరబిక్ భాషలు కలగాపులగం చేసి మాట్లాడే గమ్మత్తయిన, తమాషా అయిన మనుష్యులు వాళ్లు. గ్రీషియన్లు యీజిప్ట్ నెప్పుడో రెండున్నర శతాబ్దాల వెనుక

జయించేరు. వీళ్లు యీజిప్షియన్లూ కాక, గ్రీషియన్లూ కాక అలెగ్జాండ్రియనులుగా చెలామణీ అవుతున్నారు. దీన్నిబట్టి వాళ్లు దుర్నీతిలో ఆరితేరినవారనీ, మానవద్వేషులనీ తేటతెల్లమౌతోంది. వాళ్ళ సంకరజాతి దానికి ప్రధానకారణం; దైవానికిగాని, దెయ్యానికిగాని భయపడరువాళ్లు. వంకరటింకరగాపోయే వాళ్ళ కామం, తత్సంబంధమైన వాంఛలు తుచ్ఛమైనవీ, నీచమైనవీ కూడాను - కామతృష్ణ తీర్చుకుందుకు వాళ్ళకు లింగభేదం పాటించేపాటి సభ్యత కూడా లేదంటే చాలు వాళ్ళెంత నీచులో తెలియడానికి. మత్తుమందు సేవించి, అటువంటి నీచత్వాన్ని వీళ్లు సేవిస్తారు.

ఆ ప్రాతఃకాలపు చల్లని ఘడియలలో గొలుసులు మోసే బానిసలు ప్రయాసగా పర్వతశ్రేణివైపు పోతూ ఉండేటప్పుడు, స్పార్టకస్ యీ మేస్త్రీనే పరకాయించి చూస్తున్నాడు. వీళ్లు తన యజమానులు. వీళ్ళే తన చావు బ్రతుకులను నిర్ధారణచేసే పెద్దమనుష్యులు. అందుకే వాళ్ళ అలవాట్లూ, ప్రవర్తనా పద్ధతులూ, ఒకరికీ, మరొకరికీ మధ్యగల తేడాలు జాగ్రత్తగా పరిశీలన చెస్తున్నాడు. గనులలో మంచి యజమాని అనేవా డుండడు. కాని యితరచోట్ల యింతకన్న దుర్మార్గులుండకపోవచ్చు. ఒక్కొక్కడుగా విడిపోయి బానిసల నదలిస్తూ, తీసుకుపోతున్న వాళ్ళను మరీ దీక్షగా చూస్తున్నాడు. ఇంకా బాగా పొద్దు తిరగకపోవడంవల్ల వాళ్ళ రకరకాల ముఖకవళికలు, వైఖరులూ స్పష్టంగా కన్పించకపోయినా పరిశీలన బాగా చేతయినవాడు కాబట్టి, వాళ్ళ నడకనుబట్టీ, నిలబడే పద్ధతినిబట్టీ వాళ్ళ మనోగత భావాలను తెలుసుకోగలిగాడు.

చల్లగా వుంది. బానిసలు దిగంబరులుగా ఉన్నారు. పురుషావయవాలను కప్పగల గోచీగుడ్డకూడా వాళ్ళకులేదు. వణుకుతూ, చేతులతో శరీరాన్ని కప్పుకొంటూ అక్కడ నిలబడ్డారు బానిసలు. పేదవాడికోపం పెదవికి చేటు. అల్లాగే బానిసకోపంకూడా. అతని జీవితంలో యేమీ ఉత్పాదనశక్తి, కాదు, నిరుపయోగం, పైగా ప్రమాదం. స్పార్టకస్‌లో, కొద్దికొద్దిగా కోపం అలుముకుంటోంది. "ఏదైనా సహించవచ్చునేమో కాని యేమిటిది? దీన్ని సహించలేం. పురుషావయవమైనా కప్పుకోడానికి గోచిపాత లేనివాడు జంతువా? మనిషా?" అనుకుంటున్నాడు. "కాదు. మనుష్యులం కానేకాదు. జంతువులమూ కాదు. అంతకన్నా హేయమైన యేదో వేరే జాతి. జంతువులకన్న అథమం. రోమన్లు మా దేశాన్ని ఆక్రమించినప్పుడు మేం కష్టపడి పనిచేసే తోటలు హస్తగతం చేసుకున్నప్పుడు, యీ గని పనికని మమ్మల్ని తీసుకొచ్చేరే కాని, జంతువులను తీసుకురాలేదుగా. అవి అక్కడే యథాస్థితిలో ఉంచబడ్డాయి. అందుకే అవి మాకన్న నయం."

ఢంకా శబ్దం ఆగింది. కొరడా విసిరిన కొసగాలుల సంగీతం తప్ప మరింకేమీ వినం. గాలిలో పైకెత్తి ఉంచేరు కొరడాలు. అప్పుడే వాటికి మాంసాన్ని చూపడం ప్రారంభించడం వాళ్ళకూ యిష్టంలేదా అనిపిస్తుంది. ఇప్పుడు ఆకాశం మరింత తేజోవంతమైంది. భూగర్భంలోకి దిగిపోయి పాలరాతి బెల్లుల నూడతీస్తున్న వణికే పిల్లలను చూసేడు స్పార్టకస్. తక్కిన థ్రేషియన్లూ చూసేరు. ఇతని చుట్టూ చేరేరు. అందులో ఒకడితని చెవి ప్రక్కన జేరి గుసగుసలాడేడు.

"నాయనా! నాయనా! యెంతటి నరకమయ్యా యిది?"

"అంతా బాగుపడుతుంది" స్పార్టకస్ సమాధానం చెప్పేడు. తనకన్న వయస్సులో రెండింతలు పెద్దగా ఉన్నవాళ్ళు తనను నాయనా అని ఆప్యాయంగా పిలిచి, ఆదరంగా మాట్లాడినప్పుడు అందులోనూ వాళ్ళను విచారం పట్టి కృంగతీస్తున్నపుడు యేం చెప్తాడతను? అతను చెప్పవలసిన దేదో అదే చెప్పేడు.

అన్ని గ్యాంగులూ పర్వత శ్రేణివైపు పోతాయి పనిలోకి. గుంపులుగా నిలబడ్డ థ్రేషియన్లు, ఆరుగురు మేస్త్రీలుమాత్రం వెనక్కి ఉండిపోతారు. కొరడాలను యిసుకలో యీడుస్తూ క్రొత్తగా వచ్చిన యీ థ్రేషియన్లను సమీపించారు మేస్త్రీలు. వచ్చీరాని ఒక భాషలో మేస్త్రీ ఒకడు వాళ్ళను ప్రశ్నించాడు.

"థ్రేషియన్లూ, మీ నాయకు డెవడు?"

సమాధానంలేదు.

"కొరడా యింకా నిద్రలేవలేదు. ఇంత త్వరగా దాన్ని నిద్రలేపమంటారా?"

స్పార్టకస్ అన్నాడు: "నన్ను వాళ్ళు నాయనా అంటారు."

అతనికేసి మేస్త్రీ యెగాదిగాచూసి

"నాయనా అనిపించుకోడానికి నువ్వింకా కుర్రాడివే"

"అది మా దేశాచారం"

"ఇక్కడ మరికొన్ని ఆచారాలున్నాయి. కుర్రాడు అల్లరిచేస్తే తండ్రిని వాయిస్తాం. నాయనా విన్నారా అంతా?"

"మీ రన్నది వింటున్నాను!"

"థ్రేషియన్లంతా వినాల్సిందే. ఈ ప్రదేశం చెడ్డదే కావచ్చు. మేం తలుచుకుంటే యింతకన్న అధ్వాన్నం అవచ్చు కూడా. మీ బొందిలో ప్రాణ మున్నంతకాలం మిమ్మల్ని పనిచెయ్యమనీ, వినయ విధేయతలు చూపమనీ చెప్తాం మేము. మీరు చస్తే మే మేమీ అడగం. కొన్నిచోట్ల బ్రతకడంకంటె చావడమే నయమనిపిస్తుంది. ఇక్కడ బతకడంకన్న చావడమే మేలనిపించగలం. తెలిసిందా?"

ఊర్ధ్వాభిముఖంగా సూర్యుడు ప్రయాణం చేస్తున్నాడు. మళ్ళీ తాపం రగులోంది. గునపం, పారా, సుత్తీ. సుత్తి పైకెత్తేడు స్పార్టకస్. గంట గంటకూ సుత్తి దెబ్బ బలంగా, మరింత బలంగా, పడుతోంది. ఉపయోగపడే శక్తి ఒక్కొక్క పౌను చొప్పున హెచ్చవుతోంది; అత నెప్పుడూ జీవితంలో యింత కష్టమైన పని యింత ఎక్కువగా యింత యెక్కువసేపు చెయ్యలేదు. పూర్వంకూడా బానిస చాకిరీ చేసిన వాడే. కాని ఈ బానిసత్వం మరింత అధమాధమమైనది. అతని శరీరంలో నరాలు బిర్రబిగిసిపోయాయి. బిగించిన తీగెలులాగున్నాయి; నొప్పితో మూల్గుతున్నాయి. అదొక పద్ధెనిమిది పౌన్ల సుత్తి అని చెప్పడం సులువే. కాని ఆ సుత్తినే యెత్తి చేతులు ముక్కలయేలా పనిచేసినవాడి కష్టాన్ని వర్ణించడానికి మాత్రం యీ అంకెలూ, అక్షరాలూ అక్కరకురావు. నీరు ప్రాణతుల్యమయిన ఈ ప్రదేశంలో అతని శరీరంలోని నీరు చెమటగా పైకి పోతోంది. అతని శరీరంమీద చెమట కాలవలు కట్టింది. చర్మంలో చెలమలుగా ఊరిన చెమట అతని నుదుటిమీద నుంచి కళ్ళల్లోకి ప్రవహిస్తోంది. తన మనోబలమంతా ఉపయోగించి చెమట కారకూడదు అనుకున్నాడు; ఈ శీతోష్ణస్థితిలో యీ యెడారిలో చెమటలు కక్కడమంటే చావే అని అతనికి తెలుసు. కాని చెమట ఆగదు. దాహం, విపరీతమైన దాహం అతనిలో రాక్షసిలా ప్రవేశించింది. పిచ్చెక్కిన క్రూరమృగంలా సంచరిస్తోంది. భయంకరంగా పరిణమించింది దాహం.

నాల్గు గంటలంటే నాలుగు యుగాలు, శాశ్వతకాలం; బ్రహ్మకో యుగం; బ్రహ్మకే ఓ యుగం. బానిసలకన్న తమ వాంఛలను అణుచుకోగల వారులేరు. కాని యీ నాల్గు గంటలు గంటలుకావివి; యుగాలు, నాల్గు యుగాలు. ఒకడి దగ్గరనుండి మరొకడి వద్దకు నీటి సంచులు పోతున్నాయి. గ్యాంగులన్నీ నీటి సంచుల రాకకెదురు చూస్తున్నాయి. స్పార్టకస్‌కు అమితంగా దాహం వేసింది. థ్రేషియన్లందరికీ వేసింది. తోలు సంచులలోని చల్లని ఆకుపచ్చని నీరు ఆహార నాళాలగుండా కడుపులోకి జారింది. ఆ నీటిని అంతా త్రాగేరు. గబగబా త్రాగేసేరు, త్రాగిన పిమ్మట వాళ్ళ తప్పిదం తెలుసుకున్నారు. ఎంతటి ఆలోచన లేనిపని చేసేమా అని బాధపడ్డారు.

ఇవీ న్యూబియా యెడారిలోని బంగారు గనులు. సూర్యుడు నడినెత్తిమీదకు వచ్చినప్పుడు, మంటలవర్షం కురిపిస్తున్నప్పుడు, వడగాడ్పులు వీస్తున్నప్పుడు పని చెయ్యగల శక్తీ, ఆ బలమూ వాళ్ళలో తగ్గిపోతుంది. అప్పుడే వాళ్ళ వీపులమీద కొరడాలు యథేచ్ఛగా స్వేచ్ఛగా విహారం చేస్తాయి. కొరడా ఉపయోగించడంలో ఎంత నైపుణ్యం ఉందో! అది శరీరంలోని యేభాగాన్ని కావాలంటే ఆ భాగానికి యెంత

గమ్మత్తుగా తగులుతుందో! కావాలంటే నెమ్మదిగా స్పృశించగలదు. తేలికగా తగల గలదు. భయపెట్టేలా బాధించగలదు. జాగ్రత్త! ఖబడ్దార్ అని భయపెట్టేలా హెచ్చ రించగలదు. బానిస నుదుటికైనా తగులుతుంది, వీపుమీద మోగుతుంది. నోటిమీద కావాలంటే అక్కడే తగిలి ఊరుకుంటుంది. ఎక్కడ కావాలంటే అక్కడ తగిలేలా చెయ్యగలడు మేస్త్రీ. అది అతని విద్య. మానవుల శరీరాలపై సంగీతాన్నాలాపించి మూర్ఛనలు పోగలది కొరడా. పూర్వంకన్న యిప్పుడే మరింత దాహం యెక్కు వైంది. నీళ్ళు యింతకు పూర్వమే త్రాగేసేరు. కాబట్టి పని పూర్తి అయేవరకూ ఇంక నీరు దొరకదు. అటువంటిరోజే, ఆ రోజులోనే అటువంటి ఘడియలే శాశ్వతమై పోతాయి. ఇంక కాలానికి అంతులేదా అనిపిస్తుంది.

అయినా అది అంతమవుతుంది. ఏదో ఒక కాలంలో ప్రతీదీ ప్రారంభమై, ఏదో మరో కాలంలో అంతమయితీరాలి. తిరిగి ఢంకానాదం వినబడుతుంది. ఆనాటి పని, పని కాదు వెట్టి, ముగుస్తుంది; కాదు. మర్నాటికి వాయిదా పడుతుంది.

సుత్తి కిందకు దించి రక్తం చిందే తన చేతులను చూసుకుంటాడు స్పార్టకస్. కొందరు థ్రేషియన్లు అధిక శ్రమవల్ల కూచున్న వాళ్ళు లేవలేకపోతారు. పద్ధెనిమిదేళ్ళ కుర్రాడొకడు పడుకుని, ఒక పక్క ఒత్తిగిలి, కాళ్ళు పొట్టలోకి ముడుచుకుంటాడు. స్పార్టకస్ అతని వద్దకు వెళ్ళేడు.

"నాయనా!—నాయనా! నువ్వేనా?"

"అవునమ్మ నేనే" అని స్పార్టకస్ అతని నుదుటిపై ముద్దెడతాడు.

"నాయనా! నేను చచ్చిపోతున్నా. చచ్చిపోతాను. నా ఆత్మ ఏమైనా మిగిలి వుంటే అది నీ కీయదలుచుకున్నా, నా పెదవిమీద ఒక్క ముద్దెట్టు."

అతని పెదవులమీద స్పార్టకస్ ముద్దెడతాడు. ఏడవడానికి కన్నీళ్ళు చాలవు; ఎండిన మోడుల్లాటి మనుష్యులు వాళ్ళు.

# 4

ఆ నల్లరాతి కొండల్లో, మండుటెండల్లో, పనిచేసే దిగంబరుడు స్పార్టకస్ గురించి, యితర థ్రేషియన్ల గురించి తన కథనాన్ని ముగించాడు బేటియాటస్. చెప్ప డానికి చాలాసేపే పట్టింది. వర్షం కురవడం తగ్గింది. ఆకాశం కింద అంతటా అగాధ మైన చీకట్లు అలుముకున్నాయి. పిల్లలకు శిక్షణ గరిపే బేటియాటస్, ఉన్నత కుటుం బంలోపుట్టి, త్వరలో ప్రపంచమంతటికీ ధనాఢ్యుడు కాబోయే అదృష్టవంతుడు. క్రాసస్

దీపకాంతిలో కూచున్నాడు. దీపం మిణుకుమిణుకు మంటోంది. బేటియాటస్ బాగా త్రాగి మత్కెక్కి ఉన్నాడు. అతని ముఖంలో వేలాడే కండలు మరింతవదులై ఇంకా బాగా వేలాడుతున్నాయి. అతనికి తనంటేనే విపరీతమైన జాలి; తనయందు తనకే సానుభూతి; అతను చెప్పే విషయంలో అతనే బాగా లీనమైపోయేడు. విచిత్రమైన స్వభావం కల్గిన దుఃఖితస్వభావుడు, ఆ బంగారం గనులను గూర్చిన ఉదంతం యెంతో శక్తివంతంగా, విపులంగా, కరుణారసప్రపూరితంగా చెప్పబట్టే క్రాసస్ తనకు తెలియకుండానే ఆ కథ విని జాలిపడ్డాడు.

క్రాసస్ అజ్ఞానికాడు; అమాయకుడు కాడు. ప్రొమీథియస్ గురించి ఏశ్చిలస్ వ్రాసిన మహత్తరగాథ నతడు చదివినవాడే. ఎవరూ యెదిర్చి పోరశక్యం కాని స్పార్టకస్‌పై రోమ్‌యొక్క సమీకృత శక్తి తాలూకు ప్రభావం యెల్లా ఉంటుందో, యెంతమటుకు ఉంటుందో తెలుసుకున్నవాడే. ఈ బానిస లజేయులా? స్పార్టకస్‌ను యింకా అర్థం చేసుకోవాలన్న వాంఛ అతనిలో ప్రగాఢమైంది. అది మరింత పెద్దదైంది. వీలయితే, యెంత అసాధ్యమైనాసరే, స్పార్టకస్‌యొక్క హృదయంలోకి ప్రవేశించి తను చిక్కుకున్న చిక్కుప్రశ్నలకు సమాధానం వెతుకుదా మనిపించిందతనికి. ఈ వర్గపు ప్రజల వాంఛ లేవి? ఏ నాటికీ తీరని, యీ వర్గ ప్రజల వాంఛల చిక్కుప్రశ్నల నెలా అర్థంచేసుకోడం? అందని ఆకాశాలలో వెలుగుతూ, అంతలోనే ఆరుతూ, వెలుగుతూ, ఆరుతూ కవ్వించే తారకలను, ఊరించే తారకలను తాకేందుకు, అందుకొనేందుకు గొలుసులతో బంధించిన హస్తాలను చాచిన యీ బానిసల ప్రయత్నాలేమిటి? ఇవి తెలుసుకోవాలని, తెలుసుకుని కార్యనిర్ణయం చేసుకోవాలని అతనికుంది. బేటియాటస్‌ను క్రీగంట చూసేడు. చూసి యీ అతికాయుడికి యిన్ని విషయాలు చెప్పినందుకుగాను తను కృతజ్ఞుడై ఉండాలన్న విషయం గ్రహించాడు. తనవద్ద నున్న యే స్త్రీ యితని పొందు కూడటానికి యిష్టపడుతుందా అని ఆశ్చర్యపోయాడు. ప్రతి చిన్న విషయం బాగా ఆలోచించి క్రాసస్‌కు, ఇటువంటి విషయాలలో యేవో మరికొన్ని యిదమిద్ధమైన ఉద్దేశాలతో ప్రయత్నపూర్వకంగా కాముకవ్యాపారం కొనసాగించే క్రాసస్‌కు యే స్త్రీని బడితే ఆ స్త్రీనే ఇట్టే వాంఛించగల బేటియాటస్‌యొక్క గుడ్డి కామం మరింత ఆశ్చర్యకరంగా కనబడింది.

"అయితే స్పార్టకస్ అటువంటి చోటునుంచి యెలా పారిపోగలిగేడు?" అని అడిగేడు.

"అతను పారిపోలేదు. అస లెవరూ అక్కడనుంచి పారిపోలేరు. అల్లాంటి *ప్రదేశాలలోని సుగుణమేమిటంటే అక్కడ జీవించడానికి అలవాటుపడిన యే మనిషీ,*

మరే యితర మానవ సమాజంలోనూ జీవించటానికి ఇష్టపడడు. నేనే అక్కడినుంచి యీ స్పార్టకస్‌ను లాక్కొచ్చాను."

"అక్కడనుంచా? ఎందుకు? అతనక్కడ వున్నాడనీ, స్పార్టకస్ అతనేననీ మీ కెలా తెలుసు?"

"నా కేమీ ముందుగా తెలియదు. మల్లుల విషయంలో నాకున్న పేరంతా ఓ కల్పితగాథ కింద జమ కట్టేస్తారు లాగుంది. ఓడంత శరీరముండి, దమ్మిడీకి మారని వాడినని మీ ఉద్దేశమేమో; నా పనిలో కూడా ఒక కళ వుంది; నే చెప్తాను."

"నేను మిమ్మల్ని నమ్ముతున్నాను. మీరు స్పార్టకస్‌ను యెల్లా కొన్నారో చెప్పండి."

"సైన్యంలో సారా నిషేధించారా? చెప్పండి" ఖాళీసారాబుడ్డి పైకెత్తి చూపిస్తూ బేటియాటస్ అడిగేడు. "మీరు నాకు సమర్పించిన అవమానాలకు తోడు నన్నో త్రాగుబోతును చేసిపంపుతారా? లేక యీ వెధవ నాలికకు కళ్ళెంవేసుకుని కూచున్నాడు కాబట్టి యీ కళ్ళెం విప్పి వీడిచేత వాగించాలని సారా పోస్తున్నారా?"

"మీకోసం యింకా సారా తెస్తా" అని క్రాసస్ లేచివెళ్ళి, తన పడక గదిలోంచి ఒక సీసా పట్టుకొచ్చాడు. బేటియాటస్ అతనికి సమాన హోదాలో ఉన్నాడు. కాబట్టి మూతతీయడం కార్యక్రమం పెంచక సీసా మూతిని మేజా కాలికేసి కొట్టి, గ్లాసు నిండి పొర్లేవరకూ సారా దాన్లో పోసుకున్నాడు.

"నెత్తురూ, సారా" అతను నవ్వేడు. "నేను మరోలా పుట్టి ఒక దళానికి నాయకత్వం వహిస్తే బాగుండును. ఎవ డెఱుగును? మీకు మల్లయుద్ధాలు చూడాలని ఆసక్తి వుండొచ్చును. అవంటే విసుగెత్తిపోయాను నేను."

"నేనూ చాలినంత పోరాటం చూసినవాడినే."

"అయితే అవచ్చు. పెద్దయెత్తున మారణహోమం చేసే మీ పద్ధతికి భిన్నమయిన ధైర్యసాహసాలు మల్లయుద్ధంలో ప్రదర్శింపబడుతుంటాయి. స్పార్టకస్ చేతిలో మూడువంతులవరకు నాశనం కావింపబడిన సైన్యాన్ని మీ కిచ్చి స్పార్టకస్‌ని చితగ్గొట్టి, రోమను సంపదను, యశస్సును తిరిగి సంపాదించుకు రమ్మన్నారు మిమ్మల్ని. అప్పుడు ఇటలీ మీ చేతుల్లో ఉందంటారా? నిజం చెప్పాలంటే ఇటలీ స్పార్టకస్ చేతిలో వుంది. మీ రతన్ని ఓడించి ఉండవచ్చు. అవును ఓడించవచ్చు. రోమ్‌ను వ్యతిరేకించి యేశక్తీ మనలేదు. ఆ క్షణంలో అతనిదే పైచెయ్యి; అవునా?"

"అవును" అన్నాడు క్రాసస్.

“స్పార్టకస్‌కు శిక్షణ గరపిం దెవరు? నేను. అత నెప్పుడూ రోమ్‌లో పోరాడ లేదే. చూడదగ్గ పోరాటాలు రోమ్‌లో జరగలేదు. రోమ్‌కు కావలసిందల్లా వధ్యశాల. నిజమైన గొప్పయుద్ధాలు కేపువాలో జరిగేయి. సిసిలీలో జరిగేయి. ఆమాట కొస్తే మీ సైనికదళాలు యుద్ధమే చెయ్యనేలేవు. ఉక్కు, తోలు, డాలు, కప్పుకొని పొడుగాటి కర్రలాంటి ఈటెలతో పొడుచుకుంటారు మీరు. కత్తి చేతబట్టి దిగంబరంగా రంగ స్థలంలోకి వెళ్ళి,యిసుకపైబడి మెరిసే నెత్తుట్ని వాసన చూడండి. నగారా మోగుతూ, కాహళులు కూస్తూ సూర్యుడు ప్రకాశిస్తూ స్త్రీలు చేతిరుమాళ్లు విసురుతూ హుషారు నిస్తూ, తన దిగంబరమైన శరీరం నుండి, అవయవాల నుండి దృష్టి మరల్చక చూస్తుంటే, శరీరంలోని కండలు, తదితర భాగాలు ముక్కలుగా కోయబడి కంట బడ్డప్పుడు తన రక్తం తన పాదాలపైనే పడ్డప్పుడు, నరాలు భూమిమీద మెలికలు తిరిగి పడివుండి, గట్టిగా బాధతో అరిస్తే, ఆవేశంతో నిండితే అటువంటిదాన్నే యుద్ధం అంటా న్నేను. దానికి మామూలు మనుష్యులు పనికిరారు. మరోలాటి మను ష్యులు కావాలి. వా ళ్ళెక్కడ దొరుకుతారు? డబ్బు సంపాదించాలంటే, డబ్బు ఖర్చు చేసే స్వభావం నాది. అందుకు నా యేజంట్లను అన్ని చోట్లకీ పంపుతాను. ఎక్కడ బలహీనులు త్వరగా చస్తారో, ఎక్కడ పిరికిపందలు ఒండొరుల హత్య చేసుకుంటారో అక్కడికే పంపుతాను. రెండేళ్ళ కోమారు న్యూబియా యెడారికి పంపుతాను. ఒక మాటు నేనే స్వయంగా వెళ్ళి ప్రత్యక్షంగా చూసేను. చాలుబాబూ, ఆ ఒక్కమాటే చాలు. గనిపని చెయ్యడానికి బానిసలు కావాలి. వాళ్ళలో కొందరు మహాఅయితే రెండేళ్లు పని చెయ్యగలరు. కొంద రారునెలల్లోనే యెందుకూ పనికిరాకుండాపోతారు. లాభించే పద్ధతి ఏమంటే త్వరత్వరగా పూర్వంనించీ పనిచేస్తున్న బానిసలను తొల గించాలి. కొత్తవాళ్ళను వారిస్థానే నియమించాలి. ఇది తెలిసిన బానిసలు నిరాశచేత అన్నిటికీ తెగిస్తారు. ఆ తెగింపో అంటుజాడ్యం; అంతా తెగిస్తే మనతాడు తెగిందన్న మాటే; చెప్తే వినక, కొరడాకి లొంగక, ఇతరులకు కూడా చెప్పి వాళ్ళనూ, తనలాగే తయారుచేయగల బానిసను చంపి యెండలో కొర్రువెయ్యాలేగాని, అటువంటివాడు యెందుకూ పనికిరాడు. వా డన్నిటికీ తెగించే ఉంటాడు. వా డ్నల్లాచేస్తే తక్కిన వాళ్లు చూసి బుద్ధి తెచ్చుకోవచ్చు; కాని అటువంటి పనివల్ల యెవరికీ లాభం వుండదు సరికదా డబ్బుదండుగ; అందుకని నే నో చిన్న యేర్పాటు చేసేను. అల్లా పనిచెయ్య కుండా మొండికెత్తిన బానిసలను నాకు అమ్మమని మేస్త్రీతో చెప్పేను. మేస్త్రీ కూడా యింతడబ్బు చేసుకోగలడు, ఎవరికీ నష్టముండదు. అల్లా కొన్నవాళ్ళే మంచి మల్లు లవగలరు; అయారు కూడా.”

"ఈ స్పార్టకస్‌ని అల్లాగే కొన్నారా?"

"సరిగ్గా అలాగే. స్పార్టకస్‌ను, గేన్నికస్ అనే మరో థ్రేషియన్‌నూ, నేనల్లాగే కొన్నాను. ఆ రోజుల్లో థ్రేషియన్లకు బాకు యుద్ధం బాగా చెయ్యగలరనే పేరుండేది చూసేరా? మొదటి సంవత్సరం బాకు, రెండో యేడు పొట్టికత్తి, మూడో యేడు నిడుపైన ఖడ్గం. నిజానికి థ్రేషియన్లెప్పుడూ బాకు ముట్టనేలేదు. కాని పేరల్లా వుండేది; ప్రజలల్లా అనుకునేవారు. ఆడాళ్ళో? బాకు యుద్ధాలు వాళ్లు చేస్తేతప్ప చూసేవారేకాదు."

"అతన్ని మీరు స్వయంగావెళ్ళి కొన్నారా?"

"నా యేజంట్లద్వారా కొన్నాను. గొలుసులతో కట్టి వాళ్ళిద్దరినీ అలెగ్జాండ్రియా నుండి ఓడమీద పంపేరు. నేపుల్సులోని మా ఓడరేవు ఏజంటు వాళ్ళనిక్కడికి డోలీల మీద తీసుకొచ్చాడు."

"అయితే మీ దేం చిన్న వర్తకం కాదు." లాభసాటిగా యేదైనా జరుగుతున్నట్లు తోస్తే, క్రాసస్ మరింత జాగ్రత్తగా చూస్తాడు. అతని వర్తకం పెద్దదే అన్న విషయం అంగీకరించాడు.

"అయితే మీకు నచ్చిందన్న మాట. అల్లా కొద్దిమంది మెచ్చుకోగలరు. ఇంతకీ కేపువాలో నా పెట్టుబడి యేమాత్రం ఉంటుందంటారు?" సారా చుక్కలు కారుతున్న నోటితో బేటియాటస్ అడిగేడు.

తెలియదన్నట్లు తల ఊపి, క్రాసస్ "నా కది యెప్పుడూ తట్టలేదు. మల్లులను చూడొచ్చు. వాళ్ళ యుద్ధమూ చూడొచ్చు; కాని దానికయ్యే ఖర్చెంత అనే ఆలోచన సామాన్యంగా యెవరికీ రాదు. అన్ని విషయాల్లోనూ అంతే. ఒక దళాన్ని చూసి ప్రజలు యింతకుపూర్వమూ దళాలుండేవి; ఇకముందూ ఉంటాయి అంటారేకాని మరేమీ అనరే" అన్నాడు.

ఇది బ్రహ్మాండమైన ముఖస్తుతి, బేటియాటస్ గ్లాసుకింద పెట్టి బొర్రముక్కు మీద వేలుతో రాస్తూ "ఊహించండి" అన్నాడు.

"పది లక్షలా?"

"యాభై లక్షల దీనారాలు" నెమ్మదిగా బరువుగా అన్నాడా మాటలు. "యాభై లక్షల దీనారాలు, మీరే చూడండి. అయిదు దేశాల్లో నాకు యేజంట్లున్నారు. నేపుల్సు రేవులో ఒక ఏజంటు. మేపినప్పుడు మంచి ఖరీదైన తిండే మేపుతాం. గోధుమ, బార్లీ, గొడ్డుమాంసం, మేక వెన్న; ఇద్దరేసి పోట్లాడే రంగస్థలాలూ ఉన్నాయి. కాని రాతితో కట్టిన రంగభూమి ఉందే, అదే పదిలక్షలు చేస్తుంది. ఆ ఊళ్లో ఉండే ఒక సైనిక దళాన్ని పూర్తిగా మేపుతున్నాను. వాళ్ళకు బస యేర్పాటు చేసేను.

ఇంక లంచాలసంగతి వేరే చెప్పాలా - మీరేం అనుకోరనీ, క్షమిస్తారనీ తెలిసి చెప్తున్నాను. అందరు సైనికోద్యోగులూ మీలాంటివారు కాదుగా, వీళ్ళచేత రోమ్‌లో పోరాడిస్తే ట్రిబ్యూన్‌కీ, వార్డురాజకీయవేత్తలకీ యాభై వేల దీనారాలు చాలవు కదా, ఆడాళ్ళ గురించి అల్లా ఉండనివ్వండి."

"ఆడవాళ్ళా?" ఏమిటన్నట్లడిగేడు క్రాసస్.

"మల్లుడంటే మామూలు బానిస కాడని ముందే సెలవిచ్చాను. అతని నరాలు ఉత్సాహంగా పని చెయ్యాలంటే అతనికో ఆడది అవసరం. అప్పుడే బాగా తిని, బాగా పోట్లాడగలడు. ముసలిడొక్కులిన్నీ, యెందుకూ పనికిరాని వాళ్ళనూ కొనను. నేను కొన్నవాళ్ళంతా పిక్కల్లాంటి గుంటలు. బలంగా ఆరోగ్యంగా ఉండే యిరవై యేళ్ళలోపు ఆడపిల్లలు. నా కన్నీ తెలుసు. నేనే స్వయంగా అన్నిరకాల పరీక్ష చెయ్యగలను." అతను గ్లాసు ఖాళీచేసి పెదిమలు చప్పరిస్తూ, సారాగ్లాసు తిరిగి నింపుతూ "నాకు ఆడవాళ్ళు కావాలి. కొందరికి అక్కర్లేకపోవచ్చు, నాకు కావాలి" అన్నాడు, మెల్లిగా జాగ్రత్తగా.

"స్పార్టకస్ భార్య అంటారే ఆమెవరు?"

"వరీనియా" అన్నాడు బేటియాటస్. తనలో తనే యేదో ఆలోచిస్తున్నాడు. అంతర్ముఖుడయ్యాడు; అతని కళ్ళలో యీర్ష్య, కోపం, కామం ముల్లోకాలుగా గోచరించాయి. "వరీనియా" తిరిగి అన్నాడు.

"ఆమెను గురించి చెప్పండి."

కొంచెం ఆగి ఆలోచించాడు. అదే చెప్తోంది, యితను చెప్పనక్కర్లేకుండానే.

"నేను దాన్ని కొన్నప్పుడు దాని వయస్సు పందొమ్మిదేళ్లు; జర్మను ముండ. బంగారపు జుట్టూ, నీలంకళ్ళూ మీకు యిష్టమయితే అది బాగా నచ్చి తీరుతుంది - ఛండాలపు ముండలెండి, చంపేసేవాడినే, అల్లాగెందుకని మొగాడి ముఖం కిట్టని దీన్ని ఆడది అనవసరమనుకొనే స్పార్టకస్‌కి తగిలించి పారేశా. ఎల్లాగుందంటారు గమ్మత్తు."

"ఆమెను గురించి చెప్పేరు కారు!"

"చెప్పేనే" బేటియాటస్ కొంచెం దురుసుగా అన్నాడు. తెరలుదాటి బైటికి వెళ్ళేడు. అక్కడే, దగ్గలగా మూత్ర విసర్జనచేస్తూన్న చప్పుడు విన్నాడు క్రాసస్. ఇటువంటి అసభ్యమైన వాటికికూడా కోపం తెచ్చుకోక, తనపని దృష్టిలో ఉంచుకోడం క్రాసస్ సుగుణమనే చెప్పాలి. బేటియాటస్, దొర్లుకుంటూ తిరిగివచ్చాడు. అతని నడకే అంత; వణిక్ప్రముఖుడ్ని పెద్దమనిషిగా తయారుచెయ్యడం క్రాసస్ పనికాదు.

"ఆమెను గురించి చెబుదురూ" క్రాసస్ పట్టు విడువలేదు.

ప్రయత్నపూర్వకంగా తన బరువైన తల నూపుతూ "నేను త్రాగడం మీ కిష్టం వుండదా?" అని అడిగేడు బేటియాటస్ దెబ్బతిన్న హుందాతో.

"నాకు దాన్నిగురించి యోచనలేదు. తాగితే తాగండి. మీరు గేన్నికస్‌ను, స్పార్టకస్‌ను యిక్కడకు డోలీలపై రప్పించామన్నారు. గొలుసులు తగిలించే అనుకుంటా" క్రాసస్ అన్నాడు.

అంగీకారసూచకంగా ఊగింది బేటియాటస్ తల.

"అయితే అత న్నింతకిపూర్వం మీరెప్పుడూ చూడలేదన్నమాట?"

"అబ్బే, ఐనా నేం చూసేనో లేదో మీకేం తెలుసు. నేను మనుష్యుల్ని అందరిలాగా చూడను. ఆ యిద్దరూ పెద్ద గడ్డాలతో, రసికారే పుళ్ళతో ఆపాదమస్తకం కొరడా దెబ్బలతో, నే చూసేటప్పటికి పరమ అసహ్యంగా ఉన్నారు. వాళ్ళదగ్గరకు వెళ్తే కడుపులో తిప్పేసేటంత దుర్వాసన వచ్చింది. వాళ్ళు విసర్జించినది వాళ్ళ ఒంటిమీదే యెండి అంటుకుని వుంది. పైతొక్క ఒలిచేసినట్లున్న వాళ్ళకళ్ళే వాళ్ళలోని తెగింపును, సాహసాన్ని ప్రతిబింబించాయి. మరొకళ్ళయితే మా పాకీదొడ్లుకూడా తుడవడానికి మీరు పనికిరారు పొండి అందురు. కాని నాకు తెలుసు వాళ్ళ శక్తి. అది నా కళ. స్నానం చేయించి, క్షురకర్మ చేయించి, నూనె బాగా మర్దన చేయించి, బాగా తిండిపెట్టించి, వాళ్ళను—"

"ఇంక వరీనియా గురించి చెప్తారా?"

"చంపేసేరు."

సారా గ్లాసును అందుకోబోయాడు బేటియాటస్. ఆ ప్రయత్నంలో దాన్ని తల్లక్రిందులు చేసేసేడు. తలను టేబిలుమీద ఆన్చి, ఆ యెర్రని సారాచుక్కలు చూస్తూ ఉండిపోయాడు. అక్కడ ఆ యెర్రని మచ్చలలో యితని కేం కనబడిందో, యితనేం చూసేడో యెవరెరుగుదురు? గతా న్నవలోకించి ఉండొొచ్చు, భవిష్యత్తునూ చూసి ఉండొొచ్చు. సోదె చెప్పే పద్ధతి అంతా కల్లాకపటం కాదు: ఎందు కంటారేమో, అసలు మనుష్యులకే తప్ప మృగాలకి తాము చేసిన పనులయొక్క ఫలితాల నూహించుకోగల శక్తి లేదు కదా! ఇతను స్పార్టకస్‌కు శిక్షణ యిచ్చినవాడు. భవిష్యత్తనేదేదో పెద్ద బ్రహ్మాండమైన అల్లిక. దానికి మొదలేదో, తుదియేదో ఆ అల్లికలోనే తనో దారమైపోయాడు, ఒక పోగైపోయాడు. రాబోయే యెన్ని యుగాలకు, కాలాలకు స్పార్టకస్‌ను తయారుచేసిన వాడిగా అతని పేరు చెప్పుకుంటారో? అతని పేరు చిరస్థాయిగా మానవజాతి స్మృతిపథంలో మెదులుతుందో? స్పార్టకస్‌ను తయారుచేసిన

మనిషి ఆ స్పార్టకస్‌నే నాశనంచేయ సమకట్టిన వ్యక్తి కెదురుగా కూచొని ఉన్నాడు. శకునాలనుబట్టి సోదె చెప్పుకొనే కళలో చూస్తే స్పార్టకస్‌ను సర్వనాశనం చెయ్యగల మనే ధైర్యం వాళ్ళిద్దరికీ కలగలేదు. సంభ్రమం చెందేరు. ఈ సంభ్రమమే రవ్వంత, యీ అధైర్యమే కాస్తంత వాళ్ళిద్దరిలోనూ ఉండబట్టే యిద్దరూ అర్థం కాక చస్తున్నారు.

# 5

(మహాకాయుడైన నీ స్నేహితుడు లెంటులుస్ బేటియాటస్ అంటూ క్రాసస్ సేనాని చెప్పుకుపోతుంటే, అతని ప్రక్కనే పడుకున్న కుర్రాడు కైయస్ క్రాసస్ కునికిపాట్లుపడుతూ కథలోని కొన్ని భాగాలు మాత్రమే వింటున్నాడు. క్రాసస్ పెద్ద కథకుడు కాడు. ఆ కథ అతని మనస్సులోనే, స్మృతిపథంలోనే భయం రూపంలో, ఆలోచనలమాదిరిగా మిగిలిపోయింది. బానిసయుద్ధమూ అయింది. స్పార్టకస్ పనీ అయింది. ఏ రోమన్ శాంతి ప్రపంచానికి వరప్రసాదంలాటిదో అటువంటి శాంతి, సౌభాగ్యాలకు ఆటపట్టయి ఉంది సలేరియాభవనం. అత నాభవనంలో, ఒక గదిలో, ఒక యువకుడి పక్క పడుకున్నాడు, తప్పేముంది? ఎందుకు పడుకోకూడదు? ఎంతోమంది చేస్తారే యిల్లా, తను చేస్తే తప్పేమిటి? అనుకున్నా డా తప్పు చేసే మనిషి.

(పూర్తిగా నిద్రపట్టని కైయస్ క్రాసస్ రాజవీధి నలంకరించి ఉన్న శిలువలను గురించి యోచిస్తున్నాడు. ఒక పెద్ద రోమనుసేనాని తన లైంగిక అవసరాలకోసం తన నుపయోగించుకున్నందు కత నేమీ అహస్యు చెందలేదు. ఇటువంటి నీచమైన కామ ప్రవృత్తివల్ల చేసిన పాపాలకు ఉపశమనం యేదైనా చేద్దామనే భావం ఆ తరంవాళ్ళకు కలగనేలేదు. అది మామూలు విషయమే అనిపించిం దతనికి. సేనానికన్న కైయస్ యెక్కువ సంతృప్తిచెందాడు. సేనాని అయిన క్రాసస్ దుష్టశక్తుల్ని ప్రత్యక్షంగా ప్రతిఘటించవలసి వచ్చింది. ఉన్నత కుటుంబంలో పుట్టిన యువకుడైన క్రాసస్ మాత్రం అటువంటి శక్తులను వేటినీ ప్రతిఘటింప నవసరం లేకపోయింది.

(చచ్చిన స్పార్టకస్ అతన్ని భయపెట్టిన మాట వాస్తవం. మృతుడైన బానిసను తనసహ్యించుకున్నాడు. కాని కళ్ళుతెరిచి నీడలోవున్న క్రాసస్ ముఖం చూసినప్పుడు మాత్రం అతని కా అసహ్యం యెందుకో అర్థంకాక తికమక చెందేడు.

("నువ్వు నిద్రపోవడంలేదు" అన్నాడు క్రాసస్. "నువ్వసలు నిద్రపోవడమే లేదు. ఏది యెల్లా ఉన్నాకాని ఒక్క విషయం మాత్రం ఉంది — నీ కది యేమైనా

తెలిస్తే చచ్చి యెక్కడికోపోయిన ఆ స్పార్టకస్ అంటే నీకంత అసహ్యం యెందుకు?''

కైయస్ క్రాసస్ అతని ఆలోచనలో అతను మునిగి ఉన్నాడు. నాలుగేళ్ళ క్రితం జరిగిన సంఘటన. బ్రాకస్ అతని మిత్రుడు; అతనితో కలిసి ఏపియన్ మార్గాన కేపువాకు ప్రయాణంకట్టేడు కైయస్. బ్రాకస్ అతన్ని సంతోష పెట్టాలను కున్నాడు. వీలైనంత ఎక్కువగా, బ్రహ్మాండంగా, అధికంగా, సంతోషపరచా లను కున్నాడు. మెత్తని దిండ్లమీద, సోఫాలో తన శిష్యుడైన వాని ప్రక్క కూచుని మల్ల యుద్ధాలు చూడ్డంకన్న బాగుండే దేముం దీ ప్రపంచంలో. ఇప్పటికి సరిగ్గా నాలుగేండ్ల క్రితం, తను సలేరియా భవనంలో గడుపుతున్న యీ నాటికిసరిగ్గా నాలుగేండ్ల క్రితం యితన్ని పొగిడి, కుషామతు చేసి, యెంతడబ్బు ఖర్చయినా సరే కేపువాలో మల్ల యుద్ధం చూపిస్తానని మాటయిచ్చిన బ్రాకస్‌తో, ఒకే పల్లకీలో యిదే మార్గంలో ప్రయాణం చేసేడు కైయస్. ఇసకమీద రక్తం చిందుతుంది. వెచ్చనీ, యెర్రనీ చిక్కని రక్తం; దాన్ని చూస్తూ ద్రాక్షాసారాను సేవిస్తూ ఆనందిద్దామని మిత్రద్వయం అనుకున్నారు.

(ఇటలీలో ప్రధానమైన పెద్ద మల్లయుద్ధశిక్షణ కేంద్రాన్నీ, ప్రదర్శనశాలనూ, రంగస్థలాలనూ కట్టించిన లెంటులుస్ బేటియాటస్‌తో అతనికప్పుడే పరిచయమయింది.

(ఇదంతా నాలుగేండ్లక్రితం అనుకున్నాడు కైయస్, బానిసయుద్ధానికి పూర్వం, అసలీ స్పార్టకస్ పేరు యెవరికీ తెలియనిక్రితం. కాని యిప్పుడో బ్రాకస్ చచ్చి స్వర్గాన ఉన్నాడు. స్పార్టకస్ నశించాడు. తను గొప్ప రోమను సేనాని కామతృష్ణ తీర్చుతున్నాడు.)

## మూడవ భాగం: సలేరియా భవనానికి వాళ్ళు వచ్చిన నాటికి సరిగ్గా నాలుగు సంవత్సరాల క్రితం మేరియస్ బ్రాకస్‌తో కలిసి కైయస్ క్రాసస్ కేపువాకు చేసిన ప్రథమ ప్రయాణం, దాని వివరాలు. అక్కడ యిద్దరు మల్లుల పోరాటాన్ని వాళ్ళు తిలకించిన ఘట్టం.

---

చక్కని వసంతకాలంలో ఒక మనోహరమైన రోజు. అటువంటి రోజున సుష్టుగా భుజించి భోజనంవల్ల మరింతగా పెద్దదిగా కనబడే బొజ్జ నిమురుకుంటూ, మధ్య మధ్య త్రేన్చుతూ, తన ఆఫీసు గదిలో కూచున్న లెంటులస్ బేటియాటస్‌తో అతని గ్రీకు గుమాస్తా వచ్చి యెవరో ఇద్దరు రోమన్ యువకులు యేవో జంటల్ని గురించీ, పోరాట ప్రదర్శనల గురించీ అడుగుతున్నారనీ, వాళ్ళతనికోసం బయట వేచివున్నారనీ చెప్పేడు.

ఆ ఆఫీసు, ఆ గుమాస్తా, యింకా తదితర సరంజామా బేటియాటస్ సిరి సంపదల్ని, భోగభాగ్యాల్ని వెల్లడి చేస్తున్నాయ్. వార్డు రాజకీయరంగం ప్రవేశించి, వాటిని అనుభవంద్వారా గ్రహించి, నేర్చుకొని రోడ్లమీద రాజకీయ సంబంధమైన గూండాచర్యలు, రౌడీ చర్యలు జరిపించి, కొట్లాటలు నడిపించి, నేర్పుతో తెలివి తేటలతో ఒక్కొక్క ఉన్నత కుటుంబంతోపే పరిచయం, తరువాత సంబంధం యేర్పరచుకుని, ఎంతో నిర్మాణాత్మక కృషితో మంచి సమర్ధతగల గూండాముఠాలను నిర్మించుకుని, వాటికోసం అవసరమైనంత ధనాన్ని వెనుకాడక ఖర్చుబెట్టి, అనేక చిల్లర మల్లరవేషాలు వేసి కూడబెట్టిన డబ్బును మొట్టమొదట ఒక మల్లుల శిక్షణకేంద్రంలో పెట్టుబడి పెట్టడమనేదే అతను చేసిన మహా తెలివైన పని. దాంతో అతనికి సుడి తిరిగింది. అదృష్టం చల్లనిచూపు చూసింది. అత నందరితోనూ అనేవాడు భవిష్యత్తనే తరంగంమీద తను అదృష్టంలోకి స్వారీ చేసుకుపోతున్నానని. ఇల్లా చెప్పడం, అందులోనూ యిదే చెప్పడం అతనికి చెడ్డసరదా. అతను చెప్పినట్టే అత నెప్పుడూ ఆ కెరటం వీపుమీదే కూచుని యెక్క డెక్కడికో యెగిరిపోయేవాడు. బేటియాటస్ నడిపిన గ్యాంగుల కన్న బలమైనవి, శక్తివంతమైనవి కూడా రోమన్ రాజకీయ చరిత్రనుండి తుడిచిపెట్టుకు పోయాయి. పోయినప్పుడు వాటిమీదే ఆధారపడ్డప్పుడు అనుకున్నంతగా

బాగుపడడం, జీవితకాలంలో సుసాధ్యం కాదుకదూ? ఒక్కొక్కప్పుడు అనుకోకుండా శత్రువు ఎన్నికల్లో గెలిచాడంటే పూర్వం అధికారంలో ఉన్న ముఠాలన్నిటికీ చావే. వాడికున్న కసి అంతా తీర్చుకుంటాడు. ఇన్ని చిక్కులున్నాయి.

కనుకనే యితర మార్గాలన్వేషించి బాగుపడాలన్న బేటియాటస్ యితర మార్గాల కోసం యిటూ అటూ యింకా చూసేదో లేదో తకీమని అతని దృష్టి ఈ మల్లయుద్ధాల మీద పడింది. అతని కీ జెట్టీల ద్వంద్వయుద్ధాలు బాగా లాభించేవిగా కన్పించేయి. వాటికి పెట్టుబడి పెట్టడానికి తగిన అర్హతలన్నీ ఉన్నాయని భావించాడతను. పైగా అవి చట్ట సమ్మతమని గుర్తింపబడ్డవికూడా. ఇంతగా పరిశీలించి ఈ మార్గాన్నే యెంచుకున్నాడు బేటియాటస్. అసలు ప్రతికాలంలోనూ, కాలం కొన్నికొన్ని కాలమాన పరిస్థితులను ఏర్పరచుకుంటూ ఉంటుంది. అవేమిటో తెలుసుకోగల వాళ్ళకి ఈ క్రొత్తరకం, అంటే యీ మల్లయుద్ధ ప్రదర్శనలు యింకా బాల్యదశలోనే ఉన్నట్లు సులభంగా తెలిసి పోయింది. అసలు మొదట్లో యథాలాపంగా యేర్పాటు చేసిన వినోదం చివరకి రోమన్ సమాజానికి గంగవెర్రు లెత్తించింది. చరిత్ర సృష్టించింది. ఇతర దేశాలేవీ యెంతగా గింజుకున్నా దురాక్రమణచేసినా, సహించి యుద్ధానికి రాకపోయినప్పుడు, అంటే యుద్ధంచేసే అవకాశం కలగనప్పుడు దాని సూక్ష్మస్వరూపాన్నొకదాన్ని తమదేశంలోనే సృష్టించి, ఆనందించవచ్చునన్న సంగతి రోమను రాజకీయవేత్తలుకూడా గుర్తించారు. వందలకొలదీ మల్లుల జంటలు రోజుల తరబడి, వారాలపైబడి అదేపనిగా యెడతెరిపి లేకుండా ప్రదర్శన లివ్వడం మామూలైపోయింది. శిక్షణ పొందిన మల్లులకు గిరాకీ హెచ్చింది. వాళ్ళకోసం ప్రజల్లో ఒక తహతహ బయలుదేరింది. ఎంత తహ తహ పుట్టుకొస్తే అంతగానూ వస్తువుధర పెరుగుతుంది. కావలసినంతమంది మల్లులు తయారుగా లేనందున వున్న కాస్తమందికీ ధర పెరిగింది; ధరలు చుక్కలనంటేయి. రాతి రంగస్థలాలు ఊరూరా బయల్దేరుతున్నాయి. ఇటలీ కంతటికీ అసమానమైనదీ, అద్వితీయమైనదీ రంగస్థలం కేపువాలో కట్టబడింది. ఇదంతా చూస్తున్నాడు లెంటులుస్ బేటియాటస్. వెంటనే కేపువాకు ప్రయాణం కట్టేడు. అక్కడ శిక్షణకేంద్రం నిర్మించాలని నిర్ణయించాడు.

బేటియాటస్‌కు ఆరంభశూరత్వం, ఆడంబరం, అనవసర పటాటోపం తెలియవు. అందుకనే మొదట చాలా చిన్నయెత్తున పని ప్రారంభించాడు. అసలు సూది మొనంత భాగం ముందు సంపాదిస్తే - యేదో విధాన - ఆ తరవాత సామ్రాజ్యాన్నే స్థాపించచ్చునన్న సూత్రం అతనికి కంఠస్థం; అందుకే మొదట్లో ఒక చిన్న పాక వేయించాడు. ఒక్క జంట మల్లుల్నే తెప్పించాడు. పని ప్రారంభించాడు. అల్లా

అయిదు సంవత్సరాలు గడిచేసరికి, ఒక్కజంట పదిజంటలై, పది పదులు నూరు జంటలై, ఆఖరికి యీనాటికి నూరుజంటలకన్న మించి అతని శిక్షణకేంద్రం, అంటే అతని వ్యాపారం అవ్యాహతంగా సాగిపోతోంది. ఇప్పు డతనికి బ్రహ్మాండమైన ఒక శిక్షణకేంద్ర స్థాపకుడనే పేరు చూస్తుండగానే వచ్చేసింది. పూర్వంకట్టిన పాక యిప్పుడు రాతితోకట్టిన మల్లుల బసకింద మారిపోయింది. స్వంత తాలింఖానాలు, స్నానశాలలు, ప్రత్యేకశిక్షణా పద్ధతులు; కొద్దిమంది తమ బంధువులతోకాని, స్నేహితులతోకాని వచ్చి ప్రత్యేక పోరాట ప్రదర్శనలు చూడ్డానికి తగిన చిన్న చిన్న రంగస్థలాలు, ఒకటేమిటి ధనార్జన చేయగల అన్ని హంగులూ, అవకాశాలూ సమకూరేయి. శాంతిభద్రతలు కాపాడేందుకు తానై ఒక పోలీసు బలగాన్ని తయారుచేసి, దాన్ని పోషించడం ప్రయాస, అధిక ధనవ్యయం అని గుర్తించి, మిలిటరీ ఉద్యోగులకు, సైనికులకు లంచాలిచ్చి, వాళ్ళనే తన పనికోసం ఉపయోగించుకున్నాడు. అతని వంటింట్లో ఒక చిన్న సైన్యానికి కావలసినంత వంట వండేవారు. మల్లులు, వాళ్ళకోసం కొన్న ఆడాళ్ళు, శిక్షకులు, యిళ్ళల్లో పనిచేసే దాస దాసీజనం, డోలీలు, పల్లకీలు మోసే బానిసలు అంతా మొత్తం నాలుగువందల మందిని తను మేపేవాడు. ఆనాటి అతని ఆత్మ సంతుష్టికి కారణం లేకపోలేదు. సూర్యకాంతి వింతహొయలు కూర్చే ఆ చల్లని వసంతకాల ప్రభాత సమయంలో అతను కూచున్న ఆ ఆఫీసు యీ మధ్యే అతను సంపాదించిన చర, స్థిరాస్తులు. మొత్తంమీద యిప్పటి అతని అభ్యుదయం అతనికే ఆశ్చర్యం కల్గించి సంతుష్టికింద మారేది. తా నిటువంటి వ్యాపారిగా జీవితం ప్రారంభించిన తొలిరోజులలో కిటికీలకూ, గుమ్మాలకూ తెరలు కట్టడమేమిటని వాటిని తెగ అసహ్యించుకునేవాడు. అతను పెద్దింటివాడు కాడు. అల్లా కనబడ్డాని కతనెప్పుడూ ప్రయత్నం చేసేవాడు కాడు. అధికంగా లాభాలు లభించిన తరువాత డబ్బుకి తగ్గ హుందా ఉండవలసిన అవసరాన్ని మాత్రం గుర్తించాడు. గ్రీకు బానిసలను కొనడం ప్రారంభించాడు. అతను కొన్న గ్రీకు బానిసలలో ఎక్కౌంట్లు తెలిసిన గుమాస్తా ఒకడు, ఒక శిల్పికూడా ఉన్నారు. గ్రీకు పద్ధతిని వరుసలు తీరిన గదులూ, మూడువైపుల గోడలుండి, ఒకవైపున తెరుచుకుని ఉండే ఒకరకమైన డాబాను కట్టవలసిందిగా ఆ గ్రీకు శిల్పి యితన్ని ప్రోత్సహించాడు. అటువంటి డాబాను కట్టించాడు. తెరలు తొలగిస్తే సూర్యకాంతీ, చల్లగాలీ సమృద్ధిగా గదులలో ప్రవేశిస్తాయి. ఆ పాలరాతి నేల, అతను కూచుని ఆఫీసు పనులు చేసుకొనే ఆ తెల్లని మేజా-యివన్నీ అతని అభిరుచుల్ని తెల్పుతున్నాయి. తెరువబడినవైపు వీపుపెట్టి, ద్వారాభిముఖుడై కూర్చున్నాడు బేటియాటస్. అవతలగా గుమాస్తాల గదులున్నాయి. రోమ్‌లోని సందుగొందులు, రౌడీమూకలు, ఒక

ఏమిటి యితని పూర్వపుస్థితి ఒకప్పటి గాథగా మారి, అదైనా యితనికి దూరంగా నిలిచింది.

గుమాస్తా వచ్చి చెప్పేడు అత్తరువు పూసుకుని, ఖరీదైన దుస్తులు ధరించి, ఉంగరాలు తగిలించుకున్న యిద్దరు యువకులు వచ్చారని; బాగా లాభించేట్టు కనబడ్డా, బొత్తిగా కుర్రకారుతో వ్యవహారం మరి. అందులో ఒకడు మరీ కుర్రాడు; మహా అయితే అతని వయస్సు ఇరవై ఒక్కటుండవచ్చు. మరో అతను యితన్ని ఖుషీ చెయ్యడానికి ప్రయత్నిస్తున్నాడు.

"వాళ్ళని లోపలికి పంపు" అన్నాడు బేటియాటస్.

ఒక్క క్షణంలో ఆ యిద్దరు యువకులూ అతని గదిలో ప్రవేశించారు. వాళ్ళు రాగానే వినయం ఉట్టిపడేలా లేచి నిలబడ్డాడు బేటియాటస్. నిలబడి వచ్చినవాళ్ళని కూచోమని రెండు కుర్చీలు చూపించాడు; వాళ్ళు కూచునేలోపలే వాళ్ళేమాత్రం ధనవంతులై ఉంటారా అని వాళ్ళ విలువలు కట్టడం ప్రారంభించాడు. ధనవంతులకు మల్లే కన్పించినా, చెప్పుకోని తిరిగేటంత ధనవంతులు కారనీ, వాళ్ళదంతా పైపై పటాటోపమే తప్ప జేబు బరువు తక్కువేననీ అంచనా వేసేడు బేటియాటస్. ఉన్నత కుటుంబంలో జన్మించి ఉండొచ్చుకాని, కులీనుల కుండవలసిన సంప్రదాయాల కనుగుణ్యంగా లేదు వాళ్ళ ప్రవర్తన. అటువంటి ప్రవర్తనా పద్ధతిని పెద్దలు హర్షించరు కూడా. ఆ యిద్దరిలోకీ లేబ్రాయపువాడైన కైయస్ క్రాసస్ సరిగ్గా ఆడపిల్లలాగున్నాడు. బ్రాకస్ పెద్దవాడు. కొద్దోగొప్పో తెలివితేటలున్నవాడు. అతనే వ్యవహారం నడిపిస్తున్నాడు. కాంతిహీనమైన కళ్లూ, యెల్లప్పుడూ అసహ్యాన్ని సూచించే సన్నని పెదవులూ, యిసుకరంగు జుట్టూ - యిదీ అతని వర్ణన. అతనే మాట్లాడుతున్నాడు. వింటూ కూచున్న కైయస్ అతనివైపు కళ్ళు అప్పగించి ప్రశంసాపూర్వకంగా, గౌరవపురస్సరంగా చూస్తున్నాడు.

"నేను లెంటులుస్ బేటియాటస్‌ని, ఒక వ్యాపారస్తుడ్ని." వాళ్ళ దగ్గర తనో తక్కువవాడిలా ప్రవర్తిస్తే ఆ సాయంత్రానికి వాళ్ళవద్ద అయిదువేల దీనారాలైనా లాగచ్చునని బేటియాటస్ అభిప్రాయం. తమ యిద్దర్నీ అతనికి పరిచయంచేసి వెంటనే అసలువిషయం యెత్తుకున్నాడు బ్రాకస్.

"మా యిద్దరికీ చూడాలని ఉంది, రెండు ద్వంద్వయుద్ధాలు యేర్పాటు చెయ్యగలరా?"

"ఒట్టి మీ యిద్దరికోసమేనా?"

"మేమూ, మరో యిద్దరు స్నేహితులం అంతే."

తీవ్రంగా ఆలోచించేవాడిలా నటిస్తూ, తల ఊపి తన లావుపాటి చేతుల్ని దగ్గఱగా తీసుకున్నాడు. అల్లా రెండుచేతులూ దగ్గరగా తీసుకోడంవల్ల అతని వేలినున్న ఉంగరాల్లో పొదగబడ్డ మరకత మాణిక్యాలు బాగా కన్పిస్తున్నాయి.

"ఓ, ఏర్పాటు చేయగలం" అన్నాడు బేటియాటస్.

"మల్లులు చచ్చేదాక" బ్రాకస్ నెమ్మదిగా తాపీగా అన్నాడు.

"ఏమిటీ?"

"మీరు విన్నారుగా; నాకు రెండు జంటలు పోట్లాడ్డంకావాలి. వాళ్ళు థ్రేషియన్లయి ఉండాలి. చచ్చేదాకా పోరాటం జరపవల్సిందే."

"అదేం?" అడిగేడు బేటియాటస్. "రోమ్‌నుంచి యెప్పుడు యువకులు వచ్చినా చచ్చేదాకా దెబ్బలాడితేనే చూస్తామంటారేమిటి? అంతబాగానూ ఉంటే పోట్లాట చూడొచ్చు, రక్తాన్నీ చూడచ్చు, కాని చచ్చేదాకా ఎందుకు?"

"ఎందుకేమిటి? మేం కావాలన్నాం, అందుకు."

"అబ్బే అదా సమాధానం. చూడండి, చూడండి!" తనపని తనకి బాగా తెలుసునన్న ఆత్మవిశ్వాసం ఉన్నవాడిలా చేతుల్ని టేబిలుమీద చాచి నిశ్చలంగా, జాగ్రత్తగా ఆలోచించి చెప్పేవాడిలా యిలా అన్నాడు: "మీకు థ్రేషియన్లు కావాలంటున్నారు. ప్రపంచంలో యెక్కడా కనబడని థ్రేషియన్ పోరాటం మీకు చూపించగలను. వాళ్ళు చచ్చేదాకా పోట్లాడి తీరాలని అంటేమాత్రం మంచి కత్తిసాము చూడలేరు మీరు. నేనన్నది సహేతుకమైనదని మీకూ తెలుసు; మీరిల్లా డబ్బిస్తారో లేదో వాళ్ళల్లా దెబ్బలాడి ఒక్క క్షణంలో చచ్చి ఊరుకుంటారు. రోమ్‌లో మీ రెప్పుడూ చూసి ఉండని ప్రదర్శనం; పాయింట్ల లెఖ్కనైతే రోజ్ంతమానమూ మీకిప్పించగలను. ఆ మాట కొస్తే యీ ఊళ్ళో యే రంగభూమిలోనైనాసరే రోమ్‌లో మీ రెన్నడూ చూడలేని ఘనమైన ప్రదర్శనలు చూసే అవకాశం వుంది. కాని ప్రత్యేకం మీరే చూద్దామనుకుంటే మాత్రం ప్రత్యేక ప్రదర్శనలు యేర్పాటు చెయ్యడంలో పేరుపడ్డవాడ్ని. నాకు కసాయివాడనిమాత్రం పేరురాలేదు. మీ రిచ్చిన డబ్బుకు మించిన పోరాటప్రదర్శనం బాగా చూడతగ్గది ఏర్పాటు చేయగలను."

"మాకు కావల్సిందికూడా అదే. కాని పోరాటప్రదర్శనం మల్లులు చచ్చేదాకా మాత్రం జరిగితీరాల్సిందే," అన్నాడు బ్రాకస్.

"అదే విరుద్ధం."

"మీ ఉద్దేశంలో అల్లాగుండొచ్చు. నా డబ్బూ రావాలీ, మీ మల్లులూ చావకూడదూ; అవ్వా కావాలి, బువ్వా కావాలి; యెల్లాకుదురుతుంది. నేను యేదైనా

డబ్బిచ్చి కొన్నానంటే ఆ వస్తువు నాదే అన్న మాటకద. రెండు జంటల మల్లులు చచ్చేదాకా పోట్లాడుతారుకదా అనే నేననుకొంటాను. నాతో బేరం పొసగదని మీకు తోస్తే మరోచోటికి వెళ్తాను" బ్రాకస్ అన్న యీ మాటలు తీక్ష్ణంగా కన్పించినా, మెల్లిగానే అన్నాడతను.

"మీరు బేరం సాగనివ్వరని నే నన్నానా? మీ రనుకునేదానికన్న హెచ్చుగానే మీకు సేవచేద్దామని నాకుంది. రెండుజతలు ఉదయంనుంచి సాయంత్రంవరకు పోరాడే యేర్పాటుచేస్తాను. అంటే రోజుకి యెనిమిది గంటలన్నమాట. అందులో యెవరైనా బాగా దెబ్బతిన్న పక్షంలో ఆ స్థానంలోకి మరొకడ్ని తెప్పిస్తా. మీకూ, మీ స్నేహితులకూ కావలసినంత సరదా, చూడవలసినంత రక్తం అన్నీ ఉండేలా చేస్తా. అందుకు గాను యెనిమిదివేల దీనారాలవుతుంది; అందులోనే ఆహారం, ద్రాక్షసారా, తక్కిన సౌకర్యాలు అన్నీ ఉంటాయి."

"మాకు కావలసిందేదో మీకు మేం చెప్పేం, మీరు విన్నారు. ఊరికే అదేపనిగా బేరమాడుతూ కూచోడం అంటే నాకు చెడ్డ అసహ్యం."

బ్రాకస్ కొంచెం కోపంగానే అన్నాడు.

"అయితే సరే. ఇరవై ఐదువేల దీనారాలవుతుంది."

కైయస్‌కు ఆశ్చర్యం వేసింది. కాదు. యింత డబ్బేనా అని భయమేసింది. బ్రాకస్‌మాత్రం యేమీ కానట్లు, ఓస్ యింతేనా అన్నట్లు భుజాలెగరేసి,

"సరే, కాని వాళ్ళు దిసమొలల్తో పోరాడాలి."

"దిసమొలతోనా?"

"నే నన్నది మీకు వినబడ్లేదా?"

"సరే, సరే."

"నా దగ్గఱమాత్రం నాటకం పనికిరాదు. ఏవో రెండు దెబ్బలు తగిలించుకొని చచ్చినవాళ్ళలా యిసుకలో పడుకుని తమాషాచేస్తే మాత్రం నాకు మండుకొస్తుంది. చెప్తున్నా, అందులో యే ఒకడు చచ్చినా మీ మనిషొకడు వచ్చి మేం చూస్తుండగా వాడి తల నరకాలి. ఆ యేర్పాటు ముందుగా మీరు చేసితీరాలి."

బేటియాటస్ తల పంకించాడు.

"ప్రస్తుతం నేను మీకో పదివేలిస్తాను. మిగిలినది ప్రదర్శనం పూర్తి అయేక."

"అల్లాగే కానివ్వండి. మా గుమాస్తా మీకో రశీదిస్తాడు. ఒడంబడికమీద సంతకాలు చేద్దాం. వెళ్ళేలోపులో ఆ మల్లుల్నోమారు చూడాలని ఉందా?"

"పొద్దున్నకి మే మిక్కడికి రావచ్చా?"

"ప్రొద్దున్నా - ఓ! కాని మిమ్మల్ని నేను హెచ్చరించి తీరాలి. ఇటువంటి పోరాటాలు సాధారణంగా యెంతోసేపు జరగవు. త్వరగా, అంత మవుతాయి."

"నన్నేం హెచ్చరించకు మహాశయా!" కైయస్‌వైపు తిరిగి ప్రశ్నించాడు బ్రాకస్.

"వాళ్ళ నోమారు చూద్దామని ఉందేమిటోయ్?"

కైయస్ సిగ్గుతో నవ్వి తలూపేడు. డబ్బు చెల్లించి, ఒడంబడికమీద బ్రాకస్ సంతకం చేసింతరువాత వాళ్ళు బైటకు వెళ్ళి పల్లకీలెక్కారు. అక్కడినుంచి తాలింఖానాకు పోయారు. బ్రాకస్‌పై దృష్టి నిలిపి తదేకధ్యానంతో చూస్తున్నాడు కైయస్. అంత గొప్పగా, ప్రశంసనీయంగా ప్రవర్తించిన మనిషి కైయస్ దృష్టిలో మరొకడు లేడు. డబ్బునంత ఖాతరు చెయ్యకుండా యేమీ లెక్కలేనట్లు యెంత హుందాగా ప్రవర్తించాడని. అసలు పాతికవేల దీనారాలనే కాదు — తనకు ప్రతినెలా ముట్టే వెయ్యి దీనారాలే యెంతో ఔదార్యంతో యివ్వబడుతున్నట్లు నలుగురూ అంటారు— డబ్బు విషయ మొచ్చేసరికి యేమీ కానట్లు అతను చూపే ఆ నిర్లక్ష్యమే, అసలు డబ్బు విషయ మొకటేమిటి. మానవజీవిత మంటేనే అతను చూపే ఆ నిర్లక్ష్యమే అతన్ని ఆకర్షించింది. అదో రకమైన మానవ ద్వేషం, అటువంటిది అలవర్చుకోడమే కైయస్ ఆశయం. అదే ప్రపంచంలోని యే తర తమ విభేదాలనూ పాటించని ఘనమైన స్థాయి కలది. దానికి తోడు అతనిలో నిర్దయతో కూడిన కుతర్కం మంచి ఆశ్చర్యమైన పాళ్ళల్లో కలిసి ఉంది. తనైతే, వెయ్యేళ్ళకైనా దిగంబరులైన మల్లులచేత పోరాట ప్రదర్శనం యిప్పించాలి అని అడగగలిగేవాడా. అసలటువంటి ప్రదర్శనం చూడ వీలు కల్గుతుందనేగా రోమ్‌నుంచి యింత దూరమూ వస్త.

తాలింఖానావద్ద బానిసలు పల్లకీలు దింపేరు. నూటయాభై అడుగుల పొడుగు, నలభై అడుగుల వెడల్పు కల ఆవరణ అది. దానికి మూడువైపులా చుట్టూ దిట్టమైన పొడుగాటి యినుపవూచ లున్నాయి. ఒకవైపున మల్లులగదు లున్నాయి. ఇదంతా చూసే సరికి ఈ మల్లులకు శిక్షణ యివ్వడం పులులు, సింహాలవంటి క్రూరజంతువులకు శిక్షణ యివ్వడంకంటే చాలా కష్టం అనిపించింది కైయస్‌కు. మల్లుడంటే ఉట్టి ప్రమాదకర మైన క్రూరజంతువే కాదు, ఆలోచించే శక్తిగల తెలివైన క్రూరమృగం. ఆ తాలింఖానాలో నిండు శరీరాలు కలవాళ్ళని చూడగానే ఆహ్లాదంవల్ల ఒళ్ళు జలదరించింది కైయస్‌కి. కర్రలూ, కత్తులూ పట్టుకుని ఓ వందమంది కనబడ్డారు. వాళ్ళ ఒంటిమీద లంగోటీ తప్ప మరో బట్టా లేదు. జుట్టు కురచగా కత్తిరింపబడివుంది. నున్నని గెడ్డాలు, యుద్ధంలో మంచి అనుభవం గడించిన ఆరుగురు శిక్షకులు కూడా ఉన్నారు.

శిక్షకుని చేతిలో స్పానిష్‌కత్తీ, మరొకచేతికి బలమైన యిత్తడి తొడుగూ ఉన్నాయి. ఆ శిక్షకులు మల్లులమధ్య అతిజాగ్రత్తగా ముళ్ళమీద నడిచేవాళ్ళలా నడుస్తున్నారు. చాలా చురుకుగా పనిచేస్తూ, యేమాత్రం అపాయాన్నైనాసరే యిట్టేవెతికి పట్టుకోగల కళ్ళతో వాళ్ళు మల్లులమధ్య మెసలుతున్నారు. ఆవరణచుట్టూ చాలా చోట్ల నిలబడి పెద్ద పెద్ద ఖడ్గాలు ధరించిన సైనికులు పహరా కాస్తున్నారు. ఆ ఖడ్గాలే చాలు క్రమ శిక్షణ పట్టాలు తప్పకుండా చూడడానికి. ఇటువంటి మల్లు లెంత తక్కువమంది చచ్చినా వాళ్ళ ఖరీదు హెచ్చే ఉంటుందని గ్రహించాడు కైయస్.

కండలు తిరిగిన శరీరాలు కల్గిన మల్లులు బెబ్బులుల కన్న తీవిని మరిపించే విధంగా కనబడ్డారు. ఇంచుమించు వాళ్ళల్లో మూడురకాలవా ళ్ళున్నారు. ఆ రోజులలో యిటలీలో యీ మూడు రకాలవాళ్ళే ప్రఖ్యాతి పొందేరు. ప్రజలు మోజు చూపించే థ్రేషియన్లున్నారు. థ్రేషియన్లని పిలవబడేవాళ్ళలో గ్రీకులూ ఉండొచ్చు, యూదులూ ఉండొచ్చు. కాని వాళ్లుచేసే ప్రత్యేకమైన సాముపద్ధతివల్లనే జాతిభేదాలతో సంబంధం లేకుండా వాళ్ళందరినీ థ్రేషియన్లనేసేవారు. వాళ్ళు 'సికా' అనే చిన్న వంపు తిరిగిన కత్తితో సాము చేస్తారు. థ్రేస్‌లో జూడియాలో ప్రజ లా ఆయుధాన్ని సర్వసాధార ణంగా వాడుతూ ఉంటారు. ఈ థ్రేషియన్లనబడే వారందరినీ అక్కడినుంచే తీసు కొచ్చారు. 'రిటియారై' అనేవా ళ్ళిప్పుడే వెలుగులో కొస్తున్నారు. ఇంకా వాళ్ళ యుగం ప్రారంభం కాబోతోంది. రెండు తమాషా అయిన ఆయుధాలతో వాళ్లు సాము చేస్తారు. చేపలవల, చేపలను పొడిచే ఒక రకమైన ఈటె. ఆ ఈటెనే త్రిశూలం అనేవారు. ఇవి వారి పోరాట సాధనాలు. బేటియాటస్ యెప్పుడూ యీ 'రిటియారై' అనే రకంలో నల్లని పొడవాటి ఆఫ్రికన్లనీ, యిథియోపియన్లనీ చేర్చేవాడు. వాళ్ళకూ, ఉట్టికత్తి కాని, లేదా కత్తీ, కేడెమూ ఉపయోగించే మర్మి లోన్లనే వాళ్ళకూ ఉజ్జీకట్టే వాడు. 'మర్మిలోన్లు' జర్మన్, గాల్ జాతులకు సంబం ధించిన వాళ్లు.

"వాళ్ళని చూడు" నల్లని మల్లులను చూపించి బ్రాకస్ అన్నాడు. "నేర్పుతో కూడిన గమ్మత్తయిన పోట్లాట వాళ్ళది. ఒక్కొక్కప్పుడు విసుగుపుడుతుంది కూడా. దాని గొప్పతనం చూడాలంటే థ్రేషియన్లుండాలి. ఏమంటారు?" అని అడిగేడు బేటియాటస్‌ని.

బేటియాటస్ భుజా లెగరేసేడు మీరే నిర్ణయించుకోండన్నట్లు.

"దేనికుండవలసిన సుగుణం దానికుండనే ఉంటుంది."

"మాకు చూడాలని ఉంది. ఒక నల్లవాడినీ, థ్రేషియన్‌నీ ఉజ్జీ కట్టించండి" అన్నాడు బ్రాకస్.

ఒక్కక్షణం అతనికేసి చూసేడు బేటియాటస్. తలాడించి "అదేం ఉజ్జీ, థ్రేషియన్ ఆయుధం చిన్నబాకు" అన్నాడు.

"నా కదే కావాలి" బ్రాకస్ పట్టుపట్టేడు.

బేటియాటస్ అర్థంకానట్లు చూసి అతనికి కనపడ్డ ఒక శిక్షకుడివైపు రమ్మన్నట్లు తలూపేడు. నృత్యంలాగ, ఖచ్చితంగా చెయ్యబడుతున్న కసరత్తు చూస్తున్నాడు కైయస్. యూదులూ, థ్రేషియన్లూ చిన్న చిన్న కర్రకత్తులతో, డాళ్ళతో అభ్యాసం చేస్తున్నారు. నల్లటి ఆఫ్రికన్లు వలలు విసురుతూ, పొడుగాటి కర్రల నూపుతూ అభ్యాసం చేస్తున్నారు. పెద్ద పెద్ద శరీరాలుకల్గిన బలిష్టమైన గాల్‌లూ, జర్మన్లూ పొడుగాటి కర్రకత్తులతో సాము చేస్తున్నారు. వీటిని చూసిన కైయస్‌లో వ్యామోహపరవశత్వం వ్యాపించింది. తిరిగి తిరిగి అదే కసరత్తును అంత సునాయాసంగా, లాఘవంగా ఎంతో తీవితో అభ్యసిస్తున్న అంత సుశిక్షితులైన అటువంటి మనుష్యులను తానెన్నడూ చూడలేదు. మానవజీవితం ఎంతో వైభవోపేతమైనది; ప్రాణప్రదమైనది. అటువంటిది ఉట్టి వధ్యశాలాప్రయోజనం సాధించేదిగా తయారుచేయబడుతోంది. చూడు, చూచి జాలిపడు, అని ఆ యినుప కటకటాల వెనుక యెండలో, యిసుకలో నిలబడి కసరత్తు చేస్తున్న మల్లుల హృదయాలు వంగి, వక్రమై, మెలికలు తిరిగిన యితని హృదయానికి కూడా తెలియచేస్తున్నాయి. ఆ భావం అతనిలో ఒక్క క్షణకాలం తళుక్కున మెరిసి మాయమయింది. రాబోయేదాన్నూహించుకున్న కైయస్‌కు యింత భావప్రకోపనం కల్గించే సంఘటనలింకెప్పుడూ తన జీవితంలో లేవనిపించింది. విసుగుదల అతన్ని చంటికుర్రాడిగా ఉన్నప్పుడే వరించి పూలహారం వేసింది. ఇప్పుడు మాత్రం అతను విసుగు చెందలేదు,

శిక్షకుడు వివరిస్తున్నాడు. "బాకుకి పదునైనవైపొక్కటే ఉంటుంది. ఒక్కమాటా బాకు వలలోపడిందా థ్రేషియన్‌పని సరి. ఈ కేంద్రంలో ఒకడు అనవసరంగా చచ్చేడన్నమాటే, అదేం సరైన ఉజ్జీకాదు."

"తీసుకురా వాళ్ళని" బేటియాటస్ అతని ధోరణిని మధ్యలో ఆపేడు.

"జర్మన్‌తో యెందుకు కాకూడదు?"

"థ్రేషియన్‌తో అయినందుకే, నేను డబ్బిస్తున్నా. నాతో వాదించొద్దు" బ్రాకస్ ఖండితంగా చెప్పేసేడు.

శిక్షకుడి మెడలో వెండి బిగులు వేలాడుతోంది. మూడుమాట్లు దాన్ని చెవులు గింగురుమనేలా ఊదేసరికి కసరత్తుచేస్తున్న మల్లులంతా ఆగేరు.

"మీ కెవరు కావాలి?" అడిగే డతను బేటియాటస్ని.

"డ్రాబా."

"డ్రాబా!" శిక్షకుడు గట్టిగా అరిచాడు.

వలనూ, కత్రనూ యీడ్చుకుంటూ ఒక నల్లనిమనిషి వీళ్ళవైపు వస్తున్నాడు. దెయ్యంలాంటి మనిషి. చెమటతో తడిసిన అతని నల్లని శరీరం సూర్యకాంతిపడి మెఱుస్తోంది.

"డేవిడ్."

"డేవిడ్!" మళ్ళీ అరిచాడు శిక్షకుడు.

ఇత నో యూదు, కోపంతో నిండిన సన్నని పెదవులు, ఆకుపచ్చగా కన్పడే కళ్ళు; సన్నని గెడ్డం, గద్దముఖంలాటి ముఖం కలిగిన సన్నని మనిషి, అతనిచేతిలో కత్రకత్తి ఉంటుంది. వాళ్ళని చూడకుండానే అతని చూపులు వాళ్ళని పొడుచుకునీ, దూసుకొనీ పోయి యెక్కడికో చూస్తున్నాయి.

"యూదు" బ్రాకస్ కైయస్తో అన్నాడు. "ఎప్పుడైనా యూదులను చూసేవా?"

కైయస్ తలూపేడు.

"చాలా బాగుంటుందిసుమీ. యూదులు సికాతో చాలా గమ్మత్తులు చేస్తారు. వాళ్లు దాంతో తప్ప యిక దేనితోనూ పోరాడలేకపోయినా నేర్పుగా పోట్లాడగలరు."

"పోలిమస్."

"పోలిమస్!" శిక్షకు డరిచాడు.

ఇత నో థ్రేషియన్. నడియౌవనంలో ఉండి మంచి అందంగా ఠీవిగా ఉన్నాడు.

"స్పార్టకస్."

అత నా ముగ్గురితోనూ కలిసేడు. ఈ యిద్దరు రోమను యువకులకూ కొంత దూరంలో ఆ నలుగురూ నిలబడ్డారు. అతనికి తెలిసిన మాటలలో వాళ్ళేదో వింతైన, భయంకరమైనజాతికి చెందినవాళ్ళని అనుకున్నాడు కైయస్. జడత్వమగుపించే స్థాణువువంటి ప్రకాశహీనమైన వారి మొగతనమేకాదు—అతని పరిచయస్తు లెవరిలోనూ అటువంటి రూపురేఖలు లేవు—వాళ్లు తననుంచి దూరంగా, కటకటాలవెనుక ఉంచబడ్డ పద్ధతి చూస్తేనే అతను ఆశ్చర్యపోయాడు. సైనికులు దెబ్బలాడినట్లూ కాక,

జంతువులు దెబ్బలాడినట్లుగాక, మల్లులకు ప్రత్యేకించబడ్డ విధంగా వాళ్లు దెబ్బలాడాలి. అందుకే ఒకరితో ఒకరు పోట్లాడి చచ్చేటందుకేగా యీ శిక్షణ కార్యక్రమమంతా. కైయస్ నాలుగు భయంకర రూపాలను చూస్తున్నాడు.

"బాగున్నారంటారా?" బేటియాటస్ అడిగేడు.

ప్రాణం పోయినాసరే కైయస్ అయితే దానికి సమాధానం చెప్పకల్గేవాడు కాడు. నెమ్మదిగా బ్రాకస్ అన్నాడు.

"ఆ పగిలిన ముక్కున్నవాడు తప్ప, తక్కినవాళ్ళంతా బాగానే ఉన్నారు. అతను మల్లుడిలా కనబడడే."

"పైకి కనుపించేది మోసం చేస్తుంది" బేటియాటస్ అతనికి చెప్పేడు. "అతను స్పార్టకస్, చాలా బాగా, శక్తివంతంగా, చురుకుగా దెబ్బలాడగలడు. ఒకందుకు నేనతన్ని పిలిపించాను. మంచి చురుకైనవాడు."

"అత న్నెవరితో ఉజ్జీ కడతారూ?"

"ఆ నల్లని మల్లునితో," బేటియాటస్ సమాధానం చెప్పేడు.

"చాలా బాగుంది, డబ్బు కిట్టుబాటయిందనుకుంటా."

ఆవిధంగా అప్పుడు స్పార్టకస్‌ను చూసేడు కైయస్. నాలుగేండ్ల పిమ్మట ఆ మల్లులపేర్లువగైరా వివరాలేవీ జ్ఞాపకం లేకపోయినా, ఆ తెల్లని సూర్యకాంతి, అక్కడ తనకు కల్గిన భావాలూ, తను పీల్చిన మనుష్యశరీరాల చెమటగబ్బూ అతను మరచిపోలేదు.

## 2

ఆ రాత్రి ఆమె నిద్రపోదు. ఆ రాత్రి ఆమె ఎంతసేపటికీ నిద్రపోదు; కొద్ది క్షణాలపాటైనాసరే నిద్రను జారనివ్వదు. నిద్రను తరిమేస్తుంది. కళ్ళు తెరుచుకుని చీకటిలో పడుకున్న ఆమె వరీనియా. ఆమె ప్రక్కన శయనించిన స్పార్టకస్ మాత్రం నిద్రపోతున్నాడు. ఎంత ఆరోగ్యంగా నిద్రపోతున్నాడు. ఎంత సంపూర్ణమైన నిద్ర ననుభవిస్తున్నాడు! మెత్తని మెల్లని ఉచ్ఛ్వాసనిశ్వాసాలు అవే అతనిలో మండే అగ్నికి ఆజ్యం. ప్రకృతిలోని ఆటుపోట్లలా ఇతని ఉచ్ఛ్వాస, నిశ్వాసాలు నియతి కలవి. దాన్నిగురించే ఆలోచిస్తుందామె. జీవితంతో శాంతియుతంగా ఉంటూ బాహాబాహి యుద్ధంచేస్తూ ఉండేదే నియతి కల్గివుంటుందని ఆమెకు తెలుసు. సముద్రాల ఆటుపోట్లయినా రుతుభేదాలయినా, స్త్రీ గర్భంలో మానవాకారాన్ని పొందే బీజానికయినా ఇదే వర్తిస్తుందని ఆమెకు తెలుసు.

ఉదయాన్నే లేచి దేన్ని తానెదుర్కోవాలో తెలుసుకున్న మానవుడు, తనకు సంభవింపనున్నదేదో ముందుగానే తెలిసిన మానవుడు యింత నిశ్చింతగా ఈ విధంగా యెల్లానిద్రపోగలడు? మృత్యుగహ్వరంలోనే యెల్లా కూర్కుతీయగలడు? అతనికా శాంతి యెక్కడినుండి లభిస్తుంది?

అతితేలికగా మెల్లగా వరీనియా అతన్ని స్పృశిస్తుంది. అతని చర్మాన్ని, కండలను, అవయవాలను, తన చేత్తో నెమ్మదిగా తాకుతుంది. అతను నిద్రిస్తున్నాడు. అతని చర్మం ఎంతో కొత్తదిగా, జీవం తొణికిసలాడుతూ, బాగా సాగేదిగా నిగనిగ లాడుతూ వుంది. కండలు సడలి, అవయవాలు వదులై విశ్రాంతి తీసుకుంటున్నాయి. ఎంతో విలువైనది నిద్ర. నిద్రే అతనికి జీవం పోస్తుంది.

(నిద్రించు, నిద్రించు, నా ప్రేమైక నిధానమా, నా హృదయాంతరంగుడా, నా మృదువైన ఉగ్రస్వరూపీ—నిద్రించు, నిద్రించి నీ శక్తి వృధాచేయక జాగ్రత్త పెట్టు)

ఆమె శరీరమంతా అతని శరీరాన్ని తాకేలా, ఆమె అవయవాలన్నీ అతని అవయవాలను తాకేలా, ఆమె హృదయసీమ అతని హృదయధ్వనిని ఆహ్వానించేలా, వినేలా, ఆమెముఖ మతని ముఖాన్ని చేర్చి బుగ్గకు బుగ్గ చేరేలా ఆమె బంగారు శిరోజ మతని శిరోభూషణమైన కిరీటాన్ని బోలినట్లు చేసేలా, నెమ్మదిగా, జాగ్రత్తగా, తన కదలిక యావత్తూ కలిసి గుసగుసలాడిన శబ్దాన్ని మించకుండేలా అతనిపై వాలింది. ఇప్పటి మధురస్మృతులవల్ల, ఈ ప్రేమవల్ల ఆమెలోని భయాలు ప్రశాంతించినవి. ప్రేమ, భయం ఒకేచోట నివసించలేవే.

(ఆమె అతని కోమారు చెప్పింది నువ్వోపని చెయ్యాలని. మాజాతి నమ్మికతో చేసే ఒక పని నువ్వు చెయ్యాలి అందామె. అత నామెను చూచి చిఱునవ్వు నవ్వేడు. మీ జాతిలో నమ్మేదేమిటి? నువ్వు నవ్వుతావు, ఆమె అంది. నే నెప్పుడైనా నవ్వేనా? అన్నాడతను. అప్పుడామె చెప్పింది, ముక్కునుంచీ, నోటినుంచీ ఆత్మపైకి వెళ్తుందని; ఊపిరి విడిచినప్పుడల్లా ఆత్మపైకి వెళ్తుంటుందని నా తెగవారి నమ్మకం. చెప్పితే నువ్వు నవ్వుతావు. నేను నిన్నుచూసి నవ్వడం లేదని అతని సమాధానం. ప్రజలు నమ్మే తమాషా అయిన విషయాలు చూసి నవ్వుతున్నాను. ఇది విని ఆమె బాధపడేది. నువ్వు గ్రీకువాడివి. గ్రీకు లేదీ నమ్మరు. నేను గ్రీకు వాడినికాను, థ్రేషియన్ని. ఐనా గ్రీకులేదీ నమ్మరన్నది నిజంకాదు. ప్రజలు నమ్మే విలువైన, గొప్ప విషయాలన్నిటినీ గ్రీకులు నమ్ముతారు. దీని కామె సమాధానం చెప్పేది, గ్రీకులు దేన్ని నమ్మితే నాకెందుకు? తన తెగలోవాళ్ళు చేసే దతనుచేస్తాడా? ఆమెనోటి కతని నోటినాన్చి అతని

ఊపిరినీ, ఆత్మనూ ఆమెలోకి పంపుతాడా? అప్పుడామె కూడా అతనికంతే చేస్తుంది. వాళ్ళ ఆత్మ లోకదానితో ఒకటి కలిసి భిన్న స్వరూపాలు కల్గిన ఒకే ఆత్మగా చిర స్థాయిగా నిలిచిపోతాయి. లేక అతను భయపడుతున్నాడా? దీనికతనన్నాడు; నేను భయ పడే విషయాలు నువ్వూహించుకోలేవా?)

చిన్న పరుపుమీద ఆ గదిలో ఆమె అతనితో శయనించింది. ఆ గది వాళ్ళ యిల్లు. వాళ్ళెప్పుడు కలిసినా యేడడుగుల పొడవు, ఐదడుగుల వెడల్పుగల ఆ చిన్న గదిలోనే. దానిలో ఉన్నవల్లా ఒక కుండ, చిన్న పరుపు; యివైనా వాళ్ళ స్వంతం కావు. ఏదీ వాళ్ళదికాదు; వాళ్ళిద్దరూకూడా వాళ్ళ స్వంత ఆస్తి కానేకాదు. ఆమె అతని ప్రక్క పడుకొంది. అతని ముఖాన్ని, అవయవాలను తాకుతూ పడుక్కుంటుంది. కొద్దిగా యేడుస్తుందామె. ఉదయం ఆమె యేడువగా చూచినవారు లేరు.

(నేను స్త్రీలను దానం చెయ్యను. ఎరువిస్తా అంతే అని చెప్పడం బేటియాటస్‌కు యెంతో సరదా. నా మల్లులకు నే నెరువిస్తాను. అవయవాలు ముడుచుకుపోయేవాడు బరిలో యెందుకూ పనికిరాడు. మల్లుడంటే పల్లకీబోయీ కాదు. మల్లుడంటే మొగాడు. మొగాడు కాకపోతే చూచేవాళ్ళు పదిదీనారాలైనా యివ్వరు. మగాడికి ఆడది కావాలి మరి. అందుకే చస్తే లొంగని ఆడాళ్ళను కొంటా. వా ళ్ళెవరికీ లొంగరు కాబట్టి వాళ్ళను చవకగా అమ్మేస్తారు. కాని నా మల్లులకు చెప్తా, అబ్బాయిలూ వీళ్ళని మచ్చిక చేసుకోండిరా అని, లొంగిదీసుకోండని.

(రాత్రి వైదొలగుతూంది. ఉదయభానుని ధవళకిరణ మొకటి గదిలో పడు తుంది. వరీనియా కనక నిలువెత్తునా లేచి నిలబడితే ఆమె తల గదికిటికీ పైభాగంతో సమానంగా వుంటుంది. గదిలోంచి బైటికి చూస్తే ఆమె కా తాలింఖానా ఆవరణ, యింకా దూరంగా వున్న కాపలా కాచే నిద్రముఖాల సైనికులూ కనిపిస్తారు. ఆమె కంతా బాగా తెలుసు. స్పార్టకస్‌లా యీ గదికీ, గొలుసులకూ అలవాటుపడ్డది కాదామె.

(ప్రత్యేకంగా ఈమె బేటియాటస్‌లో మోహపూరితమైన ఆశల కట్టు విప్పింది. అతని ఏజెంట్లామెను రోమ్‌లో 500 దీనారాలకు కొన్నారు. అంత చవకగా ఆమె అమ్ముడుపోడానికి కారణం వుండకపోదు. ఆమెలో ఏ దుర్గుణమూ లేకపోతే అంత అందంగా వున్నదాన్ని అంత చవకగా యెవరూ అమ్మరు. ఆమె నిష్కళంకురాలేమీ కాదు అనుకొన్నాడు బేటియాటస్. ఐనా ఆమెకేసి చూస్తే ఆశ, మోహం అతనిలో విజృంభించకమానలేదు. జర్మను తెగల స్త్రీలవలె ఆమె పొడుగ్గా, మంచి అవయవ సౌందర్యం కలిగి, కంటికి నదరుగా కనిపించే సుందరవిగ్రహం. ఇటువంటి పొడుగాటి

సౌందర్యవతులే బేటియాటస్ ప్రశంసలకు పాత్రులయేవారు. దీనంతటికి తోడు ఆమె ఇరవై యేళ్ళయినా నిండని జవ్వని. ఆ యౌవనమే అతనికి ఆనందదాయకం. అదీకాక ఆమె బంగారుజుట్టుతో మనోహరంగా వుంటుంది. అందువల్ల బేటియాటస్‌కు ఆమె పట్ల తీరని మోజు.

(ఆమెలో లోపం లేకుండాలేదు. మొదటిరాత్రి ఆమెపొందుకై ప్రయత్నించినప్పుడే అతనికి తెలిసిపోయిందా లోపం. పిచ్చెత్తిన పులిలా తయారయిందా రాత్రి. కాళ్ళతో తన్నుతూ, ఉమ్ముతూ, గుచ్చుతూ, గీరుతూ భయంకరంగా తయారయింది. మంచి బలమైన శరీరం కనుక, స్మృతి తప్పేవరకూ ఆమెను కొట్టడంకూడా చాలా కష్టమయింది. ఆ యుద్ధంలో అతని గదిలోని ఖరీదైన వస్తువులన్నీ రూపుమాసిపోయాయి. అందమైన గ్రీకు పూలకూజాకూడా ఆమెని పడిపోయేదాకా దాంతోనే కొట్టడంవల్ల పూర్తిగా పాడైపోయింది. అతని భంగపాటు, ఆగ్రహమూ ఆమెను చంపి పారెయ్యమని తెగబలవంతపెట్టేయి. ఆమెను చంపినా పాపం లేదనుకున్నాడు. అతను కొట్టడాని కుపయోగించిన విలువైన దీపాలూ, ఖరీదైన పాత్రలూ, విగ్రహాలూ వీటి ఖరీదూ, ఆమెను కొనడానికి ఖర్చయిన డబ్బూ కలిపితే ఆమె విలువ ధనం రూపంలో హెచ్చయిపోయి, ఆమెను చంపడంవల్ల నష్టమే అధికమౌతుంది కాని లాభం లేదనుకున్నాడు. ఆమె రూపానికి తగ్గ ధర కామెను బజారులో అమ్మెయ్యడానికి కూడ అతనికిష్టంలేదు. రౌడీల, గూండాలముఠాల నాయకుడిగా జీవితం ప్రారంభించినవాడు కనుక, అతనికి వర్తకరహస్యాలన్నీ కరతలామలకమే. అబద్ధాలు చెప్పి, లేనిపోనివి కూసి, ఏ వస్తువూ అమ్మను నేననే కించెత్తు గర్వం కూడా అతనికుంది. ఇవేంకాదు; ఆమెను మల్లుల కప్పగించి, వాళ్ళచేత దీని మదం అణిగేలా చేయిద్దాం; వాళ్ళచేత లొంగదీయిద్దాం అనుకున్నాడు. అప్పటికే పగిలిన ముక్కుతో గొఱ్ఱెను బోలిన బహిరాకృతికల స్పార్టకస్ అనే థ్రేషియన్‌ని యీత నసహ్యించుకునేవాడు. అతని బహిరాకృతి లోపల కణకణ మండే జ్యోతిని కప్పుతోందని బేటియాటస్ కేం తెలుసు! ఆ జ్యోతినే తక్కిన బానిసలంతా గౌరవిస్తారని అతనేం యెరుగును. తన అసహ్యానికి గురి అయిన స్పార్టకస్ ఆమెకు తగిన జతగాడని అనుకున్నాడు బేటియాటస్.

(ఈమెను నువ్వుపయోగించుకో అని వరీనియాను అతని కిచ్చి స్పార్టకస్‌ను పరిశీలనగా చూస్తున్నాడు. అంతగా తా నసహ్యించుకునే వీడేమనుకొంటున్నాడో యేమంటాడో చూద్దామని అతనున్నాడు. నీ ఇష్టం వచ్చినట్లుచేసి యామెను లొంగదీసుకో. కాని కొట్టడం, అనాకారిగా చెయ్యడంమాత్రం పనికిరాదు. ఆమెను చూస్తున్న

స్పార్టకస్‌లో కామంలేదు. నిశ్శబ్దం తాండవిస్తోంది. ఆ సమయంలో వరీనియా యేమీ అందంగాలేదు. ఆమె ముఖంమీద రెండు లోతైన పొడుగాటి, బలమైన గాయాలున్నాయి. ఒకకన్ను బాగావాచి, పచ్చగా, యెర్రగా కనిపిస్తోంది. ఆకుపచ్చని, యెర్రని దెబ్బల దద్దు లామె నుదుటిమీద మెడమీద కనిపిస్తున్నాయి. చేతులమీద కూడా అదే.

(చూడు నీ కేం ఇస్తున్నానో, అని అప్పటికే చినిగి పేలికలుగా వున్న ఆమె బట్టల నూడతీసేడు. స్పార్టకస్ యెదుట ఆమె వివస్త్రయై నిలబడింది. ఆ క్షణంలో ఆమె స్పార్టకస్ ప్రేమను చూరగొంది. ఆ క్షణంలో ఆమెను చూసేసరికి అతనిలో ప్రేమ పెల్లుబికింది. అతను ప్రేమించినది ఆమె నగ్నస్వరూపాన్ని కాదు. నిష్ప్రయోజనమైపోతున్న తన జీవితాన్ని పరాధీనం చేస్తాను కదా అనుకోవడంవల్ల తన కళ్ళల్లో, ఆత్మలో, హృదయంలో, తుపానులా రేగిన భావాల నామె అణచుకొని, తోసుకొస్తున్న క్రోధాన్ని నిలదొక్కి, రగిలే బాధనీ, ముంచుకొచ్చే అవమానాన్నీ పైకి కనబడనీయకుండా, ఊడతీస్తున్న బట్టల్ని పట్టుకు వేలాడకుండా మానాన్ని తన చేతులతోనైనా కప్పుకుందుకు అణుమాత్రం ప్రయత్నమైనా చెయ్యకుండా నిశ్చల జలధి సమాధిలా, మౌనముద్రాభంగిమ నభినయించే నాట్యకత్తెలా, ఠీవిగా, హుందాగా, బేటియాటస్‌ను కాని, స్పార్టకస్‌ను కాని చూడకుండా తన కలలో తానై, తన భావమే తానై నిలబడి బట్టలు లేకపోయినా వివస్త్ర కాని, ఆమెను ప్రేమించా డతను. ఆమెనే ప్రేమించాడు. అతని హృదయం ఆమెపై వాలింది.

(ఆ రాత్రి ఆమె ఓ మూల ముడుచుకు పడుక్కొంది. అత నామె జోలికి పోలేదు. కాని రాత్రి చలి హెచ్చవుతున్నప్పుడు మాత్రం "అమ్మాయీ! నువ్వు లాటిను మాట్లాడుతావా?" అని అడిగేడు. దానికి సమాధానంలేదు. "నాకు జర్మన్ భాష రాదు కనుక లాటినులో మాట్లాడుతున్నా. చలి హెచ్చవుతోంది. చాపమీద పడుకో"— అప్పటికీ సమాధానం రాలేదు. అందుకతను చాపను ఆమెవైపు జరిపేడు. ప్రొద్దుటలేచి చూసేసరికి ఆ చాప వాళ్ళిద్దరి మధ్య పడివుంది. ఇద్దరూ ఉట్టినేలమీదే పడుకున్నారు. సంవత్సరంన్నర క్రితం జర్మనీ అడవులలో తనను వాళ్ళు పట్టి బంధించి తీసుకొచ్చింది మొదలు యిప్పటివఱకూ మరొక జీవి తనపట్ల అంత దయార్ద్రహృదయంతో ప్రవర్తించిన సంఘటన అదొక్కటే అనుకుంది.

(ఉదయం కాబోయే ఆ చల్లని నిశా సమయాన అతన్ని చూస్తుంటే ఆమెలో ఆ మొదటిరాత్రి మధురస్మృతులు కరిగి మహోత్తుంగ ప్రేమతరంగాల్లా ఉప్పొంగుతున్నాయి. ఇది అతను గుర్తించలేకపోతే అతని హృదయమొక పాషాణమే. అతను

కదిలేడు. వెంటనే కళ్ళుతెరచి ఆ మసకచీకటిలో ఆమెను తన బహిరింద్రియం ద్వారా కాక అంతరేంద్రియంతో చూస్తాడు. ఇంకా పూర్తిగా మెళకువ రాదతనికి. ఆమెను తనవైపు లాక్కొని లాలిస్తాడు.

"ఉండు నన్ను...."

"ఈవేళ నీకు సత్తు ఎక్కడనుంచి వస్తుంది స్పార్టకస్."

"ఉండు, నేను సంపూర్ణ బలవంతుడ్ని."

అప్పుడామె అతని బాహువుల్లో కూరుకుపోయి అతని హృదయాన్ని కన్నీటి చుక్కలతో తడుపుతుంది.)

# 3

ఆ ఉదయమే పోరాటం జరగాలి. అది ఆ గాలిలో, ఆ ప్రదేశమంతటా రెండు వందల మందికి పైగా ఉన్న ఆ మల్లులలో ప్రతిఒక్కడిలో విద్యుత్తులా ప్రవహించి సర్వ వ్యాపకమైంది. తీవ్రావేశాలం దభిరుచిగల యిద్దరు రోమను కుర్రాళ్ళు డబ్బు సంచులు మూటకట్టుకొని పట్టుకొచ్చారు. కనుక రెండుజతల మల్లులు అంటే నాలుగు నిండుప్రాణాలు ఇసుకలో నెత్తురు కారి చావాలి. ఇద్దరు థ్రేషియన్లు, ఒకడు ఆఫ్రికన్, ఒక యూదుడు. ఆఫ్రికన్ వల త్రిశూలం ఉపయోగిస్తాడు కాబట్టి పని సులభమై పోతుంది. చాలామంది వర్తకులిటువంటి ఉజ్జీలనే సహించరు. ఆ కుక్కను నువ్వు పెంచితే పెరిగింది కాబట్టి దాన్ని సింహంతో పోట్లాడించు అంటే బాగుంటుందా. కాని బేటియాటస్ డబ్బుకోసం యేపని చెయ్యడు?

నల్లని మల్లుడు డ్రాబా ఆ రోజు ప్రాతఃకాలాన్ని తన స్వంత భాషలో ఆహ్వా నిస్తూ వందన సమర్పణ చేశాడు. "మృత్యుదివసమా నమస్కారం" చాపమీద పడు కొని ఆలోచనలో పడ్డాడు. ప్రతినిస్సహాయుని జీవితంలోనూ కరుణ, ప్రేమ, ఆటల, పాటల, తీయనిమాటల, ముద్దులమూటల, మధుర క్షణాల చక్కని స్మృతులుంటా యనీ, ఆనందంతో అనురాగంతో గెంతిన రోజు ఉండకపోదనీ, ప్రతివాడూ చావుకు భయపడతాడనీ అనుకొన్నాడు. జీవితం నిరర్ధకంగా సాగుతున్నా దాన్నే పట్టుకుని వేలాడుతాడేం ప్రతివాడూ? తన కుటుంబంనుంచి, యింటినుంచి, దేశాన్నుంచి, ఆఖరికి ఆశలనుంచి దూరమైన మానవుడు, ఇక ఆ యింటికి, ఆశలదేశానికి తిరిగిపోగల అవకాశం సామర్థ్యంలేని మానవుడు, దయాదాక్షిణ్య రహితంగా అవమానానికీ, అనాదరణకీ, బాధలకీ బానిస అయిన మానవుడు, ఇతరుల ఆనందంకోసం, ఒకళ్ళ నొకళ్ళు పొడుచుకు చంపుకునేందుకు శిక్షణ పొంది జంతువులా బ్రతికే మానవుడు,

మానవుడైన జంతువు, ఇంతటి ఘోరానికి గురియైకూడా, జీవితాన్ని పట్టుకు వేలాడు తాడేం? బ్రతుకంటే వ్యామోహం చూపిస్తాడేం?

తను ఒకప్పుడు నిజాయితీగా బ్రతికిన గృహస్థు. ఇల్లూ, వాకిలీ, పెళ్ళం పిల్లలూ వుండి శాంతియుత దినాలలో గౌరవింపబడి, యుద్ధ సమయాలలో ఆదరింపబడిన జీవితం తనది. అటువంటి స్వచ్ఛంద జీవితాన్ని గడిపిన తను చేపల వల చేత బట్టి, త్రిశూలం సంధించి, ఎవరో కేరింతలు కొట్టడానికనీ, చప్పట్లు చరుస్తారుకదా అనీ, నవ్వడానికనీ, మరొకడిని చంపాలి. అతనిలాగే దౌర్భాగ్య జీవితానికి దాసులై, తనుచేసే నీచవృత్తినే చేయవలసిన దుర్గతి పట్టినవాళ్లు గౌరవించే శుష్క వేదాంత వచనాల నతడు గొణుగుతాడు.

"బ్రతికి నన్నాళ్లు సుఖములు బడవలయు."

ఇది శూన్యమైన, ఊరట కల్గించని శుష్క వేదాంతం. ఆరోజు నిద్రలేచాక అతని యెముకలు, కండలు నొప్పిగా ఉంటాయి. తన మనస్సునూ, శరీరాన్నీ స్పార్టకస్‌ను చంపడానికి సంసిద్ధపరచ పూనుకున్నకొద్దీ అవి మరింత నొప్పెడుతాయి. తెల్లవాళ్ళందరిలోకీ అతను స్పార్టకస్‌నే అమితంగా గౌరవిస్తాడు, ప్రేమిస్తాడు. కాని "మల్లుడా! మల్లుల సహవాసం మాను" అని చెప్పబడింది.

# 4

స్నానశాలవైపు నలుగురూ మౌనంగా నడుస్తున్నారు. మాట్లాడి ప్రయోజనం లేదు; ఇప్పుడు మాట్లాడుకోవలసినదీ లేదు. అప్పటినించి రంగస్థలానికి పోయేవరకూ వాళ్ళు కలిసే వున్నప్పటికీ మాట్లాడుకోవడం పరిస్థితిని మరింత పాడుచేస్తుంది.

అప్పుడే స్నానాల తొట్టెలు ఆవిరి సెగలతో వేడెక్కినయి. వాళ్లు నీటితొట్టెల్లో పడ్డ పద్ధతి చూస్తే. స్నానశాల చాలా భాగం చీకటిగనే వుంది. నలభై అడుగుల పొడవూ, ఇరవై అడుగుల వెడల్పూ వుండి తలుపులు మూసినపుడు యింటికప్పులో వున్న చిన్న అద్దపు కిటికీలగుండా కొద్ది కాంతి ప్రసరిస్తుందేతప్ప యింకే వెల్తురూ రాదు. ఈ పాలిపోయిన వెల్తురులో నీరు మబ్బుగా వుంటుంది. తెల్లని ఆవిరి దానిపై తెరలుక్రమ్మి ఆ గదినిండా అల్లుకుంది. స్పార్టకస్ శరీరంలోని ప్రతి రంధ్రం ద్వారా అది ప్రవేశించి బిర్రబిగిసిన అతని ప్రతికండరాన్ని వదులుచేసింది. ఏదో అనిర్వచనీయమైన హాయినీ సౌఖ్యాన్ని ప్రసాదించింది. ఈ ఆవిరి, ఈ వేడినీళ్ళు అతనికి ఎన్నటికీ అంతంగాని అంతుచిక్కని ఆశ్చర్యంకలిగిస్తవి. ఐనా న్యూబియా ఏడారి మృత్యువును మాత్రం అతనినుండి సంపూర్ణంగా కడిగివేయలేకపోయింది. అతనెప్పుడు స్నానాలగది

లోనికి వెళ్ళినా అంత జాగ్రత్తయిన శరీరపోషణ యివ్వబడే మనుష్యులు చావడానికి చావును తయారుచేయడానికే అటువంటిపోషణ యివ్వబడ్తుందని అనుకోకపోలేదు. గోధుమ, బార్లీ, బంగారం మొదలైన మానవావుసర వస్తూత్పత్తిలో తాను పాల్గొన్నంత కాలం అతని శరీరం మురికితో అసహ్యంగా అనవసరమైందిగా వుండేది: వుంచబడేది. కొరడాదెబ్బలకు, తన్నులకు, తాడింపులకూ మాడ్చిచంపడానికి తన శరీరాన్ని ఉపయోగించేవారు. కాని యిప్పుడు తనొక చంపే, చంపబడే జంతువుగా మారేడు గాబట్టి అశేషశ్రమతో భూమిలోతులనుండి త్రవ్వితీసిన మేలిమి బంగారం కన్నా విలువైనదిగా చూడబడ్తున్నది అతని శరీరం.

విచిత్రంగా తోచవచ్చునుగాని యిప్పుడే అతనిలో ద్వేషభావం పొడచూపింది: అంకురించి చిలవలు పలవలుగా వృద్ధిచెందుతోంది. పూర్వం ద్వేషించడానికి తీరిక వుండేది కాదు. ద్వేషం యిప్పుడతని కందుబాటులో వున్నది. తన ద్వేషానికి కారకుడయినవాడు లెంటులుస్ బేటియాటస్. అతను రోమును అసహ్యించుకున్నాడు. బేటియాటస్‌నూ అసహ్యించుకున్నాడు. రోముకు సంబంధించిన ప్రతివిషయాన్ని అసహ్యించుకున్నాడు. అతను భూమిని సేద్యం చేయడంలో పశువులమందలను పెంచడంలో మట్టినుండి బంగారం తీయడంలో పుట్టి పెరిగినవాడు. కాని ఒక్క రోమ్‌లోనే అతను చూశాడు: ఏభావ ప్రకోపనంకోసమో ఏ కొద్దిమంది స్త్రీల నీచ అభిరుచుల కోసమో, అమానుష ప్రతిహింసావాంఛతో తోడి మానవుణ్ణి ముక్కలుగా కోసి చిత్రవధ చేయడానికి, ప్రాణప్రదమైన రక్తాన్ని రంగస్థలపు టిసుకలో ప్రవహింపజేయడానికి మాత్రమే పోషింపబడుతున్నాడు మానవుడు.

స్నానశాల విడిచి మాలీసుచేసే బల్లలదగ్గరకు వాళ్ళు వెళ్ళారు. మాలీసువాడి వేళ్ళు నేర్పుగా అతని కండలను కండరాలను అత్తరువులు వేసి వదులుగా సాగదీస్తున్నప్పుడు అతనెపుడూ కళ్లుమూసుకునే వుండేవాడు. మొదటిసారి యీ మాలీసు పనికని వచ్చినప్పుడు వెతుకుతూ నలుపుతూ అతని శరీరంపై వేళ్ళు విచ్చలవిడిగా విహరించినప్పుడు తను బందీఅయిన పెంపుడు జంతువులా, వున్న కాస్త స్వేచ్ఛా పోగొట్టుకున్నట్లుగా, తన శరీరం పరాధీనమైనట్లుగా బెదిరిపోయాడు; భయపడ్డాడు. ఇప్పు డతను దాని ఉపయోగానికి అలవాటుపడ్డాడు. ఈ బల్లమీద అతను పన్నెండు సార్లు ఈ కర్మకాండల కోసం పడుకున్నాడు. అంటే పన్నెండుసార్లు పోరాడేడన్న మాట! కేపువాలోని పెద్ద రంగభూమిలో ఎనిమిదిసార్లు! పోరాడినంతసేపూ అరుస్తూ పిచ్చెక్కిన జనసమూహం 'కొట్టు నరుకు!!' అని తనను హెచ్చరిస్తూనే వున్నారు. తా నెన్నడూ చూడని పురాణగాథల్లోని మహానగరాలవంటి నగరాలనుంచి తమ

ప్రియులతో, ప్రియురాండ్రతో ఒకనాటి తమాషా ఆనందిద్దామని, స్వయంగా చూసి తెలుసుకొని మరింతగా ఆనందం పొందుదామని వచ్చిన ధనవంతులైన రసజ్ఞుల వినోదంకోసం, బేటియాటస్ రంగస్థలాల్లో నాల్గుమార్లు....

ఆ బల్లలపై పడుకున్నప్పుడు సాధారణంగా అతనికి కలిగే ఆలోచనలే ఈనాడు కూడా కలిగాయి. అవి అతని హృదయఫలకంపై చిత్తరువులా నిల్చిపోయాయి. ఎంతో ఘోరమైనా గనులలోనిపని, పొలంపని రంగస్థలపు టిసుకలో నిలబడి మరో అభాగ్యుని హతమార్చడంకన్నా ఘోరంకాదు. అక్కడి భీభత్సభయానక దృశ్యం మరెక్కడా చూడం. చావడానికి నిర్ణీతమైన ఆ సమయంలో కలిగే అన్యాయం, అవమానం మరెన్నడూ కలుగవు. అందుకే ఏరకమైన మానవజీవిత విధానమూ మల్లుని జీవితమంత నీచమైనది కాదనుకున్నా డతను. జంతువుకూ, తనకూ వున్న సాన్నిహిత్యమూ. సాదృశ్యమే అతనికి ఆ పోషణా, జాగ్రత్తా యివ్వబడేలా చేశాయి. ఉత్తమాశ్వాన్ని పెంచినట్లు పెంచుతున్నారు! ఐనప్పటికీ ఈ రంగస్థలంలోనే ఒక గుర్రాన్ని చంపుదామా అని ఎవరైనా అంటే లెంటులుస్ బేటియాటస్ అతనివంటి రోమన్ పౌరులు వున్నపాటున మండిపడేవారే! అవమానాన్నీ, భయాన్నీ అతను భరించాడు. మాలీసువాడి వేళ్ళు దెబ్బలు తగిలిన శరీరభాగంలోని ప్రతిఅణువునూ, కండరాన్నీ పట్టుకు సాగదీస్తూ లాలిస్తున్నవి.

అక్కడికే అత డదృష్టవంతుడు. తలచుకొన్నంత మాత్రాన భయంతో, బాధతో తన సహచరులు దిగులుచెందేలాటి గాయాలు తనకెన్నడూ తగల్లేదు. నరాలు తెగలేదు. ఎముకలు విరగలేదు. కంటిగుడ్డు వూడనూలేదు. కర్ణరంధ్రాల్లో కత్తిపోటు పడనూ లేదు. తల బద్దలవనూలేదు. ఇది నిజంగా అతని అదృష్టమే. అతనికి తగిలినవన్నీ చిన్నచిన్న గాయాలే. అంత తక్కువ దెబ్బల్తో బయటపడడం తన నైపుణ్యమేనని అతడు భావించలేదు. చంపడంలో, కసాయితనంలో, నైపుణ్యం! ఏ బానిసా సైనికుడు కాలేడని వాళ్ళంటారు. పిల్లికున్నంత చురుకుదనమూ అతనికుంది. ఆకు పచ్చని కళ్ళున్న యూదునికున్నంత చురుకుదనమూ అతనికుంది. తన ప్రక్కబల్లపై పడుకున్న ఆ యూదుడెంత ఏహ్యంగా చూడబడ్తాడో! మంచిబలమైనవాడూ, ఆలోచించ గలిగినవాడు. ఇదే కష్టం—ఆలోచించినా, ఆగ్రహించకపోవడం. కాని రంగస్థలంలో కోపం దెచ్చుకున్నాడా చచ్చాడన్నమాటే. భయమయితే ఫరవాలేదుగాని, కోపంమాత్రం రా కూడదు. అదేమంత కష్టంగాదతనికి. ఇంతవరకూ అతని భావాలే అతన్ని బతికేలా చేసిన పరికరాలు. చావక బ్రతికేలాచేసిన పరికరాలు. ఈ విషయం ఎవరికీ తెలీదు. "ఓ! బానిసేనా. వాడు దేన్నిగురించీ ఆలోచించడు. మల్లుడయితే మృగమే." అలాగే

కనబడ్తుంది పైకి. కాని లోపల సరిగ్గా దేనికి తల్లక్రిందులుగా వుంటుంది. ఎప్పుడైనా జన్మానికి ఓ శివరాత్రిలా ఆలోచిస్తే చాలు స్వతంత్రుడైన మనిషి బ్రతగ్గలడు! కాని ప్రతిక్షణం, అనునిత్యం ఆలోచిస్తేనేగాని బానిస బతకలేడు! మరో విధమైన ఆలోచనే అవొచ్చు. కాని ఆలోచనేకద. వేదాంతికి భావం సహచరునివంటిది. కాని భావం బానిసకు శత్రువు. ప్రతినిత్యం ఎదుర్కొనే శత్రువు. వరీనియాని ఆ వుదయం వదిలినప్పుడు స్పార్టకస్ అనుకున్నాడు: ఆమె ఎన్నడూ లేనేలేదనీ, ఆమెనుగురించి ఆలోచించకూడదనీ. అతడు బ్రతికితే. ఆమెకూడా వున్నట్లే; కాని ప్రస్తుతం అతను బ్రతకనూలేదు, జీవించనూలేదు.

మర్దన పూర్తయింది. నలుగురు బానిసలూ బల్లలు దిగి ఉన్నివస్త్రాలను కప్పుకొని భోజనశాలవైపు కదిలారు. ఎదురుగావున్న చిన్న పీటలపై ఆహారాన్ని వాళ్ళు భుజిస్తున్నారు. ఒక గిన్నెడు మేకపాలు, పందిమాంసం ముక్కలు వేసిన గోధుమ పులుసు వడ్డించబడ్డాయి. ఇక్కడకి వచ్చిన ప్రతివాడూ తన జీవితంలో మొదటిసారిగ తిన్నది ఈ శిక్షణా కేంద్రంలోనే. ఏపియన్ మార్గంలో శిలువలపై మేకులతో దిగ్గొట్టబడ్డ ప్రతివాడూ అంతకుపూర్వం యిక్కడే సుష్టుగా భుజించాడు. రంగస్థలంలో ప్రదర్శనం యివ్వవలసినవారికి మాత్రం, కడుపునిండా తిని దెబ్బలాడలేరు కనుక, కొంచెం తక్కువపెడ్తారు.

స్పార్టకస్‌కు ఆకలిలేదు. వేరువేరుగా, దూరదూరంగా కూర్చున్న ఆ నలుగురికీ తిండి సయించదు. ఏ మాంసంముక్కో ఒకటి రెండుమారులు, కొరికేవారు. ఒకరి ముఖాన్ని ఒకరు చూసుకునేవారు. చుట్టూవున్న అంతగొడవలోనూ నిశ్శబ్దంగావున్న ఈ నల్గురూ కల్లోలసముద్రంమధ్య ద్వీపంలా వున్నారు. తక్కినమల్లులు వీళ్ళతో మాట్లాడనూలేదు. చూడనూలేదు. వీ ళ్లున్నారనే విషయం పట్టించుకోలేదు. ఇదీ, ఆఖరి భోజనం చేసేవాళ్ళకి యివ్వబడే మర్యాద.

వీళ్ళ నెలా వుజ్జీలు వేశారో అందరకూ తెల్సినదే. చిన్న కత్తి ఆయుధంగా కల స్పార్టకస్‌ను వల పట్టుకొని త్రిశూలధారుడై పోరాడే నల్లని మల్లుతో ఉజ్జీవేశారని ప్రతివాడికీ తెలిసింది. థ్రేషియన్ యూదునితో దెబ్బలాడాలన్న విషయమూ తెల్సింది. స్పార్టకస్ చస్తాడు. యువకుడయిన థ్రేషియన్ కూడా అంతే అనుకున్నారు. ఇదంతా స్పార్టకస్ తప్పు. జర్మను పిల్లతో తాను పడుకోడమేగాక, ఆమె తన భార్య అని అందరకూ చెప్పడం, అదీగాక అందరూ అతణ్ణి ప్రేమించేలా చేసుకోడం యిదంతా అతని తప్పే! ఆ హాలులో కూర్చున్న మల్లులెవరూ యీ విషయం స్పష్టంగా చెప్పలేకపోవచ్చు. ఇదంతా ఎందుకు జరిగిందో ఎలా జరిగిందో వాళ్ళెవరికీ తెలీదు. ఒక్కొక్క

మనిషి ఒక్కొక్క మాదిరిగా వుంటాడు. ఒక్కడిలోనే వెయ్యిరకాల చేతలూ, చేష్టలూ వుంటాయి. సరళమయిన మృదుస్వభావమూ, గొర్రెవంటి ముఖవైఖరీ, పగిలిన ముక్కూ కలిగివున్నాడు స్పార్టకస్. ఇవన్నీ అతని నిర్ణయాలను అంతా పాటించేలా చేసేందుకు తోడ్పడ్డాయి. అంతా యితనిదగ్గరకు వచ్చేవారు న్యాయ నిర్ణయం చేయమని, తేల్చిచెప్పమని. అతడు ఏది నిర్ణయించినా తక్కినవాళ్ళంతా దాన్ని పాటించేవారు. వింతైనా ఉచ్చారణచేస్తూ మృదువుగా మాట్లాడే అతని మాటల్ని అంతా వినేవారు. సంతోషంగా వున్న వ్యక్తిలా కన్పడేవాడతను. ఎప్పుడూ తల వంచలేదు. బానిసల కిది కొత్త! ఎప్పుడూ కోపంగా మాట్లాడలేదు. స్వరం హెచ్చించలేదు. సంతృప్తి అతన్ని తక్కినవారినుండి వేరుచేసింది. చంపేందుకు శిక్షణపొందే వీరితో అతను ఆ విధంగా ప్రవర్తించేవాడు.

"మల్లులు మృగాలు!" బేటియాటస్ తరచు అనేవాడు: "ఎవరైనా వాళ్ళని మనుష్యులనుకొనేవాళ్ళుంటే దేన్నైనా చూసి అర్థం చేసికోగల దురానుగతచిత్రణ లేని వాళ్ళన్నమాట!"

ఉన్న విషయమేమిటంటే స్పార్టకస్ జంతువు కా నిరాకరించాడు. అందుకే అతను ప్రమాదకరం. కత్తి నుపయోగించడంలో నిపుణత వుండడం మూలాన అతని వల్ల చాలా డబ్బువచ్చే అవకాశమున్నా, మంచి బేరం వచ్చినపుడు స్పార్టకస్ లాభసాటిగా చావడమే నయమనుకున్నాడు, బేటియాటస్.

భోజనాలయాయి. "వాళ్ళెక్కడ? విశేషాధికారాలు గలవాళ్ళు" అనేవారు అటువంటివాళ్ళను అట్టి పరిస్థితుల్లో. ఇది వక్రోక్తి. నడిచివెళ్ళారు వాళ్ళు. ఆ రోజు వారిని వెలివేశారు. వాళ్ళను తాకకూడదు. వాళ్ళతో మాట్లాడగూడదు. ఆఖరికి వాళ్ళకేసి చూడగూడదు! అయినా గేనికస్, స్పార్టకస్‌ను కౌగలించుకొన్నాడు. ముద్దెట్టుకున్నాడు. అది చాల విచిత్రమైన సంఘటన. అందుకు శిక్ష ముప్ఫయి కొరడాదెబ్బలు. గేనికస్ ఎందుకలా చేశాడో అర్థంచేసుకోలేనివాళ్ళు ఆ మల్లుల్లో లేరు.

## 5

ఎన్నోమార్లు లెంటులుస్ బేటియాటస్ ఆనాటి ఉదయాన్నే జ్ఞప్తికి తెచ్చుకుని దీర్ఘాలోచనలోపడేవాడు. ఎన్నోమార్లు దాన్నే తన సూక్ష్మపరిశోధనకు గురిచేసేవాడు. ఆ తరువాత ప్రపంచాన్ని కదిల్చిపారేసే సంఘటనలు జరిగాయి. ఆ సంఘటనలకు కారణం అదే అని ఆరోపించడానికి ప్రయత్నించేవాడు. ఆడంబరం పిచ్చిగా అలంకరించుకుందా అన్నట్లు కనిపించే యిద్దరు రోమను యువకులు తన రంగస్థలంలో

ప్రత్యేకప్రదర్శనం చూస్తామంటూ రావడంవల్లనే, ఈ విపరీత విపత్కర సంఘట నలు జరిగేయని అతను నిర్ధారణ చెయ్యనేలేదు. ఇంకా ఒకవారం కాలేదు. ఇటువంటి ప్రదర్శనమే ఒకటి యేర్పాటు చేయబడింది. ఇదీ అల్లాంటిదే: దానికీ దీనికీ యేమీ భేదంలేదే. ఈ సందర్భంలోనే రోమ్‌లో అతని అద్దెకిచ్చే కొంపల్ని గురించి ఆలో చించాడు. ఈ అద్దెకొంపలమీద పెట్టుబడి లాభదాయకమని వర్తకవర్గాలవారు భావించిన రోజులవి. సాధారణంగా వర్తకంలో ఉండే ధరల పెరుగుదల, తగ్గుదల వగైరా దశా భేదాలు దానిలో లేవు. ఆ యిళ్లు తెచ్చేరాబడి తగ్గడమంటూ ఉండదు. వీలునుబట్టి హెచ్చే అవుతుంది. రాబడి పెరగడంతోబాటు, ప్రమాదం కూడా యెదుర్కొంది బేటియాటస్‌ను. అతను నాలుగంతస్తులమేడ ఒకటీ, ఐదంతస్తుల దొకటి రెండు మేడలు కొన్నాడు. ప్రతి మేడలో అంతస్తు కో డజను చొప్పున గదులుండేవి. ఏడాది కొక్కొగదిమీద తొమ్మిదివందల సెస్టెర్‌సెస్ ఆదాయం వచ్చేది.

అదనపు రాబడి రావాలంటే, అదనంగా అంతస్తులు కట్టాలన్న విషయం గ్రహించడానికి అతనికి ఆట్టేకాలం పట్టలేదు. తక్కువజీతాలు సంపాదించేవాళ్ళు మాత్రం పెట్టుబడిపెట్టగలిగే స్థితిలో ఉండేవారు కాదు. ధనవంతులు చుక్కలనంటే భవనాలు నిర్మించుకొన్నారు. వెంటనే తన ఐదంతస్తులమేడను ఏడంతస్తులమేడ చేసేడు. కాని అల్లాగేనాలుగంతస్తుల మీడమీద మరో రెండంతస్తులు వేయించేసరి కా మేడకుప్ప కూలి చతికిలబడింది. కూచుని నోరు తెరిచిన భవనాన్ని జూసి, నష్టం వాటిల్లింది కదా అనే విచారానికి తోడు, ఆ కొంపలో అద్దెకున్న యిరవైమంది చచ్చిన పాపం అతన్ని చుట్టు కొంది. అంతటితో ఒదిలిందా, ఖర్మం చాలక వాళ్ళు చావడమేమిటి, ఈ గొడవ యితని మెడకు చుట్టుకోడమేమిటి? మొత్తంమీద యీ గొడవ మాపు చేయించాలంటే యెంతో డబ్బు లంచాల రూపంలో తగలెయ్యాలి. రాశికి రాశిని కలిపితే గుణంలో తేడా కనబడుతుందన్న సూత్రం యీ నష్టానికి నష్టం తోడైన యేతత్సంఘటనలో అతనికి బోధపడింది. తక్కిన వర్తకప్రముఖులకు తను తీసిపోలేదనుకున్నాడు. తీసిపోలేదు సరికదా వాళ్ళకన్న పిసరంత నయమే అనుకున్నాడు కూడా.

ఆ రోజు దుర్దినమన్నది నిజం. పొద్దున్నే గేనికస్‌ని కొట్టడంతో ప్రారంభ మైంది. అసలు మల్లులను కొట్టగూడదు నిజానికి. ప్రపంచమంతటికీ అద్వితీయ మైన, అనుల్లంఘనీయమైన క్రమశిక్షణని యీ శిక్షణకేంద్రం అమలుపరుస్తుంది, ఆచరిస్తుంది. ఆచరించేలా చేస్తుంది. మల్లు డా క్రమశిక్షణను యేమాత్రం పాటించక పోయినా వెంటనే కఠినంగా శిక్షించితీరాలి; రెండో తప్పు చిన్నకత్తితో పోరాడే మల్లుడ్ని వల, త్రిశూలం పట్టుకుని పోరాడే ఆఫ్రికావాడితో ఉజ్జీ కట్టడం;

మూడోది ఆ పోరాటం జరిపించడం, ఇవన్నీ మల్లుల క్రోధానికి కారణభూత మయ్యాయి.

అతిథుల రాక కెదురుచూస్తూ, రంగస్థలందగ్గర నిలబడ్డాడు బేటియాటస్. వ్యక్తిగతంగా ఈ రోమన్లంటే యెటువంటి భావమున్నా, ఏమనుకున్నా డబ్బు కియ్యవలసిన గౌరవమొకటి ఉందిగా. ఎప్పుడతనో లక్షాధికారిని చూసినా—లక్షలు మూల్గుతున్న వాడుగాని, కోటికి పడగెత్తినవాడుకాని కాదు, యెవడు లక్షలు ఖర్చుచేస్తాడో వాడు—తనని వానితో పోల్చుకున్నా, తనో రోడ్డుప్రక్క బురదనీటిలో కప్పలాగ భావించుకుని ఆ భావంలో మునిగిపోయేవాడు. రౌడీమూకల నాయకుడుగా రోడ్లమీద తను తిరిగిన రోజులలో, ఎల్లాగో ఒక లాగున నాలుగు లక్షలు సంపాదించి యోధవరుల సమాజంలో తా నో సభ్యుడుగా చేరాలని తహతహ లాడేవాడు. కలలు కనేవాడు. తనూ ఆ పెద్దమనుష్యుల జట్టులో జేరిన పిమ్మట, ధనమంటే యేమిటో, అదేం చేయగలదో గుర్తించి, తా నిప్పటికి యెక్కగలిగిన యెత్తు యేమీకాదని అనుకున్నాడు. అతని కెదురుగా అనంతమైన సోపానపథం కనిపించింది.

గౌరవించాల్సిన అవసరం ఉన్నచోట గౌరవించాల్సిందే. అందుకే అతను క్రైయస్‌కోసం, బ్రాకస్‌కోసం నిరీక్షిస్తున్నాడు. ఆ హడావిడిలో గేన్నికస్ కొరడాదెబ్బలు తిన్న సంగతి అతని ఆలోచనలోకి రాలేదు. మెడ సాచి, అటూయిటూ తల తిప్పుతూ వుంటే కాని కనబడే అవస్థ లేకుండా రంగస్థలమంతా కూచున్నచోటునుండి కదల కుండా చూడడానికి వీలుగా ఎత్తైన ప్రదేశంలో ఒక చిన్న మంటపం కట్టించాడు. చల్లని ద్రాక్షసారా, అనేకరకాల తీపి ఫలహారాలూ, రకరకాల పళ్లూ ఎప్పటికప్పుడే వాళ్ళ ఆకలిని తీర్చటానికి అక్కడ ఉంచేరు. వాళ్ళమీద యెండపడకుండా చారల వితానం ఒకటి ఉంది. మధ్యాహ్నం యెండ యెక్కువై, అతిథులకు చెమటపడుతుంది కాబట్టి, వాళ్ళకు గాలి కావలసిన అవసరం యేర్పడుతుందని విసనకర్రలు పట్టుకొని నిలబడి విసరటానికి యిద్దరు బానిసల్ని నియోగించాడు. ఎంత వింతైన, విచిత్రమైన కోర్కెనయినా అతిథులు కోరినవెంటనే తీర్చడానికని అన్ని ఏర్పాట్లూ కావింపబడ్డాయి. ఆ యేర్పాట్లన్నీ తన ఆధ్వర్యంలో జరిగినందుకతను కొంత గర్వించాడు. ప్రదర్శనం ప్రారంభమయేలోపున వాళ్ళకు విసుగు అనిపించకుండా సంగీతం, నృత్యం యేర్పాటు చేశాడు.

ఈ కులీనుల ప్రవర్తనలో ఏదో ఒక లంకె వుంటుంది. అది అలా సాగుతూ గొలుసులా వుంటుంది. అలాంటిదే ఏదో యిక్కడకూడా వుందని తెలుసు అతడికి. కాని తన జీవితకాలంలో యిది ఫలానా అని నిర్వచించి ప్రవచించగల శక్తి అతనికి

కలగలేదు. పోనీ ఏదైనా మతీసుతీవున్న ప్రవర్తనా పద్ధతికనుక అతడికి తటస్థపడటం సంభవిస్తే, దానివెనుక తన పూర్వపు జీవిత చరిత్ర మరుగుపరుద్దామని అతడి తాపత్రయం. ప్రత్యేక ప్రదర్శనలు ఏర్పాటు చేయించుకున్నవాళ్లు ఒక్కొక్కరు ఒక్కొక్కలా ప్రవర్తిస్తారు. ఎవరి పద్ధతి వారిది. ఎలా తెల్సుకోవడం.

బేటియాటస్ యూదుణ్ణి తీసుకరావడానికని మనిషిని పంపాడు. ఇరువైపులా శిక్షకులు నడుస్తుంచే వీళ్ళదగ్గరగావచ్చి నిలబడ్డాడు యూదుడు. ఉన్ని వస్త్రం కప్పుకున్నాడతను. కళ్ళు చల్లని గులకరాళ్ళలా వున్నాయి. అక్కడకు వచ్చి నిలువబడ్డాడు.

ఆ స్త్రీ పండ్లిగిలించింది. నవ్వలేకపోయినా నవ్వును బలవంతపెట్టింది. కైయస్ హడలిపోయాడు. ఈ మల్లుడు గనుక తిరగబడితే ఆ యిద్దరు శిక్షకులు వీణ్ణి ఆపలేరని అతడి నమ్మకం. మల్లుడు తనకు బారెడు దూరంలో వున్నాడు. గోడకాని, కటకటాలు కాని ఏవీ అతణ్ణి తననుంచి వేరు చేయడంలేదు. ఆ విధంగా అంతదగ్గరగా నిలబడ్డం అతని జీవితంలో యిదే మొదటిసారి. ఆకుపచ్చని కళ్ళు, చిన్ననోరు, గెద్దముక్కులా వంపు తిరిగిన ముక్కు, అంటకత్తెరవేసిన తల-వీడి వ్యవహారంచూస్తే మనిషిలాలేడు.

"ఆ గుడ్డ తీసిపారేయ్ మనండి" అన్నాడు బ్రాకస్, బేటియాటస్‌తో.

"తీసేయ్" అన్నాడు బేటియాటస్.

కొద్ది క్షణాలు అలాగునే నిలబడ్డాడు యూదుడు. నిలబడి చటుక్కున తనవంటి మీద బట్టను తీసిపారేశాడు. సన్నంగా, పొడుగ్గా రాళ్ళలాంటి కండలు కలిగిన అతని శరీరం నగ్నంగా నిలబడింది. అతడిపుడు దిగంబరుడు: చలనంలేని కంచువిగ్రహంలా నిలబడ్డాడు. కైయస్ చూశాడు. అతని దృష్టిలో వ్యామోహం పాలుకలిసింది. ల్యూషియస్ విసుగుచెందిన వాడిలా నటించాడు. గట్టిగా త్వరత్వరగా గాలి పీలుస్తున్న అతని భార్య నోరుతెరుచుకొని అలాగే చూస్తూండిపోయింది.

"కండలు కల్గిన జంతువు" అన్నాడు బ్రాకస్.

యూదుడు వంగి వున్ని వస్త్రాన్ని తీసి తిరిగి కప్పుకుని వెళ్ళిపోయాడు. శిక్షకులు వెన్నంటారు.

"ముందతణ్ణి దెబ్బలాడ నీయండి" అన్నాడు బ్రాకస్.

## 6

ఆ కాలంలో యూదులు కాని, థ్రేషియన్లు కాని సాంప్రదాయ సిద్ధంగా పోరాడే బాకుతోపాటు వాళ్ళ కోడాలుగూడా యిచ్చితీరాలని చట్టంలో లేదు. అది చట్టరూపంలో

వున్నపుడుకూడా, చట్టం ఉల్లంఘించడానికే అన్నసూత్రం తరుచు దానికి వర్తిస్తూ వుండేది. ఇత్తడి చేతితొడుగులు, శిరస్త్రాణాలలాగనే యీ డాలుగూడ బాకు యుద్ధంలో వుంటే మజా వుండదు. దానిలో వుండే అద్భుత లాఘవం, చురుకుదనం యివన్నీ చస్తాయి. నలభై ఏళ్ళక్రితం—అప్పటికి మల్లయుద్ధాలు అక్కడక్కడ అప్పుడప్పుడు జరిగేవి. కవచాలు, శిరస్త్రాణాలు నిడుపాటి పెద్ద పెద్ద డాళ్లు, స్పానిష్ కత్తులు యింత సరంజామాతో దెబ్బలాట మొదలెట్టేవారు. దాన్లో వుషారు లేదు, ఉద్రేకమూ లేదు. రక్తపుబొట్టు కంటి కగుపించదు. ఏఁవీలేదు. కత్తిమీద కత్తిపడి చప్పుడవడం, డాలు డాలు వేసి కొట్టుకోవడం, యిల్లా గంటలకు గంటలు జరగడం, ఎవడికీ ఒక్క వెంట్రుకగూడా తెగకపోవడం! అప్పుడుగూడా యీ మల్లయుద్ధంవల్ల డబ్బు సంపాదించేవాడిని-ముండను తార్చేవాణ్ణి అసహ్యించుకునేట్లు అసహ్యించుకునేవాళ్ళు. ఎందుకూ పనికిరాని బానిసలను కొని వాళ్ళొకరినొకరు కొట్టుకుని చివరికి రక్తం ఏమీ మిగలకనో, అలసటవల్లనో చస్తే, డబ్బు సంపాదించే రౌడీల నాయకులే యీ వర్తకులు. దానికి తోడు తార్పుడు వ్యాపారం గూడా వాళ్ళకి లేకపోలేదు.

పూర్వపు మల్లయుద్ధాలకు అర్ధముండేదిగాదు. కొత్తమార్పులు రావడంతో రోమ్ ప్రజలు వెర్రెత్తిపోయారు. ఈ వ్యాపారం చేసేవా ళ్ళెంతోమంది రాజ్యాంగ సభాసభ్యులయారు. ధనవంతులయారు. దీనికి రెండు ప్రధాన కారణాలున్నాయి. ఒకటి రోమను సైన్యాలు ఆఫ్రికాను జయించడం: రెండు రోమను పెట్టుబడి ఆఫ్రికాలో చొచ్చుకుపోవడం. బలంగా ఎత్తుగా వుండే నీగ్రోలు బానిస బజారుల్లోకి కొనుగోలు వస్తువుగా తీసుకురాబడ్డారు. మల్లులపై ధనార్జనచేసే వర్తకు డెవడో ఈ నల్లని మనిషి చేతిలో చేపల వలా, త్రిశూలం పెట్టి, కత్తితో పోరాడే మరో మల్లునితో ఉజ్జీకట్టి దెబ్బలాడనిద్దామని బుద్ధి పుట్టింది. ఈ తమాషా రోమనులకు నచ్చింది. నానాటికి దీని మీద మోజు హెచ్చిపోయింది. దాంతో యిటువంటి పోరాట ప్రదర్శనలు మామూలయి పోయాయి. రెండో మార్పు థ్రేస్, జ్యూడియాలు రోమనుల హస్తగతం అవడంతో పాటు ప్రవేశించింది. అక్కడ కొండల్లో కాయకష్టంచేసే బలవంతులయిన మోటు రైతులు పట్టుబడ్డారు. విపరీతమైన పదును కలిగి వంపుతిరిగివుండే ఒక రకమైన చిన్న బాకును వీ ళ్లుపయోగిస్తారు. నల్లని త్రిశూలధారులకన్న ఈ థ్రేస్, జ్యూడియా రైతులే మల్లయుద్ధ పద్ధతుల్లో ప్రధానమైన మార్పు తీసుకువచ్చారు. సాధారణంగా కవచమూ, కేడెమూ ఉపయోగించరు. కత్తి కత్తిని, డాలు డాలుని కొట్టుకునే పురాతన మల్ల యుద్ధ రీతులుమారి మెఱుపు మెఱసినట్లుండే బాకు యుద్ధం, ఘోరమైన బలమైన గాయాలు, రక్తం, కడుపు చీల్చుకుపోయి పైకి వచ్చి వేళ్ళాడే పేగులు, మాంసపు

పేలికలూ, యుద్ధనైపుణ్యం, బాధ, విపరీతమైన చులుకుదనం రంగస్థల ప్రవేశం చేశాయి.

బ్రాకస్ తన యువస్నేహితునకు చెప్పినట్లు "ఒకమారు థ్రేషియన్ల కొట్లాట చూస్తే యింక మరేమీ చూడవు తెల్సా! మిగిలినదంతా అర్ధరహితం, విసుగు పుట్టించేదీ కదలికలేనిదీ - థ్రేషియన్ల పోరాటమే హుషారుగా వుంటుంది."

ద్వంద్వయుద్ధానికి సమయం సమీపించింది. నాట్యకర్తె, సంగీత గాయకులు వెళ్ళిపోయారు. ఆ చిన్న రంగస్థలం ఖాళీగా పడివుంది. నిశ్శబ్దం రాజ్యం చేసింది. ఒక్కొక్కప్పుడు నిశ్శబ్దం బాధపెడ్తుంది. వాళ్ళు నలుగురూ పందిరి నీడలో కూర్చొని లేత గులాబీరంగు జ్యూడియా ద్రాక్షసారా సేవిస్తూ నిరీక్షిస్తున్నారు.

# 7

రంగస్థలంవైపు తెరుచుకున్న ఒక్క షెడ్‌లో యిద్దరు థ్రేషియన్ మల్లులు ఒక నల్లని ఆఫ్రికామల్లు ముగ్గురూ కూర్చొని యీదునికోసం ఎదురుచూస్తున్నారు. సంతోషరహితంగా ఒక బల్లమీద వా ళ్ళాసీనులయారు. వాళ్ళను స్వాధీనులని పిలుస్తారు. యశస్సు కాదు, ప్రేమకాదు, గౌరవంకాదు యివేవీకాదు; సిగ్గు - అదే వాళ్ళ సాహచర్యం చేస్తుంది. స్వయంగా విధించుకున్న మౌనాన్ని తోసిపుచ్చుతూ ఆఫ్రికా మల్లు డన్నాడు:

"భగవంతుడు నిన్ను ప్రేమిస్తే బాల్యంలోనే చద్దువు."

"కాదు" స్పార్టకస్ వ్యతిరేకించాడు.

అప్పుడా నల్లనివాడు అడిగాడు: "నీకు భగవంతుడంటే నమ్మకముందా?"

"లేదు."

"అయితే నువ్వు నమ్మేదేవిటి స్పార్టకస్?"

అందమైన థ్రేషియన్ యువకుడు పోలిమస్ అందుకుని, "నువ్వూ, నేనూ కసాయి దుకాణంలో వర్తకుడమ్మే మాంసపు ముద్దల్లాంటి వాళ్ళం."

"నువ్వింకా ఏవేవి నమ్ముతావ్ స్పార్టకస్?" నల్లవాడు అడిగాడు. "ఇంకా ఏంవిటి? మనిషి దేన్ని గురించి కలగంటాడు. చావబోయే మనిషి, మృత్యు ముఖ ద్వారంలో నిలబడ్డమనిషి దేన్ని కలగంటాడు?"

"నేను చెప్పాల్సింది యింతకుపూర్వమే చెప్పాను" మృదువుగా మాటాడిన నల్లమల్లుని కంఠస్వరం స్పార్టకస్ హృదయంలో ప్రతిధ్వనిస్తోంది. విచారిస్తోంది. "ఇదికూడా చెప్పగలను: నేను చాలా ఒంటరిగా నా యింటినుంచి ఎంతో దూరంగా

యింటికి తిరిగిపోదామనే బలీయమైనకోరికతో వుంటున్నా. ఇంకనేమాత్రం నేబ్రతక దల్చుకోలేదు. సహచరుడవు నిన్ను నేను చంపాలిక! కాని చంపను.''

"కారుణ్యానికి యిదా చోటు?''

"బడలికకు యిది ప్రదేశం. నేను దాని బానిస.''

"నా తండ్రి బానిస'' స్పార్టకస్ అన్నాడు. "నా కతడొక సుగుణం నేర్పాడు. బానిసలోని ఒకేఒక సుగుణం జీవించడం.''

"మనం యిద్దరం జీవించడం కష్టం.''

"ఇతరులకుమల్లేనే బానిసలకుకూడా జీవితంచూపే కాస్త దయ ఏమంటే అతని చచ్చేరోజులు ముందుగా తెలీనీకపోవడమే.''

కాపలావాళ్ళు వీళ్ళ సంభాషణ విన్నారు. బల్లేలతో గోడపై కొట్టి మాటాడకూడ దన్నట్లు సైగచేశారు. యూదుడు వచ్చేడు. ఏ పరిస్థితిలోనూ అతను మాట్లాడడు. అత నెప్పుడూ మాట్లాడలేదు. సిగ్గుతో, విచారంతో వంచిన శిరస్సుతో, కృంగిన హృద యంతో అతనక్కడ నిలబడ్డాడు. బాకా మోగింది. థ్రేషియన్ యువకుడు లేచేడు. అతని కిందిపెదవి బరువుగా కదులుతోంది. కప్పుకొన్న బట్టలనక్కడవదలి వాళ్ళిద్దరూ బయలుదేరారు. తలుపు తెరుచుకుని థ్రేషియన్ యువకుడూ, యూదుడూ దిగంబరు లుగా రంగస్థలం ప్రవేశించారు.

ఆ నల్లనిమనిషి కాసక్తి నశించింది. మృత్యుదేవతా పీఠంమీద తను కూచున్నా ననుకొన్నాడు. యాభై రెండుసార్లు, యాభై రెండు పర్యాయాలు వలపన్ని, త్రికాలం సంధించి బ్రతికి బైటపడ్డాడు. కాని యిప్పుడు జీవితంతో అతన్ని బంధిస్తూ వచ్చిన తాడు తెగింది. మోచేతులు మోకాళ్ళపై ఆన్చి, అరచేతులలో తల పెట్టుకొని స్మృతు లను నెమరు వేస్తున్నాడు. స్పార్టకస్ మాత్రం తలుపు సందులోంచి రంగస్థలంవైపు చూస్తున్నాడు. థ్రేషియన్ తన జాతివాడే, యూదుడు మాత్రం తన హృదయాన్ని ఆదోమాదిరిగా చీలుస్తున్నాడు. ఇటువంటి ద్వంద్వయుద్ధాలు జరిగినప్పుడు ఒకడు చావడం తథ్యం. కాని దాని సారాంశమేమిటంటే జీవితమున్నంతకాలం జీవించడానికి ప్రయత్నించాలని; స్పార్టకస్ సారాంశంకూడా జీవితమే. అతనిలోని ఆ విషయాన్ని గుర్తించారు ప్రజలు. బ్రతుకుదామనే కోర్కె తారలవరకూ లేచిన ఉత్తుంగమైన ఆశాసౌధం. అత నిప్పుడు తలుపులోంచి చూస్తున్నాడు. రంగస్థలంమీద జరుగుతున్న దంతా చూస్తున్నాడు. రంగస్థలం కనిపిస్తోంది.

ఆ మల్లు లిద్దరూ రంగస్థలంలో నిలబడి తమ మాంసాన్నీ, రక్తాన్నీ కొన్న పెద్దమనుష్యులవైపు చూస్తున్నారు. వారి వెనుక వారి నీడలే ప్రవహిస్తున్నాయి.

నూనె పట్టించిన వారి శరీరాలు నల్లగా మెఱుస్తున్నాయి. ఇద్దరూ ఒకరినుంచి ఒకరు పది అడుగులు వెనక్కు తగ్గేరు. వాళ్ళని యిసుక, ఎండ విడతీస్తున్నాయి. స్పార్టకస్‌కు చూపు పొలిమేరలలో వాళ్ళగుపిస్తున్నారు. చారల వితానం కనిపించింది. దానికింద రాతిచప్టావుంది. మెల్లిగా వానిసలు వీచే వీవన లగుపిస్తున్నాయి. కొద్దిమంది అసలు స్వతహాగా శక్తివున్నా, లేకపోయినా ధనం సంపాదించి ఆ విధంగానైనా శక్తివంతు లవుతారు. ఆ విధంగా శక్తిసంపాదించిన యువకులు చావుబ్రతుకులను డబ్బిచ్చికొన్న ఆ యువకులు ఆ మంటపంలో కూచున్నారు. ఏ కాలంలో, ఏ యుగంలో మనిషిలో ఏ భావాలు రావాలో, రావడం సహజమో ఆ భావాలన్నీ స్పార్టకస్‌లో వచ్చాయి. అవన్నీ అతని మెదడులో మెదిలేయి.

ఇప్పుడు శిక్షకుడు రంగస్థలంమీద కొచ్చాడు. రెండు కత్తులు మెఱుగుపట్టిన కర్రపళ్ళెంలోపెట్టి గౌరవానికి చిహ్నంగా ప్రదర్శన ఏర్పాటు చేయించుకున్న వాళ్ళ దగ్గరకు తీసుకెళ్ళేడు. వాళ్ళవైపు వంగి పళ్ళెం వాళ్ళకు చూపగానే పన్నెండంగుళాలు పొడుగున్న కత్తులు మెరుస్తున్నా, వాడిఅంచులు మరింత మెరిసేయి. మంచి నల్ల విరుగుడుచేవతో చేసిన పిడివున్న ఆ కత్తులు ఎంతో పనితనాన్ని చూపిస్తాయి. కత్తులు కొంచెం వంపుతిరిగి వున్నాయి. దాన్ని తాకితేచాలు, చర్మం కోసుకుపోతుంది.

బ్రాకస్ తలూపేడు. స్పార్టకస్‌ను ద్వేషం కత్తితాకిన విధాన తాకింది. ఆపాద మస్తకం తాకింది. ఐనా సంబాళించుకున్నాడు; అణచుకున్నాడు. మల్లులు కత్తులను తీసుకోడం చూసేడు; వాళ్ళు తన దృష్టిపథం నుండి దూరంగా వెళ్ళేరు. ఐనా అతనికి వాళ్ళ ప్రతికదలికా తెలుసు. వాళ్ళిద్దరినీ ఆందోళన హెచ్చరిస్తోంది. వాళ్ళలో నిరుప యోగమైన చురుకుతనం కదులుతోంది. ఒకరినొకరు చూచుకొంటున్నారు. ఒకరినుంచి ఒకరు ఇరవై అడుగులదూరం పోయారు. ఒంగి యిసుకలో కత్తిపిడి తోముతూ చేతు లకు యిసుక పట్టించుకుంటున్నారు. వాళ్ళ హృదయాలు వేగంగా, బలంగా, బరువైన యంత్రాలలా కొట్టుకుంటున్నాయి. వణుకుతూ, బిగిసిన రబ్బరు తాళ్ళలాగున్నాయి వాళ్ళ కండలు.

శిక్షకుడు బిగులూదేడు; మల్లులిద్దరూ తిరిగి స్పార్టకస్ దృష్టిపథంలోకి వచ్చారు. మెరిసే కత్తులు పట్టుకొన్న ఆ దిగంబరులైన మల్లులిద్దరూ పొంచివున్నారు. భూమిని గట్టిగా అదిమిపట్టినట్లు కనిపించే అడుగులేస్తున్నారు. చిన్నచిన్న అడుగు లేస్తున్నారు. నేలకు పాదాలు పూర్తిగా అన్చి మోపుతూ, యింతలో తొందరగా, వడిగా అడుగువేస్తున్నారు. ముందుకు పోబోయి వెనక్కు తగ్గుతున్నారు. ఆ యెండలో యిసుకలో వాళ్ళపాదాలు నేలను బలంగా తాకుతున్నాయి. ఇంతలో వాళ్ళు దగ్గరగా

వచ్చారు. కంపించుతున్నారు. వచ్చిన వెంటనే విడిపోయారు. రోమన్లు చప్పట్లు కొడుతున్నారు. యూదుని ఛాతీపై సన్నని రక్తపుచార మెరిసింది.

తగిలిన దెబ్బగురించి మల్లు లిద్దరూ యెరుగరు. వాళ్ళనే ఆధారంగా చేసుకొని తీవ్రంగా, వేగంగా, పూర్తిగా భూమి తిరుగుతోందా అనిపించేలా వాళ్ళిద్దరూ ఒండొరులపై దృష్టి కేంద్రీకరించి చూస్తున్నారు. కాలచక్ర పరిభ్రమణం ఆగింది. జీవితం, అనుభవం యావత్తూ వీ రిరువురిమీదా కేంద్రీకరింపబడినట్లుంది. ఒకరి నొకరు ఆ విధంగా తీవ్రంగా దూసుకోడం, వాళ్ళిద్దరికీ బాధాకరంగా పరిణమించింది. తీవ్ర నిర్ణయం శక్తి ఒకేఒక్క సంపూర్ణ కంపనం కింద మారిందా అనిపించే విధాన వాళ్ళిద్దరూ ఒకరినొకరు తాకేరు. అప్పుడు వాళ్ళిద్దరూ మెలివేసుకుపోయారు. రెండు శరీరాలూ విడదీయలేని విధంగా కలిసిపోయాయా అనిపించేలాగున్నారు. ఎడంచేత్తో కుడిచేతిని పట్టుకొని, శరీరం, శరీరం కలిపి ముఖానికి ముఖంచేర్చి నిలబడ్డారు. ఇరువురికి బిగిసిన పిడికిలి నొప్పెట్టింది. మరింత దగ్గరగావచ్చి ఒకరినొకరు చంపాలని మౌనంగా అరిచారు వాళ్ళు. ఒకరి నొకరు ద్వేషించుకొన్నారు. వాళ్ళిద్దరికీ ఒకేఒక్క ప్రయోజనం తెలుసు. అది మృత్యువు యొక్క ప్రయోజనం. ఒకడు బ్రతకాలంటే, మరొకడు చచ్చితీరాలి. ఒకరికొకరు పెనవేసుకుపోయారు. బిగిసిన నరాలతో, కండలతో వాళ్ళిద్దరూ అసలు ఒకే శరీరమన్నట్లూ, దాన్నెవరో అనవసరంగా మధ్యకు చీల్చడంవల్ల రెండు అర్ధభాగాలుగా మారినట్లూ అనిపించారు.

రక్తమాంసాలు ఓర్చుకోగలిగినంతసేపు వాళ్ళల్లాగే నిలబడ్డారు. థ్రేషియన్ భుజంమీద పెద్ద యెర్రనిచార కనిపించింది. రొప్పుతూ, రోజుతూ, ద్వేషించుకుంటూ, కంపిస్తూ, రక్తం, నూనె చెమట పామిన శరీరంతో రక్తధారలు వాళ్ళ పాదాలవద్ద ఇసుకరేణువులకు యెఱ్ఱరంగు పూస్తుంటే, ఒకరి కొకరు పన్నెండడుగుల యెడంగా వాళ్ళిద్దరూ నిలబడ్డారు.

అప్పుడు థ్రేషియన్ దెబ్బతీసేడు. చేతిని సాచి కత్తి ఝళిపిస్తూ యూదునిమీద అశనిపాతంలా పడ్డాడు. మోకాలు భూమికాన్చి, కత్తిమొన పైకిపట్టి, దెబ్బ తప్పించుకొని థ్రేషియన్‌ని వెనక్కు తోసేసేడు యూదుడు. థ్రేషియన్ భూమిపై పడ్డాడో లేదో యూదుడప్పుడే అతనిమీదున్నాడు. ఆ ప్రదర్శనలో అదే భీతావహంగా, అత్యావేశజనకంగా, భీకరంగా, బ్రహ్మాండంగా కన్పించే ఘట్టం. మృత్యువు థ్రేషియన్ శరీరాన్ని కోసుకొని లోపలికి జొరబడుతోంది. అతను మెలికలు తిరిగేడు, దొర్లేడు, వణికేడు, ఘోరమైన ఆ కత్తిదెబ్బనుంచి రక్షించుకుందుకు పాదాలడ్డుపెట్టేడు. కాని అతని శరీరమంతా యూదుని అధీనంలోకి పోయింది. యూదుడు తెగపొడుస్తున్నాడు, కోసి

పారేస్తున్నాడు. థ్రేషియన్‌కి శక్తి నశిస్తోంది. చంపగలిగే దెబ్బ, అవతల వాడిని కొట్టగల శక్తి అతనిలో లేదు; కంపిస్తున్నాడు, నిరాశాపూరిత సాహసం అతన్ని ఏదో చెయ్యమంటోంది.

థ్రేషియన్ నిలబడగలిగేడు. రక్తసిక్తమైన అతని శరీరం యెల్లాగో ఒకలాగు లేచిందనే చెప్పాలి. అతన్ని కిందపడేసినదెబ్బ ఆతని ప్రాణానికే దెబ్బకొట్టింది. బలాన్ని వమ్ముచేసింది. ఒకచేత్తో పడకుండా కాసుకుంటూ, నిలదొక్కుకుంటూ, కత్తి పుచ్చుకుని, ముందుకూ, వెనక్కూ ఊగుతూ యూదుని దెబ్బలు తప్పించుకుందుకు గాలిలో కత్తి తిప్పుతున్నాడు. గాలినే పొడుస్తున్నాడు. యూదుడు దూరంగా నిలబడి యితని సమీపానికింకా రాలేదు. థ్రేషియన్ ముఖంమీద పోట్లుపడ్డాయి. మోకాలి నరాలుతెగి, చేతులుతెగి, కాళ్ళుతెగి, శరీరమంతా తెగి తన ప్రాణప్రదమైన రక్తం పాదాలక్రింద యిసుకలోనికి ప్రవహించి యింకుతోంది.

ఐనా చావుబ్రతుకుల నాటకంలో అద్భుతమైన చరమాంకం సమాప్తంగాలేదు. అప్పటివరకూ పరవశత్వపు మైకంలోపడ్డారు. ప్రేక్షకులు పడి, యూదుణ్ణి గొంతులు బొంగురయ్యేటట్లు, గట్టిగా చెవులు పగిలేలా అరుస్తూ "బలే! బలే!" "కొట్టు! కొట్టు!" అంటున్నారు.

యూదుడుమాత్రం కదల్లేదు. అతనికి వక్కచేనా పడింది. కాని, రక్తం కారడానికి అదిచాలు. కదిలినప్పుడల్లా రక్తం దాన్లోంచి పైకిపోతుంది. హఠాత్తుగా అతడు తన కత్తిని యిసుకలోకి విసరేశాడు. ఇసుకలోపడి గుచ్చుకుంది. ఊగింది. తలవంచుక నిలబడ్డాడు.

ఒక్కక్షణంలో అవకాశం చెయిజారిపోతుంది. శరీరం ప్రతిఅంగుళం రక్తాన్ని పోసుకున్న థ్రేషియన్ మోకాటిమీద నేలకొరిగాడు. కత్తినివదలి ప్రాణంవదిలే స్థితిలో నున్నాడు. రోమన్లు గొంతుచించుకుంటున్నారు. ఎడ్లను తోలే కొరడాలాంటిది ఒకటి యీడ్చుకుంటూ, శిక్షకు డొకడు అక్కడకు వచ్చాడు. వెంట యిద్దరు సైనికులున్నారు.

"దెబ్బలాడరా! చెత్త వెధవాయి!!" శిక్షకుడు అరిచాడు. కొరడా తాడు యూదుని నడుంచుట్టూ, పొట్టచుట్టూ తిరుగుతోంది.

"దెబ్బలాడు" అని కొరడా పదేపదే బలవంతపెట్టోంది. అతడు కదలడు. థ్రేషియన్ బోర్లపడి బాధతో మూల్గుతున్నాడు. నెమ్మదిగా ఏడుస్తున్నాడు. బాధనింక భరించలేక తీవ్రస్థాయిలో గట్టిగా విలపిస్తున్నాడు. బాధలఏడ్పు ఆగింది. ఆతనింక కదలడు. అప్పుడే కొరడా యూదుణ్ణి బాధించక ఆగింది.

నల్లనిమల్లు స్పార్టకస్‌తోపాటు తలుపు నెఱదనుండి చూస్తున్నాడు. మాట్లాడకుండా జరిగినదంతా చూస్తున్నాడు.

సైనికులు ఆ థ్రేషియన్ని యీటెలతో పొడిచారు. ఒక సైనికుడు చిన్నదైనా బలమైన ఒక సుత్తిని తన బెల్టునుండి తీశాడు. థ్రేషియన్ శరీరం క్రిందకు బల్లెం పోనిచ్చి బోర్లపడివున్న ఆ శరీరాన్ని వెల్లకిలా త్రిప్పారు. మొదటి సైనికుడు సుత్తితో అతని కణతపై ఒక బలమైన దెబ్బ మోదాడు. ఆ దెబ్బతో ముఖం ఆకారరహితమయింది. మానవరక్తం చవిచూచిన సుత్తి పట్టుకుని ఆ చేత్తోనే ప్రేక్షకులకు సలాం చేశాడు. మరో శిక్షకుడు గాడిద నొకదాన్ని తోలుకవచ్చాడు. గాడిదకు కూడ ఒక చక్కని తూలికాశిరోభూషణ ముంది. గుర్రానికి వుండాల్సిన ముస్తీలు అంతా వుంది. ఒక గొలుసు కూడా వేలాడుతూంది. చచ్చిన థ్రేషియన్ కాళ్ళకా గొల్సుకట్టారు. ఈటెలు తిరుగవేసి సైనికులా గాడిదను బాదారు. అది చాలా త్వరగా ఆ రంగస్థలంలో గుండ్రంగా గుర్రపు కదనుపోయింది! రక్తపూరితమైన, తల పగిలిన ఆ థ్రేషియన్ శరీరాన్ని లాక్కుపోతూం దా గాడిద. ఇది చూసి రోమన్లు చప్పట్లు చరిచారు. ఉల్లాసంతో ఆ కులకాంత లేసుకుట్టిన జేబురుమాలు ఆడించింది.

రక్తంపడ్డ యిసుకమీద మంచి యిసుక నెరిపారు. చోటు శుభ్రపరిచారు. మరో జంట పోరాడేముందు నాట్యం, సంగీతం ప్రారంభమయాయి.

# 8

గాబరాగా బేటియాటస్ మంటపం దగ్గరకు వెళ్ళాడు. అంతడబ్బా చెల్లించిన వాళ్ళ మనసుతీరేలా యూదుడు దెబ్బలాడలేదేమో; ఏ మెడనరమో చేతినరమో కోసి పోరాటపు తుదిఘడియలకు ఎర్రని రక్తపురంగు వెయ్యలేదేమో; వా ళ్ళేమనుకుంటున్నారో తెల్సుకునేందుకు వాళ్ళ వద్దకు బయల్దేరాడు. ఒక చేత్తో మధుపాత్ర పట్టుకున్న బ్రాకస్ బేటియాటస్‌ను వూరుకొమ్మని సంజ్ఞచేసి "ఇక మాట లనవసరం. మాంచి ఉల్లాసభరితంగా వుంది; మనసుతీరింది."

"అవును. మేం దానికి పెట్టింది పేరు."

"మీ పేరుసంగతి దేవుడెరుగు ఒక్కక్షణం—అదేదో నేచెప్తా. ఆ యూదుణ్ణి ఇక్కడకు పంపు. ఇంక అతణ్ణేమీ శిక్షించకండి. ఒకడు సరిగ్గా పోట్లాడాడంటే అది చాలదా? ఏమంటారు; వాణ్ణి యిక్కడకు పంపండి."

"ఇక్కడికే! సరి నిజంగా—" లూషియస్ ఏదో అనబొయ్యాడు.

"అవును ఇక్కడికే; వాణ్ణి వళ్ళుకడుక్కోవద్దని చెప్పండి. పోట్లాడేటప్పు డెలాగున్నాడో అలాగే పంపించండి."

జేటియాటస్ ఆ పనికై బయల్దేరినపుడు, బ్రాకస్ ఏదో చెప్పుకుపోతున్నాడు. రసజ్ఞులకు సాధారణంగా యెంత నిరర్ధకంగా మాట్లాడినా కొంత మినహాయింపు వుంటుంది. తను చూచిందానిలోని గొప్పతనం, నేర్పు, విశేషచాకచక్యం, ఆ నైపుణ్యం వీటన్నిటి గురించీ వివరించుకపోతున్న బ్రాకస్‌కు కూడా అంత మినహాయింపూ యివ్వాలి. "వంద ప్రదర్శనల్లో ఏ ఒక్కటి యిలావున్నా అదృష్టమే. క్షణకాలపు ప్రతిభ ఒక గంటసేపు కత్తిసాముకన్న ఎన్నోరెట్లు నయం. పేరుపడ్డ పోరాటం అంటే ఇదే. పోరాటంలోనూ ఎవడో ఒకడు సఫా అయేదాకా జరిగేపోరాటం; దీన్లో మజా అల్లా మల్లుడు యెంత ఘనంగా, అందంగా చస్తాడా అన్నదే. చూడాల్సింది గూడా అదే. అసలు పరిస్థితులు ఆలోచించండి. మీరే చూడండి; థ్రేషియన్, యూదుణ్ణి చూచి అతనే తనకన్న బలవంతుడని తా నతనికి సమవుజ్జీ కాదని తెల్సుకుంటాడు——"

"కాని మొదట రక్తాన్ని కళ్ళజూపింది వాడేగా?" లూషియస్ వ్యతిరేకత చూపాడు.

"అబ్బే, దాన్లో ఏముంది బొంద; వాళ్ళిద్దరూ యిదివరకెప్పుడూ ఒకరితో ఒకరు దెబ్బలాడినట్లు కనబడదు. అలాచేస్తే ఒకళ్ళసంగతి ఒకళ్ళకు తెలుస్తుంది. ఒకడి లోటుపాట్లు ఒకడికి తెలుస్తాయి. దాంతో కత్తిసాము మొదలెట్టుదురు. దానికీ నైపుణ్యం, సహనం కావాలనుకోండి. వాళ్ళు దగ్గరగావచ్చి పెనవేసుకపోయి ఒకరికొకరు లంకె వేసుకున్నట్లు నిలబడ్డారు. చూశారూ; అప్పుడు యూదుడు విడివడి థ్రేషియన్ భుజం మీద ఒకవేటు వేశాడు. ఆ దెబ్బ కుడిచేతికి తగిల్తే అక్కడితో ఆఖరైపోను. థ్రేషి యనుకు మాత్రంతెల్సు; తనకన్నా యూదుడే బలవంతుడని. అందుకే కావాత్రిప్పడం మొదలెట్టాడు. శరీరాన్ని చుట్టూ కావాత్రిప్పాలని ప్రారంభించాడు. నూటికి తొంభై తొమ్మిదిమంది మల్లులు అటువంటిదే జరుగకుండా చూస్తారు. ఒకళ్ళనొకళ్ళు పట్టుకుని దగ్గరగా పెనవేసుక నిలబడ్డమే నయం. ఒక మనిషి శక్తినంతా వుపయోగించి అటు వంటి కత్తితో ఒకపోటు పొడవడం అంటే ఏవిఁటో తెల్సా? నేను యూదుణ్ణి ఎందుకు రప్పిస్తున్నానో చూపిస్తా." అతడు మాట్లాడుతూండగానే యూదుడు వారిని సమీపిస్తున్నాడు. ఇంకా నగ్నంగానే వున్నాడు. రక్తం, చెమటవాసన కొడ్తూవుండే క్రూరమైన, భయావహమైన, నరరూప రాక్షసుని చిత్రంలా వాళ్ళయెదుట నిలబడ్డాడు. వంచినతల ఎత్తలేదు. అతని కండలు యింకా కంపిస్తూనే వున్నాయి.

"వంగోవోయే" బ్రాకస్ ఆజ్ఞాపించాడు. యూదుడు కదల్లేదు.

"వంగు" బేటియాటస్ అరిచాడు.

ఇద్దరు శిక్షకులు యూదుణ్ణి పట్టుకుని వాళ్ళముందు పడేలా బలవంతంగా నెట్టారు. బ్రాకస్ అతని వీపు చూపిస్తూ కొత్త విషయాన్ని కనిపెట్టిన వాడిలా చెప్పాడు.

"అదుగో, అదుగో అక్కడ చూడండి. కొరడాదెబ్బలుకాదు. స్త్రీ తన గోళ్ళతో గిస్తే ఎలాగుంటుందో అలాగే అతని చర్మంమీద నాటుపడింది చూడండి. కిందనుండి మీదపడ్తున్న థ్రేషియన్ని కొయ్యడానికి వీడు ప్రయత్నించినపుడు వాడా దెబ్బగొట్టాడు. హాఁ; చచ్చేదాకా పోరాటం! వాణ్ణి పంపించేయండి." బ్రాకస్ బేటియాటస్‌వేపు తిరిగి అన్నాడు; "వాణ్ణి యిక బాదకండి. అలాగే వుండనీయండి. మీ కతనివల్ల డబ్బు రాకపోతే నాతో చెప్పండి. అతనికి పేరు తెప్పిస్తా నేను. ఓయీ మల్లుడా యీ ద్రాక్ష సారా నీ గౌరవార్థం" అని మధుపాత్ర ఖాళీచేశాడు. తలవాల్చుకుని అలాగునే మౌనంగా నిలబడ్డాడు యూదుడు.

# 9

"రాళ్ళుకూడా ఏడుస్తాయి" ఆఫ్రికావాడు చెప్తున్నాడు. "ఈ యిసుకగూడా బాధతో మూల్గుతుంది. ఏడుస్తుంది. కాని మనం బాధపడం."

"మనం మల్లులం" అన్నాడు స్పార్టకస్.

"నీకున్నది కటికరాతిబండగుండె కాదుకదా?"

"నేనొక బానిసను. బానిసకు రాతిగుండె ఉండాలి. లేదా అసలు ఉండేవుండకూడదు. నీకు జ్ఞాపకముంచుకునేందుకు కొన్నైనా మంచి విషయాలనేవి వున్నాయి. కాని నే నొక 'కోరూని.' జ్ఞాపక ముంచుకునేందుకు మంచి విషయమనేది నాలో లేనేలేదు."

"అందుకేనా నా బాధ చూసినా, నీలో చలనం కలుగకపోతా?"

"అది నాలో చలనం కలిగించేందుకు సహాయపడదు" ఆసక్తిలేనివాడిలా జవాబిచ్చాడు స్పార్టకస్.

"స్పార్టకస్! నాకు నువ్వేం అర్థం కావడంలేదు. నువ్వు తెల్లవాడివి; నేను నల్లవాడిని. మనమధ్య ఆ తేడావుంది. నా దేశంలో ఎవడి హృదయమయినా విచారంతో నిండితే వాడేడుస్తాడు. కాని మీ థ్రేషియన్లలో కన్నీరే కనబడదు. ఇంకిపోయింది. నా వేపు చూడు, నీకేం కనిపిస్తోంది."

"ఒక మనిషి ఏడ్వడం కనిపిస్తోంది" స్పార్టకస్ అన్నాడు.

"ఏడుస్తున్నందుకు నేనేమైనా మగతనం తక్కువైన వాణ్ణా? స్పార్టకస్ నే చెప్తున్నా; నీతో నేను పోట్లాడను. వాళ్ళే వెధవలై శపించబడి, ఎన్నటికీ శపించబడి చావనీ! నీతోమాత్రం నేను దెబ్బలాడను చెప్తున్నా."

"మనం దెబ్బలాడకపోతే యిద్దరమూ చస్తాం" స్పార్టకస్ నిశ్చలంగా సమాధాన మిచ్చాడు.

"ఐతే నన్ను చంపెయ్యి. నేస్తం, బతకలేక చచ్చాను. ఇక నన్ను చంపెయ్యి. బతకడమంటే నాకు మహచిరాకు."

"ఏయ్, అక్కడే గొడవ చేయకండి." షెడ్ గోడమీద కొట్టారు సైనికులు. నల్లవాడు తన పెద్ద పిడికిలి బిగించి ఆ గోడమీద బాదాడు. దాంతో షెడ్ కదిలింది. బాదడం మానేసి బెంచిమీద చేతుల్లో ముఖం ఆన్చి కూచున్నాడు. స్పార్టకస్ అతని దగ్గరకు వెళ్ళి, అతని తల ఎత్తి నుదుటిమీది స్వేదబిందువులను లాలనగా తుడిచాడు.

"మల్లుడా! మల్లుల సహవాసం మాను."

"స్పార్టకస్! ఎందుకయ్యా మానవుడు పుట్టింది?" బాధతో, ఆవేశంతో గొణిగాడు.

"బతకడానికి!"

"అదేనా సమాధానమంతా?"

"అదొక్కటే సమాధానం."

"నీ సమాధానం నా కర్థమవలేదు థ్రేషియన్!"

"ఏం? ఎందుకవలా నేస్తం" ఇంచుమించు బ్రతిమాలుకున్నట్లు యాచించాడు స్పార్టకస్. "పసిపాపలకు తెలుసే ఆ సమాధానం. తల్లి కడుపులోంచి బయటపడగానే అదేగా అతి సామాన్యమైన, అతి సూక్ష్మమైన సమాధానం."

"నా కది సమాధానం కానేకాదు. నన్ను ప్రేమించినవాళ్ళకోసం నా హృదయం బద్దలవుతుంది; రగిలిపోతుంది."

"ఇతరులు నిన్ను ప్రేమిస్తారు!"

"ఇక వద్దు. ఇంకొద్దు" అన్నాడు నల్లమల్లుడు.

# 10

కాలం గడిచినకొద్దీ, కేపువాలో పోరాడిన ఆ రెండుజంటల మల్లుల గురించి గాని, ఆనాటి ఉదయపు సంఘటనల గురించిగాని కైయస్‌కు స్పష్టంగా జ్ఞాపకం లేవు. జీవితంలో తానెన్నో తమాషాలు చూశాడు. డబ్బిస్తే బోలెడు కొనవచ్చునటువంటివి.

స్పార్టకస్ అన్నది ఒక థ్రేషియన్ నామధేయము మాత్రమే. రోమన్లు అనుకునేవారు థ్రేషియన్ల పేర్లన్నీ ఒకలాగే వుంటాయని. గేనికస్! స్పార్టకస్! మేనికస్! ఫ్లూరకస్! లియకస్! ఈ కథ చెప్పేటప్పుడు యూదుణ్ణికూడ థ్రేషియన్ క్రింద జమకట్టి చెప్పుక పొయ్యేడు కైయస్. ప్రజలు ఈ మల్లయుద్ధాల గురించి కథలుగా చెప్పుకునేవాళ్ళు. మత్తుపదార్థము లలవాటు చేసుకున్నట్లే, ఈ ప్రదర్శనలకు గూడ అలవాటు పడ్డారు. ప్రదర్శనల పరిభాష థ్రేషియన్ అన్న పదానికి రెండర్థాలు సృష్టించింది. బాల్కన్ ప్రాంతానికి దక్షిణంగా ఇటలీవరకు నివసించే నానారకాల జాతుల ప్రజలూ, బాల్కన్ ప్రాంతానికి తూర్పుగా వ్యాపించిన ప్రదేశమంతటా, నల్లసముద్రం వరకూ నివసించే ప్రతిబర్బరజాతి వాళ్ళనీ అందరినీ థ్రేషియన్లనే పిల్చేవారు. మేసిడోనియా సమీపాన వున్న ప్రజలు గ్రీకుభాష మాట్లాడుతారు. వంపుతిరిగిన చిన్నకత్తిని ఈ జాతులవాళ్ళంతా సాధారణంగా వుపయోగించే ఆయుధంగానట్లే థ్రేషియన్లకు గ్రీకు మాతృభాష కానే కాదు.

అదలా వుండగా రోమ్‌లో క్రీడల పరిభాషలో, రంగస్థల పదజాలంలో థ్రేషియన్ అంటే 'సికా'—చిన్నకత్తితో పోట్లాడేవాడని అర్థం. అందువల్లనే యూదుడుకూడ థ్రేషియనే! 'మెకబీస్' నాటినుంచీ పూర్వం చాలాకాలం క్రితం జరిగిన మొదటి వ్యవసాయిక విప్లవంనాటినుంచీ విప్లవపతాకం భుజాన ధరించి, నిత్యం అన్యాయాన్ని ప్రతిఘటిస్తూ, దోపిడీకి వ్యతిరేకంగా పోరాడిన జ్యూడియాకొండల్లో నివసించే దృఢగాత్రులైన రైతులే తన తాతముత్తాతలను సంగతి కైయస్‌కు ఏం తెల్సు పాపం! అతగాడికి జ్యూడియా గురించి తెల్సుకోవాలనే వుద్దేశమేలేదు. ఒక జంట యుద్ధంచేయడం చూశాడు. మరో జంట ప్రారంభించబోతోంది. ఆ నల్లమల్లుడు చేసినదీ, ఆ తరువాత అతన్నేం చేశారో జ్ఞాపకం వుంచుకోవడంలో అతనితో పోట్లాడ వచ్చిన వస్తాదు గురించి అతడు మరచిపోయాడు. వాళ్ళిద్దరూ బోనులోంచి బైటకు వచ్చిన పెద్దపులుల్లా బయటకు రావడం, నీడను దాటి వెలుతురులోకి రావడం, సూర్య కాంతిలో రక్తపు మరకలుపడ్డ యిసుకలో నిలబడడం అన్నీ జ్ఞాపకమున్నాయి. పక్షు లెగిరిపోయాయి. పచ్చని మచ్చలు గల పక్షులు రక్తం చిందిన యిసుకనేలను ముక్కులతో పొడుస్తూ, ముక్కులను దాంతో నింపుకొనే రక్తపిపాసులు! అవి ఎగిరి పోయాయి. ఇసుకరంగులా పచ్చని మచ్చలున్న ఆ పక్షి లెగుర్తుంటే మంటి ముద్దలు పైకి లెగిచిపోతున్నాయా అనిపిస్తుంది. నిర్ణీత ప్రదేశంలో మల్లు లిద్దరూ ఆగారు. తమ రక్తమాంసాలను కొన్న రోమన్లకి యిక్కడే గౌరవాభివందన మర్పించాలి. ఇదే క్షణం, జీవితం నిరర్థకం చేయబడ్డ క్షణం యిదే. మానవుని అంతస్తును, హోదాను,

సిగ్గును, అభిమానాన్ని, జీవితపు అర్థ సమస్తాన్ని, పరమార్థాన్ని మార్చివేసే, మార్చి వేసే క్షణం యిదే. ఇదే ఆఖరుకు తేలిన విషయం. ప్రపంచంలో కులీనురాలైన యిల్లాలు రక్తపు ప్రవాహాన్ని చూసి సంతసిస్తుంది. ఆనందంతో తప్పెటలు మ్రోగిస్తుంది!

ఆఫ్రికావాడితో పోల్చిచూస్తే మహారాక్షసునిముందు నిలబడ్డ మరుగుజ్జులా కనిపించాడు థ్రేషియన్. ఎండపై పడ్తోన్న యిసుక రంగభూమియొక్క బల్లచెక్కలూ వీటి ముందతను చెక్కిన పెద్ద శిలావిగ్రహంలా అగుపిస్తున్నాడు. ఈ సందర్భంలో బ్రాకస్ ఏదో అన్నాడు. అత నన్నది ఏదో తను మర్చిపోయాడు. వాటికి అంత పెద్ద విలువాలేదు. అందుకే కాలప్రవాహం ఆ మాటలను కడిగిపారేసింది. ఇటువంటివాళ్ళకు ఏదో బుద్ధిపుడ్తూంటుంది. వాటికేమీ కారకత్వం వుండదు. కారణాల్లాగునే కనిపిస్తాయి. స్పార్టకస్ కూడ కారణంకాదు. అతిసామాన్యమైన దాని ఫలితమేనని అనుకుంటాడు కైయస్. ఏదో బుద్ధిపుట్టి తెలివితేటలు శూన్యమైన తన స్నేహితునికోసం నిరర్థకుడయిన కైయస్‌కోసం శరీరంలోని అణువణువూ చీల్చిచెండాడుకునే మృత్యుప్రదర్శనం ఏర్పాటు చేయించాడు బ్రాకస్. బుద్ధి జాడ్యజనితం అనుకోని కైయస్ ఇది ఒక స్వయంకారకత్వ ప్రతిభావిలసితమైన, గమ్మత్తయిన తమాషా అనుకున్నాడు.

మల్లులిద్దరూ వందన సమర్పణచేశారు. చేయాలిమరి. సారా సేవిస్తోన్న రోమన్లు ఏవేవో తింటూ కూర్చున్నారు. అప్పు డొకడు ఆయుధాలు తీసుకువచ్చాడు. స్పార్టకస్‌ను గురించి ఒక కత్తి, నల్లవాడిని గురించి పొడుగాటి బలమైన బరువైన త్రిశూలం, ఒక చేపలవల. లజ్జాభిమానాలతో అన్యాయమైన అవమానంతో వారిద్దరూ గొప్ప హాస్యగాళ్ళలా కనపడ్డారు. ఆ మండపపు నీడలో ద్రాక్షసారా సేవిస్తూ, తీపివస్తువులు చప్పరిస్తూ రోమన్లు తమాషా చూసి, ఆనందించడంకోసం ప్రపంచాన్నంతటినీ బానిసత్వంలో ముంచారు.

ఇద్దరూ ఆయుధధారణ చేశారు. అపుడు ఆఫ్రికా మల్లుడికి పిచ్చెత్తినట్లనిపించింది కైయస్‌కు. అది పిచ్చి తప్ప మరేం కాదని కైయస్ నమ్మకం. అసలు ఆ ఆఫ్రికావాడి మాతృభూమికి వెళ్ళి అతడి పూర్వపు జీవితం చూస్తే కైయస్ గాని, బ్రాకస్‌గాని, లూషియస్‌కాని అతనికి పిచ్చెక్కిందనుకోరు. రోమను సైనికులు అతని దేశాన్నాక్రమించుకుని, రోమను బానిసవర్తకు లక్కడి మానవ జీవిత ఫలసాయాన్ని నేర్పుతో బంగారంగా మార్చక పూర్వం ఒక నదీతీరాన యితని కో యిల్లుండేదని, భార్యా పిల్ల లుండేవారని, సేద్యంచేసి స్వచ్ఛందజీవితం గడిపేవాడని, వీళ్ళ జీవితంలో వీళ్ళెపుడూ వూహించుకోలేరు.

అందుకే ఆఫ్రికావాడికి పిచ్చెత్తిందని వాళ్ళ ఉద్దేశ్యం. అతడు వల దూరంగా పారేసి దిక్కులు పిక్కటిల్లేలా యుద్ధనినాదం చేయడం చూచారు. పెద్దగా బొబ్బలు పెడ్తూ రోమన్ల మండపంవైపు పరుగెత్తుకు వస్తున్నాడు. దూసిన కత్తి పుచ్చుకుని అతన్ని ఆపడానికి శిక్షకుడొకడు వచ్చాడు. తన శూలంతో శిక్షకుణ్ని గుచ్చి గాలిలోకి ఎగరవేశాడు. బాధతో అరుస్తూ శిక్షకుడు భూమ్మీద వాలాడు. ఆరడుగుల ఎత్తునున్న కంచె దోవకడ్డుగా నిల్చింది. కాగితం ముక్కను చింపి పారేసినట్లు కంచెను లాగి పారేశాడు. మహోద్ధతితో, ఉద్వేగంతో, ప్రచండశక్తితో అతని రూపమే మారింది. అతని శరీరం మహోదగ్రభయంకర ఆయుధమైనది. మండపం ఆతని ధ్యేయం. అటు క్రమిస్తున్నాడు.

రంగస్థలపు నలుమూలలనించీ సైనికులు పరుగెత్తుకొస్తున్నారు. ఒక సైనికుడు కాళ్ళు ఎడంగాబెట్టి, ఎడమచేతిని ముందుకుసాచి కుడిచేత్తో బలమైన బల్లాన్ని విసిరాడు. రోమన్ యీటెను ఎదిర్చి ఓర్చగలది ఏదీలేదు యీ ప్రపంచంలో. అది ఎన్నో సైన్యాలను నాశనం జేసింది. కాని ఆఫ్రికా మల్లుని అది నాశనం చేయలేదు. వీపున గుచ్చుకున్న ఆ బల్లెం ఛాతీని దూసుక పైకి కనపడ్తున్నా అతని ప్రయత్నాన్నిమాత్రం అది మాన్పలేకపోయింది. బల్లెం గుచ్చుకున్న శరీరంతో, తాడిత భుజంగంలా, సుడిగాలిలా శీఘ్రంగా రోమన్లున్న మండపంవైపు పోతున్నాడు. మరొక బల్లెం అతని ప్రక్కలో, వేరొకటి వీపుమీద, యింకొకటి మెడమీద గుచ్చుకున్నయి. ఆఖరిదాంతో అతని పని ముగిసింది. కాని అతడు సాచిన చేతినుండి త్రిశూలం ప్రచండ వేగంతో మండప స్థంభాన్ని తాకింది. భయకంపితులై రోమన్లు హడలెత్తారు. ఎక్కడపడ్డాడో అక్కడే రక్తం కాలువలు కడ్తోంటే, ఆ మల్లుడు ప్రాణం వదిలాడు.

ఇంత జరుగుతున్నా స్పార్టకస్ మాత్రం కదలకుండా, మెదలకుండా నిలబడ్డ చోటనే మిగిలిపోయాడు. ఏమాత్రం కదిలినా అతడూ ఖతమైపోయేవాడు. కత్తిని యిసుకలోనికి గిరాటువేసి నిలబడ్డాడతను. జీవించడమే జీవితానికి సమాధానం!

# నాలుగవ భాగం: బానిస యుద్ధకారణాల గురించి మార్కస్ టూలియస్ సిసిరో ఆసక్తి.

రోమను భూస్వామి ఆలోచించి యిచ్చే ఆతిథ్యాన్ని సహభాగులై స్వీకరించడంకోసం, మర్యాదస్తులైన స్త్రీ పురుషులు సలేరియా భవనానికి వచ్చి, స్పార్టకస్‌ను గురించి, అతని తిరుగుబాటునుగురించి అనుకోకుండా యెంతగానో ఆలోచించారు. ఇది సహజం. వాళ్ళంతా శవాలు వేలాడే ఏపియస్ మార్గాన ప్రయాణంచేసి యీ భవనానికి చేరుకున్న వాళ్ళే. కొందరు దక్షిణంగావున్న రోమ్‌నుంచీ, సిసిరో సిసిలీ నుండి ఉత్తరంగానూ ప్రయాణంచేసి వచ్చారు. అత నక్కడ ప్రభుత్వశాఖలో బాధ్యతగల పెద్ద ఉద్యోగం చేస్తున్నాడు. రోమన్ న్యాయశాస్త్రం కరుణావిహీనమైనా, ధర్మబద్ధమైనదే అని ప్రపంచానికి యెలుగెత్తిచాటే కఠినశిక్షాచిహ్నాలు ప్రయాణకాలంలో వాళ్ళకి ప్రతి నిముషం ప్రత్యక్షమయేవి.

బానిసలకూ, రోమన్లకూ మధ్య జరిగిన యుద్ధాలు రోమను పాలన క్రిందనున్న ఆక్రమిత ప్రాంతాల నన్నింటినీ, రోమన్ రిపబ్లిక్కునీ కూకటి వేళ్ళతో కదిల్చి పారేసేయ - అటువంటి భీషణసంగ్రామాల గురించి ఆ రాజవీధిని ప్రయాణం చేసిన యే వ్యక్తీ—ఏ కొద్దిపాటి గ్రహణశక్తి కలవాడైనాసరే - ఆలోచించక మానడు. తన వంటి వా రెందరో, అసంఖ్యాకములైన శిలువలపై వేలాడుతున్న సంగతి ఆలోచించి, వ్యాకులపాటు చెంది నిద్రలో పక్కమీద అటూ యిటూ దొర్లని బానిసంటూ లేడా తోటలలో.

ప్రత్యేకంగా ఈ శిలువ పద్ధతి ఒక బలవత్తరమైన తీవ్రోద్రేకం. ఆ శిలువ మీద రోమన్ క్రౌర్యానికి బలియై, నెమ్మదిగా ప్రాణంలోని ప్రతి అంగుళాన్నీ కోల్పోతూ, ఆ బానిసలు భరించిన, భరించలేక చచ్చిన దుస్సహ బాధ రోమన్ దేశ మంతటా, ప్రతి పల్లెలో, ప్రతి వాడలో, ప్రతి యింటా, ప్రతి హృదయంలో - అసలు హృదయ మనేదే వుంటే - అంతటా వ్యాపించి సర్వాత్మకమైంది. సిసిరో వంటి యోచనాపరుని హృదయంమీద వీటి ప్రభావం పడిందన్న సంగతి ఊహ కందేదే.

సిసిరో చిన్నవయస్కుడే; సరిగా ముప్ఫైరెండేండ్లుకూడా దాటని యువకుడే; కాని అతనికన్న వయస్సులో, విత్తంలో అధికులే అతన్ని గౌరవిస్తారు. ఆంటోనియస్ కైయస్‌వంటి పెద్దమనుష్యులే అతన్ని గౌరవిస్తారన్నది గమనార్హం.

సిసిరోకి వంశపరంపరానుగతమైన మర్యాద లేదు. పోనీ ప్రస్తుతమైనా అతని కుటుంబం ప్రాముఖ్యతలో ఉందా? అంటే అదీలేదు. ఇతరుల దయను చూరగొనగల గుణవిశేషమూ అతనిలో విశేషంగాలేదు. ఇతనిలో యేమంత ప్రత్యేకమైన ఆకర్షణీయాంశమూ లేదని యితని స్నేహితులే చెప్తూ ఉంటారు. తెలివితేటలైతే ఉన్నవికాని, ఆమాత్రం తెలివి అందరికి ఉంటుంది. కార్యసాఫల్యమార్గంలో అడ్డు తగులుతుందని తోస్తే యీషణ్మాత్రమైన న్యాయాన్యాయ విచక్షణాజ్ఞానం లేక, నీతినియమాలను కూలద్రోసి, స్వధర్మాన్ని పాటించక, అంతరాత్మ ప్రబోధం కాని, తన అపరాధిత్వం కాని, తన నికముందు జాగ్రత్తగా ప్రవర్తించమని నచ్చచెప్పినా, వినక, ధర్మబద్ధులు కాక, కరుణావిహీనంగా ప్రవర్తించే ఆనాటి కొందరి యువకులవంటివాడే సిసిరో. దీని అర్థం అతనికి ధర్మంతో, న్యాయంతో, కరుణతో యేవిధమైన సంబంధమూ లేదనికాదు. అతనికీ సంబంధమూ ఉండేది; కాని స్వీయాభివృద్ధికి తోడ్పడేటంత వఱకే అది పాటింపబడేది; కేవలం ఆశగలవాడు మాత్రమేకాదు సిసిరో; ఉట్టి శుద్ధమైన ఆశలో కొంతమటుకు ఉద్రేకం కలుస్తుంది. కార్యసిద్ధికోసం శాంతంగా, తెలివిగా ప్రయత్నించే మనిషి. ఒకప్పు డతని అంచనాలు విఫలమయాయే. కట్టండి. అదికూడా అతనివంటి యువకులలో సాధారణంగా ఉండేదే. యత్నించు, తిరిగి యత్నించు అని ఉండనే ఉందిగా.

ఇప్పటివరకూ అతని అంచనా లెప్పుడూ విఫలమవలేదు. అంత చిన్నతనంలో యెన్నో విజయాలు సాధించి, అందరికీ ఆశ్చర్యం కలగచేసేడు. పద్దెనిమిదోయేటే ప్లీడరయాడు. పేరుకోసం, గౌరవంకోసం నిరపాయమైన ఒక దాడిలో పాల్గొన్నాడు. ముప్ఫైయేండ్లు నిండేసరికి ప్రభుత్వ పరిపాలనా శాఖలో ఒక ఉన్నతోద్యోగాన్ని సంపాదించాడు. వేదాంతం, ప్రభుత్వం వంటి విషయాలమీద అతను కొన్నివ్యాసాలు వ్రాసేడు; ఉపన్యాసాలిచ్చాడు. వీటిని చదివిన ప్రజలకు అతను వ్రాసిన ఆ కాస్త విషయమూ, లోతుగా పోలేని అతని స్వల్పపరిజ్ఞానమూ కూడా యెక్కడనుంచి గ్రంథ చౌర్యంచేసి తీసుకొచ్చి స్వంతసరుకుగా చెలామణి చేస్తున్నాడో తెలుసుకోగలిగినంత జ్ఞానం లేకపోయింది. ఎవరికెంత పేరుందో, ఎవరిపలుకుబడి యెంతో అతనికి ముందుగానే తెలిసేది. ఆ తెలుసుకోడంలోమాత్రం తప్పుడంచనాలు వెయ్యలేదతను. ఆ రోజులలో అధికారం, పలుకుబడిగల వర్గాలతో సంబంధ మేర్పర్చుకుందుకు చాలామంది

తహతహలాడేవారు. అవసరమైన వాళ్ళతో తనకున్న సంబంధంతో దేన్నీ జోక్యం కలుగచేసుకోకుండా చూసుకోడం ఒక్కటే అతనిలోని ప్రధానమైన సుగుణం.

నీతికీ, న్యాయశాస్త్రానికీ మధ్యనున్న తేడాని అతనెప్పుడో కనిపెట్టేసేడు. న్యాయశాస్త్ర మన్నది బలవంతులు తమ కిష్టమైన విధంగా ఉపయోగించుకుందుకు సృష్టించుకున్న పరికరం. నీతి, అమాయకులు కొలిచే ముప్పైమూడుకోట్ల దేవతల లాగ, బలహీనుల భ్రమ. బానిసత్వం అనేది న్యాయమనీ, ధర్మబద్ధమైనదనీ వాదించేవా ళ్ళెవరైనా ఉంటే వాళ్లు పుట్టి వెర్రివెధవలని సిసిరో అభిప్రాయం. ఆ రాజమార్గంలో, ఉత్తరంగా ప్రయాణంచేస్తూ, అసంఖ్యాకములైన శిలువలమీద వేళ్ళాడే బానిసల భయంకరమైన బాధ నతడు గ్రహించకపోలేదు. అది తనను కదల్చకుండా, తన హృద యాన్ని స్పృశించకుండా మాత్రం చూసుకుంటాడు. అత నెప్పుడూ యేదో ఒకటి వ్రాస్తూ ఉంటాడు. ఆ సమయంలోకూడా అతను వ్రాస్తూనే వున్నాడు. ఏపియన్ మార్గంలో వేలాడే వివిధజాతుల ప్రజల ఉదాహరణలయం దతని కత్యాసక్తి ఉంది. అతనికి ప్రతిదానిలోనూ ఆసక్తి ఉంటుంది. కాని వాటితో ప్రమేయం మాత్రం కలగ చేసుకోడు. ఏ విషయంతోనూ ప్రమేయంలేకుండా ఆసక్తికోసం ఆసక్తి చూపడంలో అతను పరిపూర్ణత పొందేడు. బాధలేకుండా, జాలికల్గకుండా శిలువవేయబడ్డ గాల్‌లు, ఆఫ్రికన్లు, థ్రేషియన్లు, యూదులు, జర్మన్లు, గ్రీకులు మొదలైనవారిగురించి తెలుసు కున్నాడు. ఈ మహోద్రేకంలో ఒక నూతనమైన, బలవత్తరమైన మహాప్రవాహ ప్రతి బింబమొకటి గోచరించిం దతనికి. అది భవిష్యత్కాలాలలో కూడా పొంగి, పొరలి ప్రవహించేదిగా తోచింది. ఎవరైనా యీ బానిసవిప్లవాన్ని జాగ్రత్తగా పరిశీలించి, బాగా అర్థం చేసుకుని, విమర్శించి భాష్యం చెప్పగలిగితే అతనా నా దద్వితీయ ప్రతిభా శాలిగా పరిగణన పొందుతాడన్నదికూడా అతనికి తోచింది. తక్కినవాళ్ళల్లా బానిసల నూరికే అసహ్యించుకోలేదతను. బానిసల మానసిన వాంఛలను బాగా అవగాహన చేసుకుని మరీ అసహ్యించుకొనేవాడు సిసిరో.

అదీ సిసిరో సుగుణసంపత్తి; కొందరది చూడగల్గేవారు; కొందరు చూడలేక పోయేవారు. క్లాడియా ఆ సాయంత్రం సలేరియా భవనానికి వచ్చి సిసిరోని చూసినప్పుడు అతని స్వభావాన్ని గ్రహించలేకపోయింది. క్లిష్టమైన భావాలు లేనివాళ్ళను మాత్రమే క్లాడియా అర్థంచేసుకోగలిగేది, హెలీనా అల్లాకాకుండా యితని స్వభావాన్ని గుర్తించి గౌరవించింది. "నాకూ, నీకూ జోడుకుదిరిందిలే, కానిద్దామా యిక?"

ఆమె కళ్ళడుగుతున్నట్లున్నాయి.

ఒక గొప్ప రోమను సేనాని రాకకోసం యెదురుచూస్తూ, సోదరుడు కైయస్ తన గదిలో పడుకున్నప్పు డామె సిసిరో గదికి వెళ్ళింది. కొందరు తమను తామే తృణీకరించుకుంటారు. అటువంటి వ్యక్తిలాగానే ఆమె తన చుట్టూ అసహజతను కల్పించుకుంది. అదే ఆమె కానందం. గోరంత జరుగుబాటూ, కొండంత ధనాపేక్ష కల్గిన మధ్యతరగతి యువకుడైన సిసిరోముందు తానెందుకు తక్కువగా భావించుకొని బాధపడాలో ఆమెకే బోధపడలేదు. రేపు, నిన్ను నీ వసహ్యించుకునే విధంగా నేటిరాత్రి నువ్వు సంచరిస్తున్నావు సుమీ అని అంటే ఆమె ఒప్పుకోదు.

సిసిరోకిమాత్రం ఆమె యెంతో వాంఛనీయమైన స్త్రీ. పొడుగ్గా, బలంగా, అందంగా తీర్చిదిద్దిన ఆమె సుందరస్వరూపం, ఆ నల్లని కళ్లు మొదలైన కులీనులలో వుండవలసిన రూపురేఖా విలాసాలన్నీ ఆమెలో ప్రత్యక్షంగా కన్పించాయి. ఈ గమ్య స్థానాన్ని చేరుకొందుకే తనవంటివా రెందరో ప్రయత్నించి, లభ్యంకాక విఫలమనో రథులయారు. చూడగానే ఉండవలసిన కులీనలక్షణాలన్నీ కనిపించే స్త్రీ స్పష్టంగా అగు పించే ఒక కారణంకోసం తన గదిలో ప్రవేశించిందన్న సంగతి అతనికెంతో సంతృప్తి కల్గించింది.

ఆ రోజుల్లో రాత్రి చాలాసేపు పనిచేసే రోమన్లు తక్కువ; ఆశ్చర్యం కలిగించే అద్భుతమైన అభివృద్ధిని సాధించిన రోమను సమాజం దీపాల విషయంలో మాత్రం కొరతబడింది. రోమనుదీపికలు నిస్తేజంగా పాలిపోయిన పచ్చని కాంతినిచ్చేవి. ఆ కాంతిలో వస్తువుల్ని జూస్తే కళ్ళు నొప్పులు పుట్టేవి. అందుచేతనే రాత్రిపూట పని చేయడం, అందులోనూ బాగా తిని, తాగినతర్వాత పనిచేయడం ప్రశంసనీయాంశంగా కాని, సంశయాత్మకమైన వైపరీత్యంగాకాని కనిపించేది. ఆ పనిచేసే వ్యక్తినిబట్టి యిది ప్రశంసనీయమా, సంశయాత్మక వైపరీత్యమా అనే నిశ్చయం జరిగేది. సిసిరో విష యంలో, అతను ఆశ్చర్యకరమైన మనిషి కనుక, అది ప్రశంసనీయంగానే తోచింది. హెలీనా ఆతని గదిలో ప్రవేశించేసరికి ఈ ఆశ్చర్యకరమైన వ్యక్తి తన పక్కమీద కాళ్ళు ముడుచుకుని కాగితంమీద ఏదో వ్రాస్తూ, దిద్దుతూ కూర్చున్నాడు, మరో వయస్సుమీరిన వనిత అయితే చూసేవాళ్ళకోసం అతడు కావాలని కూర్చొని నటి స్తున్నాడనేసేదే. హెలీనా యిరవైమూడేళ్ళది. ఆమెకు ఇతని గొడవ బాగానచ్చింది. శాంతియుతకాలంలో, యుద్ధ సమయంలో కూడా నాయకులుగానే వుండే వ్యక్తులు పురాణాల్లో, పూర్వపు గాథల్లో కనిపిస్తారు. కాని రోజుకు రెండు మూడు గంటలే నిద్రపోయి, తక్కిన కాలాన్నంతటినీ తమ శక్తియుక్తులను దేశంకోసం త్యాగం చేసిన రోమనులు కొద్దిమందే వుండేవారని వాడుక. వారు నివేదితులు. అటు

వంటి నివేదితులలో ఒకడైన సిసిరో తనకేసి ఆ విధంగా చూడటం ఆమెకు బాగా నచ్చింది.

తలుపు మూసేలోగానే, సిసిరో ఆమెను తన మంచంకాళ్ళ దిక్కున కూచోమని సంజ్ఞచేశాడు. కూచోడానికి ఆ గదిలో మరేదీ లేదు. తన పనిలో నిమగ్నమైపోయాడు. తలుపు జేరవేసివచ్చి ఆమె అతని మంచంమీద కూచుంది.

ఏంవుందీ? ఇద్దరు పురుషులు, ఒక స్త్రీ పట్ల ఒకే రకంగా ప్రవర్తించరు. నక్కపుట్టి ఏడు ఆదివారాలు గాకపోయినా, ఆమె తన కాస్త జీవితకాలంలోనూ యీ విషయానికే చాల ఆశ్చర్యపొయ్యేది. సిసిరో ఆమెపట్ల ఏ విధంగానూ ప్రవర్తించలేదు. ఊరికే తనపనిలో తాను నిమగ్నమై కూచున్నాడంతే. పావుగంట గడిచాక ఆమె అతన్ని అడిగింది.

"ఏమిటి వ్రాస్తున్నారు?"

ఏదో వెదుకుతున్నవాడిలా ఆమెకేసి చూచాడతను. ఈ ప్రశ్న ఏమంత శ్రద్ధాసక్తులతో వేసిందికాదు. ఎక్కడో అక్కడ ఏలాగోలాగు సంభాషణ ప్రారంభమవాలి గదా అని వేసినది. సిసిరోకికూడా మాట్లాడబుద్ధి వేసింది. తనవంటి ఎంతోమంది యువకుల్లాగనే, ఆతనూ తన అహంభావాన్ని పెంచి పోషించగల స్త్రీ కోసం చాలా కాలంనించి ఎదురుచూస్తున్నాడు. అత నామె నడిగాడు: "ఎందు కడిగారూ?"

"నాకు తెల్సుకోవాలని వుంది. అందుకే."

"బానిన యుద్ధాలమీద వ్యాసం రాస్తున్నాను" అతడు వినయంగానే సమాధానం చెప్పాడు.

"అంటే చరిత్రన్నమాట?"

ఖాళీగా కూచునే ఉన్నతవర్గపు ప్రజలు కొందరు ఆ రోజుల్లో ఈ చారిత్రక విషయాలనుగురించి రాయడం ఒక ఫాషన్‌గా భావించేవారు. కొత్తగా ప్రభుత్వవర్గాల్లో చేరగలిగిన ఎంతోమంది వ్యక్తులు ఈ మధ్యనే పురాతన చరిత్రను తిరగేసి, తమ వంశానికి రిపబ్లిక్‌లో జరిగిన గొప్పగొప్ప చారిత్రాత్మక సంఘటనలకు ముడిపెట్టి చరిత్రలు రాసుకున్న రోజులుకూడా అవి.

"చరిత్రకాదు" సిసిరో నిజమే చెప్పాడు. చెప్పి, ఆమెకేసి చాల గంభీరంగా, నిబ్బరంగా, నిలకడగా చూశాడు. ఆ చూపే అత నొక నీతీ, నిజాయితీగల మనిషనే భావం చూపరులకు కల్గిస్తుంది. లేని దున్నట్లుచేసి మసిపూసి మారేడుకాయ చేయగల్గిన అతని పద్ధతు లెలావున్నా చరిత్రలో కాలనిర్ణయంకూడా యిమిడివుంటుందికదా. "కంటి కగుపించే విషయాలూ, ఒక విషయం జరిగిన పద్ధతీ, తీరూ వీటియందే నా ఆసక్తి

అంతా'' అన్నాడు. ''ఎవరైనా ఆ శిలువలు చూస్తే ఏపియన్ మార్గంలోని ఆ శిక్షా చిహ్నాలను చూస్తే వాళ్ళకు కనిపించేదేమిటి?ఆరువేల మృతకళేబరాలు! ఆరువేల కంకాళాలు. అవి చూసినవాళ్ళకి రోమన్లంటే పగసాధించుకునే ప్రజ అనేభావం కలగొచ్చు. మేం ధర్మపరులమని వూరికే వాళ్ళకు చెప్పుకున్నంతమాత్రం చాలదు. న్యాయశాస్త్రావశ్యకతను గుర్తించండి బాబూ అని వాళ్లను ప్రాధేయపడ్డా చాలదు. పోనీ ఎవరికోసమో ఎందుకు, మనకోసమే ననుకోండి న్యాయశాస్త్రంలోని తర్కాన్నీ, హేతువునూ మనం విడమర్చి చెప్పాలిగా; విశదీకరించాలిగా. వాళ్ళు బానిసలు గాబట్టి స్వతంత్రుల చేతిలో చావడమనేది సహజం అని కొందరనేస్తారు; అది కొందరికి నిజంగానే కనిపించొచ్చు. కాని అదో చవకబారు బజారు అభిప్రాయమంటాను. నాక్కావల్సింది అది కాదు. మనం ఆ మాదిరిగా అంతమంది బానిసల్ని ఎందుకు చంపాలి అన్నదే నాక్కావాలి.''

''ఈ బానిసల్నేకనుక బజారున అమ్మితే మంచి లాభాలార్జించే అవకాశా లున్నాయని కొందరంటారే'' హెలీనా పెదవులపై మందహాసం గోచరించింది.

''కాస్త నిజం, బోలెడంత అబద్ధం'' సమాధానం సంధించాడు సిసిరో. ''విషయాలను లోతుకుపోయి చూడాలంటాను నేను. పైపైని చూపి సంతృప్తిచెందే స్వభావం నాకు సరిపోదు. ఈ బానిసల తిరుగుబాటు, విప్లవమే అనుకో. దీని అంతరార్థం ఏఁవిటి అన్నదే నాక్కావల్సినదల్లా. భ్రాంతి అనేది గొప్ప వినోదమైపోయింది రోమన్లకు. నామటుకు నే నీ భ్రాంతిలో పడ్డానికి సిద్ధంగాలేను. ఈ యుద్ధమంటాము; ఆ యుద్ధమంటాము. బ్రహ్మాండమైన దండయాత్రలగురించి, గొప్ప గొప్ప సేనానుల గురించి మాట్లాడుకుంటాము. కాని, యీరోజున మన కళ్ళెదుటజరిగే ఈ నిరంతర పోరాటం, ఈ ఎడతెగని, ఈ బానిసతో యుద్ధంగురించి మాత్రం గుసగుసలాడుకోడానికి గూడా, అసలు యిలాంటిది ఒకటుందనుకునేందుకు గూడా మనం యిష్టపడం. ఆ యుద్ధానికి సంబంధించిన సేనానులే దాన్ని గురించి అంతా గప్‌చప్‌చేసిపారేసారు. బానిసయుద్ధంలో పాల్గొంటే యశస్సూ, కీర్తీ అట్టే వుండకపోవచ్చు. అవున్లే! బానిసలపై విజయం సాధించినంతమాత్రాన కీర్తికాంత వరిస్తుందా?''

''కాని నిజంగా అదేమంత ముఖ్యమైన విషయంకాదు.''

''కాదా! ఐతే ఏపియన్ మార్గంలో ప్రయాణంచేసి, వాటినన్నిటినీ కళ్ళారా చూసిన మీకు ఆ శిలువలేమీ ప్రాముఖ్యంలేనివిగా కనిపించాయా? వాటి ఆవశ్యకత ఏమీ లేదనేనా మీ రనేదంతా?''

''నిజానికి అవి ఎంతో వెగటు పుట్టించాయి. అటువంటివి చూడ్డానికి నాకేమీ సర్దావుండదు. క్లాడియాకి నచ్చుతాయి.''

"ఇంకోలా చెప్పాలంటే ఏదోకొంత ప్రాముఖ్యత వాటికుందన్నమాట."

"స్పార్టకస్ గురించీ, బానిసయుద్ధాల గురించీ ప్రతివాళ్ళకీ తెల్సుగా?"

"ప్రతీవాళ్ళకీ తెల్సా! నాకేమీ నమ్మకంలేదు. క్రాసస్‌కికూడా బాగా తెల్సంటే నేన్నమ్మను. మన కీ స్పార్టకస్ విషయమంతా అగమ్యగోచరమయిపోయింది. ప్రభుత్వపు రికార్డు ప్రకారం అతనొక థ్రేషియన్ బానిస, బందిపోటు దొంగ. క్రాసస్ ఆలోచనలో అతను న్యూబియా ఎడారుల్లోని బంగారుగనుల్లో పనిచేసిన బానిస. దీనిలో ఏది నమ్మడం! కేపువాలో శిక్షణకేంద్ర మంటూ వెలగబెట్టిన బేటియాటస్ చచ్చి నరకాన్నున్నాడు. అతని గుమాస్తాగా పనిచేసిన గ్రీకుబానిసే యితనింక బ్రతకడం నిరుపయోగమనుకుని గొంతుకోసి యిదే యమపురికి మార్గమని పంపేశాడాయె. ఆ విధంగా స్పార్టకస్‌కూ, మనకూమధ్య లింకుతెగి వూరుకుంది. మరి అతని గురించి యింకెవరు రాయగల్రు? నా వంటివాళ్ళు తప్ప."

"నీవంటివాళ్ళే రాయాలి. ఎందుక్కూడదు?" హెలీనా అడిగింది.

"నువ్వలా గన్నందుకు సంతోషం. కాని స్పార్టకస్‌ను అసహ్యించుకోవడం తప్ప అతగాడిగురించి నాకేమీ తెలీదు."

"అంతెందుకు! మా అన్నయ్య అసహ్యించుకుంటాడు."

"అయితే నువ్వు అసహ్యించుకోవా?"

"ఫలానా అని నాకేంలేదు. అతనొక బానిస అంతే" అంది హెలీనా.

"అంతేనన్నమాట. ఐతే వఠిబానిసగ స్పార్టకస్ ఎలా అవగలిగాడు? అదుగో అదే నేను సమాధానం చెప్పాల్సిన చిక్కుసమస్య. ఇదెక్కడ, ఎలా ఎందుకు ప్రారంభమయిందో తెలుసుకోవాలి నేను. నీకు విసుగు కలిగించడం లేదుగదా?"

మనఃపూర్వకంగా నిష్కపటిలా కనిపిస్తాడు సిసిరో. ఆ కనబడడమే రక్షరేకు కట్టింది. మున్ముందు ఎవరయినా యితన్ని అవీ యివీ అన్నా యితన్ని నమ్మినవాళ్లు మాత్రం యితని తరపున బాగా వాదించేవారు. "అబ్బెబ్బే చెప్పు ఫర్వాలేదు" అంది హెలీనా. రోములో ఆమెకు పరిచయమున్న సిసిరో వయస్సుయువకులు ఏం మాటాడినా కొత్తరకం అత్తరులుగురించీ, ఏ మల్లులమీద ఎంత పందెం వేసినదీ, ఏ గుఱ్ఱం నెగ్గే అవకాశముందో, వాళ్ళమధ్యనే అనుభవించిన సాని గురించీ, సంసారి గురించీ చెప్పుకునేవాళ్ళు. అటువంటి సంభాషణలతో విసిగి వేసారిన హెలీనా అందుకే అతన్ని చెప్పమంది.

"పూర్తిగ అలంకార శాస్త్రంమీద ఆధారపడ్డ రకంగాదు నేను" సిసిరో చెప్పాడు: "ఏదైనా ఓ విషయం గురించి రాయడమంటే నాకు చాలా సర్దా,

ఎక్కడేదిపడాలో అదిపడ్తే సరి. నా భయమేమిటంటే చాలామంది నీలాగే యీబానిస విప్లవానికి ప్రాముఖ్యత ఏమిటనుకుంటా రేమోనని. కాని చూశావూ; మనందరి జీవితాలూ ఈ బానిసలమీదనే ఆధారపడి వున్నయి, అందుకే ఈ బానిసల తిరుగుబాటు మనం అనుకునే దండయాత్ర లన్నిటికన్నా ఎక్కువయుద్ధకాండను పెంచింది. అంత వరకైనా నమ్ముతావా?"

ఆమె తలవూపింది.

"అది నేను రుజువు చేయగలనుతెల్సా. నిన్నటిదీ; మొన్నటిదీకాదు. నూట యిరవైఐదు సంవత్సరాలక్రితం యిది ప్రారంభమయింది. మనం నిర్బంధంలో నుంచిన కార్తేజీనియన్ బానిసల తిరుగుబాటు దీనికి నాంది. అటు పిమ్మట రెండు తరాలుగడిచాక గ్రీస్‌లోని లారియమ్‌గనుల్లో జరిగిన బానిస మహావిప్లవం. ఆ తరువాత స్పెయిన్‌గనిపనివాళ్ళ బ్రహ్మాండవిప్లవం. పిమ్మట కొద్దిసంవత్సరాలకే మన రిపబ్లిక్కునే కూకటివేళ్ళతో కదల్చి పారేసిన సిసిలియన్ బానిసల తిరుగుబాటు. ఆ తరువాత ఇరవైసంవత్సరాలకు సాల్వియస్ అనే బానిసనాయకత్వాన జరిగిన తిరుగుబాటు. బానిసయుద్ధా లనేసరికి మనం సాధారణంగా చెప్పుకునే యుద్ధాలివి. వీటిలో ఒకదానికీ మరొకదానికీ మధ్య యెన్నెన్ని చిన్న చిన్న తిరుగుబాటులు జరగడంలేదు? యెంత సంక్షోభం వ్యాపించటంలేదు? ఇదంతా కలిసి మనకూ, మన బానిసలకూ మధ్య జరుగుతున్న ఎడతెగని పోరాటం. నిశ్శబ్దంగా సాగిపోయే యుద్ధం, మనం సిగ్గు పడాల్సినయుద్ధం. అందుకే దీన్ని గురించి ఎవరూ మాట్లాడరు. అందుకే యే చరిత్ర కారుడూ దీన్నిగురించి వ్రాయడు. దానిగురించి రాయడానికే భయపడ్తాం. అసలు దానికేసి చూడ్డానికే భయపడ్తాం. ఎందు కీభయం? అది ప్రపంచంలో ఒక అధునాతన శక్తి గనుక. రెండు దేశాలమధ్య యుద్ధాలుండేవి. రెండు పట్టాలమధ్య యుద్ధాలు జరిగేవి. రెండుపార్టీలు పడక పోట్లాడుకచచ్చేవి. ఆఖరికి యిద్దరు సోదరులు కొట్టు కొనేవారు. కాని యిదో; యిది మన నావహించిన బ్రహ్మరాక్షసి. మన నరనరా ల్లోనూ వుంది యిది. అన్నిదేశాలకూ వ్యతిరేకంగా, అన్ని పట్టాలకూ వ్యతిరేకంగా, అన్ని పార్టీలకూ వ్యతిరేకంగా సాగుతోంది యిది."

"నన్నడలగొట్టున్నావ్!" హెలీనా అంది. "దీన్ని నువ్వు యెలా చిత్రణ చేశావో తెల్సా?"

తలవూపి సిసిరో ఆమెవైపు ఏదో వెతికేవాడిలా చూశాడు. ఆమె తన చేతులతో అతనిచేతిని మూసిపట్టుకునేవరకూ అత డా చారిత్రక విషయాల్తో ఆమెను గాబరాపెట్ట సాగాడు. తననుంచి అతనివైపు ఒకరకమైన వెచ్చదనం ప్రవహించిపోతున్నట్లు ఆమె

భావించసాగింది. వయస్సులో తనకన్నా ఏమంత పెద్దవాడుగాకపోయినా జాతి భవిష్యత్ గురించి అంత తీవ్రంగా ఆలోచించే యువకుడు యిక్కడే ఆమెకు తటస్థపడ్డాడు. చిన్నపుడు తను విన్న కథలు అస్పష్టంగా జ్ఞాపకం వచ్చాయి. తను రాస్తున్న దొకప్రక్కనబెట్టి మృదువుగా ఆమెచేతిని తాకుతూ ఆమెను చుంబించాడు. ఇప్పుడే ఆమె స్పష్టంగా ఆ శిక్షా చిహ్నాలను జ్ఞాపకం తెచ్చుకుంది. కుళ్ళుతూ, ఎండకుఎండుతూ పక్షులు పీక్కుతింటూన్న ఆ మానవ మాంసఖండాలింక ఆమెను భయపెట్టలేదు. వాటన్నిటినుంచీ సిసిరో ఒక తర్కాన్ని తయారీచేశాడు. కాని, ఆమె జీవితకాలంలో ఆమె కా తర్కంలోని భావం బోధపడితే ఒట్టు.

'ఎంతో అసాధారణమైన ప్రజలం మేం. ప్రేమ, న్యాయం, వీటిని ఎంతగానో యిముడ్చుకోగల బ్రహ్మాండమైన ధారణశక్తి గలవాళ్ళం' అనుకున్నాడు సిసిరో. హెలీనాకోసం ప్రేమను తయారుచేస్తున్నపుడు అత నావిధంగా తలపోసాడు. ఎట్టకేలకు నన్నర్థం చేసుకోగలస్త్రీ దొరికిందిగదా అని సంతోషపడ్డాడు. ఆ సంతోషం ఆమెను జయించాననుకున్నందువల్ల అతనిలో కలిగిన స్వీయశక్తి విశ్వాసాన్ని తగ్గించలేదు సరికదా; తనకు పర్యాయపదమే శక్తిగా భావించి ఆ శక్తిని సారించగా తా నావిర్భవించినట్లూహించాడు. అదుగో; ఆ విస్తరణ అదే అతని తర్కానికి వెన్నెముకై కూచుంది. అతని ఒక్కనిమట్టుకే నిగూఢంగా గోచరించిన ఒక క్షణంలో తను నడుం బిగించి స్పార్టకస్‌ను అణచిపారేసిన శక్తితో చేతులుకలిపి అతన్ని తిరిగి తలెత్తకుండా పదేపదే దెబ్బతీస్తున్నట్లనుకున్నాడు. అతనికేసి చూచిన హెలీనాకు హఠాత్తుగా అతని ముఖం అసహ్యంతో, కాఠిన్యంతో నిండినట్లనిపించింది. అలవాటుప్రకారం తనని తానసహ్యించుకుంటూ ఆమె అతనికి లొంగింది.

## 2

కేవలం అలసటవల్ల, మానసికాందోళనవల్ల ఆఖరికి నిద్రపోయింది హెలీనా. ఎప్పుడూ తనకొక కల వస్తూండేది. ఏదో ఒక పురుషుడితో తనకు సంబంధమున్నట్లు వచ్చే పాడుకల. ఆ కలలో తన నిద్రచెడేది. కాని ఇప్పుడు యిదొక వింతైనకల. కలతపరిచే కల. ఆ కలలో వాస్తవికత, అవాస్తవికత రెండూ సమ్మేళనమౌతవి. దేనికది విడదీయలేనివిధంగా కలిశాయి. ఆ కలలోనే అన్నతో తను రోం వీధుల్లో తిరుగుతోన్న సమయాన్ని జ్ఞప్తికి తెచ్చుకుంటుంది. కైయస్ తనకొక వ్యక్తిని చూపించి అతడే వర్తకుడు లెంటులుస్ బేటియాటస్ అని చెప్తాడు. ఇది జరిగి ఆరున్నొక్క నెలలయింది. లెంటులుస్ బేటియాటస్‌ను ఆ గ్రీకుబానిస గొంతు కోసి చంపిన కొద్ది రోజుల

క్రితం అందరూ చెప్పుకునే దాని ప్రకారం ఆ గ్రీకుబానిస యజమానివద్దనుంచి కొంత డబ్బు దొంగిలించాడని, ఆ డబ్బుతో ఒక బానిసస్త్రీని కొన్నాడని. ఆ స్త్రీ విషయంలో పేచీలు వచ్చి యజమాని బేటియాటస్‌ను చంపాడని తెలుస్తుంది. స్పార్టకస్‌తో తన కున్న సంబంధంవల్ల బేటియాటస్‌కు కొంత పేరువచ్చింది. అద్దెకొంప తగాదాలో అతడు ప్రతివాది. అద్దెకొంప ఒకటి కూలినపుడు అందులో చావగా మిగిలిన ఆరు కుటుంబాలవారూ అతన్ని కోర్టు కీడ్చారు. దానికి సమాధానం చెప్పుకునేందుకు రోమ్‌కు వచ్చాడతను.

ఆమె తన కలలో అతణ్ణి అతని మామూలు స్థితిలో చూడకల్గింది. పెద్ద 'ప్రభ' అంతమనిషి. బాగా తిని ఇష్టమొచ్చినట్లు తిరిగి, శరీరపు పరిమాణం పెంచిన వ్యక్తి. ఎప్పుడూ పల్లకీలో పోడు. టోగా కట్టుకుని మేరుపర్వతంలా నడుస్తాడు. అసహ్యంగా కాండ్రించి ఉమ్మివేస్తా డెప్పుడూ. చేతికర్రతో అడుక్కునే ముష్టిగుంటలను ఈగలను తోలినట్లు తోలేస్తాడు. ఆ రోజునే కొంతసేపయాక ఎందుకోకాని తనూ కైయస్ న్యాయస్థలం దగ్గర ఆగుతారు. అక్కడే ఒక కోర్టులో బేటియాటస్ దావా విచారణ చేస్తారు. కలలో యిదంతా మామూలుగానే కనిపిస్తుంది. దానికీ యథాస్థితికీ తేడాయే కన్పించదు. ఆరుబైటకోర్టు. ప్రేక్షకులు, పనీపాటాలేనివాళ్ళు, కాలాన్ని ఎక్కడ ఏం చేయాలో తెలీని స్త్రీలు కొందరు, ఉబుసుపోక పట్నంలో తిరిగే యువకులు, పిల్లలు ప్రపంచ ప్రఖ్యాతిచెందిన రోమనుల న్యాయశాస్త్రప్రదర్శనం ఒక్కసారైనా చూడ కుండా రోమ్ వదలి వెళ్ళడం యిష్టంలేని పరదేశస్థులు, ఆ పనికీ, యీ పనికీ తిరిగే బానిసాళ్ళు వీళ్ళందరితోనూ నిండివుంది ఆ ప్రదేశం. ఈ జనసమ్మర్దంనించి న్యాయం మాట దేవుడెరుగు; వివేకమైనా లభిస్తుందా అన్నది అనుమానమే. కాని, కోర్టులిలాగే పనిచేసేవి ప్రతిరోజూ. బేటియాటస్‌ను ఏవేవో ప్రశ్నలు వేశారు. ఆబోతుగొంతుతో వాటికి సమాధానం చెప్పాడు. ఇదంతా తన నిజజీవితంలో చూసినదాని మాదిరిగానే వుంది ఆమెకు.

ఇంతలో ఆమె బేటియాటస్ పడకగదిలో నిలబడి చూస్తోంది. ఇదే ఆమెకు ఎన్నటికీ అర్థంగానిది. ఈ కలలోని విచిత్రమే అది. అతని గ్రీకుబానిస కత్తి పైకెత్తి అడుగులేసుకుంటూ అతణ్ణి సమీపిస్తున్నాడు. ఆ కత్తి థ్రేషియన్ మల్లులు పోరాడే వంపుతిరిగిన చిన్నకత్తి 'సికా'. ఆ పడకగది రంగస్థలం; అదంతా యిసుకమయం. థ్రేషియన్ ఆ యిసుకలో మెల్లమెల్లగా అడుగులేసుకుంటూ సంకోచిస్తున్నవాడిలా నడుస్తున్నాడు. థ్రేషియన్లా జాగ్రత్తగా,బరువుగా అడుగులేస్తున్నాడు. బేటియాటస్ లేచి మంచంమీద కూచుని భయభ్రాంతుడై చూస్తున్నాడు. ఎవరి నోటమ్మటా మాటలేదు.

ఏమీ శబ్దంలేదు. ఆ గ్రీకువానిప్రక్కనే రాక్షసిలాటివాళ్ళెవరో మరొకరు కనిపించారు. మంచి బలిష్ఠమైన కంచువిగ్రహంలాగున్న ఆ మనిషి కవచం ధరించిన శరీరంతో ముందుకొస్తున్నాడు. వెంటనే హెలీనాకు అర్థమైపోయింది. అతడే స్పార్టకస్ అని. గ్రీకువాని మండపట్టుకుని అత నటూ, యిటూ కాస్త తిప్పాడోలేదో గ్రీకువాని చేతి లోని కత్తి క్రిందపడింది. అందమైన ఆ కంచు రక్కసి స్పార్టకస్ తనవైపు-హెలీనా వేపే - సైగచేశాడు. వెంటనే ఆమె ఆ కత్తి పుచ్చుకుని బేటియాటస్ కుత్తుక నుత్త రించింది. థ్రేషియన్, బేటియాటస్ మాయమైపోయారు. తను ఆ మల్లునితో ఆ గదిలో ఒంటరిగా వుంది. ఆమె అతనివైపు బాహువుల సాచినపుడు అతడు కాండ్రించి సరిగ్గా ఆమె ముఖంమీద ఉమ్మాడు. వెనుదిరిగి వెళ్ళిపోయాడు. మూలుగుతూ, ముక్కుతూ వేడుకుంటూ ఆమె అతని వెనకపడిందిగాని; వెనుదిరిగి చూడనైనా చూడక స్పార్టకస్ వెళ్ళిపోయాడు. అంతులేని ఆ యిసుకతిన్నెపై అలాగే చూస్తూ నిలబడి పోయిందామె.

# 3

చాలా అసహ్యంగా నీచపుచావు చచ్చాడు బేటియాటస్. స్వంత బానిసచేతిలో చావడమంటే నీచపుచావుగాక మరేమిటి! క్రాకస్‌కోసం ఏర్పాటుచేయించిన రెండు జతల మల్లయుద్ధ ప్రదర్శనలూ నిష్ఫలమయాయి. వాటినేగనుక అతడు జరగకుండా చేసుకున్నట్లయితే తన చావునేగాక యింకా ఎన్నిటినో నివారించుకోగల్గునేమో. పోనీ, జరిగించాడేకట్టు. అనుకోనివిధంగా పరిణమించిన ఆ పోరాటాలలో పాల్గొగా మిగిలిన యిద్దరు మల్లులనూ నరికించేసినా గొడవలేకపోను. కలతకు కారకులయిన మల్లులను చంపడానికి ఏ అభ్యంతరమూ ఎవరూ చెప్పరుకూడా, అసలుదొక ఆచారమయి పోయింది. స్పార్టకస్ అనేవాణ్ణి చంపినంత మాత్రాన చరిత్రగమనం మారుతుందా అనేది సందేహాస్పదం. ఏ శక్తులు స్పార్టకస్‌ను ముందుకు త్రోసుకొచ్చాయో అవే శక్తులు యితడులేని పక్షంలో వేరొకణ్ణి తయారుచేసును. ఎంతోకాలానికి సలేరియా భవనంలో పాపవిమోచనపొంది నిద్రించే ఈ రోమనుకన్య, హెలీనా, ఒక కలగన్నది. ఆ కలకు ప్రత్యేకించి స్పార్టకస్‌తో అని కాదు; కత్తిపట్టిన ఏ బానిసతోనైనా సరే సంబంధముంది. అలాగే బేటియాటస్ కలగూడ. ఆ కలలు అతని ఒక్కడిసొత్తూ గావు. అవి అతనివంటి వ్యాపారం చేసేవాళ్ళకు, కత్తులుపట్టే మల్లులకూ్కడా సంబంధించి నవే. స్పార్టకస్ యీ పన్నాగం ఎలా పన్నేడు అని బోధపడనివాళ్ళకు యిదే సమా ధానమిస్తుంది. అది ఒకడిపన్నాగం కాదు. ఎంతోమంది పన్నినది, ఏదో ఒక శక్తి

పన్నినది. అతడు నిద్రలో మూల్గుతూ తీవ్రమైన మాటలేవో పేలుతూ పడుకున్నాడు. అతని ప్రక్కనే అతడి భార్య జర్మను స్త్రీ వరీనియా మెళుకువగా కూచుంది. ఆ నిద్ర లోనే అతడెన్నెన్నో విషయాలగురించి మాట్లాడాడు. ఇప్పుడతను థ్రేస్‌కొండలలోని బాలుడు. అంతలో అతను న్యూబియా బంగారు గని పనిమనిషి, అప్పుడే అతడు రంగ స్థలంలోనికి వచ్చేశాడు. 'సికా' అతని చర్మాన్ని కోసింది. బాధతో అతను అరిచాడు. ఆ పలవరింతలను సహించలేకపోయింది వరీనియా. అతన్ని లేపింది; చెమట పట్టిన అతని నుదుటిపై ముద్దిడితూ తట్టుతూ మృదువుగా లాలిస్తూ, ప్రేమిస్తూ అతణ్ణి ఆమె లేపింది. వరీనియా చిన్న పిల్లగా వున్నపుడు తన తెగలోని స్త్రీ పురుషులు ఒండొరులు ప్రేమించుకున్న సమయాల్లో ఎలా ప్రవర్తించేవారో చూసేది. దాన్ని భయాన్ని జయించడమూ అనేవారు. తన ప్రజలు నివసించే మహారణ్యాల్లోవుండే దయ్యాలు, భూతాలుగూడ ప్రేమికుల భయానికి లొంగరని తెల్సుకున్నవి. వేళ్ళు మెలివేసుకుని వాళ్ళు నడిచే తీరులో మనకు స్పష్టంగా కన్పిస్తుంది. భయాన్ని జయించడమే ప్రేమ. ఆమె ఖైదీగా పట్టుబడ్డప్పుడు ఈ తీయని తలపులు స్మృతిపథాన్నుంచి తొలిగాయి. ఆమె వునికియొక్క ప్రధాన ప్రేరణ ద్వేషం!

ప్రస్తుతం ఆమె సర్వస్వమూ ఆమెలోని ప్రాణం, బ్రతుకు, వునికి, జీవితం, పని ఆమె రక్తంయొక్క చలనం, హృదయస్పందన అన్నీ మేళవించుకుని కలిసి పోయి యీ థ్రేషియన్ బానిసపై ప్రేమగా మారాయి. తన జాతిలోని స్త్రీ పురుషుల అనుభవాలు ఎంతో నిజమని, ఎంతో పురాతనమని, ఎంతో భావోద్దీపనమని యిప్పుడే ఆమె పూర్తిగా తెల్సుకోగల్గింది. ఆమె మాయను నమ్ముతుంది. ఆమె ప్రేమలోని మాయ వాస్తవమయినది. నిర్ధారణ చేయ శక్యమైనది. అతన్ని ప్రేమించడం చాలా సులభం. అదీకాక అతను రకరకాలుగావుండే మనిషికాడు. సరళమైన మనిషి. ప్రధా నంగా స్పార్టకస్‌లో కనిపించేది అభిన్నత. పరిపూర్ణత. అత నద్వితీయుడు. సంతుష్టి కలవాడు. సంఘంలో అతని హోదానుచూసిగాదు అతడు సంతుష్టి చెందేది. ఒక మానవుడుగా అత నేమిటో ఎటిగిన తరువాతనే వచ్చిన ఆత్మసంతృప్తి అది. భయం కరమైన, సర్వనాశమైన ఈ నిరాశాజీవుల వలయంలోనైనా సరే, హంతకులతో సైన్యంనించి పారిపోయివచ్చిన పాతకులతో హృదయమేలేని నరరూపరాక్షసులతో న్యూబియా ఎడారి గూడా చంపలేకపోయిన మొరటు మనుష్యులతో నిండిన యీ శిక్షణాకేంద్రపు మృత్యుగహ్వారంలో కూడా అతడు గౌరవించ బడ్డాడు; ప్రేమించ బడ్డాడు కాని ఆమె ప్రేమ మరోలాంటిది. పురుషుల జీవితాల సారమే స్పార్టకస్ అని పించేది స్త్రీలకు. తన స్త్రీత్వపు వాంఛలు నశించినవని ఆమె నమ్మేది కాని అతన్ని

స్పృశించినంతనే అవి రగుల్కొనేవి. అతనిలో ప్రతీదీ పురుషునిలో వుండాల్సిన సులక్షణాలే అని చెప్పాలి. ఆమె ఒక శిల్పి అయివుంటే పురుషులందరినీ అతని మాదిరిగా రూపొందించి తీరును. అతని పగిలిన ముక్కు, పెద్ద గోధుమరంగు కళ్ళు, పెద్ద నోరు, యివన్నీ తను చిన్ననాటినుంచీ చూచిన పురుషుల ముఖాలకు ఎంత తేడాగానో ఉన్నవి. కాని ఆమె ఇతను వినా మరో పురుషునితో సంపర్కంకానీ, మరొకణ్ణి ప్రేమించడంకాని వూహించుకోలేకపోయింది.

అతడు అతనిలాగే ఎందుకుండాలో ఆమెకు అర్థంగాలేదు. ఈ రోమను ఉన్నతకులాల మనుష్యుల జీవిత పద్ధతుల కామె చిరపరిచితురాలు కనుకనే ఆ పురుషులెట్లా ప్రవర్తిస్తారో ఆమెకు ఎరుక. కాని ఒకబానిస స్పార్టకస్ ఎలా అవగలిగాడో మాత్రం తెలీలేదు.

ఆమె చేతులతనికి ఊరటకల్గించాయి. "నువ్వే కలగంటున్నావ్" అని అడిగిందామె.

అతను తలూపాడు.

"నన్ను దగ్గరగా అదిమిపట్టుకో పాడు కలలేంరావు."

అతనలాగే చేశాడు. నెమ్మదిగా ఆమె నడిగాడు: "మనం యిద్దరం కలిసి వుండకపోవచ్చు. అది నువ్వెప్పుడయినా వూహించావా?"

"ఐతే!"

"ఐతే నువ్వప్పు డేంచేస్తావు వరీనియా."

"అప్పుడు నేను చస్తాను" ఆమె ఒక్కమాటలో సమాధానం యావత్తూ చెప్పేసింది.

"దానిగురించే నీతో మాటాడుదా మనుకున్నాను" అతను తన కలలనుండి పూర్తిగా మేల్కొని ఆమెతో తాపీగా అన్నాడు.

"దాన్ని గురించి ఆలోచించడంగాని, మాట్లాడ్డంగాని ఎందుకు?"

"నన్ను నువ్వు బాగా ప్రేమించినట్లయితే నేను దూరంగా వున్నా చచ్చిపోయినా, చచ్చిపోతాననవు."

"నువ్వలా అనుకుంటున్నావా?"

"అవును."

"ఐతే నేను చచ్చిపోతే నీకు చచ్చిపోవాలని వుండదా?"

"నాకు జీవించాలనే వుంటుంది."

"ఏం!"

"జీవితమే లేకపోతే మరింకేదీ వుండదుకనుక."

"మరి నువ్వు లేకపోతే మరి నాకు జీవితమేవుండదే" అంది ఆమె.

"నువు నాకొక మాటిచ్చి అది తప్పకుండా చేస్తానని ఒట్టుపెట్టాలి."

"నేనొకమారు మాటయిస్తే; అది చేసితీర్తా లేకపోతే యివ్వనే యివ్వను."

"ఎప్పుడూ నిన్ను నువ్వు చంపుకోనని మాటయివ్వాలి" స్పార్టకస్ అన్నాడు.

ఆమె కొంతసేపువరకు సమాధాన మివ్వలేదు.

"ఏం వప్పుకుంటావా?"

చివరకు ఆమె చెప్పింది "అలాగే. నేనెప్పుడూ ఆపని చెయ్యనులే."

కొద్దిసేపటికి ఆమె కౌగిలిలో అతను ప్రశాంతంగా, హాయిగా నిద్రపోయాడు.

## 4

వ్యాయామానికి వేళతెలిపింది ప్రభాతభేరీ నాదం. ఇద్దరిద్దరు చొప్పున వరుసలు దీరి వకరివెనుక నొకరు నలభై నిముషాలు నిలబడాలి. ప్రొద్దుట భోజనానికి పూర్వం యిది. నిద్రలేచిన ప్రతివాడికి ఒక గ్లాసుడు మంచినీళ్ళిస్తారు. ప్రతివాడి కొట్టుతలుపూ తెరుస్తారు. అతని కో స్త్రీవుంటే ఆమెచేత ఆగది శుభ్రంచేయించి ఆమెను కేంద్రంలో యితర పనులకు పంపించేస్తారు. బేటియాటస్ శిక్షణాకేంద్రంలో వృథాఅనేది కన్పించనే కన్పించదు. మల్లులకు సరఫరా చేయబడ్డ బానిసస్త్రీలు శిక్షణాకేంద్రంలోని వంటిల్లు తుడవాలి. అంట్లుతోమాలి. వంటచేయాలి. వంటిల్లు వెనుకనున్న పెరడు దున్నాలి. స్నానశాలలు బాగుచేయాలి. గొర్రెలను పెంచాలి. ఎన్నోచేయాలి. చవకగా తయారయే అంబలిపోసి చచ్చేదాకా కొరడాతోబాది వీళ్ళందరి చేత పని చేయించేవారు. భూస్వాములకన్నా బాధపెట్టేవాడు బేటియాటస్. కాని, స్పార్టకస్ అన్నా, వరీనియాఅన్నా అతని కెందుకో భయంగానే వుండేది. వాళ్ళల్లో దేన్నిచూస్తే, యే ప్రత్యేక ప్రవర్తనా విశేషంచూస్తే అతని కా భయం కలిగేదో అతనికే తెలీదు.

ప్రత్యేకం ఆరోజు మాత్రం శిక్షణాకేంద్రమంతటా అసహనమూ, యేహ్యభావం పూర్తిగ వ్యాపించిపోయాయి. ఆ ఢంకానాదంలో ఆవరణలోకి శిక్షకులు మల్లుల్ని తోలిన పద్ధతిలో ఆవరణచుట్టూరావున్న కంచెలకు ఎదురుగా నల్లని ఆఫ్రికా మల్లుని శరీరాన్ని శిలువవేయడంలో, విపరీతమైన ఏహ్యభావంతో బానిసస్త్రీలను అకారణంగా కొరడాలతో బాదడంలో యిదే కన్పిస్తోంది. ఆరోజు ఉదయం వరీనియా అంటే వాళ్ళకేమీ భయంలేదు. ఆమెకు గట్టిగా కొరడాదెబ్బలు తగిలాయి. ఏదైనా వస్తేచాలు; మేస్త్రీ ఆమెను తక్కిన వాళ్ళనుండి విడదీసి "మహావీరునిముండవ్"

అని ఏవేవో వ్యాఖ్యానాలు చేసేవాడు. తక్కిన వాళ్ళకన్నా కొరడా ఆమె నెక్కువ మార్లు తాకేది. వరీనియా వంట గదిలో పని చేస్తుంది. అందుకే ఆమె నక్కడికి తోలేశారు.

బేటియాటస్ క్రోధం అక్కడి వాతావరణమంతటా వ్యాపించింది. గజగజ వణికించే, గడగడలాడించగల కోపం. అసలు ఏ వర్తకుడికయినా ఒకందుకే కోపం వస్తుంది. ఆర్థిక నష్టంవల్ల! మొదట అనుకున్నదానిలో సగండబ్బు యివ్వడం మానేశాడు బ్రాకస్. కావాలంటే వ్యాజ్యం వేసుకోవచ్చు. ఇకనీ వ్యాజ్యాలతో, వ్యవహారాలతో ఎవడు పడగలడు. అందులోనూ ఒక రోమన్ ఉన్నతకుటుంబమేమిటి; దానికి వ్యతిరేకంగా రోమన్‌కోర్టులో రోమన్ న్యాయం లభించడమేమిటి. అతనికోపం ఎన్నో రూపాల్లో ఎన్నోవిధాలుగా అక్కడంతా తాండవిస్తోనేవుంది. వంటగదిలో ఆడాళ్ళందరినీ పనిచేయించడానికని పెద్ద కర్రొకటి బాదేశాడు వంటవాడు. తమ యజమాని చేతి దెబ్బలు చవిచూసిన శిక్షకులు పళ్లుల్నిపట్టుక వాయించారు. ఉదయాన్నే వీళ్ళులేచి కసరత్తుకోసం బారులుతీర్చి నిలబడేచోట అందరికీ బాగా కనపడేటట్లు ఆ ఆవరణ కంచెకు వేలాడతీయబడింది - ఆఫ్రికా మల్లుని కళేబరం.

స్పార్టకస్ తన స్థానంలోనే వున్నాడు. ఒకవేపు గానికస్, మరోవైపు గాల్ మల్లుడు క్రిక్సస్ వున్నారు. రెండువరసలలో నిలబడ్డారు వాళ్ళు. శిక్షకులు రోజుకన్నా హెచ్చుగా ఆయుధాలు ధరించారు. ముఖ్యంగా కత్తి, నిడుపాటి ఖడ్గం. తలుపులు తెరిచివున్నవి. అక్కడ నలభై మంది సైనికులు చేతుల్లో పెద్దయీటెలు ధరించి నిల్చున్నారు. ఉదయభానుని వెచ్చదనం యిసుకను తాకుతోంది. కాని స్పార్టకస్‌లో ఆ వెచ్చదనంలేదు. "ఏమిటిదంతా?" అని గానికస్ అతని చెవిలో ప్రశ్నించాడు. తన తలనూపి మౌనాన్ని స్వీకరించాడు స్పార్టకస్.

"నువ్వు దెబ్బలాడావా?" అడిగాడు గాల్.

"లేదు."

"పోనీ వాళ్ళల్లో వక్కడినైనా చంపాడుగాదు. చావదల్చుకుంటే ఇంతకన్న మంచిచావే చావచ్చుగా."

"నువ్వింత కన్న మంచిచావు చావగలవా."

"అతడో కుక్కలా చచ్చాడు. నువ్వూ అంతే" క్రిక్సస్ అనే గాల్ చెప్పాడు. "పొట్ట పెగుల్చుకుపోయి యిసుకలో పడి చచ్చాడతను. నువ్వూ అంతే."

అప్పుడే గ్రహించాడు స్పార్టకస్ - తానేం చేయాల్సినదీ. సరిగా చెప్పదల్చుకుంటే ద్రవీభూతంగా నున్నవారిలో గ్రహణశక్తి యిప్పుడే ఘనీభవించింది. ఒక

రూపం పొందుతూంది. వాస్తవమయినది ప్రారంభంగాబోతూంది. దాని అంతమో, అనంతమో రాబోయేకాలాల్లో ఎప్పుడో ఎక్కడో వుందోలేదో. ఆ వాస్తవికతకు అతనితో, అతని చుట్టూ వున్న హతభాగులతో సంబంధముంది. ముమ్మందు జరుగబోయే వాటితోనూ సంబంధముంది. నీగ్రోయొక్క నల్లని పెద్ద కళేబరాన్ని చూశాడు. కొరడాల్తో విపరీతంగా మోదిన శరీరం అది. కత్తులు, బల్లేలు, ఆ శరీరాన్ని చీల్చినచోట్ల చర్మం వలవబడి ఎర్రని మాంసపుముద్దలు రక్తంచిమ్మి గడ్డకట్టి ఎండిపోయింది. ఉన్నతమయిన, బలిష్ఠమయిన అతని భుజాలమధ్య తల ముందుకి ఒక ప్రక్కగా పట్టు తప్పి వేలాడుతోంది.

ఈ రోమనులకు జీవితమంటే ఎంతరోత! అనుకున్నాడు స్పార్టకస్. వాళ్ళెంత సులభంగా చంపగలరు. చావు అంటే ఎంత వ్యామోహమూ, ఉత్సాహమూ. అవును; ఎందుకుండదూ. తనబోటి బానిసజాతి రక్తంతో ఎముకలమీద బ్రతికేవాళ్ళకుండదా! శిలువెయ్యడమంటే ఎంత మోహపరవశత చెందుతారో వాళ్ళు! ఆ జబ్బు కార్తేజ్‌లో పుట్టింది. బానిసను చంపడానికి ఈ శిలువ వెయ్యడమే సరైన పద్ధతి అనుకున్నారు కార్తజీనియన్లు. రోమన్ల హస్తాలెక్కడకు సాచితే అక్కడ ఈ శిలువ పిచ్చి జాస్తి అవుతోంది.

బేటియాటస్ ఆవరణలోనికి వచ్చాడు. పెదిమలు కదిలీ కదలకుండా స్పార్టకస్ తన ప్రక్కనున్న గాల్‌ను అడిగాడు. "నువ్వెలా చస్తావుమరి?"

"థ్రేషియన్! నువ్వెలా చస్తావో నేనూ అల్లానే."

"అతను నా నేస్తం" మృతుడైన నీగ్రోనిచూపి చెప్పాడు స్పార్టకస్. "అతను నన్ను ప్రేమించాడు!"

"ఆ ప్రేమే కొంపకూల్చుతుంది."

వెనుక సైనికులు నిలబడగా బారులుతీరిన మల్లుల కెదురుగా నిలబడి చెప్పుకపోతున్నాడు బేటియాటస్. "మిమ్మల్ని నేను మేపుతున్నాను. మీకు మంచిమంచి వేపుడు కూరలూ, మంచినీటి చేపలూ, పులావూ పెట్టి మరీ మేపుతున్నాను. పొట్ట పగిలేదాకా మేపుతున్నా. మీకు స్నానాలు, మాలీసులు చేయిస్తున్నా. గనిగోతుల్లో పనిచేసే మీమూకనంతటినీ, ఓడల అడుగునపడి ఏడ్చిన మిమ్ములనందరినీ చావకుండా యిక్కడకు తీసుకవచ్చి మేపితే సోమరిపోతుతనానికి చక్రవర్తులై రోమ్‌నే తినేస్తున్నారు మీరు. పూర్వం మీరుండే నీచస్థాయికన్నా యింకా అధమాధమమైనదేదీ లేదు. అలాంటి మీకు ఏం కావాలంటే అదిచ్చి మీరెక్కడ బాధపడిపోతారో అని సకల సౌకర్యాలూ, సదుపాయాలూ చేశాను నేను."

"నువ్వు నా నేస్తానివేనా?" స్పార్టకస్ అడిగాడు. గాల్ పెదిమలు కనీకనబడకుండా మెదిపాడు.

"మల్లుడా, మల్లుల సహవాసమ్మాను!"

"నేను నిన్ను నేస్తం అంటాను" స్పార్టకస్ అన్నాడు.

చెపుతున్నాడు బేటియాటస్; "ఆ నల్లకుక్క మసిపూసిన హృదయంలో కృతజ్ఞతాలేదు; అవగాహనా లేదు. మీలో ఎంతమందివున్నా రలాంటివాళ్ళు."

మౌనంగా నిలబడ్డారు మల్లులు.

"నా దగ్గరకు ఒక నల్లనాణ్ణి తీసుకరండి" శిక్షకుల కాజ్ఞాపించాడు బేటియాటస్. వాళ్ళువెళ్ళి ఆఫ్రికన్లలోంచి ఒకణ్ణి అతని దగ్గరకు యీడ్చుకపోయారు. ఇదంతా పూర్వమే ఏర్పాటు చేసుకున్నారు. బాజాలు వాయించడం ప్రారంభమయింది. ఇద్దరు సైనికులు తక్కినవారినుండి వచ్చి బల్లేలను పైకెత్తారు. బాజాలింకా మోగుతున్నాయి. మరింత వేగంగా గట్టిగా మ్రోగుతున్నాయి. భయంతో, బాధతో గింజుకుంటున్నాడు; కొట్టుకుంటున్నాడు నీగ్రో. రెండు రోమన్ యీటెలు అతని హృదయ ప్రదేశంలో నాటాయి. క్షణంక్రితం నిండు ప్రాణంతోవున్న నీగ్రో యిప్పుడు యిసుకలో పడి వున్నాడు. రెండు యీటెలు చిత్రంగా కోణాకృతి ధరించాయి. రోమన్ మృత్యువు అతన్ని అలంకరించింది. తన దగ్గర నిలబడ్డ ఉద్యోగి వైపు తిరిగి బేటియాటస్ చెపుతున్నాడు: "ఇప్పుడికనేం ఖంగాళీచేయరు. ఈ కుక్కలు యింక గుర్రైనా పెట్టలేవు."

"నేను నిన్ను నేస్తమంటున్నా" గానికస్ స్పార్టకస్‌తో అన్నాడు. ఏమీ అనలేదు గాల్. బరువుగా, దీర్ఘంగా గాలి పీలుస్తూ నిలబడ్డాడు.

అప్పుడు, అలాంటప్పుడు ఉదయపు కవాతు ప్రారంభమయింది!

# 5

సెనేట్ పరిశీలనాసంఘానికి కొంత కాలంతర్వాత బేటియాటస్ చెప్పుకున్నాడు. నిజంకూడా అంతేమరి. తన శిక్షణాకేంద్రంలో కుట్రలు, మాయోపాయాలు పన్నినట్లు తన కేమీ తెలీదని, అసలు అలా పన్నడం అసాధ్యమని, అటువంటివి తాను నమ్మలేక పోతున్నానని చెప్పి దీనికి ఆధారంగా అతనొక విషయాన్ని వినిపించాడు. శిక్షణా కేంద్రంలో స్వేచ్ఛ యిస్తానని యిద్దరు మల్లుల్ని జీతాలిచ్చి పోషిస్తాడు. అప్పుడప్పుడు ఆ యిద్దరూ ప్రదర్శనలిస్తారు కూడా. అందులో ఒకడికి ముందనుకున్న విధంగానే స్వేచ్ఛ ఇవ్వబడుతుంది. రెండోవాడు కొద్ది దెబ్బలతో తిరిగి

వస్తాడు. మల్లుల రహస్యాల్ని చెప్పే మల్లునే మరొకణ్ణి ఆ ఖాళీ జాగాలో నియమిస్తాడు. దీన్నిబట్టి చూస్తే ఏకుట్రా తనకు తెలీకుండా జరిగే అవకాశంలేదు అని అతని వాదన.

ఎన్నిమార్లో బానిసల తిరుగుబాట్లు జరిగినా వీటికి కారణంగాని, కారకులుగాని, ఈ విషఫలితాలకు దారితీసిన పరిస్థితులివియనిగాని, అవిచ్ఛిన్నంగా సాగిపోతున్న వీటి మూలంకాని ఎప్పుడూ తెల్సుకోలేక పోతున్నారు. సిసిలీలో పెద్ద ఎత్తున జరిగిన విప్లవమైనా సాధారణంగా ఏ కొద్దిమంది దౌర్భాగులనో శిలువెయ్యడంతో అంతమయ్యే తోటల్లోజరిగే విఫల ప్రయత్నాలైనా నేటికీ సెనేటు మూలం యిది అని చెప్పలేక పోయింది. ఐనా మూలకారణాలు త్రవ్వి తెల్సుకుతీరాలి. ఇక్కడే అపారమైన వైభవాన్ని, భోగాన్ని సృష్టించారు. రోమనుశాంతి ప్రపంచంలోని ఏ జాతిని మరొక జాతితో యుద్ధం చేయకుండా చేసింది. విడివిడిగా వున్న దేశాలను రోమను రోడ్లు దగ్గరగా చేర్చాయి. ప్రపంచానికే ముఖ్యపట్నం అనతగిన, బలవత్తరమైన రోమ్‌లో ఆనందానికి, ఆహారానికి లోటులేదు. ఎలా వుండాలో అలానే ఏర్పాటయింది యిదంతా. ప్రతివాడూ దేవుళ్ళంతా సంకల్పించినట్లు, వాంఛించినట్లే జరిగిందని చెప్పాలి. కాని యీ కుసుమ వికసిత శరీరంలో ఒక జబ్బు వ్యాపించుతుంది. దాని మూలం ఎవడెరుగును. అందమైన ఆ శరీరానికి ఆ జబ్బు ఏ వికార స్వరూపాన్ని ప్రసాదిస్తుందో!

అప్పుడు సెనేటు బేటియాటస్‌ను అడిగింది: "ఐతే కుట్రగాని, మాయోపాయంగాని, దురాలోచనగాని జరుగుతున్న సూచనలేవీ కనబడలేదా?"

"ఏమీ కనబడలేదు."

"మరి మీరా ఆఫ్రికావాడికి మరణశిక్ష విధించినపుడు - మేం దానిని సరైనదేనని భావిస్తున్నాంలెండి - ఏ విధమైన నిరశనా లేదా?"

"లేదే!"

"మేం ప్రత్యేకంగా తెల్సుకోగోరిన విషయం ఏమంటే బయటనించి ఏ విధమైన సహాయంకాని, అన్యుల ప్రోత్సాహంకాని వుండే అవకాశం వుందంటారా?"

"దానికి అవకాశం ఏమీలేదు" బేటియాటస్ చెప్పాడు.

"బయటనించి సహాయంకాని, ధనంకాని యీ నాయకత్రయం - స్పార్టకస్, గానికస్, క్రిక్సస్-లకు లభించిందంటారా?"

"అటువంటిదేమీ లేదని భగవత్సాక్షిగా చెప్పగలను" అని సమాధానమిచ్చాడు బేటియాటస్.

# 6

ఇది పూర్తిగా నిజంకాదు. ఎవరూ ఒంటరిగా లేరు. అందులోనూ స్పార్టకస్ ఎప్పుడూ ఒంటరిగా వుండడు. తను నిర్మించుకున్న ఏ గూటిలోనో ఏకాకిగా వుండిపోడు. అదే అతన్లోని పరమాద్భుతమైన శక్తి. మేరియస్ బ్రాకస్ ఏర్పాటు చేయించిన ప్రదర్శన పోరాటాలు అనుకోనివిధంగా పరిణమించిన నాటికి ఎంతో కాలంకాలేదు. సిసిలీలో మూడు పెద్ద తోటలలో తిరుగుబాట్లు లేచాయి. ఈ తిరుగుబాట్లలో పాల్గొన్న మొత్తం తొమ్మిదివందల మందిలోనూ చాలా కొద్దిమందిని తప్ప తక్కినవాళ్ళను శిలువలపై వేలాడతీశారు. ఈ రక్తపాతం అయాకకానీ బానిసలను చంపడంవల్ల ఎంత డబ్బు నష్టంవస్తుందో గ్రహించలేకపోయారు. ఏమైతే అదేరానీ అని చంపగామిగిలిన వందమందినీ ఓడలవాళ్ళకు అమ్మేసారు. ఆ ఓడలలోనే బేటియాటస్ ఏజంటు ఒకడు బలిష్ఠమైన పొడుగాటి గాల్, క్రిక్సస్‌ను చూచాడు. ఓడల్లో, బానిసలు పెంకెఘటాలని పేరుపడడంవల్ల వాళ్ళకు ధరకిట్టుబాటయేదికాదు. బానిసవ్యాపారం చేసేవాళ్ళకు ఆస్టియా నౌకాకేంద్రంలో అల్లరి, గొడవ జరగడం మంచిదిగాదనితోచి అతని గతచరిత్ర చెప్పకుండా క్రిక్సస్‌ను ఎలాగో ఓలాగున వదల్చుకొన్నారు. మొత్తంమీద స్పార్టకస్ ఏకాకిగా లేడు. ఒక బ్రహ్మాండమైన అల్లికలో తను ఓ భాగం కాకపోనూలేదు. అతని పక్కగదిలో క్రిక్సస్ వుండేవాడు.

సాధారణంగా ప్రతి సాయంత్రము తల తలుపుకు చేరువుగా పెట్టి పడుకుని బానిసత్వ విమోచనకై అర్ధశతాబ్దంనుంచీ ఎడతెరిపి లేకుండా సిసిలీలో జరిగే నిరంతర పోరాటగాధలను క్రిక్సస్ చెప్పగా వినేవాడు. తను, స్పార్టకస్, బానిసల్లో బానిసై పుట్టినవాడు. కానీ, తనవంటి వారిలోనే పురాణ పురుషు లవతరించారు. ఎఖీల్స్, హెక్టర్, ఒడెస్సస్‌లవంటి మహానుభావు లుదయించారు. పాటల్లో, పద్యాల్లో వాళ్ళ కీర్తి ప్రస్తుతింపబడకపోయినా, దేవతల జాబితాల్లో వారి పేర్లుచేర్చి నైవేద్యాలు, ·రతులూ యివ్వకపోయినా వాళ్ళు మహానుభావులే! మానవ సమాజపు ధృవతారలు. ·ాలు. ఈ దేవతలు, రోమన్లలాగనే, బానిసల జీవితాలతో సంబంధము లేనివాళ్ళు ·ట్టి సానుభూతి చూపలేనివారు కనుక ఎఖీల్స్ అలాగే వుండాలి. అలాగే హెక్టర్, ·డెస్సస్ వుండాలి; వుండితీరాలి. వీళ్ళు సామాన్యమానవులు. అంతకన్న అధమవు బానిసలు; అందులోనూ దిగంబరులైన బానిసలు; బజారులో గాడిదలకన్నా తక్కువ ధరకు అమ్ముడుపోయే సరకు, నాగలికికట్టి పొలం దున్నించడానికి ఉపయోగించబడే

జంతువులు; కాని వాళ్ళు ఎటువంటి అఖండులు! దీవిలోని ప్రతిఒక్క బానిసనూ విడిపించి, స్వేచ్ఛనిచ్చి మూడు రోమన్ సైనికదళాలను తుత్తునియలు చేసిన యూనస్, గ్రీకువాడైన ఎథీనియన్. థ్రేస్‌వాడు సాల్వియస్, జర్మనీవాడు వుండార్టు, అద్భుతుడైన బెంజోష్ అనే యూదు. ఇతడే పడవలో కార్తేజ్ నుండి పారిపోయి పడవనడిపే వాళ్ళందరితోసహా ఎథీనియన్‌తో కలిశాడు.

వింటూ, స్పార్టకస్, తన హృదయం గర్వంతో, సంతోషంతో ఉప్పొంగి పోతూందనుకునేవాడు. తన హృదయాన్ని, ఆత్మను, పవిత్రంచేసే సోదరత్వం, ఆత్మీయత ఈ స్వర్గస్థులయిన మహాపురుషులందు తనకు కలిగినట్లు భావించేవాడు. మృతజీవనులై, మృత్యుంజయులయిన యీ కామ్రేడ్స్ పేర్లు విన్నప్పుడల్లా ఆవేశంతో, ఉద్రేకంతో స్పందించేది అతని హృదయం. వారి మనస్సులో మెదిలిన భావా లితనికి తెల్సు. తనకు తెల్సు వా రే కలలు కన్నారో. తనకు తెల్సు; వాళ్ళు సకలేంద్రియాలతో ఏది వాంఛించారో వాళ్ళకి జాతి, పట్నం, దేశం అనే మాటలు అర్థప్రేరణ చేయవు. వాళ్ళ సంబంధం అంతర్జాతీయమైనది. వాళ్ళ ప్రకాశమైన విప్లవజ్యోతులు విఫలతవల్ల జాలిగొల్పేవి. ఓ కొత్తరకం చెట్టు; ఆ కొత్తరకం చెట్టుకు కనీవినీ ఎరుగని ఓ కొత్త రకం పండు. అది ఆ శిలువ! రోమన్లు వాటికే బానిసలను మేకువేసి దిగ్గొట్టేవారు. చివరికి బానిసను శిలువేసేవారు. ఎందుకూ? అందరూ చూడ్డానికి. బానిస కావడానికి నిరాకరించే బానిసకు ముట్టే బహుమానాన్ని బహుమంది చూడాలని ఈ శిలువలు. రోమన్ పరిపాలన చలువ బానిసకు యీ శిలువ!

"చివరకన్నీ ఒకలాగే తయారయేవి" క్రిక్సస్ అన్నాడు.

ఎంత ఎక్కువకాలం మల్లునిగా జీవితం గడిపితే అంత తక్కువగా ఈ సంగతుల గురించి మాట్లాడేవాడు క్రిక్సస్. భూత భవిష్యత్ కాలాలు మల్లుని కేమీ వుపయోగించనివి. అతనికి వున్నదల్లా వర్తమానమే! తన చుట్టూ నిరాశావాదపు గోడలు నిర్మించుకున్నాడు క్రిక్సస్. స్పార్టకస్ ఒక్కడే ఆ గోడల్ని బద్దలు చేసుకొని లోపలి మహాబలవంతుడైన గాల్‌ని చూడగలిగాడు. ఒకమాటు క్రిక్సస్ అతనితో చెప్పాడు.

"నువ్వు చాలామంది స్నేహితుల్ని సంపాదిస్తావు స్పార్టకస్ స్నేహితు చంపడం చాలా కష్టం. నా మానాన్న నన్ను బ్రతకనీ."

ఈనాటి ఉదయం కసరత్తు పూర్తయిన పిమ్మట భోజనశాల లోనికి పోయే ముందు అంతా ఆ ఆవరణలో గుమిగూడారు. శరీరాలు వేడెక్కి చమటలు కారుతున్నాయి. ఆ మల్లులు అక్కడ నిలబడ్డారు. కొంతమంది కూర్చున్నారు. వాళ్ళ మాటలు

వాళ్ల నోళ్ళల్లోనే మిగిలిపోయాయి. ఎదురుగా ఆవరణ గోడకు రెండు కళేబరాలు వేలాడుతున్నవి. ఆ ఆఫ్రికన్ల కళేబరములు రెండూ మేకువేసి గోడకి దిగ్గొట్టారు. చచ్చినవాడు చేసిన నేరానికి బ్రతికినవాణ్ణి శిక్షించారు. న్యాయమంటే అదీ, అలా గుండాలి. అలావుంది రోమన్ న్యాయశాస్త్రం వర్తించిన అన్ని ప్రాంతాల్లోనూ. అలా శిక్షింపబడిన వాని శరీరం క్రింద యింకా రక్తం పడి యిసుకలో మడుగులు కట్టూనే వుంది. రక్తదాహం గల ఈ రోమన్లు బ్రతికివున్న తోటిమానవుణ్ణి చంపితే, తమ దాహం తీర్చుకునేందుకు, చచ్చినవారి రక్తం పీల్చేపక్షులు కొన్ని అక్కడ వాలి దాహం తీర్చుకుంటున్నాయి. వ్యసనమనస్కులై వున్నారు మల్లులు. వ్యాకులపాటు గొంతుకలో అడ్డుపడి వా రెవరినీ మాటాడనివ్వదు. ఇది కథాప్రారంభం మాత్రమేనని అనుకున్నారు వాళ్ళు. బేటియాటస్ మరింతగా వాళ్ళని బాధిస్తాడని అభిప్రాయపడ్డారు. ఇదొక చెడు కాలం. కాలం మహాచెడ్డది.

సైనికులు తినడానికని పోయారు. శిక్షణాకేంద్రంప్రక్కగా ప్రవహించుకుంటూ పోయిన ఏటి ఒడ్డునగల చెట్లతోపులో ఆయుధాలు ఎక్కడో దూరంగాపెట్టి కూచు న్నారు. స్పార్టకస్ వాళ్ళని చూస్తున్నాడు. శిరస్త్రాణాలు లేవు; ఆయుధాలు లేవు. దూరంగా వున్నారు వాళ్ళు. తదేకదీక్షతో దృష్టి వాళ్ళపై నిలిపాడు.

“ఏమిటి చూస్తున్నావ్?” గ్యానికస్ తెల్సుకోగోరాడు. వా ళ్ళిద్దరిదీ చాలాకాలం నుంచి ఒకటే వృత్తి: ఒకేచోట యిద్దరూ సహచరులయిన బానిసలు. గనులలో, థ్రేషియన్ కొండలలో చిన్నప్పుడూ, ఎప్పుడూ వాళ్ళు కలిసేవున్నారు.

“ఏమీలేదు.”

క్రిక్సస్ వ్యాకులచిత్తుడై వున్నాడు. హింస అతనిలో చాలా కాలంగా అణగి వుంది. “దేన్ని చూస్తున్నావ్ స్పార్టకస్?” అని క్రిక్సస్ కూడా అడిగాడు.

“అబ్బే, ఏం లేదు.”

“ఏమీ లేకపోవడమేమిటి. నీలో ఏమీ లేకపోతేనే థ్రేషియన్లంతా నిన్ను నాయనా అని పిలుస్తున్నారా?”

“క్రిక్సస్ నువ్వెవర్ని ద్వేషిస్తావ్?”

“ఆ నల్లవాడుకూడా నిన్ను నాయనా అనేవాడా. స్పార్టకస్! నువ్వతనితో ఎందుకు దెబ్బలాడలేదు. అవసరమొచ్చినపుడు నాతో దెబ్బలాడ్తావా?”

“ఏ మల్లునితోనూ నే నిక దెబ్బలాడను” ప్రతీమాటా తూచి శాంతంగా చెప్తు న్నాడు స్పార్టకస్. “అది మాత్రం నాకు తెల్సు. మొన్నమొన్నటిదాకా నా కది తెలీదు. కాని యిప్పుడుమాత్రం నే తెల్సుకున్నా.”

ఓ అరడజనుమంది యీ మాటలు విన్నారు. అతనిచుట్టూ చేరారు. అతని దృష్టి ఆ సైనికులమీద లేదింక. మల్లులను చూస్తున్నాడతను. మల్లులు, తనబోటి మల్లులు. వాళ్ళ ఒక్కొక్కరి ముఖాన్నే పరిశీలనగా వాటి తూనిక కడ్తున్నట్లుగా చూస్తున్నాడు. అరడజనుమంది ఎనమండుగురు అయారు. పదీ. ఓ డజనుమంది అయారు. ఇంకా అత డేమీ అనలేదు. వాళ్ళలో యింతకుపూర్వంవున్న మనోవ్యధ మాయమయింది. ఉద్రేకం, ఆవేశం, ఉద్వేగం వాళ్ళ కళ్ళల్లో మెరుస్తున్నాయి. ఆ కళ్ళల్లోంచి హృదయాల్లోకి ఎక్కడికో అతడు చూస్తున్నాడు.

"నాయనా! ఏంచేద్దాం?" గానికస్ అడిగాడు.

"చెయ్యాల్సొచ్చినపుడు ఏం చెయ్యాలో అది చేద్దాం. ప్రస్తుతం దీన్ని బద్దలు కొట్టండి...."

అప్పుడు భవిష్యత్తు కళ్ళముందు గోచరించింది. థ్రేషియన్ బానిస వెయ్యేళ్ళ వాడయాడు. వెయ్యి సంవత్సరాల్లో జరగనిది యిప్పుడు కొద్ది క్షణాల్లో జరగబోతోంది. అదుగో మళ్ళీ వాళ్ళు బానిస లవుతున్నారు. బానిసలు చేయాల్సిన పని చేస్తున్నారు. ఇంత ఆవేశం వుండి కూడా వాళ్ళు బానిసాధములే. కసాయి బానిసలే. ఆవరణద్వారం వేపు నడిచారు. పొద్దుట భోజనంకోసం భోజనశాల వైపు వెళ్ళారు.

అప్పుడే బేటియాటస్‌పల్లకీ వాళ్ళ పక్కగా పోయింది. ఎనిమిదిమంది మోసే ఆ పల్లకీలో బేటియాటస్, అతని గుమాస్తా కూచునివున్నారు. వాళ్ళ పక్కగా పోతూన్న బేటియాటస్ బానిస లెంత క్రమశిక్షణతో వున్నారో అనుకున్నాడు. ఆఫ్రికావాణ్ణి చంపిన ఖర్చు హెచ్చయినా, బాగానే జరిగిం దనుకున్నాడు.

బేటియాటస్ అలాగున్నాడు. ఇకముం దతన్ని గొంతుకోసి చంపే గుమాస్తా అలాగే వున్నాడు.

## 7

భోజనాల గదిలో జరిగింది యిదీ అని ఎప్పటికీ, ఎవరూ సరీగ్గా చెప్పలేరు. ఎలా చెప్పడం? బానిసల సాహసాన్ని చిత్రించేందుకు చరిత్రకారులు లేరే. వాళ్ళ జీవితాలు చిత్రించడానికి పూనుకున్న వాళ్ళు లేరుకదా. ఒకవేళ బానిసచేసిన పనులకు చరిత్రలో స్థానం యిచ్చితీరాల్సిన అవసరమే ఏర్పడిందనుకోండి; అప్పుడైనా ఆ చరిత్ర వ్రాసేందుకు బానిసలను కొనుక్కునే వాడే వాళ్ళ నసహ్యించుకొనే వాడే. వాళ్ళంటే భయపడేవాడే తయారయేవాడు.

వంటగదిలో పనిచేస్తూ తను స్వయంగా చూసింది వరీనియా. చాలా కాలం గడిచినాక ఆ సంగతి ఆమె ఎవరికో చెప్పుతుంది—అప్పుడు మనమూ విందాం—ఆ విప్లవపు రణగొణ ధ్వని. బ్రహ్మాండాన్ని బ్రద్దలు చేసిన ఆ శబ్దం గుసగుసలాడుకునే స్థాయికే దిగినా అదెప్పుడూ వినబడకుండా మాత్రం పోదు. భోజనాల హాలుకి ఒక వేపున వంటగది వుంది. మరో చివర ఆ గదిలోకి ద్వారముంది.

ఆ భోజనాలగది బేటియాటస్‌గారి సృష్టి. పూర్వపుపద్ధతిని కట్టే రోమన్ భవనాలున్నాయి. కాని యీ మల్లులకు శిక్షణ యివ్వడం, వాళ్ళద్వారా డబ్బు సంపాదించడం, పోరాటప్రదర్శనాలు చూడాలనే పిచ్చి యింతమందినీ అదుపు ఆజ్ఞలలో పెట్టడం మొదలైన గొడవలన్నీ ప్రస్తుత రోమను సమాజపుసృష్టి. పూర్వం వున్న రాతిగోడకు మూడుగోడలు చేర్చాడు. ఆ చదరంమీద లోపలికి నాల్గువేపులా ఎనిమిది అడుగుల వెడల్పుగల కర్రచూరు దింపాడు. ఇదీ పూర్వపు పద్ధతిదే. ఇటువంటి కట్టడ పద్ధతులు ఒక శతాబ్దం క్రితం వుండేది. సమశీతోష్ణముండే కేపువాలో యీమాత్రం చాలు. శీతాకాలంలో మాత్రం కొంచం చల్లగా, ఎప్పుడూ తేమగా వుండేది. మల్లులు నేలమీద కూచొని తినేవారు. మధ్యగా పచారుచేస్తూ, వీళ్ళని చూస్తూ వుండేవారు, శిక్షకులు. దీని కో పక్క వంటగది. ఆ గదిలో యిటుకలతో, పెంకుతో కట్టిన పెద్దపొయ్యి వుంది. ఒక వేపు పెద్ద కర్రతలుపు లున్నాయి. మల్లులు లోన ప్రవేశించిన తరువాత తలుపులు గడియవేస్తారు.

అలాగునే, రోజూ తీరునే యీనాడు కూడా అంతా జరిగింది. వాళ్ళ వాళ్ళ స్థానాల్లో మల్లు లున్నారు. వంటగదిలో పనిచేసే బానిసలే వాళ్ళకు వడ్డన చేస్తున్నారు. అందులో చాలామంది స్త్రీలే. నల్గురు శిక్షకులు చతురస్రాకారపు టావరణలో పచార్లు చేస్తున్నారు. కొరడాలు, కత్తులు పట్టుకున్నారు. ఆ పనికోసం నియోగించబడ్డ యిద్దరు సైనికు లొచ్చి తలుపులు బిగించి వెళ్ళారు. పైన గడియ వేశారు. రమ్యమైన ఆ తోపులో చాలా దూరంగా సైనికులు విశ్రాంతి తీసుకుంటున్నారు.

ఇదంతా స్పార్టకస్ గమనిస్తూనే వున్నాడు. అత డేమీ నోటబెట్టలేదు. నోరు తడి ఆరిపోయింది. అతని ఛాతీమీద హృదయం సమ్మెటతో కొడుతోంది. ఏమంత గొప్పపనేమీ జరగడంలేదు. భవిష్యత్తు గురించి యితర్లకు తెలీనిదీ, తనకు తెల్సినదీ ఏమీలేదు కాని కొంతమంది ఒక నిశ్చయానికి వస్తారు. "నేను ఫలానా పని చేయలేకపోతే నే నిక బతికియుండాల్సిన అవసరమూ లేదు. దాని ప్రయోజనమూ లేదు!" చాలామంది యీ నిశ్చయానికే వస్తే పృథివి కంపిస్తుంది.

అదుగో ఆ కంపనమే కొద్ది కొద్దిగా కానివ్వాలి. ఈ రోజు సమాప్తమయేసరికి సూర్యుడస్తమించి చీకటి వ్యాపించేలోపున ఆ కంపనం జరుగుతుంది. కాని స్పార్టకస్‌కు అదేమీ తెలీదు. ముందు క్షణంలో చేయాల్సిన దేదో అదే తెల్సు అతనికి. ముందు చేయాల్సినది మల్లులతో మాట్లాడ్డం. అదే ఆ గాల్, క్రిక్సస్‌తో అతను చెప్పుతుంటే పొయ్యిదగ్గిర నిలబడి వరీనియా అతణ్ణి చూసింది. అతని పెదిమల కదలికను చూసి భావంగ్రహిస్తున్నాడు యూదుడు. చెవి అతనివైపుపెట్టి నిలబడ్డాడు గేనికస్. ఆఫ్రికా వాడు ఫ్రాక్సస్ అతనికి దగ్గరగా వచ్చాడు.

“నిలబడి మాట్లాడాలని వుంది నాకు” స్పార్టకస్ అన్నాడు. “మనసు విప్పి మాట్లాడదామనివుంది నాకు. ఒకమారు మాట్లాడ్డం మొదలెట్టితే యిక వెనుదీయడమనేది వుండబోదు. అప్పుడా శిక్షకులు నన్ను ఆపడానికి ప్రయత్నిస్తారు.”

“నిన్ను వాళ్ళాపలేరు” క్రిక్సస్ చెప్పాడు.

ఆ ఆవరణలో యీ అజ తగిలింది. ఇద్దరు శిక్షకులు స్పార్టకస్ వున్న చోటికి వచ్చారు. కొరడాలు విదలించి కత్తులు దూశారు.

“మాటాడిప్పుడు” గేనికస్ అరిచాడు.

“కుక్కలనుకున్నారా అలా కొరడాల్తో బాదడానికి?” ఆఫ్రికన్ గర్జించాడు.

స్పార్టకస్ లేచి నిలబడ్డాడు. అతనితోబాటు చాలామంది లేచారు. కొరడాలూ, కత్తులూ యిష్టమొచ్చినట్లుపయోగిస్తున్నారు శిక్షకులు. మల్లులు వాళ్ళమీద పడ్డారు. వెంటనే శిక్షకులు శిక్షింపబడ్డారు. బానిసస్త్రీలు వంటమనిషిని సఫా చేశారు. ఇంత జరిగినా పెద్ద చప్పుడేమీ కాలేదు. అప్పుడు స్పార్టకస్ మొదటిసారిగా ఆజ్ఞాపించాడు, నెమ్మదిగా, మృదువుగా, గాబరా పడకుండా జాగ్రత్తగా ఆజ్ఞాపించాడు. క్రిక్సస్, డేవిడ్, గేనికస్, ఫ్రాక్సస్‌లతో చెప్పాడు.

“వెళ్ళి ఆ ద్వారాన్ని జాగ్రత్తగా సంరక్షించండి. నే మాట్లాడాలి.”

ఈ గొడవనించి యింకా వాళ్ళు తేరుకోనేలేదు. కొద్ది క్షణాల్లో వాళ్ళాతని ఆదేశాన్ని పాటించారు. ముందు కూడా, అతను వాళ్ళకి నాయకత్వం వహించి నడిపించినప్పుడు అతని ప్రతిమాటా జవదాటక పాటించేవారు. అతన్ని ప్రేమించారు. క్రిక్సస్‌కు తెల్సు చావు అనివార్యమని. ఐనా అదేం లెక్కలేదు అతనికి. ఎప్పుడూ ఎరుగని వెచ్చదనం తనలో ప్రవహించి, సౌమ్యస్వభావుడయిన యీ వింత థ్రేషియన్ అంటే ప్రేమ పొడసూపింది. పగిలిన ముక్కుతో అసహ్యంగా కనబడే స్పార్టకస్ నాయకత్వం పట్ల యూదుడు డేవిడ్‌కు భక్తిప్రపత్తు లుదయిస్తాయి.

# 8

"నా చుట్టూరా చేరండి" స్పార్టకస్ అన్నాడు.

ఇదంతా ఎంతో త్వరగా జరిగింది. బయటనున్న సైనికులకు యీ గొడవేమీ తెలీదింకా. వంటగదిలోని మల్లులూ, బానిసలూ మొత్తం 30 మంది స్త్రీలు, యిద్దరు పురుషులూ వాళ్ళుగూడా వచ్చి వీళ్ళచుట్టూ చేరారు. భయంతో, ఆశతో భక్తితో అతని వైపు చూస్తూ వరీనియా అలొస్తోంది. ఆమెకోసం వాళ్ళొత్తిగిలారు. తన దగ్గరకు వచ్చి నిలబడ్డ వరీనియాను చేత్తో చుట్టి గట్టిగా అదిమి పట్టుకొని తనలో అనుకున్నాడు.

"ఇప్పటికి నేనొక స్వతంత్రుణ్ణి! నా తండ్రిగాని, తాతగాని వాళ్ళ జీవితకాలంలో ఒక్కక్షణం స్వేచ్ఛావాయువులు పీల్చిన పాపానపోలేదు. కాని నే నిప్పుడు స్వేచ్ఛా జీవిని." ఆ భావాన్ని సేవించిన అతనిలో తీయని ద్రాక్షసారా ఆహారనాళం గుండా చల్లగా జారినట్లనిపించింది. కాని దానితోబాటు ఓ భయం కూడా వుంది. స్వతంత్రం పొందడమంటే తమాషా ఏమీ కాదు. చాలకాలం బానిసగా మ్రగ్గిన నువ్వు స్వతంత్రుడుగా కావడం అంటే మాటల్తో పనికాదు. తనకు బాగా తెల్సిన భయమొకటి స్పార్టకస్‌లో వుంది. తిరుగులేని కఠోర నిర్ణయంచేసిన ప్రతి వ్యక్తీ అలాగునే భయపడ్తాడు. పైగా అతనికి తెల్సు. తను వేసే ప్రతి అడుగునా నోరు తెరచి మృత్యువు కబళింప చూస్తున్నదని. చంపడమే పనిగాగల మల్లులు తమ యజమానుల్నే చంపినందుకు యజమానిని కొట్టిన బానిస బాధపడినట్టే, ఆందోళనాపూరితమైన ఒక సంశయంతో బాధపడ్తున్నారు. వాళ్ళ కళ్ళన్నీ అతన్ని గమనిస్తున్నాయి. శాంత స్వభావంగల థ్రేషియన్‌గని పనిమనిషని, తమ హృదయారాటాన్ని తెల్సుకున్నవాడని, తమ కాత్మీయుడని వాళ్ళు తలపోశారు. ఆ కాలపు ప్రజలు మూఢనమ్మకాలకూ, విశ్వాసాలకూ దాసులు. ఏదో ఒక దేవత, కొద్దిగా జాలి హృదయంగల ఒక దేవత అతన్ని స్పృశించిందని మల్లులు భావించారు. అందుకని అతను భవిష్యత్తులో మంతనాలాడి దాన్నొక వాచకం క్రింద గడగడా చదివి వినిపించి వాళ్ళను దానిలోనికి నడిపించాలి. ఒకవేళ రోడ్లు లేక, వాళ్ళకు ప్రయాణానికి అతనె కొత్తబాటలు వేయాలి. వాళ్ళ కళ్ళల్లో యివన్నీ అతని కగుపడ్డాయి.

"మీరు నా వాళ్ళేనా?" దగ్గరగా నిలబడ్డ వాళ్ళ నుద్దేశించి ప్రశ్నించాడు. "ఇక ముం దెన్నటికీ నేను మల్లుణ్ణి కాను. ముందు నే చస్తా. మీరు నా ప్రజలేనా?"

కొందరి కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి. ఇంకా దగ్గరగా వచ్చి నిలబడ్డారు. కొందరు చాలా భయపడ్డారు. కొందరు కొంచెం భయపడ్డారు. కాని వాళ్ళ నందరినీ అతను తేజస్సులో జలకమాడించాడు. అదీ అతనిలో గల శక్తి, స్వీయప్రతిభ.

"మనలో ప్రతివాడు యిప్పుడో కామ్రేడ్. అందరం కలిసి ఒకే మనిషిలాగు ఉండాలి మనం. పూర్వం నా ప్రజలు చెప్పగా విన్నాను నేను. పోరాటానికి పోయే ముందు రోమన్లలా గాక ఒక సదుద్దేశంతో వెళ్ళేవారట. ఎవరికైనా పోరాటానికి పోవాలని లేకపోతే వాడికేసిచూడరు వాళ్ళు."

"మనం ఏం చేద్దాం?" ఒక డడిగాడు.

"పోయి పోరాడుదాం; ఘనంగా పోరాడుదాం. మనకన్న పోరాడగల్గిన వాళ్ళు యీ భువిలో లేరు కనుక పోరాడుదాం. బాగా పోరాడుదాం." అన్నాడు స్పార్టకస్. అతని కంఠం ప్రతిధ్వనిస్తోంది. ఇతడేనా మృదువుగా మాట్లాడే స్పార్టకస్-అని ఆశ్చర్యపోయి అలాగే నిలబడ్డారు మల్లులు. అతని గొంతు భయంకరంగా గట్టిగా ధ్వనిస్తోంది. బయట నున్న సైనికులు తప్పకుండా వినేవుంటారు.

"కేపువా మల్లులను రోమ్ మరువలేని విధంగా మనం ద్వంద్వయుద్ధాలు చేద్దాం!"

దేన్ని మానవుడు చేయాలో అది చేయాల్సిన కాల మొకటివుంది. వరీనియాకు యిది తెలుసు. పూర్వం ఎన్నడూ ఎరుగని సంతోషాన్ని నేడామె చూపింది. ఒక ఆనందాన్ని పొందింది ఆమె. ప్రపంచంలో ఎవరితోనూ సరిపోల్చదగని సాటివారిలో మేటి మగడు ఆమె భర్త అనేవిషయం ఆమెలో గర్వాన్నీ, ఆనందాన్ని రేకెత్తించాయి. ఆమెకు స్పార్టకస్ గురించి తెలుసు. అనతికాలంలో ప్రపంచకానికంతకూ తెలుస్తుంది. కాని తనకు తెలిసినంత తెలీదే! యెలానో ఆమె అనుకుంది; ఏదో ఒక బలవత్తరమైన మహత్తర నిరంతర పోరాటం ప్రారంభం కాబోతుందనీ, అతడెంతో సౌమ్యస్వభావు డనీ, పరిశుద్ధాంతఃకరణుడని, అతనివంటివాడు మరొకడు లేడని.

## 9

"మొదటా సైనికులు——" స్పార్టకస్ ఆజ్ఞాపించాడు. "మనం ఐదుగురికి వాళ్ళల్లో ఒక్కడున్నాడు. వాళ్ళు పారిపోతారేమో."

"వాళ్ళు పారిపోయారు" అతనన్నాడు కోపంగా. "వాళ్లు పారిపోరు. ఆ సైని కుల్ని గురించి ఆ మాత్రమైనా తెల్సుకోవాలి. వాళ్ళు మననైనా చంపాలి, లేదా మనం వాళ్ళనైనా చంపాలి. వాళ్ళని మనం చంపినా, ఇంకా బోలెడుమంది వస్తారు. రోమన్

సైనికులకు అంతేమిటి," తనకేసి చూసిన వాళ్ళతో అతనన్నాడు: "ఐతే బానిసలకు మాత్రం అంతుందా ఏమిటి?"

అప్పుడు వాళ్ళు తమ ప్రయత్నాలు శీఘ్రంగా కొనసాగించారు. చచ్చిన శిక్షకుల ఖడ్గాలు తీసుకున్నారు. ఆయుధంగా ఉపయోగించుకునేందుకు వీలైనవన్నీ వంటగది లోంచి తీసుకువచ్చారు. మాంసం గుచ్చి కాల్చే పెద్ద పెద్ద యినుపవూచలూ, గొడ్డళ్ళూ పొడుగాటి అట్లకాడలూ, ముఖ్యంగా రోకళ్ళు ఒకటేమిటి, చేతికి దొరికిందల్లా అధమం శత్రువుమీదికి విసరేందుకు వుపయోగపడుతుంది కదా అనే వుద్దేశంతో తీసుకవచ్చారు. కట్టెలుగూడ వాళ్ళ ఆయుధాలే అయాయి. మూకుళ్ళు, పెనాలు వాళ్ళ డాళ్ళు. ఏదో మాదిరి ఆయుధాలు ప్రతీవాళ్ళ దగ్గరా వున్నాయి. స్త్రీలు వెంటరాగా వాళ్ళా పెద్ద కర్ర తలుపులను తెరిచారు యుద్ధానికి పోడానికి.

వాళ్ళు తొందరగానే వెళ్ళారు. సైనికుల్ని గాబరా పెట్టేంత తొందరగా మాత్రం వెళ్ళలేదు. ఇద్దరు కాపలాసైనికులీ వార్త తక్కిన వాళ్ళ దగ్గరకు మోసుక పోయారు. వెంటనే తోపులోని సైనికులంతా కవచాలు ధరించి, అస్త్రాలు పూని, నాల్గు దళాలుగా చీలి, ఏటికావలిగట్టున నిలబడ్డారు నలభైమంది సైనికులు. సైనికుల్లాగే కవచాలూ, ఆయుధాలూ ధరించిన శిక్షకులూ మొత్తం ఏభైయిద్దరున్నారు. రెండు వందలమంది దిగంబరులైన, నిరాయుధులైన మల్లుల కెదురుగా నిలబడ్డారు. అదేమీ సమవుజ్జీగాదు. రోమన్ సైనికుల కిది లాభించింది. పైగా రోమన్‌సైన్యం ప్రపంచమే ఎదిర్చిపోర నశక్యమైనది. ఒకదళం తరువాత నొకదళం యీటెలనెత్తిపట్టుక ముందుకు వస్తున్నారు. ప్రభాతవాయువులు దళాధిపతుల ఆజ్ఞలను మోసుకుపోతున్నాయి. వాళ్ళ మాటలు స్పష్టంగానే వినిపిస్తున్నాయి. ఈ బానిసాధములను తుడిచిపారేయలేక పోతామా అన్నట్లు నడుస్తున్నారు వాళ్ళు. బూటూ కాళ్ళతో ఎత్తి ఎత్తి పడుతున్న వాళ్ళ అడుగులు ఏటినీటిని తూలిస్తున్నవి. గడ్డిపూలు వాళ్ళ పాదాలకింద నలిగి పోతున్నవి. ఆ చుట్టుప్రక్కలనున్న బానిసలు ఏమిటో ఆశ్చర్యమని చూడవచ్చారు. ఎండలో ఈటెల మొనలు మెరుస్తున్నవి. రోమన్‌శక్తి ప్రదర్శించడానికి యీ కొద్ది పాటి సైనికులూ చాలు. ఒట్టి బానిసలైతే వీళ్ళని చూసి పరిగెత్తే వాళ్ళే.

కాని ఆ సమయంలో మాత్రం రోమన్‌శక్తి అగాధంలో పడిపోయింది. స్పార్టకస్ సేనానాయకుడయాడు. ప్రజల్ని నడిపించే వ్యక్తికి ప్రత్యేకనిర్వచనమంటూ ఏమీలేదు. నాయకత్వమన్నది, అరుదైనదీ, అర్ధమవనిదీ, అధికారం కీర్తికలిస్తే మరేనీ. ఎవడైనా ఆజ్ఞాపించవచ్చు. కాని ఇతరులు వినేలా ఆజ్ఞాపించగల్గడమే విశేషం. ఆ విశేషం స్పార్టకస్‌లో అశేషంగా వుంది. దూరదూరంగా వుండండని ఆజ్ఞాపించాడు.

వాళ్ళు అలాగా దూరంగా వుండిపోయారు. ఈ దళాలను చుట్టుముట్టడానికి వీలుగా ఒక పెద్ద వలయంగా వుండమన్నాడు. వాళ్ళు అటువంటి వలయాన్నే ఏర్పరిచారు.

సైనికదళాలవేగం తగ్గింది. ఏంచేయాలో వాళ్ళకు తెలీడంలేదు. వాళ్ళు ఆగారు. ప్రపంచంలో ఏ సైనికుడూ మల్లులతో సమానంగా నడవలేడు. మల్లులకు వేగమే జీవితం. ఆ వేగం, చురుకుదనమూ లేకపోతే ద్వంద్వయుద్ధాల చేయనేలేరు. పైగా వీళ్ళేమీ దుస్తులు ధరించలేదు, లంగోటాలు తప్ప. రోమన్ సైనికులు అలాగాక ఖడ్గం ఈ డాలు శిరస్త్రాణం, కవచం, బూట్లు వగైరా ఎంతో బరువు మోస్తున్నారు. ఆ బానిసల వలయంలో సైనికులు యిటూ అటూ తిరుగుతూ ఈటెలు విసురుతున్నారు. ఆ యీటెలు యెంత విసిరినా ముప్పై నలభై గజాలు మించిపోవు. వాటి ప్రయోజనంలేదు. పైగా ఒకమాటు విసిరితే వాటిపనిసరి. బానిసలంత దూరమున్నప్పుడు వాటిని ఎవరిమీద విసరడం?

ఆ పరిస్థితిలో, విస్పష్టంగా చూడగలిగిన సూక్ష్మదృష్టితో తన వ్యూహాన్ని వూహించాడు స్పార్టకస్. రాబోయే సంవత్సరాలలో గూడ అతడదే వ్యూహరచనా పద్ధతి నవలంబించాడు. వాడిఅయిన రోమనుమొనలకు యెదురుగ మూకవుమ్మడిగా పడి యీటెలకు ప్రాణాలను బలియిచ్చి నశించిన సైన్యాల గాథలు విన్నాడు. గనుక వాటి ఎత్తుగడల్లోని తప్పులను వివరంగా క్లుప్తంగా తన మనోనేత్రంతో చూడగలిగాడు. అరుస్తూ, శపిస్తూ, శరిస్తూ నిల్చిన దిగంబర మల్లులమధ్య రోమన్ క్రమశిక్షణ, రోమన్‌శక్తి, అసహాయతతో నిలబడిపోయాయి. "విసరండి" అరిచాడు స్పార్టకస్. "విసరండి రాళ్ళు. అవే మన తరపున పోట్లాడుతాయి." ఆ వలయం చుట్టూ యిట్టే కదుల్తున్నాడు తీవిగా "విసరండి రాళ్ళు."

రోమను క్రమశిక్షణ రాళ్ళవర్షంలో నిలబడింది. సిగ్గుతో సైనికులు తల వాల్చారు. అక్కడగాలి రాతిమయమయింది. ఎగిరే భయంకరమైనరాళ్ళు. స్త్రీలుగూడా కలిసారు. ఇళ్ళల్లో పనిచేసే బానిసలు, తోటల్లో, పొలాల్లో పనిచేసే బానిసలూ యీ బానిసల్తో కలిసారు. సుశిక్షితులైన సైనికులు గత్యంతరంలేక పెద్దపెద్ద డాళ్ళ నడ్డు పెట్టుకుని వంగి ముడుచుకుపోయి నిలబడ్డారు. ముందుకువచ్చి సైనిక శ్రేణులను ఖండించి యెదుర్కొనేందుకు అదే మల్లులకు అవకాశమిచ్చింది. కొద్దిమంది సైనికులు యీటెలు విసిరారు. ఒక్క మల్లుడుమాత్రం ఆ ఆయుధానికి గురికాక తప్పలేదు. తక్కినవారా రా సైనికబృందంపైపడి చీల్చిచెండాడి అందరినీ చంపారు. సైనికులు తిప్పి కొట్టడానికి ప్రయత్నించారు. తోడేళ్ళలా మల్లులు వాళ్ళమీదపడి చంపుతున్నా, రాళ్ళ వర్షం కురుస్తున్నా అలాగే నిలబడి పోట్లాడుతూ చచ్చిపోయారు. పదిమంది సైనికులు

త్రోవచేసుకుని ఎలాగోలాగున తప్పించుకుపోదా మనుకున్నారు. కాని ఆ పనికి పది మంది సరిపోతారా? వాళ్ళు గూడా సంహరింపబడ్డారు. క్షమాభిక్ష వేడుకున్న శిక్షకు లిద్దరిని ఆడాళ్ళు డాళ్ళతో కొట్టి చంపారు. శిక్షణాకేంద్రం ఆవరణలో మొదలయిన ఈ చిన్న వింతయుద్ధం కేపువా రోడ్డుదాకా వ్యాపించి అక్కడున్న ప్రతి సైనికుణ్ణీ హత మార్చేవరకూ వెళ్ళింది. ఆ ప్రదేశమంతటా చచ్చినవాళ్ళు, గాయాలు తగిలినవాళ్ళూ పడివున్నారు. రోమన్ సైనికులూ, శిక్షకులూ కలిసి ఏభైనల్గురు మరింకెంతోమంది మల్లులూ చచ్చిపోయారు.

అది నాంది మాత్రమే. సంపూర్ణమైన విజయంతో, విజయోత్సాహంతో రాజ మార్గంలో నిలబడి స్పార్టకస్ దూరంగావున్న కేపువా నగరపు గోడలు చూశాడు. రక్షణదుర్గంలో భేరీనిస్వన వినవొతున్నది. ఇప్పుడింక విశ్రాంతి వుండదు; అందరికీ ఉప్పు అందింది. రక్షణదుర్గంలో చాలమంది సైనికులున్నారు. ప్రపంచగోళం ధణేలు మని పేలినట్లయింది. మృత్యువుతో నిండిన, నెత్తుటితో తడిసిన, ఆ రాజమార్గంలో నిలబడ్డ స్పార్టకస్‌కి బ్రహ్మాండమైన కల్లోలిత ప్రవాహాలపై స్వారీచేస్తున్నట్టని పించింది. నవ్వుతూ కనబడ్డాడు క్రిక్సస్. విజయోత్సాహంతో కనబడ్డాడు గేనికస్. కత్తిపై నెత్తురు, కళ్ళ మెఱసే జీవంతో కనబడ్డాడు యూదుడు డేవిడ్. వాళ్ళ భాషలో యుద్ధగీతాలను పాడుకుంటూ ఆఫ్రికన్లు నిశ్చలంగా నిలబడ్డారు. వరీనియాను తన చేతు ల్లోనికి తీసుకున్నాడు. తక్కిన మల్లులు వారివారి స్త్రీలను ముద్దెట్టుకుంటున్నారు. తమ బాహువులతో పైకెత్తుతున్నారు. వాళ్ళతో కలసి కేరింతలు కొడ్తున్నారు. ఇళ్ళల్లో పనిచేసే బానిసలు బేటియాటస్ తాలూకు తోలుసారాసంచులు పట్టుకొచ్చారు. నవ్వుతూ, ఆనందంతో అరుస్తూ అతని ముఖాన్నీ, భుజాలను, కత్తిపట్టిన అతని హస్తాన్ని నిమురుతోంది; అతని కళ్ళల్లోకి చూస్తోంది వరీనియా. అదో హడావిడి. ఆ హడా విడిలో కొందరు బానిసలు సారాసంచులు విప్పే ప్రయత్నంలో నున్నారు. స్పార్టకస్ వాళ్ళ వంటిమీద తెలివొచ్చేలా చేశాడు. అతనిలో మృదుత్వం పోయింది. ఏకాగ్రత రగుల్కొని అతన్ని మార్చివేసింది. తన జీవితమంతా యీ పనికే, అతని ప్రయత్నమంతా యీ పనికే అని ఉద్బోధించింది. శతాబ్దాల తరబడి అతడు నిరీక్షిస్తున్నాడు. మొదటి బానిసకు సంకెళ్ళు తగిల్చి నీళ్ళను తోడమని కర్రతో, కొరడాల్తో మోదినప్పటినించీ నిరీక్షిస్తున్నాడు. అపుడే ఒక నిర్ణయాని కొచ్చాడు. ఆ నిర్ణయానికి మార్పన్నది లేదు.

పూర్వం వాళ్ళని అడిగేవాడు. కాని ఇపుడు వాళ్ళని ఆజ్ఞాపిస్తున్నాడు. రోమన్ ఆయుధాలు ఎవరుపయోగించగలరు? ఈ జెలతో ఎవరు పోరాడగలరు? వాళ్ళందర్నీ నాల్గుదళాలుగా ఏర్పరిచాడు.

"స్త్రీలు లోపలుండండి. వాళ్ళు బయటకు కనపడకూడదు. దెబ్బలాడకూడదు" అన్నాడతను.

స్త్రీల ఆగ్రహం అతన్ని ఆశ్చర్యచకితుణ్ణి చేసింది. మొగాళ్ళ కోపంకన్న అ దెంతో తీవ్రమైనది. "మాకు దెబ్బలాడాలని వుంది" అన్నారు వాళ్ళు. మా మాట వినకపోతే "ఏడ్చి మరీ చెప్తాం" అన్నారు. కత్తులు కొన్ని కావాలని వాదించారు. అవి యివ్వకపోవడం చూసి రాళ్ళను వళ్ళో మూటకట్టుక నిలబడ్డారు!

శిక్షణాకేంద్ర సమీపంలో రాతిమయమైన తోటలున్నాయి. అద్భుతమైనదేదో, ఏదో భయంకరమైనది జరుగుతోందని, తెల్సుకుని ఆ తోటల్లోని బానిసలు రాతిగోడల మీద కూచొని, గుంపులు గుంపులుగా చేరి నిలబడి యిదంతా చూస్తున్నారు. వాళ్ళని చూసేసరికి ఒక్క క్షణంలో అతనికి భవిష్యత్తు సాక్షాత్కరించింది. యూదుడు డేవిడ్‌ని పిల్చి చేయవలసిన దేదో చెప్పాడు. డేవిడ్ ఆ బానిసలవైపు పరిగెత్తాడు. స్పార్టకస్ ఊహ సరైనదే. చూస్తూ నిలబడ్డ బానిసల్లో మూడొంతులమంది డేవిడ్‌తో వచ్చేశారు. పరుగెత్తుక వచ్చి మల్లుల చేతుల్ని ముద్దెట్టుకున్నారు. వాళ్ళ వద్ద తొళ్ళిక లున్నాయి. ఆ పనిముట్లు ఆయుధాలుగా మారాయి. ఆఫ్రికావాళ్ళు తిరిగి వచ్చారు. ప్రధానాయుధాగారం బద్దలుగొట్టబడ లేదు. శూలాలున్న పెట్టె బద్దలుకొట్టి ముప్ఫయి త్రిశూలాలు మాత్రం తీసుకొచ్చారు. త్రిశూలాలతో పోరాడేవాళ్ళ కా ఆయుధాలిచ్చాడు స్పార్టకస్. వా ళ్ళా ఆయుధాల్ని లాలించారు. ముద్దెట్టుకున్నారు. వారి వింత భాషలో ఏవేవో వింత ప్రతినలు పూనారు.

ఇదంతా కొద్దిపాటి క్షణాల్లో జరిగింది. కాని యింకా వేగంగా జరగాలన్న విషయం స్పార్టకస్ గుర్తించాడు. శిక్షణాకేంద్రంనించి, వాళ్ళున్న ఆ ప్రదేశంనుంచి, కేపువానుంచి బయటకు పోవాలనుకున్నాడతను. "నాతో రండి" అతనరిచాడు. "నాతో రండి" అతని ప్రక్కనే వరీనియా నిలబడింది. రోడ్డుదాటి, తోటలుదాటి, ఏటవాలుగా నున్న కొండలమీదకు వాళ్ళెక్కారు. "న న్నెప్పుడూ వదిలిపెట్టకేం! న న్నెప్పుడూ వదిలిపెట్టకేం" అంది వరీనియా. "నేను మొగాడిలా యుద్ధం చేయగలను."

రోడ్డుమీద కేపువానించి వస్తోన్న సైనికులు అగుపించారు. రెండొందల మంది మల్లులు కొండల్లోకి పోతున్నారన్న సంగతి చూసేవరకూ వాళ్ళు జంటలుగా వచ్చారు. అప్పుడు సైనికాధిపతులు మల్లులను తాకి, వారి శ్రేణులను ఛేదించవలసి నదిగా ఆజ్ఞాపించారు. ఎంతోమంది కేపువాపౌరులు ధర (ఖర్చు) లేని ద్వంద్వ యుద్ధాలు అయాచితంగా ఏర్పాటవుతున్నాయి కదా అని సింహద్వారం వద్ద నిలబడి చూస్తున్నారు.

ఇదంతా ఏదో ఒకచోట ఆగిపోనూవచ్చు. ఇంతకుపూర్వం బానిసలు తప్పించుక పారిపోవడమూ కద్దు. అలా పారిపోయినవాళ్ళు తోటల్లోకీ, అడవుల్లోకీ పోయి దొరికిందేదో దొంగిలించగల్గిందేదో తిని జంతువుల్లా, కొన్నాళ్ల కాలం గడిపేవారు. సైనికులు ఒక్కొక్కణ్ణీ వెన్నంటి తరుముకొచ్చి దొరికిన ప్రతి బానిసనీ శిలువలపై దిగగొట్టేవారు. తమవైపు వస్తోన్న రక్షణదుర్గంలోని సైనికులను చూసి, స్పార్టకస్ యిదంతా గ్రహించాడు. ఆ ప్రపంచంలో బానిసకు ఎక్కడా శరణ్యంలేదు. ప్రపంచం అలా తయారయింది. అలా తయారుచేశారు. తల దాచుకుందుకు చోటులేదు. మనుషులు దాక్కుందుకు కన్నాలుండవుగా. ఈ ప్రపంచం మారాలి. అంటే ప్రపంచాన్ని మార్చాలి.

పరిగెత్తడం ఆపాడు. చెప్పాడు "సైనికుల్తో తలపడాలి మనం."

# 10

తరువాత చాలాకాలానికి స్పార్టకస్ తనలో తాను ప్రశ్నించుకున్నాడు. "మా పోరాటాలేమిటో, మేమేం నెగ్గామో, ఏవి ఓడామో వీటిగురించి వ్రాసేదెవరు? నిజం చెప్పేదెవరు?" బానిసలకు సత్యమైనది, వారు నివసించే పరిస్థితులు కల్పించిన వర్గాలకు సత్యమైనదానికి విరుద్ధం. అసలెప్పుడైనా నిజమనే దానికి అవకాశముండదు: ఏ పరిస్థితుల్లోనైనా సరే నిజానికి తావేలేదు. దీనర్థం వాస్తవమైనది జరగదని కాదు. ఆయా కాలమాన పరిస్థితుల్లో ఆ యా సందర్భాలలో యిదిగో యిదీ యథార్థం అని చెప్పి ఎవరినీ వప్పించలేము. బోధపర్చడానికి ప్రయత్నించినా ఎంతవరకు పని జరుగుతున్నదనేది వేరే విషయం. బానిసలకన్న సైనికులెక్కువ. ఎక్కువగా వున్న ఆ సైనికులకు ఆయుధాలుకూడా హెచ్చే వున్నయి. అసలు బానిసలు యుద్ధం చేయగలరని సైనికులు అనుకోలేదు. కానీ, సైనికులు తప్పక యుద్ధంచేసితీరుతారని బానిసలకు తెలుసు. కొండలమీదికి పరుగెత్తుకవస్తున్నారు సైనికులు. వాళ్ళకు ప్రతిదినమూ కవాతులో చెప్పిన పద్ధతిలోనే వరుసలు తప్పకుండా, క్రమశిక్షణతో పరుగెత్తుక వస్తున్నారు. పారిపోయేది కుందేలే అని తెలిసినపుడు సహజంగా ధైర్యంతో పరుగెత్తొచ్చు. మల్లుల్ని తరుముకొచ్చే సైనికులు ఆ విధంగానే పరిగెత్తుకొచ్చారు. పరిగెడ్తున్నవాళ్ల హఠాత్తుగా దెబ్బతినేశారు. వాళ్ళ కర్థంకాలేదు. ఆ దాళ్ళు విసరుతోన్న రాళ్ళధాటి కోర్వలేక ఆ దాళ్ళ వెనుక దాగుతూ వాటి నడ్డుపెట్టుకొని ఎటు విసురుతున్నారో తెలీకుండా ఈటెలు విసురుతున్నారు.

ఇదిమాత్రం నిజం. బానిసలు సైనికుల్ని తరిమి తరిమికొట్టారు. సునాయాసంగా కేపువాకు సగందూరందాకా తరిమేశారు. కొందర్ని చంపి పారేశారు. మొదటి పోరాటంలో బానిసలు బాగా నష్టపడ్డారు. కాని రెండవతూరి పోరాడినపుడు మాత్రం ఏదో కొద్దిమంది నిహతులయేరేతప్ప ఏమంత హెచ్చునష్టంలేదు. రోమన్ సైనికులు కాళ్ళకు బుద్ధిచెప్పి రోడ్డుచ్చుకుని పలాయనం చిత్తగించారు! అసలు విషయం అలాగుండగా దాన్నే వందల విధాలుగా రకరకాలుగా మనిషికో పద్ధతిగా చెప్పుకున్నారు. కాని అధికారయుతమైన మొదటి రిపోర్టుమాత్రం కేపువా రక్షణదుర్గపు సైనికాధికారిచే తయారుచేయబడింది.

అతను ఈ విధంగా వ్రాశాడు: "లెంటులస్ బేటియాటస్ శిక్షణా కేంద్రంలోని కొద్దిమంది మల్లులు తిరుగబడ్డారు. అందులో చాలా మంది దక్షిణంగా ఏపియన్ మార్గం గుండా పారిపోయారు. అర్థపటాలం సైనికులు పంపబడ్డారు. కాని వాళ్ళెలాగో తప్పించుక పారిపోయారు. పల్లెప్రాంతాల్లోని బానిసల్లో అలజడి, ఆందోళన లేవతీస్తున్నారు. వాళ్ళ నాయకులెవరో, వాళ్ళ ఉద్దేశాలేవో తెలీడంలేదు. తక్షణం ఈ తిరుగుబాటు నణచేందుకు ఉత్కృష్టమైన రోమన్ సెనేట్ సహాయ సేనలను పంపవలెనని యిక్కడ పౌరులు అనుకుంటున్నారు." ఈమాత్రం చేర్చడం ఎందుకైనా మంచిదని కాబోలు మరో వాక్యంకూడా చేర్చాడు. "అప్పుడే ఎన్నో అత్యాచారాలు జరుగుతున్నాయి. గృహదహనాలూ, దోపిడీలూ జరుగుతాయేమోనని పల్లెప్రజలు భయభ్రాంతులవుతున్నారు."

ఏమిటి జరిగిందో తెల్సుకోవాలనే కుతూహలమున్న ప్రజలకు తనకు తెల్సినంత మట్టుకు చెప్పాడు బేటియాటస్. ఎన్నో సంవత్సరాలుగా అతడు చేసిన కృషి అంతా ఒక్కక్షణంలో గంగపాలయింది. అందుకే అతనికన్న వ్యథచెందినవారు, కలగుండె పడినవారూ లేరనే చెప్పాలి. కాని అందరికీ తెలుసు ఈ భయంకరమైన మల్లులను చావగొట్టి శిలువలకు తగిలించేవరకూ పల్లెపట్టులాందోళనకు ఆటపట్టయి అశాంతి ఏర్పడుతుందని. ఆ శిలువలవల్ల లాభం చేకూరగలదని అంతా అనుకున్నారు. ఏదైనా జరగడం ఒక ఎత్తు. జరిగిన దాన్ని గురించి చెప్పకోవడం మరొక ఎత్తు. ఈ చెప్పకోడానికి కూడా ఒక పద్ధతి వుందా అనిపిస్తుంది. బానిసల అశాంతి పునాదిపై నిర్మించబడ్డది రోమన్ జీవితసౌధం. సహస్ర విధాలుగా, రకరకాలుగా జరిగిందాన్ని గురించి కథలల్లుకుని చెప్పుకున్నారు రోమన్లు. ఈ తిరుగుబాటును గురించి భయంతో వాళ్ళకు తోచిన విధంగా చెప్పుకున్నారు. ఎప్పుడూ వాళ్ళ ప్రవర్తన అంతే. ఇంకెప్పుడూ అంతే.

"కేపువా పెద్దబావిలో నీళ్ళు తోడుతోనే వున్నాను, ఇట్టే తప్పించుకపోయాడు స్పార్టకస్. నే చూశానే! రాక్షసంత మనిషి అమ్మనాయనో ఎంత భయమేసిందని, పసి కందు పొట్టలో ఈటెతో పొడిచి పైకెత్తి పట్టుకొన్నాడు. అమ్మ! వాడి రాక్షసత్వం మాడ!"

ఇలాగే కొన్నివేల విధాల్లో స్పార్టకస్ గురించి అనుకున్నారు. అతని గుణ, గణరూప విశేష వర్ణనలు చేసుకున్నారు. వీటిమాటకేంగాని ఆ పరిస్థితుల్లో స్పార్టకస్ చూడకల్గిందే సత్యం అని చెప్పాలి. కాలంయొక్క వుక్కు సంకెళ్ళన్ని విదల్చుకొని కానరాని భవిష్యత్కాలాన్ని చూడగల్గింది అతని దృష్టి. అతని నాయకత్వం క్రింద నడిచిన మల్లులు రెండు చిన్న పోరాటాల్లో రోమన్ సైనికుల్ని తుడిచిపెట్టారు. ఆ సైనికులు అందానికి ఆశ్రయమైన కేపువా నగరంలో భీకర యుద్ధ ఘోషల శబ్దాలకు దూరంగా సుఖజీవనం సాగిస్తున్నారే అనుకోండి; అదీకాక యిటలీలో కత్తిపట్టకలిగిన వారెవరైనా వుంచే అట్టి జట్టీలతోనే ఆ సైనికులు పోరాడవలసివచ్చిందే అనుకోండి. అయితే మాత్రం ఒక్క విషయం భూకంపం కల్గించగల శక్తిగలది కదా మరి! అణగి పడివుండే బానిసెక్కడ, తిరస్కారం ప్రకటించగల ధైర్యమెక్కడ! అంతటితో ఆగిందీ! ఒకేరోజున బానిసలు తమ యజమానిపై రెండు పర్యాయాలు దెబ్బతీశారు. అందులోనూ ఆయుధాల్తో! ఇదీ అక్కడ గమనించాల్సిన విషయ విశేషం. పైగా సైనికులు పారిపోయినంత మాత్రాన వాళ్ళ తిరుగుబాటు ప్రయత్నాలాగాయా అంటే అదీలేదు. స్పార్టకస్ ఒక్కమారు పిలవడంతో ఆ బానిసలంతా హాజరయారు. కొద్ది గడియల్లో వాళ్ళతన్ని దేవుడుగా మార్చేశారు. విజయోల్లాసం వారిలో ప్రవేశించి ఆత్మవిశ్వాసాన్ని పురిగొల్పగా అది వారిలోని భయసందేహాలను దరిదాపుల కనపడ కుండా పారదోలింది. నెమ్మదిగా, లాలనగా, మృదువుగా ఒకళ్ళనొకళ్ళు తాకుతున్నారు. అదొకమాదిరిగా స్పృశిస్తున్నారు. ఆ స్పర్శ వారి భాష లేని భావాలను ప్రసారం చేస్తోంది. ఏమైపోయిందిప్పుడా సూత్రం? "మల్లుడా మల్లుల సహవాసం మాను" అన్న సూత్రం ఏమైపోయింది. ఒక్క దెబ్బ నెగిరిపోయింది. తద్విరుద్ధమైనదే నిజమయి కూర్చుంది. పాపం! సూత్రకారుడికి యత్నవైఫల్యమేకదా! ఒకరి వునికి వేరొకరికి శక్తినీ ఉత్సాహాన్నీ యిచ్చింది. ఇవన్నీ వాళ్ళ ఆలోచనా పర్యవసానంగా తేలిన విషయాలా, వాళ్ళ హేతు చర్చలవల్ల బయటపడ్డ సారాంశమా అంటే అదేమీ కాదు. వాటంతటవే వాళ్ళకే తెలీకుండా పరిస్థితుల కనుగుణ్యంగా వచ్చిన భావాలు. అనుకో కుండా వచ్చాయి. వాళ్ళు అమాయకులు మామూలు మనుషులు; హఠాత్తుగా పారిశుధ్యం పొందారు. ఇదివరకెన్నడూ ఒకరి ముఖంలోకి మరొకరు చూసి ఎరుగరు. అవునుమరి.

గొర్రెవేపు బేలతనంతో జాలిగా చూసిన కసాయీ కాగలడా? అలాగే వాళ్ళంతకు పూర్వం విధిగా ఒకరి నొకరు రంగస్థలం మీద చంపుకోవాలి. ఆనాటి విధ్యుక్త ధర్మమది. కాని యిపుడో విజయంవల్ల సౌహార్ద్రభావాన్ని సాధించిన స్వేచ్ఛాజీవులు వాళ్ళు. సిసిలీలో, తక్కిన అనేక ప్రదేశాల్లో విప్లవాలెలా జరిగాయో, వాటి అర్థమేమిటో యధార్థమేమిటో యిప్పుడు వ్యక్తమయింది స్పార్టకస్‌కు. తన సహచరుల్లో ప్రవహించిన శక్తి యుత్సాహాలే అతనిలో వెల్లువలై ప్రవహించినయి. ప్రవహించి అతని గత జీవితపు వేతల బాధలభయాల నైచ్యాన్ని కడిగిపారేశాయి. జీవితాన్ని జాగరూకతతో చూసుకుంటాడు. జీవితపు రహదారిలో మెళుకువగా నడుస్తాడు స్పార్టకస్. ఇది చూసిన ప్రతీవాడూ స్పార్టకస్‌కి జీవితమంటే యెంత జాగ్రత్త, బ్రతుకంటే యెందుకంతగా ప్రాకులాడుతాడనుకుంటారు. ఇక్కడే వుంది అతని ప్రాకులాటలోని పరమార్థం. అతని జాగ్రత్తకు ఫలితం. ఇప్పు డతనికి చావంటే భయం లేదిక. ఎందుకో ఆ భయం అనుకోకుండానే వైదొలగింది. అదో పెద్దవిషయంగా తోచదతని కింకేమాత్రం.

కేపువాకు అయిదుమైళ్ళ దక్షిణంగా ఏపియన్ మార్గానికి పక్కగా కొద్ది దూరంలో ఒక కొండపక్క మల్లులు, వారి స్త్రీలు, తక్కిన బానిసలు అంతా గుమిగూడారు. అక్కడికి రోమన్ ఖామందుల భవంతి ఒకటి కనిపిస్తోంది. సూర్యుడు నడినెత్తిన నిల్చినకాలం. ఈ రెండు పోరాట సంఘటనల అనంతరం, ఆ బానిసలు ఒక సైన్యాన్ని పోలివున్నారు. నల్లవాళ్ళే కనుక, వాళ్ళల్లో లేకపోతే, చూసినవాళ్ళకు అదొక రోమన్ సైనిక విభాగమనిపించేదే. నిహతులయిన రోమన్ సైనికుల ఆయుధాలు, శిరస్త్రాణాలు, కవచాలు, డాళ్లు వగైరా అన్ని యుద్ధపరికరాలనూ వాళ్లు పంచుకున్నారు. చూస్తుంటే ఈ సాహసులను రోమ్ తప్ప తక్కిన మరెవరూ ఎదిరించి పోరశక్యం కాదనిపిస్తుంది. స్త్రీలు తప్ప తోటలలో, యిళ్ళల్లో పనిచేసే బానిసల్ని అందరినీ కలుపుకుంటే మొత్తం రెండువందల ఏభై మందున్నారు. గాల్‌లు, ఆఫ్రికన్లు, థ్రేషియన్లు వాళ్ళలో మూడు ప్రధానభాగాలుగా వున్నారు. వాళ్ళవాళ్ళ నాయకులనే సైనికోద్యోగులుగా భావించి, రోమన్ దళనిర్మాణపక్కీ నవలంబించారు. రోమన్ సైనికపద్ధతులను చాలాకాలంగా చూసినవాళ్ళు గాబట్టి ఆ పద్ధతుల్నిట్టే అమలుపర్చేశారు. పదేసిమంది చొప్పున చిన్నచిన్న దళాలుగా చీలి, క్రమశిక్షణను పోషిస్తున్నారు. వా రందరికీ స్పార్టకస్ నాయకుడు. ఆ విషయమై ఆలోచనేలేదు. సహజంగా జరగాల్సిందేమో జరిగిపోయింది. అతనంటే ప్రాణాలు సహితం లెక్కచేయరు వాళ్లు. మానవుల్లో కొందరిని దేవతలు స్పృశిస్తారు. అప్పుడు వాళ్లు మహాపురుషులవుతారు అని పురాణాల

వల్ల విన్నారు. అతని కేసి వాళ్లు చూసినపుడు వాళ్ళ కళ్ళల్లో, ఆ కళ్ళ వెనుక అగాధాల్లో ఆ భావమే ద్యోతకమయేది. ఆ భావంతో నిండిన చూపులే వాళ్లు చూసేవారు.

ముందుకు సాగిపోతూన్నవాళ్ళకు ముందుండేవా డతను. నడుంచుట్టూ ఒక చేతిని పెనవేసి, అతని ప్రక్కనే నడిచేది వరీనియా. ఆమెకిది కొత్తా ఏమైనానా. పురుషుల్లో మహాపురుషుడనీ, బలవంతులలో ధైర్యశాలి అనీ తెలిసే కదా ఆమె ఇతణ్ణి వరిస్తే. ఇప్పుడు తనకు తెలిసినటులే అప్పుడూ తెల్సు. వాళ్ళ కళ్ళు కలిసేవి. పెదవులపై చిరునగవు దొంతరలు దొరలేవి. సైనికులతో ఆమె యుద్ధం చేసింది. ఇది అతనికి సంతోషం కల్గించిందో లేదో కాని, తను కత్తిపట్టుకోవడానికి అతనెప్పుడూ అభ్యంతరం చెప్పలేదు. వాళ్లు సమానులు. మొగాళ్ళలాగునే యుద్ధాలకుపోయిన పూర్వపు అమెజాన్ యువతుల వీరగాధ లామె విన్నది. ఆ కథ లా రోజుల్లో వాడుకలో వుండేవి. ఒకప్పుడు స్త్రీ పురుషులు సమానులని, బానిస యజమాని అనే తేడాల పాటింపబడని సమయం ఒకటి వుండేదని చెప్పేకథలు స్పార్టకస్ నాటికి కూడా చెప్పుకునేవారు. నేడు నాటికి బూజుపట్టించింది. గతంమీద వర్తమానం మసక చీకటుల మబ్బుతెరలు వాల్చింది. అప్పటిదే స్వర్ణయుగం, అదే స్వర్ణయుగం రాబోతుందిక.

స్వర్ణసమయమే అది. అందమైన పల్లెప్రాంతాలపై సూర్యుడిపుడు స్వర్ణమయ కాంతులను ప్రసరింపజేస్తున్నాడు. భయంకరులయిన రంగస్థలపు మనుష్యులు, ఏవేవో ప్రశ్నలతో నిండిన జర్మన్ వనిత వరీనియా, అతని దగ్గరగా అతని చుట్టూరా వున్నారు. మెత్తగా ఆకుపచ్చని ముఖమల్లులాగున్నది పసిరిక. దానిపై పచ్చని గడ్డి పూలు వెన్నలా తెట్టుకట్టాయి. తుమ్మెదలూ, సీతాకోక చిలుకలూ ఎగురుతున్నాయి. ఎగిరి ఝుంకారశబ్ద సంగీతాన్ని ప్రసారంచేస్తున్నాయి ఆ గాలిలో. వాళ్ళతన్ని థ్రేషియన్ పద్ధతిలో "నాయనా!" అని సంబోధిస్తారు.

"ఇప్పుడిక మనమేం చేయాలి. ఎక్కడకు పోవాలి?"

ఆ వలయంలో కేంద్రములా అతడు నిలబడ్డాడు. అతని కాలికి తన బుగ్గ నానించి గడ్డిలో కూచుంది వరీనియా. ఎర్రని ముఖాలలో నీలాలకళ్ళు పొదిగిన గాల్‌లు, నల్లనిజుట్టుగల బలిష్ఠమైన థ్రేషియన్లు, నిడుపాటి అవయవాలు పొడుగాటి శరీరాలు గల్గిన ఆఫ్రికన్లు, అంతా అక్కడ పరివేష్ఠితులయారు. కొందరు పడుకున్నారు. అత నన్నాడు: "మనమందరం ఒకే తెగ, వప్పుకుంటారా?" వాళ్ళు తలలూచారు.

ఎంతోకాలం కాలేదు. ఒకప్పుడంతా సమానులే. అందుకే అప్పుడు బానిసలనేవారే లేరు. అందరూ అదే అన్నారు.

"ఎవరికి మాట్లాడాలని వుంది? మనకెవరు నాయకత్వం వహించదల్చుకున్నారు. ఇప్పుడు మనం స్వతంత్రులం. నాయకత్వం వహించదలిచిన వారెవరైనా వుంటే లేచి నిలబడండి."

ఎవ్వరూ లేవలేదు. కత్తుల పిడులతో థ్రేషియన్లు డాళ్ళమీద మోదారు. అదో బ్రహ్మాండమైన శబ్దాన్ని కల్గించింది. ఎవరో ఆ మైదానంలో పరిగెత్తిన చప్పుడు వినబడింది. ఖామందుల గృహప్రాంగణాన నిలబడ్డ దెవరు చెప్మా. అంతదూరాన వున్న వారెవరో ఏమిటో చెప్పడం కష్టం. వాళ్ళ ముఖాల ముందు చప్పట్లు చరిచి, స్పార్టకస్ పట్ల తమకున్న గౌరవాన్ని తెలీజేశారు ఆఫ్రికన్లు. వాళ్ళందరిలో అంత సంతృప్తి కల్గడం ఆశ్చర్యమనిపిస్తుంది. ఆ క్షణంలో వారు కలల విమానాలమీద ఎగిరి స్వాప్నిక జగత్తులో విహరిస్తున్నారు. అప్పటి వారి మనఃప్రవృత్తి అట్టిది. మరింత గట్టిగా తన బుగ్గను అతని కాలికాన్చింది వరీనియా. గేనికస్ జయధ్వానం చేశాడు.

చావ సిద్ధంగానున్నవా డొకడు నీరసంగా లేచి నిలబడ్డాడు. అతణ్ణి గడ్డిమీద పడుకోబెట్టారు. చేయిపొడుగునా తెగివుంది. ఆ గాయానికి రక్తంతో తడిసినగుడ్డ చుట్టబెట్టారు. అతడొకగాల్. వెనకబడటం యిష్టంలేదతనికి. ఆ విధంగానే స్వతంత్రాన్ని చవిచూశాడు. కట్టును నిర్లక్ష్యించి కారుతోంది రక్తం. తనవేపు వస్తున్న అతన్ని స్పార్టకస్ నెమ్మదిగా పట్టుకొని జాగ్రత్తగా నిలబెట్టాడు.

"చావంటే నాకు భయం లేదు!" మల్లుల నుద్దేశించి, అతడు చెపుతున్నాడు: "మల్లయుద్ధంలో ఒక సోదరునితో పోరాడి చచ్చేదానికన్నా యితన్ని అనుసరించి చావడమే మేలు. నా కదే యిష్టం. ఇతన్నే అనుసరించి, మనల నెక్కడికి తీసుక పోతాడో చూడాలని వుంది నాకు! కాని నేను చస్తే నన్ను జ్ఞాపకముంచుకోండి. ఎన్నడూ అతని కన్యాయం తలపెట్టకండి. అతని మాటలు వినండి. అతన్ని థ్రేషియన్లు 'నాయనా!' అంటారు. మనమంతా చిన్నపిల్లలం. మనలోని చెడుని అతడు తుడిచి పారేయగలడు. ఒక గొప్పపని చేశాను కాబట్టే నాలోని చెడుగు నశించింది. పరిశుద్ధుడి నయాను. అందుకే చావంటే జంకను. ఇంక హాయిగా నిద్రపోతా. ఆ నిద్రలో నా ప్రాణం పోయాక నా కింక కలలు రావు!"

ఇది విన్న మల్లులలో కొందరు గట్టిగా ఏడ్చారు. ఆ గాల్ స్పార్టకస్‌ను ముద్దెట్టుకున్నాడు. అతన్ని తిరిగి చుంబించినపుడు స్పార్టకస్ పెదిమలు వణికాయి. "నా పక్కనే వుండు" అన్నాడు స్పార్టకస్. అక్కడే కూలబడ్డాడు గాల్. ఏమీ

కానట్లు మృత్యువుతో అంత సులభంగా వియ్యమందగల మల్లుల్ని చూస్తే పొలాల్లో పనిచేసిన బానిసలకు ఆశ్చర్యమేసింది.

"నువ్వు చనిపోతావుకాని మేం జీవిస్తాం?" అతనితో అన్నాడు స్పార్టకస్. "నీ పేరు మేం జ్ఞాపకముంచుకుంటాం. అది మా నినాదం చేసుకుంటాము. ఆ నినాదాన్ని దిక్కులు పిక్కటిల్లేలా ధ్వనిస్తాం. ఈ ప్రపంచమంతటా నీ పేరు ప్రతిధ్వనింప చేస్తాం?"

"ఎప్పుడూ మానరా యింక!" అడిగాడు గాల్.

"సైనికులు మామీద పడ్డపుడు మానామా మేము? రెండుమార్లు ఆ సైనికుల్తో తలబడి నెగ్గలేదా. మనం చేయాల్సిన దేమిటో మీకు తెల్సా?" స్పార్టకస్ మల్లుల నడిగాడు.

వాళ్ళతణ్ణి చూశారు.

"మనం పారిపోగలమా?"

"ఎక్కడికి పారిపోయేది" క్రిక్సస్ అడిగాడు. "ప్రతిచోటా యింతే మనకి. ప్రతి చోటా ఒకడు యజమాని; ఎంతోమంది బానిసలు."

"మన మెక్కడికీ పారిపోం" అని చెప్పాడు స్పార్టకస్. అతనికెప్పుడూ ఏమీ అనుమానం లేనట్లు ప్రతిదీ ఖచ్చితంగా తెలిసినవాడిలా ఖండితంగా చెప్పాడు స్పార్టకస్. "ప్రతితోటకీ, ప్రతియింటికీ పోదాం. అక్కడ బానిసలందరినీ స్వతంత్రులనుచేసి మనలో కలుపుకుందాం. రోమ్ మనమీదికి సైన్యాలను పంపితే వాటితో పోరాడుదాం. ఇకమీద రోమన్ పద్ధతే కావాలో, మన పద్ధతే కావాలో భగవంతుడే నిర్ణయిస్తాడు."

"ఆయుధాలో మరి? అవెక్కడనించి వస్తాయి?" ఎవరో అడిగారు.

"సైనికుల ఆయుధాలే లాక్కుందాం. కావాలంటే వాటిని మనమే తయారు చేదాం. బానిసల రక్తం, చెమట, బాధ తప్ప మరింకేమిటీ రోమ్? మనం చేయలేంది ఏమైనా వుందా?"

"అప్పుడు రోమ్ మనమీద యుద్ధం చేస్తుంది."

"అప్పుడు మనం రోమ్‌తోనే యుద్ధం చేద్దాం!" గాభరా లేకుండా, నెమ్మదిగా, బరువుగా స్పార్టకస్ అన్నాడు. "రోమ్‌ను అంతం చేద్దాం. చేసి మరో ప్రపంచాన్ని సృష్టిద్దాం. ఆ ప్రపంచంలో బానిసలు, యజమానులనే తేడా వుండదు!"

అదొక కల. వాళ్ళలాగే కలగనే స్థితిలోనే వున్నారు. ఆకాశం లోతుల్లోకి వాళ్ళు చొచ్చుకపోయారు. పగిలిన ముక్కూ, నల్లని కళ్ళూగల ఈ

థ్రేషియన్ "మనం దేవతల్తో యుద్ధం చేద్దాం రండి" అని పిలిస్తే ముందూ వెనుకా చూసుకోకుండా, మరో ఆలోచన లేకుండా, వాళ్ళు అతన్ననుసరించుక పోయేవాళ్ళే!

"మనని మనం అగౌరవపర్చుకోకూడదు" ప్రతివాడితోనూ నేరుగా, సూటిగా మాట్లాడుతున్నాడా అన్నట్లు సౌమ్యంగా చెప్తున్నాడు స్పార్టకస్. "రోమన్లు చేసినట్లు చెయ్యొద్దు మనం. రోమన్ న్యాయాన్ని పాటించొద్దు మనం! మన న్యాయశాస్త్రాన్ని మనం తయారుచేద్దాం."

"ఏమిటి మన న్యాయశాస్త్రం?"

"మన ధర్మం సాధారణమైనది. మనలో ఎవరేది వశపర్చుకొన్నా అది అందరికీ చెందిన సమిష్టి ఆస్తి అవుతుంది. ఎవరూ తన బట్టలూ, ఆయుధాలూ తప్ప యికే వేటినీ ఉంచుకోకూడదు. పూర్వం ఎలాగుండేదో అలాగే!"

"అందరం ధనవంతు లవడానికి చాలినంత వుందిగా!" అన్నాడొక థ్రేషియన్.

"అయితే నువ్వే న్యాయసూత్రాలు తయారుచెయ్యి. నే నెందుకు చెయ్యడం?" అన్నాడు స్పార్టకస్.

అలా వాళ్ళు మాట్లాడుకున్నారు. వాళ్ళలోనూ దురాశాపరులున్నారు. రోమన్లు లాగ పెద్దపెద్ద భూస్వాములవాలని ఆశపడ్డవారూ వున్నారు. కొందరు రోమన్లందరినీ బానిసలుగా తయారుచేద్దామన్నారు. వాళ్ళలా మాట్లాడగా మాట్లాడగా, చివరకు స్పార్టకస్ చెప్పినదే ఖాయమైంది.

"భార్యనితప్ప, మరే స్త్రీనీ వుంచుకోగూడదు" స్పార్టకస్ అన్నాడు. "అలాగని ఏ వక్కడికీ ఎంతోమంది భార్య లుండరాదు. ఒక పురుషుని కొక్కర్తే భార్య. భార్యాభర్త లిద్దరూ న్యాయందృష్టిలో సమానులే. వాళ్ళు సౌఖ్యంగా, శాంతి యుతంగా జీవితం గడపలేకపోతే, విడిపోవచ్చు. కాని ఏ మనిషీ రోమను స్త్రీనైనా సరే, మరే స్త్రీనైనా సరే భార్య అయితే తప్ప, తన కామంకోసం ఉపయోగించ కూడదు."

వాళ్ళ న్యాయశాస్త్రం ఎన్నోగ్రంథాల్లో పట్టేటంత పెద్దది గాదు. బహు చిన్నది. దానికెన్నో భాష్యాలు లేవు. దానినందరూ అంగీకరించారు. అప్పుడు వాళ్ళు ఆయుధాలు చేబూని అల్లంతదూరాన కనపడుతున్న భూస్వామి భవంతిపైకి దాడి వెడలేరు. ఆ యింట్లో నివసించే రోమన్లు ఎప్పుడో ప్రాణాలరచేతపట్టి కేపువా చేరేరు. ఆ యింట్లో బానిసలొక్కళ్ళే వున్నారు. ఆ బానిసలు మల్లులతో కలిశారు.

# 11

కేపువా వాసులు మొదటిసారిగా, జమీందారీ భవనం తగలడ్డం చూశారు. వాళ్ళు అపకార బుద్ధిగల క్రూరులు అనుకున్నారు. బానిసలు పెద్దమనుష్యులుగా బుద్ధిగా వుండాలని వారి కోరిక. బానిసలకు ఆచరణయోగ్యమైనదేమంటే—వాళ్ళ దృష్టిలో—కొండల్లోనికి పారిపోయి, వంటరిగానో చిన్న చిన్న గుంపులుగానో ఏ గుహల్లోనో తలదాచుకోవడం మంచిదని. అలాచేయడంవల్ల ఆ బానిసలను, జంతువులను వేటాడి నట్లు సుళువుగా వేటాడిపారెయ్యొచ్చుగా. గృహదహనం ప్రథమ పర్యాయంగా చూసి నపుడే కేపువాపౌరు లాందోళన చెందారు. ఏది కనిపిస్తే దానిని నాశనం చేస్తారని, దేని మీదపడితే దానిమీదే మల్లులు పగతీర్చుక తీరుతారని వాళ్ళకి తెలుసు. తిరుగుబాటు గురించి సెనేటుకు తెలీబరచేందుకై ఏపియన్ మార్గంలో ఒక బండి ఉరకలు, పరుగులు పెడ్తూ హుటాహుటిని పోతూంది. దీని తాత్పర్యమేమిటంటే అనతికాలంలో పరిస్థితి అదుపులోకి వచ్చితీరుతుందని. అప్పుడు బానిసలకు సులభంగా మరుపురాని పాఠాన్ని బోధించాలి.

మేరియస్ ఎకనూస్ అనే పెద్దభూస్వామి విషయాన్ని ముందుగానే తెల్సుకుని, కేపువానగరంలో రక్షణపొందడానికని తన ఏడువందలమంది బానిసలనీ పోగుచేసుకుని తోలుకపోతున్నాడు. దారిలో యితనికి మల్లుల దర్శనమైంది. తన బానిసల చేతిలో తానే భార్యా సమేతంగా మృత్యుసాన్నిధ్యం చేరుకొంటూన్న అతనికేసి ఏమీ మాట్లాడ కుండా చూస్తూ నిలబడ్డారు మల్లులు! అతని కూతురూ, ఆమె భర్త, అతని మరదలు కూడా చంపబడ్డారు. అది ఘోరమైన జుగుప్సాకరమైన విషయమే కావొచ్చు. కాని వాటి నాపడం సాధ్యంకానిపని అని స్పార్టకస్‌కు తెల్సు. ప్రత్యేకించి వాటినాపాలనే తొందరాలేదు అతనిలో. స్వయంగా వాళ్ళ చేతులతో వాళ్ళే చల్లిన విషపువిత్తుల విషమఫలితాన్ని వాళ్ళే అనుభవించారు. వీళ్ళు రోమను సైనికులుకారు. ప్రజలు చెప్పుకుంటున్న తిరుగుబాటుదారులైన మల్లులు వీరే అని తెలిసేసరికి, పల్లకీ మోసే బానిసలే తమ యజమానిని సకుటుంబంగా హతమార్చేశారు. అప్పుడు సాయంత్ర మవుతోంది. కాని కాలంకన్న వేగంగా వార్త వ్యాపించింది. మొదట్లో ఏదోకొద్ది వందలమందిగా వున్నవాళ్ళల్లా యిప్పుడు వెయ్యిమందికిపైగా అయ్యారు. కొండవాలు మీదనుండీ, లోయలలోనుంచీ బానిసలు పరుగు పరుగునవచ్చి వీరితో కలిశారు. తోటలలో, పొలాల్లో పనిచేసేవాళ్లు వాళ్ళపనిముట్లతో సహా వచ్చిచేరారు. పశుల కాపరులు గొర్రెలను, బర్రెలనూ తోలుకొని మందలతో సహా వీళ్ళతోచేరారు. ఆ

జనవాహిని ఒకతీరూ, తెన్నూలేకుండా ఒకయింటివేపువోతే—ఒక్క మల్లులకుతప్ప తక్కినవాళ్ళకి సైనిక క్రమశిక్షణ తెలీదు—వారికన్నాముందే వాళ్ళరాక వార్తవిన్న వంటయిళ్ళలోని బానిసలు చిన్నచిన్న బాకుల్తో, గునపాలతోసహా బైటికివచ్చి వాళ్ళ నాహ్వానించారు. ఇళ్ళల్లోని బానిసలు వాళ్ళకి సిల్కుబట్టలు, నూలుగుడ్డలు అన్నీ పంచి పెట్టేవారు. సాధారణంగా రోమనులు పారిపొయ్యేవారు. కానీ రోమన్లు, మేస్త్రీలు కలబడితేమాత్రం, ఆ ప్రదేశంలో ఏదో గొడవ జరిగినట్లు ఘోరమైన ఆనవాళ్ళు మిగిలిపోయేవి.

వాళ్ళిప్పుడు తొందరగాపోలేరు. నవ్వుతూ, పాడుతూ, కేరింతలు కొట్టేపిల్లల, స్త్రీల, పురుషుల మహాజనసందోహమది. వారందరూ ఒకే విజయోల్లాసాన్ని ఆస్వాదించి వున్నారు. అదే స్వతంత్రాన్ని రుచిచూచి వున్నారు. కేపువాకు యిరవైమైళ్ళ దూరంలో వున్నారు. చీకటిపడింది. గుసగుసలాడే యేటిఒడ్డున, లోయలో పెద్దపెద్ద మంటలువేసుకుని తాజామాంసాన్ని తింటూ విడిదిచేశారు.

గొర్రెల, మేకల, గొడ్లమాంసాన్ని ఉడుకబెట్టిన రుచికరమైన వాసనతో నిండింది గాలి. ఏళ్ళతరబడి వుల్లికాడలూ, వేళ్లూ, దుంపలూ, బార్లీ పులుసూ తిని బతికినవాళ్ళ కిదొక విందు. మాంసాన్ని ద్రాక్షసారాలో ముంచి భోజనాన్ని పాటలతో నవ్వులతో మిళాయించి భుజించారు వాళ్ళు. ఎటువంటి జట్టువాళ్ళది! ఆ జట్టులో గాల్‌లు, యూదులు, యవనులు, యీజిప్షియన్లు, థ్రేషియన్లు, న్యూబియన్లు, సూడానీలు, లిబియన్లు, పర్షియన్లు, అస్సిరియన్లు, సమారియన్లు, జర్మన్లు, స్లావులు, బల్గార్లు మేసిడోనియన్లు, స్పేనియార్డులు, ఏదో ఒక కారణంవల్ల తరతరాలుగా బానిసలుగా అమ్ముడుబోయిన కొంతమంది యిటాలియన్లు, సబయినులు, అంబ్రియన్లు, టుస్కన్లు, సిసిలియన్లు, చరిత్రనుండి, భూగోళంనుండి తుడిచిపెట్టుకపోయిన అనామకులైన ఎన్నో తెగలవాళ్ళున్నారు. ఎన్నోజాతులు, వర్ణాలు కలవాళ్ళైకాని ఆ సమూహం అంతా మొదట బానిసలుగా ఒకే తెగగా, తర్వాత స్వతంత్రులుగా ఒకే తెగగా, యెప్పుడూ ఒకే ఒకతెగగా కలుస్తూవున్నవాళ్ళే!

పూర్వం గణాలకుటుంబాలు, తెగలజాతులు అనేవి వుండేవి. చివరకవి జాతి గర్వకారణంగా విశేషాధికారాన్నిగూడ పొందగలిగేవిగా వుండేవి. కాని ప్రస్తుతం యిక్కడ ప్రపంచానికంతకూ ఆశ్చర్యంకల్గించే అణగారిన ఆర్తులందరి యొక్క విచిత్రమైన సౌహార్దత, సహచర్యము గోచరిస్తున్నవి. ఆరాత్రి ఏ ఒకని గొంతూ కోపాన్నికాని, అసంతృప్తినికాని ధ్వనింపచేయలేదు. కొద్దిపాటి ఔన్నత్యం, కొంత ప్రేమ వారిని స్పృశించేయి. కొందరు స్పార్టకస్‌ను చూడలేదు. అథవా

చూచినా "అడుగో స్పార్టకస్" అని దూరంనించి చూపిస్తే చూసినవాళ్ళే. అయినా, వారందరిలో అంతటా వున్నాడు స్పార్టకస్. వాళ్ళకు అతను నాయకుడు. వాళ్ళ భగవంతుడు. అప్పుడప్పుడు దేవతలు భూమ్మీద సంచరిస్తుంటారని వాళ్ళెరుగుదురు. మరి ప్రొమీథియస్ స్వర్గంలోని పవిత్రాగ్నిని దొంగచాటుగా తీసుకవచ్చి అమూల్యమైన కాన్కగా మానవజాతికి సమర్పించలేదా? ఒకమారు అటువంటిది సాధ్యమైనపుడు మళ్ళీ జరుగకూడదని ఎక్కడుంది. అప్పుడు మంటలచుట్టూరా కూచొని వాళ్ళు ఎన్నో గాథలల్లి చెప్పుకుంటున్నారు. ఇంక స్పార్టకస్‌యుగం ప్రారంభమవుతుంది. పిల్లలతో సహా వాళ్ళల్లో ప్రతిఒకరూ ఎవ్వరూ బానిసలులేని మరో ప్రపంచంగురించి కలలు కంటున్నారు.

పరివేష్టించిన మల్లులమధ్య కూచొని స్పార్టకస్ వాళ్ళతో మాట్లాడుతున్నాడు. వాళ్ళంతా జరుగుతున్న విషయాలనుగురించి ఆలోచిస్తున్నారు. ప్రతి విషయాన్ని తూచి చూస్తున్నారు. అప్పు డా చిన్నఏరు ఒక నదిగా పారుతోంది. ఆ నదికి వరదలు. గేనికస్ అన్నాడు స్పార్టకస్‌ను చూచినపుడల్లా అతనికళ్ళు మెరిసేవి: "మనమీ ప్రపంచమంతటా తిరుగుదాం. దానిని తలక్రిందులా చేదాం. ప్రతిరాయినీ తిరగేసి పారేద్దాం!" ఇదీ అతడన్నది. స్పార్టకస్‌కు మరింత స్పష్టంగాతెలుసు. వరీనియా తొడమీద తలపెట్టుకుపడుకున్నా డతను. అతని గోధుమరంగు వుంగరాలజుట్టులో ఆమె వ్రేళ్ళు స్వేచ్ఛని పొందాయి. లోలోపల ఆమె ఆనందపారవశ్యత పొందింది. ఇప్పు డామె సంతృప్తిచెందింది. కాని అతనిలో నిప్పు రాజుకుంది. ఒక మంటయి మండుతోంది. బానిసత్వంలోనే అతనికేదో విధమైన తృప్తి వుండేది. ఆ ఇటాలియన్ నిశీధిలో ఆకాశంలో తెల్లనిమెరిసేతారకలు అవుపించినయి. అతని మెదడులో భయంకరమైన భావాలు, పరితాపంతో కూడిన ఆపేక్ష మెదిలినయి. అన్నీ భయాలే. అన్నీ సందేహాలే. ఇంక చేయవలసిన దేమిటి అనే ప్రశ్న రాతిలా అతని గుండెలపై బరువుగా కూచొని అతని మెదడుని తడుతోంది. రోమ్‌ను సర్వ నాశనం చేయాలి తను. ఈ ఆలోచనే ఎక్కువగా ఆలోచించడంవల్ల అతనికి నవ్వొచ్చింది. తన భాషలో ఒక పాట పాడుతూ సంతోషంతో అతని పెదాలను స్పర్శిస్తోంది వరీనియా.

అరణ్యమయమైన శీతల ప్రాంతాలలోని ప్రజలు పాడుకునేపాట అది. ఆ పాటను ఆమె పాడుతోంది. పాటవింటూ పాటతోబాటు తనభావాల్ని పునశ్చరణ చేస్తా డతడు. అతని కలలు ఆకసంలోని నక్షత్రాల మధ్య ప్రదేశంలో ప్రక్క పర్చుకుంటాయి.

"నువ్వు రోమ్‌ను సర్వనాశనం చేయాలి స్పార్టకస్! నువ్వు వీళ్ళకి నాయకత్వం వహించి, బలవంతులుగా తయారుచేయాలి. పోరాడడం, చంపడం నేర్పు వీళ్ళకి. వెనుకంజ పనికిరాదు అసలు. ఒక్కడుగేనా వెనక్కి పోబోకు. ఈ ప్రపంచమంతా రోమ్ స్వాధీనంలో వుంది. అందుకే నాశనంచేసి ప్రపంచాని కీ రోమ్ అనేది చెడుకల అనిపించేలా చెయ్యి. రోమ్‌స్థానే మరో జీవితాన్ని పుష్పింపచేదాం. దానిలో ప్రజలకు శాంతి, సోదరత్వం, ప్రేమ వెల్లివిరుస్తాయి. ఒకడు బానిస, వేరొకడు యజమాని అనే తేడావుండదు. మల్లులూ, రంగస్థలాలూ అగుపించవు. పూర్వం లాగనే అదో స్వర్ణయుగం. సౌహార్దత నిండిన నూతన నగర నిర్మాణం చేద్దాం యిక. ఆ నగరాలచుట్టూ రాతిగోడ లుండవు!"

అప్పుడు వరీనియా పాటనాపి అతన్నడిగింది: "స్పార్టకస్! ఏమిటి కలగంటున్నావ్? ఆ నక్షత్రాల్లో మిణుకు మిణుకుమని తొంగిచూసే దేవతలు నీతో మాట్లాడుతున్నారా? ఎవరితోనూ చెప్పగూడని రహస్యాలు నీతో వల్లిస్తున్నారా!" ఆవిడకు దీనిలో కొంత నమ్మకం లేకపోలేదు. ఈ దేవతలగురించి నిజమెంతో, అబద్ధమెంతో ఎవ డెరుగును. స్పార్టకస్ దేవతలను పూజించేవాడుకాడు. అసహ్యించుకొనేవాడు. "బానిసలకు ఓ భగవంతుడంటూ వున్నాడా?" అతనొకసారి ఆమె నడిగాడు.

"నా జీవితమంతటిలో నీతో చెప్పకూడని రహస్యమంటూ ఏమీలేదు నాకు" అత నామెతో అన్నాడు.

"అయితే నీవేం కలగంటున్నావ్."

"మనం సృష్టించబోయే మరో ప్రపంచంగురించి!"

అతను మృదువుగానే చెప్పాడు. కాని ఆమె కెందుకో అతనంటే భయమేసింది. "ఈ ప్రపంచంగూడా మనుష్యులు తయారుచేసిందేగా? దానంతటదే తయారయిందంటావా? వరీనియా, చూడు మనం నిర్మించనిది ఏముంది? ఈ పట్నాలు, గుళ్ళు గోపురాలూ, గోడలూ, ఓడలూ, రోడ్లూ ఏవి మనం నిర్మించలేదు గనుక? అలాంటప్పుడు మరో ప్రపంచ సృష్టిమాత్రం ఏమంత కష్టం?"

"మరి రోమ్?" అందామె. ఆ ఒక్క మాటలో ప్రపంచాన్ని పరిపాలిస్తోన్న శక్తి యిమిడివుంది.

"అప్పుడు మనం రోమ్‌నే సర్వనాశనం చేస్తాం" స్పార్టకస్ అన్నాడు. "ప్రపంచానికి ఈ రోమ్‌తో కడుపు నిండింది చాలు. రోమ్‌ను నాశనం చేయాలి! ఈ రోమ్ నమ్మిన ప్రతిదాన్ని మనం నాశనం చేయాలి."

"ఎవరు? ఎవరు?" ఆమె అడిగింది.

"బానిసలే! పూర్వంకూడా తిరుగుబాట్లుండేవి. కాని యిప్పటిది మరొక విధంగా వుంటుంది. ప్రపంచంలోని బానిసలంతా వినేలా మనమొక పిలుపిద్దాం."

ఆ విధంగా శాంతి! అదేవిధంగా ఆశ! చాలాకాలం గడిచాక తన ప్రియుడు తన ఒడిలో తలపెట్టుక పడుకొని దూరానగల చుక్కల్ని చూసిన దృశ్యం ఆమెకు జ్ఞప్తికి వచ్చేది. అదో ప్రేమపూరితమయిన రాత్రి. ఏ కొద్దిమందికో అటువంటి రాత్రులు లభిస్తాయి. అది వాళ్ళ అదృష్టం. వాళ్ళిద్దరూ ఆ మల్లుల మధ్య, ఆ మంటల మధ్య పడుకుని వున్నారు. అప్పుడు కాలం నెమ్మదిగా గడిచింది. ఒకళ్ళ నొకళ్ళు తాకుతూ 'యిద్దరం వున్నాంగా' అనుకునేవాళ్ళు. వారిద్దరి మనసులూ ఒకటయ్యాయి. ఆ యిద్దరి శరీరాలూ ఆ మనసే!

## అయిదవ భాగం: లెంటులుస్ గ్రాఛూస్ సలేరియా భవనంలో నున్నప్పటి విషయాలు. అతని స్మృతులు, అతని వృత్తాంతం.

శరీరభారం పెరుగుతున్నకొద్దీ, తాడెక్కి మొగ్గవేయగల తన నైపుణ్యం పెరుగుతోందని చెప్పడం లెంటులుస్ గ్రాఛూస్‌కు యెంతో సరదా. దీనికి బలమైన ఆధారం ఉంది కూడా. అతని యాభై ఆరుయేళ్ళ జీవితకాలంలోనూ రాజకీయాలను విజయవంతంగా సాధించడంలో ముప్పైయేడేళ్ళు గడిపేడు. అతనన్న మాటల కాధారంగా యీ ఒక్కమాటే చాలు. అప్పుడప్పుడతనుద్ఘాటించేవాడు రాజకీయాలలో బతకాలంటే చలనంలేని, మార్పులేని మూడే మూడు ఉపాయాలుండాలనీ, తదితర సుగుణ సంపత్తి యేదీ వుండనవసరం లేదనీ. మరే కారణమున్నా, లేకపోయినా యెంతోమంది రాజకీయవేత్తలు సుగుణాలవల్లనే తగులడ్డారని అతని నిశ్చితాభిప్రాయం. ఉండి తీరాలి అని అతను చెప్పే మూడు ఉపాయాలూ యీ విధంగా యెంచి చెప్పేవాడు: మొదటిదేమంటే యెప్పుడూ నెగ్గేపక్షాన్నే యెంచుకోగలగడం. అదీ సాధ్యం కాకపోతే సర్వనాశనం కాక పూర్వమే ఓడిపోయే పక్షాన్ని వదిలిపెట్టగలగడం ద్వితీయ పక్షం. అతను చెప్పే ఆఖరి ఉపాయమేమంటే పై రెండూ చేయకపోతే మానె, ఎవరితోనూ శత్రుత్వం కల్గివుండకపోవడం, ఇవన్నీ అవకాశవాదుల లక్షణాలని యెవరేనా అంటే అది వాళ్ళ ఖర్మ.

ఈ పై మూడూ ఆశయాలు. ఆచరణమటుకు ఆచరణా, ఆశయాలమటుకు ఆశయాలూ ఉండడం మామూలేగా. ఈ ఉపాయాల గతికూడా అల్లాగే తీర్థానికి తీర్థం, ప్రసాదానికి ప్రసాదంలా తయారవడం సహజం. ఈ ఆశయాలను - అస లే ఆశయాలనైనాసరే - నూటికి నూరుపాళ్ళు ఆచరణలో పెట్టడమన్నది అసంభవం. కాని తన మటుకు తాను జాగ్రత్తగానే పని కానిచ్చేవాడు. చెప్పులు కుట్టేవాడి కొడుకుగా జన్మించిన గ్రాఛూస్, కష్టపడి పందొమ్మిదవ యేటనే ఓట్లుకొనడం, అమ్మడం వగైరా చేస్తూ, లంచాలూ గట్రా యిచ్చి ఉద్యోగాలు వేయిస్తూ, ఇరవై అయిదవయేటనే అనవసరమనుకున్నవాళ్ళని త్రోవనుండి తొలగించడానికని అప్పుడప్పుడు చిన్నచిన్న ఖూనీలు చేయిస్తూ, తన యిరవై యెనిమిదవయేటనే మంచి బలమైన రాజకీయ ముఠా నొక

దాన్ని సృష్టించుకొని, ముప్ఫై యెనిమిదేళ్ళు దాటకుండానే ప్రసిద్ధిగాంచిన కేలియన్ వార్డునుంచి పోటీ అనేది లేకుండా యెన్నుకోబడ్డ యేకైక ప్రజానాయకుడయ్యాడు. తదుపరి ఐదు సంవత్సరాలకు మేజస్ట్రీపై నలభై యోపడి ప్రవేశించేసరికి సెనేట్ భవనంలో ప్రవేశించాడు. ఆ నగరంలో పదివేల మందిని పేరు పేరునా పిలిచి, వాళ్ళకే జ్ఞప్తి లేనివాళ్ళ కుటుంబ వ్యవహారాలు, వాళ్ళ తాతముత్తాతల పేర్లు, గోత్రాలతో సహా చెప్పగలిగి, మరో ఇరవైవేల మందితో ఓహో! అంటే ఓహో అనుకునే ముఖపరిచయం కలిగి వుండేవాడు. అతను తన ఉపకారం పొందిన వాళ్ళలిస్టులో తనకు బద్ధవైరులుగా ఉండే శత్రువులను కూడా చేర్చేవాడు. తన సహచరులంతా, శ్రేయోభిలాషుల్లా కనిపించేవాళ్ళంతా నిజాయితీపరులే అనే దురభిప్రాయం మాత్రం అతనికెప్పుడూ కలుగలేదు. అల్లాగని అబ్బాయ్! నువ్వు నిజాయితీలేనివాడవని నాకు తెలుసులే అన్నట్లు ప్రవర్తించి, అవతలవాడు తన భావాన్ని గుర్తించేలా మాత్రం అతనెప్పుడూ ప్రవర్తించలేదు. ఆ అగాధమైన తప్పిదాన్ని తప్పించుకు తిరగగలగడమే అతని ప్రజ్ఞ.

అతని భావమూ, భారమూ సంఘంలో అతని స్థానానికి తగ్గవిగా వుండేవి. తానై యెన్నడూ స్త్రీలను నమ్మలేదు. నమ్మిన తన మిత్రుల కా నమ్మకం యేమీ లాభించలేదన్నది కూడా గుర్తించాడు. అతనికి ఒకే ఒక దురలవాటు వుంది. తిండి; ఇదే అతని దురలవాటు. కార్యసిద్ధికి యే విధమైన లోపమూగాని అతని రాజకీయ జీవితంలో అతనెంతో తిని కొవ్వు మేటలు వేసుకున్నాడు. దాంతో అతని శరీరం అటూ, యిటూ తెగపెరిగి చూడగానే వీడురా నమ్మకస్తుడైన పెద్దమనిషి అనే భావం యితరులలో కలిగితీరుతుంది. టోగా మడతలలోకాని రోడ్డుమీద కనిపించని ఉన్నతవర్గ రోమను వ్యక్తులలాగనే అతను కూడా టోగా ధరిస్తేనేకాని ప్రజల కంట బడేవాడు కాడు, చొక్కా గిక్కా తొడిగితే గ్రాఖూస్ చూసినవాడి నాకర్షించగలిగేవాడు కాడు. టోగా ధరించినప్పుడు మాత్రం రోమను భావమూ, రోమను సుగుణసంపత్తీ మూర్తీభవించిన అవతారంలా కనబడేవాడు. మూడువందల పౌన్ల బరువుగల అతని శరీరము పెద్ద బట్టతలనొకదాన్ని మోస్తోంది. ఆ తలకింద, మెడ దగ్గర కొవ్వెక్కిన కండలు ముడతలుగాపడి పెద్ద చుట్టకుదురు మీద పెట్టిన కుండలా కనిపించేది అతని తల. ఎక్కడినుంచో నాభినుంచీ యెంతో లోతునుంచి వస్తున్నట్లు తోచే బొంగురు గొంతు, అవతల వాడిని వలలో వెయ్యగల చిఱునవ్వు, సంతోషంతో మెఱసే చిన్న నీలంకళ్లూ యిదీ అతని వర్ణన; చంటిపిల్లల శరీరంలా లేతగులాబీరంగుగల శరీరఛాయ కలవాడు.

అందరూ అతనికి మానవవిద్వేషం వుందనుకునేవారు. కాని అతనిలో అంతా అనుకొనేటంతగా ఆ మానవద్వేషంలేదు. రోమన్లే సర్వశక్తివంతులనే సిద్ధాంతం అతనికేం అనూహ్యమైనదీకాదు. అర్థంకాని అత్యద్భుత విశేషమూకాదు. అతి ముఖ్యమైన అంతిమసత్యాన్ని కనుగొనేమిషపై సిసిరో కావించే పర్యాలోచనా పూర్వక ప్రయత్న మాతని కాశ్చర్యం కలిగించింది. సిసిరో గురించి మీ అభిప్రాయమేమిటని ఆంటోనియస్ కైయస్ అడిగినప్పుడు "ఏదో కుర్రకుంక" అని ముక్తసరిగా సమాధానం చెప్పి ఊరుకున్నాడు.

ఆంటోనియస్ కైయస్‌తో అతను చాలా మంచిగా ఉంటూ వచ్చాడు. ఏ కులీనుడితో అయినా అత నా విధంగానే వుంటాడు. అతనికి కులీనులంటే యిష్టం కూడా వుంది. వాళ్ళయందు అసూయ, వాళ్ళంటే కొంత అసహ్యమూ కూడా లేకపోలేదు. తమ వంశమర్యాదనూ, సంఘంలో వున్న ఉన్నత స్థానాన్నీ ఉపయోగించుకుని మరింత ముందుకు పోలేకపోయిన యీ కులీనులను వీళ్ళుట్టి వెర్రివాళ్ళనీ, తెలివితక్కువ వాళ్ళనీ, అతను భావించేవాడు. అందుకే వాళ్ళు నిజంగా గౌరవానికి అర్హులు కారని అతని అభిప్రాయం. అల్లా అని వాళ్ళతోమాత్రం స్నేహం చెయ్యడంలో యేవిధమైన లోపం చేసేవాడుకాదు. సలేరియా భవనానికి తన నాహ్వానించినట్లే, ఈ కులీనులెవరైనా తనను తమ రమణీయమైన తోటల కతని నాహ్వానిస్తే అతనెంతో సంతోషించేవాడు. పెద్ద గొప్పవాడిలా కనిపిద్దామనిగాని, కులీనుడిలా ప్రవర్తిద్దామనిగాని అత నెన్నడూ ప్రయత్నించలేదు. అతని శక్తికి మించినదైనా యెప్పుడూ స్వంతంగా తోటలు కొందామనే ప్రయత్నం కూడా చెయ్యలేదతను. అతనికి ప్రతివిషయంగురించీ యెంతోకొంత తెలుసు. మంచి లౌకికుడు. అతనిలోని యీ విశేషాలనే కులీనులు మెచ్చుకునేవారు. అందుకే ఆంటోనియస్ కైయస్‌కు గ్రాఛూస్ అంటే బాగా యిష్టం. అందుకే నిండుగా నిజాయితీగల మనిషి యెవరు? అన్న ప్రశ్న ఉదయించినపుడు ఆంటోనిస్ కైయస్ పెదిమలపై గ్రాఛూస్ పేరే దొర్లేది.

ఆ సాయంత్రం ఆ భవనంలో జరిగిన విషయాలలో దేనినీ గ్రాఛూస్ గ్రహించకపోలేదు. ప్రతివిషయాన్నీ శాంతంగా పరిశీలించి, తూచి, యిదీ దీని విలువ అని లెక్కగట్టేవాడు కాని దేనిమీదా గొట్టిదాటుగామాత్రం తీర్పు యిచ్చేసేవాడు కాడు. కైయస్ అంటే అతనికి అసహ్యం. ధనవంతుడు క్రాసస్ సేనాని మాత్రం అతనికి గమ్మత్తయినవాడిలా కనిపించాడు. సిసిరో గురించిమాత్రం ఆంటోనియస్ కైయస్‌తో "అతనిలో అన్నీ వున్నాయి. గొప్పతనం తప్ప. తన ఉద్యమానికి లాభం అనితోస్తే తల్లికుత్తుకనైనా ఉత్తరించ వెనుదీయనివాడని నా ఉద్దేశ్యం" అన్నాడు.

"కాని అతని ఉద్యమ పటువంటిదా?"

"సరిగ్గా అటువంటిదే. అందుకే అతను ప్రతిదానిలోనూ విఫలుడవుతాడు కూడా. అతన్ని గురించి యెంత గొప్పవాడౌతాడో యేమిటో అని భయపడనవసరం లేదు. ఎందుకంటే అతనేమంత ప్రశంసించదగ్గ వ్యక్తికాడు కాబట్టి."

పన్నెండేళ్ళ కుర్రాడికి లైంగిక వాంఛలున్నాయనే అనుకుందాం. ఆంటోనియస్‌కుండే వాంఛలు సరిగ్గా ఆ పన్నెండేళ్ళ కుర్రాడి వాంఛలు వంటివే. అటువంటి వాడికి యింత లోతుగా ఆలోచించి యిచ్చిన వ్యాఖ్యానం యేమీ అర్థంకాలేదు. పైగా అతని స్వభావం యే విషయాన్నీ అర్థం చేసుకున్నా లేకపోయినా ఆకాశమంత ఎత్తున ప్రశంసించి పారెయ్యడం. తన పాదాలకింద భూమి యిసుకగా మారి జారిపోతోందన్న విషయాన్ని అంగీకరించడానికి గ్రాఖస్ సంకోచించడు. అతని లోకం భిన్నత్వ స్థితిలోకి దిగజారుతోంది. అతనుకూడా మర్త్యుడే కాని అమరుడుగాడు కదు. అందుకే అతినెమ్మదిగా జరుగుతున్న ఆ దిగజారుడు క్రమాన్ని యితడు పూర్తిగా చూడలేకపోయాడు. అంటే అది తన జీవితకాలంలోనే పూర్తిగా జరిగిపోలేదు. కాని అబ్బే! దిగజారడం లేదే అని తమనుతాము మోసపుచ్చుకునే ఆసక్తి కాని, మోసపుచ్చుకుందుకు ఆతురత కాని అతను చూపించలేదు. జరుగుతున్న దాన్ని గుర్తించక పోలేదు. ఏ ఒక్క పక్షంతోనూ చేతులు కలపకుండా తటస్థంగా వుండి అన్నీ పరిశీలిస్తాడు. అస లతని వంటి వాళ్ళకు పక్షపాతం చూపవలసిన అవుసరమే వుండదు.

ఆనాటి రాత్రి అంతా నిద్రపోతున్నా అతనుమాత్రం మెళుకువగానే వున్నాడు. సాధారణంగా నిద్ర పట్టదతనికి. పట్టినా కాస్తసేపే పడుతుంది. చంద్రకాంతి ఆరవేసినట్లున్న ఆ తోటలలో కాస్సేపు తిరిగివద్దామని బయలుదేరేడు. ఎవరైనా అడిగితే మాత్రం ఆరాత్రి యెవరు యెవరితో కలిసి ఖుషీగా కాలం గడుపుతున్నారో వివరంగా చెప్పగలుగును. అల్లాగని గ్రాఖస్ యితరుల విషయాలు దొంగచాటుగా తెలుసుకునే స్వభావం కలవాడని అంటే అది వాళ్ళ తప్పేకాని యితని తప్పుకాదు. పైగా యితనటువంటి గూఢచారి తత్వాన్ని అసహ్యించుకునేవాడు కూడా. ఇది రోమ్. ఎవరుబడితే వారు, ఎవరితోపడితే వాళ్ళతో యిష్టం వచ్చినట్లు అనుభవించడమేనా అనే ప్రశ్నకు యిక్కడ యేమాత్రం తావులేదు. అదీకాక ఇక్కడ మూర్ఖులు తప్ప మరెవ్వరూ అటువంటి చచ్చు ప్రశ్నలు వెయ్యరు.

అల్లా వెళ్తూ శిలావేదిక మీద కూర్చున్న జూలియాను చూసేడు గ్రాఖస్. ఆమె ఆకృతి విచారాన్నీ, వ్యాకులపాటునూ, భయాన్నీ, తనంటే తనకే వున్న

అసంతృప్తి భావాన్నీ సూచిస్తోంది. వీటిని దగ్గర పెట్టుకుని ఆ వెన్నెట్లో ఆమె కూచుంది. అతనామె కేసి తిరిగేడు.

"ఈ రాత్రికి యిద్దరం తయారయాం. ఎంతో అందమైన రాత్రి. ఏమంటావ్ జూలియా?" అన్నాడు గ్రాఛూస్.

"నీ కందమైనదని తోస్తే అందమైనదే."

"ఏం? నీకు తోచడం లేదా జూలియా" అతను టోగా సరిచేసుకున్నాడు. "నేనిక్కడ కూచోడం నీకిష్టమేనా?"

"దయచేసి కూచో."

కొద్దిసేపు మౌనంగా కూచున్నాడు. వెన్నెల ప్రభావ మతనిలో పడకపోలేదు. గుల్మ వాటికలలోంచి, ఆకుపచ్చని వృక్షసమూహాల మధ్యనుండి తెల్లని సలేరియా భవనం పైకి లేచింది. ఆ చప్టాలు, జలయంత్రాలు, దూరంనుంచి కనిపిస్తున్న ఆ భవన శిల్పవైదిగ్ధ్యమూ, ఆ పొదలూ వాటి మధ్యనున్న చంద్రకాంత శిలావేదికలు, యివన్నీ అతనికి కడుమనోహరంగా కనిపించాయి. "ఎంత సౌందర్యాన్ని రోమ్ తన ఆధీనం చేసుకోగలిగింది!" ఆమెతో అన్నాడతను.

"జూలియా! నాకనిపిస్తుంది దీనితో మనం సంతుష్టిపొంద వచ్చునని."

"అవును అల్లాగే అనిపిస్తుంది."

అతనామె భర్త స్నేహితుడు. అతిథి. "రోమన్ జాతిలో పుట్టడమే విశేషాధికారం కల్గి వుండటమన్న మాట" అత నభిప్రాయపడ్డాడు.

"నాతో వున్నపుడు తప్ప మరెప్పుడూ నువ్వీ అతి సామాన్యమైన విషయాల ప్రసక్తి తేనేతేవు" జూలియా నెమ్మదిగా అంది.

"నిజమే?"

"నిజమే. వరీనియా గురించి నువ్వేమైనా విన్నావేమో చెప్పు."

"వరీనియా?"

"లోపల పదిమాట్లు జపంచేస్తేకాని యే విషయాన్ని నువ్వు పైకి తేల్చవు కాదూ? నామటుకు నేనేమీ తెలివైన దానిలా ప్రవర్తించడానికి ప్రయత్నం చెయ్యను." ఆమె తన చేతి నాతని చేతిలో వుంచింది. "నేనల్లా ప్రవర్తించలేను, వరీనియా అంటే స్పార్టకస్ భార్య."

"భార్యా?"

"అవును. నేనూ ఆమెనుగురించి విన్నాను. నిజం చెప్పాలంటే మీరంతా ఆ

స్పార్టకస్ ముట్టడి గుప్పిటలోపడి గాభరాపడిపోయారు. అంతే. ఆ గొడవతప్ప యింకేదీ మాట్లాడుకోగా వినలేదు.''

''అతను సలేరియా భవనాన్ని వదిలిపెట్టినందుకు యెల్లా కృతజ్ఞత చూపాలో యేం పాడో నాకు తెలియడంలేదు. ఆ శిక్షా చిహ్నాలే మన కృతజ్ఞతా చిహ్నాలని నా అభిప్రాయం. ఆ మార్గంలో యేముందో నేనింకా చూడలేదు. అవి చాలా భయం కరంగా వున్నాయా?''

''భయంకరమా? వాటిని గురించి నేనేమీ పెద్దగా ఆలోచించా ననుకోను. అవి అక్కడున్నాయి, అంతే. మన జీవితాలే చవకై పోయాయి. అటువంటప్పుడు బానిసల జీవితాలో లెక్కా ? ఈ వరీనియాను గురించి అడుగుతావేమిటి?''

''నాకెవరంటే అసూయ వుందో తెలుసుకోదలచాను. ఆమెయందే నా కసూయ.''

''నిజమే? జూలియా! అదో బర్బరజాతికి చెందిన ఆడపిల్ల. బానిస. అల్లాంటి వాళ్ళనో డజను మందిని మార్కెట్టులో కొని నీకు ఊడిగం చెయ్యడంకోసం పంప మంటావా?''

''గ్రాఛూస్! నువ్వెప్పుడూ యే విషయం గురించీ తీవ్రంగా ఆలోచించవు కదూ?''

''తీవ్రంగా ఆలోచించడాని కిందులో యేముంది? ఆమెయం దసూయ యెందుకు?''

''నేనంటే నాకే అసహ్యం కనుక.''

''చంపేవు. ఇది అసలే అర్థంకాదు.'' దూరంనుంచి పడే ఉరుముల్లా మాట్లాడు తున్నాడు గ్రాఛూస్. ''చీదుతూ, ముక్కు గోక్కుంటూ, ఉమ్ముతూ, అసహ్యమైన గోళ్ళతో, వేళ్ళతో, మురికితో, పొక్కులున్న ముఖంతో వుండే ఆమెను నువ్వసలు చూడగలవా అని. అల్లాగే వుంటుంది నీ బానిస మహారాజ్ఞి. అటువంటి దానియం దసూయ యేమిటి?''

''ఆమె అల్లాగే వుంటుందా?''

గ్రాఛూస్ నవ్వేడు. ''ఎవరెరుగుదురు జూలియా? రాజకీయాలు శుద్ధ అబద్ధం. చరిత్ర ఆ అబద్ధాలనే గ్రంథస్తం చేస్తుంది. నువ్వా రోడ్డుమీదకు వెళ్ళి త్రోవ పొడుగునా పడి మూల్గుతున్న శిలువలను చూస్తే నీకే తెలుస్తుంది. స్పార్టకస్ గురించి ఇంకేం లేదు. ఇంతకుమించి యెవరేం చెప్పినా అదంతా స్వకపోల కల్పితమే. నాకు తెలుసు.''

"నేను నా బానిసలను చూస్తుంటాను...."

"వాళ్ళలో నీకు స్పార్టకస్ కనబడ్డేమిటి? ఎల్లా కనిపిస్తాడు? జూలియా! నీ హృదయాన్ని కొరుక్కు తినడం మాను. దాన్నలా వుండనీ. నీకు సలహా యిచ్చే అధికారం నాకియ్యి. ఇతరుల విషయాలలో జోక్యం కలిగించుకుంటున్నానన్న చెడ్డ పేరు నాకు వచ్చినా సరే. ఆ అవసరం నాకేమిటని పదిమందీ అనుకున్నా సరే. కాని నీ బానిసలలో మంచి నక్కలాంటి కుర్రాడ్నొకడ్ని యేరి...."

"గ్రాఛూస్! ఆ గొడవాపుదూ."

"....అతనే స్పార్టకస్ కాగలడు."

ఆమె కొద్దిగా యేడవడం మొదలెట్టింది. తన వర్గపు స్త్రీ లీ విధంగా యేడవడం అతనెప్పుడూ చూడలేదు. అందుకే యిదంతా అతని కసహ్యంగానూ, మూర్ఖంగానూ కనిపించింది. అల్లా అనడం తప్పా అని ఆమె నడిగాడతను. తనన్నదేం నిందాపూర్వకంగా లేదే. ఏం? అల్లా చాలామంది చెయ్యరా? అయినా యేం తప్పుతుందని?

"కాదు నీ తప్పుకాదు గ్రాఛూస్. నాకు కొద్దిమందే స్నేహితులున్నారు. వాళ్ళల్లో నువ్వొకడివి. ఈ తెలివితక్కువ దద్దమ్మతో స్నేహం యేమిటని మానెయ్యకేం?" అని ఆమె కళ్ళు తుడుచుకుని, క్షమాపణ వేడుకొని, అతన్నక్కడ వదలి వెళ్ళింది. "నాకు చాలా బడలికగా వుంది. నా వెనక్కాలే రాకేం బాబూ" అందామె.

## 2

సిసిరోకీ వుంది, గ్రాఛూస్‌కీ వుంది చరిత్ర యందాసక్తి. కాని వీళ్ళిద్దరి మధ్యా ముఖ్యమయిన తేడా వుంది. తన స్థానమేదో, పాత్రయేదో ఎంతవటకో గాభరాపడకుండా, గందరగోళం చెయ్యకుండా తెలుసుకోగలిగేవాడు గ్రాఛూస్. అందుచేతనే సిసిరోకన్న చాలా విషయా లతను స్పష్టంగా వివరంగా చూడగలిగేవాడు. ఆ మృదు మధుర వసంతకాల చంద్రచంద్రికా ధవళకాంతిలో కూర్చుని ఆలోచించసాగేడు. రోమను గృహిణి, పెద్దింటి యిల్లాలు జూలియా యెక్కడ? అనాగరిక, బర్బర బానిస స్త్రీ వరీనియా యెక్కడ? కాని అటువంటి జూలియా ఒకబానిస స్త్రీయందు అసూయ చెందడమేమిటా అని ఆశ్చర్యపోయాడు. ఈ వింత యేమిటా అని అక్కజపడ్డాడు. అసలు జూలియా చెప్పినది నిజమేనా అని ఆలోచించాడు. ఆమె నిజం చెప్పిందనడంలో సందేహం లేదనిపించింది. జూలియా యొక్క అసంతృప్తి, ఆమె విషాదం యీ వరీనియావల్ల బైటపడింది. ఆమెవల్ల జూలియాయొక్క మనోగతభావం

యెందుకు, యెల్లా బైటపడిందో అతనికి తెలియలేదు. తమ అందరి జీవిత సారమూ యేపియన్ మార్గంలోనున్న శిక్షచిహ్నాలలో యిమిడి ఉండలేదు కదా అని ఆశ్చర్య వీణ పలికించాడు. నీతి అన్నది గ్రాఘూస్‌ను బాధించదు; అసలతని జోలికి పోదు. అతనికి అదంటే భయమూ లేదు, భక్తీలేదు. తన రోమను ప్రజల నతడు బాగా యెరుగును. అందుకే రోమను గృహిణుల గురించీ, రోమను కుటుంబాల గురించీ చెప్పుకునే కథలువిని అతను మోసపోలేదు. వాటినత నంగీకరించడు కూడా. కాని యెందుకో కాని జూలియా చెప్పినదతనిలో పనిచేస్తూనే ఉంది. సమాధానం దొరకని ఆ ప్రశ్న అతన్ని వెంటాడుతూనే ఉంది.

అవగాహన తళుక్కున మెఱిసింది. దీనంతటికీ సమాధానం ఆ మెఱుపులో వుంది. అది చూసి యితను భయకంపిత గాత్రుడయాడు. ఆ విధంగా భయంతో కంపించడం అతని కిదే మొదటిసారి. చావు మనిషిని భయంకరంగా భయపెడుతుంది. మెఱుపులా మెఱిసిన ఆ అవగాహన కూడా యితన్నంతగానూ భయపెట్టింది. తమస్సునీ, సర్వనాశనాన్నీ పెంచి పోషించే చావంటే అతను భీతాహం చెందేడు. కొందరు విద్వేషంవల్ల బలపడతారు. విద్వేషంవల్లనే కొన్ని నిశ్చయాలకు రాగలుగుతారు. గ్రాఘూస్ కూడా అంతే. అతన్ని నిలబెడుతూ, బలపరుస్తూ వున్న విద్వేషాన్నీ, తత్సంబంధమైన నిశ్చయాన్నీ ఆ మృత్యువనే సమాధానం ఊపిపారేసింది; పెకలించి పారేసింది. కాలం, చరిత్ర అనేవి రెండూ కలిసి ఒక మహాప్రవాహం అని చెప్పవచ్చు. ఆ సమాధానమే అతని వ్యక్తిగత పతనాన్నీ, సర్వనాశనాన్నీ ఆ మహాప్రవాహంలో కొట్టుకుపోయేలా చేసింది.

ఇదంతా అతను స్పష్టంగా చూసేడు. అతనికిది సుస్పష్టంగా గోచరమయింది. బానిసల యెముకల పునాదులపై లేచి, బానిసల మూపులపై నిర్మించబడ్డ ఒక సంఘం, ఒక సాంఘికశక్తి యిటీవలనే, అధునాతనంగా ప్రపంచంలో అడుగుపెట్టింది. ఆ సంఘం ఉచ్చరించే, ఆలపించే ఒకే ఒక్క స్వరసమ్మేళనం యేది? కొరడా విసిరిన కొసగాలుల సంగీతం, కొరడా దెబ్బల మూర్ఛనల గీతం. జూలియా ఉద్దేశ్య మేమిటి? గ్రాఘూస్ వివాహం చేసుకోలేదు. అతని అవగాహన పురుగై మెదడులో ప్రవేశించి పెళ్ళి చేసుకోకు అని దొలిచింది. కావలసి వచ్చినప్పుడు ఉపయోగించుకొనేందు కతను స్త్రీలను కొన్నాడు. ఉంపుడుకత్తె లున్నారు. అంటోనియస్ కైయస్ కూడా వ్యభిచారిణుల కోసం ఒక భవనం కట్టించాడు. అందరు పెద్దమనుష్యులు లాగనే అతను కూడా ఎంతోమంది స్త్రీలను కొన్నాడు. గుఱ్ఱాలను, కుక్కలను కొన్నట్టె అదికూడా.

ఆ పెద్దమనుష్యుల భార్యల కిదంతా తెలుసు. దీనికి వాళ్ళభ్యంతరం కూడా చెప్పరు. మొగుడు పరాయిస్త్రీతో పోతాడనే బాధకూడా వాళ్ళకి వుండదు. వాళ్ళమటుకు వాళ్ళు మొగబానిసలతో కూడి భర్తలకు చెల్లించవలసినదంతా చెల్లించి, జమా ఖర్చులు లెక్కలు తేల్చి పారేస్తారు యెప్పటికప్పుడు. దీనికేముంది, అవినీతి కిదో ఉదాహరణ మాత్రమే అనుకుందుకు వీలుందా? ప్రపంచాన్నే తల్లకిందులు చేసి పారేసింది. ఒక రాత్రి గడిపేందుకు సలేరియాభవనంలో కూడిన వీళ్ళంతా స్పార్టకస్ అంటే యేకాభి ప్రాయానికి వచ్చారు. ఎందుకు? స్పార్టకస్ వీళ్ళలా లేడు కాబట్టి, వీళ్ళకు భిన్నంగా, విరుద్ధంగా వున్నాడు కాబట్టి, స్పార్టకస్ వీళ్ళ అవినీతిలో భాగస్వామి కాలేదు కనుక, స్పార్టకస్ వీళ్ళ దుశ్చర్యలు, లోపా లోపాలు పంచుకోడు కనుక, వీళ్ళకూ అతనికీ యే విధమైన సామ్యమూ, అణుమాత్రం సారూప్యమూ గోచరించదు కనుక. అసలీ స్పార్టకస్ అనేవాడు యెక్కడనించి, యెల్లా వచ్చాడు? అన్నది సిసిరో యెంత ఆలోచించినా బోధపడలేదు. కాని ఇదంతా గ్రాఛూస్ అర్థం చేసుకోగలడు. గృహం, కుటుంబం, గౌరవం, సుగుణం, మంచిదీ, ఉత్తమమైనది, ఉన్నతమైనది ప్రతీదీ బానిసల సొత్తు. వాళ్ళు దానికి అధినాథులు—వాళ్ళు ఉత్తములు కనుకా, ఉన్నతమైన వాళ్ళుకనుకా యిదంతా వారిసొత్తు కాలేదు—వాళ్ళ యజమానులైన కులీనులీ విషయాలన్నీ నిర్లక్ష్యంతో తృణీకరించి బానిసవద్దకు తోసేసేరు. కనుకనే వాళ్ళు వీటి నన్నిటినీ సంరక్షించవలసి వచ్చింది.

స్పార్టకస్‌కు యే విధంగా అయితే రాబోయే దాని స్వరూపం గోచరమయిందో ఆ స్వరూపం అతనినుండే బయలువెడలింది. ఆ విధంగానే గ్రాఛూస్‌క్కూడా భవిష్యత్తు దర్శన మిచ్చింది. అతని కగుపించిన ఆ రాబోయే విషయం అతన్ని భయపెట్టింది. బాధపెట్టింది. లేచి తన టోగా సర్దుకున్నాడు. బరువైన తన కాళ్ళనూ, శరీరభారాన్నీ యీడ్చుకుంటూ, తన గదివైపు, మంచంవైపు నడిచేడు.

అతనికి సులభంగా నిద్రపట్టలేదు. జూలియా అసూయ, దాని వెనుక నున్న వాంఛ యేమై వుంటుందా అని ఆలోచించసాగేడు. బాలునిలా యేడ్వసాగేడు. ఏడుపు పైకి వినబడకుండా చూసుకుని వెచ్చని కన్నీటి చుక్కలు తుడుచుకున్నాడు. ఒంటరితనపు బాధనుంచి తనను బైట పడవేయగల సహచారిణి దొరకలేదు కదా అని బాధ పడ్డాడు. కుర్రాడిలా, బానిస పిల్ల వరీనియాతో పొందు ననుభవిస్తున్నట్లు కలలు కన్నాడు. దుఃఖ సూచకమైన అతని వాంఛకు భయం బలాన్నిచ్చింది. చేయూత నిచ్చింది. ఆ మంచం మీద అతని లావాటి ఉంగరాల చేతులు మేరుపర్వతంలా పడి వున్న ఒక భూతాన్ని తట్టింది. తట్టి జోకొట్టింది. గంటలు చీకట్లో పరు

గెత్తేయి. ఇంకా అతను తన ఆలోచనల ప్రవాహంలో నిస్సహాయుడై కొట్టు కుంటున్నాడు.

స్పార్టకస్‌ను అంతా అసహ్యించుకున్నారు. ఆ హాలులో స్పార్టకస్, ఎటు చూచినా స్పార్టకస్. ఆ హాలంతా ఆక్రమించాడు స్పార్టకస్. ఏ ఒకడికీ అతని స్వరూపం, స్వభావం, తీరుతెన్నులూ-యివేవీ రవంతైనా తెలియవు. కాని ఆ హాలులో అతను సాక్షాత్కరించాడు. రోమ్ అంతటా తనే అయి సాక్షాత్కరించాడు. గ్రాఖూస్ అని పిలవబడుతున్న తను స్పార్టకస్‌ను అసహ్యించుకోడం లేదన్నది సర్వాబద్ధం. కల్పితం. తద్వ్యతిరేకమైనదే నిజం. అతి జాగ్రతగా అతనిలో మరుగుచేయబడుతున్న ద్వేషం యితరుల ద్వేషంకన్న, యెంతో ఉధృతమైనది. ఎంతో తీవ్రమైనది. ఎంతో తీక్షణమైనది.

స్మృతులతో, ఆలోచనలతో, జ్ఞాపకాలతో అతను పోరాడినకొద్దీ వాటికి రూపం, రంగు, వాస్తవికత లభించాయి. సెనేట్‌లో అతనెల్లా కూచున్నదీ జ్ఞాపకమొచ్చింది. అప్పుడు పెద్దమనుష్యులమధ్య తను కూచున్నానుకదా అని గర్వితుడయాడు. కాని ఆ గర్వం రాకూడనిదని అతనెరుగును. ఆ గర్వాన్ని అసహ్యించుకుంటూనే, అణుచు కుంటూనే అతనా సెనేట్‌లో కూచునేవాడు. అప్పుడు కేపువానుంచి కొంప మునిగినట్లు తొందరగా ఒక వార్త వచ్చిపడింది. ఏమిటా వార్త? లెంటులస్ బేటియాటస్ యొక్క శిక్షణ కేంద్రంలోని మల్లులు తిరుగుబాటు చేశారట. ఆ తిరుగుబాటు పల్లె ప్రాంతాల లోకి కూడా వ్యాపిస్తోందట. సెనేట్‌లో కెరటాలుగా భయం వ్యాపించి ప్రతివాడినీ ఆ భయసముద్రంలో ముంచెత్తిన సంగతి అతనికి జ్ఞాపకముంది. వాళ్ళంతా బాతుల గుంపులా ఒకచోట గుమిగూడి యెల్లా కేకలేసేరో, అంతా ఒకేమాట మాట్లాడ్డం మొద లెట్టేరో, భయావిర్భావ దీనాత్ములై వాళ్ళంతా యెల్లా ఆందోళనచెంది మాట్లాడడం ప్రారంభించారో, ఏదో వేళ్ళమీద లెక్కపెట్ట గలిగినంతమంది మల్లులు తిరుగబడి కొద్ది మంది శిక్షకులను హతమార్చినంత మాత్రానే వాళ్ళెంత భీతాహం చెందేరో అన్నీ అతనికి కళ్ళకు కట్టినట్లు జ్ఞాపకమున్నాయి. తన అలవాటు ప్రకారం టోగా సవిరించు కుని ఒక్కఊపుతో వల్లెవాటు వేసుకుని మహనీయులైన తన సహచరులవైపెల్లా ఉరిమేడో అంతా జ్ఞాపకమొచ్చింది.

"మహాశయులారా! మహాశయులారా! మిమ్మల్ని మీరు మరచిపోతున్నారు!"

మతిపోయిన వాళ్ళల్లా కేకలు వేస్తున్న వాళ్ళంతా కేకలెయ్యడం మాని అతని వైపు తిరిగేరు. "మహాశయులారా! ఏ కొద్దిమంది బానిసలనేరమో మనముందుంది. మన నెదుర్కొంది. అంతేకాని మన నెదుర్కొన్నవి బర్బరుల దండయాత్రలేవీ కావు.

అటువంటి పరిస్థితులలోనయినా సరే మహాశయులారా! సెనేట్ మరోవిధంగా ప్రవర్తించి వుండాల్సిందటా నేను. మననుంచి ఒక విధమైన అంతస్తు, హోదా వాంఛించబడ్డాయనుకుంటాను నేను.''

దాంతో వాళ్ళకి కోపం వచ్చింది. మరి తనకో? తనకూ వాళ్ళమీద కోపం వచ్చింది. పట్టుతప్పేటంతటి కోపం తెచ్చుకోకపోవడమనేదో గర్వకారణం అనుకునే వాడతను. కాని యీ రోజున అతనికి విపరీతమైన కోపం వచ్చింది. తన మనస్సు తన అధీనంలో లేకుండాపోయింది. తక్కువ జాతిలో సామాన్యమైన పుట్టుకపుట్టిన తను, యెంతో మహనీయులైన వ్యక్తులను నిందించాడు. తక్కువగా చూసేడు. ''చావండి మీరంతా!'' అతనిలో అతనే అనుకుని గర్వంతో యెత్తెత్తి అడుగులేసుకుంటూ ఆ హాలులోంచి వెళ్ళిపోయాడు. పవిత్ర స్వీయ గౌరవ రక్షణగురించి వాళ్ళనుకునే మాటలతని చెవిలో గింగురుపెడుతూనే వున్నాయి. పెట్టనీ, అతనుమాత్రం యింటికి పోయాడు.

అతని స్మృతిపథంలో పూర్వపుటాలోచనల ఆకాశంలో ఆ దినం మెఱుస్తూ యితనితో బాటే జీవిస్తోంది. ఆ రోజులోని ప్రతినిముషం అతనితోబాటే జీవిస్తోంది. మొదట్లో అతను గాభరాపడిపోయాడు. భయపడిపోయాడు. ఏమిటి? తను లెంటులుస్ గ్రాఘాస్? స్వయంనిర్ణయమైన పవిత్ర ప్రవర్తనా నియమాల నుల్లంఘించాడు. అంతే కాక, అందరి ముందూ కోపంతో ఒణికేడు. ఆవేశానికి కళ్ళెంవేయలేక అది యీడ్చుకు పోయినట్లల్లాపోయాడు. రోమ్ అంటే తనకెంతో యిష్టం. రోమ్ తనెంతో ప్రేమించిన రోమ్. ఆ రోమ్ వీధులలో సందులలో తిరిగేస్తున్నాడు. తను చేసినపని యే విధంగా పరిణమిస్తుందో తత్ఫలిత మెల్లా వుంటుందో అనే భయసందేహాలను వెన్నంటి పోతున్నాడతను. భయసందేహా లతన్ని దగ్గఱ వుండి తీసుకుపోతున్నాయి. ఆ భయం తోనే, ఆ భయంలోనే తన సహచరుల నసహ్యించుకున్నాడు. తనను తానే అసహ్యించు కున్నాడు. అంత భయమూ, అంత అసహ్యముకూడా సెనేట్‌యం దతనికున్న గౌర వాన్ని భక్తిని తొలగించలేకపోయాయి; మఱుగుపరచలేకపోయాయి. అతనికి సెనేట్ సభ్యులయందున్న గౌరవాన్ని పోద్రోలలేకపోయాయి.

రోమ్ నగరపు శబ్దాన్నీ, అది వెదజల్లే వివిధ రకాల వాసనలను, అతని జ్ఞానేంద్రియాలు ఆహ్వానించడం మానేసేయి. పట్నం కని, పెంచి, పోషిస్తే దాని కలవాటుపడి బ్రతుకుతున్నాడు గ్రాఘాస్. అది అతని శరీరంలో మనస్సులో భాగమై పోయింది. అతను కూడా దానితో ఒక భావమై పోయాడు. ఈ బూటకపు లేళ్ళూ, సెలయేళ్ళూ, పచ్చని పసరిక బయళ్ళూ, లోయలూ,

తరు లత గుల్మవాటికలూ యివన్నీ అంటే అతనికి ప్రశస్తమైన ద్వేషం వుంది. మెలికలు తిరిగే రోమన్ సందుగొందులలో మురికికాలువల ప్రక్కనడుస్తూ, పరిగెడుతూ, ఎవరితోనో దెబ్బలాడుతూ వుండే అలవాటు కలవాడతను. అది అతని విద్య. చిన్నప్పుడు, అంతులేని అద్దెకొంపల కప్పులమీద మేకపిల్లలా ప్రాకుతూ పోయేవాడు. పట్నమంతటా వ్యాపించిన, క్రమ్ముకున్న బొగ్గుపొగకంపు అతనికి ప్రియమైన సుగంధం. ఈ ఒక్క ప్రదేశమే మానవ విద్వేషాన్ని, నిరాశావాదాన్ని జొరనీయనిది. ప్రపంచంలోని వివిధ వస్తుసంపదను అమ్మజూపే అంగళ్ళమధ్య, సరకులతో నిండిన తోపుడుబళ్ళ మధ్య, ఆ సన్నని వీధులలో యెంత తిరిగినా తిరగాలనే అనిపించేది — నగరంలోని సగంమంది గ్రాఘూస్ నెరుగుదురు. "ఓహో! గ్రాఘూస్‌గారూ! ఏమండోయ్ గ్రాఘూస్‌గారూ! గ్రాఘూస్! గ్రాఘూస్!" ఇల్లాగే యెక్కడపడితే అక్కడ యెంతోమంది అతన్ని పిలిచేవారు. సాధారణంగా యీ పిలవడంలో పెద్ద తంతుండేదికాదు. కొట్లవాళ్ళూ, జోళ్ళవాళ్ళూ, అడుక్కునేవాళ్ళూ యెందుకూ కొఱగాకుండా తిరిగేవాళ్ళూ, బళ్ళవాళ్ళూ, మేస్త్రీలూ, వడ్రంగులూ ఒకళ్ళేమిటి అంతా అతన్నెరుగుదురు. 'గారూ' 'అండీ' మొదలైనవి లేకుండా అతన్ని పిలిచేసేవారు. ఒకప్పుడు వాళ్ళందరిమధ్యా బ్రతికి పెద్దవాడయినవాడు కాబట్టి అతనికంత పేరు. అందరికీ అతనంటే యిష్టమే. ఇందుకు వేరే కారణాలు కూడా కొన్ని వున్నాయి. ఓట్లు కొనేప్పుడు యితను తక్కిన వాళ్ళందరికన్న హెచ్చుధర పెట్టేవాడు. పైగా పెద్దవాడిననే డాబులేదతనికి. తను నీచంగా బ్రతికినప్పుడు తన నెరిగినవాళ్ళను సైతం ఆప్యాయంగా పలకరించి మాట్లాడేవాడు. ఇప్పుడు తనకు సంఘంలో ఉన్నతస్థానమే వుంది. మంచి హోదా వుంది. కాని అతనెప్పుడూ గర్వం ప్రదర్శించలేదు. పల్లకీలో తిరగడానికి తగ్గ హోదా అవకాశం వున్నా, తన ప్రజలమధ్య కాలినడకనే తిరిగేవాడు. ఆవిధంగా తనకు ప్రజానీకంతో వున్న పరిచయాన్ని వృద్ధిచేసుకునేవాడు. ఇతనిలోని యీ గుణవిశేషాలుచూచి ప్రజ లితనంటే మరింత యిష్టం చూపించేవారు. అన్నిపనులూ చేయడానికి చవకగా కొన్న బానిసల్నుపయోగించారు. ఒకమారు కొన్నాక యేపని చేయించినా, యెంతపని యెంతసేపు చేయించినా బానిసకు కూలి యివ్వనవసరంలేదు. ఒకమాటు కొనుక్కుంటే చాలు, అతనిచేత యెంత వెట్టిచాకిరియైనా చేయించవచ్చు. కాని రోమను పనివాళ్ళ సంగతి అదికాదు. వాళ్ళ కెప్పటికప్పుడు పనిచేసాక డబ్బు చెల్లించాలి. అందుకు అధికంగా డబ్బు ఖర్చవుతోందని తెలుసుకున్న రోమన్ ధనాధిపతులు క్రమేపీ బానిసల చేతనే సమస్తమైన పనులూ చేయించడం ప్రారంభించారు. ఆవిధంగా శ్రామికరంగంలో ప్రవేశించిన బానిసలు రోమన్ పనివాళ్ళకు పనులులేకుండా చేసేరు. రోమన్ శ్రామికులు

నిరుద్యోగులై యెందుకూ కొఱగానివారిగా యాచకులుగా తయారయారు. నిరాశ్రయులై, నిరాశతో దుర్భర జీవిత పరిస్థితులకు తలఒగ్గి సతమతమవుతున్నారు. ఇతను వాళ్ళ నా దౌర్భాగ్యాన్నుండి కాపాడగల నివారణోపాయం సూచించలేక పోయినా, వీళ్ళ తరపున సెనేట్‌లో వాదించకపోయినా వాళ్ళితనియందు చూపే గౌరవంలో యే విధ మైన లోపమూ రానివ్వలేదు. తన్నివారణోపాయ మొకటి వున్నదనే వాళ్ళెప్పుడూ అనుకోలేదు. అతను వాళ్ళనీ, వాళ్ళ ప్రపంచాన్నీ ప్రేమించాడు. ఆ నిరాశా తమస్సులో, అంతస్తులపై అంతస్తులుగా లేచిన అద్దె కొంపలు, శిధిలావస్థలోనున్న ఆ అద్దె కొంపలను పడకుండా నిలబెట్టిన చోట్లు, ఆ సన్నని గొందులు, పట్నంలోని గొడవ, గొడవతో నిండిన వీధులు, చెత్తా చెదారం నిండిన కూలిపేటలు, యిన్ని లోపాలుండి కూడా ప్రపంచ మహానగరాలలో ప్రథమ శ్రేణికి చెందిన రోమ్; వీటి నన్నిటినీ ప్రేమించాడు గ్రాఛూస్.

కాని అతనికంత స్పష్టంగా జ్ఞాపకమున్న ఆ రోజున మాత్రం యివేవీ అతని కంట బడలేదు. వీటి నతను చూడనేలేదు. దణ్ణం పెట్టినవారికేసి చూడకుండా, పలక రించినవారిని వినిపించుకోకుండా, వీధులలో నడిచిపోతున్నాడు. అతనా కొట్లలో ఏమీ కొనలేదు. ఎంతో రుచికరమైన వంటకాలను తోపుడు బళ్ళల్లో పెట్టి అమ్ముతారు. మిఠాయిలేవీ అతను కొననేలేదు. ఎప్పుడీ రోడ్డుమీద అతను తిరిగినా యీ మిఠాయిలను కొనకుండా ఉండేవాడుకాడు. కాని ఆ రోజున మాత్రం వీటికేసి చూడలేదు. ఇవేవీ అతని దృష్టి నాకర్షించలేకపోయాయి. ఎంతో వ్యథలో మునిగి యీదుతూ యింటికి చేరేడు.

నదీ సైకతస్థలాలో, వనాంతర్భాగాలలో, తరులత గుల్మావృతమైన ప్రదేశా లలో యీ మధ్య యెంతోమంది అందమయిన పెద్దపెద్ద భవనాలు నిర్మించుకుంటు న్నారు; కొంటున్నారు. క్రాసస్ అంత ధనవంతుడే అయినా గ్రాఛూస్ మాత్రం యిటు వంటిదేమీ చెయ్యలేదు. అస లా ఆలోచనే లేదు. అత నే వార్డు నుంచి ఎన్నుకో బడ్డాడో ఆ వార్డులో ఒక అద్దె కొంపలో, క్రింద అంతస్తులో కాపురముంటున్నాడు. అతన్ని చూడ్డానికి వచ్చిన వాళ్ళకోసం తలుపులెప్పుడు తెరుచుకునే ఉండేవి. బాగా జరుగుబాటున్న కుటుంబా లా కాలంలో కింద అంతస్తులలోనే కాపరం చెసేవారు. రోమన్ అద్దెకొంపలు కూడా ఒక నిష్పత్తి వేస్తాయి. కదిలే క్రమెక్కెక్కుకుంటూ పోయి, యెంత యెత్తుగా నివసిస్తే అద్దె అంత తక్కువ. ఇది విలోమనిష్పత్తి. అంత స్తులు కిందైన కొద్దీ అద్దె పైకి పెరుగుతుంది. సాధారణంగా కింది రెండంతస్తులలోనే నీటివసతి, స్నానాలగదుల సదుపాయాలు అన్నీ ఉండేవి. పైకి పోయిన కొద్దీ సదు

పాయాల, సౌకర్యముల సంఖ్య కిందికి దిగుతుంది. పూర్వపు ఆదిమ కమ్యూనిస్టు సమాజప్రభావ మెట్టిదో కాని ధనవంతులకూ, బీదలకూ అట్టే విభేదం ఉన్నట్లు యీ రెంటిమధ్య కంచుగోడలున్నట్లు కనిపించడంలేదు. ఎంతగా ఆలోచించినా కూడా కన బడనట్లుంది. అందుకే ఈ ధనవంతుల నెత్తిమీద ఆరేడంతస్తులవఱకు పేదరికం గుట్టలుగా పడిఉండేది.

ఎవరినీ పలకరించకుండా, ఎవరికీ దణ్ణం పెట్టకుండా, తిరిగి తిరిగి అతను యింటికి చేరుకున్నాడు. ' ఆఫీసుగదిలో అడుగుపెడుతూనే ఎప్పుడూ లేనిది, బానిస లందరినీ యింట్లోంచి బయటకు పొమ్మన్నాడు. వాళ్ళముఖం తనకు కనబడనియ్యద్దని కేకలేసేడు. ఇదంతా అతనికి జ్ఞాపకం ఉంది. అతని బానిసలంతా స్త్రీలే. మరో మొగాడు తన యింట్లో ఉండడం అతనికి యిష్టంలేదు. అల్లాగని కొంతమందిలా అతను యింటినిండా ఆడమూకని చేర్చలేదు. మోతాదుగానే ఉంచుకున్నాడు. అతని అవసరా లన్నీ తీర్చడానికని పధ్నాలుగురు స్త్రీల నతడు ఉంచుకున్నాడు. అంతేకాని కొందరు బ్రహ్మచారులలాగా బానిసస్త్రీల జనానా ఒకటి తయారుచెయ్యలేదు. ఆ పధ్నాలుగురి లోనూ ఆనాటికి తనకు నచ్చిన బానిస స్త్రీనే తన వాంఛలకు ఉపయోగించుకునేవాడు. ఇంట్లో యేవిధమైన గొడవా జరగడం గ్రాఘూస్‌కు యిష్టంలేదు. బానిసస్త్రీ గర్భం దాల్చడం అతనికి అయిష్టం, అతని కనవసరం. అందుకే బానిసస్త్రీ అయినా కర్మం చాలక గర్భంధరిస్తే అతనాస్త్రీని యే భూస్వామికో అమ్మేసి ఆ గొడవకో తిలాంజలి సమర్పించేవాడు. దానికో కారణం చెప్పలేడుకాని పల్లెప్రాంతాలలో పెరిగిన పిల్లలే బాగుంటారనీ, తను చేసేదానిలో అవినీతీ, కాఠిన్యమూ యేమీలేదనీ అతని అభి ప్రాయం.

ఆ పధ్నాలుగుమందిలోనూ అతని కే ఒక్కరియందూ యెక్కువ మక్కువ లేనేలేదు. తాత్కాలికమైన కామప్రకోపనంవల్ల స్త్రీతో సంపర్కం పెట్టుకునేవాడేకాని మరేవిధంగానూ స్త్రీతో అతనికి సంబంధం లేదు. చాలామంది గృహాలకన్న తనయిల్లే సజావుగా శాంతియుతంగా గొడవలులేకుండా ఉందని అతనంటాడు. సలేరియా భవ నంలో ఒకగదిలో పడుకుని ఆనాటి సంఘటనలు నెమరువేస్తున్న గ్రాఘూస్‌కి తన యింట్లో కూడా తనకానాడు మనశ్శాంతి లభించలేదని జ్ఞప్తికొచ్చింది. ఏదో ఒక నీతి సూత్రం అతన్ని ఆవహించింది. తను జీవించే పద్ధతి, పరిస్థితి తనకే చిరాకు పుట్టి స్తున్నాయేమిటి అనుకున్నాడు. ఆనాటి సంఘటనల నతడు వెన్నంటి పోతున్నాడు. దూరంగా నిలబడి తనను తాను చూసుకున్నాడు. ఏ సామాన్లూ లేవు. ఏ ఆడంబరం లేదు. అటువంటిగదిలో — అది అతని ఆఫీసు గది — టోగా ధరించి పెద్ద కావ్వు

కొండ, మాంసపుముద్ద కూచుని ఉంది. తను, తనకీ ఆ విధంగా కనిపించాడు: అని పించాడు; ఎవరూ పిలవకుండా, మరో గొడవేం లేకుండా ఒంటరిగా అతనావిధంగా ఆ గదిలో ఒక అరగంటసేపు కూచున్నాడు. అప్పుడెవరో తలుపుతట్టిన శబ్దం విన వచ్చింది.

"ఎవరది?" అతనడిగాడు.

"మీ కోసం కొందరు పెద్దబాబు లొచ్చేరు," బానిస సమాధానం.

"నా కెవరినీ చూడాలని లేదు." ఎంత క్రూరతరహాగా తయారయాడు తను!

"పెద్దబాబులండి. సెనేటు బాబులు."

అయితే వాళ్ళొచ్చారన్నమాట. తను వాళ్ళనుంచి యింకా విడిపోలేదన్నమాట. తనను వాళ్ళప్పుడే మరచిపోలేదన్నమాట. నిర్లక్ష్యం చెయ్యలేదు. అత నెందుకల్లా అనుకోవలసి వచ్చిందో? రారుమరీ, తన దగ్గరకు వచ్చి తీరుతారు! పునర్జన్మ లభించిన వాడిలా, చచ్చిబ్రతికిన వాడిలా భావించుకున్నాడు. 'అహం' తిరిగి అతనిమీద వాలింది. లేచివెళ్ళి తలుపు తెరిచాడు. నవ్వుతూ, నమ్మకంగా, సమర్థుడిలా కనిపించే ఎప్పటి గ్రాఛూసే.

"మహాశయులారా! మహాశయులారా! సుస్వాగతం." సెనేట్ సభ్యులతో పార్లమెంటు భాషే మాట్లాడాలి మరి.

కమిటీలో ఐదుగురు సభ్యులున్నారు. అందులో యిద్దరు గౌరవనీయులైన సలహా దారులే. మిగతా ముగ్గురూ మంచి హోదాలోనున్న వ్యక్తులు. ఉన్నత కుటుంబాలకు చెందినవాళ్ళు. ప్రస్తుత, విపరీత, విపత్కర, అత్యవసర పరిస్థితులెలా ఉన్నా, యీ గ్రాఛూస్ యే రాజకీయ విభేదాలు తెచ్చిపెట్టి, మరో ముఠాను తయారుచేసి, గొడవ లేవతీస్తాడో అనే భయంచేత, ఆ విభేదాలను పూడ్చిపెట్టి, అతనితో సమాధానం కుదుర్చుకుందు కా కమిటీయే అతనివద్దకు కదిలివచ్చింది. ఉన్న పరిచయంకొద్దీ కొద్ది కొద్దిగా మందలించారు: అదైనా స్నేహపూర్వకంగానే. మనలో మనకేమిటయ్యా అన్నట్లే, కొద్దిగా బుకాయించారు కూడా.

"ఏం? గ్రాఛూస్! ఎప్పుడో ఒకప్పుడు మమ్మల్ని విమర్శించే అవకాశంకోసమే సంవత్సరం పొడుగునీ అల్లా కాచుక్కూర్చుంటా వేమిటి?"

"మిమ్మల్నెలా క్షమాపణ వేడుకోవాలో తెలియడంలేదు. ఆ తెలివీ లేక పోతోంది" అన్నాడు క్షమాపూర్వకంగా.

"నీకు రెండూ తెలుసు. అసలు విషయం అదికాదు."

గ్రాఘూస్ కుర్చీలు తెప్పించి వేయించాడు; సంఘంలో మంచిస్థానం, హోదా గల యీ ఉన్నతవంశపు వ్యక్తులయిదుగురు, రోమను పరిపాలనా చిహ్నమైన టోగాలు ధరించిన యీ అయిదుగురూ అతనిచుట్టూ కుర్చీలలో కూచున్నారు. ద్రాక్షసారాయమూ, మిఠాయిలూ అతను తెప్పించాడు. సలహాదారుడు కాస్సియస్ యెక్కువగా మాట్లాడుతున్నాడు. అతను గ్రాఘూస్‌ను తెగపొగిడేడు. దాంతో గ్రాఘూస్ తబ్బిబ్బయాడు. ఇటువంటి కలతలు యెప్పటికీ జ్ఞాపకముండిపోతాయి. తా నట్టివాటికి పూర్వమెన్నడూ కారకుడు కాలేదు. సలహాదారుడవాలనే వాంఛ అతనికుండేది. ఆ పదవి సంపాదిద్దామని కలగనేవాడు. కాని అది అతనికి అందుబాటులో లేదనే చెప్పాలి. అందుకు కావలసిన చాకచక్యమూ అతనిలో లేదు. అవన్నీ ఉన్నా లేకపోయినాపోయె, ఉన్నత కుటుంబాలతో సంబంధాలు లేవు. వాళ్ళేం చెప్పబోతారో ఊహించడానికి ప్రయత్నించాడు. ఏదో కొంతవరకు బోధపడిందనుకున్నాడు. వాళ్లు చెప్పేది స్పెయిన్‌లో మున్ను జరిగిన ఒక విషయం గురించి. ఆ దేశంలోనే యీ సెనేట్‌కు వ్యతిరేకంగా—సెనేట్ అంటేనే రోమ్—సెర్టోరియస్ అనేవాడి నాయకత్వాన పెద్ద తిరుగుబాటు లేచింది. చివరి కా తిరుగుబాటు సెర్టోరియస్, పాంపీల మధ్య అధికారంకోసం పెనుగులాటగా మారింది. వాళ్ళిద్దరిని యిత నసహ్యించుకున్నాడు. వా ళ్ళిద్దరూ ఒకరినొకరు నాశనం చేసుకోగా చూడాలని ఉవ్విళ్ళూరేడు. తన ఎదురుగా కూచున్న యీ ఐదుగురు పెద్దమనుష్యులుకూడా అల్లాగే అనుకున్నారు.

"చూసేరూ, యీ కేపువాలోని తిరుగుబాటు కూడా—ప్రస్తుతం రాబోయే బ్రహ్మాండమైన అపాయాన్ని సూచిస్తోంది" కాస్సియస్ అన్నాడు.

"నా కల్లా అనిపించడంలేదు" గ్రాఘూస్ తెగేసి చెప్పేడు.

"అంటే యీ బానిస విప్లవాలవల్ల వాటిల్లిన నష్టాలను దృష్టిలో ఉంచుకునేనా...."

"మీ కీ తిరుగుబాటు గురించి తెలిసిన దేమిటి?" ఇంతకుముందుకన్న మెత్తపడ్డాడు గ్రాఘూస్. "ఎంతమంది బానిసలు తిరగబడ్డారు? వాళ్ళంతా యెక్కడికి పారిపోయారు? మీ బాధ నిజమైనదేనా, లేక అదుగో పులి అంటే యిదుగో తోక అని బెంబేలుపడుతున్నారా?"

ఒక్కొక్క ప్రశ్నకే కాస్సియస్ సమాధాన మిచ్చాడు. "ఎప్పటికప్పుడు మనకు వార్తలు చేరుతునే ఉన్నాయి. వార్తా సౌకర్యాలు మాత్రం చెడలేదు. మొదట మల్లులొక్కళ్ళే ప్రారంభించారు. ఒక రిపోర్టు ప్రకారం డెబ్భైమంది పారిపోయారు. ఆ తరువాత పారిపోయిన మల్లుల సంఖ్య రెండువందలనీ, వాళ్ళలో గాల్, థ్రేషియన్

జాతులవాళ్ళూ హెచ్చుమంది ఆఫ్రికన్లూ ఉన్నారనీ తెలిసింది. ఆ తరువాత వార్తల ప్రకారం చూస్తే తిరుగుబాటుదార్ల సంఖ్య పెరుగుతున్నట్లు తెలుస్తోంది. మార్కెట్లో కూడా కొంత గలాటా జరిగినట్లుంది. వాళ్ళెంతో నష్టం కలిగించినట్లు కూడా తెలుస్తోంది. కాని పూర్తివివరా లింతవరకూ చేరలేదు. వాళ్ళెక్కడకు పారిపోయారని కదూ మీరడుగుత? వెసూవియస్ పర్వతంవైపు పోయినట్లు కనిపిస్తోంది.''

"ఈ కనిపించడమేనా యింకా యేమైనా ఉందా?'' గ్రాఘూస్ సహనం కోల్పోయి ప్రశ్నించాడు. "గుమ్మంలో జరుగుతున్నదేదో తెలుసుకోలేకపోవడానికి కేపువా వాళ్ళంత వెర్రివెధవలా? అక్కడో సైనికదుర్గముందిగా, వాళ్ళీ గొడవలను వెంటనే ఎందుకు అణచిపారెయ్యలేదు?''

కాస్సియస్ అతనివైపు ప్రశాంతంగా చూసి, "ఒక్కదళమేగా కేపువాలో నున్నది'' అన్నాడు.

"ఒక్క దళం! కొద్దిమంది వస్తాదు వెధవల్ని తన్ని తగిలెయ్యడానికి మహా సైన్యాలు కావాలాయేం?''

"కేపువాలో ఏం జరిగిందో మీకెంత తెలుసో నాకూ అంతే తెలుసు.''

"నాకు తెలియకపోవచ్చుకాని ఊహించగలను. నాకు తెలిసినంత మటుకు అక్కడి దళాధిపతి ప్రతి వర్తకుడివద్దా లంచాలు పుచ్చుకుని వాళ్ళ పని చూసిపెట్టే రకం. వర్తకులందరి దగ్గరకూ తలొకడివద్దకూ యిరవైమందినో, పదిహేనుమందినో పంపితే యింకెంతమంది మిగులుతారు నగర రక్షణకు?''

"మొత్తం రెండువందల యాభైమంది ఉన్నారు. దాచడానికేముంది గాని మహానుభావా! మన సైనికుల నా మల్లులు చావగొట్టేరు. అసలుసంగతి అది. అందుకే యీ గాభరా అంతా. మా ఉద్దేశ్యమేమిటంటే పట్నంలోని పటాలాలు కొన్నిటి నక్కడకు పంపుదామా అని.''

"ఎన్ని?''

"అధమం ఆరుపటాలాలు, అంటే మూడు వేలమందినన్నమాట.''

"ఎప్పుడు!''

"వెంటనే.''

గ్రాఘూస్ తల ఊగింది. అతనంతక్రితం ఊహించిన విధంగానే జరిగిందనుకున్నాడు. చెప్పదలుచుకున్నదంతా ఒకమాటాలోచించుకున్నాడు, జాగ్రత్తగా ఆలోచించుకున్నాడు. బానిసలగురించి తనకు చాలా తెలుసు. ఆ జ్ఞానమంతా యిప్పుడుపయోగించాలనే ఉద్దేశ్యంతో ఒకచోట ప్రోగుచేశాడు.

"అల్లాగే చేయకండి."

అతనికి, వాళ్ళను వ్యతిరేకించే, అలవాటొకటుంది. ఎందుకితనల్లా అంటాడో వ్యతిరేకిస్తాడో తెలుసుకోవాలని వాళ్ళకుంటుంది.

"ఎందుకంటే యీ పట్నాలలోని పటాలాలు నమ్మతగ్గవికావు. బానిసలను కొంతకాలందాకా యేమీ చెయ్యకండి. వాళ్ళమానాన వాళ్ళని వదలండి. వాళ్ళల్లో వాళ్ళు తన్నుకు చావడం మొదలెట్టేవరకు, ఆగండి. పటాలాలూ వద్దు, గిటాలాలూ వద్దు."

"మరింకెవరిని పంపుదాం?"

"సైన్యాన్ని పిలిపించండి."

"స్పెయిన్‌నుంచీ, పాంపీనుంచీనా?"

"పాంపీ దానంతటదే నాశనమవుతుంది. బానిసలను కొంతకాలం దాకా యేమీ చెయ్యకండి. స్పెయిన్‌ని వదిలిపెట్టండి. సిస్‌ఆల్పైన్‌గాల్‌నుంచి మూడోదళాన్ని రప్పించండి. తొందరగా పరిగెట్టించకండి. వాళ్ళు బానిసలు. కొద్దిమంది బానిసలు. మీరు చేస్తే తప్ప అదేం పెద్ద గొడవకాదు."

అల్లా వాళ్ళు వాదించుకున్నారు. అతని స్మృతిపథంలో ఆ వాదన యిట్టే కనిపిస్తూ, యిట్టే మాయమౌతోంది. నమ్మశక్యంగాని భయాందోళనలలో మునిగి ఆ సెనేటర్లావిధంగా వాదించుకుని చివరికో నిర్ణయానికి వచ్చారు. పట్నంలో ఆరుపటాలాలను పంప నిశ్చయించుకున్నారు. గ్రాఘూస్‌కు కొద్దిగా నిద్రపట్టింది. తెల్లారేసరికి నిద్ర లేచాడు. ఎక్కడ పడుకున్నా, రాత్రి ఎంత ఆలస్యంగా పడుకున్నా ఉదయాన్నే నిద్ర లేచే స్వభావం అతనిది. అల్లాగే యీవేళకూడా లేచాడు.

## 3

మానవునిలోని భయాన్నీ, ఆందోళననీ తగ్గిస్తుంది ఉదయం. ప్రభాతం అమృతాంజనంలాటిది. అదో ఆశీస్సు అది. చాలామంచి ప్రభావం కలది. దాని ప్రభావం పనిచేయని పరిస్థితులూ ఉంటాయి. ఉషఃకాంతి నాహ్వానించని మనుష్యులు కూడా వున్నారు. ఖైదీ వున్నాడంటే నిశీధిని కౌగలించుకుని, అంటిపెట్టుకుని దాన్నే పట్టుకు వేలాడుతాడు. పొద్దుపొడిచినంతమాత్రాన ఖైదీకి ఊడబొడిచేదేమీలేదు. అంతమాత్రాన అతనిలో యే వుత్సాహము పొడసూపదుకూడా. కాని సాధారణంగా ఉషఃకాంతి మనస్సులోని తమస్సునూ, అంహస్సునూ తుడిచిపెడుతుంది. గొప్పవాళ్ళ గొప్పతనమేమిటంటే వాళ్ళు ప్రతిఉదయమూ వాళ్ళ గొప్పతనాల ముసుగు తగిలించుకుంటూ

ఉంటారు. రాత్రిళ్ళు వాళ్ళుకూడా అతిసామాన్య మానవులలాగానే ప్రవర్తిస్తారు గనుక, ఉదయాన్నే ఆ పని చెయ్యాల్సిన అవసరం వాళ్ళకు చాలావుంది. ఇంత గొప్పవాళ్ళు రాత్రిపడ్డాక యెన్నో లుచ్ఛాపనులు చేస్తారు. కొందరెందరో, యెందుకో చీకట్లో ఏడుస్తారు. చీకటి యేడుపు తమ హృదయకోశాలలోని ప్రాణాపహరణకై మృత్యుదేవత తన పొడుగాటి హస్తాలను సాచి వెతికి తీసుకుపోబోతోందని భ్రమించి మంచం మీద ఒక మూలకు ముడుచుకుపడుకుంటారు మరికొందరు. ఉన్న చీకటికన్న మరింత చీకటి నూహించుకుని, తమచేతి కదలికనో, కాలి కదలికనో చూచి హడలి చస్తారు మరికొందరు. కాని తెల్లారేసరికి మాత్రం అటువంటివాళ్ళంతా రాత్రి యిటువంటివేం జరుగనట్లు యథాప్రకారంగా గొప్పవాళ్ళుగానే వ్యవహరిస్తూంటారు. వెల్లవలె తెల్లగానున్న టోగా తొడుక్కొని, ఉల్లాసంతో, ఆత్మవిశ్వాసంతో చూడగానే వీడురా రోమను సెనేటరుకి ఉదాహరణ అన్నట్లు కూచున్నాడు. అప్పుడూ, ఇప్పుడూ, ఎప్పుడూ చాలా మందితో ఒక విషయం చెప్పడం గ్రాఘూస్‌కి పరిపాటు. భూత భవిష్య ద్వర్తమాన కాలాలలో యే ఇతర శాసనసభ అయినాసరే రోమను సెనేట్ అంత గొప్పగా శాసనసభా వాద, ప్రతివాద కార్యక్రమాల్ని కొనసాగించలేదని అతని దృఢనమ్మకం. గ్రాఘూస్‌కేసి చూస్తే అదే నిజమేమోననిపిస్తుంది. అతనన్నదేమీ అతిశయోక్తి కాదనిపిస్తుంది. అతని కుటుంబ గతచరిత్ర అనుమానాస్పదమైనదే కావచ్చు. అతని హృదయం ప్రసరింపచేసే రక్తం ఉన్నత కుటుంబాలనుంచి సంక్రమించిన వారసత్వఫలితం కాకపోవచ్చు. ఏది యెల్లాగున్నా అతనిలోమాత్రం వుండాల్సిన ఒక సుగుణమూ వుండనే వుంది. అతను ధనవంతుడు. ఒకవ్యక్తి ధనరూపంలో యెంత విలువైనవాడు అనే కాని, అతని పూర్వీకు లెట్టివారు అని యెంచకపోవడం రోమ్‌యొక్క సుగుణమనే చెప్పాలి. ఒకడికి, యెవడికైనా సరే, భగవంతుడు ధనాన్ని ప్రసాదించాడంటేనే చాలు, అతనిలో అంతర్గతంగా మేధాసంపద వెల్గొందుతూందని చెప్పడానికి. దీనికి ఋజువు కావాలా? ఎక్కడపడితే అక్కడే వుంది దీనికి ఋజువు. ఇంతమంది ప్రజలలో యే కొద్దిమందో ధనవంతులై బహుళ సంఖ్యాకులు పేదరికపు దారిద్ర్యంలో పడి బాధపడతారేం? వాళ్ళకు ధనముండడమే వాళ్ళ ఆధిక్యతకు ప్రబల నిదర్శనం.

సలేరియా భవనంలోని అతిధులంతా, గృహయజమాని ఆంటోనియస్ కైయస్‌తోసహా గ్రాఘూస్‌చుట్టూ చేరేరు. ఆ రాత్రికి అక్కడ కూడిన స్త్రీ పురుష బృందంలోని ప్రతివారికీ అసాధారణ వ్యక్తిత్వం వుంది. తద్వారా ఆ బృందం మొత్తం మీద అసాధారణమైనదే. మాలో ప్రతివాడిలో యెంత అసాధారణత్వం వుందో,

మేమెంత అనన్యసామాన్య ప్రతిభావిలసితులమో నన్నభావం అక్కడున్న ప్రతివారి లోనూ వుంది. ఆ భావం వాళ్ళకి సంతోషం కల్గించింది. అక్కడి ప్రతివ్యక్తీ ఒక్కొక్క రకంగా గొప్పవాళ్ళవటట్టి ఒకరితో ఒకరు సంతోషంగా కాలం గడప గలిగారు. ఆంటోనియస్ కైయస్ ఆషామాషీ మనుష్యులను చేర్చడనీ, అక్కడికి వచ్చారు కాబట్టి వాళ్ళుకూడా గొప్పవాళ్ళేననీ వాళ్ళు భావించారు. ఎప్పుడూ గొప్ప వాళ్ళనే చేర్చగల ఆంటోనియస్‌యందు వాళ్ళకు నమ్మకం పెరిగింది. ఇక్కడకు వచ్చినవారిలో, ప్రపంచమంతటిలో ధనవంతులైన వాళ్ళిద్దరూ అద్యతన కాలాలలో కని విని యెరుగని విధంగా వ్యభిచరించి కులటయై ప్రసిద్ధిగాంచిన కులకాంత యొకరై: జీవితకాలమంతా పన్నాగాలు పన్ని, పై కగుపించని కృత్రిమంతో, కుయుక్తులతో, కుట్రతో, కుత్సితంతో యెప్పుడూ తన మోసం బైటపడకుండా చేసుకుని, శతాబ్దాల తరబడి వీడు కూడా గొప్పవాడా అని ప్రజలనుకునే విధంగా మోసగించినవాడై, యశస్సు నార్జించిన యువకుడొకడు; భ్రష్టత్వపు లోతులోతులకు దిగజారి, తద్వారా పేరు సంపాదించిన యువకుడొకడు;- ఆ రాత్రి అతని అతిథులుగా ఆ భవనంలో చేరేరు. ఎటువంటి సమయంలోనైనా సరే యిటువంటివారికి ఆతిథ్యం యివ్వడం ఆ గృహస్తుకు పరిపాటయిపోయింది.

ఈ ఉదయం వాళ్ళంతా గ్రాఖస్ చుట్టూ పరివేష్టించి కూచున్నారు. అత నొక్కడే వాళ్ళలో టోగా ధరించినవాడు. అతనికోసం అత్తరువు వేసిన నీరు తేబడింది. ఆపిల్‌పండు పైతొక్క చెక్కుతూ కూచున్నాడు. అతను నిశ్చలుడైన, అనుభవజ్ఞుడైన మేజస్ట్రీటు, మధ్యమధ్య ఒకటో, అరో మాట వదులుతున్నాడు. మంచి దుస్తులు ధరించి, యెంతోసేపు అవస్థపడి బాగా తలదువ్వుకుని, పెదిమలకు యేవేవో రంగులు పట్టించి, అక్కడకు వచ్చి కూచున్న యువతీయువకులను చూసి 'వీళ్ళు మంచి తమాషాగా తయారవగలరు' అనుకున్నాడు. ఇదీ, అదీ యేదేదో వాళ్ళు మాట్లాడుకున్నారు. ప్రతీదీ లోపల ముందుగానే అనుకుని, బాగా ఆలోచించుకుని, జాగ్రత్తగా మాట్లాడ్డం వాళ్ళ అలవాటు. శిల్పం గురించి మాట్లాడాల్సినప్పుడు మాత్రం సిసిరో పని నల్లేరుమీద బండిలాగుంటుంది. మంచి అధికారపూర్వకంగా మాట్లాడతాడు.

"అస్తమానూ గ్రీకులంటే మాత్రం నాకు చెడ్డచిరాకు. వెయేళ్ళ కిందట యీజిప్షియన్లు సాధించిన దానికన్న వీళ్ళు సాధించేసినదేమిటి? ఈ రెంటిలోనూ క్షీణ దశ కనిపిస్తోందనుకోండి. ఈ రెండుజాతులూ అభివృద్ధికీ, అధికారానికీ తగవనే చెప్పాలి; తగవుకూడా. అదిగో ఆ క్షీణదశనూ, వారి అసమర్థతనూ ఆ శిల్పం

ప్రతిబింబిస్తుంది. రోమన్ కళాకారుడు కనీసం యెల్లాగున్నది అల్లాగైనా చిత్రించగలడు" అన్నాడు సిసిరో.

"కాని యెల్లాగున్నది అల్లాగే ప్రతీది యథాతథంగా చిత్రిస్తేనే వస్తుంది చిరాకు" హెలీనా అసమ్మతి పలికింది. విజ్ఞానంకల యువతిగా అల్లా అనడానికి ఆమెకు విశేషాధికారం వుంది. కళగురించి నాకేం తెలియదు బాబూ, అనే రకానికే గ్రాఘుస్ చెందుతాడని వాళ్ళందరికీ తెలుసు. "నాకు ఇష్టమైనదేదో నాకు తెలుసు" అన్నాడతను. నిజానికి గ్రాఘుస్‌కి శిల్పం గురించి బాగా తెలుసు. ఈజిప్షియన్ శిల్పకళాఖండాలనతడు కొన్నాడు. ప్రత్యేకమైన ఆ శిల్పపద్ధతి అతనిలోని యేదో తంతిని మీటింది. క్రాసస్‌కీ విషయంలో నిర్దుష్టమైన భావాలులేవు. దీనిలోనే కాదు; చాలావాటిలో క్రాసస్‌కేవిధమైన భావాలులేవు. సైనిక విషయాలకు సంబంధించినంతమటుకు మాత్రం అతనో మంచిసేనాని. ఐనా, కుండ బద్దలేసినట్లు చెప్పే సిసిరో మాటలు మాత్రం అతనికి అసహ్యం కల్గిస్తాయి. భ్రష్టులు! భ్రష్టులు! అని అరవడం సుళువే, ఆ భ్రష్టులతో ముఖాముఖి నిలబడి యుద్ధం చేయవలసిన అవసరం లేనంతకాలం.

"నాకు గ్రీకుశిల్పం అంటే యిష్టం" ఆంటోనియస్ కైయస్ చెప్పేడు. "అది చవక. రంగుపోయాక చూడ్డానికి చాలా బాగుంటుంది. ఏ రంగూలేని పాత చెత్తకిందే కనబడతాయనుకోండి. కాని, యీ తోటల్లో అవే నయం అనిపిస్తోంది నాకు."

"అలాంటప్పుడు స్పార్టకస్ నిర్మించిన స్మృతిచిహ్నాలనే కొని వుండాల్సింది, మన మిత్రుడు క్రాసస్ వాటిని నాశనంచేయక పూర్వం," చిరునవ్వు నవ్వేడు సిసిరో.

"స్మృతిచిహ్నాలా?" హెలీనా అడిగింది.

"వాటిని నాశనం చెయ్యాల్సొచ్చింది మరి" క్రాసస్ యేమీ కానట్లు చెప్పేడు.

"నే నన్నదే నిజమయితే వాటిని ధ్వంసం చేయాలన్న ప్రభుత్వాజ్ఞపై సంతకం చేసినవాడు గ్రాఘుస్."

"నువ్వెప్పుడూ నిజమే చెప్పగలవు కదూ? ఏం" పిడుగులు పడ్డట్లు మాట్లాడేడు గ్రాఘుస్. "నువ్వన్నది నిజమేలే" అని హెలీనాతో అన్నాడు. "వెస్యూవియస్ పర్వతంయొక్క తూర్పుభాగంలో అగ్నిపర్వతశిలతో రెండు బ్రహ్మాండమైన స్మృతిచిహ్నాలను చెక్కించిపెట్టేడు స్పార్టకస్. వాటిని నేను చూడలేదు కాని, వాటిని ధ్వంసం చెయ్యమని మాత్రం ఆజ్ఞాపించా!"

"ఎందుకల్లా చేసేరు?"

"ఎందుకు చెయ్యకూడదూ? చెత్తకు చిహ్నంగా చెత్తబయలుదేరితే దాన్ని తుడిచి పారెయ్యాలంతే."

"అవెల్లాగుండేవి చూడ్డానికి?"

గ్రాఛూస్ నవ్వుతుంటే అతనితల ఊగుతోంది. సంభాషణ యెక్కడ దేన్ని గురించి ప్రారంభించినా చివరికీ బానిస పిశాచాల గురించీ, వాళ్ళ నాయకుడిని గురించీ మాట్లాడుకోడం తప్పదేమోనన్న విచారం కూడా కలిసిన నవ్వు నవ్వేడు. "నేనెప్పుడూ వాటిని చూడలేదమ్మా, క్రాసస్ చూసేడు" అన్నాడు.

"కళావేత్తలా చెప్పమంటే నాతరంకాదు" క్రాసస్ చెపుతున్నాడు. "ఎల్లా గుంటాయని మేమనుకున్నామో అల్లాగే ఉన్నాయవి రెండు. ఒకటో బానిస విగ్రహం, అంటే చిన్నదనుకునేరు. యాభై అడుగుల ఎత్తయిన విగ్రహం. ఎడంగా కాళ్లుపెట్టి, శృంఖలాలు ఛేదించుతున్నట్లుందా విగ్రహం. గొలుసులు తెగి వేలాడుతున్నాయి. ఒక చేత్తో పసిపాపను హృదయానికి హత్తుకున్నాడు. మరొక చేత్తో స్పానిష్ ఖడ్గం పట్టుకున్నాడు. ఒకటి అల్లాగుంది పెద్దవిగ్రహం. నామటుకది బాగానే ఉన్నట్లనిపించింది. కళా విషయాలలో నే నో పెద్ద విమర్శకుడ్ని కాననుకోండి. కాని అది శుభ్రంగా కనబడింది. చిన్నచిన్న వివరాలు గురించి కూడా యెంతో జాగ్రత్తగా ఆలోచించి చేసినట్లనిపించింది? గొలుసులు శరీరానికి కట్టినస్థలాలలో, దాని మచ్చలు గుర్తులు కూడా బాగా కనబడేలా చేసేరు. సూక్ష్మవిషయాలు కూడా వాళ్ళెంత నిశితంగా పరిశీలించారో తెలుసుకోవాలంటే ఈ ఒక్క ఉదాహరణే చాలు. గైయస్ తనేరియా అనుకుంటూ, అతనే నా కా విగ్రహం యొక్క భుజంలోని పనితనాన్ని చూపించాడు. రైతుల చేతులలాగే ఆ చేతులు కూడా వున్నాయి. చేతులమీద నరాలుబ్బిన్నట్లు కనిపించాయి. స్పార్టకస్ చాటున చాలామంది గ్రీకులు కూడా ఉండేవారు. వాళ్లు శిల్పంలో మంచి నైపుణ్యం కలవాళ్లు. దానికి వాళ్ళేమీ రంగులు పూయలేదు. బహుశా వాళ్ళకి రంగులేమీ దొరకలేదేమో. మొత్తంమీద అవి యేథెన్సులో కనిపించే రంగులుపోయిన పూర్వపు శిల్పంలాగే ఉన్నాయి. రంగులు పోయాక వాటిని చూడ్డానికి ముచ్చటగానే వుంటుందని ఆంటోనియస్ కైయస్ చెప్పినదానితో నేనేకీభవిస్తున్నా. తక్కినవంత పెద్దవికావు. మహా అయితే యిరవై అడుగుల పొడుగుంటాయి. అవికూడా బాగానే వున్నాయి. ముగ్గురు మల్లుల విగ్రహాలవి - థ్రేషియన్, గాల్, ఆఫ్రికన్. ఆఫ్రికావాడి విగ్రహం మాత్రం నల్లరాతితో చెక్కినది బలే గమ్మత్తుగా వుంది. ముగ్గురి మధ్యన రెండుచేతులలోనూ నిటారుగా త్రిశూలాన్ని పట్టుకుని నిలబడ్డ ఆఫ్రికన్ తక్కిన ఇద్దరికన్న పొడుగైన వాడిగా కనిపించాడు. ఒకవైపున వంపుతిరిగిన చిన్న కత్తిని పట్టుకుని థ్రేషియన్, మరోవైపున నిడుపాటి ఖడ్గాన్ని పట్టుకుని గాల్ నిలబడ్డారు. చేతులమీదా, కాళ్ళమీదా వున్న కత్తివాట్లనుబట్టి చూస్తే వాళ్ళప్పుడే ప్రదర్శన యిచ్చిన

మల్లులులాగ కనిపించారు. ఆనాట్లుకూడా బాగానే చెక్కబడ్డాయి. వాళ్ళ వెనుకగా ఠీవిగా నిలబడ్డ స్త్రీ విగ్రహ మొకటుంది. వరీనియా పోలికలో చెక్కేరేమో ఆ విగ్రహాన్ని. దాని ఒకచేతిలో తాపీ, మరొక చేతిలో ఒకతొళ్ళికా వున్నాయి. వాటి భావమేమిటో నాకు బోధపడలేదు!

"వరీనియా?" గ్రాఘూస్ అన్నాడు.

"వాటిని మీరెందుకు పాడుచేస్తారు?" హెలీనా అడిగింది.

"అంతయెత్తునా నిలచిన ఆ విగ్రహాలను అల్లా వుండనివ్వాలనా నువ్వనేది?" గ్రాఘూస్ వ్యతిరేకించాడు. "అందరూ వాటిని చూసి యివిగోనండోయ్! వీటినే బానిసలు తయారుచేస్తే అని చెప్పుకుందుకు వాటినల్లాగే ఉంచాలికదూ జాగ్రత్తగా కాపలాకాస్తూ?"

"వాటినల్లాగే ఉండనివ్వగలబలం రోమ్‌కుంది. వాటికేసి చూపించనూ వచ్చు, చెప్పుకోనూవచ్చు!" హెలీనా చెప్పింది.

"భేష్! బలేగా చెప్పేవు!" సిసిరో అన్నాడు. క్రాసస్ మాత్రం తనుచేసిన యుద్ధంగురించి జ్ఞప్తికి తెచ్చుకున్నాడు. రక్తపుటేరులు కట్టిన యుద్ధరంగంలో తన పదివేలమంది సైనికులూ యేమవుతారో అనే భయాందోళనలతో ఉన్నప్పుడు, అప్పుడు బానిసలు తాడిత భుజంగంలా, భీకరంగా, అత్యుగ్రస్ఫూర్తితో నిలబడ్డసింహంలా భీభత్సం చేసిపారేసారు.

యధాలాపంగా అడుగుతున్నవాడిలా కనిపించడానికి ప్రయత్నిస్తూ "వరీనియా విగ్రహం యెల్లాగుంటుంది?" అని అడిగేడు గ్రాఘూస్.

"నాకదేం బాగా జ్ఞాపకంలేదు. గాల్ జాతికో, జర్మన్ జాతికో చెందినదానిలా గుంది. పొడుగాటి జుట్టు, వదులైన గౌను, జర్మన్, గాల్ స్త్రీలు ముడివేసుకొనేటట్లే ఆమెకూడా జుట్టు ముడివేసుకుంది. మంచి బలమైన స్త్రీ విగ్రహం. ఈమధ్య బజారులో చాలామంది యిష్టపడి కొనుక్కుంటూన్నారు చూసేరూ అల్లాటి జర్మను ముండలాగానే వుంటుంది. ఆమె వరీనియా ఔనో కాదో యెవరికి సరిగా తెలియదనుకోండి. స్పార్టకస్‌కు సంబంధించిన తక్కిన గొడవల్లాగానే యిదికూడా మనకు బాగా తెలియదు. ఇంక తలాతోకా లేని పుకార్లన్నీ వింటూ కూచోవాలి. దాన్నిగురించి నాకు తెలిసినదేమైనా వుంటే ఆ బేటియాటస్ నాకు చెప్పినదే. అతనైనా యేదో నోటికొచ్చిందంతా వాగాడే కాని పెద్ద యెక్కువేం చెప్పలేదు. అతను చెప్పినదాన్ని బట్టి ఆమె అందంగానే ఉంటుందనాలి."

"అదికూడా ధ్వంసం చేసేరూ" హెలీనా అంది.

క్రాసస్ తలూపేడు ఇటువంటి ప్రశ్నలతన్నేం చెయ్యలేవు. "నేనో సైనికుడ్ని, సెనేట్ ఆజ్ఞలను నేను పాటించాను. అంతే. బానిసయుద్ధం యేదో చిన్న విషయం అని కొందరనగా నువ్వు విని ఉండొచ్చు. అల్లా చెప్పడం సహజమైపోయింది. అసలల్లా చెప్పడమే సహజమంటా. కాక బానిసలు మమ్మల్ని చిత్తుచేసి పారేసేరు. మేం ఎంత కష్టపడవలసి వచ్చిందో తెలుసా అని ప్రపంచానికి చెపితే మన కష్టంమాట దేవుడెరుగు. ఓస్ యింతేనే వీళ్ళబలం, బానిసలచేతిలో నుసైపోయారు అనుకుంటారంతా. కాని మన స్నేహితుడు, అప్పుడు ఆంటోనియస్ కైయస్ డాబామీద, యింత మేధావులైన మిత్రులు కూచున్నచోట గాథలు, పురాణాలు చెప్పుకోడం అనుచిత మంటాను నేను. నిజం చెప్పాలంటే యింతకు పూర్వమెవరూ రోమ్‌ను సర్వనాశనం చేయడానికి, స్పార్టకస్ పూనుకున్నంతగా పూనుకోలేదనే చెప్పాలి. అంతబలంగా యెవరూ దెబ్బతీయలేదు. ఏదో నన్ను సమర్థించుకుందుకు నేను మాట్లాడలేదు; వాదం పెంచాలనీ నాకు లేదు. ఈ తిరుగుబాటుకి పాంపీయే నాయకుడనుకోండి. అప్పుడు మనకు లభించే విజయం యేవిధంగాచూసినా ఘనవిజయం కాదు. మీరే ఆలోచించండి. వేదపడి శిలువలమీద వేలాడే బానిసలను చూడడానికే అదోలాగుంటుందికద. అల్లాటిది ప్రపంచంలోకల్లా గొప్పదైన రోమను సైన్యం, కాళ్ళుతెగి, చేతులు తెగి, తలలు రక్తంలో దొర్లుతూ రణరంగంలో పడి వుండటం చూచిననాకు యెల్లాగనిపిస్తుందో మీరే ఊహించండి. అందుచేతనే బానిసలు సృష్టించిన యీ శిలా శిల్పాలను ధ్వంసం చెయ్యడానికి నేను వెనుదియ్యలేదు. కొట్టి పారెయ్యండన్నాను. ఆపని చేసేక నాకు చాలా సంతృప్తికలిగిందికూడా. ఒక్క పిసరుకూడా కనబడకుండా ఆ విగ్రహాలను ముక్కముక్కలు చేయించి, గుండపిండి చేయించి పారేశాను. అలాగే స్పార్టకస్‌ని, అతని సైన్యాన్నికూడా నాశనం చేశాం. అల్లాగే అనతికాలంలో యీ స్పార్టకస్ గురించి, అతని అనుచరులను గురించి యెవరికీ, యేమీ జ్ఞాపకంలేకుండా చేస్తాం. అది చాలా అవసరంకూడా. నేను చాలా సూటైన మనిషిని. పెద్ద తెలివితేటలు నాకు లేకపోవచ్చు. కాని యిదిమాత్రం నాకు తెలుసు. ప్రపంచంలోని సక్రమపద్ధతి యేదయ్యా అంటే కొందరు పాలించాలి, మరి కొందరు పాలింపబడాలి. అది భగవదేచ్ఛ. అల్లాగే వుండాలి, ఉండి తీరుతుంది!"

తను ఆవేశపూరితుడు కాకుండా యితరులలో ఆవేశం కలిగించగలగడం క్రాసస్ గొప్పతనం. గ్రాఛూస్ అక్కడకూచుని ప్రతీవాళ్ళనీ పరిశీలిస్తున్నాడు. పల్చని ముఖంకల దొంగసిసిరో, గుంటడుకైయస్, హెలీనా మౌనంగా బాధపడుతూ

అదోలాకనిపించే జూలియా, ఆంటోనియస్‌కైయస్, క్రాసస్ వీళ్ళంతా అతనిదృష్టిలో పడ్డారు. వాళ్ళన్నమాటలన్నీ విన్నాడు. హాలువిడిచి తనుబైటకు పోయినప్పుడు సెనేటు కమిటీ తనవద్దకు వచ్చిన సంగతి జ్ఞాపకమొచ్చింది. అప్పుడే ఆరుపటాలాలు పంపబడ్డాయి. కథ ప్రారంభం మరచిపోతారు. క్రాసస్ చెప్పినట్లు అంతంకూడా మరిచిపోతారేమో. ఐనా ఆ అంతం అన్నది యింకా రావాలిగా, ముందుందది.

# 4

కేపువాకు ఆరు పటాలాలుపంపి అక్కడలేచిన బానిసల తిరుగుబాటును అణచి పారెయ్యాలని సెనేట్ మొదట్లో నిర్ణయించింది. ఈ నిర్ణయాన్నే గ్రాఖూస్ వ్యతిరేకించాడు. కాని ఆ నిర్ణయం వెంటనే అమలుజరుపబడింది. తద్వారా అతనికి అణకువకూడా నేర్పబడింది. ఆ తరువాత జరిగిన సంఘటనల దృష్ట్యా తన నమ్రతకు తానే సంతృప్తిచెందేడు గ్రాఖూస్. కాని యీవిధంగా హఠాత్తుగా వినమ్రుడై పోవడంవల్ల తానేదో విధంగా దెబ్బతిన్నట్లనుకోక మానలేదు.

పంపబడ్డ ప్రతి పోలీసుపటాలంలోనూ ఐదువందల అరవై మంది వుంటారు. వీళ్ళకీ, మామూలు సిపాయీలకీ ఆట్టే తేడాలేదు. పైగా వీళ్ళకిచ్చే దుస్తులు, ఆయుధాలు చాలా మంచివి. దీనికి తోడు పట్నవాసాలలో వీరి వాసం, సైనికదళాల్లాకాదు. వాళ్ళీ భూగోళపు యే అంచుకైనా పోవాలి. చాలా సందర్భాలలో అల్లాపోయినవాళ్ళు తిరిగి రావడంచూడం. ఏ దూరదేశంలోనో, తమకు తెలియని యే భూభాగాలలోనో వాళ్లు స్మశానవాసులుగా ఉండిపోయేవారు. అథవా వచ్చినా ఐదేళ్ళకో, పదేళ్ళకో, పదిహేనేళ్ళకో యెప్పుడో వచ్చేవారు. యువకులుగా వెళ్ళి వృద్ధాప్యాన్నికూడా మోసుకొచ్చేవారు. ఏదో పిడికెడు మెతుకులు తిని, రోజస్తమానూ కవాతుచేసి, చెమటలుకారేలా పనిచేసి యే మహారణ్యాలలోనో, రోడ్లూ, మహానగరాలూ నిర్మించేవారు. పట్నవాసం వాళ్ళ కొక్కొక్కప్పుడు జ్ఞాపకముండేదేకాదు.

ఈ పోలీసు పటాలాలల్లాకాదు దేశంలో పండేపంట సంతనూ తెగమేస్తారు. సారా, స్త్రీ క్రీడలు వీటికి అంతేలేదు. పట్నంలోని పటాలాలకు చెందిన ప్రతివ్యక్తీ రాజకీయవేత్తే. ఏదో కొంత రాజకీయ ప్రాముఖ్యత కలవాడే. ఎప్పుడూ లంచండబ్బులు చేతిలో పడుతూనే వుంటాయి. వీళ్ళల్లో చాలామందికి పట్నంలో పెద్దపెద్ద యిళ్ళు కూడా వుండేవి. అందులో కొందరు ఆరేసిమంది బానిసస్త్రీలనుకూడా కొనుక్కొని వాళ్ళతో తెగ కులికేవారు. ఎవడో ఒక సిపాయి పట్నంలో ఒకపెద్దవాటా అద్దెకు తీసుకుని, దాంట్లో పదునాలుగురు బానిసస్త్రీలతో కాలక్షేపంచేస్తూ, వాళ్ళకు పుట్టిన

పిల్లలను ఆరేసేళ్ళవరకూ పెంచి ఆ పిల్లలను మంచి ధరకు బజారులో అమ్ముకుని ఆవిధంగా బాగా డబ్బు గడిస్తున్నాడని సిపాయిల గురించి అనేకమైన కథలల్లి చెప్పుకునేవారు ప్రజలు. అటువంటి వెన్నో కథలు, పుకార్లు చెలామణీయైపోతున్నాయి.

పోలీసు పటాలాలు మంచి అందమైన దుస్తులు ధరిస్తాయి. ప్రతి పటాలన్నీ పెద్దపెద్ద కుటుంబాలలోని యువకులు నాయకత్వం వహించి నడిపిస్తారు. ఉన్నతస్థానాలు అందుకుందుకు, సంఘంలో హోదా సంపాదించేటందుకు యీ పటాలాలు సోపాన మార్గాలుగా, నిచ్చెనలుగా ఉపయోగపడుతూ వుంటాయి. చెయ్యిసాచితే నాటకశాలకో, రంగస్థలానికో తగిలేటంతవఱకే వాళ్ళు పటాలాలతో పోవడానికి యిష్టపడతారు. అంతకుమించి వాళ్ళను వెళ్ళమనడం వాళ్ళకు ఘోరమైన అన్యాయం చేసినట్లే అవుతుంది. అందులో సగంమందికి పైగా క్రైయస్‌కు స్నేహితులే. ఒకటి రెండుసార్లే ఉద్యోగంచేస్తేయేం? అనుకున్నాడు కాని, తన ప్రత్యేక విశిష్టత దృష్ట్యా, సామర్థ్యం దృష్ట్యా యీ ఆలోచన విరమించుకోడమే శ్రేయస్కరం అని భావించాడు. ఏ జాతీయోత్సవ సందర్భంలోచూసినా యీ పటాలాలే ఠీవిగా, దర్జాగా, కవాతుచేస్తూ, బ్యాండువాయిస్తూ, సైనికవందనం చేసేవారు. అందుకే చాలామంది యీపటాలాలకు ఆధిపత్యం వహించడంకోసం పెనుగులాడేవారు. ఒక్కొక్క పటాలం ఒక్కొక్క రంగు దుస్తులు ధరించేది. పక్షుల పింఛాలు శిరస్త్రాణాలు ధరించే గౌరవం వాళ్ళ కొక్కళ్ళకే దక్కింది. ఒక్కొక్కదళం పూర్తిగా కంచుకవచాలు ధరించేది. ప్రతీ పటాలానికీ ఒక్కొక్కరకం బూట్లుండేవి. ఆ బూట్లకు చిరుగంటలుండేవి. మోకాళ్ళవరకు ఉండే ఆ బూట్లు, ఆ చిరుగంటలూ చూడముచ్చటగా నుండేవి. సరిహద్దులుదాటి యితరదేశాలకుపోయే సైన్యాలు యిటువంటి బరువు మొయ్యడం కష్టంకాబట్టి వదిలేశాయి. కాని వీళ్ళుమాత్రం యీబరువు చాలనట్లు చేతులకు పొడుగాటి కంచుతొడుగులు తగిలించుకునేవారు. ఒక్కొక్కపటాలం ఒక్కొక్కరకం డాలు ధరించేది. ఇటలీ అంతటికీ ప్రశస్తమైన ఆయుధాలు వాళ్ళు ధరించేవారు.

వాళ్ళకు శిక్షణలో లోటుందా అనుకుంటే అదీలేదు. 'సర్కస్ మేక్సిమస్' గుఱ్ఱపు పందేలు జరిగేచోటు. ఆ ప్రదేశంలో వీళ్ళు ప్రతీ ఉదయాన్నే, నూరు క్లారినెట్లు సంగీతం ఆలపిస్తుంటే, లయబద్ధంగా అడుగు వేసుకుంటూ కవాతుచేసేవారు. ఆ చుట్టుపక్కల, కొండగుట్టలమీద చిన్నపిల్లలుచేరి యీ ముచ్చట చూసేవాళ్ళు.

ఒకటి యీ దళాలు సైన్యాలుకాదు. నిరాశాపూరితులైన, నిరాయుధులైన, నిరుద్యోగుల నణచడంకాదు; ఏ రాజకీయ జగడాలలోనో, పాల్గొనడమూకాదు; స్పానియర్డులతో, గాల్‌లతో, జర్మన్లతో, ఆఫ్రికన్లతో, థ్రేషియన్లతో వాళ్ళు పోరా

డాలి. ఐనా ఇవేమంత కష్టంకాదు. ఏదో కొద్దిమంది, వేళ్ళమీద లెక్కపెట్టగలిగినంత మంది బానిసలు తిరగబడ్డారంతే. ఎంత అధ్వాన్నమయినా యీ ఆరుపటాలాల్లోనూ మూడువేల ఐదువందలమందికి పైగా ఉన్నారాయె. గ్రాఖూస్‌కూడా కొంతమటుకు తన అంగీకారం తెల్పేడు. కాని ఒకరోజుకన్న యీ పటాలాలు పట్నంవదలి పైకి పోవడం అతనికి యిష్టంలేదు. వీళ్ళు సులభంగా బానిసల నణచిపారెయ్యలేకపోతారా అని అతని అభిప్రాయం. ఈ పటాలాలలోని సైనికులు రైతులనుండివచ్చి పట్నాలలో పుట్టిపెరిగినవాళ్ళు, పనికిమాలినవాళ్లు, హృదయంలేని అవినీతిపరులైన పరాన్న భుక్కులు. అంతటితో ఆగక వీళ్ళు రాజకీయాలలో కలగచేసుకున్నందున అవి రాజకీయ పటాలాలుగా మారేయి. అందుకనే గ్రాఖూస్ వీళ్ళ నసహ్యించుకునేవాడు. వీటిమాట వినబడేసరికి మండిపడేవాడు. అందుకే అతనీ ప్రతిపాదనను వ్యతిరేకించాడు. నానాటికి క్షీణించిపోతున్న కుటీరపరిశ్రమలలోని చేతిపనివాళ్ళూ, చిన్న చిన్న అంగళ్ళవాళ్ళూ, యీదశాలలో చేరేవారు. రంగస్థలాలలోనో, రోడ్లమీదనో, కాలాన్ని వృధాచేస్తూ; వాళ్ళకి ప్రభుత్వమిచ్చిన భరణమేదో తింటూ; గుఱ్ఱపుపందేలలో ఉన్న డబ్బులు తగలేసుకుంటూ, ఎన్నికలలో ఓట్లు అమ్ముకుంటూ; కన్న పిల్లలను పెంచే బాధ్యత తీసుకోడం యిష్టంలేక, పసిపాపల పీకపిసికి చంపి భ్రూణహత్యాకాండ కావిస్తూ; స్నానశాలలలో, పానశాలలలో కాలాన్ని వెళ్ళబుచ్చుతూ; అద్దెకొంపలలో యెత్తయిన అంతస్తులమీద నివసించే వీళ్ళనే పటాలాలలో చేర్చుకునేవారు.

సెనేట్ నిర్ణయంవచ్చిన మరునాడు పొద్దుపొడవడంతోటే యీ పటాలాలు పటాటోపంతో, రాజవైభవంతో బయలుదేరేయి. నేరుగా సెనేట్‌కు జవాబుదారీగా ఉండే పద్ధతిని, అధికారంయిచ్చి వరీనియస్ గ్లాబ్రూస్ అనే యువకుడిని పటాలాలకు అధిపతిగా చేసేరు. రాజకీయాధిపత్యంకోసం చాలాకాలంగా జరుగుతున్న అంతఃకలహాలతో సతమతమవుతున్న రోమ్ యిటువంటి యువకుడికి సైనికాధిపత్యం యివ్వడానికి కారణం అనుభవజ్ఞులైన పెద్దలులేకకాదు. గ్లాబ్రూస్ ధంభాచారాలుకల యువకుడే కావచ్చు; పెద్ద తెలివితేటలుకలవ్యక్తే అవచ్చుకాని రాజకీయంగా బాగా నమ్మతగ్గవాడు.

అప్పటికతనికి ముప్ఫైతొమ్మిదేళ్ళుంటాయి. తల్లిద్వారా ఉన్నతకుటుంబాలతో సంబంధాలు కలవాడు. అతనికి అంతులేని ఆశలుకూడాలేవు. అనుమానంలేదు. ఇది మా కుటుంబానికి ప్రసాదింపబడిన గౌరవమే అని అతని కియ్యబడిన ఆ ఆధిపత్యం గురించి అతనికుటుంబం భావించింది. ఇతన్ని నియమించడంవల్ల ఎన్నో ఉన్నత

వర్గాలయొక్క సహకారమూ, యెంతమందో కులీనులయొక్క సానుభూతీ లభించాయి సెనేట్‌కు. అస లేపనిచేసినా దానివెనుక రాజకీయంగా సాధింపబడేది యెంతో ఉంటే కాని చేయనేచెయ్యదు సెనేట్. సైనిక నాయకుడుగా అతను చేయవలసిన పనులు గురించి వివరంగా స్పష్టంగా అన్ని ఉత్తరువులూ సెనేట్ యివ్వనే యిచ్చింది. సెనేట్ చెప్పినవాటిని అతను ఆచరణలో పెడితేచాలు. ఆ పటాలాలు రోజుకు యిరవై మైళ్ళ చొప్పున ప్రయాణంచేసి కేపువా చేరుకోవాలన్నారు. ప్రయాణానికి అనువైన ఏపియన్ రాజమార్గంలో వీళ్లు వెళ్తారుకాబట్టి ఆహారం నీరు వగైరా వస్తువులు బళ్ళ మీదవచ్చే అవకాశంవుంది. మామూలు సిపాయిలైతే ఎవళ్ళతిండి వాళ్లు కూడామోసుకు పోవాలి. కాని వీళ్లు పట్నవాసపు పటాలాలకు చెందినవాళ్ళవడంచేత యెన్నో సౌకర్యా లున్నాయి. ఒక్కరాత్రి కేపువా ప్రహరీగోడచుట్టూ మాటు వెయ్యాలనీ, శత్రు సన్నా హాలగురించి ఒక్కరోజులో గూఢచారులద్వారా రహస్యాలు సేకరించి, తిరుగుబాటు నణచడానికి యేం చెయ్యాలని యితనికి తోచిందో, యే వ్యూహం, యెత్తుగడ అవలం బించ నున్నాడో, అతనిపథకాలేమిటో అన్నీ ముందుగా సెనేట్‌కు పంపమనీ యితనికి ఉత్తరువు చేసేరు. అల్లాగని సెనేట్ సమ్మతి వచ్చేదాకా పోరాటం ఆపి దిక్కులు చూడక పోరాటంమటుకు పోరాటం కానివ్వాలిసుమీ అనికూడా యితనికి చెప్పా ల్సొచ్చింది. ఎల్లా వీలయితే అల్లాగే బానిసల నణచిపారెయ్యమన్నారు. వీలైనంత మంది తిరుగుబాటుదార్లను పట్టుకొని - ముఖ్యంగా వాళ్ళనాయకులను మాత్రంతప్పదు- బహిరంగంగా విచారించి శిక్షించడంకోసం రోమ్‌కు పంపమని ఆజ్ఞాపించారు. శిక్షా చిహ్నాలకోసం మాకు కొంతమంది పట్టుబడ్డవాళ్ళు కావాలని కేపువా పురపాలకసంఘం కనుక అభ్యర్థిస్తే పట్టుబడ్డవాళ్ళ సంఖ్యలో సగంకన్న తక్కువగా ఉంటేనే పది మందిని శిలువవెయ్యడానికి అంగీకరించమనికూడా అతనికి చెప్పడమైంది. బానిసలెవ రికి చెందినా వాళ్ళ యజమానులకింక తిరుగబడ్డ బానిసలపైనున్న హక్కు రద్దయి నట్లు, వాళ్ళను సెనేట్‌కు హస్తగతంచేసి తీరాలనికూడా స్పష్టంచేయబడింది. ఈ విష యమై కోర్టు ఉత్తరువులకోసం వేసే దావాలుకాని, హక్కులగురించి పిటీషన్లుకాని ఎవరయినా పెట్టుకుంటే వాటి నన్నిటినీ హక్కులకమిటీ విచారిస్తుందని చెప్పారు.

బానిసవిప్లవానికి నాయకత్వం వహించినదెవరో తెలియకపూర్వం జరిగిన సంగతి యిది. అప్పటికి యెవరూ స్పార్టకస్ పేరు వినలేదు. బేటియాటస్ శిక్షణ కేంద్రంలో యెందుకు తిరుగుబాటు జరిగిందోకూడా యెవరికీ తెలియదు. ఎవరెవరు యేయే స్థానాలలో సైనికోద్యోగులుగా పనిచెయ్యాలి అన్న విషయంపై కొంతరభస జరగడంవల్ల, ముందు అనుకున్నట్లుగా ఉదయమే వెళ్ళాల్సిన పటాలాలు బాగా యెం

డెక్కిన పిమ్మటగాని బయలుదేరలేకపోయాయి. బ్యాండు, క్లారినెట్లు సంగీతాన్ని విని పిస్తున్నాయి. సైనికుల బూట్లధ్వని వినిపిస్తోంది. పట్టణ సింహద్వారం దగ్గఱ చాలా మంది జనం యీ యీ ముచ్చట చూడ్డానికి పోగయారు.

అదంతా గ్రాఘూస్‌కు జ్ఞాపకముంది—బాగా జ్ఞాపకముంది. బ్యాండు మోగుతూ జెండాలు గాల్లో రెపరెపలాడుతూ, కదంత్రొక్కే సైనికుల శిరస్త్రాణాలకు తగిలించిన పింఛాలు ఆడుతుంటే, ఆ పటాలాల ముందు శ్వేతాశ్వాన్ని అధిరోహించి వరీనియస్ ఠీవిగా పోతుంటే బానిసమూకల్ని ఓడించిరండి అని ప్రజలు వాళ్ళని దీవించారు. రుమాళ్ళు ఊపేరు. జయ జయ ధ్వానాలు చేసేరు. సుశిక్షితులైన సైనికులు చేసే లయబద్ధమైన కవాతుకన్న అందమైనదేముంది యీ ప్రపంచంలో! ఇదంతా తనూ మరో యిద్దరు సెనేట్ సభ్యులూ నగర సింహద్వారంవద్ద నిలబడి చూసేరు. ఎంత అందమైన దృశ్యం! దీన్ని గురించి అతనేమీ మరిచిపోలేదు.

# 5

ఒకనాడు అంతా స్పార్టకస్ పేరు విన్నారు. ఆ పేరు మొదటిసారిగా యెల్లా ఉచ్చరించబడిందో గ్రాఘూస్‌కు జ్ఞప్తికొచ్చింది. బహుశా అదే మొదటిసారి కావచ్చు. అజేయమైన రోములో ఆ పేరు ఉచ్చరింపబడడం అదే ప్రథమం కావచ్చు. వెళ్ళిన వెంటనే తన రిపోర్టు పంపించాడు వరీనియస్. ఆ రిపోర్టులో డాంబికంలేదు. ఏ ఒక్క విషయానికి కాని ప్రాముఖ్యత యివ్వబడలేదు. మామూలు రిపోర్టులాగనే వుంది. "సెనేట్ దివ్యసముఖమునకు" అంటూ ప్రారంభమై ఏపియన్ మార్గంలో జరిగిన చిన్నచిన్న సంఘటనలూ, కేపువాలో వాళ్ళు సేకరించిన రహస్య సమాచారమూ మొదలైన విషయాల నతడు వ్రాసేడు. పటాలాల సైనికులు చేతులకూ కాళ్ళకూ తగిలించుకున్న కంచుతొడుగులవల్ల పుళ్ళుపడి, వాళ్లు నడవలేకపోతున్నారన్న దొక్కటే ఆ రిపోర్టులో ప్రధానమైన విషయం. వాళ్ళా తొడుగులు తీసివేసి ఆ సామానంతా ఒక బండిలో యెక్కించి రోమ్‌కు పంపివేయవలసిందిగా వరీనియస్ నిర్ణయించాడు. ఇది వారి దళ గౌరవాన్నీ, ప్రతిష్ఠనూ మంటగలపడమే కాగలదనీ, దళాలను నిందించడం తప్ప వేరుకాదనీ అభిప్రాయపడ్డ ఆయా దళాధిపతులు పడ్డ పుళ్ళకు కొద్దిగా నూనె పట్టించి సమస్యా సామరస్యపరిష్కారానికి సహాయపడ్డారు. వరీనియస్ తన అభిప్రాయం మార్చుకుని దాని కంగీకరించాడు. తత్ఫలితంగా బాగా పుళ్ళుపడి బాధపడుతున్నారని నూరుమందిని కేపువాలో వదిలేసేరు. ఇంకా యెంతోమంది పుళ్ళతో కుంటుతున్నా బానిసలమీద దండయాత్రకు వీళ్ళు పనికిరారని నమ్మకంగా భావించబడింది. (రిపోర్టు

లోని 'దండయాత్ర' అన్నమాట చదవగా విన్నప్పుడు గ్రాఖస్ అయిష్టంతో ఓర చూపు చూచేడు.)

తిరుగుబాటు గురించి యెన్నో వివరాలు పంపుదామన్న కుతూహలం పెరిగింది వరీనియస్‌కు - అటువంటివి అట్టే లభ్యం కాకపోయినా - అల్లా పంపడంవల్ల స్వీయాభివృద్ధికి బాటవేసుకున్న వాడినౌతానుకదా అని అతని అభిప్రాయం. తిరుగుబాటుకు వెనుకనున్న గాథనంతటినీ బేటియాటస్ చెప్పగా విని దాన్నికూడా సెనేట్‌కు పంపేడు. పంపుతూ "స్పార్టకస్ అనే థ్రేషియన్, క్రిక్సస్ అనేగాల్ దాన్ని నడుపుతున్నట్లు కనిపిస్తోంది" అని వ్రాసేడు. వీళ్ళిద్దరూ మల్లులే కాని మొత్తం యెంతమంది మల్లులు తిరుగుబాటులో పాల్గొన్నారో చెప్పడం కష్టం. మూడు తోటలను వాళ్ళే విధంగా తగులపెట్టేరో పూర్తి వివరాలు కూడా పొందుపరుచబడ్డాయి. ఆ తోటలలో పనిచేసే బానిసలు, తమ యజమానులయందు భక్తి ప్రపత్తులు కలిగినవాళ్ళేకాని, తిరుగుబాటుదార్లు కత్తిచూపి చంపుతామని బెదిరించి బలవంతంగా తమలో కలుపుకోవడంవల్ల అటు చేరేరని, దానిని వ్యతిరేకించిన వారిని అక్కడే నరికేసేరనీ తెలియజేయబడింది.

ఇద్దరు భూస్వాములు కేపువాలో తలదాచుకుందుకు వస్తుండగా వారిని త్రోవలోనే అడ్డగించి చంపి వారి బానిసలను అన్యాయంగా తమలో కలుపుకొన్నారు తిరుగుబాటుదార్లు. అసలా తిరుగుబాటులో తమకుతామై చేరిన వాళ్ళు స్వామిద్రోహ పరాయణులైన బానిసలు, సోమరిపోతులై దుర్మార్గానికి ఒడికట్టిన బానిసలు, విప్లవకారులు చేసేరని చెప్పబడే యెన్నో దౌర్జన్య చర్యల లిస్టులు తయారుచేసి, మరో మూడు కాగితాలపై వాళ్ళు చేసిన మరికొన్ని అత్యాచారాలు పేర్కొని రిపోర్టు పంపేడు వరీనియస్.

తనకు తెలిసినంతవరకూ వాళ్ళు వెసూ్యవియస్ కొండకోనలలో దాగి వున్నారనీ, వెంటనే తానక్కడకు పోయి సెనేట్ నిర్ణయాన్ని వాళ్ళమీద అమలుచేసి తీరుతాననీ అతను వ్రాసేడు.

ఈ రిపోర్టు సెనేట్ అందుకుని అంగీకరించింది. మరో తీర్మానంకూడా ప్రతిపాదించబడింది. "పట్నవాసాలలోని బానిసాధములు చూసి గుణపాఠాల నేర్చుకుందుకుగాను, గనులకు పంపడానికని యింతకు పూర్వం కేటాయించిన యెనభైమంది బానిసలను శిక్షాచిహ్నాలుగా శిలువవేయడానికి యీ సభవారు నిర్ణయిస్తున్నారు." ఈ తీర్మానం యేకగ్రీవంగా ఆమోదింపబడింది. ఆ మరునాడే యీ యెనభైమంది దౌర్భాగ్యులూ క్రీడావిరామకాలంలో శిలువల నలంకరించారు. అదేరోజున ప్రజల మన్ననలను

పొందిన పార్థియా గుఱ్ఱం 'ఎరిస్టోన్సు' న్యూబియా ఆడగుఱ్ఱం 'చారోస్'తో ఓడి పోయింది పందెంలో. దాంతో పార్థియా గుఱ్ఱంమీద డబ్బు ఒడ్డిన యెంతో మంది రోమన్లు కుదేలయిపోయారు.

ఆరురోజులవరకూ పోలీసు పటాలాల గురించికాని, వరీనియస్ గురించికాని యేమీ తెలియలేదు. ఆ తరువాత ఒకరోజున చిన్న రిపోర్టొకటి చేరుకుంది. పటాలాలు బానిసలచేతిలో ధ్వంసమైపోయాయి. దీన్ని వివరిస్తూ ఆ రిపోర్టులో మరేవిషయమూ వ్రాయబడలేదు. ఏమి రానున్నదో అని, యిరవైనాలుగు గంటలసేపు, రాబోయే ప్రమాదాన్నూహించుకుంటూ రోమ్ నిశ్చేష్టంగా వుండిపోయింది. ఈ బానిస విప్లవం గురించి ప్రతివాడు మాటాడేవాడే కాని యెవరికీ యేమీ తెలియదు. మొత్తంమీద భయంమాత్రం పట్నమంతట సంచరిస్తోంది.

# 6

సెనేట్ రహస్య సమావేశంలో వుంది. తలుపులు మూసుకుని దీర్ఘాలోచనలో పడింది. బైట ప్రజలు సెనేట్ భవనానికి పోయే రోడ్లన్నిటిమీదా, రోడ్లనిండా నిల బడ్డారు. ఈ ప్రజలలో యెక్కడబడితే అక్కడ యేదిబడితే అది పుకారు. ఆరు పటాలాలకూ పట్టినగతి సెనేట్‌కు తెలుసు. వినాలనే ఆదుర్దా ప్రతివాడిలోనూ వుంది.

సెనేట్ సభ్యులంతా హాజరయారు. ఒకటి రెండు కుర్చీలు మాత్రం సభ్యుల రాక కెదురు చూస్తున్నాయి. గ్రాఛూస్‌కు ఆ సమావేశం బాగా జ్ఞాపకముంది. అద్వితీయ మైన సెనేట్ యిటువంటి విషమ పరిస్థితుల్లోకూడా, ఇటువంటి దుర్వార్త విన్నప్పుడు కూడా యెంతో ఘనంగా ప్రవర్తించి తీరుతుందని అతనికి తెలుసు. అనుభవజ్ఞులైన వృద్ధసెనేటర్ల చూపులు ప్రయోజనకారిగా వున్నాయి. వాళ్ళ ముఖాలలో భయాందోళ నలు కనబడ్డంలేదు. కాని యువకులలో మాత్రం క్రోధం, దృఢనిశ్చయమూ తాండ విస్తున్నాయి. అందరూ రోమన్ సెనేట్ యొక్క గొప్పదనాన్ని గుర్తించినవారే. అంతమేరకు, ఆ సందర్భంలో, గ్రాఛూస్ తన నిరాశవాదాన్ని, మానవ విద్వేషాన్ని వదులుకున్నాడు. ఇక్కడ కూచున్నవాళ్ళని అతనెరుగును. ఎటువంటి పద్ధతు లవలం బించి, అందులోనూ వక్రమార్గాలలో ఓట్లుకొని, దొంగఓట్లు వేయించి, రాజకీయ కపటనాటకమాడి, అవకాశవాదాన్ని చేబట్టి, వీళ్ళు సెనేట్ సభ్యులు కాగలిగేరో అంతా అత నెరుగును. ఇక్కడ కూచున్న ప్రతివాడిలోనూ వున్న అవినీతిసముద్రాల లోతు లతనికి తెలుసు. అయినా వారిమధ్య కూచున్నానన్న సంగతి అతనిలో గర్వాన్ని కలిగించి, ఒడలు పులకరించేలా చేసింది.

ప్రస్తుత మాతని వ్యక్తిగత విజయాలగురించి అతనికే చింతాలేదు. అతని విజయమో, పరాజయమో అక్కడివారందరి జయాపజయాలమీదా ఆధారపడి వుంది. అందుకే అతన్ని సెనేట్ 'పృచ్ఛకుని'గా నియమించింది. వాళ్ళలోని విచారాన్ని తను ఆవహింప చేసుకుని, తన కాస్త విజయగర్వాన్ని ఆవలకు నెట్టేశాడు. వాళ్ళముందున్న రోమను సైనికునివైపు తిరిగి నిలబడ్డాడు. ఆ ఊళ్ళో పుట్టిపెరిగినా, సందుగొందులలో తిరిగిన ఆ సైనికుడికి సెనేట్ ముందు నిలబడడం అదే ప్రథమ పర్యాయం. అతనిది పల్చని ముఖం. కళ్ళు భయంతో, గాభరాగా చూస్తున్నాయి. నాలికతో యెప్పుడూ పెదవులను నాకుతున్నాడు. కవచం వుందికాని, ఆయుధాలేవీ లేవు. సెనేట్‌లోకి వచ్చే వాళ్ళెవరూ ఆయుధాలు ధరించకూడదని శాసనం. ఆ శాసనమే అతని ఆయుధాన్ని బైటవుంచింది. ఒక చేతికి రక్తంతో బాగా తడిసిన గుడ్డకటు వుంది. బాగా అలసిపోయి నట్లు కనిపిస్తున్నాడు. ఇతరులైతే యేది చెయ్యలేరో గ్రాఛూస్ యేసంకోచమూ లేకుండా అది చేయగలడు. చేసేడుకూడా. అతన్ని ప్రశ్నలడిగే ముందు, ఒకడిచేత ద్రాక్షసారా తెప్పించి ఆ సైనికుని ప్రక్కనున్న బల్లమీద పెట్టించాడు. పూర్తిగా అలసి పోయిన ఆ సైనికుడు బలం లేక స్పృహతప్పిపోవడం గ్రాఛూస్‌కు యిష్టంలేదు. దాని వల్ల పనికూడా జరగదు. ఆ సైనికుని వద్దనుంచి సమాచారం సేకరించే అవకాశం పాడైపోతుంది. దళాధిపతి తన కిచ్చిన అధికారదండం ఆ సైనికుడి చేతిలో వుంది. ఆ అధికార దండం ప్రజాభిప్రాయానుసారం దాడివెడలిన సైన్యాలకన్న, ఆయుధా లన్నిటికన్న, అధికారంకన్న, ఆఖరుకి ఘనమైన యీ సెనేట్‌కన్న శక్తివంతమైనది. మొదట్లో ఆ సైనికుడికి గ్రాఛూస్ చెప్పినదేమీ బోధపడలేదు. ఆ దండాన్ని గ్రాఛూస్ పుచ్చుకుని వేదికపై వుంచాడు. అతని గొంతుక గద్గదికమైపోయింది. అనిర్వచనీయ మైన యేదో బాధ హృదయాన్ని క్రుంగదీస్తోంది. అతను మనుష్యుల నసహ్యించుకో గలడు; ఇంతాచేసి మనుష్యులే కాబట్టి వాళ్ళంచే అతనికేం లెక్కలేదు. కాని తన జీవితమంతటిలోనూ అతను కష్టపడి సంపాదించిన హోదాకు, అధికారానికి, యశస్సుకు ప్రాతినిధ్యం వహించగల ఆ రాజదండాన్ని మాత్రం, కొద్దిరోజుల క్రితమే వరీనియస్‌కి సెనేట్‌చే యీయబడ్డ ఆ అధికార దండాన్ని మాత్రం, అతను తక్కువచూపు చూడ లేడు.

అప్పు డతనా సైనికుడ్ని అడిగేడు: "ముందు నీ పేరు?"

"అరలస్ పోర్థస్."

"పోర్థస్?"

"అరలస్ పోర్థస్" ఆ సైనికుని సమాధానం.

ఒక సెనేట్ సభ్యుడు చేత్తో చెవినివంచి దొప్పలా పట్టుకుని "గట్టిగా, ఇంకా గట్టిగా చెప్పలేవటోయ్? ఏమీ వినబడడంలేదు" అన్నాడు.

"గట్టిగా మాట్లాడు" గ్రాఛూస్ అన్నాడు. "ఇక్కడ నీకేవిధమైన భయమూ వుండనక్కర్లేదు నిజం చెప్పడానికి. భగవంతుని ముందు, పవిత్రమైన హాలులో నువ్వున్నావు మాట్లాడు!"

సైనికుడు తల ఊపేడు.

"ద్రాక్షసారా తీసుకో."

అక్కడున్న వాళ్ళందరి మొహాలకేసీ చూసేడు సైనికుడు. లావుగా, తెల్లని టోగాలు ధరించి, చెక్కిన శిలావిగ్రహాలలా, కూచున్న వీళ్ళందరి ముఖాలూ చూసేడు. పాత్రలో సారాతీసుకుని తాగి తన పెదవులు నాక్కున్నాడు.

"నీ వయస్సెంతోయ్?" గ్రాఛూస్ ప్రశ్నించాడు.

"ఇరవై ఐదేళ్ళు."

"నీ జన్మస్థలం?"

"ఇక్కడే రోమ్‌లో."

"నీ వృత్తి యేమిటి?"

ఏమీ లేదన్నట్లు తల ఊపేడు సైనికుడు.

"ప్రతీ ప్రశ్నకూ నువ్వు సమాధానం చెప్పాలి. ఔననో, కాదనో యేదో ఒక సమాధానం ప్రతిప్రశ్నకూ చెప్పితీరాలి కాని, తల ఊపితే పనికిరాదు. ఇంకా వివరాలియ్యగలిగితే యిస్తే మంచిది తెలిసిందా?"

"ఏమీలేదు, యుద్ధమే నావృత్తి."

"నువ్వేన్నో పటాలానికి చెందినవాడివి?"

"మూడో పటాలానికి."

"ఎంతకాలంనుంచి మూడో పటాలంలో పనిచేస్తున్నావు నువ్వు?"

"రెండేళ్ళ రెండు నెలలనుంచి."

"అంతకు పూర్వం?"

"ఏమీలేదండి."

"మూడో పటాలానికి అధిపతి యెవరు?"

"సిల్వియస్ కైయస్ స్వలేరియస్."

"మీ వందమంది దళానికి యెవరు?"

"మేరియస్ గ్రాఛూస్ ఆల్వియో."

"సరే. నాకూ, యిక్కడ ఉపవిష్టులైన గౌరవనీయులయిన సెనేట్ సభ్యులకూ కేపువా వదలి వెళ్ళేక, మీ ఆరుపటాలాలకూ జరిగిందేమిటో ప్రతిదీ స్పష్టంగా, ఖచ్చితంగా చెప్పాలి; అనుమానించకుండా, దాచకుండా జరిగిందంతా చెప్పు. చెప్పడానికి యేమీ భయపడనక్కర్లేదు. పవిత్రమైన యీ సెనేట్‌లో నీకే విధమైన అపకారము జరగదు."

అక్కడికీ ఆ సైనికుడు గాభరాలేకుండా ధారాళంగా మాట్లాడలేకపోయాడు. కొన్ని సంవత్సరాలు దొర్లిపోయినై. ఒకనాటి వసంతసమయ ప్రభాతకాలంలో సలేరియా భవనం డాబామీద కూర్చుని ఉదయ వీచికా డోలికల నానందిస్తున్న గ్రాఛూస్‌కు ఆ సైనికుని మాటలకన్న, తనలో నాడు అవి రచించిన చిత్రాలే మరింత స్పష్టంగా కళ్ళముందు కట్టినట్లుగా జ్ఞాపకమున్నాయి. స్పష్టమైన, భయంకరమైన చిత్ర చిత్రీకరణ చేసినమాటలవి. వరీనియస్ గ్లాబ్రూస్ నాయకత్వాన నడిచివెళ్ళిన పటాలాలకు సంతోషంకాని, సంతృప్తికాని కలిగేటట్లు త్రోవలో ఆహ్వానపత్రాలు చదవలేదు. ఎప్పుడూ లేని విధంగా మారింది శీతోష్ణస్థితి. తాపం ఎన్నడూ లేనంత అధికమైంది. ఈ పట్నవాసపు పటాలాలకు దూరప్రయాణాలు అలవాటులో లేవు. అందులోనూ కాలినడకను చేయవలసిన యీ ప్రయాణం వారికెంతో కష్టతమంగా పరిణమించింది. సరిహద్దు సైన్యాలలోని సిపాయిలు మోసే బరువుకన్న యిరవై పౌనులు తక్కువే వాళ్ళు మోస్తున్నా, యీ శిరస్త్రాణం, ఖడ్గం, పెద్ద చేటంత డాలూ, పొడుగాటి ఈటె యివన్నీ ప్రయాణవేగానికి ప్రతిబంధకాలుగా తయారయేయి. ఈ లోహపు వస్తువులు శరీరాన్ని రాపాడేచోట పుళ్ళుపడ్డాయి. 'సర్కస్ మాక్సిమస్' భూములలో, అందంగా, గర్వంగా కవాతుచేసిన మెత్తని బూట్లు యీ రోడ్లమీద, పొలాలలోనూ యెందుకూ పనికిరాకుండా పోయాయి. మధ్యాహ్నం వేళ వర్షపు జల్లులు ముఖాన్ని మొత్తేవి; పూర్తిగా తడిపి పారేసేవి. ఉదయపు యెండలలో వేగిపోయేవారు. దాంతో సాయంత్రానికి వాళ్ళ ముఖాలలో దైన్యం దేవులాడేది. విచారం విచ్చలవిడిగా విహరించేది.

ఆ పటాలాల పరిస్థితి కళ్ళకు కట్టినట్లూహించుకోగలిగేడు గ్రాఛూస్. బారులు తీర్చిన పటాలాలు వర్షపు నీటితో, బురదతోనిండిన ఏపియన్ మార్గంలో శరీరభారాన్నీ; ఆయుధాల, కవచాల భారాన్నీ యీడ్చుకుపోయే పటాలాలు, ఠీవికి చిహ్నంగా శిరస్త్రాణలపై యెగిరిన పింఛాలు తడిసి, ముద్దయి, వంగి, వాలి, శిరస్త్రాణానికంటుకుపోయి కళ్ళమీదపడి ఈ అడ్డుకూడా యేమిటనిపించేటంత అసహ్యంగా తయారయాయి. పరిస్థితులేమీ బాగులేవనడానికికూడా శక్తిలేని పటాలాలు అల్లాపోతూ తోటలలో పని చేసే నలుగురు బానిసలను చంపి పారేసేరు - ముగ్గురు పురుషులు, ఒక స్త్రీ.

"మీరు వాళ్ళనెందుకు చంపవలసి వచ్చింది?" గ్రాఘూస్ ప్రశ్నించాడు.

"ఆ ప్రాంతాలలోని ప్రతిబానిసా మన శత్రువని అనుకున్నాం మేం."

"వాళ్ళు మీ శత్రువులే అయితే యెక్కడో కొండలలో దాక్కున్న వాళ్ళు, మీరు కవాతు చేసుకుంటూ పోతుంటే చూడ్డానికని రోడ్డుమీద కెందుకు వస్తారు?"

"నాకు తెలియదండి. ఇదంతా ఆ రెండో పటాలంవాళ్ళు చేసేరు. శ్రేణులు వదలివెళ్ళి ఆ ఆడదాన్ని పట్టుకున్నారు. మొగాళ్ళు ఆమెను కాపాడ్డానికి ప్రయత్నించారు. కోపంవచ్చి సైనికులు ఆ మొగబానిసల్ని ఈటెలతో పొడిచేసేరు. ఇదంతా ఒక్క నిముషంలో జరిగింది. మొగాళ్ళు చచ్చిపోయారు నేనక్కడి కెళ్ళే సరికి—"

"మీ పటాలంలోవాళ్ళుకూడా శ్రేణివదిలి వెళ్ళేరంటావు?" గ్రాఘూస్ అడిగాడు.

"అవునండి. సైన్యం అంతా, దగ్గరగా వున్నవాళ్ళఅంతా చుట్టూ మూగేం. దాని ఒంటిమీద బట్ట వూడతీసి వెల్లకిలా పడుకోబెట్టి, ఒకడి తరువాత ఒకడు బలవంతంగా...."

"ఆ వివరాల్లోకి పోనక్కర్లేదు" ఆటంకం చెప్పేడు గ్రాఘూస్. "మీ ఆఫీసర్లు జోక్యం కలగచేసుకోలేదా?"

సైనికుడు సమాధానం చెప్పకుండా నిలబడిపోయాడు.

"నువ్వు నిజం చెప్పాలి, తెలిసిందా? నిజం చెప్పడానికి భయపడొద్దని నే చెప్పలేదూ?"

"ఆఫీసర్లు జోక్యం కలుగచేసుకోలేదు."

"ఆ ఆడదెల్లా చచ్చింది?"

"వాళ్ళు చేసినదాంతో ఆమె చచ్చిందండి," సైనికుడు మెల్లిగా చెప్పేడు. తిరిగి చెప్పమని వాళ్ళడగవలసి వచ్చింది. అతని కంఠస్వరం యించుమించు వినబడకుండా పోయింది.

"రక్షణశ్రేణిని నిర్మించడానికి మీ సేనాని ప్రయత్నించలేదా? పోనీ ప్రయత్నించాడో, లేదో నీకు తెలుసా?"

రోమన్లు గర్వించదగ్గ వెన్నో వున్నాయి. ఒకరోజు రోమను సైన్యాలు యెక్కడ మకాంవేసినా వెంటనే రక్షణదుర్గాన్ని నిర్మించుకోకుండా వుండకపోవడమన్నదికూడా వాళ్ళకో గర్వకారణమైంది. చుట్టూ చిన్న కందకం, గుంజలు పాతడం, కొయ్యలు నాటడం, ఆ మకాం ఒక కోటలాగనో, ఒక పట్నంలాగనో తయారు చెయ్యడం పరిపాటైపోయింది.

"నలుగురూ అనుకునేవే నాకు తెలుసుకాని మరేం వివరాలు తెలియవండి."

"నలుగురూ అనుకొన్న వేమిటి?"

"వరీనియస్ గ్లాబ్రూస్ దుర్గం నిర్మించాలన్నా, కొందరు దళాధిపతులు వ్యతిరేకించారని అంతా అనుకున్నారు. అంతా ఒప్పుకుంటే మాత్రం అయేదా యేమన్నానా? మనలో యింజనీర్లు లేరు ఇదంతా బుర్రా, బుద్ధి లేకుండా చేసిన పనికాదని కూడా వాళ్ళన్నారు - అయ్యా! క్షమించండి, ఘనమైన——"

"చెప్పు ఫరవాలేదు. వాళ్ళేమనుకున్నారో నిర్భయంగా చెప్పు."

"అయ్యా! ఇదేం ఆలోచించి చేసినది కాదన్నారండి వాళ్ళు. ఏదో కొద్దిమంది బానిసముండాకొడుకులికి భయపడ్డమేమిటి అన్నారా ఆఫీసర్లు. అప్పుడే చీకటి పడుతోంది. రక్షణశ్రేణి నిర్మించాలని అంతగా అనుకున్న వరీనియస్ గ్లాబ్రూస్ చీకటిపడిపోయేదాకా ప్రయాణం యెందుకు చేయించాడు అన్నారండి దళాధిపతులు. చాలామంది అదే అన్నారు. ఆ నడక యెంతో యిబ్బందైపోయింది. దుమ్ము, ధూళి నిండిన రోడ్లు. గాలి వీచేసరికి ముక్కునిండా, ముఖంనిండా అదే ధూళి. కుండపోతగా వర్షంపడేది. ఆఫీసర్లకేం గుఱ్ఱాలమీద కూచున్నారు ఠీవిగా. వాళ్ళ సొమ్మేంపోయింది. ఎటొచ్చీ నడుస్తున్న మనకే యీ బాధంతా అని కూడా అన్నారండి. బళ్ళలో సామాను యెంత దూరం రాగలిగితే అంత దూరం ప్రయాణం చేయడమే మంచిదన్నారు."

"అప్పుడు మీ రెక్కడున్నారు?"

"కొండదగ్గఱ."

ఆ సైనికుడు భయంవల్ల అనాలోచితంగా పలికిన సాక్ష్యంకన్న, కళ్ళకు కట్టినట్లుతనికి తోచిన దృశ్యాలే గ్రాభూస్‌కు మరింతబాగా జ్ఞాపకమున్నాయి. తను స్వయంగా చూసిన వాటంత బాగా జ్ఞప్తికి వచ్చాయి. బురదతో నిండిన రోడ్డు పోను పోను ఒకే బండి పట్టేటంత సన్నమైపోయింది. హాయిని గొల్పే రకరకాలూ, తోటలూ, పసరిక బయళ్ళూ, చొరనశక్యమైన అడవులలోనికి, ఆఖరుకు అగ్నిపర్వత శిలాప్రాంతాలకు, కొండలలోకి దారితీసేయి. ఆ అగ్నిపర్వతం పెద్ద నోరు తెరచినట్లున్న గొయ్యివఱకూ యీ శిలాప్రాంతమే. వీటన్నిటినీ మించి నిరంతరము దీర్ఘాలోచనలో నున్నట్లు రాజతేజస్సుతో విరాజిల్లే వెస్యూవియస్ అగ్నిపర్వత శిఖరం. ఒక మైలు పొడుగున బారులు తీర్చిన సైనికులూ, సామాను బళ్ళూ, చిరాకుతో, అలసటకు దాసులైన సైనికులు. వాళ్ళకు కొంతదూరంలో చిన్న కొండంత వున్న ఎత్తయిన పెద్ద రాయి. ఆ రాతికి కొద్దిగా దిగువన ఒక బయలు. ఆ బయలులో ఒక యేరు పారుతుంటుంది.

పచ్చని, మెత్తని ముఖమల్లులాటి గడ్డి. ఆ గడ్డిలో పచ్చని పూవులు. నిశాగమన సమయం.

అక్కడ వాళ్ళు రాత్రికి మకాం వేసేరు. తన కింద ఉద్యోగుల మాటలకు లొంగేడు వరీనియస్ గ్లాబ్రూస్. అదికూడా గ్రాఘూస్‌కు దృగ్గోచరమైంది. మూడువేల మంది రోమన్ ఆయుధాలు ధరించిన సైనికులు మనకుండగా, మనమీద కా బానిసలు దాడిచేసే అవకాశమెక్కడుంది? ఆ అపాయమేమీలేదే? అస లా తిరుగుబాటు లేవదీసిందే రెండువందలమంది మల్లులు. అందులో చాలామంది చచ్చేరుకూడా. అటువంటప్పుడు యింతమంది వుండి భయపడాల్సిందేమిటి? పైగా మనమంతా అలసిపోయి వున్నాం అన్నారు దళాధిపతులు. కొందరు ఆ గడ్డిమీద నడుం వాల్చినదే తడవు నిద్రపోయారు. ఒకటి రెండు పటాలాలు డేరా వెయ్యడమనీ, వీధులేర్పాటు చెయ్యడమనీ క్రమ శిక్షణతో చేసేరు. చాలా పటాలాలు వంటకని మంటలేసేరు. బళ్ళల్లో వండిన వంట సిద్ధంగా వుంది కాబట్టి, వంటకు ప్రయత్నాలెందుకు అన్నారు మరి కొందరు. ఆ పర్వతం నీడలో, వాళ్ళు విధంగా మకాంవేసినట్లు ఊహించుకున్నాడు గ్రాఘూస్. సరిగ్గా మధ్యన వరీనియస్ గ్లాబ్రూస్ డేరా వేయబడింది. అక్కడే పతాకచిహ్నాలు ప్రతిష్టించబడ్డాయి. కేపువా ప్రజలు తమ సైన్యాలకు యెన్నో రుచికరమైన వంటకాలు తయారుచేసి యిచ్చారు. రక్షణదుర్గం కట్టవలసిన భారం తగ్గిందికదా అన్న సంతోషంతో ఆఫీసర్లతో కలిపి వరీనియస్ గ్లాబ్రూస్ విందారగించేడు. కష్టంగా వున్నా ఆ ప్రయాణంలో యేమీ అపాయాలుమాత్రం కలగలేదు. పైగా కొన్ని దినాలు పట్నాన్ని వదిలి రావడంతో కొంతపేరూ, ప్రతిష్టా రాకపోవు.

తనను జంతువులనుండి హెచ్చుస్థాయికి తీసుకుపోయిన జ్ఞానచక్షువుతో గ్రాఘూస్ తన పూర్వపు స్మృతులవైపు చూసేడు. చూసి ఆ విప్లవ ప్రారంభపు ఘడియలనూ, దృశ్యాలనూ నెమరు వేసుకున్నాడు. జ్ఞాపకమన్నదే మానవునికి సంతోషదాయకమైనదీ, విచారకరమైనదీకూడా. ఉదయపు యెండలో మంచినీటి గ్లాసులోనికి ఆలోచనాపూర్వకంగా చూస్తూ కాళ్ళు బారచాచుకుని కూచున్నాడు. రాయబారులకూ, దాడి వెడలే సేనాధిపతులకూ యిచ్చే అధికారదండాన్ని పుచ్చుకువచ్చిన దెబ్బతిన్న సైనికుని కంఠధ్వని యెంతోకాలంక్రితం విన్నా తిరిగి ఆ ధ్వని నతను వింటున్నాడిపుడు. ఏవేవో దృశ్యాలు మనోనేత్రాని కగుపించాయి. తమ కా విషయం ముందుగా రవ్వంత కూడా తెలియకుండా కొద్ది ఘడియల్లో మృత్యుసాన్నిధ్యాన్ని చేరుకునే వాళ్ళ మనోభావాలెల్లాగుంటాయి? వరీనియస్ గ్లాబ్రూస్ స్పార్టకస్ అన్న పేరెప్పుడైనా విన్నాడా? బహుశః వినకపోవచ్చు.

"ఎల్లా చీకటిపడిందో అంతా నాకు జ్ఞాపకముంది. నక్షత్రాలు ఆకాశంలో మెఱుస్తున్నాయి." సెనేట్ సభ్యుల ముఖాలు రాళ్ళల్లా తయారయాయి. వింటున్న వాళ్ళతో చెప్పేడు సైనికుడు.

మూర్ఖుని మాటలలో కూడా అణుమాత్రం అందం వుంటుంది. చీకటి పడింది. వరీనియస్ గ్లాబ్రూస్ తన సహచరులతోబాటు మధువును సేవిస్తూ, తేనె వేసిన తీపి పదార్థాలు తింటూ తన పెద్ద డేరాలో కూచున్నాడు. మంచి సంభాషణే, తెలివైన సంభాషణే జరిగివుండవచ్చు ఆ డేరాలో. ప్రపంచం అంతటికీ చెప్పుకోదగ్గ రోమన్ ఉన్నత వర్గాల యువకులు ఆ డేరాలో వున్నప్పుడు సంభాషణ సామాన్య విషయాలమీద వుంటుందని ఎల్లా అనుకోడం? వాళ్ళేం మాట్లాడుకుని వుంటారో? అప్పుడు యే విషయం ప్రజలకు మనోరంజకమై వుండేదా అని నాలుగేళ్ళయాక అప్పటెప్పటి విషయమో ఆలోచిస్తున్నాడు గ్రాఘుస్. నాటకశాలల్లో, గుఱ్ఱపు పందేలలో, రంగస్థలాలలో యేది ఆనాడు జనరంజకంగా వుండేదో? పాక్యువియస్ తాలూకు 'ఆర్మోరం ల్యుథేషియమ్' అనే నాటకం ప్రదర్శింపబడ్డ వెంటనే జరిగిందా యీ తిరుగుబాటు గొడవ? ఫ్లావియస్ గాలిస్ ప్రధానపాత్ర ధరించి, కని విని యెరుగని విధంగా తన సంగీతంతో ప్రజల సుశ్రూతలూగించిన రోజులలో కాదు కద? (పూర్వం యెప్పుడూ కని, విని యెరుగనివిధంగా ప్రధానపాత్ర ధరించి నటించడం పాడడం అన్నది వట్టి భ్రమయే కావచ్చు) ఆ కాలంలోనే అయివుంటుంది. అప్పుడే యీ విప్లవం జరిగినట్లుంది. ద్రాక్షసారా సేవించిన వాళ్ళ గొంతులు మల్లెపువ్వులు విడినట్లు విడి వుండొచ్చు. డేరాలలో కూచుని పాటలు కూడా పాడుకున్నారేమో?

దొర్లుకుంటూ, మెలికలు తిరుగుతూ, తిన్నగా సూటిగా పరిగెడుతూ ఆకాశపు టంచులలో విహరిస్తూ, సముద్రంలోని అలలపై విహరిస్తూ, వసంతాగమనాన్ని ఆహ్వానించే పక్షుల రెక్కల చప్పుడులా రెపరెపలాడుతూ ఆ పాటలు మకాం అంతటా విహరించాయేమో! స్మృతి అన్నది గమ్మత్తయినది. ఈ పాటలు విని అలసట మకాం వదలి పారిపోయింది. డేరాలు వేసుకోని సైనికులు గడ్డిలో వెల్లకిలా పడుకుని చుక్కలు చూస్తున్నారు. బానిసలెప్పుడూ తమ యజమానిమీద చెయ్యెత్త కూడదని బానిసలకు పాఠం నేర్పడానికని రోమ్నుండి దక్షిణంగా ప్రయాణంచేసి వెస్యూవియస్ ప్రేలుడు కొండదాకా వచ్చిన ఆ మూడువేల సైనికులకూ నిద్రపట్టింది. తీయని మృదువైన నిద్ర....

గ్రాఘుస్ పృచ్ఛకుడైన సెనేటరు. అతని పని ప్రశ్నలువేయడం, సమాధానాలు రాబట్టడం. సైనికుడు సమాధానం యిచ్చేలోపున ఆ హాలులో నిశ్శబ్దం చప్పుడు చేయ

కుండా తిరుగుతోంది. ఈగ వాలిన చప్పుడూ, ఎగిరే యీగల రెక్కల చప్పుడూకూడా వాళ్ళకు వినిపించే వుండును.

"నువ్వు నిద్రపోయావా?" అడిగేడు గ్రాఘుస్.

"నేను నిద్రపోయానండి" చూసినదంతా చెప్పడానికి ఎల్లాగో ప్రాణాలు దక్కించుకుని వచ్చిన ఆ సైనికుడు చెప్పేడు.

"నీకు మెళుకు వెల్లా వచ్చింది?"

ఇక్కడే ఆ సైనికుడు మాటలకోసం తడుముకున్నాడు. అతని ముఖం పాలి పోయింది. అతను స్పృహతప్పి పడిపోతాడేమో నన్న భయం కల్గింది గ్రాఘుస్‌కు. అతను స్పృహతప్పి పడిపోలేదు. అతని రిపోర్టు స్పష్టంగా, ఖచ్చితంగా యేమీ ఉద్రేకం లేకుండా తయారయింది. తను చూసేనని అతను చెప్పిన దిది :

"నేను నిద్రపోయాను. ఎవరో అరవడంవల్ల నిద్ర లేచాను. ఎవరో ఒక్కరే అరిచి వుంటారని నే ననుకున్నాను కాని, తీరా లేచి చూస్తే ఒక్కడు కాక ఎంతో మంది అరుస్తున్నట్లు తెలుసుకున్నాను. ఆ ప్రదేశమంతా కేకలతో, పెడబొబ్బలతో నిండింది. నేను మేల్కొని ప్రక్కకు తిరిగేను. బోర్ల పడుక్కునే అలవాటు కలవాడిని కనుక అల్లా తిరగాల్సొచ్చింది లెండి. నా ప్రక్కన కేలియస్ పడుకున్నాడు. పాపం! అతను అనాధుడు. ఇంటి పేరేం లేదతనికి. నా బాల్యస్నేహితుడు. నాకు కుడిచెయ్యి లాంటివాడు. నేను ప్రక్కకు ఒత్తిగిలేసరికి నా చెయ్యి తడిగా, వెచ్చగా, మెత్తగా వున్న దేనిమీదో పడింది. తీరా ఏమిటిరా అని చూసేసరికి నా స్నేహితుడి పీక తెగి పోయి వుంది. పూర్తిగా తెగిపోయింది. ఆ కేక లల్లాగే వున్నాయి. నేను రక్తపు మడుగులో కూచుని వున్నాను. ఆ రక్తం నాదో మరొకళ్ళదో నాకు తెలియనేలేదు. వెన్నెలలో నా చుట్టూ చచ్చి పడి వున్న శవాలగుపించాయి. ఎక్కడ నిద్రపోయారో అక్కడే చచ్చి పడి వున్నారు వెన్నెట్లో, మకాం నిండా అటూ యిటూ. కిందకీ, పైకీ ఆడుతున్న కత్తులు తళతళ మెరిసేయి. ఎక్కడబడితే అక్కడే తయారయా రీ బానిసలు. ఆ విధంగా వాళ్ళు మమ్మల్ని చంపారు. సగంమందిని నిద్రపోతుండగానే చంపేసారు. ఎవడు లేచి నిలబడితే వాడినల్లా చంపేసేరు. ఇక్కడా అక్కడా కొద్ది మంది సైనికులు గుంపులు గూడేవారు. కాని వాళ్ళెంతోసేపు దెబ్బలాడలేకపోయారు. ఇంత భయంకరమైనది నా జీవితంలో నేనెప్పుడు చూడలేదు. వాళ్ళు చంపడం మాన లేదు. నాకు మతిపోయింది. నేనూ కేకలెయ్యడం మొదలెట్టేను. జరిగిన విషయం చెప్పడానికి అనుమానందేనికి, కత్తిదూసి మకాంలోకి దూకుడుగాపోతూ ఒక బానిసను పొడిచి చంపేను అని నేననుకుంటున్నాను. చచ్చేడో లేదో మరి. తీరా ఆ మైదానం

మీదకు నేనొచ్చేసరికి చుట్టూ ఈటెలు కాపలా కాస్తున్నాయి. అవి మకాం చుట్టూ వున్నాయి. ఆ బల్లేలు పుచ్చుకుని నిలబడ్డ వాళ్ళల్లో చాలామంది స్త్రీలే. నేనెప్పుడూ అటువంటి స్త్రీలను చూడలేదు. అటువంటి వాళ్ళుంటారని కూడా ఆలోచించలేదు. ఆడవాళ్ళలా కనబడలేదు వాళ్ళు. గాలికి వాళ్ళ పొడుగాటి విరబోసుకున్న జుట్టు యెగురుతోంది. నోళ్ళు తెరిచి అసహ్యంగా అరుస్తూ నిలబడ్డారు. మొత్తం రణగొణ ధ్వనిని వాళ్ళ కేకలు మరింత గొడవగా తయారుచేస్తున్నాయి. వీళ్ళేం చేస్తారులే అను కున్న ఒక సైనికుడు వాళ్ళను తోసుకుపోవడానికి ప్రయత్నించాడు. వాళ్ళతన్ని నిర్దా క్షిణ్యంగా పొడిచి చంపేసేరు. ఎవడూ తప్పించుకుని పారిపోలేకపోయాడు. దెబ్బలు తిన్న సైనికులు పాకుతూ, డేకుతూ వస్తే వాళ్ళనుకూడా పొడిచి చంపేరు యీ స్త్రీలు. నేనూ అక్కడికి పరుగెత్తుకుని వెళ్ళేను. నా భుజంలో ఒక బల్లెం దూసుకుపోయింది. అదెల్లాగో ఊడబెరుక్కుని యీ రాక్షసుల బారినుంచి తప్పించుకుందుకు తిరిగి మకాం లోకి పరుగెత్తి వెళ్ళేను. రక్తం కాలువలు కడుతుంటే అక్కడ పడిపోయా. అల్లా యెంతసేపున్నానో నాకే తెలియదు. ఎంతో సేపనుకోను. లేచి పోరాడి చద్దామను కున్నాను. కాని ఆగేను. కేకలు, హాహాకారాలూ కొంచెం తగ్గినవి. ఎవరో నన్ను పట్టు కుని నిలబెట్టేరు. కత్తితో ఒకవేటు వేద్దామనుకున్నాను, కాని నా కత్తి లాక్కున్నారు వాళ్ళు. భుజంమీద తగిలిన దెబ్బవల్ల శక్తికూడా లేకుండా పోయింది. బానిసలు నన్ను పట్టుకున్నారు. ఒక కత్తి నాకుత్తుకదాకా వచ్చింది. నా పనయిపోయిందనుకున్నాను. నేకూడా చస్తాననుకున్నా. కాని యెవరో అరిచారు 'ఆగండి'. అప్పుడా కత్తి ఆగింది. నా గొంతుకు సరిగ్గా అంగుళం దూరంలో ఆ కత్తి ఆగిందంటే నమ్మండి. ఒక బానిస అక్కడకు వచ్చాడు. అతని చేతిలో థ్రేషియన్ కత్తి వుంది. అతనే ఆగండి అని అరిచాడు; అతనే అనుకున్నాను నేను. ఆగి అక్కడ నిలబడ్డారు వాళ్ళు. నా ప్రాణం కూడా పోకుండా ఆగింది. ఎఱ్ఱని జుట్టుకల బానిసొకడు వచ్చాడు. ఏదో మాట్లాడుకున్నారు. మిగిలినవాడిని నే నొక్కడినే కనుక వాళ్ళు నన్ను చంపలేదు. తక్కిన మన సైనికు లందరూ చచ్చిపోయారు. ఎక్కడ పడుకున్న వాళ్ళక్కడే చచ్చిపోయారు. వరీనియస్ గ్లాబ్రూస్ తాలూకు పెద్ద డేరాలోకి నన్ను తీసుకెళ్ళేరు. అతనూ చచ్చిపోయాడు. అతని శవం మంచంమీద పడి వుంది. కొందరు దళాధిపతు లున్నా రక్కడ. వాళ్ళు సంహరింపబడ్డారు. నా గాయానికి కట్టుకట్టి, కొందరు బానిసలను నాకు కాపలాగా వుంచేరు. అప్పటికి తెల్లారుతోంది. పటాలాలన్నీ చచ్చి పోయాయి.''

ఉన్నదున్నట్లు ఆవేశం లేకుండా, చెప్పుకుపోయాడు. ఇది చెప్తూన్నంతసేపూ అతని కంటిరెప్పలు త్వరత్వరగా మూసుకొనేవి. శిలాప్రతిమలా కూచున్న సెనేట్ సభ్యుల ముఖాలకేసి అత నెప్పుడు చూడలేదు.

"వాళ్ళంతా చచ్చిపోయారని నీ కెల్లా తెలుసు?" గ్రాఛూస్ అడిగేడు.

"తెల్లారేదాకా నన్ను డేరాల్లో అట్టేబెట్టేరు. డేరా తెరలు పైకి చుట్టపెట్టేసేరు. రాత్రి జరిగిందంతా నాకు స్పష్టంగా కనుపించింది. అరుపులూ, కేకలూ, హాహాకారాలూ, పెడబొబ్బలూ యేమీ వినబడ్డం లేదప్పుడు, కాని నా చెవులలో మాత్రం అవింకా గింగురుమంటూనే ఉన్నాయి. ఎంతోమంది చచ్చి చాపచుట్టల్లా పడివున్నారు. గాలిలో రక్తంవాసన వ్యాపించింది. రాత్రి మైదానంచుట్టూ కాపలాకాచిన ఆడవాళ్ళు కనిపించలేదు. ఆ వాసనను తోసుకుని మాంసం వండుతున్న వాసన వచ్చింది. పొద్దున్నే భోజనానికని ఆ స్త్రీలే మాంసం ఉడకబెడుతున్నారేమో. ఇటువంటప్పుడు యెవరైనా యెల్లా తినగలరా అనిపించింది. వెగటుబుట్టి వాంతి చేసుకున్నాను. వాంతులు కట్టేవఱకూ నన్ను పైన కూచోపెట్టేరు. ఎండవస్తోంది. మకాంలో తిరుగుతున్న బానిసలను చూసేను. చచ్చినవాళ్ళ కవచాలూ, ఆయుధాలూ అన్నీ వాళ్ళు తీసుకుంటున్నారు. మన డేరా గుడ్డలు నేలమీద పరచి ఆయుధాలూ, శిరస్త్రాణాలూ అన్నీ గుట్టలుగా వేసేరు. పక్కగా పారుతున్న యేటిలో కత్తులూ, యీటెలూ, కవచాలూ అన్నీ కడిగి తీసుకొచ్చారు. రక్తంతో నిండిన వీటినన్నిటినీ కడగడంతో ఆ యేటిలోని నీళ్ళన్నీ తుప్పురంగులా తయారయాయి. మేం పట్టుకెళ్ళిన కొవ్వుడబ్బాలు తీసి ఆ కొవ్వూ, చమురూ పట్టించారు ఆయుధాలన్నిటికీ. డేరాకు దగ్గఱగా పఱచిన గుడ్డమీద కత్తులన్నీ మేటలేసేరు. వెయ్యిపైగా ఉన్నాయవి."

"బానిస లెంతమంది ఉన్నారు?" గ్రాఛూస్ ప్రశ్నించాడు.

"ఆరున్నొక్కటి, ఎనిమిదివందలు. ఓ వెయ్యిమంది ఉన్నారు. నాకు సరిగ్గా తెలియదు. పదేసిమంది ఒక గ్యాంగుగా పనిచేస్తున్నారు వాళ్ళు. ఒళ్ళు వంచి పని చేస్తున్నారు. దోచుకున్న ఆయుధాలువగైరా మేం తీసుకువెళ్ళిన బళ్ళల్లో కెక్కించి యెక్కడికో తోలుకుపోయారా బానిసలలో కొందరు. ఉడకబెట్టిన మాంసం బుట్టల నిండా పెట్టి ఆడాళ్ళు పట్టుకొచ్చారు. ఒక్కొక్క గ్యాంగు ఒక్కొక్కమాటు తినేది. మన రొట్టెలు కూడా తినేసేరు."

"చచ్చిపోయినవాళ్ళ నేం చేశారు వాళ్లు?"

"ఏమీ చెయ్యలేదు. ఎక్కడున్న వాళ్ళ నక్కడే వదిలేసేరు. వస్తువులన్నీ దోచుకున్నాక, అక్కడ శవాలున్నట్లే వాళ్ళనుకోలేదనిపించింది నా మటుకు. ఎక్కడ

బడితే అక్కడే వున్నాయి శవాలు. రక్తం నేలమీద డాగులు కట్టింది. చూడ్డానికి నాకు చాలా అసహ్యమేసింది. ఒకచోట ఆరుగురుజేరి నిలబడి జరుగుతున్నదంతా చూస్తున్నారు. అందులో ఒక ఆఫ్రికన్ కూడా ఉన్నాడు. వాళ్ళు మల్లులు.''

''నీ కెల్లా తెలుసు.''

''డేరాలోకి వచ్చినప్పుడు వాళ్ళు మల్లులని నాకు తెలిసింది. జుట్టు అంట కత్తిర వేసి ఉంది వాళ్ళకి. ఒంటిమీద యెక్కడబడితే అక్కడ గాయాల మచ్చలున్నాయి. దాన్నిపట్టి నే ననుకున్నాను. అదీకాక మల్లు లెక్కడున్నా తెలిసిపోతారు. ఒకడి కో చెవిలేదు. ఒకడికి యెఱ్ఱని జుట్టుంది. వాళ్ళ నాయకు డొక థ్రేషియన్. కళ్లు మిటకరించకుండా, కదపకుండా చూస్తాడతను. అతని ముక్కు పగిలింది—''

సెనేట్ సభ్యులలో ఒక మార్పు వచ్చింది. ఆ మార్పు కంటి కగుపించకపోవచ్చు. కాని అది రావడంమాత్రం నిజం. వాళ్లు మరోమాదిరిగా వింటున్నారు. ఆ వినడంలో మరింత ఆసక్తి, ద్వేషం కనిపించుతున్నాయి. బిగుసుకుపోయి కూచున్నారు. ఆ క్షణం గ్రాఛూస్‌కు మరుపురాదు. ఆ క్షణమే స్పార్టకస్‌ను హాల్లోకి తీసుకొచ్చింది. ఆ క్షణమే అంతక్రితం లేని స్పార్టకస్‌ను, ప్రపంచాన్ని ఊపిపారేసిన స్పార్టకస్‌ను వాళ్ళకి పరిచయం చేసింది. ఎక్కడివా డీ స్పార్టకస్. చాలామంది కో మూలం అంటూ ఏడుస్తుంది. ఒక చరిత్ర ఉంటుంది. ఒక ప్రారంభం ఉంటుంది. ఒక స్థలం, ఒక దేశం, యేదో ఒకటుంటుంది. కాని స్పార్టకస్ కివేంలేవు. చావగా మిగిలిన ఒక సైనికుడి పెదవులపై పుట్టే డీ స్పార్టకస్. ఆ సైనికుడ్ని చావకుండా చేసినదీ, చూసినదీ కూడా ఆ స్పార్టకస్సే. అతను బ్రతికితే సెనేట్‌వద్దకు పోయి ఆ స్పార్టకస్ అంటే యిల్లాంటివాడు, ఫలానా అని చెప్పడానికి వీలౌతుంది. అతనో బ్రహ్మరాక్షసి కాడు. మహోద్రగ భయంకర స్వరూపుడుకాడు. మామూలు బానిస. కాని తను చూసిన దేదో ఒకటుంది. అది సవిస్తరంగా చెప్పాలి—

''—ఆ ముఖం నాకో గొఱ్ఱె ముఖాన్ని జ్ఞప్తికి తెచ్చింది. ఒక చొక్కా తొడుక్కున్నాడతను. బరువైన ఇత్తడి బెల్టూ, ఎత్తయిన బూట్లూ ఉన్నాయి. కవచం, శిరస్త్రాణం లేవు. అతని చొక్కామీద రక్తం మచ్చలున్నాయి. ఒకసారి చూస్తే అతని ముఖం మరిచిపోలేం. నా కతన్ని చూస్తే భయమేసింది. తక్కినవాళ్ళని చూస్తే భయంలేదుకాని యితనంటేనే నాకు భయం.''

''అతి నో థ్రేషియన్ అని నీ కెల్లా తెలుసు?''

''అతని మాటలనుబట్టి అనుకున్నా. థ్రేషియన్లు మాట్లాడుకోగా నేను పూర్వం చాలామాట్లు విన్నాను. అతను ల్యాటిను సరిగ్గా మాట్లాడలేదు. ఆ ఆరుగురిలోనూ

మరో థ్రేషియన్‌కూడా ఉన్నాడు. మిగతావాళ్ళు గాల్‌లు. నావైపు వాళ్ళు చూసేరంతే. తతిమ్మావాళ్ళలా నేకూడా చస్తే బాగుండుననిపించింది నాకు. డేరాలో శవాల్ని బైట పారేసేరు. వరీనియస్ గ్లాబ్రూస్ తాలూకు కవచం వగైరా అన్నీ తీసి మంచంమీద పెట్టేరు. అందులో యీ అధికారదండం కూడా ఉంది. ఆ మంచంమీద వున్న వస్తువు లను వాళ్ళు చూస్తూ నిలబడ్డారు. సేనాని కత్తిని వాళ్ళంతాచూసి అందరికీ చూపించారు. దానికి నగిషీ చెక్కిన దంతపుపిడి ఉంది. చూసి మంచంమీద పడేసేరు. అప్పుడా దండాన్ని పరిశీలనగా చూసేరు. పగిలిన ముక్కున్న మనిషి—స్పార్టకస్ అతని పేరు — ఆ దండాన్ని పట్టుకుని నాకు చూపిస్తూ నన్నడిగేడు. "రోమన్, ఇదేమిటో నీకు తెలుసా?" అది సర్వోత్కృష్టమైన రోమన్ సెనేట్ తాలూకు హస్తం అన్నా న్నేను. వాళ్ళ కేమీ తెలియదు. అప్పుడు బోధపడేలా చెప్పేను. స్పార్టకస్, ఎఱ్ఱని తల గల గాల్ ఆ మంచంమీద కూచున్నారు. తక్కిన నలుగురూ నిలబడిఉన్నారు. చేతుల్లో గడ్డం పెట్టుకుని, మోకాళ్ళమీద మోచేతులాన్చి అదేపనిగా నన్ను చూస్తూ కూచున్నాడు స్పార్టకస్. పాము చూసినట్లు చూసేడతను. నే చెప్పినదంతా విన్నారు. ఏమీ మాట్లాడ లేదు. స్పార్టకస్ మాత్రం నన్ను అదేపనిగా చూస్తున్నాడు. నాకు చెమట్లుకమ్మేయి. ఈ చూడ్డం అంతా నన్ను చంపెయ్యడానికేమో అనిపించింది. అప్పు డతనే తన పేరు చెప్పేడు. నా పేరు స్పార్టకస్. రోమన్! జ్ఞాపకముంచుకో. నా పేరు స్పార్టకస్. అతనింకా అన్నాడు. నిన్న మీ రా ముగ్గురు బానిసలనూ యెందుకు చంపేరు రోమన్? ఆ బానిసలు మీ కేం హానిచెయ్యలేదే. కవాతుచేస్తున్న సైనికుల్ని చూడ్డానికి వచ్చా రంతే. అదేనా వాళ్ళు చేసిన తప్పు. రోమనుస్త్రీలు సైనికులకు దొరకనంత శీలవతు లనా మీరంతా ఒక బీద బానిసస్త్రీని చెరచారు? ఏం ఎందుకల్లా చేసేరు రోమన్? ఏం జరిగిందో చెప్పడానికి ప్రయత్నించాను. రెండో పటాలంలోనివాళ్ళే ఆమెను చెఱచి, ఆ ముగ్గుర్నీ చంపేరని చెప్పేను. నేను మూడో పటాలంవాడిననీ, నాకేమీ తెలియదనీ కూడా చెప్పేను. ఆ ముగ్గురు బానిసలనూ చంపినప్పుడు మేం తప్ప ఆ చుట్టుపక్కల మరెవరూ లేరు. కాని వీళ్ళకెల్లా తెలిసిందో నాకు బోధపడలేదు. మేం చేసిన ప్రతిపనీ వాళ్ళకు తెలుసు. మేం కేపువాకు యెప్పుడు వచ్చామో, అక్కడినుండి ఎప్పుడు బయలుదేరేమో అన్నీ వాళ్ళకు తెలుసు. ఇదంతా అతని పాము కళ్ళల్లో, మిటక రించని ఆ కళ్ళల్లో ఉంది. ఇదంతా అతని గొంతులో ఉంది. అత నా గొంతు నెప్పుడూ హెచ్చించడు. ఒక కుఱ్ఱాడితో మాట్లాడినట్లు మాట్లాడ్డం మొదలెట్టాడు నాతో. నేనా, నే నల్లాటివాటికి మోసపోను. అత నో హంతకుడు. అదీ అతని కళ్ళల్లో కనిపిస్తుంది. మల్లులంటే హంతకులే. ఆ రాత్రి వాళ్ళు చంపిన ఫక్కీలో,

అంత దారుణంగా మల్లులు తప్ప మరెవరు చంపగలరు? నాకు తెలుసు కొందరు మల్లులు—"

గ్రాఛూస్ గొంతు అభ్యంతరం చెప్పింది. సైనికుడు తన మాటల ప్రవాహంలో పడి తానే కొట్టుకుపోతున్నాడు. దేవుడు పూనినవాడి పద్ధతిలో ఉన్నాడు. గ్రాఛూస్ కొంచెం నిశితంగానే అన్నాడు.

"నీ కేమేం తెలుసో వాటన్నిటియందు మాకు ఆసక్తిలేదు. తెలుసా? నీకూ, ఆ బానిసలకూ మధ్య జరిగిందేదో అదే మాక్కావాలి."

"జరిగిందిది" మొదలుపెట్టినవెంటనే ఆగేడు సైనికుడు. నిద్రపోతూ అప్పుడే కళ్ళు తెరిచినవాడిలా చూసేడు బలవత్తరమైన ఆ రోమను సెనేటువైపు. వణికేడు. చెప్పుకొనిపోయాడు.

"వాళ్ళేం చెయ్యదలచుకున్నారో, వాళ్ళే చేస్తారుకదా అని ఊరుకున్నా. అక్కడ కూచున్నాడు స్పార్టకస్. ఈ దండం అతని చేతిలో ఉంది. దాని పొడూవునా వేళ్ళతో రాస్తున్నాడు. ఇంతలో దాన్ని నా మీదకు విసిరిపారేశాడు. అతని ఉద్దేశ్యమేమిటో, అత నేం చెయ్యదలచుకున్నాడో నాకేంతెలియలేదు. తీసుకో దాన్ని, సైనికుడా తీసుకో. రోమన్, తీసుకో. నేను తీసుకున్నాను. ఇప్పుడు నువ్వు ఉత్కృష్టమైన సెనేట్ తాలూకు హస్తానివి అన్నాడతను. ఏమీ కోపంగా లేడు. ఎప్పుడూ బిగ్గరగా మాట్లాడనూలేదు. ఇదంతా యేదో మామూలు విషయంలా తోచిందతనికి. అందుకే యధాలాపంగా మాట్లాడేసేడు. నే నా పరిస్థితుల్లో అసహాయుడిని. చెయ్యగలిగిందేమీ లేదు. లేకపోతే, యీ పవిత్రమైన రాజదండాన్ని తాకిన నేను చావనూ? అసలు ముట్టక పోదును. నే నో రోమనువాడ్ని, ఒక పౌరుడిని—"

"అది ముట్టుకున్నందుకు నిన్నెవరూ శిక్షించరులే" గ్రాఛూస్ హామీ యిచ్చాడు.

"ఊఁ చెప్పు."

"ఇప్పుడు నువ్వు ఉత్కృష్టమైన రోమన్ సెనేట్ హస్తానివి. మళ్ళీ, అన్నాడు స్పార్టకస్. ఈ ఘనమైన రోమన్ సెనేట్‌కు చాలా పొడుగాటి హస్తమే ఉంది. ఆ హస్తానికి చివర మిగిలిందల్లా నువ్వు. నే నా దండాన్ని పుచ్చుకున్నాను. అక్కడ కూచుని అతను నాకేసి అల్లాగే చూస్తున్నాడు. "నువ్వో పౌరుడవేనా రోమన్?" ఔనన్నాను నేను. తలఊపి కొద్దిగా నవ్వేడు. "నీకో సందేశం యిస్తా, ప్రతిమాటా నేనెల్లా చెప్తే అల్లా చెప్పు వాళ్ళకి అన్నాడతను. అని ఆగేడు." సైనికుడు చెప్పడం ఆపేడు. సెనేట్ వినడం ఆపింది. గ్రాఛూస్‌కూడా ఆగేడు. ఒక బానిస యిచ్చిన

సందేశం యేమిటని నోరువిడిచి అడగడం అతనికిష్టంలేదు. కాని వినాలి. ఆ సందేశం తాము వినవల్సిందే: ఎక్కడనుంచో ఊడిపడ్డా డీ స్పార్టకస్—ఇప్పు డీ సెనేట్ హాలులో నిలబడ్డాడు. గ్రాఘాస్ అతన్ని చూసేడు; ఇక ముందెన్నోమార్లు చూస్తాడు. చూచిన వాళ్ళు చెప్పగా విని చూస్తాడేకాని ప్రత్యక్షంగా కాదు. కొంతసేపయాక గ్రాఘాస్ సైనికుడిని మాట్లాడమన్నాడు.

"మాట్లాడలేను."

"నిన్ను మాట్లాడమని సెనేట్ ఆజ్ఞాపిస్తోంది."

"అవి ఒక బానిస మాట్లాడిన మాటలు. నాకు నోరెల్లా తిరుగుతుంది...."

"చాలోయ్, చాలు" గ్రాఘాస్ అన్నాడు. "ఆ బానిస మాతో యేం చెప్పమని చెప్పేడో చెప్పు."

స్పార్టకస్ చెప్పిన మాట లాసైనికుడు చెప్పేడు. అన్ని సంవత్సరాలు గడచిన పిమ్మట గ్రాఘాస్ జ్ఞాపకముంచుకున్నంతమటుకు అతను చెప్పినమాటలివి. ఆ మాటలు జ్ఞప్తికి తెచ్చుకున్నప్పుడల్లా గ్రాఘాస్ కో దృశ్యం అగుపించేది. నీలంచారలూ, పసుపు పచ్చని చారలూ ఉన్న పెద్దడేరా, అది రోమన్ సేనానిది. సేనాని మంచంమీద స్పార్టకస్ కూచుని ఉంటాడు. అతనిచుట్టూ సైనికోద్యోగులైన మల్లులుంటారు. అతని కెదురుగా, భయకంపిత గాత్రుడై, క్షతగాత్రుడై, అంతా చావగా మిగిలిన ఒకే ఒక్క రోమన్ సైనికుడు సెనేట్ హస్తాన్ని, అంటే అధికారదండాన్ని పట్టుకొని యిద్దరు బానిసలు తన్నిరువైపులా పట్టుకోగా నిస్సహాయుడై నిలబడి ఉంటాడు.

"సెనేట్ వద్దకు తిరిగివెళ్ళు (స్పార్టకస్ చెప్పాడు). ఈ దంతపు దండాన్ని వాళ్ళకియ్యి. నేను నిన్ను రాయబారిని చేస్తున్నా; ఇక్కడ చూసిందంతా చెప్పు. వాళ్లు మా మీదకు పటాలాలు పంపేరనీ, వాటిని మేం నాశనం చేసేమనీ చెప్పు. చెప్పు వాళ్ళకి మేం బానిసలమని; మాట్లాడగల పనిముట్లని; గొంతుగల పరికరాలని. మా కంఠస్వరాన్ని వాళ్ళకు వినిపించు. వాళ్ళతో యీ ప్రపంచం విసిగిపోయిందనీ, యీ ఛండాలపు రోమ్, యీ సెనేట్ వీటితో - ప్రపంచం విసిగిపోయిందని మే మన్నామనీ చెప్పు. కొరడాదెబ్బల సంగీతం విని యీ ప్రపంచం విసిగిపోయిందనికూడా చెప్పు. ఉన్నతమైన రోమన్‌లకు ఆ పాట ఒక్కటే తెలుసు. ఆ పాట యిక మే మెప్పుడూ వినదలుచుకోలేదు. వినం. ఆదిమానవులందరూ ఒకలాగే ఉండేవారు. వాళ్ళు శాంతియుతంగా జీవించేవారు. వాళ్ళకున్న ఆస్తి నంతటినీ సమిష్టి ఆస్తిగా పరిగణించేవారు. కాని యిప్పుడు రెండు వర్గాలున్నాయి. రెండురకాల ప్రజ

లున్నారు. ఒకరు బానిసలు, వేరొకరు యజమానులు. మీ యజమానుల సంఖ్యకన్న మేం వెయ్యివేల రెట్లధికం. మేం మీకన్న బలవంతులం. మీకన్న బాగా నయం. మానవులలోని మంచి అంతా మా సొత్తు. మా స్త్రీలను మేం గౌరవిస్తాం. వారిసరసన నిలిచి దుర్మార్గాన్ని ప్రతిఘటిస్తాం. కాని మీరో? మీ స్త్రీలను మీరు కులటలుగా తయారు చేస్తారు. మా స్త్రీలను జంతువులుగా చూస్తారు. మా పసిపాపలను మీ రపహరించి నపుడు మేం దుఃఖంతో క్రుంగిపోతాం. ఏడుస్తాం. వాళ్ళని గొఱ్ఱెలమందలలో దాస్తాం. కాని మీరు మీ పిల్లల్ని జంతువులను పెంచినట్లు పెంచుతారు. మా బానిస స్త్రీలవల్ల మీకు కల్గినపిల్లలను మీరు బజారులో యెవ డెక్కువ ధరయిస్తే వాడికి విక్రయిస్తారు. మీరు మనుష్యులను కుక్కల్ని చూసినట్లు చూస్తారు. మీ నీచమైన ఆనందంకోసం రంగస్థలాలలో ఒకరి నొకరు పొడుచుకునేలా చేస్తారు. మీ స్త్రీలు మేం చంపుకొం టుంటే, మేం దిశమొలతో నిలబడితే వింత చూస్తారు వింత! కుక్కపిల్లల్ని తొడ మీద పడుకోబెట్టుకుని బిస్కట్టుముక్కలు తినిపిస్తూ మానవ మారణహోమాన్ని చూస్తారు మీ కులకాంతలు. ఎంత నీచులు మీరు ఎంత ఏహ్యమైనవాళ్ళు మీరు. మానవ జీవితాన్ని యెంత కలుషితం చేసేసేరు మీరు. మానవుడు కలలుకనే నిర్మాణాత్మక కృషినిసల్పే మానవ హస్తాలను, వారి నుదుటి చెమటను, వారి జీవస్రవంతి అయిన రక్తాన్ని మీరు వేళాకోళంగా, వెక్కిరింతగా తయారుచేసేరు. మీ పౌరులు, ప్రభుత్వం పెట్టే భిక్ష తిని, బ్రతికి రంగస్థలాలలో యెల్లవేళలా పడిగాపులు గాస్తారు. జీవితాన్ని అకటావికటంగా తయారుచేసి దాని విలువను నాశనం చేసేరే మీరు. చంపడంకోసమే చంపేస్వభావం మీది. పెద్దమనిషి తరహాతో, నాగరికంగా కనిపించే మీ ఆనందం యేమిటి? కారే రక్తప్రవాహాన్ని చూడడం. చంటిపిల్లలచేత గనుల్లో పనిచేయించి ఆ పసికందుల్ని చిన్నతనంలోనే చంపుతారు. ప్రపంచాన్ని దోపిడిచేసే గజదొంగలై మీరీ వైభవాన్ని సమకూర్చుకున్నారు. సరి; అంతే. మీరంతేనని మీ సెనేట్‌కు చెప్పు. ఇది వాగగల పనిముట్టు చెప్పినమాటలని చెప్పు. వాళ్ళ సైన్యాలను మా మీదకు పంపమనీ, ఆ పంపిన సైన్యాలను మేం ధ్వంసంచేసి పారేస్తామనీ, ఆ సైన్యాల ఆయుధాలనే మేం తీసుకొని, మీ ఆయుధాలతో మిమ్మల్నే చంపుతామనీ చెప్పు మీ సెనేటుతో. ఈ ప్రపంచమంతా యీ మాట్లాడగల పనిముట్టు చెప్పిన మాటలను వింటుంది. మేమో పిలుపు యిస్తాం. బానిసలంతా లేవండి! లేచి మీ గొలుసులను తెంచుకోండి! ఇటలీ అంతా తిరుగుతాం. మే మెక్కడికి వెడితే అక్కడ బానిసలు మాతో చేరతారు. అప్పు డొక రోజున మీ ఆద్యంత రహితమైనపట్నంమీద పడతాం. అప్పు డది ఆద్యంత రహితం కాకుండాపోతుంది. ఆ సంగతి కూడా సెనేటుకు చెప్పు. అప్పుడు మేం రోమ్

గోడలు బ్రద్దలు చేస్తాం. అప్పుడు మీ సెనేట్ సమావేశాలు జరిగే భవనానికి వస్తాం. అక్కడ ఉన్నత స్థానాలలో కూచునే గౌరవనీయులైన సెనేట్ సభ్యుల్ని యీడ్చి పారేస్తాం. వాళ్ళదుస్తు లూడతీస్తాం. విచారణ చేసేటప్పుడు మల్లుల్ని యెల్లా దిగంబరులుగా నిలబెట్టి విచారణ చేసేవారో అల్లాగే చేస్తాం. వాళ్ళకు ముట్టవలసిన న్యాయాల్ని, మాకు వాళ్ళిచ్చిన న్యాయానికి ప్రతిఫలాన్ని వాళ్ళకు ముట్టచెప్తాం. వాళ్ళు చేసిన ప్రతినేరానికీ వాళ్ళు సమాధానం చెప్పుకోవాలి. ఇవన్నీ వాళ్ళకు ముందుగానే చెప్తే, వాళ్ళు దీనంతకూ సంసిద్ధులౌతారు. వాళ్ళని వాళ్ళొకమారు ఆత్మపరీక్ష చేసు కొంటారు. అప్పుడు, న్యాయం జరిగిన పిమ్మట, మేం యింతకన్న మంచి నగరాలను నిర్మిస్తాం. అందమైన, శుభ్రమైన పట్నాలను నిర్మిస్తాం. ఆ పట్నాలచుట్టూ గోడ లుండవు; ఎక్కడ మానవులు హాయిగా, శాంతియుతంగా జీవిస్తారో అక్కడ ప్రహరీ గోడ లనవసరం. ఇదే మా సందేశం ఇది వాళ్ళతో చెప్పు. ఇదంతా స్పార్టకస్ అనే ఒక బానిస చెప్పాడనికూడా చెప్పు....''

అలాగే ఒకలాగున చెప్పే డా సైనికుడు. ఇది చెప్పి యెంతో కాల మయింది అనుకున్నాడు గ్రాఘూస్. సెనేట్ యిదంతా వింది. శిలాప్రతిమలలా కూచుని యిదంతా విన్నారు వాళ్ళు. కాని ఇదంతా యెంతో కాలంక్రితం, చాలా కాలం క్రితం. దాన్లో చాలామటుకు అంతా మరచిపోయారు. స్పార్టకస్ మాట్లా డిన మాటలు వ్రాసినవా డెవడూ లేడు. ఏ కొద్దిమంది స్మృతిపథంలోనో వున్నా యవి. సెనేట్ రికార్డుల్లోంచి ఆ మాటలు తుడిచివేసేరు. తీసిపారేసేరు. అది రైటే. అది న్యాయమే. బానిసలు ప్రతిష్ఠించిన స్మృతిచిహ్నాలను ధ్వంసం చెయ్యడం యెంత న్యాయమో, అల్లాగే వాళ్ళ నాయకుడు స్పార్టకస్ మాటల్ని రికార్డుల్లోంచి తుడిచిపారేయడం కూడా అంతే. క్రాసస్ మూర్ఖుడు కావచ్చు. కాని ఇది మాత్రం అర్థం చేసుకోగలిగేడు. కాక, కొద్దిపాటి మూర్ఖత్వం లేకపోతే సేనాని కావడం యేలాగ? స్పార్టకస్‌ను మినహాయిస్తే. తనూ ఒక గొప్ప సేనానాయకుడే. అయితే స్పార్టకస్ కూడా మూర్ఖుడేనా? ఆ మాటలు మూర్ఖుని మాటలేనా? అయితే ఒక మూర్ఖుడు నాల్గేళ్ళపాటు యేకాగ్రంగా రోమను సైన్యాల నెలా నాశనం చేయ గలడు? ఇటలీని, రోమను సైన్యాలకు స్మశానవాటికగా యెల్లా తయారుచేయ గలడు? అతను చచ్చిపోయాడంటారు. మరి కొందరంటారు మృతజీవు లున్నారని, చచ్చి బ్రతికినవాళ్ళు కూడా వున్నారని. ఇదే నేమిటి స్పార్టకస్ స్వరూపం? గ్రాఘూస్ వైపు నడిచివస్తోంది. త్రోవలోని గోడలనూ, వస్తువులన్నిటినీ లెక్కచేయకుండా వస్తోంది. బ్రహ్మ రాక్షసి అంతటి మనిషి. అయినా సరే అల్లాగే వున్నాడు. ఆ

పగిలిన ముక్కు, నల్లని కళ్ళు, అంటకత్తెర జుట్టు, అతనేనా? అతని విశ్వరూపమేనా?

"చచ్చిపోయినవాళ్ళు నడుస్తారా?"

# 7

"ముసలి గ్రాఘాస్ చూడు" బరువైన తలముందుకు వేలాడుతోంది. కూచున్నాడు గ్రాఘాస్. అతన్ని చూసి ఆంటోనియస్ కైయస్ నవ్వుతూ అన్నాడు. గ్రాఘాస్ యీ లోకంలో లేనివాడిలా కూచున్నా, చేతిలోని పాత్రనుమాత్రం జాగ్రత్తగా పట్టుకున్నాడు. అందులోని ఒక చుక్కనీరు కూడా తొణికి కిందపడలేదు.

"అత న్నేమీ వేళాకోళం చెయ్యకండి!" జూలియా అంది.

"గ్రాఘాస్‌ను చూసి యెవరూ నవ్వలేదే! నా జీవితమంతా అటువంటి హోదా కోసమే ప్రయత్నిస్తా" అని సిసిరో చెప్పేడు.

'ఆ ప్రయత్నంలో యెప్పుడూ వెనకబడుతూనే వుంటావులే' అనుకుంది హెలీనా.

కళ్ళు మిటకరిస్తూ లేచాడు గ్రాఘాస్. "నేను నిద్రపోతున్నానా?" ఏం మాట్లాడినా అతను జూలియాకేసి తిరిగి ఆమెకోసమే అన్నట్లు మాట్లాడుతాడు. అది అతని అలవాటు. "జూలియా, నన్ను క్షమించాలి. పగటికలలు కంటున్నాన్నేను."

"పోనీ ఆ కలలు మంచివేనా?"

"ఓ మంచివే. జ్ఞాపకశక్తి మనిషి కీయబడ్డవరం అని యెవరేనా అంటే నేను ఒప్పుకోలేను. నా ఉద్దేశ్యంలో అదొక శాపం. పైగా నాకు తెగబోలెడు జ్ఞాపకాలు."

"అందరికంటె నీ కేమీ యెక్కువ జ్ఞాపకాలు లేవులే? ప్రతివాళ్ళకీ వుంటాయవి అంతే; అందులోనూ విచారకరంగా వుండేవి మరీ జ్ఞాపకముంటాయి" క్రాసస్ అన్నాడు.

"అయితే అవెప్పుడూ సంతోషంగా వుండవా!" క్లాడియా ప్రశ్నించింది.

"నీ గురించి నేనెల్లా జ్ఞాపకముంచుకుంటానో తెలుసా. సూర్యకాంతిలా నిన్ను జ్ఞాపకముంచుకుంటాను చచ్చిపోయేదాకా. ఈ మాట అన్నందుకు యేమీ అనుకోకు. యేదో ముసలాడ్ని" గ్రాఘాస్ సహజధోరణిలో గట్టిగా మాట్లాడుతున్నాడు.

"ముసలాడినే అన్నమాటేమిటి? పడుచువాళ్ళు ఆమె నా మాటన్నా యేమీ అనుకోని సహృదయం ఆమెది?" ఆంటోనియస్ కైయస్ చిరునవ్వు నవ్వుతూ అన్నాడు.

"నువ్వు కునికిపాట్లుపడుతుంటే మేమీ స్పా...." క్రాసస్ చెపుతున్నాడు.

"ఈ స్పార్టకస్ గొడవతప్ప యింకేమీ మాటాడుకోలేమా?" జూలియా గట్టిగా అంది. "యుద్ధం రాజకీయాలూ తప్ప, మరి మాట్లాడుకుందు కింకేమీ లేదా? నా కది అసహ్యం——"

"జూలియా;" మధ్యలోనే ఆమె వాగ్ధోరణి నాపేడు ఆంటోనియస్ కైయస్. ఆమె ఆగింది. బరువైనదేదో కష్టంగా దిగమింగుతున్నదానిలా ఆమె గుటక వేసింది. భర్తకేసి చూసింది. తనతో మాట్లాడేపద్ధతి అదేలాగుంది. చిన్న పిల్లల్ని కేకవేసినట్లు మాట్లాడేడు.

"జూలియా! క్రాసస్ మన అతిథి. పైగా యీయన చెప్తున్నన్ని విషయాలను మనం యింకెవరివల్లా తెలుసుకోలేం. ఆయన స్వయంగా చూసిన విషయాలవి. అదీ కాక యిక్కడ అందరికీ వినాలనే కుతూహలం ఉంది. జాగ్రత్తగా వింటే, నీకూ ఆసక్తి కలిగితీరుతుంది."

ఆమె ముఖం, కళ్లు యెఱ్ఱబడ్డాయి. లజ్జాభిమానాలు పొంగులువారేయి. కళ్ళల్లో నీళ్ళు తిరిగేయి. తలవంచుకు కూచుంది. క్రాసస్ మాత్రం క్షమాపణ వేడడంలో జాగ్రత్తపడ్డాడు.

"నీకు బాగా విసుగుపుట్టిస్తుంది జూలియా, నన్ను క్షమించాలి."

"జూలియాకుకూడా వినాలనే ఉంది. నాకు తెలుసు. ఏం లేదూ జూలియా? వినాలనిలేదా?" ఆంటోనియస్ కైయస్ అడిగేడు.

"నేనే తెలివితక్కువగా, బుర్రలేకుండా ప్రవర్తించాను" వల్లించిన పాఠం వప్పచెప్పినదానిలా అంది జూలియా. "దయచేసి చెప్పు."

అనుకోకుండా పాడవుతున్న పరిస్థితిని బాగుచేయడంకోసం గ్రాఛుస్ నడుం కట్టేడు. జూలియామీదకు మరింత విమర్శ రాకుండా చేయడానికి ఆంటోనియస్ కైయస్‌వైపు తిరిగి "ఈ విషయంలో యీయన భావం నేను సరిగ్గా ఉహించగలననుకుంటా; మానవజీవితంమీద గౌరవం అణుమాత్రమైనా లేనందునే బానిసలు యేవో కొన్ని యుద్ధాలు గెలిచారని యీయన వాదన. బానిసమూకలు అసంఖ్యాకంగా వచ్చి మనపీడపడబట్టి మనం మొదట్లో ఓడిపోయేమనికూడా యీయన అభిప్రాయం. ఔనా? ఏమంటారు?" అన్నాడు.

"అనటానికి ఏముంది? ఇంతకన్న మరెవరూ తప్పుగా ఊహించలేరనుకుంటా. ఎవరిదాకానో యెందుకు, మీరే యింతకన్న తప్పుగా కావాలనుకున్నా వూహించలేరు" హెలీనా నవ్వింది.

తనను వాళ్ళు పరిహాసంపాలు చేసినా అత నేమీ అనుకోలేదు. "గ్రాఘూస్! నే నల్లాగే అనుమాన పడుతూ వచ్చా. నీవంటి ఘనమైన ప్రచారకులు అటువంటి విషయాలనే నమ్మాలి మరి" అని సిసిరో అన్న మాటలను కూడా, గ్రాఘూస్ సహించాడు.

"కొంతమటుకు" గ్రాఘూస్ సహనంతో ఒప్పుకున్నాడు. "రోమ్ యెందుకు గొప్పది? రోమ్ జీవించి ఉంది కనుక. స్పార్టకస్ అసహ్యించుకోతగ్గవాడు. అదెందుకు? స్పార్టకస్ గురించి ఆ శిక్షచిహ్నాలు తప్ప మరేమీ మిగలలేదుగనుక. ఆ విషయాలు దృష్టిలో ఉంచుకోవాలి. ఏమంటావ్ క్రాసస్?"

తల పంకించాడు క్రాసస్. "కాని" అని అందుకున్నాడు సిసిరో. "కాని స్పార్టకస్ ఐదు యుద్ధాలలో గెలిచాడే. మన పట్నం పటాలాలను ఓడించిన సంఘటన లెక్కచేకాదు. బ్రహ్మాండమైన కాన్సలర్ సైన్యాల నతడు జయించి, నాశనంచేసి, వాటి ఆయుధాలను లాక్కుని నిర్మూలం గావించిన ఐదు పెద్దయుద్ధాల గురించి నే మాట్లాడుతున్నా. క్రాసస్ అనవచ్చు: యీ స్పార్టకస్ అనేవాడు యేదో ఒక మురాకు అదృష్టంకొద్దీ నాయకుడైనవాడేగాని, వాడికి వ్యూహ రచనానైపుణ్యమనేదే లేదని. మొదట్లో బానిస లపజయం పొందకపోవడానికి కారణం వాళ్ళకా సదవకాశం లభించక పోబట్టే అంటారు కదూ? ఏం క్రాసస్?"

"కొంతమటుకు" అని అంగీకారం తెలిపేడు క్రాసస్. అతను జూలియాకేసి తిరిగి చిరునవ్వు నవ్వేడు. "జూలియా! నువ్వనుమతిస్తే ఆసక్తికల్గించే ఒక చిన్న దృష్టాంతం చెప్తా. కొంత యుద్ధం, కొంత రాజకీయాలు, కొంత వరీనియా గురించి. ఆమె స్పార్టకస్ తాలూకుమనిషి; నీకు తెలుసుగా."

"తెలుసు."

"నాకు తెలుసు" జూలియా మృదువుగా అంది. తన కేదో భారం తగ్గించి నందుకు కృతజ్ఞతతో గ్రాఘూస్వైపు చూసింది. "నాకు తెలుసు" గ్రాఘూస్ అనుకున్నాడు. "నాకు తెలుసు జూలియా. మనిద్దరం కొంచం విచారంగా, అదో మాదిరిగా కనిపిస్తుంటాం అందరికీ. నీకూ, నాకూ ఉన్న ప్రధానమైన తేడా యేమంటే నువ్వాడదానివి, నేను మొగాడ్ని. అంతే. నువ్వు పెద్ద గొప్పదానివి కావనుకో. కాని మొత్తం మీద మనిద్దరం అంతే. ఒకే రకమైన విషాదంతో నిండిన జీవితాలు మనవి. మనిద్దరమూ దెయ్యాలను ప్రేమిస్తాం. ఎందుకని? మానవులను ప్రేమించడం కానీ, మానవులచేత ప్రేమించబడడం కాని మనిద్దరకూ తెలియదు గనుక."

"వరీనియా గురించి యెవడో కోసేస్తున్నాడని నా నమ్మకం" క్లాడియా అల్లా అంటుందని ఎవరూ అనుకోలేదు.

"ఏం? ఎందుచేత అల్లా అనుకుంటున్నావు?"

"అటువంటి స్త్రీ యెక్కడా వుండదు కాబట్టి, ఏది నిజమో, యేది అబద్ధమో చెప్పడం చాలా కష్టం. నేనొక దాడిలో పాల్గొన్నాను. ఆ తరువాత కొంతకాలానికి ఆ దాడిగురించే వ్రాసినదాన్ని చూసేను. జరిగినదానికీ, వ్రాసినదానికీ యేకోశానా పొందిక లేదంటే నమ్మండి. నేను పాల్గొన్న దాడి అదేనా అని ఆశ్చర్యపోయా. అన్నీ అల్లాగే వుంటాయి. దీన్లో కూడా నిజం వుందని హామీ యివ్వనుకాని, నమ్మడానికి తగ్గ కారణాలు లేకపోలేదు. నేను నమ్మేను కూడా."

అతని గొంతు వింతైన స్వరాలు పలికింది. అతని ముఖంలోకి చూసింది హెలీనా. చూసి అతని అందానికి ముగ్ధురాలైపోయింది. ఉదయం ఆ యెండలో, డాబా మీద కూచున్న క్రాసస్ ముఖం, బలమైన, అందమైన ముఖం పురాణ గాథలలోని యౌవనకాలంనాటి రోమను శ్రేయోరాజ్యాన్ని స్ఫురింపచేసింది. ఎందుకోగాని యీ ఆలోచన ఆమెలో సంతోషం కలిగించలేదు. తన అన్నవైపు చూసింది. ఆనందపరవశత్వంతో, భక్తిప్రపత్తులతో కైయస్ కళ్ళు వప్పగించి క్రాసస్‌వైపు చూస్తున్నాడు. ఇది తక్కినవాళ్ళు కనిపెట్టలేకపోయారు. క్రాసస్ అంతసులభంగా యితరుల ఆసక్తిని ఆకర్షించగలడు. నెమ్మదిగా, నిజాయితీ ధ్వనించే గొంతుకతో అతను మాట్లాడతాడు. శ్రోతలందరినీ తన గుప్పిట్లో ఉంచుకోగలడు. సిసిరోలాటివాడు కూడా యితని వ్యక్తిత్వాన్ని గుర్తించాల్సి వచ్చింది. ఇదివఱకు తనకనిపించినట్లే ఇప్పుడు కూడా, క్రాసస్ తానావేశపూరితుడుకాకుండా యితరులలో ఆవేశాన్ని రేకెత్తించగల నేర్పరి అని తోచింది.

"దీనికి ఉపోద్ఘాతంగా సర్వసాధారణమైన ఒక విషయం చెప్తా" క్రాసస్ ఉపక్రమించాడు. "సేనాధిపత్యం నా కంటగట్టేసరికే చాలా సంవత్సరాలనుంచి యుద్ధం కొనసాగుతోంది. మరొక వైద్యుడు మందిచ్చి పెదవి విరిచిన రోగికి చికిత్స చెయ్యడం యెటువంటిదో, అల్లాగే ఒకడి నాయకత్వంలో ఓడిపోతున్న సైన్యాలకు మరొకడు వచ్చి నాయకత్వం వహించి నడపడం కష్టం. దానికితోడు ఈ బానిస యుద్ధాలలో పాల్గొనడంవల్ల కీర్తిరాదు సరికదా ఓటమి కనుక సంభవిస్తే తలమీద వెంట్రుక లుంచరు. కాదు మరి? ఎంత సిగ్గుచేటు! స్పార్టకస్ చేతిలో ఐదు బ్రహ్మాండమైన సేనలు నాశనమయాయి. నాశనంలోనూ సర్వనాశనమయాయి." గ్రాఖూస్ వైపు తిరిగి తలఊపేడు. "మీ ప్రచారమైతే కళ్లు కప్పగలిగినదే కాని నేను

మాత్రం పరిస్థితిని ముఖాముఖి ఎదుర్కోవలసి వచ్చింది. ఏమంటారు? ఒప్పుకుంటారా దీనికి?''

"దాన్లో సందేహం దేనికి?''

"అసంఖ్యాకములైన బానిసమూకలు నా కగుపించలేదు. నిజం చెప్పమంటారా? మన మెప్పుడూ సంఖ్యలో వాళ్ళకన్న హెచ్చుగానే ఉన్నాము. వాళ్లే తక్కువ. మొదట్లోనూ యిల్లాగే ఉంది. ఆఖరు యుద్ధంలో కూడా అంతే. అంతా అనుకున్నట్లే స్పార్టకస్ చేతికింద ముప్పైలక్షలమంది బానిసలే కనుక ఉండినట్లయితే యీ రోజున మనం చక్కగా యీ తోటలలో వెచ్చని యెండలో కూచుని కులాసాగా కబుర్లు చెప్పుకొనే పరిస్థితి కలుగకనే పోవును. స్పార్టకస్ రోమ్‌ను జయించి యుండును. రోమ్ ఒక్కటే అన్న మాటేమిటి? సమస్త ప్రపంచాన్నీ జయించును. ఈ విషయం కొందరు నమ్మకపోవచ్చు. నాకు యుద్ధంద్వారా స్పార్టకస్‌తో చెప్పుకోదగ్గ పరిచయముంది. అంటే మంచి అనుభవముంది నాకు. నాకు తెలుసు అతని బలాబలాలు, నా మాటల్లోని నిజానిజాలు. అసలు సంగతేమంటే యిటలీలోని బానిసలంతా అతనితో చేతులు కలపలేదు. వాళ్ళంతా ఆ స్పార్టకస్ తయారయిన మూసలోనే తయారయి ఉంటే, మనకన్న వందల, వేల రెట్లధికంగా ఉన్న బానిసలతోనిండిన యీ తోటలలో, పొలాలమధ్య యింత నిర్విచారంగా కూచోగలమా? చాలామంది అతనితో చేరేరేమో. కాని యెప్పుడూ అతని సైన్యం నలభై ఐదువేలకు మించలేదు. అదైనా అత నుచ్ఛస్థాయిలో ఉన్నప్పుడు మాత్రమే. హానిబాల్ కున్నట్లు అతనికి అశ్వికదళాలు లేవు. కాని యే రోమ్‌ఐతే హానిబాల్‌ని ఒక్కదెబ్బతో గిటడంచగలిగిందో అదే రోమ్‌ను స్పార్టకస్ ముప్పతిప్పలూపెట్టి మూడుచెఱువుల నీళ్ళు త్రాగించాడు. రోమ్‌ను మోకరిల్లేలా చేసేడు. అబ్బో! ఎంత గట్టివాళ్ళు, ఉక్కుతునకల్లాంటివాళ్ళు, ఎంత భయంకరమైన వాళ్ళు, సాహసులూ స్పార్టకస్‌తో చేరేరని.''

"ఇదంతా నేను స్వయంగా తెలుసుకోవలసివచ్చింది. రోమ్‌ను చూస్తే నాకు సిగ్గేసింది. బానిసలు కల్పించిన యీ భయభ్రాంతులలో తలమునకలుగా పడిపోయి రోమ్ భీతాహ సముద్రంలో యే లోతులోనో ఉండిపోయింది. నాకు యథార్థం కావాలి. నా క్కావాల్సిందల్లా నే నే శక్తితో పోరాడుతున్నదీ, ఏ సైన్యంతో, యే మనిషితో అన్న విషయాలు. జర్మన్లను, స్పానియార్డులను, యూదులను ఒకరేమిటి యెన్నెన్నో జాతులను ఓడించి సర్వనాశనంచేసిన రోమన్‌బలాలు అవే జాతులకు చెందిన బానిసలను చూచేసరికి యీపెలు కిందపారేసి యెందుకు కాళ్ళకు బుద్ధిచెప్పేవారో కావాలి నాకు. సిస్ ఆల్పైన్ గాల్ అనేచోట మకాంవేసేను. ఒకటికి పదిసార్లాలోచిస్తేనేకాని

స్పార్టకస్ యీ మకాంమీద దాడిచెయ్యలేదు. సరే విషయపరిశీలన కుపక్రమించా. నాలో పెద్దసుగుణా లేవీ లేకపోవచ్చు. కాని పరిపూర్ణత ఒకటేడ్చిందిగా. ఈ స్పార్టకస్ గురించి తెలుసుకుందుకు ఓ వందమందితో మాట్లాడేను. వెయ్యిపైగా ప్రభుత్వ రికార్డులు తిరిగేసేను. నేను మాట్లాడిన వాళ్ళల్లో మల్లులనమ్మే బేటియాటస్ ఒకడు. స్పార్టకస్‌తో యింతక్రితం యెన్నోసార్లు పోరాడిన యెంతోమంది సైనికులతో, సైనికోద్యోగులతో మాటాడేను. అందులో యెవరో యీ కథ నాకు చెప్పేరు. దాన్ని నేను నమ్మేను."

"కథకూడా యీ ఉపోద్ఘాతంలాగానే చాలా పెద్దదైన పక్షంలో మన ఫలహారా లిక్కడికే తెప్పిస్తా" ఆంటోనియస్ కైయస్ అన్నాడు. అప్పటి కప్పుడే బానిసలు యీజిప్షియన్ కర్బూజాపళ్లూ, ద్రాక్షగుత్తులూ, చల్లని ద్రాక్షరసమూ, యేవేవో తెస్తు న్నారు. వాళ్లు కూచున్న చోటుకూడా చాలా అందంగా, హాయిగా, ఆనందంగా ఉంది. అందువల్లనే ఆనాడే పోదామని సంకల్పించుకున్న అతిథులలో పోదామన్న తొందర పోనేపోయింది. ఆ దృశ్యాలూ, ఆ రామణీయకతా వీళ్ళను కదలనీయలేదు.

"కథ పెద్దదే. కాని ధనాఢ్యు లేదైనా అన్నప్పుడు——"

"చెప్పు. చెప్పవయ్యా చెప్పు" అర్ధోక్తిలోనే ఆపి గ్రాఘూస్ అన్నాడు. "నాకు చెప్దామనే ఉంది, ఈ కథ జూలియా కోసం. ఏం జూలియా?"

ఆమె అంగీకారసూచకంగా తల ఊపింది. గ్రాఘూస్ తనలో అనుకున్నాడు - 'ఇతనేం లోతుగా విషయాలను పరిశీలన చెయ్యగలవాడిలా కనిపించడుకాని దాన్ని తగలెయ్య, యేమిటి చెప్మా వీడి ఉద్దేశ్యం?'

"ఇది రెండవసారిగా రోమను సైన్యాన్ని స్పార్టకస్ నాశనంచేసిన సందర్భం. మొదటిది మనందరికీ జ్ఞాపకముందనుకోండి. ఐనా గ్రాఘూస్‌కే అప్పటి విషయాలన్నీ వివరంగా తెలుసు. పట్నంలోని పటాలా లారింటిని పంపేమే అదీ." గ్రాఘూస్ నుద్దేశించి క్రాసస్ చెప్పిన యీ మాటలో యేదో అక్కసు జీరగా ఉంది. "దాని పని పూర్తి అయాక సెనేటు, ఫ్లూబియస్‌ను స్పార్టకస్‌మీదకు పంపేరు. పూర్తిగా ఒక అక్షోహిణి సైన్యం అనుకుంటాను నేను, గ్రాఘూస్ అది మన మూడవ అక్షోహిణీ కదూ?"

"పరిపూర్ణత, నీలోని సుగుణంగాని నాలోనిది కాదే?"

"నే చెప్పినది నిజమేనని నా ఉద్దేశ్యం. నే చెప్పినదే కనుక తప్పుకాకపోతే, దగ్గఱ యేడువేలమంది ఆశ్వికులున్న ఒక ఆశ్వికదళం కూడా పట్నంనుంచి వెళ్ళిందని నాకు జ్ఞాపకం. జూలియా! ఒకటిమాత్రం నమ్ము. ఈ యుద్ధాలలో యేమీ యింద్ర

జాలం లేదు. డబ్బు గడించాలన్నా, ఒక గజం గుడ్డ నెయ్యాలన్నా సేనానాయకుడి కుండవలసిన తెలివికన్న హెచ్చు తెలివితేటలే కావాలి. మన కళ్ళదగ్గరగా వచ్చి నిలబడే కారణాలు మనం కళ్ళువిప్పిజూస్తే చాలు తెలుస్తుంది. వాటిని వెతకడానికి యెంతో దూరం పోనక్కరలేదు. యుద్ధమే పనిగా పెట్టుకున్న సేనాను లనేకమంది ఉన్నారు. వాళ్ళేమంత పెద్ద తెలివైనవాళ్లు కారు. కాని స్పార్టకస్ మాత్రం చాలా తెలివైనవాడు. అతను యేవో కొన్ని యుద్ధశాస్త్ర సూత్రాలను మాత్రమే జీర్ణించు కున్నాడు. దానికితోడు రోమ్ తాలూకు శక్తీ, దాని బలహీనతా కూడా అర్థంచేసు కున్నాడు. మనకు అనేకమంది శత్రువులున్నారు. ఉండేవారు. కాని చాలా తక్కువ మంది యీ విషయాలను తెలుసుకోగలిగేవారు. హానిబాల్‌కుకూడా తెలుసు ననుకోండి; కాని చాలా తక్కువమంది. మన సమకాలికుడు పాంపీ - అతనికీ తెలుసు ననుకోను.''

"ఉత్కృష్టమైన యీ రహస్య విశేషాలను యింకా మేం చాలా వినాలా యేమిటి?'' సిసిరో అడిగేడు.

"అవేమీ ఉత్కృష్టమైనవీ కావు; పెద్ద రహస్యమైనవీ కావు. జూలియా కోసం చెప్తున్నాన్నేను. తెలుసుకోవాలనుకున్నవాళ్ళకి అవి అర్థంకాని అగాధమైన విషయాలనిపిస్తాయి. మొదటిసూత్రం: దెబ్బ తప్పించుకోనేటప్పుడు తప్ప మరెప్పుడూ సైన్యాలను చీల్చకపోవడం. రెండవది: పోరాడాలనుకున్నప్పుడు ఎదుటివాడికన్న ముందుగానే దెబ్బతీయాలన్నది, పోరాడాలని లేనప్పుడు యెప్పుడూ స్వీయరక్షణలో పడకూడదు. పోరాటాన్ని తప్పించుకోవాలి. మూడోది: మనకు నచ్చిన సమయం, అనువైన స్థలం చూసుకుని హఠాత్తుగా దాడి ప్రారంభించడం. శత్రువుకే యీ అవ కాశం కల్పించి అతనే దాడిచేసే పరిస్థితి రాకుండా చూసుకోవాలి. నాలుగోది: చక్ర బంధవ్యూహంలో పడిపోకుండా చూసుకోడం. ఆఖరుది: శత్రువు బలహీనతను గుర్తించి ఆ బలహీనమైన స్థానంమీదనే దెబ్బదీసి శత్రువును నాశనం చేయడం.''

"ఒక రకంగా యిదొక పెద్దబాలశిక్ష'' సిసిరో వ్యాఖ్యానించాడు. "ఏ సైనిక పుస్తకంలో చూసినా ఉంటా యివి. క్రాసస్! అందులో పెద్ద గంభీరమైన అగాధమైన జ్ఞానం యేదైనా ఉందీ? అతిసామాన్యమైన, సర్వసాధారణమైన విషయాలు.''

"అయితే అవచ్చుకాని సర్వసాధారణంగా కనబడేవాటిలోనే గంభీరతకు లోటు లేదని నేను నమ్మకంగా చెప్పగలను.''

"దీని అంతు చూద్దాము ఉండు. ఐతే క్రాసస్! రోమనుసైన్యాల బలమూ, బలహీనతా అన్నావే, ఏమిటవి?'' గ్రాఘూస్ అన్నాడు.

"ఇవన్నీ సర్వసాధారణమైన విషయాలే. తప్పకుండా సిసిరో నన్ను వ్యతిరే కిస్తాడనుకుంటా."

"గొప్ప రోమన్ సర్వసేనాని పాదాలముందు శిష్యరికాన్ని సంతోషంగా స్వీక రిస్తా" తేలికవిషయంగా కొట్టిపారేసేడు సిసిరో.

క్రాసస్ తల ఊపేడు. అతని ఆలోచనే వేరు. "అబ్బే అక్కర్లేదు లెండి. కాని రెండు విషయాలు చెయ్యడానికి మాత్రం మనుష్యులు పరిశీలనా, ప్రయత్నం లేకుండా సిద్ధపడతారు. పుస్తకం వ్రాయడం, సైన్యాల్ని నడపడం ఈ పనులు చెయ్యా డానికి ఇంతమంది వెర్రివెధవలు తయారవుతారేమిట్రా బాబూ అని ఆశ్చర్యపోతాం. కాని తయారవుతారు. నే నన్నదానికి మంచి ఋజువు వుంది. ఇదంతా నా గురించే లెండి. ఆ ఋజువు నేనే అనుకోండి." అవతలవాడింకేం మాట్లాడకుండా చేసేడు క్రాసస్.

"బలే! బాగుంది" అంది హెలీనా.

తలపంకించాడు క్రాసస్. అతనికి స్త్రీలగొడవ బాగా కావాలి. అల్లా అని వాళ్ళల్లో పెద్ద ఆసక్తి ఉండికాదు. ఏదేమయినా హెలీనా మాత్రం అతన్ని గురించి అల్లా అభిప్రాయపడింది. క్రాసస్ తిరిగి ప్రారంభించాడు.

"మన సైన్యాలనే బాగా చూడండి. వాటి బలమూ, బలహీనతా కూడా ఒక్క దానిలో యిమిడిఉన్నాయని చెప్పొచ్చు. అది వాటి క్రమశిక్షణ, ప్రపంచంలోకల్లా గొప్పగా క్రమశిక్షణపొందిన సైన్యం మనకుంది; అసలు ప్రపంచమంతటికీ యిదొ క్కటేనేమో. వారంరోజులూ రోజు కైదు గంటలు చొప్పున కవాతు చేయిస్తాం. ఆ కవాతులో యెన్నో రకాల పోరాట పద్ధతులు నేర్పుతాం. ఎన్ని నేర్పినా అందరికీ, అన్నీ నేర్పలేరుకద. ఆ క్రమశిక్షణ అన్నది చాలామటుకు యంత్రతుల్యంగా ఉంటుంది. ఏదయినా వీళ్ళు నేర్చుకోని కొత్తపద్ధతిలో శత్రువు దాడితీస్తే వీళ్ళ క్రమశిక్షణ గట్టిచిక్కులో పడిపోతుంది. మెఋపుదాడులు జరపగల సైన్యాలు కూడా మనకున్నాయి. ఆ దాడులకు వీలుగా ఉపయోగపడే ఆయుధాలూ ఉన్నాయి. అందుకే రాత్రిపూట యెప్పుడు మకాంచేసినా దళాలు రక్షణశ్రేణి నిర్మించి తీరుతాయి. అవతల వాడు దాడితీయకుండా ముందుగా మనమే దాడితీయగలగడమన్న దొక్కటే మన సైన్యాలకు వెన్నెముకవంటిది. రోమను వ్యూహంలో మొదటి యెత్తుగడ ఏమిటయ్యా అంటే నేలమీదనే యుద్ధంచెయ్యడం. నేలమీద యుద్ధం జరక్కుండా చూసేవాడు స్పార్టకస్. మూడో అక్షౌహిణీని దక్షిణంగా నడిపించుకువెళ్ళిన పూబ్లియస్ పైన చెప్పినవాటి నన్నిటినీ ఉల్లఘించాడు. అవన్నీ సర్వసామాన్యమైన సాధారణ విష

యాలే కావచ్చు. కాని వాటి నతిక్రమించడమే కొంపముంచింది. పైగా అతనికి స్పార్టకస్ అంటే వట్టి ద్వేషమే తప్ప అతన్ని గురించి జాగ్రత్తగా ఆలోచిద్దామనే జ్ఞానమే లేకపోయింది.''

ఆంటోనియస్ కైయస్ కూతుళ్ళిద్దరూ వీళ్ళ దగ్గరకు వచ్చారు. ఆట, పాటల వల్ల, సంతోషంగా అరవడంవల్ల, నవ్వడంవల్ల వాళ్ళ ముఖాలు ఎఱ్ఱబడ్డాయి. వాళ్ళు గబగబా పరువు పరువున వెళ్ళి జూలియా ఒళ్ళో కూచున్నారు. క్రాసస్ చెపుతున్న ఆఖరు మాటలు వాళ్ళు విన్నారు.

''మీకు స్పార్టకస్ గురించి తెలుసా?'' ఆ యిరువురిలో పెద్దది అడిగింది క్రాసస్‌ను. ''మీ రతన్ని చూసేరా?''

''నే నతన్ని యెప్పుడూ చూడలేదు. కాని నే నతన్ని గౌరవిస్తానమ్మా'' అన్నాడు క్రాసస్ నవ్వుతూ.

దీర్ఘాలోచనలోనున్నవాడిలా కూచుని ఆపిల్‌తొక్క చెక్కుతున్నాడు గ్రాఛూస్. కళ్ళు చిన్నవిచేసి క్రాసస్‌ను పరిశీలనగా చూస్తున్నాడు. క్రాసస్ అంటే అతనికేమీ యిష్టంలేదు. అతననే కాదు. ఏ సైనికోద్యోగిని చూసినా అతనికి తన హృదయంలో స్థానం యివ్వడంమాట అటుంచి అసలు యింట్లోనే స్థానం యివ్వకూడదనే రకం.... ఆపిల్‌తొక్క నంతటినీ ఒకే పొడుగాటి చెక్కగా తయారుచేసి చేత్తో పట్టుకున్నాడు. పిల్ల లిది చూసి ఆశ్చర్యంతో చప్పట్లు కొట్టేరు. దాన్ని అందుకో బోయారు. దీన్ని తీసుకోబోయే ముందు ఒక కోరిక కోరుకోండని అతను వాళ్ళతో అన్నాడు. ''అప్పుడు దీన్ని మీరు మీ కోరికచుట్టూ చుట్టబెట్టండి, ఆ ఆపిల్ విజ్ఞానంతో నిండి ఉంటుంది.''

''అప్పుడప్పుడు పురుగులు కూడా ఉంటూ ఉంటాయి దానిలో'' అని జూలియా అంది. ''వరీనియా గురించి కథ యేమైంది క్రాసస్?''

''ఇదిగో దానికే వస్తున్నా. మొదట ఆ కథ వెనుక నున్న గాథ చెప్తా. ఆ రోజుల్లో స్పార్టకస్ యింకా వెసూృవియస్ అగ్నిపర్వతాల దగ్గరనే ఉండేవాడు. స్పార్టకస్‌ను పట్టుకుంటానని బయలుదేరిన పూబ్లియస్; వెర్రి అనుకోవాలో పిచ్చి అనుకోవాలో వెసూృవియస్ పర్వతం యావత్తు చుట్టు ముట్టడానికని తన సైన్యాన్ని మూడు భాగాలుగా చీల్చేడు. ఒక్కొక్క భాగంలో రెండు వేలమంది ఉంటారు. ఈ మూడు భాగాలనూ మూడుచోట్ల తారసిల్లి చావగొట్టి వదిలేడు స్పార్టకస్. చావ గొట్టడంతో వదిలాడా? సర్వనాశనం చేసి భూలోకంలో పూర్వం యీ పూబ్లియస్

అనేవాడు కాని, యీ యిన్ని వేల సైన్యంకాని ఉన్నాయా అసలు అనిపించేసేడు. ఈ దాడులలో యెప్పుడో ఒకప్పుడు యెల్లాగో ఒకలాగున ఆశ్విక పటాలం పూర్తిగా తప్పించుకుని బైటపడింది. కొందరు సిపాయిలు దౌడు తీస్తున్న గుఱ్ఱాలను పట్టుకు వేలాడేరు. నురుగులు కక్కుకుంటూ వాయువేగంతో దౌడుతీసేయి గుఱ్ఱాలు. బానిసలు యుద్ధంచేసిన పద్ధతులను బాగా పరీక్షగా చూస్తే మనకో విషయం బోధ పడుతుంది. యుద్ధంలో వాళ్ళు దృష్టిని అనవసరంగా ఒకదాని మీద నుంచి మరో దానిమీదకు మరల్చరు. వాళ్ళ కెదురుగా వున్న దానినే పట్టుకుంటారు. ఈ లోపులో ప్రక్కనేదో జరుగుతున్నదని దానిమీదకు పోయి, మళ్ళీ మరొకటి జరుగుతోందని దానివైపు వాళ్లు గాభరాపడిపోరు. ఇంతకూ జరిగినది. తప్పించుకున్న యే డెనిమిది వందలమంది ఆశ్వికులు, సిపాయిలు త్రోవ తప్పి అరణ్యాలలో చిక్కుపడి అనుకోకుండానే బానిసల మకాంవైపు పోయారు. అక్కడ బానిస స్త్రీలూ, పిల్లలూ వున్నారు. మకాం అన్నానే కాని అదొక చిన్న పల్లెకన్న పెద్దదిగానే వుంది. చుట్టూ కందకం, మట్టిగోడ, దానిమీద దగ్గఱ దగ్గఱగా గుంజలూ, తీర్చిదిద్దిన రోడ్లూ, వాటి ప్రక్కన గుడిసెలూ యిదంతా చూస్తే మన దళాలను వదలి పారిపోయిన సైనికులెవరో బానిసలతో జేరినట్లు తెలిసిపోతోంది. లేకపోతే రోమన్ సైన్యాలు మకాం చేసినట్లు బానిసలెల్లా చెయ్యగలుగుతారు? సింహద్వారం తెరచి వుంది. అక్కడ చిన్నపిల్ల లాడుకుంటున్నారు. కొందరు స్త్రీలక్కడ కూచుని ఉన్నారు. దెబ్బతిని యుద్ధరంగం నుండి పారిపోయిన సైనికులకు మతి వుండదు. పోతుంది. కాస్త యింగితజ్ఞానంకూడా మిగలదు. ఉన్మాదుల్లా ప్రవర్తిస్తారు. అహః! బానిసల పిల్లలను కానీ, ఆడాళ్ళను కానీ చంపినందుకు వాళ్ళమీద తీర్పు చెపుదామని కాదు. అసలటువంటి చెత్త నసహ్యించుకోవాలి. ఆ సైనికులు పూరాగా ద్వేషంతో నిండివున్నారేమో, ఆ స్త్రీలమీదా, పిల్లలమీదా పడ్డారు. మంచి దూకుడుగా పడ్డారు. ఆశ్వికులు యీటెలతో కుందేలుపిల్లల్ని పొడిచినట్లు పొడిచి పైకెత్తేరు. మొదట్లో స్త్రీలనుకూడా పొడిచి చంపేరు. కాని యింతలో అక్కడి స్త్రీలంతా కత్తులూ, కఠారులూ, ఈటెలూ పుచ్చుకొని సింహద్వారం యీనుతోందా అన్నట్లు బైటికొచ్చారు. ఆ సైనికులలో కసి, ద్వేషం తప్ప మరింకేం లేదనుకుంటా. ఆ బానిస స్త్రీలను కొందరిని చెఱచి చంపి ఉండొచ్చు కూడా. ఆ రోజుల్లో బానిసలంటే ప్రజలెల్లా మండిపడేవారో మీకు జ్ఞాపకం లేదూ? స్పార్టకస్‌కి ముందు బానిస స్త్రీని చంపినవాడెవడైనా నలుగురి ముందూ బజారులో తలెత్తుకు తిరగలేకపోయేవాడు. అదొక నీచమైన పనికింద జమకట్టే వారం. అనవసరంగా అకారణంగా చంపినట్లు ఋజువైతే

జుల్మానా కూడా విధించే వారం. ఆ శాసనం మూడేళ్ళ క్రితమే మారింది కదూ గ్రాఛూస్?"

"అవును" అనిష్టంగా జవాబిచ్చాడు గ్రాఛూస్. "ఐనా యిదంతా యెందుకు? నీ కథ చెప్పుకుపోదూ. వరీనియా గురించికాదూ?"

"అవును?" ఒక్క క్షణం మందమతిలా కన్పించాడు గ్రాఛూస్. "ఆడుకోండమ్మ" జూలియా తన పిల్లలతో అంటోంది పసరికబయిళ్ళకేసి చూస్తో. "పోయి ఆడుకోండి. పరిగెత్తాలి."

"అయితే ఆ స్త్రీలు సైనికులతో పోరాడేరంటారా?" తెల్సుకోవాలని అడిగింది క్లాడియా.

"అంతే. అదీ విషయం" క్రాసస్ తలూపి అంగీకారం తెల్పినాడు. "సింహద్వారముముందు మహాయుద్ధం జరిగిందంటే నమ్మండి. నమ్మడమేమిటి జరిగింది. ఆ సిపాయిలకు మతిపోయింది. ఆడాళ్ళతో దెబ్బలాడుతున్నామన్న సంగతికూడా మర్చిపోయారు వాళ్ళు. ఇలా ఒక గంటసేపు అయిందనుకొంటా. మరి వాళ్ళు చెప్పినదాని ప్రకారం ఆ స్త్రీలకు ఒకత్తె నాయకత్వం వహించిందట. ఆమె పొడుగ్గా దృఢంగా వుందట. ఆమె వరీనియాయే అంటారు. ఎక్కడబడితే అక్కడే ఆమె కనబడేదట. ఆమె బట్టలు పూర్తిగా చినిగిపోయి నగ్నంగా వుండి ఈటె పుచ్చుకుని భయంకరంగా యుద్ధం చేసిందట. ఆమె మహోగ్ర స్వరూపిణియై—"

"దీన్లో ఏదీ నే నమ్మను" గ్రాఛూస్ అడ్డుతగిలాడు.

"మీకు నమ్మాలని లేకపోతే నమ్మకపోవడమే మంచిది." తన కథ వాళ్ళ మీద ప్రభావం కల్గించలేదని గుర్తించిన క్రాసస్ "అది జూలియా కోసమే చెప్పా" అని వూరుకొన్నాడు.

"నా కోసం ఎందుకు?" ఆమె తెల్సుకోగోరింది.

హెలీనా అతనికేసి రెప్పవాల్చకుండా చూస్తూ "ఆ కథ పూర్తిచేద్దురూ నిజమో పాడో యేదో పూర్తిగా చెప్పేయండి. ఏ కథైనా కంచి కెళ్ళడముంటుంది."

"అన్నింటిలాగే యిదీ ముగిసింది. అన్ని యుద్ధాలూ ఒకలాగే ముగుస్తాయి. గెలవనైనా గెలుస్తాం; లేకపోతే ఓడిపోతాం. దీన్లోమాత్రం ఓడిపోయాం. కొందరు బానిసలు రావడంతో ఆ ఆడాళ్ళమధ్య, ఈ బానిసల మధ్య పడి మనవాళ్ళు హతమారిపోయారు. కొద్దిమంది అశ్వికులు మాత్రం చావుతప్పి కన్నులొట్టయి తిరిగి వచ్చారు. వాళ్ళే యిదంతా చెప్పారు."

"అయితే వరీనియా చావలేదన్న మాటేనా?"

"ఆమె వరీనియా గనక అయితే చావలేదనే చెప్పాలి."

"అదింకా బతికేవుందా?" అడిగింది క్లాడియా.

"ఆమె బతికే ఉందా!" క్రాసస్ అదేమాటన్నాడు. "అది కాదు అసలు కావల్సింది; ఏవంటారు?"

గ్రాఘూస్ లేచాడు. అలవాటు ప్రకారం ఒక్క వూపున టోగా భుజమ్మీద వల్లెవాటుగ వేసుకుని ఎత్తెత్తి, అడుగులు వేస్తూ నడిపించేడు శరీరాన్ని. ఇతడు వెళ్ళడంతో అక్కడకు నిశ్శబ్దం వచ్చింది. కొంతసేపయాక సిసిరో అడిగాడు;

"ముసలాణ్ణేదో తినేస్తుంది."

"భగవంతుడికే తెలియాలి."

"వరీనియా బతికుందో చచ్చిందో అసలు విషయం అదికాదన్నారేం?" హెలీనా అడిగింది.

# ఆరవ భాగం: సలేరియా భవనంలోని అతిథులలో కొంతమంది కేపువాకు వెళ్ళిన వైనమూ, అందమైన ఆ పట్టణం గురించిన కొన్ని వివరాలూ, ప్రయాణీకులు కడపటి మల్లుడ్ని శిలువవేయగా చూచిన సంగతి.

---

ఒకేరోజున సిసిరో, గ్రాఘూస్ లిద్దరూ సెలవుతీసుకుని రోమ్ వెళ్ళారు. తెల్లవారే సరికి బయల్దేరి వెళ్ళడంవల్ల ప్రయాణం సుకరం అవుతుంది కాబట్టి, ఆ మర్నాడు ఉదయమే తమను వెళ్ళనిచ్చే ఒప్పందంమీద కైయస్, ఆ స్త్రీ లిద్దరూ, సేనాని క్రాసస్ ఆ రోజు అక్కడే ఉండిపోయారు. ఇదివరకే క్రాసస్ మనమంతా, కలిసి వేద్దామో యని కైయస్‌తో చెప్పాడు. గొప్ప రోమన్ సైన్యాధిపతితో కలిసి ప్రయాణంచేసే భాగ్యం తమకు లభించింది కదా అని క్లాడియా, హెలీనా లిద్దరూ సంతోషించారు.

సూర్యోదయం అయ్యేసరికి వాళ్ళు బయల్దేరారు. నాల్గు పల్లకీలు, నౌకర్లూ చాకర్లూ, సామాన్లుమోసే బానిసలు, వీళ్ళందరితోనూ కలసి యీ ప్రయాణీకుల బృందం ఒక పెద్ద వూరేగింపులా సాగిపోతోంది. సైనికవందనంకోసమని ఓ పది పటాలాల సైనికుల్ని రప్పించాడు క్రాసస్. బానిసలపై సాధింపబడిన అంతిమ విజయపు సందర్భంలో విజయసూచకంగా జరిపిస్తోన్న ఉత్సవాలను దర్శించవలసిందిగా విప్లవం ప్రారంభమయిన కేపువాకు క్రాసస్‌ని ఆహ్వానించారు. స్పార్టకస్ ఓడించబడి, చంపబడిన పిమ్మట తమకు పట్టుబడ్డ బానిసఖైదీలనుండి నూరుగురు మల్లుల్ని ఏరి, వాళ్ళచేత వారాలతరబడి మల్లయుద్ధ ప్రదర్శనాలు చేయిస్తున్నారు. ఇరువురు మల్లులు పోరాడితే అందులో ఒకడు చావాల్సిందే. అలా రెండు జంటలు పోరాడితే యిద్దరు చచ్చిపోతారు. ఆ మిగిలిన యిద్దర్నీ మళ్ళీ పోట్లాడిస్తారు. అందులో మిగిలినవాణ్ణి మరో జంటతో పోరాడి, బతికినవాడితో వుజ్జీకట్టి ఈ విధంగా వందమంది పోరాడితే చివరకు ఒక్కడు మాత్రమే మిగుల్తాడు. దీన్ని 'ఏరివేత' పద్ధతి అంటారు. మృత్యునృత్యానికి అంతమనేదుండా అనిపిస్తుంది!

"నీకు చూడాలని వుందనుకుంటా" కైయస్ అన్నాడు.

ఒకడితో నొకడు మాట్లాడుకుందుకు వీలుగా పల్లకీలు ఒకదానిపక్క వేరొకటి పోతున్నాయి. అటునుండి వస్తున్న జన, వాహన, సంచారాన్ని రోడ్డుపక్కకు నెట్టారు. వీళ్ళని చూడగానే వీళ్ళు నిస్సందేహంగా ధనవంతులే అన్నట్లు తోచే విశేషాధికారాన్ని వీళ్ళ యిష్టప్రకారం రోడ్డుమీద ప్రయాణం చేయడానికి వారికిగల హక్కును ప్రజలు గుర్తించారు.

కైయస్, క్రాసస్ లిద్దరూ ఒకరిపక్క నొకరున్నారు. క్లాడియా, క్రాసస్ పక్క హెలీనా, తన అన్నపక్క వున్నారు. వయస్సులో తను పెద్దవాడవబట్టి వాళ్ళ యందతనిలో మరేవో భావాలుండబట్టి క్రాసస్ అతిథులను సత్కరించే పాత్ర స్వీకరించాడు. ఎలా చెబితే అలా చేస్తారని బానిసలు ప్రయాణం చేస్తుండగనే, తన అతిథుల అవసరాలేమిటో వాళ్ళ సదుపాయాలేమిటో, వాళ్ళకేం కావలసివస్తుందో అంతా ఆలోచిస్తున్నాడు క్రాసస్. ఇప్పుడతను సత్కరించే ఒక గృహస్థుగా, తోటి ప్రయాణీకుడుగా, మార్గదర్శకుడుగా తయారయాడు. కైయస్ ప్రశ్నకు సమాధానంగా అన్నాడు: "అబ్బే! నీ కాశ్చర్యంగా వుండొచ్చుకాని కైయస్, నా కీ క్రీడలన్నా, ప్రదర్శనలన్నా ఆసక్తిలేదు. పైగా తలనొప్పి. ఎప్పుడో బాగా పోట్లాడగల జంటయితే తప్పదనుకో. ఎలాగైనా యిది తలనెప్పే; అనుమానంలేదు. కాని నీకు చూడాలని వుందని ముందుగానే తెల్సివుంటే——"

"ఆఁ! దానికేముంది."

"ఎలాగైనా యీ మల్లయుద్ధాల్లో చివర కొకడు మిగుల్తాడుగా" అంది క్లాడియా.

"మిగలాలని ఎక్కడుంది ఆఖరికి మిగిలిన యిద్దరూ బాగా దెబ్బ్తిని చస్తే? కాని ఒకడు మిగిల్తే మాత్రం వాణ్ణి ఏదో ద్వారంముందు శిలువెయ్యడం తప్పదనుకుంటా. అదో చిహ్నం. చూసేవూ! ఈ నగరానికి ఏడు ద్వారాలున్నాయి. ఈ శిక్షా చిహ్నాలు ప్రారంభమయినపుడు ఏడు సంఖ్యతోనే ప్రారంభించాం. అంటే ఒక్కొక్క ద్వారంముందు ఒక్కొక్క శిలువన్న మాట. ఎవడు మిగిల్తే వాడు ఏపియన్ ద్వారం ముందున్న శవం స్థానాన్ని ఆక్రమిస్తాడన్నమాట! నువ్వెప్పుడేనా కేపువా వెళ్ళావా?" క్లాడియా నడిగాడు.

"లేదు. వెళ్ళలేదు."

"అయితే నీ కళ్ళకొకవిందే. అంత అందమయిన పట్టణం అది. ప్రపంచ నగరాలన్నిటిలోకి అందమయినదని నా నమ్మకం. పట్నపు ప్రహరీగోడ మీద నిలబడితే, మబ్బూ మంచూలేని రోజునయితే అందమయిన అఖాతం కని

పిస్తుంది. దూరంగావున్న తెల్లని వెసూవియస్ అగ్నిపర్వత శిఖరం కన్పిస్తుంది. ఎంత హాయిగా వుంటుందని; అటువంటిది మరొకటుందా అని. నా కక్కడ ఓ చిన్న కొంపగూడా వుంది లెండి. మీరు నా అతిథులుగా వుంటే నా కెంతో ఆనందం.''

మేం వస్తామని, మా తాత చూస్తుంటాడని, అక్కడకు వెళ్ళడం తప్పదని కైయస్ చెప్పాడు.

''పోనీ - అలాగైనా మనం కలుసుకుంటుండొచ్చుగా. మొదటి రెండు మూడు రోజులూ అంతా వూకదంపే. ఆ అధికార స్వాగతాలూ, ఉపన్యాసాలూ గట్రా అన్నీ పూర్తయాక పడవమీద షికారు పోవచ్చు. కావాలంటే చిన్న వనభోజన మొకటి ఏర్పాటు చేయించుకోవచ్చును గూడా. ఓ రోజు మధ్యాహ్నం సెంటుమిల్లులుగూడా చూసిరావచ్చు. కేపువా అంటే సెంట్లన్నమాటే. నా కక్కడో మిల్లులో వాటాగూడా వుంది. సెంట్లు, యితర పరిమళ వస్తువులు తాలూకు ఉత్పత్తి ఎలాగో నాకు తెలుసు. మీ కే సెంటు కావాలంటే అది నేను బహూకరించగలను'' ఉదారబుద్ధి ప్రకటించాడు క్రాసస్.

''అబ్బా! ఎంత దయ'' అంది హెలీనా.

''ఆఁ. దయకేం వుంది. నే నేమైనా మడిమాన్యా లిచ్చేస్తున్నాన్నేవిటి దయ చూపడానికి? ఇంతాచేసి అత్తరువే కదా, కాని నాకు వున్నదే, ఈ కేపువా అంటే చెడ్డ సరదా. దాన్ని ప్రేమిస్తూ అటువంటి నగరం మనకుంది గదా అని గర్విస్తా. ఓ యితిహాసముంది మీకు తెలుసూ. వెయ్యేళ్ళ క్రితం ఇటలీలో ఈ ప్రాంతంలో ఎట్రూస్ ఖనులు పన్నెండు మహానగరాలు నిర్మించేరట. వాటినే హేమమయ కంఠహారంలోని ద్వాదశ రత్నాలూ అని పిల్చేవారట. వాటిలో ఒక నగరం పేరు వోల్టర్నం - అదే నేటి కేపువా - అంటారు. అది వఠి యితిహాసమే గావచ్చు. 350 సంవత్సరాల క్రితం ఎట్రూస్ఖన్‌ల నుండి సామ్నయిట్‌లు ఆ నగరాన్ని స్వాధీనపర్చుకుని పునర్నిర్మాణం చేశారు. నూట ఏభై సంవత్సరాల క్రితం సామ్నయిట్‌ల చేతినుండి మనం లాక్కుని ఈ ప్రహరీలు, విశాలమైన రోడ్లు నిర్మించాం. నిజానికి రోమ్‌కన్నా ఇదే బావుంటుంది.

ఆ విధంగా వాళ్ళు ఏపియన్ మార్గంలో ప్రయాణం చేశారు. ఆ శిక్షా చిహ్నాలను వాళ్ళు చూశారా లేరా అంటే చెప్పడం కష్టమే. అవి అక్కడ లేనట్లే పోతున్నారు వాళ్ళు. గాలి వీచి కుళ్ళినమాంసం కంపుకొడితే తక్షణం గాలిలో అత్తరువులు చిమ్మేవారు. అత్తరువు గాలికి సువాసన నిచ్చేది. చెప్పుకోదగ్గ సంఘటన లేవీ ప్రయాణ

కాలంలో జరుగలేదు. మజిలీలమీద ప్రయాణంచేసి హాయిగా సునాయాసంగా కేపువా చేరుకున్నారు.

## 2

మంచి వైభవమూ, గొప్ప ప్రాభవమూ కల కేపువానగరం సంబరాలు చేసుకుంటుంది. బానిస విప్లవంవల్ల వచ్చిన మచ్చను తుడిచి పారేసుకుని ఉల్లాసంగా ఉత్సవాల్లో వుంది. ఆ నగరపు తెల్లని గోడలపై ఒకటిగాదు రెండుగాదు, పన్నెండువందల జెండాలులేచి నిలబడి రెపరెపలాడుతున్నాయి. శాంతి భద్రతలు నెలకొల్పబడ్డాయి; కనుక కల్లోలం కనబడకుండా పోయింది; కనుక వినుతికెక్కిన ఆ నగర సప్తద్వారాలూ తిరిగి తెరువబడ్డాయి. సేనాని రాక ముందుగానే తెలిసి ఎంతోమంది అధికారులు పెద్ద పెద్దవాళ్ళు ఎదురేగి ఆహ్వానించేందుకై వచ్చారు. బాజాలు, భజంత్రీలు, కాహళులు ఒక టేమిటి నూరురకాల వాద్యవిశేషాలు ధ్వనిస్తున్నయి. ఆ ధ్వని వీరికి ఆహ్వానాన్ని తెలుపుతోంది. వెండి మలామాచేసిన కవచాలు ధరించి పట్టణ పటాలం ఒకటి అధికారులతో సహా ఏపియన్ ద్వారంగుండా బయటకొచ్చింది. ఇది అంతాచూసి హెలీనా, క్లాడియాలు సంతోష పారవశ్యత్వంలో మునిగిపోయారు. ఇదోలెఖ్ఖా అన్నట్లు నిర్లక్ష్యం నటించదలిచాడు కైయస్. కాని ప్రఖ్యాతిచెందిన సేనానితోబాటు తనకూడా బ్రహ్మాండమైన ఆహ్వానమీయబడింది. అందుకనే ఉల్లముల్లాసభరిత మయింది. పట్నం లోనికి వాళ్ళు వెళ్ళగానే సెలవుతీసుకుని కైయస్, ఆ యిద్దరు వనితలూ తమ బంధువుల యింటికి వెళ్ళిపోయారు. వీళ్ళు వెళ్ళిన కొద్దిసేపటిలోనే క్రాసస్వచ్చి తన గౌరవార్థం ఆ సాయంత్రం యివ్వబడుతున్న విందుకు రావలసినదిగా ఆహ్వానించాడు. ఆహ్వానించినపుడు వీళ్ళ బంధువులను పిలవడంలోగూడ లోటు జరుగలేదు. క్రాసస్ వంటి గొప్ప సేనాని తనని అంతగా ఆదరించినందుకు కైయస్లో స్వాతిశయం పొడ చూపింది. విందు పూర్తయ్యే పర్యంతం ఏదో అవకాశం కల్పించుకుని వాళ్ళయందు ఆదరభావాన్ని వ్యక్తం చేస్తూనే వచ్చాడు క్రాసస్. సేనానికి గౌరవసూచకంగా ఏభై ఐదు రకాల పిండివంటలనూ, అనేక వంటకాలను వడ్డించారు. క్లాడియా, హెలీనా లందులో ఏ కొద్దింటినో రుచిచూసారు. ఎన్నో, ఎంతో వడ్డిస్తే కొన్నిటినే కొద్దిగా రుచి చూడడమన్నది నాగరికుల లక్షణం. పురుగులను ఎంతో నేర్పుతో రుచికరంగా వండగల ఎట్రూస్కన్ పద్ధతిలో క్రిములను పచనం చేశారు. పిట్టమాంసంతో సున్నితంగా తయారుచేయబడ్డ పురుగులనైనా సరే, తేనెలో తేలియాడే క్రిములనైనా సరే, ఎంత బాగా వండిన వాటినైనా సరే కైయస్ తినలేకపోయాడు. పురుగులను తినడంలో

సుఖమేమిటో అతనికి తెలిసేదికాదు. ఆనాటి సాయంత్రపు విశేషాల్లో విశేషమైన దేమి టంటే క్రాసస్ గౌరవార్థం ప్రత్యేకంగా ఏర్పాటు చేయబడ్డ గమ్మత్తయిన నాట్య ప్రదర్శన. పవిత్రమైన రోమన్ కన్యల్ని రక్తపిపాసగల నరరూప రాక్షసులయిన బాని సలు బలవంతంగా చెరచడానికి ప్రయత్నించే ఘట్టం ప్రదర్శింపబడింది. బానిసలు నీచా త్ములే అన్న గట్టినమ్మకంతో ఒక అరగంటసేపు విపరీతంగా ప్రదర్శించారు. దీనిలో యధావిధిగా చివరకు బానిసలు సంహరింపబడ్డారు. పూలు అప్పుడా భవనపు కప్పు నుండి వర్షిస్తాయి.

చీకటి పడుతోంది. మరింతరాత్రి కావస్తున్నది. వందలమంది అతిథులంతా మరింతగా తాగుతున్నారు. కాని క్రాసస్ మాత్రం చాలా తక్కువగా తాగుతున్నాడు. ఈ సంగతి హెలీనా కనిపెట్టింది. కేపువాలోని బట్టీలలో అత్తరువులు తయారుచేసే నల్లే ఘాటయిన బాగా మత్తెక్కించగల సారాయి కూడా తయారుచేస్తారు. క్రాసస్ అటువంటి మద్యాన్ని సేవించక కొద్దికొద్దిగా ద్రాక్షరసాన్ని మాత్రం చవిచూస్తున్నాడు. అతనిలో నిష్ఠనియమాలూ, యింద్రియలోలత్వం యీ రెండూ వున్నవి. అతని కళ్ళలో ఈ రెండూ కనిపించాయి. వారిద్దరూ ఒకరి నొకరు చూసుకున్నారు.

విందు ముగిసేసరికి చాలా ఆలస్యమయింది. ఎంత రాత్రయినా సరే హెలీనాకు మాత్రం బానిస విప్లవం ప్రారంభమైన లెంటులస్ బేటియాటస్ తాలూకు మల్లశిక్షణా కేంద్రాన్ని చూడాలనే కుతూహలం కల్గింది. తమకు దర్శకుడుగా వుండి స్థలవిశేషాల్ని చెప్పమని క్రాసస్‌ని అర్థించింది. అది మనస్సుకూ శరీరానికీకూడా ఎంతో చల్లదన మిస్తోన్న రాత్రి; రమ్యంగా హాయిని గొల్పే రాత్రి; అంతటా వ్యాపించిన నవవసంత సుమసురభిళాలతో రమణీయంగా వున్న రాత్రి. పెద్ద వర్తులాకారమైన పళ్ళెంలా చంద్రుడు ఆకాశంలో పయనిస్తున్నాడు. ఈ రాత్రి ఏదైనా చూడాలంటే సులభమే. వెన్నెల - పుచ్చపువ్వులా, విచ్చినవిరుల్లా, హసించే మల్లెలా తెల్లగా వుండే వెన్నెల రాబోతుందిక. మార్గం కనిపిస్తుంది. వస్తువులు, విశేషాలు చూడటం అతిసులభం.

న్యాయస్థలంవద్ద ఒక విశాలమైన భవనంలో వాళ్ళున్నారు. సేనానిచుట్టూ ఎంతో మంది జనమున్నారు. ఉపాయంగా, నేర్పుగా హెలీనా, క్లాడియాల నిద్దరినీ వాళ్ళ బంధువులనించి విడదీయాలన్న సమస్య ఒకటుంది. హెలీనామాత్రం కైయస్‌ను తోడు రమ్మని బలవంతం చేసింది. కైయస్ తప్పతాగి వున్నాడు. వెంట రమ్మన్న వెంటనే అంగీకరించాడు. వదులుగా స్వేచ్ఛగా వేలాడుతున్న చేతుల్తో తూలుతూ నిలబడలేక నిలబడి క్రాసస్‌వేపు అదోవిధంగా విపరీతమైన భక్తిప్రపత్తులతో చూశాడు. జరగ వలసిన ఏర్పాట్లన్నీ సేనాని చూచుకున్నాడు. కొద్దిసేపటికి పల్లకీలు రానేవచ్చాయి. వచ్చి

వీళ్ళనెక్కించుకొని ఏపియన్ ద్వారంవైపు పోతున్నాయి. ద్వారపాలకులు యీతనికి నమస్కరించారు. వాళ్ళతో కొద్దిసేపు ఖులాసాగా మాట్లాడి కొన్ని వెండినాణేలు వారి కిచ్చి తోవచెప్పమన్నాడు క్రాసస్.

"ఐతే నువ్వెపుడూ అక్కడికి వెళ్ళలేదన్నమాట!" హెలీనా అంది.

"అబ్బే, ఎప్పుడూ వెళ్ళనూ లేదు; చూడనూలేదు."

"బాగుంది. ఎంతో తమాషాగా వుంది. నే నీ వూళ్ళో వుంటే చూడకుండా వుండలేను. నీ జీవితం, స్పార్టకస్ జీవితం పెనవేసుకపోయి ముడివడ్డ ప్రదేశం యిదేగా" అంది హెలీనా.

"నా జీవితం, స్పార్టకస్ చావూ" క్రాసస్ తప్పుదిద్దాడు.

"ఇప్పుడక్కడేంలేదు" ద్వారపాలకుడన్నాడు. "బేటియాటస్ ప్రాణానికి అదో విపరీతమైన పెట్టుబడే. నిజంగా అతడెన్నో లక్షలు గడించే పరిస్థితిగూడా ఏర్పడింది. తిరుగుబాటుతోబాటు దురదృష్టం ప్రారంభమయిందతనికి. అతనా గ్రీకు బానిసచేతిలో చచ్చేసరికి ఆ శిక్షణాకేంద్రం కోర్టు గొడవల్లో యిరుక్కుపోయింది. తక్కిన శిక్షణా కేంద్రాలు వూరిబయటనుండక వూరిలోనికి వచ్చేశాయి. ఇప్పుడు అద్దె కొంపలలో రెండు కేంద్రాలు పెట్టారు."

క్లాడియా ఆవులించింది. పల్లకీలో నిద్రపోయాడు కైయస్.

ద్వారపాలకుడైన కెప్టెన్ సర్దాగా చెప్పుకపోతున్నాడు. "ప్లాసియస్ మొనాయియా తిరుగుబాటుగురించి వ్రాసిన చరిత్రలో బేటియాటస్ శిక్షణాకేంద్రం నగరం నడిబొడ్డున వున్నట్లు వర్ణించాడు. అక్కడికే మేం యాత్రీకులను తీసుక పోతూంటాము. నమ్ముతారో లేదో, చరిత్రకారుని మాటముందు నా మాటొహలెక్కా యేమిటిగాని, ఆ ఏటి ప్రక్కనేవున్న కాలిబాట వెంబడే పోతే బేటియాటస్ శిక్షణా కేంద్రానికి పోవడం అతిసులభం. ఈ వెన్నెట్లో తెల్లవారినట్లే వుంది. అలాపోతే మీరు తప్పక శిక్షణాకేంద్రానికే వెళ్తారు. ఎంతో ఎత్తున రంగస్థలంలో కర్రమంటపం వుంటుంది."

వాళ్ళు మాట్లాడుతుండగా కొందరు బానిసలు పారలూ, గునపాలూ పట్టుకుని ద్వారంలోంచి వచ్చారు. వాళ్ళదగ్గర ఒక నిచ్చెనా, మేదరితట్టలూ వున్నాయి. ద్వారాని కెదురువున్న పెద్ద శిలువ దగ్గరకు వెళ్ళారు. శిక్షాచిహ్నాలన్నిటిలోకి మొదటి దది. ఆ చిహ్నాలన్నిటికీ సాంకేతికం అది. రోమ్‌కు పోయే మార్గంలోనున్న 6 వేల శిక్షాచిహ్నా ల్లోనూ మొదటిది యిదే. నిచ్చెన నా శిలువకు చేరవేసినప్పుడు కోపంతో అరుచుకుంటూ రెక్కలు కొట్టుకుంటూ కాకుల గుంపొకటి ఎగిరిపోయింది.

"వాళ్ళేం చేస్తున్నారు?" క్లాడియా అడిగింది.

"ఒక కుక్క నిద్దేసి మరోకుక్క నా స్థానంలో వేలాడతీస్తారు" ద్వారపాలకుడు చెప్పాడు. "ఏరివేత పద్ధతి నేర్పాటు చేసిన మల్లయుద్ధాలలో ఆఖరుకు మిగిలిన మల్లునకు యిక్కడ జరగాల్సిన లాంఛనాలన్నీ జరుగుతాయి. స్పార్టకస్‌తో పాటు వున్న బానిసల్లో ఆఖరివాడు యిక్కడే చస్తాడు."

క్లాడియా వణికింది. "నాకు మీతో రావాలని లేదు" అని క్రాసస్‌తో చెప్పింది.

"నీ కింటికి పోవాలనుంటే పోవచ్చు. ఇదుగో! యిక్కడున్న యిద్దరు మనుష్యుల్ని పంపుతావు? వీళ్ళని దిగబెట్టారు" అని కెప్టెన్‌ని అడిగాడు క్రాసస్.

హాయిగా గుర్రుపెట్టి నిద్రపోతున్న కైయస్ క్లాడియాతోపాటు వెళ్ళిపోయాడు. హెలీనాకు నడవాలనే వుంది. పల్లకీదిగి క్రాసస్ ఆమెవైపు రమ్మనమని సంజ్ఞ చేశాడు. పల్లకీలు వెళ్ళిపోయాయి. ఆ యువతి వెంటరాగా గొప్పకులీనుడైన సేనాని వెన్నెల్లో వెళ్తున్నాడు. వాళ్ళు శిలువ దగ్గరగా వెళ్ళారు. ఎండకు ఎండి నల్లబడి, పక్షులు పీక్కుతినగా మిగిలిన కళేబర అవశేషాన్ని బానిసలు కిందికి దింపారు. అది దుర్గంధం వెదజల్లుతోంది. శిలువ యిటూ అటూ కదలకుండా నిటారుగ నిలబడడంకోసం శిలువ మొదట్లో గునపాల్తో తవ్వి రాళ్ళు దిగ్గొట్టున్నారు బానిసలు.

"నీ కలాటి వేమీ గాభరా కల్గించవుకదూ?" క్రాసస్ హెలీనా నడిగాడు.

"ఇలాటి వెందుకు గాభరాకల్గించాలి నాకు!"

క్రాసస్ భుజా లెగరవేసాడు. "విమర్శిద్దామని నా అభిప్రాయం కాదు అదెంతో ప్రశంసనీయమని నా నమ్మకం."

"ఏమిటీ? ఆడది ఆడదికాకుండా పోవడమేనా ప్రశంసనీయం!"

"మనం కాలం గడుపుతున్నామే, ఈ లోకం దాన్ని నే నంగీకరిస్తా," ఏదీ యిథమిద్ధమని తానై చెప్పడం క్రాసస్‌కు యిష్టముండదు. "నా మటుక్కు నాకు మరో లోక మేదీ వున్నట్లు తెలీదు."

తలవూపి మాట్లాడక వూరుకుంది హెలీనా. వాళ్ళు నడుస్తూనే వున్నారు. అక్కడకి శిక్షణాకేంద్రం ఎంతో దూరంలేదు. రమణీయమైన ఆ ప్రదేశం నిజంగా దేవలోకంలా కనిపించింది. దగ్గరగా రంగస్థలపు గోడ కనపడింది. పల్లకీల నక్కడాపాడు. తను హెలీనాతోపాటు నడిచివెళ్ళాడు. ఆ ప్రదేశం చిన్నదికాదు. ఆడంబరంగా కూడా వుంది. తాలింఖానాచుట్టూ వున్న యినుపకంచెలో చాలా భాగం దొంగలవశమైంది.

రంగస్థలం చుట్టూరావున్న గోడ సగంమట్టుకు కూలిపోయింది. ఇసుకలో వారిద్దరూ ఎత్తుగావున్న కఱ్ఱమంటపంవేపు చూస్తో నిలబడ్డారు. రంగస్థలం చిన్నదిగా అసహ్యంగా కనబడింది. కాని అక్కడ యిసుకమాత్రం వెన్నెలలో వెండిపూత పూయబడినట్లు మెరిసిపోయింది.

"దీన్నిగురించి మా అన్న చెప్పేవాడు. అంత గొప్పగా చెప్పేవాడుకదా. తీరా చూస్తే యింత చిన్నదిగా వుందేమిటి చెప్మా?" హెలీనా అంది.

ఈ చంపుకునే ప్రదేశాల గురించి, ఈ శిక్షణాకేంద్రంలో జరిగే ఘోరమైన ద్వంద్వయుద్ధాల గురించి ఏదో ఒకటి చెపుదామని క్రాసస్ అనుకున్నాడుగాని అతనేమీ సరిగా చెప్పలేకపోయాడు. వాటిలో అర్థమూ లేదు; ఆసక్తీ లేదు.

"మంటపంమీదికి వెళ్ళాలని వుంది" హెలీనా చెప్పింది.

"వెళ్ళాలని వుంటే వెళ్ళొచ్చుకాని చాల జాగ్రత్తగా వెళ్ళాల్సుమీ. ఆ కఱ్ఱ చివికిపోతోంది."

ఈ ప్రేక్షకుల మంటపాన్ని బేటియాటస్ చాలా గర్వంగా చూసుక సంతోషించేవాడు. దానిమీదకు వాళ్ళు వెళ్ళారు. చారల వితానం పేలికల పేలికలుగా చిరిగి వేలాడుతోంది. పోగా మిగిలిన తలగడాలనించి చిట్టెలుకలు పారిపోయాయి. ఓ సోఫాలో హెలీనా కూచుంది. ప్రక్కనే క్రాసస్ ఉపవిష్టుడయాడు. అప్పుడు హెలీనా అడిగింది.

"నువ్వు నా గురించి ఏమీ అనుకోవా?"

"అనుకోకేం! నువ్వు అందమైన దానివనీ, తెలివైందానివనీ తలపోస్తూనే యున్నాను."

నెమ్మదిగా హెలీనా అంది: "సేనానీ, మరి నేను నువ్వొక పందివనుకుంటున్నాను" అత నామెవేపుకు వరిగాడు. ఆమె ఖాండ్రించి అతని ముఖంమీద నుమ్మింది. పాలిపోయిన వెన్నెలకాంతిలోగూడ అతని కళ్ళల్లో తొణికిసలాడే క్రోధాన్ని ఆమె చూడగల్గింది. ఇతనూ సేనాని అంటే. మాట్లాడేటపుడు ఆవేశం కనపర్చడు. కాని యిప్పుడతడు పూర్తిగ ఆవేశపూరితుడయాడు. అతడామె నొక్క దెబ్బకొట్టాడు. ఆ దెబ్బతో ఆమె సోఫానించి పడి, మంటపం చుట్టూవున్న కఱ్ఱలమీద పడింది. సగం శరీరం అవతలకీ మిగిలిన సగం యివతలా వుండి అటోయిటో పడేటట్లుంది. అదైతే యిరవై అడుగులు క్రింద పడాల్సిందే; కాని యింతలో తేరుకుని ముందుకొచ్చి క్రాససమీదపడి పీకుతూ గిచ్చుతూ రక్కుతోంది. సేనాని కదలకుండానే ఆమె రెండు చేతులూ పట్టుకుని తనకొక్కింత దూరంలో నిలబెట్టి కరకుగా ఏమీ కానట్లు నవ్వాడు. నవ్వి యిలా అన్నాడు:

"అసలు విషయం వేరు. హెలీనా నాకు తెల్సులే."

ఆమెలో పొంగులువారిన కోపమూ, శక్తీ అణగిపోయాయి. ఏడ్వడం మొదలెట్టింది. అల్లరిచేసిన పెంకెపిల్లలా ఏడ్వసాగింది. అలా ఏడుస్తుండగానే అతని పనేదో అతను కానిచ్చాడు. అతని పనిని ఆమె వ్యతిరేకించనూ లేదు, ఆహ్వానించనూలేదు. ఆవేశం లేకుండా తొందరపడకుండా తనపని పూర్తి చేసిన పిమ్మట అతడిలా అన్నాడు:

"నీక్కావల్సిన దదేగా హెలీనా?"

ఆమె సమాధాన మివ్వలేదు. బట్టలు సరిచేసుకుంది. జుట్టు సరిచూసుకుంది. కంట్లో మెదలిన కన్నీటి చుక్కలను తుడిచేసుకుంది. బుగ్గలమీదకు కారిన కన్నీటిని తుడిచేసింది. మాట్లాడకుండా వెళ్ళి పల్లకీలో కూచుంది. క్రాసస్ నడుస్తున్నాడు. కాలిబాట నా బోయీలు కేపువావైపు పోతున్నారు. రాత్రి గడచింది. చంద్రకాంతిలోని తెల్లదనం పోతూంది. ఏదో క్రొత్త వెలుగు భూమిని స్పృశిస్తోంది. ఉదయకాంతి పరిఢవిల్లుతోంది. ఏ కారణంవల్లనో తనలో శక్తీ, ఉత్సాహాలు, చురుకుతనం తొణికిసలాడుతున్నట్లు భావించాడు క్రాసస్. అతని కటువంటి భావం కల్గడం అరుదు. పుష్టి, తుష్టి ఎంతగానో తనలో నిండినట్లు తలపోశాడు. మర్త్యులైన నరజాతి స్త్రీలలో ఏ కొద్దిమందిలోనో భగవంతుడు విశిష్టమానవుల, మానవాతీతుల, బీజాల్ని నాటుతాడని నిరూపించే పురాణగాథలను చాలామట్టుకు నమ్మేలా చేసింది ఆ ఆలోచన. "ఏం, అది సాధ్యంకాదా" అతన్లో నత డనుకున్నాడు. తా నటువంటి మానవాతీతుల్లో ఒకడవొచ్చు. తనకున్న అదృష్టాన్నిబట్టి చూస్తేనే తెలుస్తోంది. అటువంటప్పుడు తాను మాత్రం అటువంటి విశిష్టమానవుడు కావడం అసాధ్య మెలాగవుతుంది!

హెలీనా పల్లకీ పక్కగా అతను నడుస్తున్నాడు. అతని వైపామె క్రొత్తగా చూచి అడిగింది:

"అసలు విషయం వేరని చెప్పావు. నీ వుద్దేశ మేమిటి? ఆ అసలు విషయం నాకు సంబంధించిందా; కాదా. అంత ఘోరమైన మాటనెందుకన్నావ్?"

"ఆ మాట అంత ఘోరమైందా ఏం?"

"నీకే తెల్సు, యెంత ఘోరమైందో. అసలా 'అసలు విషయం' ఏమిటా అని."

"ఒక ఆడది!"

"ఏ ఆడది?"

అతని కనుబొమలు ముడివడినయి. కళ్ళముందో, కళ్ళలోనో మబ్బులు కమ్మి నయ్. తనలోని తేజస్సు నశిస్తోంది. దాన్ని రెక్కపట్టుక కూచోబెట్టాడు. అది చాలా మటుకు మిగిలేవుంది. ఏపియన్ద్వార సమీపంలో ఆమె పల్లకీవదలి ద్వారపాలకుల నాయకుని దగ్గరకు వెళ్ళాడు. తాను దైవాంశ సంభూతుడనేభావం యింకా మెదుల్తూనే వుంది. ఆ భావన అతని కామన. అలా ఆలోచించడం కొన్ని కొన్ని పరిస్థితుల్లో కష్టమే. ఆ పరిస్థితిలో మరీ కష్టం. ఇంచుమించు మొరటుగానే ఆ ద్వారపాల కుల్తో అన్నాడు: "ఈమెను యింటిదాకా సురక్షితంగా దిగబెట్టడానికి ఒకణ్ణి పంపించు."

ఆజ్ఞ అమలుపరిచారు. తిరిగి హెలీనా ముఖంకేసి చూడలేదతను. ద్వారం నీడలో నిలబడి దీర్ఘంగా ఆలోచిస్తున్నాడు క్రాసస్. కాపలా కాస్తున్న సైనికులూ, వారి నాయకుడూ అతనివంక వింతగా చూస్తున్నారు. అప్పుడు క్రాసస్ అడిగాడు.

"ఇప్పుడెంతైంది?"

"ఆఖరుఝాము వస్తోంది. ఇంకో గంటలో పొద్దుపొడుస్తుంది. అయ్యా! తమకి బడలికగా లేదండీ?"

"లేదులే. బడలికగాలేదు; నాకేం బడలికగాలేదు" అతని కంఠస్వరం మెత్త బడింది. "ఇలా కాపలాకాయడంచూసి నాకెంతో కాలమయింది."

"ఈ రాత్రిళ్ళు ఎంతకీ గడవ్వంటే నమ్మండి" కాపలా కాస్తూ రాత్రిళ్ళు గడపటం ఎంత విసుగైనపనో కేప్టెన్ వివరించాడు. "ఇంకో అరగంటలో యిదంతా మారిపోతుంది. రాత్రంతా కాపలాకాసినచోట యిదేనా అనిపిస్తుంది. కావిళ్ళతో, గంపలతో కూరలవాళ్ళు, ఆవుల్ని తోలుకుంటూ ఆలకాపరులూ, ఏవేవో బరువులు మోసుకొచ్చేవాళ్ళు, చేపలవాళ్ళు, ఒకళ్ళేమిటి, ఈ దోవన ఎంతోమందొస్తారు. ఇక్కడ రద్దీ మహా ఎక్కువ. దేవుడు మేలుచేస్తే యివాళ పొద్దున్నే ఆఖరి మల్లుణ్ణి శిలువ నెక్కిస్తార్లెండి!" పూర్తిగా తెల్లారలేదు. ఉదయపు మసకవెల్తురులో అతడు చూసిన శిలువ స్పష్టంగా కనబడలేదు. కాని ఏదో శిలువమాత్రం వున్నట్లు ఒక ఆకారం గోచ రించింది.

"చూట్టానికి చాలామందొస్తారా?" క్రాసస్ అడిగాడు.

"అయ్యా, రాకేమండి. ఇప్పుడప్పుడే ఇంతమంది రారనుకోండి. కాని పొద్దెక్కినకొద్దీ కొంపమునిగినట్లొచ్చి పడ్తారు. ఇంతమందెక్కడున్నారా అని పిస్తోంది. ఒకటి: మనిషిని శిలువెయ్యడంలోగూడ ఒక గమత్తు వుందని వప్పుకోవాలి బాబయ్యా. సూర్యుడు నడినెత్తికొచ్చేసరికి ఈ గుమ్మందగ్గరా, గోడలమీదా, రోడ్లమీదా

యిసుకేస్తే రాలనంతమంది తయారవుతారు. ఒకమాటు చూస్తే చాలదా అనుకుంటా రేమో తమరు, అబ్బే! ఎక్కడవాళ్ళుంది లెండి!"

"ఇంతకీ వాడెవరు?"

"అది నాకు తెలవదండి. మల్లుడనిమాత్రం నాకు తెల్సు. అతడు చాలా మంచి వాడేమో! నాకు చాలా జాలేస్తుంది పాపం."

"ఓయ్! నీ సానుభూతి కొద్దిగా దాచుక తగలేసుకోరాదూ?" సేనాని అన్నాడు.

"మరో ఉద్దేశ్యం నాకేమీ లేదండి అయ్యా. నా ఉద్దేశ్యం ఏమిటంటే పాపం ఆఖరిమల్లుడుకదా అని. అందరికీ అలాగునే ఉంటుందిగూడా."

"లెఖ్ఖలుగడ్తే అలాగేవుంటుంది. ఆఖరివాడంటే జాలి! మొదటివాడంటే ఏమిటో నీకే తెలియాలి. ఈ మల్లయుద్ధాలు ప్రారంభించి చాలారోజులైంది. చివరికి ఎవడో ఒహాడు మిగలడం తప్పదుమరి."

"అంతేలెండి బాబయ్యా, అంతే అంతే."

ఆ ఆఖరిగంటకూడా గడచింది. పొద్దుపొడవటంతోబాటు మర్నాటి మొదటి గంట ప్రారంభమయింది. మరోరోజు! చంద్రుడు పాలిపోయాడు. విరిగిన పాలలా గుంది ఆకాశం. అంతటా మంచు బాగా కురిసింది. ఉత్తరంగా కంటికగుపించేవరకు యింకా పైగా కూడా తిన్నగాపోయే రోడ్డుఅంచులు నల్లని గీతలా కనిపిస్తున్నాయి. సన్నగా, నిటారుగా, గట్టిగావున్న ఆ శిలువ తెల్లని ఆకాశంముందు నిలబడివుంది. తూర్పున ఉదయభానుని కిరణాలు. లేత వంగపండురంగుల కిరణాలు సూర్యోదాయా నికి అగ్రదూతలై వస్తున్నాయి; సూర్యోదయాన్ని సూచిస్తున్నాయి. మెళుకువగా వుండాలని నిశ్చయం చేశాడు క్రాసస్. తన నిశ్చయాన్ని తానే మెచ్చుకున్నాడు. ఉదయం, ఆశ నిరాశల మిశ్రమంలా కనిపిస్తోంది. ఆ ప్రభాతాన్నే అతడు ఆహ్వానిం చాడు. అతడు కాదు; అప్పటి అతని మానసికపరిస్థితే ఆహ్వానించింది. ఉషస్సెప్పుడు అంహస్సుని, తేజస్సుని గమ్మత్తయిన పాళ్ళలో కలుపుతుం దెందుకనో.

ఇప్పుడెక్కణ్ణుంచో పది పదకొండేండ్ల బాలుడు నడిచివస్తున్నాడు. ఉదయపు మంచును త్రొక్కుకుంటూ నడుస్తున్నాడు. అతని చేతిలో చిన్న కూజా ఒకటి వుంది. ద్వారపాలకుల కెప్టెన్ అతన్ని చేరబిల్చాడు. అతని చేతిలోనున్న కూజా తీసి కున్నాడు.

"నా కొడుకు" క్రాసస్‌కు చెప్పాడు. "ప్రతిరోజూ ఉదయమే నాకు తాజా సారా తెస్తుంటాడులెండి వీడు. బాబూ తమరు వీణ్ణొకమారు పలకరిస్తారా? మీరొక మారు మాట్లాడేరంటే వీడికెంత సంతోషమనుకున్నారు. ఇంటిపేరు లిషస్. వీడిపేరు

మేరియస్. మీ మంచితనాన్ని అదనుగా తీసికొని నా యిష్టమొచ్చినట్లు అడిగేస్తున్నా లెండి. తమరేమీ అనుకోకపోతే వీడితో ఒక్కమాట మాట్లాడితే ఎంతోకాలం జ్ఞాపకముంచుకుంటాడు.

"ఏమోయ్! మేరియస్ లిష్టస్—" అని ఆగాడు క్రాసస్.

"మిమ్మల్ని నే నెరుగుదునండి" కుర్రా డన్నాడు. "వీరే సేనాని. మిమ్మల్ని నే చూశా. బంగారపు కవచం కనబడ దేమండీ?"

"అది బంగారమంది కాదోయ్. ఇత్తడిది. అస్తమానం తొడుక్కోవడం కష్టం: అందుకే యిప్పుడు ధరించలేదు."

"అలాటిదే నాకోటి వుంటేనా; ఎప్పుడూ తీసెయ్యను."

'ఐతే రోమ్ యిలాగుందన్నమాట! రోమ్ కీర్తి, కాంతి, సాంప్రదాయాలు ఎప్పటికీ యిలాగే జీవిస్తాయన్నమాట' అనుకున్నాడు క్రాసస్.

ఆ దృశ్యం, ఆ కుర్రాడి మాటలు అతన్ని కదిలించాయి. కెప్టెన్ కూజా అతని కివ్వబోయి "తమరు రుచిచూడండి" అన్నాడు.

తలూపాడు క్రాసస్. దూరంనించి భేరీ శబ్దం వినవైంది. కెప్టెన్ కూజా కుర్రాడి కిచ్చి ద్వారపాలకుల నాజ్ఞాపిస్తున్నాడు. గుమ్మాని కిరువైపులా రెండు వరుసలుగా నిలబడ్డారు కాపలా సైనికులు. వాళ్ళ డాలులు భూమికి తగుల్తున్నాయి. ఈటెలు నిలువునా లేచి నిలబడ్డాయి. వాటినలా పట్టుకుని కదలకుండా, మెదలకుండా నిలబడ్డం కష్టమే. చూస్తున్న క్రాసస్‌కే చిరాకేసింది. తనే కనుక అక్కడ లేకపోతే ఈ ఆయుధాల నే మూలో్న పెట్టి పనిజరుపుకపోయేవారు; కాని యిలా మోద్దురా అనుకున్నాడు. ఈ ప్రదర్శనమంతా తనగురించే నను కున్నాడు. బాజాల శబ్దం బిగ్గరగా, దగ్గరగా వినవొతూంది. బారులు తీర్చిన చెట్ల మధ్యనున్న ఆ విశాలమైన రోడ్డుమీద బాజాలు వాయించుకుంటూ వచ్చే సైనికులు కనబడ్డారు. సూర్యుడు ఎత్తయిన భవనాలని తాకుతున్నాడు. మానవసంచారం కూడ కనపడ్తుందప్పుడప్పుడే. వాళ్ళా ద్వారంవైపే వస్తున్నారు. ఆ సైనిక గీతం కూడా ద్వారంవైపే ప్రసరిస్తుంది.

ఆరు భేరీలున్నాయి. నాల్గు బాకాలున్నయి. ఆర్గురు సైనికులున్నారు. వెనకాల మల్లుడు. ఆ మల్లుని వెనుక దగ్గరగా మరో డజను సైనికులు నడుస్తున్నారు. ఆ మల్లుడు దిగంబరుడై యున్నాడు. అతని చేతులు వెనక్కు విరిచి కట్టారు. ఒక్కడి కోసం యింతమందా అని చూస్తే, వీళ్ళు చాలామందే వున్నట్లు తోచక మానదు. పైగా యీ మనిషి బలవంతుడుగా కూడా కనబడడు. అపాయకరమైన మనిషిగా కూడా తోచడు. వాళ్ళు దగ్గరకు వచ్చాక, మల్లుని ముఖం స్పష్టంగా అతనికి కనబడ్డాక

క్రాసస్ తన పూర్వపు అభిప్రాయాన్ని మార్చుకున్నాడు. అబ్బో! యిటువంటివాళ్ళే చాలా అపాయకరమైనవాళ్ళు. అతని ముఖంలోనే కనిపిస్తోందది. మనసిచ్చి కులాసాగా మాట్లాడే రోమను లక్షణాలేవీ యితన్లో కనిపించవు. గెడ్డముఖం, వంపుతిరిగిన ముక్కు, ఎత్తయిన దవడఎముకలు, వాటికి దగ్గరగా, పలుచగా బిగువుగా నున్న చర్మం, సన్నపాటి పెదవులు, పచ్చగా అసహ్యంగావున్న కళ్ళు—యిదీ యితనితీరు. అతనిలో ద్వేషముంది. కాని జంతువుల్లాగునే యితడు ద్వేషాన్ని కక్కడు. అతని ముఖం అట్టముఖంలా వుంది. శరీరం పెద్దదేమీ కాదు. కాని కండలు రాళ్ళలా వున్నట్లనిపిస్తాయి. శరీరంమీద గాయాల గుర్తులు రెండవుపిస్తున్నాయి. ఒకటి ఛాతీమీద. మరొకటి మెడవేపున, రెండూ పెద్దదెబ్బలేమీ కావు. ఈ మధ్యనే తగిలిన ఆ గాయాల చుట్టూ రక్తం గడ్డకట్టి వుంది. ఒకచేతికో వేలులేదు. ఒకచెవి తెగిపోయింది. తలకు దగ్గరగా పూడ్చిపెట్టుక పోయిందది.

ఆ దళాన్ని నడిపించుకొస్తున్న ఉద్యోగి, క్రాసస్‌ని చూడగానే తనవెంట వచ్చే సైనికుల్ని ఆగాల్సిందిగా సంజ్ఞచేసి క్రాసస్ దగ్గరకు వెళ్ళాడు. సేనానికి నమస్కరించాడు. సేనాధిపతిని కలుసుకున్న అవకాశావేశాన్ని ఉపయోగించుకోకుండా వుండే రకం కాదతను.

"మిమ్మల్ని ఈ విధంగా కలుసుకోగల భాగ్యం నాకు లభిస్తుందని అనుకోలేదు" అన్నాడతను.

"ఇది దైవికం; అదృష్టము" క్రాసస్ ఒప్పుకున్నాడు. బానిస సైన్యాల్లో ఆఖరువాడైన ఈ మల్లుడు, తనూ అనుకోకుండా ఈ విధంగా తటస్థపడటం, అమర్చినట్లు సరిపోయిన ఈ సంఘటన అతని కాశ్చర్యం కల్గించకమానలేదు. "అతన్నెప్పుడు శిలువెక్కించ తల్చుకున్నారు. ఇప్పుడేనా?"

"అనే నన్నాజ్ఞాపించారు."

"వా డెవడు? ఆ మల్లుడు బాగా రంగస్థలానికి అలవాటుపడ్డరకంలా కనిపిస్తోన్నాడే. కత్తినాట్లు శరీరమంతటా వున్నయి. వా డెవడో నీకు తెల్సా?"

"వీడి గురించి మాకు చాలా తక్కువగా తెల్సు. ఆ బానిస సైన్యంలో ఏదో పదవి వెలగబెట్టేవాడట. ఒక పటాలానికో, మరెన్నింటికో నాయకత్వం వహించాడని విన్నాం. యూదుడిలాగూడ వున్నాడు. ఒక్కొక్కప్పుడు థ్రేషియన్లకన్నా బాగా బాకు యుద్ధం చేయగల్గే యూదుణ్ణి బేటియాటస్ కొనేవాడు. స్పార్టకస్‌తోబాటు డేవిడ్ అనే యూదుడుండేవాడని బేటియాటస్ వాఙ్మూలంలో తెలియచేశాడు. ఆ తిరుగుబాటుకు

ప్రధానకారకుల్లో యితనొకడు. అతనే యితనై యుండొచ్చు; కాకపోనూవచ్చు. బందీగా తీసుకొచ్చాక వాడేమీ వులకడూ; పలకడూ; అదేం మంకుతనమోగాని ఒక్క మాటైనా ఆడలేదు. బాగా పోరాడేడు. వీణ్ణి తగలెయ్య. కత్తినెంత నేర్పుగా, చాకచక్యంగా, మెలకువతో వుపయోగించేవాడని! నే నెప్పుడూ అటువంటి బాకు యుద్ధం చూడలేదు. ఐదు ద్వంద్వయుద్ధాల్లో పాల్గొన్నా ఆ రెండు చిన్న దెబ్బలూ తప్ప మరేమీ తగల్లేదు. వీడు పాల్గొన్న మూడు యుద్ధాలు చూశాను. ఎప్పుడూ అటువంటి బాకుయుద్ధం చూడలేదు. చివరకు శిలువేస్తారన్న సంగతి తెల్సి కూడా పోరాడి జయిస్తే విజయంతోబాటు స్వాతంత్ర్యం లభిస్తుందని అనుకున్నాడేమో. నా కర్థంకాదది."

"కాదా! సరిజీవితం బహువిచిత్రమైనది నాయనా."

"అవునండి. దాన్నంగీకరించాల్సిందే."

"వాడేకనుక దేవిడ్ అయితే-" ఆలోచనాపూర్వకంగా అన్నాడు క్రాసస్. "అదో కర్మ పరిహాసమంటాను. వాడితో మాట్లాడొచ్చా?"

"ఓ! మాట్లాడొచ్చు. అభ్యంతరమేమిటి. కాని మాట్లాడినా సంతృప్తి కలగదనే నా అభిప్రాయం. వాడొక మూర్ఖజంతువు. నోరు మెదపడు."

"మాట్లాడిచూస్తే."

వాళ్ళిర్వురూ మల్లుడున్నచోటు కెళ్ళారు. అప్పుడే జనసమూహం అతన్ని చుట్టి వేసింది. సైనికులు ప్రజల్ని దూరంగా త్రోసేస్తున్నారు. ఆ ఉద్యోగి డాంబికంగా చెప్పేడు:

"మల్లుడా! నీకు ప్రత్యేకమైన గౌరవం లభించింది. సర్వసేనాని మార్కస్ లిసినియస్ క్రాసస్ నీతో మాట్లాడ సంకల్పించారు." ఆ పేరు వినగానే అక్కడి ప్రజలు హర్షధ్వానాలు చేశారు. ఈ బానిసకు చెవుడా ఏమిటి చెప్మా. ఇదంతా విన్నా అతని ముఖంలో మార్పేమీ గోచరించలేదు. చలనంలేకుండానే అలా యెక్కడికో చూస్తూ నిలబడిపోయాడు. అతనికళ్ళు పచ్చల్లా మెరుస్తున్నాయి. ముఖంలో యేమీ కనపడలేదు. ఏ కదలికాలేదు.

"నువ్వు నన్నెరుగుదువు. మల్లుడా నావేపు చూడు" అన్నాడు క్రాసస్.

అప్పటికీ మాట్లాడలేదు ఆ దిగంబరుడు. ఉద్యోగి అతన్ని సమీపించి మాట్లాడ నందుకు ముఖంమీద ఒక దెబ్బకొట్టేడు.

"పందీ; నీతో మాట్లాడుతున్న దెవరో తెల్సా?"

పంది మాట్లాడుతుందా మరి. ఆ ఉద్యోగి తిరిగి ఒకటి తగిలించాడు. దెబ్బ

తప్పించుకుందుకు మల్లుడెవ్విధమైన ప్రయత్నమూ చేయలేదు. ఈ విధంగా జరగటం వల్ల ఫలితం శూన్యమని క్రాసస్ గ్రహించాడు.

"చాల్లేయిక; వాడి మానాన్న వాణ్ణి వుండనీ, నీ పని నువ్వు చూసుకో."

"ఎంత పని జరిగిందీ. వీడా మాట్లాడడు; అసలుమాటలు రావేమో. తోటి మల్లులతో మాట్లాడ్డం చూడలేదండీ మేము."

"దానికేముందిలే" అనేశాడు క్రాసస్.

వాళ్ళు ద్వారందాటి శిలువ దగ్గరకు వెళ్తున్నారు. క్రాసస్ చూస్తూ నిలబడ్డాడు. ద్వారంనించి ఎడతెరిపిలేకుండా జనం వస్తున్నారు. రోడ్డుమీద నిలబడి జరుగుతున్న దంతా చూస్తున్నారు. ఆ జనంలోంచి క్రాసస్ శిలువ దగ్గరగా వెళ్ళాడు. శిలువ వేసే టప్పుడు వాడేంచేస్తాడో చూడాలనిపించిం దతనికి. శిలావిగ్రహాన్ని తలదన్నగల, మరిపించగల ఆ బానిసమౌనం అతనికో సవాలు విసరినట్లు భావించాడు. శిలువదగ్గరకు అంత మౌనంగా, నిర్లక్ష్యంగా నడిచి వెళ్ళిన మనిషిని జీవితంలో తానెన్నడూ చూడ లేదు. శిలువ వేసినపుడతనే విధంగా ప్రవర్తిస్తాడా అని ఆలోచిస్తున్నాడు.

శిలువెయ్యడంలో ఆ సైనికులు ఆరితేరారు. నేర్పుగా వాళ్ళపని వాళ్ళు చేసుక పోతున్నారు. మల్లుని చంకలక్రిందినించి తాడొకటి పోనిచ్చి కొనలు రెండూ సమాన దూరంలో వుండేటట్లు చూసేరు. గతరాత్రి బానిసలక్కడ వదలివెళ్ళిన నిచ్చెనను శిలువకు చేరవేసేరు. అడ్డంగా భుజాల్లాగున్న బలమైన అడ్డుబల్లమీద రెండువేపులా తాటికొనలు రెండూవేసి ఆ కొనలు కిందికి లాగుతున్నారు. ఇద్దరు సైనికులలా చేసే సరికి బానిస శిలువపైకి ఎత్తుగా వెళ్ళేడు. కళ్ళుమూసి తెరిచే అంతలో లాఘవంగా అతన్ని లాగేశారు. మరో సైనికుడు నిచ్చెనపైకెక్కి బానిసను పైకిలాగుతుంటే అడ్డ దిడ్డంగా తిరక్కుండా పట్టుకున్నాడు. నిలువుగా వున్న దూలం, అడ్డుగావున్నదీ కలిసే చోటుకు కొద్దిగా కిందగా బానిస వేలాడుతున్నాడు. నిచ్చెనమీదనున్న సైనికుడు అడ్డుదూలం ఎక్కేడు. మరో సైనికుడు బలమైన సుత్తీ, పెద్దపెద్ద మేకులూ పట్టుకుని వచ్చి నిచ్చెన ఎక్కి అడ్డుదూలం మీద మరోవేపు కూచున్నాడు. దిట్టమైన యినుప వూచలే ఒకవైపు వాడిగాచేసి తయారుచేసిన మేకులవి. అవి పొడుగ్గా, బలంగా వున్నాయి.

ఇలా జరుగుతోంది. ఆసక్తితో క్రాసస్ మల్లుణ్ణి పరిశీలిస్తున్నాడు. గరుకుగా వున్న దూలంమీద తన శరీరాన్ని తాళ్ళతోకట్టి పైకి లాగుతోన్నపుడు గూడ అతని ముఖంలో నిర్లక్ష్యం తనకేం సంబంధం లేదా అన్నట్లు కన్పించే నిర్నిమిత్తం, నిర్వి చారం గోచరిస్తున్నాయి. కొంపతీసి సుఖదుఃఖాది ద్వంద్వాతీతుడైన మహావేదాంతి

కాడుగదా! అనిపిస్తాడు. మరొకతాటిని చంకలకిందికి పోనిచ్చి ఛాతీచుట్టూ తిప్పి అడ్డు దూలానికి పైన ముడివేస్తుండగా కూడా అతనలాగే కొయ్యబొమ్మలా వేలాడుతున్నాడు. పైకి లాగడానికి ఉపయోగించిన తాటినిప్పుడు తొలగించి వెనక్కు విరిచికట్టిన అతని చేతికట్లను తెగ్గోశారు. ఇద్దరు సైనికులూ తలోచేతినీ తలోవైపుకూ లాగారు. అడ్డు దూలానికీ చేతిమడమలకూ కలిపి తాళ్ళతో కట్టారు. అతని గుప్పిటను విప్పి అర చేతిలో ఒక మేకు నిలబెట్టి దూలానికి దిగ్గొట్టారు అప్పటిదాకా అతడు బాధను తెలియ చేయనేలేదు. అప్పుడైనా అతనినోట మాట రానేలేదు: అరవలేదు. భరించలేని బాధ వల్ల అతని ముఖం ముడ్చుకపోయి వికృతమైంది. బాధతో శరీరం గిలగిలా కొట్టు కుంది. చేతిపట్టు జారకుండేందుకు మరో నాల్గు దెబ్బలుకొట్టి మేకును దూలంలోకి ఐదంగుళాల వరకు పోనిచ్చేరు. రెండో చేతిక్కూడా ఈ పద్ధతినే అమలు జరిపేరు. తన చేతిమాంసాన్ని నరాలను, నాళాలను ఛేదించుకొని ఎముకలను రాపాడి దూలానికి దిగ్గొట్టబడే మేకుపై వేసిన ప్రతిదెబ్బా అతని మెడమీద, హృదయంమీద సమ్మెట పోటుల్లా అనిపించి గిలగిలా తన్నుకునేవాడు. అతని పెదవులు, కళ్ళు బుగ్గలు అన్నీ ముడుచుకపోయి వక్రమై బాధను వ్యక్తంచేశాయి. అయినప్పటికీ అతను ఏడ్వలేదు. అరవలేదు: కళ్ళవెంబడి జలజలా కన్నీళ్ళు కారుతున్నా, నోటినుండి లాలాజలం నురుగులులాకట్టి కారుతున్నా అతనేడ్వలేదు. బాధవల్ల అరవలేదు.

అతన్ని దూలానికి కట్టిన తాటినీ తెగకోసేరు. మేకులు దిగకొట్టిన అతని చేతులే ఆధారంగా అతని యావత్తు శరీరభారమూ వేలాడుతోంది. మేకులుమీదనే శరీరం బరువంతా పనిచేస్తే మేకు లూడిపోతాయేమోనని భయపడి అతని చేతులను దూలంతో కట్టిన త్రాళ్ళనల్లాగే ఉండనిచ్చారు. నిచ్చెన తీసేసేరు. కొద్ది నిముషాలలో శిలువేయడం అంతా పూర్తి అయిపోయింది. అంతత్వరగా పని పూర్తిచేయగల సైనికుల చుఱుకుదనాన్నీ, పనితనాన్నీ ప్రజలు ప్రశంసించారు.

అప్పుడా మల్లుడు స్మృతితప్పి పడిపోయాడు.

"వాళ్ళంతా యెప్పుడూ అల్లాగే;" ఉద్యోగి చెపుతున్నాడు క్రాసస్‌తో. "ఆ మేకులే వాళ్ళనల్లాచేస్తాయి. కాని వాళ్ళకి తిరిగి ఒంటిమీద తెలివివస్తుంది. మళ్ళీ తెలివిలేకుండా పోడానికి రోజు, రోజున్నర పట్టవచ్చు; ఒకనాడో గాల్‌ని శిలువేశాం. వంటిమీద తెలివితో వాడు నాలుగురోజులపాటు అల్లాగే వేళ్ళాడేడు. గొంతు బొంగురై పోయింది. ఇక అరవలేకపోయాడు; కాని స్పృహమాత్రం వుంది. అటువంటిది నేనెప్పుడూ చూడలేదు. అసలు మేకులు దిగగొట్టినప్పుడే తెగ అరిచాడు. అన్నాళ్ళు చావకుండా శిలువమీద వేలాడి చెవులు బ్రద్దలయేలా అరిచినవాడిని నేనెప్పుడూ చూడ

లేదు. అరే భగవాన్! ఏం దాహం!" అని ఒక పెద్దబుడ్డి మూతతీసి నోట్లో ఎత్తిపోసుకుని గడగడా తాగేసేడు. తాగి ఆ బుడ్డిని క్రాసస్ కందిచ్చాడు.

"గులాబీపువ్వులు వేసేరా లేదా దీంట్లో?"

"అమ్మయ్య ప్రాణం లేచొచ్చిందోయ్" అన్నాడు నీటిని త్రాగి క్రాసస్. ఎందుకనో వున్నపాటున బడలికగా వున్నట్లూ, దాహమేసినట్లూ అనుకున్నాడు. ఆ బుడ్డిలో నీళ్ళన్నీ త్రాగేసేడు. జనం తండోపతండాలుగా వస్తున్నారు. వాళ్ళను చూపించి క్రాసస్ అడిగేడు: "పొద్దస్తమానూ వాళ్ళంతా అల్లా చూస్తూ నిలబడిపోతారా ఏం?"

"చాలామంది వాడికి తెలివి వచ్చేదాకా వుంటారు. ఒంటిమీద తెలివొచ్చేక ఆ బానిస యేమి చేస్తాడా అని చూస్తారు. ఈ బానిసలు శిలువలమీద యెన్ని తమాషాలు చేస్తారనీ. చాలామంది వాళ్ళ అమ్మకోసం యేడుస్తారు. బానిసలు కూడా మనలాగే తల్లిని తలుస్తారని మనం అనుకోం." రోడ్డుమీద జనం యింకా యెక్కువగుతున్నారు. వాళ్ళని రోడ్డుకోపక్కగా నిలబెట్టాలి. చెప్పుకుపోతున్నాడా ఉద్యోగి. "ఎక్కడి బళ్ళక్కడ, యెక్కడ మనిషి అక్కడ ఆగిపోయారు చూసేరా. అటు మనిషి యిటు రాలేడు, ఇదిరోడ్డు, నలుగురూ పోవాల్సిన త్రోవ అనే యింగితజ్ఞానం కూడా యీ ప్రజలలో ఏ ఒక్కడికీ వున్నట్లు కనిపించదు. అజ్ఞానమే శూన్యం. వాళ్ళంతా అంతే. అసలు మందకి మతేమిటి?" రోడ్డుమీద అడ్డుగా నిలబడ్డ జనాన్ని పక్కకు పంపవలసిందిగా ఇద్దరు సైనికుల్ని నియోగించాడు.

"మీరేమేనా అనుకుంటారని భయంకానండి, లేకపోతే ఒక్కవిషయం అడగాలనుందండి. అది నా స్వంత విషయం కాదనుకోండి. కాని నాకా విషయం తెలుసుకోవాలని మహవుంది. మీరేమీ అనుకోకపోతే, అతనే కనుక డేవిడ్ అనే యూదుడైతే కర్మపరిహాసమనో మరేదో అన్నారుకదా, దాని అర్థం ఏమిటా——"

"నేనల్లా అన్నానా?" క్రాసస్ అడిగేడు. "ఏ ఉద్దేశ్యంతో అన్నానో, యెందుకన్నానో నాకూ తెలియదు." అదంతా గతించిన గాథ. గతాన్ని నెమరేస్తూ కూచోటం క్రాసస్‌కు యిష్టంలేని పని. దాన్నల్లా కదపకుండా ఉండనీయడమే మంచిది. అదీకాక బానిసలతో చేసినయుద్ధానికి కీర్తిరావడం వుండదుకద. విజయం దానివల్ల వచ్చే మెప్పు, మెహర్బానీలు ఒకళ్ళకి; శిలువేసే కసాయివృత్తీ, దాన్లో ఏమైనా సంతృప్తి అనేది యేడిస్తే అది తనకు. ఈ హత్యాకాండతో, చిత్రహింసతో, మృత్యువుతో తానెంత విసిగిపోయాడు. కాని వాటిని తప్పించుకోవాలంటే ఎక్కడికి పోగలడు? ఒక ఘోరమైన సామాజిక వ్యవస్థ నిర్మించబడుతోంది. దానికి ఒట్టి మృత్యువే పునాది. అంత ఖచ్చితంగా, ఒక క్రమంలో, అంత పెద్దఎత్తున మున్నెన్నడూ మానవ మారణ

హోమం కొనసాగింపబడలేదు. ఎప్పుడది ప్రారంభమైనదని? అంతు యెప్పుడు? యెక్కడ? మానసికంగా, శారీరకంగా చిత్తుగా ఓడిపోయిన రోమన్ సైన్యాలకు తను నాయకత్వం వహించిన తొలి రోజులవి. ఆనాటి ఒక సంఘటన జ్ఞాపకమొచ్చింది. పిలికో మమ్మియస్ తన బాల్యస్నేహితుడు; తన అనుచరుడు. అతనికో మూడు దళాలిచ్చి స్పార్టకస్ సైన్యాలను కల్లోలపరచి, గాభరాపెట్టి, వీలైతే వాటికి గండికొట్టి రమ్మని పంపించాడు. స్పార్టకస్ సైన్యాలను గాభరాపెట్టడం సంగతి దేవుడెరుగు. ఇతనే వాళ్ళ వలలోపడ్డాడు. బానిసలు చుట్టిముట్టి తరుముకొచ్చేసరికి చావుతప్పి కన్ను లొట్టయి పరిగెట్టుకొచ్చాడు. ఆ పరిగెట్టడంకూడా ఎవడిష్టంవచ్చినట్లు వాడు పరిగెత్తేసరికి యిదే బాగుందనుకొని బానిసలు వీళ్ళని తెగనరికేరు. నరికీ, నరికీ చేతులు పీకెట్టేసరికి పోనీ అని కొద్దిమందిని వదిలేసేరు. మమ్మియస్ తన యెదుటపడేసరికి "పిరికి పందా! వాడిచేతిలోనే చావలేకపోయావా? పీడాపోను. మళ్ళీ యెందుకు ముఖం చూపించావ్? ఏ ముఖం పెట్టుకు తిరిగొచ్చావురా?" అని యెన్నెన్నో అన్నాడు. ఆఖరికి బండబూతులు కూడా ప్రయోగించాడు. తిట్టినతిట్టు తిట్టకుండా, అన్నమాట అనకుండా యెన్నెన్ని అన్నాడో, ఎన్ని దుర్భాషలాడాడో అన్నీ జ్ఞాపకమొచ్చేయి. "నన్ను చంపెయ్యి" అన్నాడు మమ్మియస్.

అదంతా యితనికి కళ్ళకు కట్టినట్లు జ్ఞాపకం వచ్చింది. ఎందుకంటే అతనికి బానిసలంటే విపరీతమైన ద్వేషాగ్నిని రగుల్కొల్పినవారు మమ్మియస్, మాజీ రాజ సలహాదారుడు మార్కస్ సెర్వియస్‌లే. ఆ కథకూడా అతని స్మృతిపథంలో నిలిచింది. బానిసల గురించి యెన్నో కథలు చెప్పుకుంటారు. వాటిలాగే దీనిలోకూడా నిజాన్నీ, అబద్ధాన్నీ విడదీయలేం. ఏది నిజమో, ఏదసత్యమో చెప్పడానికి రెంటిమధ్యా కంచు గోడలూలేవు, అఖాతాలూ లేవు. స్పార్టకస్ యొక్క ప్రాణస్నేహితుడు, అనుచరుడు, బానిస సైన్యంలో ముఖ్యుడూ అయిన క్రిక్సస్ అనే గాల్‌ని చంపడంలో మార్కస్ సెర్వియస్ ప్రధానపాత్ర వహించాడు. క్రిక్సస్ ఒక్కడ్నీ బానిస సైన్యంనుంచి విడదీసి అతన్నీ, అతనితోపాటున్న కొద్దిమంది సైనికుల్నీ హతమార్చడంలో సెర్వియస్‌దే బాధ్యత. అందుకే చాలాకాలం అయాక యీ మమ్మియస్, సెర్వియస్ లిద్దరూ బానిసలకు పట్టుబడినప్పుడు వాళ్ళని సైనికకోర్టులో విచారణ చేయించేడు స్పార్టకస్. ఖైదీలకు మరణశిక్ష యే విధంగా విధించాలి అన్న ప్రశ్న వచ్చినప్పుడు డేవిడ్ అనే యూదుడే యేదో వాదించాడంటారు. క్రాసస్‌కి పూర్తిగా తెలియదు. మల్లులలాగే ద్వంద్వయుద్ధంచేసి మమ్మియస్, సెర్వియస్ లిద్దరూ చావాల్సొచ్చిందని అంతా అంటారు. వాళ్ళిద్దరికీ బట్టలూడతీసేరు. రోమన్ సైనికాధికారుల గతి అల్లాగయింది.

ఇద్దరిచేతిలోనూ తలోకత్తి పెట్టేరు. అప్పటికప్పుడే వీళ్ళకోసమే రంగస్థలం ఏర్పాటయింది. ఇద్దర్నీ ఒకరినొకరు పొడుచుకు చావాల్సిందిగా ఆజ్ఞాపించబడింది కూడా. ఆ ఒక్క సందర్భంలోనే స్పార్టకస్ క్రూరంగా ప్రవర్తించాడు. ఐతేమాత్రం? క్రాసస్ దాన్ని మరచిపోలేదు, మన్నించనూలేదు.

శిలువనీడలో ఉద్యోగి నిలబడివున్నాడు. అతని కిదంతా చెప్పడం క్రాసస్‌కి యిష్టంలేదు. "ఎందుకన్నానో నాకే తెలియదు, ఆ మాటల్లో అంత విశేషమేంలేదు" అన్నాడు క్రాసస్.

అలసి వున్నాడు. అందుకే యింటికిపోయి విశ్రాంతి తీసుకుంటానన్నాడు.

## 3

చివరకు మిగిలిన యీ మల్లుడ్ని శిలువేయడంలో న్యాయం యేపాలుంది? అన్న విషయం గురించి క్రాసస్ అసలాలోచించలేదు. అత నా విషయాన్ని పట్టించుకోలేదు. ఈ నిర్లక్ష్యానికి కొన్ని ప్రత్యేక పరిస్థితులు తోడ్పడ్డాయి. అతని న్యాయాన్యాయ విచక్షణ, జ్ఞానం మొరటుబారింది. ప్రతీకారవాంఛ బండదేరింది. చావంటే అతని కే విధమైన భావమూ కలగదు, విచారమూ కలగదు, సంతోషమూ కలగదు. ఉన్నత కుటుంబాలలోని పిల్లలలాగానే యితనుకూడా బాల్యంలో యోధుల వీరగాథలు తెగ విన్నాడు. ఇతని బుర్రనిండా యివే. రోమన్లు అన్నిజాతులకంటె ఉత్కృష్టులు, అతిమానవులు, మానవాతీతులు, దైవాంశసంభూతులు అన్న వాదాన్ని తను పూర్తిగా బలపరిచేవాడు. హృదయపూర్వకంగా నమ్మేవాడు. ప్రభుత్వమూ, రాజ్యాంగమూ, రోమను న్యాయశాస్త్రమూ ప్రజ లందరికీ మేలు చేకూర్చుతా యన్నది యితని గట్టి నమ్మకం. ఎప్పటినుంచి తా నీ విషయాలను నమ్మడం మానేసేదోమాత్రం చెప్పలేడు కాని, నమ్మకం మెల్లిమెల్లిగా జారుకుంటోంది. పూర్తిగా కాకపోయినా చాలామటుకు నమ్మకం సడలింది. ఏదో మూల, ఏ మూలో వీటియందు భ్రమ, యివి నమ్మతగ్గవే అన్న భ్రాంతి రవ్వంత మిగిలిపోయాయి. కాని ఒకప్పుడు యిదీ న్యాయం, ధర్మం అంటే యిదీ అని తెగేసి నిర్వచించి ప్రవచించగల అతని శక్తి నేడు నశించింది. పదేళ్ళక్రితం తన తండ్రినీ, వృద్ధిలోకి రావాల్సిన తన అన్ననూ, ప్రతిపక్ష నాయకులు హత్యచేయించారు. నిర్దాక్షిణ్యంగా చేసేసేరు. అయినా యీ రోమన్ న్యాయమున్నది దారుణమైన ఆ రాజకీయహత్యకు ఏమి శిక్ష విధించింది? ఏది న్యాయం? అన్యాయ మేది అన్నది అయోమయమైపోయింది. ఆ అయోమయావస్థ నానాటికి హెచ్చుతోందే కాని తగ్గేసూచన లేవీ కనబడవు. అధికార ప్రాబల్యమూ, ధనమూ వీటి నాధారంగా

చేసుకుంటే, యివే పునాది అనుకుంటే ఒక తర్కాన్ని, హేతువాదాన్ని తయారు చెయ్యొచ్చు. అతను చేసేడు కూడా. ఏ విధంగా, యే కోణంనుంచి పరిశీలించినా, ఏ కారణం వెతికినా చివరకు ఒకేఒక్క సత్యం కనిపిస్తోంది. అధికారాన్నీ, ధనాన్నీ యేవీ, యెవరూ, యేమీ చెయ్యలేరన్నదే ఆ సత్యం. నీతినియమాలు పాటించే మూర్ఖుడు లేడే! అందుకే, ఈ కారణాలన్నిటివల్లనే కడపటి మల్లుడ్ని శిలువెయ్యడమన్నదో పవిత్రకార్యనిర్వహణగా తోచలేదతనికి. ఒక్కమాటలో దీని సారాంశం చెప్పాలంటే అతను దీన్ని గురించి ఆలోచించనే లేదు. అతని హృదయం చలించలేదు.

ఆ మల్లుడి మనస్సులో కూడా, న్యాయాన్యాయాల గురించిన ప్రశ్నలు బొమ్మజెముడు డొంకలై లేచినై. బాధవల్ల, భయంవల్ల, బడలికవల్ల అతను జాగ్రదావస్థలో లేకుండా పోయాడు. మానసికంగా, శారీరకంగా అతను నిశ్చేష్టుడై ఉన్న పరిస్థితుల్లో యీ ప్రశ్న లుదయించినై. చిక్కులుపడిపోయిన దారపుండలా, గజిబిజిగా అల్లుకుపోయిన స్మృతులలో యీ ప్రశ్న లిరుక్కుపోయాయి. ఆ చిక్కు విడదీయకల్గును, శరీరాన్ని వూపిపారేసి, శరీరాన్ని దూసుకుపోయే, మతిపోగొట్టే అపరిమిత బాధాతరంగాలనుండి ఆ ప్రశ్నలు విడతీయకల్గును. కాని అతనికి క్రాసస్ ఆలోచించిన సంఘటనే ఖచ్చితంగా జరిగిన ప్రతి అంశమూ స్పష్టంగా స్మృతిపథంలో మెరిసింది.

క్రాసస్ కే విధంగా అది న్యాయాన్యాయ నిర్ణయం గురించిన ప్రశ్నగా తోచిందో మల్లులకు గూడ అది న్యాయమేది; అన్యాయమేది అనేది ప్రశ్నగానే తోచింది. కాలం గడిచింది. చరిత్రకారు లని కొందరు బయల్దేరారు. బానిసలనమితంగా అసహ్యించుకొనేవాళ్ళచే, బానిసలు ఏంచేశారో సత్యాసత్యాల నెరుగనివారిచే ఒక చరిత్ర తయారుచేయబడింది. ఆ చరిత్రలో, బానిసలు తమకు పట్టుబడ్డ ఖైదీలను బలప్రయోగంచేసి నగ్నంగా ద్వంద్వయుద్ధం చేయించి ఒకరి నొకరు పొడుచుకచచ్చేలా చేసేరని, విచిత్ర చిత్రవధా విధానాలు ప్రవేశపర్చారని, దారుణమానవ మారణహోమ మహోత్సవం చేసేరని యెన్నో విశేషాలు, యెన్నెన్నో విశేషణాలు చేర్చి రాసుకున్నారు. పీడితులకు అధికారం హస్తగతమయినపుడు వాళ్ళు కూడా పీడకులవలెనే దాన్నుపయోగిస్తా రన్నది పాలకుల అంగీకారాన్ని పొందింది. సాధారణంగా పాలకులు, పాలితుల్ని గురించి యిటువంటివేవి చెప్పినా, నిజానిజాల ప్రసక్తి లేకుండా ఆమోదించి పారేస్తారు.

శిలువమీద వేలాడుతున్న మనిషికి జ్ఞాపకం వచ్చిన విషయం యిది. వాళ్ళనుకున్నట్లుగా బానిసలు ఖైదీలచే బలవంతంగా ద్వంద్వయుద్ధం చేయించి మానవహత్యా

మహోత్సవాన్ని జరిపించలేదు. ఒక్క ఉదాహరణ ఉన్నమాట నిజమే. విపరీతమైన కోపంలో, ద్వేషంలో ఆ యిద్దరు కులీనులను చూపించి స్పార్టకస్ "మేం ఎలా చచ్చామో మీరూ అలానే చావండి! ఆ యిసుకమీద దిసమొలతో నిలబడి ద్వంద్వ యుద్ధంచేసి మరీ చావండి తెలుస్తుంది. మేం రోమ్ వినోదం కోసం, రోమన్ పౌరుల సర్దాకోసం ఎలా ఒకర్నొకరు పొడుచుకు చావాల్సొచ్చేదో మీకే అర్థమవు తుంది."

అప్పుడా యూదు డక్కడే కూచున్నాడు. ఏమీ అనకుండా అంతా వింటు న్నాడు. రోమన్లను ద్వంద్వయుద్ధం చేయించడానికి తీసుకపోయారు. స్పార్టకస్ అతని వేపు తిరిగాడు. ఆ యూదుడేమీ మాట్లాడలేదు. వాళ్ళిద్దర మధ్యా అవినాభావసంబంధ మేర్పడి వేళ్ళు నాటుకుంది. కాలం గడుస్తున్నకొద్దీ, ఎన్నో పోరాటాలు జరుగుతున్న కొద్దీ కేపువానించి తప్పించుకొచ్చిన మల్లుల సంఖ్య తగ్గిపోతూంది. ఒక్కొక్కరే యుద్ధానికి ఆహుతైపోతున్నారు. ఇక మిగిలిన కొద్దిమందీ బానిససైన్యానికి నాయకత్వం వహించారు. ఆ నాయకవర్గంలో ఒకడితో ఒకడు ముడిపడిపోయి విడతీయ నశక్యంగా వున్నారు.

స్పార్టకస్ యూదునికేసి చూసి ప్రశ్నించాడు: "నే చేసింది తప్పా; ఒప్పా?" ఆ ప్రశ్నలో హృదయారాటం ధ్వనించింది.

"వాళ్ళకి ఒప్పైనది మనకి ఒప్పుకాదు."

"వాళ్ళు దెబ్బలాడితే ఏం?"

"నీ కెలావుంటే అలాగేకానీ. వాళ్ళని ఒకళ్ళనొకళ్ళ పొడుచుకచావనీ. కాని అది మననే మరింత బాధిస్తుంది. మన శరీరంలో వేరుపురుగై దొలుస్తుంది. నువ్వూ నేనూ మల్లులం. నికృష్టమైన యీ మల్లయుద్ధాలనూ, ఏ ఒకడి స్మృతిపథంలోనూ లేకుండా తుడిచిపారేస్తాం అని మనం చెప్పి ఎంతకాలం అయిందంటావు?"

"అవును చెప్పేం; తుడిచిపారేస్తాం కూడా. అందులో అనుమానం యేదీ లేదు. కాని వీళ్ళుమాత్రం దెబ్బలాడి తీరాలి."

అదీ అసలు సంగతి. శిలువకు దిగకొట్టే మనిషికి జ్ఞాపకం వచ్చిన విషయ మది. అతని కళ్ళలోకి చూసేడు క్రాసస్. అతన్ని శిలువవెయ్యడం కూడా చూసేడు క్రాసస్. ఒక మహావలయం పూర్తయినది. బానిసల తిరుగుబాటు కేంద్రంగా గీయ బడ్డ తిరుగుబాటుదార్ల మహావలయ మది. ఆఖరుమల్లుని చావుతో ఆ వలయం పూర్త యింది. అలసట చెందిన క్రాసస్ విశ్రాంతి కోసం యింటికి పోయాడు. మేకులు విగ్గొట్టిన మల్లుడు శిలువపై వేలాడుతున్నాడు.

# 4

మల్లుడికి తెలివొచ్చేసరికి ఒక గంట పట్టింది. బాధ అన్న దో బాట. స్మృతి అన్నది బాధలబాటపై పయనిస్తుంది. బ్రహ్మాండమైన ఢంకా నూహించు. అతని ఆవేదనా, యింద్రియజ్ఞానమూ బాగా సాగదీస్తే, సారిస్తే ఆ ఢంకామీద కప్పిన తోలులా తయారవుతుందనుకో. అనుకుండేదానిమీదనే ఇప్పుడు బ్రహ్మాండమైన వాద్యం సాగుతోంది. ఆ వాద్యం, ఆ సంగీతం కర్ణకఠోరమైనది, సహించరానిది; బాధగా ఉంది, నొప్పెడుతోంది అని అత డనుకోవడమే అతనికి వంటిమీద తెలివొచ్చిం దనడానికి తార్కాణం. బాధకి పర్యాయపదం ప్రపంచం. ఆ బాధ అనే ప్రపంచంలో అతని కింకేమీ తెలీదు. ఆ బాధే యీ అనంతవిశ్వం. ఆరువేలమంది సహచరుల్లో అతడు కట్టకడపటివాడు. వాళ్ళందరి బాధా యితనిదే. ఇతడే వాళ్ళబాధ లన్నిటినీ పుణికిపుచ్చుకున్నాడు. కాని తనబాధ అన్నిటినీ మించిన బాధ, బాధలనే బాధించగల బాధ, తనతర్వాత దాన్ని తననించి పుచ్చుకోవడమూ దానిలో భాగాన్ని స్వీకరించడమూ చెయ్యగలవాళ్ళెవరూ యిక మిగల్లేదే. అతని కళ్ళు తెరుచుకున్నాయి. దట్టమైన ఎరుపు రంగు పూసిన అద్దంలాగుంది బాధ. ఆ అద్దం తన నీ ప్రపంచం నుండి విడదీసి యిక్కడ నిలబెట్టింది. తనొక అసహ్యమైన క్రిమి, గొంగళిపురుగు, కంటికి కనీకని పించని గుడ్లల్లో రూపందాల్చే సూక్ష్మజీవి. తనచుట్టూ బాధలగూడు అల్లబడుతోంది. అల్లబడింది.

అతనికి ఒకేమారు స్పృహ రాలేదు. కెరటాలు కెరటాలుగా ఆగి ఆగి వచ్చింది. అతనికి బాగా తెలిసిన బండి, గుర్రపుబగ్గీ - విపరీతమైన కుదుపుతో పోతూన్న ఆ గుర్రపుబగ్గీలోనే స్మృతినిబట్టి తీసుకొచ్చేందుకై అతను బయల్దేరాడు. కొండలమయమయిన ఒక దేశం. ఆ దేశంలో అప్పుడు తనొక కుర్రవాడు. దూర దేశాల్లో నివసించే గొప్ప గొప్ప జమీందారులు. నాగరికులు, శుభ్రం ఎరిగినవాళ్ళు, అప్పుడప్పుడు ఆ కొండదారుల వెంబడి గుర్రపుబగ్గీలపై ప్రయాణం చేసేవారు. "నన్నొకమాటు యెక్కనీయరూ" అని బ్రతిమాలుకుంటూ ఆ బళ్ళ వెనకాలే పడేవా డతను. గొప్పవాళ్ళెంత ఉదారస్వభావులో! అప్పుడప్పుడు మిఠాయిముక్క లిచ్చేవారు. వాళ్ళెవ్వరూ అతని భాష మాట్లాడరు. నల్లని జుట్టువున్న యీ పిల్లలు బండివెనుక బల్లచెక్కనుపట్టుక వేలాడుతుంటే వాళ్ళు చూసి అందంగా నవ్వేవారు. కుర్రాళ్ళు ఎక్కగా చూసి ఒక్కమారు ఆ గుర్రాల్ని అదలించేవారు. ఆ గుర్రాలు బండి నొక కుదుపుకుదిపి శరవేగంతో పరుగెత్తేవి. ఆ కుదుపుకీ, వేగానికీ వెనకాల కూచున్న

పిల్లలు కిందపడేవారు. బాగుంది. పాశ్చాత్యదేశాల ప్రభువు లెటువంటివారో మనం చెప్పగలమా? మన తరమేనా? వాళ్ళలోని చెడును మంచిగా భ్రమిస్తాము. తీరా బల్ల చెక్కమీంచి దూకి క్రిందపడ్డాక దెబ్బతగిలేది మనకే.

అప్పు డతనికి గుర్తుకొచ్చింది. తను గెలీలీ కొండల్లోని బాలుడు కాడింక. శిలువపై వేలాడే వయస్సొచ్చినవాడే. అంతా వకమాటు, అన్ని విషయాలూ ఒకే పర్యాయం తెలుసుకోగల స్థితి రాలేదింకా. కొన్ని కొన్ని ప్రాంతా లతనికి వున్నట్లుగా బోధపడేవి. తన శరీరం తన ఆధీనంలో లేకపోవడమే దీనికి కారణం. ఆ చేతులలో యేదో జరుగుతున్నట్లు గ్రహించాడు. చేతులలోని నరాలు యెర్రగా కాలి, చివరికి తెల్లబడేదాకా కాలిన యినుపతీగల్లాగున్నయి. వాటిలో వెచ్చని కాగే నెత్తురు ప్రవహిస్తోంది. అటువంటి ప్రవాహం శరీరంలో ఎక్కడెక్కడికి యెంతెంతదూరం వెళుతోందో తెల్సిపోతుంది. అదుగో; వంచిన తలకింద మెడ, భుజాలు రెండూ కలిసే భాగం వరకు ఆ రక్తం ప్రవహిస్తోంది. ఇంతలో అతని కడుపులో కండలు బిర్రబిగుసుకపోయి బాధ అక్కడే వున్నట్లు అనుకున్నా డతను. అక్కడే అతని జీర్ణకోశపు పేగులు, మూత్రకోశపు నరాలు, ఏవేవో నరనరాలన్నీ బిగుసుకపోయి, పెనవేసుకుని. ముడివేసుకుని నొప్పికల్గిస్తున్నట్లు తెల్సుకోగల్గాడు.

అతన్ని చూస్తున్న ఆ జనసమూహం, ఆ గుంపు గుంపుల ప్రజలు, పడుతూ లేస్తున్న తరంగాలు, అవేనా ఒక్కొక్కప్పుడు కనపడేవి. ఒక్కొక్కపుడు తరంగాలూ లేవు, యేవీ లేవు. అతను సరిగ్గా చూడలేకపోతున్నాడు. ఏ వస్తువునీ దృష్టిసారించి, కేంద్రీకరించి, చూడ్కినిగిడించి చూడగల స్థితిలో లేడతను. అతను చూసిన మనుష్యులు ముడతలుపడుతూ సాగుతూన్నారేమిటి చెప్మా. వంపున్న అద్దం లోంచి చూస్తే ప్రతీదీ క్రిందికీ, పైకీ, ఈ పక్కకీ, ఆ పక్కకీ సాగుతున్నట్లు కన్పిస్తుంది. అలాగే కన్పిస్తున్నా రా జనం. ఇతని పరిస్థితి ఈ విధంగా వుండగా, మల్లిడికి వంటిమీద తెలివొస్తుందని గ్రహించి, తెలివొచ్చాక ఏంచేస్తాడో చూద్దామనే కుతూహలంతో, ఆతృతతో చూస్తున్నారు జనం. మరోటీ, మరోటీ అయితే అంత మంది జనం అలా చూస్తూ నిలబడకపోదురు. వాటిలో చూడాల్సిన తమాషాయేే ఉండదు. ఈ శిలువెయ్యడమన్నది రోమ్‌లో సర్వసాధారణమైపోయింది; సర్వసామాన్యమైపోయింది. నాల్గుతరాలక్రితం కార్తేజ్‌ని జయించిన రోమ్ కార్తేజ్‌లో రెంటిని మాత్రం బాగా పరిగ్రహించి అనుగ్రహించింది. ఒకటి బానిసలచే వెయ్యబడే వర్తకపు పంటల తోటలు; రెండు శిలువెయ్యడం. ప్లస్సు గుర్తులాగుండే శిలువ. దానిపై ఒక నిర్భాగ్యజీవి వేలాడ్డం రోమ్‌కి యిదంతా బాగా నచ్చింది. అసలు యీ

శిలువపిచ్చి కార్తేజ్‌లో పుట్టిందన్న విషయమే ప్రజలు మరిచిపోయేస్థితికి తీసుకొచ్చింది. రోమ్ శిలువను జాతిపరంచేసి పారేసింది. ఒక్క తన జాతికేనన్న మాటేమిటి యావత్ప్రపంచంలోనూ బహుళవ్యాప్తి పొంది ప్రశస్తమని ప్రస్తుతింపబడ్డ నాగరికతా చిహ్నంగా తయారుచేసిపారేసింది. రోమను రోడ్లెక్కడికి వెళ్తే అక్కడి కా రోడ్ల వెంట బానిసలు పెంచే తోటలపద్ధతీ, ఈ శిలువ, మల్లుల ద్వంద్వయుద్ధరీతులూ, దాస్య బంధంలోపడి నికృష్టజీవితం గడిపే దీనులయెడ ద్వేషం, మానవుల రక్తాన్నీ చెమటనూ పిండి పీల్చి బంగారం చేసుకునే ధనదాహ నైపుణ్యం యివన్నీ చెట్టపట్టాలు వేసుకొని నడిచి వెళ్ళాయి.

కాలం గడిచినకొద్దీ ఒకప్పుడు మంచిదనిపించుకున్నదే చెడుగా మారుతుంది. తినగా తినగా గారెలు చేదైపోతాయి. ఎంతో బాగుందనుకున్న ద్రాక్షసారా త్రాగగా త్రాగగా మొహం మొత్తేస్తుంది. ఒక మనిషికి పుట్టిన పిచ్చి వేలమంది వేలంవెర్రిలో యేమీ కాకుండా పోతుంది. మరొకరెవర్ని శిలువవేసినా యింతమంది రాకపోదురు. కాని యిప్పుడిక్కడో బానిసవీరుడు చావబోతున్నాడు. మృత్యువు తన అనంతమైన హస్తాలను చాచి ఒక గొప్ప మల్లుడ్ని స్వీకరించబోతోంది. ఎల్లకాలాలకూ బానిస విప్లవకర్తగా ప్రసిద్ధిచెందిన బానిస విప్లవకారుడు స్పార్టకస్ యొక్క సహచరుడు, అతనికింద పనిచేసిన సైనికాధికారి, మల్లయుద్ధాలలో ఎంతోమంది నోడించి; చివరకు మిగిలిన ఒక్కగానొక్క జగజ్జెట్టి యిక్కడే చస్తాడు. అటువంటివాని అటువంటి చావు వాళ్ళకో చోద్యం. ఆ చోద్యం వాళ్ళు చూడొద్దామరి; చూస్తారు. ఎప్పుడూ మల్లుని పాత్రలో ఒక వైరుధ్యం వుంటుంది. చావడంకోసం, చంపడంకోసం ప్రత్యేకించ బడిన మల్లుడిలో, ద్వంద్వయుద్ధం చేసే యీ తోలుబొమ్మలో అన్నింటికన్న విప రీతంగా అసహ్యించుకోదగిన యీ మల్లుడిలో ఒక వైరుధ్యముంది. రక్తసిక్త రంగ స్థలంలో నెత్తురు కాలువలు గట్టి ప్రవహించినా కండలు గుట్టలు గుట్టలుగా తెగి పడి వున్నా యీ మల్లుడు బ్రతికేవుంటాడు.

మల్లుడెల్లా చస్తాడో చూద్దామని వచ్చారు జనం. చావు మనిషి కర్థంకాని మాయ. ఆ మాయలోపడి యీ మల్లుడెల్లా మాయమౌతాడో చూద్దామనే కుతూ హలంతో వచ్చారు వాళ్ళు. మేకులు దిగగొట్టినపుడైనా నోరుమెదపడా? చూద్దాం, ఏం చేస్తాడో అని వచ్చారు. అంత బాధతోనూ, నొప్పితోనూ మౌనంగా ఉండగలగడం యెంత వింత! అదో ప్రజ్ఞ. మేకులు చేతుల్లో దిగి, వార్త మెదడు కందినప్పుడైనా, యేదోఒకటి చెయ్యకపోతాడా అని నిరీక్షించారు. కాని వాళ్ళ నిరీక్షణవల్ల ఫలితం లేక పోయింది. అతనేమీ అరవలేదు. వాళ్ళెంతో పట్టుదలైనవాళ్ళు కనుకనే, అతను కళ్ళు

తెరచి ప్రపంచాన్ని చూడగల జాగ్రదావస్థలోకి వచ్చినపుడైనా అరవకపోతాడా అని అల్లాగే నిలబడ్డారు.

వాళ్ళ మనోరథం యీడేరింది. అరిచేడు మల్లుడు. ఎంతోసేపటికి వాళ్ళకేసి అతను చూసేక, కళ్ళముందున్న వస్తువులన్నీ ఊదులాడుతున్నట్లు, సాగిపోతున్నట్లు కనబడక కొంచం స్పష్టంగా అగుపించాక అరిచాడు. నొప్పితో, వేదనతో, బాధతో దిక్కులు పిక్కటిల్లేలా, రోదసీకుహరం బ్రద్దలయ్యేలా, కువలయం కంపించేలా బ్రహ్మాండమైన అరుపొకటి అరిచాడు.

అతనన్న దేమిటో వాళ్ళెవరికీ బోధపడలేదు. బాధ బ్రద్దలై అతని నోటివెంట మాటలై పెగిలింది. ఆ మాటలేమిటా అని తెగ ఆలోచించారు. అతను మాట్లాడడని కొందరూ, మాట్లాడలేరని కొందరూ పందేలు వేసేరు. దెబ్బలాటలలో, పందెంవేసే ననీ వెయ్యలేదనీ, పేచీలలో వాదనలలో కొందరు ఒడ్డిన పందెపుసొమ్ము చెల్లించేరు. మరికొందరు చెల్లించలేదు. కొంద రతనేమీ మాట్లాడలేడనీ, గట్టిగా మూలిగేడనీ, తామే నెగ్గేమనీ అన్నారు. అందులో కొందరు అతను మరో భాషయేదో మాట్లాడేడనీ యేభాష మాట్లాడినా అవీ మాటలే అనీ, మొత్తంమీద మాట్లాడేడు కాబట్టి పందెం తమదే అనీ కూచున్నారు.

అతను భగవంతుణ్ణి స్మరించాడని కొందరూ, వాళ్ళఅమ్మకోసం మూలిగేడని మరి కొందరూ అభిప్రాయపడ్డారు.

నిజానికి అదేమీ కాదు. అతను గట్టిగా అరిచేడు. దాన్లో ఉన్న మాటలివి: "స్పార్టకస్! స్పార్టకస్! మనం యెందుకు ఓడిపోయాం?"

## 5

చరిత్ర యినుపపాదాలక్రింద, స్పార్టకస్ లేవదీసిన తిరుగుబాటు మట్టికొట్టుకు పోయింది. ఆరువేలమంది తిరుగుబాటుదార్లు పట్టుబడ్డారు. ఏదో యింద్రజాలంచేసి, ఆ ఖైదీలందరి మనస్సులూ, మెదడులూ దేనికది విడిదీసి, విప్పి తెరిచి యీ చిక్కులు పడ్డ అల్లికకు మొదలేది, అంతెక్కడ అనిచూస్తే; యీ ఆరువేల జీవిత చిత్రాలనూ లిఖిస్తే, వాళ్ళందరి గతజీవితాలూ ఒకేలాగున్నట్లు తేటతెల్లమౌతుంది. బహుశా వాళ్ళ అంత్యదశలో, ప్రాణావసాన కాలంలోకూడా వాళ్ళల్లో తేడాలేదు. సాధారణంగా వాళ్ళంతా ఒకరకమైన బాధలననుభవించేవారు. ఒకేలా వ్యధచెందేవారు. ఆ బాధలన్నీ, వ్యధలన్నీ కలిసి నిలిచేయి. దేవతలే కనుక ఉంటే, పోనీ ఒకే ఒక్క సర్వాంతర్యామి అనబడేవాడే ఉంటే, యీ వర్షాలు ఆ దేవతల, లేక సర్వాంతర్యామియొక్క కన్నీటి

చుక్కలే అయితే, రోజుల తరబడి, నెలలతరబడి సంవత్సరాల తరబడి, శతాబ్దాల తరబడి ఆ కన్నీటి వర్షం భోరున పడుతూనేవుండును. కాని అటువంటిదేదీ లేదు. వీళ్ళను దౌర్భాగ్యంలో వేసేసేవాడు సూర్యుడు. రక్తాలుకారే మాంసపు ముద్దల్ని పీక్కుతినేవి పక్షులు. మనుష్యులు చచ్చేవారు.

ఆ ఆరువేలమంది చచ్చే వాళ్ళ జాబితాలోనూ యితని పేరు ఆఖరున వుంది. ఆరువేలమందినీ కూడితే ఆ కూడిక ఫలితమే యితను. మానవ జీవిత సర్వస్వం అతని మనస్సులో నిండివుంది. కాని అటువంటి బాధతో, బాధలో మనిషి ఆలోచించ లేడు. స్మృతులు పీడకలలుగా అతన్ని భయపెట్టేయి. ఆ స్మృతులన్నీ యిటూ, అటూ పేర్చి ఒక రూపాన్ని కూడా సృష్టించుకోవచ్చు. ఆ రూపం తక్కిన వాళ్ళందరి బాధల జీవితరూపాల నుండి వేరుకాదు.

అతని జీవితాన్ని నాలుగు దశలుగా విభాగిద్దాం. మొదటిది : అజ్ఞానపు బాల్యదశ. రెండవది : జ్ఞానం వచ్చిన దశ. ద్వేషం అతని కా దశలోనే అల వడింది. అత నప్పుడే ద్వేషంతో నిండేడు. మూడవ దశలో ఆశ. అప్పుడే అతనిలో ద్వేషం మాయమై సహచరులయెడ ప్రేమ, సౌహార్ద్రభావా లేర్పడినై. నాలుగో దశలో నిరాశ.

ఆ అజ్ఞానదశలో అతనో బాలుడు. అతని కా దశలోనే యేదో అనిర్వచనీయ మైన ఆనందం, ఎందుకో తెలియని ఆనందం కలిగేది. అప్పుడే అతని జీవితం వెలుగు బాటలో నడిచేది. నొప్పియొక్క కరాళదంష్ట్రలనుండి తప్పించుకుందుకై చల్లని చల్ల దనంకోసం అతను ప్రయత్నిస్తే, అతని కా చల్లదనం తన బాల్యావస్థలోనే కనబడింది. బాల్యదశలో అతను చూసిన ఆకుపచ్చని కొండలన్నీ చల్లగా, హాయిగా, అందంగా వున్నాయి. తళతళ మెరుస్తూ కుబుసం విడిచిన పాములా జలజలా పారేవి సెలయేళ్ళు. నల్లని మేకలు కొండవారలమ్మట నిగనిగలాడే పచ్చగడ్డిమేసేవి. పంటభూములను ప్రాణా స్పదంగా చూసుకునే ప్రేమాస్పదమైనచేతు లాకొండపక్క బార్లీ వగైరా పంటలు పండే భూములను జాగ్రత్తగా సాగుకు లాయకయ్యేటట్లు చూసేవి. ముత్యాలపంటలా గుండేది బార్లీ. కెంపుల్లా మెరిసేవి ద్రాక్షపళ్ళు. ఆ కొండలదగ్గరే అత నాడుకునేవాడు. ఆ సెలయేళ్ళ గానాన్ని వింటూ, వాటిలో జలకమాడేవాడు. గెలీలీలో అందమైన పెద్ద చెరువొకటుంది కూడా. ఆ చెరువులో నీలాలనీళ్ళల్లో యీదులాడేవాడు. ఆరోగ్యంగా సంతోషంగా చెంగుచెంగున గెంతే లేగదూడలాగుండే వాడతడు. అన్నలు, చెల్లెళ్ళూ, అక్కలు యెంతో కులాసాగా ఆడుకునే పిల్లల్తో అతను హాయిగా సర్దాగా ఆడుకునేవాడు.

ఆ కాలంలోగూడ, అంత బాల్యావస్థలోనూ అతనికీ ఒక దేవుడుండేవాడు. ఆ దేవుడు ఫలానివిధంగా, ఫలానిరూపంతో వుంటాడని తన హృదయఫలకంపై స్పష్టంగా చిత్రించుకున్నాడు. అతను కొండజాతికి చెందినవాడు. కొండజాతుల ప్రజలు తమ దేవతలను మనుష్యమాత్రుడికి ఎక్కడానికి సాధ్యంకాని మహోన్నత పర్వత శిఖరాగ్రాలమీద ప్రతిష్ఠించుకునేవారు. ఆ దేవతావిగ్రహాన్ని స్వయంగా తమచేతుల్తో అక్కడ ప్రతిష్ఠించకపోయినా, భగవంతుని నివాసమదేనన్నది వారి దృఢనమ్మకం. సర్వకాల సర్వావస్థలయందూ ఆ భగవంతుడు అక్కడే కూచుంటాడు. భగవంతుడనే వాడొకడే; ఎంతోమంది లేరు. భగవంతు డో ముసలివృద్ధు. ఆ వృద్ధునికి తెల్లని దూదిలాంటి గెడ్డం గుండెలదాకా, యింకా కిందుగా వేలాడుతోంది. గాలికి అతని తెల్లనిబట్ట కదిలితే తెల్లనిమేఘాలు పరుగెత్తినట్లుంటాయి. ఆ భగవంతు డన్యాయంచేసే ప్రభువు. అప్పుడప్పు డా ప్రభువు కరుణ జూపిస్తాడు కూడా. కాని ఎప్పుడూ మానవుడు చేసిన తప్పులకూ, పాపాలకూ కసితీర్చుకునే స్వభావం కలవాడు. పగలు, రాత్రి ఎప్పుడూ ఆ చిన్నపిల్లాణ్ణి భగవంతుడు చూస్తూనేవుంటాడు. ఆ కుర్రాడికి భగవంతుని చూపుల బారినుండి తప్పించుకోడం కష్టం. అతడు చేసే ప్రతీదీ భగవంతుడు చూస్తాడు. ఆఖరికి అతని బుర్రలో ఏ ఆలోచన మెదిలినా భగవంతుడు యిట్టే పసికట్టేస్తాడు.

మతతత్వం బాగా తలకెక్కిన ప్రజల్లోంచి వచ్చాడతను - మతతత్వంలోనూ బ్రహ్మాండమైన మతతత్వం. చాద స్తమయిన నానానేక ఆచార భూయిష్టమైన మతతత్వం. వాళ్ళు నిత్యజీవితంలో చేసే చూసే ప్రతిదానిలో, ఒకటేమిటి? వాళ్ళ జీవితాలన్నిటి లోనూ, అన్నివైపులా అల్లుకుపోయిన దారంలా వుండేవాడు భగవంతుడు. వాళ్లు పశువుల్ని మేపేటప్పుడు చారల కంబళీ నొకదానిని కప్పుకునేవారు. ఆ కంబళీలోని ప్రతిచారా; ఆ చారలోని ప్రతీదారం వాళ్ళకి భగవంతుడంటే వుండే వివిధరకాలైన నమ్మకాలను, భయాలను, భక్తిప్రపత్తులను సూచిస్తాయి. అన్నం తినడానికి కూర్చునప్పుడు మొదటి ముద్ద నోట్లోకి వెళ్ళకపూర్వం వాళ్ళాదేవుని ప్రార్థించేవారు. ఒక గ్లాసుడు ద్రాక్షరసం తాగితే దానిని తమకు లభింపచేసినందుకు దయామయుడైన సర్వేశ్వరునకు కృతజ్ఞత తెలియజేసేవారు. దురదృష్టం లాగి లెంపకాయకొట్టినా, భగవంతుడా మాకు ముట్టాల్సిన ప్రతిఫలం ముట్టింది, ఈ పాపిని రక్షించు అని ప్రార్థనలు చేసేవారు. దురదృష్టాన్ని వీరు సహించలేకపోతున్నారు అనే అభిప్రాయం ఆ భగవంతునికి కలగకూడదు. దుర దృష్టాన్ని వ్యతిరేకించే బుర్రతిరుగుడు వీళ్ళకొచ్చిందా అని ఒక్కక్షణమైనా ఆ భగ వంతునికి కలగకూడదు.

శిలువపై వేలాడడానికి తగ్గ యుక్తవయసొచ్చిన ఆ మల్లుడు ఆ విధంగా తన చిన్నతనంలో పసివాడయి వున్నప్పుడు ధ్యానమంతా భగవంతునియందు నిలిపి సర్వమూ ఆ దేవుడేననే భావంతో వుండేవాడు. ఆ కుర్రాడు భగవంతుడంటే భయపడే వాడు. వాళ్ళ భగవంతుడు భయపెట్టే స్వభావం కలవాడే. కాని ఆ భయం సర్వవ్యాపిత మైన ఈ భానుకాంతిలో, పచ్చని కొండల, సెలయేళ్ళ, గుబురుగా పెరిగిన చెట్ల చల్ల దనంలో, ఏదో ఒకమూల పొరపాటున జారిపడ్డ అపస్వరంలాగుండేది. పసివాడు పరుగులెత్తేవాడు. గెంతేవాడు. ఆరోగ్యమైన, నిష్కల్మషమైన తెల్లనినవ్వు నవ్వేవాడు. చల్లనిపాటలు పాడేవాడు. మేకల్ని, గొర్రెలని కాచేవాడు. గెలిలీ ప్రజలుపయోగించే చాబో అనే కత్తిపట్టుకుని తనకన్న పెద్దకుర్రాళ్ళు సాము చేస్తోంటే చూసేవాడు. ఆ కత్తిపక్కన వేలాడిన ప్రతివాడికి గెలిలీలో మెదడులో కొద్ది స్వాతిశయం పొడ చూపేది. అది పట్టుక తిరగడమంటే ఆ ప్రజలకు కొంత గర్వముండేది. తనూ ఒక కత్తి సంపాదించేడు. అది కర్రకత్తి - ఆ కత్తి పుచ్చుకొని తన యీడువాళ్ళతో సర్దాగా యుద్ధంచేసేవాడు.

అతను కత్తి బాగా తిప్పితే అతనికన్న పెద్దవాళ్ళు బాగా చేసేవురోయ్ అని తన నైపుణ్యాన్ని మెచ్చుకుందుకు యిష్టపడేవారు కారు. అక్కడికీ థ్రేషియన్లా గున్నావురోయ్ "కుర్రకుంకా" అనేవారు. థ్రేషియన్ అంటే దుర్మార్గానికి అపరావ తారమన్నమాట వారి దృష్టిలో. థ్రేషియన్ అంటే యుద్ధాల్లో ఆరితేరిన రణకోవిదు డన్నమాట. పూర్వం యెంతో కాలం క్రితం తనదేశంమీదకు కిరాయీ సైనికులు దాడిచేశారు. వాళ్ళను తరిమేసే సరికి యెన్నో సంవత్సరాలు పట్టింది. ఎంతో యుద్ధం చేయాల్సొచ్చింది. ఈ కిరాయి సైనికుల్నే థ్రేషియన్లనేవారు. వాళ్ళను తా నెన్నడూ చూడలేదు.

తన మొలలో యెప్పుడు కత్తి వేలాడదీసి ఠీవిగా తిరుగుతానా అన్నదే అతని ఆలోచనంతా. అప్పు డంతా తెలుసుకోగలరు. కత్తి చేతబట్టి తా నీ థ్రేషియన్లందరి కంటే బాగా పోరాడగలడో లేడో అందరూ తెలుసుకోగలరు. అత డేమనుకున్నా, ఎంతనుకున్నా భీకరంగా మాత్రం కనపడేవాడుగాదు. శాంతస్వభావం కల్గిన మృదు వైన ఒక చిన్నబాలుడు; ఎంతో సంతోషంగా కనపడే పిల్లాడు.

అది అజ్ఞానపు బాల్యదశ.

ఇక ద్వితీయదశా ప్రారంభం. అది అతని జ్ఞానావస్థ. ఇంకేమాత్రం అతను కుర్రాడు గాదు. రమణీయమైన సూర్యకాంతి పోయింది. దానిస్థానే మంచులా చల్లగా వుండే శీతలవాయువు విసిరింది. కమనీయమైన సెలయేటిగానం లేదు. దాని

స్థానాన్ని చర్మాన్ని కోసిపారేసే హేమంతతుషారం ప్రవేశించింది. కాలం మించిపోకుండా అతడు జాగ్రత్తపడాలి. అందుకే సకాలంలో స్వీయరక్షణార్థం అతడు ద్వేషమనే దట్టమైన కంబళి కప్పుకున్నాడు. ఆ దశే, ఆ కాలమే, శిలువపై వేలాడే అతని హృదయాన్ని తళతళ మెరిసే ఖడ్గమై దూసుకపోయి ఎర్రని బాధను కల్గించింది. ఆ కాలాన్ని గురించిన అతని ఆలోచనలు, అతని స్మృతులు మెలికలు తిరిగి భయంకరంగా భయపెట్టాయి. ఆ ఆలోచనల వాడిరంపపు పళ్లు అర్థంగాకుండా అయోమయంగా వున్నాయి. ఇసకేస్తేరాలని జనం తన్ను చూస్తున్నారు. వాళ్ళ కళ్ళల్లో, వాళ్ళ అరుపుల్లో, వాళ్ళుచేసే ప్రతి శబ్దంలో, ఉచ్ఛ్వాసనిశ్వాసములో అతనికి తన జీవితపు రెండోదశ అజ్ఞానావస్థ కనిపించింది. అతని ఆవేశానికి సహనముంది. ఆ విధంగా సహించినపుడల్లా స్మృతిపథం వెంట ఆ రెండోదశలోనికి విజ్ఞానాన్ని సంపాదించిన ఆ కాలంలోకి అతను నెట్టిపారవేయబడ్డాడు.

ఆ కాలంలో అత నెన్నో విషయాలు తెలుసుకునేవాడు. ఆ తెలుసుకోవడంలోనే అతని బాల్యం, బాల్యచేష్టలు కరిగిపోయి కనిపించకుండా మటుమాయమయ్యాయి. చిన్నప్పటికన్న యిప్పుడు తనతండ్రి గురించి మరింత తెలిసింది. ఎండలో పనిచేయడంవల్ల కమిలిపోయిన శరీరం, కాయకష్టం చేయడంవల్ల రాయిలా గట్టిపడ్డ శరీరం. రాత్రింబవళ్ళు విశ్రాంతి లేకుండా శ్రమపడేవాడు. ఆ శ్రమకు అంతులేదు. అతనికి విచారం గురించి తెలిసింది. తన తల్లి చచ్చిపోయింది. అందుకు వాళ్ళు విలపించారు. పన్నుల గురించి తెలుసుకోగల్గేడు. ఈ పన్నులు రాక్షసినోటిలోని పళ్లల్లాంటివి. తన తండ్రి రెక్కలు ముక్కలు చేసుకొని చెమటోడ్చి పనిచేసినా కుటుంబానికి కడుపు నిండేది కాదు. పోనీ భూమి సారవంతమైనదికాదా అంటే ఆ విషయంలో మరేభూమితోనూ తీసిపోదు. బాగా పండేది. అప్పుడు అతనికి తెలిసింది ధనవంతులకూ, బీదలకూ మధ్య అఖాతమొక టుందని.

ఇప్పు డతడు విన్న ప్రతి శబ్దమూ చిన్ననాడు తను విన్నదే. కాని ఆ శబ్దాల యొక్క అర్థం యిప్పుడే తెలుసుకోగలిగాడు. పూర్వం వాటి భావం యేమిటో తెలుసుకోకుండా యేదో వినేసేవాడు. పెద్దవాళ్ళు మాట్లాడుకునేటప్పుడు పూర్వంలాకాకుండా యిప్పు డితన్ని కొంచెం దూరంలో నిలబడి వాళ్ళమాటలు విననిచ్చేవార. పూర్వమయితే “కుర్రవెధవ్వి, నీ కెందుకు పోయి ఆడుకో” అని గదిమేసేవారు.

అతని కొక కత్తిగూడా యివ్వబడింది. కాని ఆ కత్తితోబాటు సంతోషం మాత్రం రాలేదు. కొండలుదాటి అయిదుమైళ్ళు కాలినడకను తనూ, తనతండ్రీ మరో

ఊరెళ్ళారు. అక్కడే యినుప సామాన్లు తయారుచేసే కమ్మరి వకడున్నాడు. వీళ్ళక్కడ మూడుగంటలపాటు నిలబడ్డాక అత డొక కత్తి తయారుచేసి యిచ్చాడు. ఆ మూడుగంటలసేపూ తన తండ్రీ, ఆ కమ్మరీ దేశంలో వ్యాపించిన సంక్షోభం గురించి తమబోటి సామాన్యజనం యెలా పీడింపబడుతున్నదీ మాట్లాడుకున్నారు. తన తండ్రీ, ఆ కమ్మరీ పోటీపడ్డట్టుంది. ఎవ రెక్కువ పీడింపబడుతున్నదీ చెప్పుకోవడంలో వకరితో వొకరు పోటీపడ్డారా అన్నట్టు తోచింది తనకి. "ఈ కత్తి తీసుకో!" కమ్మరి చెప్పాడు "దీనికి నాల్గుదీనారాలియ్యి-ఆ నాల్గుదీనారాల్లోనూ నాల్గోవంతు అంటే ఒక దీనారం బకాయి పడిపోయిన గుడిపన్ను చెల్లించడానికి పన్నులవాళ్ళు చంపేస్తున్నారు. మరో నాల్గోవంతు ప్రభుత్వపుపన్ను. ఇక రెండు దీనారాలు మిగుల్తాయి. కత్తి చెయ్యాలంటే యినుం కావాలికదా? ఆ యినుపముక్కకయ్యే ఖర్చు రెండు దీనారాలు. మరినాకు మిగిలేదేమిటి మన్ను. వళ్ళు హూనమయ్యేటట్లు పనిచేశానా? ఆ పనికి కూలీ అక్కర్లేదా? అదీకాక యీ కత్తిపిడికోసం కొమ్ము కొనాలిగా? దానికి డబ్బెక్కణ్ణించి వస్తుంది? ఇన్నిటికీ సరిపోయాక నా కుటుంబం పోషింపబడాలంటే ఎలాగ? దీని ధర ఐదు దీనారాలు చేస్తే అంతా బాగానేవుణ్ను; కాని మరోచోట నాల్గు దీనారాలకు దొరుకుతున్నపుడు మీరీ నాల్గు దీనారాలే అతికష్టంమీద యిస్తోన్నపుడు ధర పెంచితే అడుక్కుతినాల్సిందే. భగవంతుడికీ నీ యందే దయ. మట్టిలో ఏదో ఒకటి పండించి వేళకింత తింటారు."

కుర్రాడి తండ్రికిమాత్రం మరొక వాదనలేదా? అతనికీ వుంది బాధలగాధ ఒకటి. "అప్పుడప్పుడు నీ దగ్గర ఎంతో కొంత రొక్కమైనా ఏడుస్తుంది. నా గొడవ చూశావా? బార్లీ పంటకోసి కళ్ళంవేస్తా. ముత్యాల్లా మెరుస్తుంది బార్లీ. పంటలవేల్పుకు దయచూపించావు నాయనా అని దణ్ణంపెడ్తాం. మా బార్లీ బాగా పండిందిగా. గోదాంలో బార్లీ రాసులుగా పడివుంటే యింక బాధపడడం దేనికీ? కాని యింతలో యమభటుడిలా తయారవుతాడు గుడి పన్నువాడు. పంటలో నాల్గోవంతు వాడి కాష్ఠంలో పోస్తాం. వీడయాక ప్రభుత్వపు పన్నంటూ మరొక యముడు తయారు. ఈ ప్రభుత్వం ఎక్కడుందో ఏమిటో; వేళ మించిపోకుండా పన్నుకోసంమాత్రం ఒకణ్ణి పంపుతూ వుంటుంది. నాల్గోవంతు వాడు లాక్కెడతాడు. వాణ్ణి నేను బతిమాలుకుంటా. నా పశువులకే చాలినంత బార్లీలేదు; వస్తున్నది చలికాలమని వేడుకుంటా. నీ పశువులు తిండానికి లేకపోతే చలికాలంలో ఆ పశువుల్నే నువ్వుతిను అంటాడు వాడు. ఆఖరికి ఆ దౌర్భాగ్యపుపనే చేయాల్సిన దుర్గతి పడ్తుంది. మాంసంకాని, ధాన్యంకాని ఏమీ లేకుండా పోయినపుడు పిల్లలన్నంకోసం ఏడిస్తే బాణాలకి తాళ్ళుకట్టి కొండల్లో కుందేళ్ళుగాని,

దుప్పులుకాని మిగిలిపోయేయేమో చూద్దామని బయల్దేరుతాం. కాని యిది అపవిత్రమైన ఆహారం. యూదుడికి ఈ మాంసం నిషిద్ధమని నాకు తెలుసుగా. మతాచారుల అంగీకారం పొందితేగాని, వాళ్ళు అభయం యిస్తేనేగాని ఈ మాంసం తినకూడదు. అందుకని కిందటి శీతాకాలంలో మా గ్రామపెద్దని జెరూసలేంకు పంపించాము. అక్కడ మతాచారులతో మొరపెట్టమని చెప్పాం. మా గ్రామపెద్ద వున్నాడే అతను చాల మంచివాడు. అతని ఆకలి మా ఆకలి. ఐదురోజులు ఆ ఆలయాల్లో దేవుళ్ళాడాడు మావాడు. ఎంతటికీ గురువుల దర్శనం కాలేదు. దర్శనమైనా యితను చెప్పిన మాటలు విని చీదరించుకున్నారట. ఐదురోజులైంది గదా వచ్చి, వీడికో పిడికెడు మెతుకులు పారేద్దామనికూడా తల్చలేదు వాళ్ళు. ఆకలితో మలమలా మాడిపోయాడు. "గెలీలీ వాళ్ళింక మూల్గడం, నీల్గడం యిక మానరేమిటోయ్?" అని అడిగారట వాళ్ళు. మీ రైతులు సోమరిపోతు లన్నారటగూడ. వెచ్చని యెండలో సుష్టుగాతిని పడుకోవడమే వాళ్ళ పని. మీ వాళ్ళని మరికొంచెం శ్రమపడి మరింత బార్లీ పండించమను. అంతా బాగుంటుంది అని గురువుగారు ఉపదేశమిచ్చారట. మరింత పండిస్తే మరింత గుడి పన్ను. పోనీ పండిద్దామంటే భూమి ఖాళీగా కూచుందేమిటి; పోనీయవయ్యా ఎల్లాగోలా, మరింత పండించామే అనుకో. ఏమవుతుందో తెలుసా?"

"ఏమవుతుందో తెలీదంటావా ఏంటి" అన్నాడు కష్మరి. "చివరకు నీకేం లేకుండాపోతుంది. ఎప్పుడూ మనకి మిగిలేదంతే. లేనివాడు మరింత లేకుండాపోతాడు; డబ్బువున్నవాళ్ళు మరింత కూడబెడ్తారు."

కత్తికోసం తను వెళ్ళినప్పుడు యిలాగైంది. ఇంటిదగ్గర మాత్రం ఇంతకన్నా ఏముంది. వాళ్ళున్నదో చిన్నయిల్లు. ఆ యిల్లంతా కలిపి ఒకటే గది. ఆ గదిలో అంతా కూరుకుపోయి వుండేవాళు. ఇంట్లో సాయంత్రపువేళ యిరుగు పొరుగు వాళ్ళంతా వచ్చి కూచుని కష్టం సుఖం మాట్లాడుకునేవారు. వాళ్ళ నెలా పిండి పీల్చి పిప్పిచేసి పీడిస్తున్నారో, బ్రతకడం ఎంత దుర్భరమైపోయిందో మాట్లాడుకునేవారు. ఈ పీల్చేయడం ఎంతకాలం కొనసాగుతుంది. రాళ్ళనించి రక్తాన్ని పిండగలరా?"

శిలువమీద మనిషి ఆ విధంగా ఆలోచించాడు. ఇవి మనస్సును పొడిచి బాధించే స్మృతులు. తన కష్టాలను జ్ఞప్తికితెచ్చే చేదైన స్మృతులు. అతనంత బాధపడిపోతున్నా సహించలేనంత నెప్పి కెరటాలు కెరటాలుగా లేస్తున్నా ఆ కెరటాలు కొంత తగ్గినపుడు మాత్రం యింకా బతకాలనే వాంఛించాడు. అప్పటికప్పుడే చచ్చినవాళ్ళలో జమ అయిపోయాడు. శిలువకు బలియై మృత్యుగహ్వరంలోనున్నా యింకా బ్రతకాలనే

వాంఛించాడు. జీవితం! అది ఎటువంటి శక్తి. జీవితం! అది ఎటువంటి పూపు. వని మనుగడకోసం మనుషు లెటువంటెటువంటి పనులు చేస్తారు.

ఎందుకలాగ అతనికి తెలీదు? ఆ గాథలో అతడు భగవంతుణ్ణి పిలవలేదు. ఎందుకంటే దీనంతకూ భగవంతుడిలో ఏ సమాధానమూ దొరకదు. దీని వివరణా కనపడదు. భగవంతుడన్నా, తదితర చిల్లరదేవుళ్ళన్నా అతనికింకేమాత్రం నమ్మకం లేదు. తనజీవితపు రెండోదశలో తనకు భగవంతుడితోనున్న సంబంధం కాస్తా తెగి పూరుకుంది. ధనవంతుల ప్రార్థనలనే వింటాడు భగవంతుడు.

అందుకని భగవంతుణ్ణి స్మరించడం మానేశాడు. ధనవంతులు శిలువలపై వేలాడరుగదా. కాని తన జీవితమంతా శిలువమీదనే గడిపాడు. చేతులలో మేకులతో శాశ్వతంగా ఆ శిలువమీదనే వున్నాడు. ఉన్నది తనా, పరొకరెవరైనానా? తన తండ్రి కాదుగదా వుంటా? బుర్రసరిగ్గా పనిచేయడంలేదిప్పుడు. అతని మెదడులో సక్రమంగా అందంగా పేర్చిన ఆలోచనలన్నీ చెదిరిపోయాయి. తన తండ్రిని శిలువవేసిన సంగతి జ్ఞప్తికొచ్చినప్పుడు తనతండ్రికి బదులు తననే శిలువవేసినట్లుగా గాభరాపడ్డాడు. ఆందోళనగా వున్న అతని మెదడులోని స్మృతులన్నిటినీ తిరగేశాడు. అప్పుడా శిలువేయడమన్నది ఎందుకని జరిగిందో అతనికి కొద్దికొద్దిగా జ్ఞాపకమొచ్చింది. పన్ను వసూలుచేసే వాళ్ళొచ్చారు. వట్టిచేతుల్తో తిరిగిపోయారు. గుడిపన్ను కోసం మరొకళ్ళు తయారయారు. ఉత్తిచేతుల్తోనే పోయారు. వీళ్ళందరినీ తన్ని తగిలేసేరు.

అది జరిగిన కొద్దికాలం వరకు మనంకదా యింతపని చేశాం అన్న గర్వం ప్రజల్లో నుండేది. పన్నులు నిరాకరించి వసూలుకోసం వెళ్ళినవాళ్ళని అవమానపరిచిన ఈ ప్రజలమీదికి మొదటిసారిగా మతగురువు సైన్యాల్ని పంపాడు. కొండల్లోని రైతులు బాణాలూ, కత్తులూ పుచ్చుకుని ఆ సైన్యాల్ని ధ్వంసం చేశారు. ఆ పోరాటంలో తనూ వున్నాడు. పధ్నాల్గేళ్ళ గుంటడే తను. తండ్రితోబాటు కత్తిచేబట్టి శత్రువుని టకటక లాడించేశాడు. విజయాన్ని చవిచూశాడు.

కాని ఆ రుచి చాలాకాలం వుండిపోలేదు. గెలీలీ తిరుగుబాటుదార్ల నణచడానికి కవచాలు ధరించిన సైనిక నికాయాలు పంపబడ్డాయి. కిరాయీ సైనికదళాలు వచ్చాయి. దేవాలయ ఖజానాల డబ్బుపాతర్లకు అంతులేదు. అందుకనే మతగురువులు కావలసినంతమంది కిరాయి సైనికుల్ని కొనగలరు. ఒంటిమీద గుడ్డలేని రైతులెక్కడ! కవచధారులైన మహాసైన్యమెక్కడ! అక్కడికీ కత్తులు చేబూని రైతులు ప్రతిఘటించారు. కాని వాళ్ళ తిరుగుబాటు అణచివేయబడింది. రెండువేలమందిని ఖైదీలుగా పట్టుకున్నారు. ఆ రెండువేలమందిలో తొమ్మిదివందలమంది శిలువలకోసం ప్రత్యేకించ

బడ్డారు. ఇదీ నాగరికుల పద్ధతి, ఇదీ పాశ్చాత్యప్రభువుల పరిపాలనా విధానం. కొండల పక్క శిలువలు రుద్రాక్షపూసల్లా వేలాడుతుంటే మతగురువులు చూడ్డంకోసం వచ్చేవారు. వాళ్ళతోబాటు రోమను సలహాదార్లు కూడా వచ్చేవారు. ఆ కుర్రాడు, డేవిడ్, తన తండ్రిని మేకులు దిగ్గొట్టి శిలువవేస్తుంటే చూశాడు. శిలువేసిన తన తండ్రి శరీరాన్ని, తనను లాలించి ప్రేమించిన తన తండ్రి శరీరాన్ని పక్షులు పీక్కుతింటూంటే అలాగే చూశాడు.

ఇప్పుడు తనే శిలువ నలంకరించాడు. కథ ఎలా ప్రారంభమయిందో ముగియడంకూడా అలానే ముగిసింది. అతనెంతగా అలసిపోయాడు. బాధతో, విచారంతో వింతగా నిండిపోయింది తన ప్రాణం! మనిషికి తెలిసిన కాలపు కొలమానాలతో సంబంధంలేనికాలం శిలువమీద వేలాడేకాలం. అత నా కాలాన్ని గడుపుతున్నప్పుడు, ఆ కాలం గడుస్తున్నప్పుడు, ఒక తెగనిప్రశ్నకు సమాధానంకోసం తెగవెతికాడు. శూన్యంలో పుట్టి, గిట్టి శూన్యంలోనికే పోయే ఈ జీవితార్థం ఏమిటి? ఏమిటి దీని పరమార్థం? అన్నదే ఆ ప్రశ్న. అతన్నింతకాలం ప్రాణాల్తో నిలిపిన జీవితంమీద పట్టు సడలిందిప్పుడు. మొదటిసారిగా చావాలనుకున్నాడు.

(తనకు స్పార్టకస్ చెప్పినదేమిటి? మల్లుడా జీవితాన్ని ప్రేమించు. అన్ని ప్రశ్నలకూ అదే సమాధానం. కాని స్పార్టకస్ జీవించిలేడే. తను జీవించి వున్నాడు.)

అలసిపోయాడతను. బడలిక బాధతో పందెం వేసింది. అతని స్మృతుల పేలికలు బడలికమయమైపోయాయి. ఆ తిరుగుబాటు విఫలమయ్యాక తనూ మరో ఏడువందలమంది కుర్రాళ్ళూ మెడకూ మెడకూ గొలుసులు తగిలింపబడి తీసుకపోబడ్డారు. వాళ్ళెంతకాలం నడిచారో! కొండలు, ఎడార్లు, మైదానాలు కడచి నడిచారు. వాళ్ళ. గెలిలీలోని పచ్చని కొండలు స్వర్గలోకం గురించి కలల్లా మిగిలిపోయాయి. యజమానులు మారేవారు. కాని వాళ్ళ మూపులను ముద్దిడే కొరడామాత్రం అదే. అదే కర్ర. ఆ కర్రచివర తోలు తాడు. అదే. అదే. ఏదో మరో దేశానికి వచ్చారు వాళ్ళు. అక్కడ కొండలు గెలిలీ కొండలకన్న ఎత్తైనవి. శీతాకాలంలో, వేసవిలో ఎప్పుడూ ఆ పర్వతశిఖరాలు మంచును చుట్టబెట్టుకునేవి.

ఆ దేశంలో తనను రాగి తవ్వి తెమ్మని భూగర్భంలోకి పంపించారు. రెండేళ్ళి రాగిగనుల్లో పనిచేశాడు. తనతోబాటే పనిచేసిన తన సోదరులిద్దరూ ఈ రాగిగనులకు ఆహుతైపోయారు. అతడుమాత్రం బ్రతికాడు. రాయిలాటి, ఉక్కులాటి శరీరమతనిది. కొందరికి జబ్బుచేసేది. మరికొందరి కదేమిటో పళ్ళూడిపోయేవి. ప్రాణంపోయేవరకు

వాంతులు చేసుకునేవారు కొందరు. కానీ యితను బతికాడు. ఆ విధంగా రెండేళ్ళు రాగిగనులలో కండలు కరిగించాడు.

అప్పుడతను తప్పించుక పారిపోయేడు. బానిసలకుండే కంచెలాటి మెడపట్టీ వుండనేవుంది. దాంతోనే ఆ కొండల్లోకి పారిపోయేవాడు. అక్కడ అమాయకులైన కొండజాతిప్రజలు నివసించేవారు. వాళ్ళితన్ని చేరదీసి రక్షణయిచ్చి మెడపట్టీ వూడ తీసేశారు. శీతాకాలమంతా వాళ్ళతో గడిపాడు. వాళ్ళు పేదప్రజలు. ఆ ప్రజల హృదయాల్లో దయమాత్రముంది. వలలుపన్ని జంతువులను వేటాడి దొరికిందేదో తిని కాలక్షేపం చేసేవారు. ఇంచుమించూ ఏమీ పండించరు. వాళ్ళభాష యితను నేర్చుకున్నాడు. తమ తెగలోని పిల్లను పెండ్లాడి తమతోబాటే కొండల్లో వుండిపొమ్మని ఆ భాషలోనే యితన్నడిగారు. కాని అతని మనస్సు మాతృభూమి గెలీలీపైకి మళ్ళింది. వసంతాగమనంతో అతను దక్షిణంగా ప్రయాణమయాడు. కాని మధ్యలో పెర్షియా వర్తకులితన్ని పట్టుకున్నారు. పట్టుకుని పశ్చిమంగా తీసుకపోబడుతూన్న బానిసలతో ఇతన్ని పంపేశారు. టైర్ అనే పట్టణంలో నడిబజారులో యితన్ని వేలంవేశారు. అక్కడికి తన మాతృభూమి కళ్ళక్కనబడే టంతటి దూరంలోవుంది. అతని హృదయ మెంత తరుక్కుపోయిందో! తనను ప్రేమించే స్వజనానికి, తనను కని పెంచిన స్వస్థలానికి అంత దగ్గరగా వుండి కూడా చేజిక్కనదనుకొని సంతోషించిన స్వేచ్ఛ హఠాత్తుగా మాయమవడం చూచి అతడెంత వెచ్చటి కన్నీటిని గార్చేడో. ఫోయినీషియా వర్తకుడొక డతణ్ణి కొన్నాడు. కాని సిసిలీరేవుతో వర్తకవ్యాపారాలుచేసే ఓడలో ఒక సంవత్సరకాలం ఆ నీటిమయమయిన చీకటిలో, తడిసిన చెత్తలో కూచుని తెడ్డు లాగుతూ దౌర్భాగ్యపుజీవితం గడిపేడు.

ఒకనా డా ఓడను గ్రీకు దోపిడీదొంగలు వశపర్చుకున్నారు. అతని కిదేం అర్థం కాలేదు. కళ్ళు మిటకరిస్తూ నిలబడ్డాడు. వాళ్ళితణ్ణి బాగా పరిశీలించారు. ఆ భయంకరులయిన గ్రీకుదొంగలు యితని నేవో ప్రశ్నలడిగారు. ఫోయినీషియా వర్తకుణ్ణి, ఓడ నడిపేవాణ్ణి చంపి పచ్చగడ్డి మోపుల్లా విసరిపారేసినా, తననూ, తనతోటి బానిసల్ని మాత్రం వాళ్ళు బాగా పరిశీలించి, ప్రతివాణ్ణీ అరమిక్ భాషలో ఒక ప్రశ్న అడిగేరు: "నువ్వు దెబ్బలాడగలవా? లేకపోతే ఈ తెడ్డు లాగడమేనా?"

పిశాచాన్ని చూస్తే ఎంత భయమో అలాగే రాత్రింబవళ్ళు యీ చల్లని నీటిలో తెడ్డులాగడమంటే అతనికంతే భయం. ఆ ప్రశ్నకతను సమాధాన మిచ్చాడు: "అవకాశం కల్పిస్తే నే దెబ్బలాడగలను." ఆ పరిస్థితిలో అత నో సైన్యాన్నే ఎదుర్కొని పోట్లాడగల్గును. అంతేకాని; ఛోయి తెడ్డులాగడమంటే మాత్రం హడలిపోయేవాడే.

ఎక్కువ దెబ్బలు కొట్టకుండా, అట్టే బూతులు తిట్టకుండా వాళ్ళతనికి ఓడ నడపడంలో మెళుకువలన్నీ నేర్పారు. తెరచాపలెలా ఎత్తాలో, తాళ్ళు ఏ విధంగా విసరాలో, 30 అడుగుల పొడవుండే చుక్కాని ఎలా తిప్పాలో, పురివేసి తాళ్ళను ఎలా కలపాలో ఏవేవో పడవనడిపే పనివానితనమంతా నేర్పారు. అతన్ని ఓ రోమను దగాకోరుతో పోరాడమన్నపుడు మాంచి చురుకుదనం, చాకచక్యం ప్రదర్శించేడు. ఆ భయంకర మైన దోపిడీ ముఠాలలో యితన్ని ఆ నిడుపైన కత్తే రక్షించింది. అతని మనస్సులో సంతోషం లేదు. హత్యాకాండకు, క్రౌర్యానికి, మృత్యువుకూ ప్రాణస్నేహితు లనదగిన ఈ దోపిడీదార్లంటే విపరీతమైన ద్వేషం జనించింది. పగటికీ, రాత్రికీ ఎంత తేడా వుంటుందో తను చిన్నపుడు పుట్టి పెరిగిన అమాయకపు రైతులకూ, వీరికీ మధ్య అంత తేడా వుంది. వాళ్ళకు దేవుడంటే నమ్మకం లేదు. సముద్రు డన్నా నమ్మకం లేదు. అతన్లో గూడా రానురాను నమ్మకం సడల్తున్నా, అతని సంతోష సమయమంతా భగవద్భక్తిగల వాళ్ళ మధ్యే గడిచింది. వాళ్ళెపుడైనా తీరాన్ని సమీపిస్తే చంపడానికి, మంటపెట్టడానికి, చెఱచడానికి తప్ప మరెందుకూ ఒడ్డెక్కరు.

ఇదిగో ఈ కాలంలోనే తనచుట్టూ రాతిగోడను నిర్మించుకొని ఆ గోడలమధ్య నుండి పోయేవాడు. అతని ముఖంలో యువక లక్షణాలు నశించేయి. పచ్చని కళ్ళు, గెద్దముక్కులాంటి ముక్కు అతని స్వరూపాన్నే మార్చేశాయి. వాళ్ళతో కలిసి నపుడు అతనికింతాజేసి పద్దెనిమిదేళ్ళే. కాని అతని ముఖం చూడగానే అనాదినించీ యితను బతుక్కొస్తున్నాడా అనిపిస్తుంది. అతని జుట్టప్పుడే తెల్లబడ్తోంది. అతన్లో అతనే అయి ఒక్కొక్కప్పుడు వారాలతరబడి యెవరితోనూ ఒక్కమాటకూడా ఆడే వాడు కాదు. అతన్ని వాళ్ళేమీ చెయ్యలేదు. దెబ్బలాడ్డంలో అతని శక్తిసామర్థ్యాలు వాళ్ళకు తెలుసు; అతనంటే భయపడేవాళ్ళుగూడ.

కలలే అతని ప్రాణం. వాటిమీదనే అతను జీవించేవాడు. ద్రాక్ష, సారా, మనుగడ యివే అతని కలలు. ఏదో ఒకరోజున యీ పడవ పాలస్తీనా తీరం క్రమించకపోతుందా? అప్పు డతను నీటిలో దూకి ఈదుక వడ్డుచేరి, గెలిలీ కొండల్లోకి పారిపోలేకపోతానా అని కలలుకనేవాడు. మూడేళ్ళు గడచినా ఆ రోజు రాలేదు. వాళ్ళు యేదో ఆఫ్రికారేవును దోచుకున్నారు. అప్పుడుయిటలీ సమీపంలో మధ్యధరా సముద్రంగుండా ప్రయాణంచేశారు. స్పెయిన్ తీరంలో పోట్లాడారు. రోమన్ల భవ నాలు తగలబెట్టారు. అక్కడున్న డబ్బు దోచుకుని ఆ యిళ్ళల్లోని స్త్రీల నపహ రించారు. మళ్ళీ ప్రయాణం సాగించారు. చుట్టూ ప్రహరీగోడలున్న దొంగల పట్న

మొకటుంది. అక్కడ శీతాకాలమంతా గడిపారు. జిబ్రాల్టర్ జలసంధి దాటి బ్రిటన్ చేరుకున్నారు. అక్కడ పడవ మరమ్మత్తులు చేశారు. అక్కణ్ణించి ఐర్లండు వెళ్ళారు. అక్కడ వస్త్రాలు, చవకబారు వజ్రాలు అవీ యిచ్చి ఐరిష్ అడవిజాతుల ప్రజలు ధరించే బంగారపు నగలు కొనుక్కున్నారు. అప్పుడు గాల్, ఫ్రెంచి సముద్ర తీరమంతా తిరిగారు. చివర క్నాఫ్రికా తిరిగొచ్చారు. ఆ విధంగా మూడేళ్ళు గడిచినా యెప్పుడూ ఆ పడవ తన స్వస్థలంవేపు పోలేదు. కాని ఆ కల, ఆ ఆశ అతనితోనే ఉండిపోయాయి. ఈ సమయంలోనే ఒక్కమనిషి యెంత గట్టిపడగలడో అంతగానూ గట్టిపడ్డాడు. బాగా రాటుదేరాడు.

ఆ కాలంలోనే అతను చాలా విషయాలు తెలుసుకొన్నాడు. సముద్రం ఒక రోడ్డులాంటిదని, మనిషి శరీరంలో రక్తమే విధంగా ప్రవహిస్తుంటుందో అదే విధంగా ఆ రోడ్డుమీద ప్రవహిస్తుంటుందని అత నపుడే తెలుసుకున్నాడు. ఈ ప్రపంచానికి అంతులేదని, యిది చాలా విశాలమయినదని తెలుసుకున్నాడు. ఎక్కడికి వెళ్తే అక్కడ సామాన్య ప్రజలు తన ప్రజలవలెనే పేదరిక మనుభవించే ప్రజలున్నారని తెలుసుకున్నాడు. వాళ్ళు భూమితో యేదో అవస్థపడి యేమాత్రం పండించినా కుటుంబ పోషణ సంగతి యెలాగున్నా పండించిందంతా తెగ నాయకుడో, రాజో, దోపిడీ దొంగో కాజేసేవారు. దొంగలూ, దొరలూ. వాళ్ళకు తోడొకరాజు. ప్రతీచోటా ఒక తెగ నాయకుడు, ఒక రాజు, ఒక దోపిడీదొంగ ఉంటారని అతను తెలుసుకున్నాడు. అస లదే రోమ్.

ఆఖరికి పాపం పండింది. రోమను యుద్ధనౌక తటస్థపడింది. చావగా మిగిలిన తనూ, మరో పధ్నాలుగుమంది ఓడ నడిపేవాళ్ళూ ఉరికంబా లెక్కడానికి ఆస్టియా పంపబడ్డారు. అతని జీవయాత్ర అంతటితో సరి. కాని ఆఖరుక్షణంలో కూడ అతన్ని అదృష్టం వరించింది. కేపువా శిక్షణాకేంద్రానికంటూ లెంటులుస్ బేటియాటస్ ఏజంటొకడు యితన్ని కొనుక్కుపోయాడు.

అతని రెండోదశ: జ్ఞానమూ, ద్వేషమూ తా నలవర్చుకున్న ఆ రెండోదశ ఆ విధంగా గడుస్తున్నది. ఆ ద్వితీయదశాశేషం కేపువాలో నిశ్శేషమయింది. అక్కడే అతనికి నాగరికతయొక్క ఔన్నత్యం కనిపించింది. అక్కడే రోమ్‌లోని సోమరి పోతులు తమాషా చూసి ఆనందించడానికి, ఒక లావుపాటి కుత్సితుడైన, దుర్మార్గుడైన వర్తకుడు మరింత ధనార్జనకోసం మనుష్యులు ఒకళ్ళనొకళ్ళు పొడుచుకచంపుకునే శిక్షణ యిస్తారు. అత నొక మల్లుడయ్యాడు. అతని జుట్టు అంటకత్తెర వేశారు. చేతికో కత్తి యిచ్చి రంగస్థలంలోకి పంపేరు. అక్క డతను చంపేది తన

శత్రువులను కాదు, తనవంటి బానిసలనే, తనవంటి దౌర్భాగ్యులనే చంపవలసి వచ్చింది.

ఇక్కడే అతని జ్ఞానంతోబాటు ద్వేషం మరింతగా వృద్ధిగాంచింది. అత నొక గాదె మాదిరిగా తయారయ్యాడు. ఆ గాదెలో ఎంత ద్వేషమైనా పడ్తుంది. రోజురోజుకీ అది నిండుతోంది. భయంకరమైన ఒంటరితనంలో, ఒక గదిలో నిరాశలో అతను బతికేవాడు. ఎప్పుడూ తనలోతానై ఆ గది చీకటిలో అతనుండే వాడు. భగవంతుడంటే యిక నేమాత్రం నమ్మకం లేదు. తన తాత తండ్రులు కొలచిన దేవుణ్ణి గురించి యెప్పుడు ఆలోచించినా అసహ్యం, ద్వేషం అతన్లో రగుల్కొనేవి. ఒకమా రతనిలో అత ననుకున్నాడు :

"ఆ కొండలలోని ముసలివృద్ధు భగవంతుడితో నే నొకమా రీ రంగస్థలంలో పోరాడితీరతా. మేం కార్చిన కన్నీటిచుక్క లన్నిటికీ, ఆశ నశించి నిరాశఒడిలో అడియాసలపాలై జీవించిన మా బ్రతుకుల దౌర్భాగ్యానికి అతనికి తగిన ప్రతిఫలం ముట్టజెప్తా. కసి తీర్చుకుంటా. వాడి కా పిడుగులూ, మెరుపులూ పారెయ్యండి. నా చేతి కో కత్తి నివ్వండి. నే చస్తే చస్తాకాని వాడికి కోపం అంటే యేమిటో, క్రోధం అంటే యేమిటో బోధపరచి తీర్తా."

ఒకమాటు అతని కొక కలొచ్చింది. ఆ కలలో అతను భగవంతుని సింహాసనం దగ్గరగా నిలబడియున్నాడు. కాని భయపడలేదు. "నువ్వేంచేస్తావోయ్ నన్ను" అని వెక్కిరించినట్లు నిర్లక్ష్యంతో గట్టిగా అడిగాడు. "నేను యిరవైయొక్కేళ్ళు గడిపాను. నువ్వు సృష్టించిన భూలోకంలో నేనుపడ్డ యమయాతన్లనుమించి నువ్వు చేయకల్గిందేమిటి? నా తండ్రిని శిలువెయ్యడం చూశాను. గనుల్లో గొడ్డులా పనిచేశా. రెండేళ్ళు పనిచేశాను. ఓ ఏడాదిపాటు ఓడ అట్టడుగున చెత్తిలో, కుళ్ళునీళ్ళల్లో ఎలకలు కాళ్ళమీంచి దాటిపోతుంటే తెడ్డులాగుతూ గడిపాను. మరో మూడేళ్ళు మాతృభూమి కోసం కలలుకంటూ దోపిడీ ముఠాల్తో వెళ్ళబుచ్చాను. ఇప్పుడు, నాలాంటి మనుష్యులనే చంపడానికి నన్ను అద్దెకు తీసుకుంటున్నారు. గాడిద గుడ్డు? నువ్వు చేయగల్గిందేమిటోయ్ నన్ను?"

అతని రెండోదశలో అతనిలో కలిగిన పరిణామమట్టిది. ఆ కాలంలోనే కేపువా మల్లశిక్షణకేంద్రానికి ఒక థ్రేషియన్ బానిసను తీసుకొచ్చారు. అతను బహు వింతమనిషి. మృదువుగా మాట్లాడే స్వభావం కలవాడు. పగిలిన ముక్కూ, నల్లగా నల్లని కళ్ళూ కలవాడు. ఆ విధంగా స్పార్టకస్ అనే మల్లుడి ముఖంతో యితనికి పరిచయం కలిగింది.

# 6

ఇదంతా జరిగిపోయి యెంతోకాలమయ్యాక ఒకప్పు డొక రోమన్ బానిసనే శిలువవేయడం జరిగింది. అత నా శిలువమీద ఒకరోజు వేలాడేడు. చక్రవర్తి దయ దలిచి అతనికి ప్రాణభిక్ష పెట్టాడు. ఎల్లాగో ఓ లాగున అతను బ్రతికేడు. శిలువపై తన అనుభవాన్ని గురించి అతను వ్రాసేడు: "శిలువమీద రెండే రెండు విషయాలు తెలుసుకోగలం. బాధ, అంతులేని కాలం! నే నా శిలువమీద యిరవైనాలుగు గంటల సేపే ఉన్నాననీ అంతా అంటారు. కాని నేను యీ ప్రపంచం సృష్టింపబడ్డనాటినుంచి, అనాదిగా ఆ శిలువమీదనే వేలాడుతున్నట్లు నా కనుపించింది. క్షణ మొక్క యుగంగా గడిచింది. కాలం అనేదే లేకపోతే, కాలానికి కొలతలే లేకపోతే ప్రతిక్షణం అనంతమే."

ఆ విచిత్రమైన, బాధామయమైన అనంతంలో మల్లుని మనస్సు స్థానంతప్పి, పట్టుతప్పి యే మూలో పడిపోయింది. క్రమబద్ధంగా, హేతుబద్ధంగా ఆలోచించగల అతనిశక్తి క్రమేపీ నశిస్తోంది. ఉండి ఉండి చీకటిలోంచి యెగిరివచ్చి మళ్ళీ చీకటి లోనికే మాయమయే గబ్బిలంలా యెగురుతోంది అతని జ్ఞాపకశక్తి. తన గత జీవితాన్ని బాగా జ్ఞాపకం చేసుకున్నాడు. ఆ జీవితాన్ని ప్రత్యక్షంగా తిరిగి జీవిస్తున్నాడు. తన ఆలోచనలో, తిరిగి యెంతోకాలానికి స్పార్టకస్‌తో సంభాషిస్తున్నాడు. తనజీవితం నిరర్థకమైనది; పాడుపడ్డది. ఆ జీవితంలో తాను దేన్ని సంరక్షించదలచుకున్నాడో ఆలోచిస్తున్నాడు. కాలం అనే దో చండప్రచండ ఝంఝామారుతం. ఆ పెను గాలిలో, భూమిమీదనున్న సకల చరాచర జీవకోటినీ తుడిచిపారవేయగల ఆ ఝంఝా మారుతంలో అత నొక ఊరూ, పేరూలేని అల్పజీవి. ఒక బానిస.

(అతను స్పార్టకస్ వైపు చూస్తాడు. అతన్ని పరిశీలిస్తాడు. తనో పిల్లిలా గున్నాడు. ఆకుపచ్చని తన కళ్ళే తననో పిల్లిలా కనిపించేటట్లు చేస్తాయి. పిల్లి యెల్లా నడుస్తుందో మనకు తెలుసు. ఎప్పుడూ బిర్రుగా బిగిసిపోయి నడుస్తుంటుంది. అదుగో అల్లాగే యీ పిల్లుడు కూడా నడుస్తాడు. అతన్ని గాలిలోకి విసిరిపారేద్దామని నీ కనిపించిం దనుకో, ఎంత యెత్తుగా అతన్ని విసిరిపారేసినా నిటారుగా రెండుకాళ్ళ మీద వచ్చి భూమిమీద నిలబడతాడు. ఏ మనిషినీ తిన్నగా చూడడతను. తన కంటి కొలకుల్లోంచి ఓరచూపు చూస్తాడు. ఆ విధంగానే ప్రతిరోజూ అతను స్పార్టకస్‌ను పరిశీలనగా చూస్తున్నాడు. స్పార్టకస్‌లోని ఏ విశేష మతన్ని ఆకర్షించిందో అతనికే తెలియదు. కాని అదేమీ కనికట్టుకాని, మంత్రమహిమ కాని కాదు. ఇత నెంత

బిగుసుకుపోయి, తనలో తనే అయి యెవడితోనూ మాట్లాడకుండా కూచుంటాడో, స్పార్టకస్ అంత ధారాళంగా, అంత స్వేచ్ఛగా, ప్రతివాడితో మాట్లాడుతూ కలిసి కట్టుగా ఉంటాడు. అందరూ స్పార్టకస్‌తో మాట్లాడతారు. తమ కష్ట సుఖా లతనివద్ద వెళ్ళబోసుకుంటారు. ఈ మల్ల శిక్షణా కేంద్రంలోని స్పార్టకస్ యేదో యెక్కిస్తున్నాడు; ప్రవేశపెడుతున్నాడు. ఈ కేంద్రాన్ని స్పార్టకస్ నాశనంచేస్తున్నాడు.

(ఈ యూదుడు తప్ప తతిమ్మా వాళ్ళంతా స్పార్టకస్ దగ్గరకు వస్తారు. ఇత నెందుకు రాడో అని స్పార్టకస్ ఆశ్చర్యపోతాడు. కసరత్తు విరామ సమయంలో ఒక రోజున అతనే యూదుని వద్దకు వచ్చి మాట్లాడేడు.

("గ్రీకుభాష మాట్లాడగలవయ్యా నువ్వు?" స్పార్టకస్ అడిగేడు.

(ఆ ఆకుపచ్చని కళ్ళు కదలకుండా, మెదలకుండా, రెప్పపాటు పడకుండా అతనికేసి అదేపనిగా చూస్తాయి. తటాలున స్పార్టకస్‌కి తట్టింది. తను మాట్లాడు తున్నది నూత్న యౌవనుడైన వ్యక్తితోనే అని, కాని అతని యౌవనాన్ని ఒక ముసుగు కప్పేస్తోంది. తను చూస్తున్నది ఆ యువకుడిని కాదు. ఆ ముసుగునే.

(యూదుడు స్పార్టకస్ ప్రశ్నను విన్నాడు. ఆ ప్రశ్న తనలో తనే ఒకమా రనుకున్నాడు. గ్రీక్ - నేను గ్రీకుభాష మాట్లాడగలనా? అన్ని భాషలూ మాట్లాడగల ననుకుంటా. హెబ్రూ, గ్రీక్, లాటిన్ యివే కాక ప్రపంచంలోని మరెన్నో భాషలు కూడా నేను మాట్లాడగలను. అస లే భాషలోనైనా నే నెందుకు మాట్లాడాలి? ఎందుకు?"

(చాలా సౌమ్యంగా స్పార్టకస్ అతన్ని అర్థించాడు. నే నో మాట, నువ్వో మాట; అంతే. మనం మనుష్యులం. పైగా ఒంటరిగాలేం. అవస్థ యెప్పుడయ్యా అంటే మనం ఒంటరిగా వున్నప్పుడే. ఒంటరితనం భయంకరమైనది, దుర్భరమైనది. కాని మనం యిక్కడ ఒంటరిగా లేంగా. మన ప్రస్తుత పరిస్థితికి అంటే; యిప్పటి మన యీ దుర్గతికి మనం యెందుకు సిగ్గుపడాలి? మన మీ విధంగా తయారుకావడం మన స్వయంకృతాపరాధమా? మన తప్పులవల్ల మనం యీ విధంగా తయారయామని నే ననుకోను. మనం యీ విధంగా తయారుచేయబడ్డాం. వాళ్ళవాళ్ళ వినోదంకోసం మన చేతిలో కత్తులుపెట్టి మనం ఒకళ్ళ నొకళ్ళు పొడుచుకుచావగా చూసి సంతోషించే రోమన్లే విపరీతమైన ఘోరాలు చేసేరు. అందువల్ల మనని చూసి మనమే సిగ్గు పడాల్సిన అవసరమేముంది? మనను మనం అసహ్యించుకోకూడదు. మనిషిలో కొంచెం శక్తి, కొద్ది ఆశ, కొద్దిగా ప్రేమ వుంటాయి. అవి ప్రతి మానవునిలోనూ చల్లపడ్డ విత్తనాలు. కాని మనిషి వాటిని తనలోనే ఉంచేసుకుంటే ఆ ప్రేమను,

ఆ శక్తిని, ఆ ఆశను మరొకనికి ఉపయోగించేలా చేయలేకపోతే ఆ విత్తనాలు మాడి పోయి చచ్చిపోతాయి. అతని కింకేమీ ఉండదు. అతను జీవించి ప్రయోజనం కూడా వుండదు. అటువంటివాణ్ణి భగవంతుడే రక్షించాలి. మానవమాత్రు డేమీ చేయలేడు. అలా కాకుండా తన శక్తిని, ఆశను, ప్రేమను, యితరులకోసం వినియోగిస్తే యిత రులు కూడా యితని కోసం వాటిని విపరీతంగా నిలవచేసి వుంచారన్న యథార్థాన్ని గ్రహించినవా డవుతాడు. అప్పు డవి అతనిలో వాడిపోవు, మాడిపోవు. జీవించి ప్రయోజనం ఉంటుంది. జీవితమే ప్రపంచంలో అమూల్యమైనదంటే నమ్ము. అది మనకు తెలీకనా? తెలుసు. మనం బానిసలం. మనకున్న ఆస్తి అంతా మన జీవితమే. అందుకే జీవితపు విలువ మనకు బాగా తెలుసు. రోమన్లకి రకరకాల చరస్థిరాస్తు లున్నవి. వాటిముందు వాళ్ళకి జీవితం ఓ లెఖ్ఖలోనిది కాదు. జీవితపు విలువ శూన్యంగా కన్పిస్తుంది. దానితో వాళ్ళు వినోదం చేస్తారు. ఆటలాడతారు. కాని మనం జీవితాన్ని చాల తీవ్రంగా గ్రహిస్తాము. అందుకే మనం వంటరిగా ఉండ కూడదు. నువ్వు చాలా వంటరిగా ఉంటున్నావు. నాతో కొంచెం మాట్లాడు.

(అయినా యూదుడేమీ మాట్లాడడు. అతని ముఖంలో, కళ్ళలో ఏ విధమైన మార్పూ కన్పించదు. స్పార్టకస్ చెప్పిందంతా విన్నాడు. సావధానంగా, నిశ్శబ్దంగా, జాగ్రత్తగా విన్నాడు. విని వెనక్కుతిరిగి వెళ్ళిపోయాడు. కొద్దిగా అడుగులువేసి ఇంతలో ఆగేడు. తల కొంచెం వెనక్కి తిప్పేడు. ఆ కళ్ళ కొలకుల్లోనించి పరిశీలనగా స్పార్టకస్‌ని చూశాడు. పూర్వం అతనిలో లేనిదేదో, అంతలో కలిగినట్లు భావించాడు స్పార్టకస్. ఒక అగ్నికణం రగుల్కొంది. ఒక భావావేశం పనిచేయసాగింది. ఆశ ఒక కాంతిరేఖలా మెరిసింది. అవును మరి.)

నాలుగుదశలుగా విభజింపబడ్డ అతని జీవితంలో తృతీయదశ ప్రారంభమవు తోంది. ద్వేషం నశించి తోడిమల్లులయందు ప్రేమ, సౌహార్దభావాలు పొడచూపిన ఆశలదశ యిది. ఇవి హఠాత్తుగా ఒకేమారు సంభవించిన మార్పుగాదు. మానవుని యందు యితనికి నమ్మకం ఒక్కొక్కటై వచ్చి చేరింది. ఆ విధంగా మానవుణ్ణి నమ్మడంవల్ల మానవజీవితాన్ని ప్రేమించకల్గాడు. స్పార్టకస్‌లోని ఆ విశేషమే ఇతన్ని మొదట్నించీ యింతగా ఆకర్షించింది. ఆ థ్రేషియన్ జీవితాన్ని యెంతో ప్రేమిస్తాడు. జీవితానికి రక్షకుని వంటివాడు. ఈ పనివల్ల లాభముంది కనుక చేద్దాం అని కోరి అతడు చేసిందిగాదది. అతడు దాన్లో అంతర్లీనమైపోయాడు. ఎప్పుడూ అతడు దానిని దేనికది విడదీసి ఏమిటది అని ప్రశ్నించి యెరుగడు. చూస్తుంటే ఈ స్పార్టకస్‌కు, జీవితశక్తులకు మధ్య రాజీ కుదిరిందా అనిపిస్తుంది.

స్పార్టకస్‌ని పరిశీలించడం దగ్గర ప్రారంభమై అతన్ని అనుసరించేవరకు పోయింది వ్యవహారం. దీన్నతను ఒక్కమాటు బాహాటంగా చేయలేము. ఎంతో నిగూఢంగా, పైవాళ్ళకు తెలీకుండా యీ అనుసరణ కానిచ్చేవాడు. కాస్త అవకాశం లభిస్తేచాలు; అతను స్పార్టకస్ పక్కన నిలబడేవాడు. నక్కకు వినగలశక్తి ఎక్కువ. ఇతను నక్కకన్నా బాగా వినగలడు. స్పార్టకస్ చెప్పిన మాటలన్నీ వినేవాడు. ఆ మాటలను తనతోకూడ తీసుకుపోయేవాడు. ఒకచోట కూచుని ఆ మాటలను తనలోతను అనుకుంటాడు. ఆ మాటల్లోని అర్థ మేమిటా అని ఆలోచిస్తాడు. ఈ కాలమంతా అతన్లో ఏదో మార్పువస్తోంది. అతను మారుతున్నాడు. పెరుగుతున్నాడు. ఇంచుమించు ఈ విధంగానే ప్రతి మల్లునిలోనూ ఏదో ఒక మార్పు ఎంతో కొంత అభివృద్ధి కన్పిస్తాయి. కాని, డేవిడ్ విషయంలో మాత్రం ఆ మార్పు ప్రత్యేకమైనది. అనన్య సామాన్యమైనది. జీవితమంతటా యావత్కాలం, భగవంతునితో నిండిపోయిన ప్రజల మధ్యనుండి వచ్చాడతను. అతనా భగవంతుని వదిలేశాక జీవితంలో ఒకలోటు పడ్డట్టు బాధపడ్డాడు. ఈ లోటునతడు మానవత్వంతో భర్తీ చేస్తున్నాడు. మానవుణ్ణి ప్రేమించడానికి ప్రయత్నించాడు. మానవుని గొప్పతనాన్ని తెలుసుకున్నాడు. ఈ విధంగా యిదంతా అతనాలోచిస్తో కూచోలేదు. అది అతన్లో జరుగుతో వచ్చింది. ఇలాగే కొంతవరకు తతిమ్మా మల్లుల్లో కూడా జరిగింది.

రోమన్ సెనేటర్లకుకాని, వ్యాపారి బేటియాటస్‌కుగాని యివేమీ అర్థమయే విషయాలు కావు. అర్థంలేకుండా, ఆలోచన లేకుండా తిరుగుబాటు బ్రద్దలైందని వారి అభిప్రాయం. వాళ్ళకు తెల్సినంతమట్టుకు ఈ విప్లవానికి జరిగిన ప్రయత్నాలూ లేవు, దాని కో చరిత్రా లేదు. ఏదీ లేదు. అందుకే వాళ్ళు ప్రభుత్వ రికార్డుల్లో ఆ విధంగానే రాసుకున్నారు - వాళ్ళకి రాయడానికి వేరొకవిధ మేముంది కనుక.

దీనికి చరిత్ర లేదా; పూర్వగాథ లేదా? ఉన్నాయి. అన్నీ ఉన్నాయి. సులభగ్రాహ్యం కాని సూక్ష్మ విషయాలతో కూడి వింతగా, విపరీతంగా అభివృద్ధిచెందుతోన్న కారణా లెన్నో ఉన్నాయి. మొదటిసారిగా డేవిడ్ ఒడెస్సీ మహాగ్రంథంలోని గీతాలు స్పార్టకస్ చదవగా విన్నాడు. తన్మయత పొందించగల, మైమరపించే సంగీతం దాన్లో ఎంతగా ఉందో! ఎన్నో కష్టాలు సహించి యెన్నడూ ఓటమిని యెరుగని ధీశాలి గురించిన కథ అది. ఆ గీతాల్లో చాలా భాగం అతనికిట్టే అర్థమయింది. తన మాతృదేశాన్నించి తీసుకపోబడి నిర్బంధించబడ్డ జీవియొక్క నిరాశాపూరితమైన బాధ అతనికి తెలుసు. అదృష్టమన్నది మాయామర్మాలకు పుట్టినిల్లు. ఆ అదృష్టంచేసే యింద్రజాలం అతనికి తెలిసింది. గెలీలీ కొండల్లోని ఒక పిల్లని యితడు ప్రేమిం

చాడు. ఆ పిల్ల పెదవులు యెఱ్ఱని దొండపండ్లలాంటివి పట్టులా, నున్నగా, మెత్తగా నిగనిగలాడే బుగ్గలు. అతని హృదయం ఆమె కోసం బాధపడింది. ఆమె తనకింక లభ్యమవదు. కాని తను విన్న యీ గీతాల్లోని సంగీతం సూర్యకాంతిలా యెంత తెల్లని స్వచ్ఛమైనది. బానిసకు కొడుకై పుట్టిన బానిస యీ గేయాలన్నిటినీ కంఠస్థం చేసి అప్పచెప్పగలగడం యెంత ఆశ్చర్యం! పూర్వమెప్పుడైనా యీ స్పార్టకస్ లాంటి వాడు పరాకడుండేవాడూ! అంత సౌమ్యంగా, అంత సహనంతో అంత మృదువుగా వుండేవాడు మున్నెన్నడైనా వుండేవాడా?

అతని మనస్సులో ఒడెస్సెస్సే స్పార్టకస్ అనుకున్నాడు. ఓర్మి, తాల్మి, తెలివి తేటలూ కల ఒడెస్సెస్. అతనికి సంబంధించినంతమటుకు, అతనికి అవగాహనయి నంతమటుకు వాళ్ళిద్దరూ యెప్పటికీ ఒక్కరే. ఏదెలాగున్నా అత నింకా కుర్రాడే. తన జీవితంలో ఆదర్శపురుషుడుగా అనుసరించతగ్గవాడు ఒక్కడే కనపడ్డాడు. అతనే స్పార్టకస్. మొదట్లో తనలో కొత్తగా బయల్దేరుతున్న యీ భావాన్ని తనే శంకించేవాడు. నువ్వెవ్వడినీ నమ్మకపోతే నిన్నెవడూ మోసం చేయలేడన్నది ప్రారంభంలో యితని నమ్మకం. ఆ సూత్రాన్నే తెగ వల్లించేవాడు. ఆ సూత్ర ప్రభావంవల్లనే తెగ నిరీక్షించాడు, పరీక్షించాడు. స్పార్టకస్ ఎప్పుడైనా స్పార్టకస్ కాకుండా పోతాడేమోనని చూసేవాడు. స్పార్టకస్ యెన్నడూ స్పార్టకస్ కాకుండా పోడని క్రమేపీ గుర్తించాడు. అవకాశం అవకాశమిస్తే అంతకన్న హెచ్చుగానే నిలుస్తాడు. దీనికో కారణం కూడా వుంది. ఏ మనిషీ తనకన్నా తక్కువగా లేడన్నది అతడు గుర్తించాడు. పూర్తిగా యీ విధంగానే తా ననుకున్నాడని గాదు; కాని ప్రతివాడిలోనూ యేదో కొంత జ్ఞానం తేజోకిరణాలుగా మెరుస్తున్నట్లు తెలుసుకో గల్గాడు.

లింగభేదం పాటించ నక్కర్లేకుండా కామతృష్ణ తీర్చుకోగల యిద్దరు రోమన్ పెద్దల వినోదం కోసం తనూ, మరో ముగ్గురు మల్లులూ పోరాట ప్రదర్శన లివ్వాలని బేటియాటస్ ఆజ్ఞాపించాడు. పూర్వ మెన్నడూ తననుభవించి ఎరుగని మానసికవ్యథ, వైరుధ్యము అతనిలో ప్రవేశించినయి. అదో కొత్తవ్యథ. ఆ వ్యథ నతడు జయించాడు. జయించిన పిమ్మటనే తనచుట్టూ నిర్మించుకున్న యెత్తయిన గోడలు మెల్లి మెల్లిగా పడిపోవడం ప్రారంభించాయి. ఆ పరిస్థితిని కూడా అత నా శిలువమీద ఆలోచించసాగేడు. ఆలోచించడమే కాదు. తిరిగి తా నా పరిస్థితుల్లో జీవిస్తున్నట్లు భావించాడు. తిరిగి తను పూర్వపు మనిషే అయాడు. తిరిగి తనలో తను తన వ్యథలతో వైరుధ్యాలతో హోరాహోరి పోరాడుతున్నాడు. నాల్గు సంవత్స

రాల క్రితం తనలో తా ననుకున్న మాటలు బాధల మూటలుగా శిలువపై వ్రేలే అతని పొడిఆరిపోయిన పెదవులనుండి పైకొచ్చాయి.

(ప్రపంచములోకల్లా పరమ దౌర్భాగ్యుణ్ణి నేను. తనలో తా ననుకుంటున్నాడు. కాదా మరి. కాకపోతే నే నెంతో ప్రేమించిన నా సోదరుణ్ణి నా చేతుల్తోనే పొడిచి చంపమని నన్నే యెందుకు నియోగించారు. ఎంత దారుణమైన దురదృష్ట మిది. మానవుణ్ణి సదా చిత్రహింసలపాలుజేసే భగవంతుణ్ణించి; లేదా అసంఖ్యాకములైన దేవతాగణాల్నుంచి మనం ఆశించగలిగినదింతే. వాళ్ళ పని అంతా అదే. కాని వాళ్ళను నేను సంతృప్తిపరచను. ఇక వాళ్ళకోసం ఈ ప్రదర్శనాలివ్వబోను. ఆ దేవతాగణం, రంగస్థలాల్లో కూచుని మనుష్యుల నరాలూ, కండలూ తెగి యిసుకలో పడుతుంటే వింతచూసే, సెంటు పులుముకు తిరిగే రోమను పందుల్లాంటి వాళ్ళు చూడు! ఈసారి వాళ్ళకు నేను సంతృప్తి కల్గించను. మరే విధంగానూ ఆనందంకాని, సంతోషంకాని పొందలేని ఈ పందు లీ మాటు ద్వంద్వయుద్ధం చేయగా చూసే అవకాశాన్ని కోల్పో యేలా చేస్తా. నన్ను వాళ్ళు చంపేస్తారు. దాంతో వాళ్ళకి తనివితీర్తుందా? ఇప్పుడే అన్న మాటేమిటి? ఎప్పుడో అప్పుడు నన్ను వాళ్ళు చంపడం తథ్యం. మిన్ను విరిగి మన్ను మీదపడ్డా నేను స్పార్టకస్‌తో దెబ్బలాడను. నా సోదరుని నా చేతుల్తో నేనే చంపుతానా?

(అప్పుడేం జరిగింది? మొదట తన జీవితంలో ఉన్మాదంతప్ప మరేంలేదు. ఈ ప్రస్తుత జీవితపద్ధతి ఉన్మాదాన్ని తప్ప మరింకేమీ కల్గించదు. అయితే స్పార్టకస్ నా కిచ్చిందేమిటి? నన్ను నేనే ఆ ప్రశ్న అడుక్కోవాలి. ఎందుకంటే; స్పార్టకస్ నా కిచ్చింది యెంతో ప్రాముఖ్యమైంది కనుక. అతను నాకు జీవితరహస్యాన్ని అందిచ్చాడు. జీవించడమే జీవితంతాలూకు పరమరహస్యం. ప్రతివాడూ యేదో ఒక పక్షాన్ని చేర్తాడు. నువ్వు జీవితపక్షాన వున్నావా; లేక మృత్యువుపక్షంలో చేరావా అన్నదే ప్రశ్న. స్పార్టకస్ జీవితపక్షంలో నిలబడ్డాడు. అందుకే నాతో అతను దెబ్బ లాడితే దెబ్బలాడొచ్చు, తను జీవించాలి కనుక నాతో పోరాడొచ్చు. ఊరకే చచ్చి వూరుకునేరకం కాదతడు. ఏమీ మాట్లాడకుండా, ఏ విధమైన ప్రతిఘటనా లేకుండా, శత్రువు నొక్క దెబ్బైనా కొట్టకుండా తనని చంపనీయడు స్పార్టకస్. అయితే నేను కూడా చేయవల్సిందదే అన్నమాట. నేను స్పార్టకస్‌తో పోరాడాలి. ప్రపంచంలో నే నే మానవుణ్ణీ యింతగా ప్రేమించని స్పార్టకస్‌తో, శాంతస్వభావి స్పార్టకస్‌తో కత్తి పుచ్చుక పోరాడాలి. అప్పుడు జీవితమే మా ఇద్దరిమధ్యా నిర్ణ యిస్తుంది. ఎంత భయంకరమైన నిర్ణయమో యిది. ఏ మనిషికైనా ఇంత దౌర్భాగ్యం

ఎప్పుడైనా కల్గిందీ? అవును. అలాగే జరుగుతోంది ప్రస్తుతం. విధివిధానమే అది.

ఆ నిర్ణయాన్ని, అప్పటి తన ఆలోచనలను పునశ్చరణ చేసుకున్నాడు. తను శిలువమీద ప్రాణాలను కోల్పోతున్న సంగతి మరిచిపోయాడు. అదృష్టం అతనియందు అనుగ్రహం చూపింది. స్పార్టకస్‌తో పోరాడవలసిన పరిస్థితి ఏర్పడలేదు. వ్యథతో క్రుంగి, బాధతో బద్దలైన అతని మనసు పూర్వం జరిగినదంతా ఏరి, ప్రతిముక్కనూ అతికి తిరిగి అత నా కాలంలో జీవిస్తున్నట్లు భావించేలా చేసింది. తిరిగి మరోమారు మల్లులు శిక్షకులను హతమార్చారు. అదే భోజనశాలలో కడతేర్చారు. కత్తులతో, ఒట్టి చేతులతో మరోమారు వాళ్ళు పటాలాలతో పోట్లాడారు. మరోమారు పల్లెప్రాంతాలలో పర్యటించారు. తోటలలోని బానిసలు వాళ్ళతో కలిశారు. తిరిగి మరో పర్యాయం వాళ్ళు అర్ధరాత్రి హఠాత్తుగ పట్టణ పటాలాలపై బడి అందరినీ నిశ్శేషంగా నిర్మూలం గావించారు. వాళ్ళ ఆయుధాలనూ, కవచాలనూ తీసుకున్నారు. ఎర్రగా మండేమంటలను బంతిగాచేసి ఆ బంతిని కాలంలోకి ఎక్కడికో విసిరేస్తే ఎలాగుంటుందో అల్లా వున్నయి అతని ఆలోచనలు. అవి క్రమబద్ధంగాకాని, హేతుబద్ధంగాకాని, తర్కశాస్త్ర నియమావళికి అనుగుణ్యంగాకాని లేనిఆలోచనలు. ఆలోచనలలో అతను తన గత జీవితాన్ని తిరిగి మరోమారు జీవిస్తున్నాడు.

("స్పార్టకస్" అతననుకున్నాడు. "స్పార్టకస్?" వాళ్ళ రెండో పోరాటం జరిగిపోయింది. బానిసలు మహాసైన్యంలా కన్పిస్తున్నారు. పదివేల రోమన్ల ఆయుధాలను, కవచాలనూ వాళ్ళు స్వాధీనపర్చుకుని ధరించారు. వందమంది ఒక విభాగంగా, అయిదు వందలమంది ఒక భాగంగా యెన్నో యీ భాగాలు కల్గిన మహాసైన్యంగా విభజింపబడ్డారు. రాత్రిళ్ళు వాళ్ళు బసచేసేమకాం క్రతో కట్టబడేది. దీనిచుట్టూ కందకం వుంటుంది. రోమను సైన్యాలు ఏర్పాటుచేసుకునే మకాంల లాగునే వుంటాయి అవి. రోమన్లలా ఈటెలు విసరడం, వాటి నుపయోగించడం గంటలతరబడి సాధనచేసి అలవర్చుకుంటున్నారు. తాము చేసినది ప్రపంచంలో నలుమూలలా తెలిసింది. తాము చేసినది ప్రపంచాన్ని భయాందోళనలతో నింపింది. ప్రతి బానిస గుడిసెలోనూ, ప్రతి బానిస బారకాసులోనూ ఎవరో ఒకరి పెదవులపై స్పార్టకస్ అనేమాట వినిపిస్తూనే వుంటుంది. అతనే ప్రపంచానికి నిప్పు ముట్టించాడు. అవును అతనే; అతనికో బ్రహ్మాండమైన సేన ఒకటి వుంది. త్వరలో అతడు రోమ్‌మీద దండెత్తుతాడు. క్రోధోద్దీపిత మనస్కుడై రోమ్ నిర్మించిన ప్రహరీగోడలు బద్దలుచేసి తీర్తాడు! అత నెక్కడికి వెళ్తే అక్కడ బానిసలకు దాస్యబంధవిముక్తి కలుగచేస్తాడు. ఆ విముక్తి బానిస

లకు జీవితంలో రక్తి కలిగిస్తుంది. తమను దోపిడీచేసేవాళ్ళ దగ్గరనుంచి అతను కొల్లకొట్టిన వస్తువులూ, ధనమూ అంతా సమిష్టి ఆస్తిగా పరిగణించబడుతుంది. అందరికీ చెందేలా సమిష్టి ధనాగారాల్లో నుంచబడుతుంది. పూర్వం ఒకప్పుడు ఏవిధంగా ఆస్తిపాస్తులన్నీ ఏ ఒకడికోకాక తెగ అంతటికీ చెందివుండేవో యికముందుకూడా అలాగే వుండబోతుంది. ఏ ఒక్కడూ ధనవంతుడుకాడు. అతని సైనికులకు ఆయుధాలు, తొడుక్కున్న బట్టలు, జోళ్ళు తప్ప మరే ఆస్తీ లేదు. స్పార్టకస్ అంటే అది.

అతనన్నాడు: "స్పార్టకస్?"

(కొద్దికొద్దిగా మాట్లాడ శక్తివచ్చింది డేవిడ్‌కి. నెమ్మదిగా, అతి నెమ్మదిగా ఆగి ఆగి మాట్లాడుతున్నాడు. మాట్లాడ్డం కష్టంగానేవున్నా మాట్లాడుతున్నాడతను. తనిప్పుడు బానిసల నాయకునితో మాట్లాడుతున్నాడు.

("స్పార్టకస్. నేను బాగా దెబ్బలాడగల్ను కదూ?"

("బాగా! చాలా బాగా దెబ్బలాడగలవు. అందరికన్నా బాగా దెబ్బలాడగలవు నువ్వు."

("నేను పిరికిపందను కానని నీకు తెలుసా?"

("అది నాకు చాలాకాలం క్రితమే తెలుసు" స్పార్టకస్ అంటాడు. "ఏ ఒక్క మల్లుడేనా పిరికిపంద కాగలడా?"

("నే నెప్పుడేనా వెన్నిచ్చి పారిపోయానా?"

("లేదు."

("నా చెవి తెగిపోయినపుడు కూడా పళ్ళు బిగపట్టి బాధ నణుచుకున్నానే కాని నొప్పితో అరిచానా?"

("నొప్పిపెట్టి ఏడవడమన్నది అవమానకరమైన విషయమేమీకాదు." స్పార్టకస్ అంటున్నాడు: "బలవంతులైన వాళ్ళుకూడా నొప్పితో ఏడవగా చూశాను. కోపంవల్ల కూడా ఏడుస్తారువాళ్ళు. అదేమీ అవమానంకాదు."

("కాని నువ్వూ నేనూ ఏడవం. ఎప్పటికో అప్పటికి నేనూ నీలాగే అవుతా."

("నువ్వు నాకన్న బాగా అవుతావు. నాకన్నా బాగా దెబ్బలాడగలవు నువ్వు."

("నీలో సగంకూడా అవలేను నేను. బాగా దెబ్బలాడగల ననుకో. నాకున్నదల్లా చురుకుదనం. పిల్లిలా చురుకుగా వుండగలను నేను. పిల్లి రాబోయే దెబ్బను

తెలుసుకోగలుగుతుంది. తన చర్మంలోంచి లోపలికి చూసుకోగలదు. నేనూ అంతే. సర్వసాధారణంగా పడబోయేదెబ్బ నాకు తెలిసిపోతుంది. అందుకే నిన్నొక విషయం అడగదలుచుకున్నా. నన్ను నువ్వెపుడూ నీ పక్కనే వుంచుకోవాలని అడుగుతున్నాను. యుద్ధభూమిలో ఎప్పుడూ నీ పక్కనే వుండాలనివుంది నాకు. నిన్ను మేం పోగొట్టు కుంటే ఉద్యమం అంతా పోగొట్టుకున్నట్లే. మా ఒకళ్ళకోసమే మేం యుద్ధం చేయటం లేదు. ఈ ప్రపంచమంతటి కోసం మేం పోరాడ్తున్నాం. అందుకే మనమెప్పుడు పోరా టాని కెళ్ళినా నీ పక్కనే నన్నుండనియ్యి."

("నా పక్కన నిలబడ్డంకన్నా ముఖ్యమైన పనులున్నయి చేయడానికి. సైన్యానికి నాయకత్వం వహించగల్గే వాళ్ళు గావాలి మనకి."

("అందరికీ నువ్వు కావాలి. నే నడిగేది ఏమంత పెద్దవిషయమా?"

("నువ్వడిగేది చాలా చిన్నవిషయమే డేవిడ్. నాకోసం అడిగావు కాని నీకోసం గాదు."

("అయితే చెప్పు. నీ కిష్టంలేదా?"

(స్పార్టకస్ తలూపేడు.

("ఇంక నీ కే అపాయమూ జరుగకుండా నే కాస్తా. రాత్రింబవళ్ళూ నీ క్కాపలా కాస్తా."

ఆ విధంగా అతను బానిసల నాయకునకు కుడిభుజ మయాడు. తన యువక జీవిత మంతటిలోనూ రక్తపాతం, శరీరశ్రమ, దౌర్జన్యమూ తప్ప మరేమీ తెలియని డేవిడ్ యిప్పుడే అరుణ ప్రభాత స్వర్ణమయకాంతులతో ఆకాశం తెరుచుకున్నట్లు భావించేడు. వాళ్ళ తిరుగుబాటు ఫలితంగా కాబోయేదేదో, రాబోయేదేదో అతని కిప్పు డిప్పుడే తెలుస్తోంది. ఈ ప్రపంచంలో చాలామంది బానిసలే. కాబట్టి వాళ్ళంతా అనతి కాలంలో ఒక మహాశక్తిగా విజృంభించొచ్చు. అప్పుడు జాతివిచక్షణలూ, ప్రపంచాన్ని పాలించే మహానగరాలూ కన్పించకుండా పోతాయి. తిరిగి మళ్ళీ స్వర్ణయుగ ముదయి స్తుంది. ఆ యుగంలోనే మనుష్యులు పాపాలు చేయరు. ఒకరినొకరు ద్వేషించుకోరు. దాస్యబంధం తెగిపోయి ప్రేమబంధాలలో శాంతియుతంగా, ఐక్యతతో, హాయిగా బ్రతకగలరు. స్పార్టకస్, అతని అనుచరులూ యీ ప్రపంచాన్ని జయించినపుడు తిరిగి ఆ స్వర్ణయుగ నిర్మాణం కావించబడుతుంది. శిలువలు నేలకేసి విరగ్గొట్టగా పుట్టిన శబ్దంతో, విజయకాహళధ్వనులతో ఉత్కంఠులై, కోటానుకోట్ల ప్రజలు గొంతులు కలపి విజయస్తుతిచేస్తూ పాడుతున్న గీతికా సంగీతతరంగాలలో నూతనయుగా గమనం, వినూత్న శకారంభం జరుగుతుంది; జరిగితీరుతుంది.

జ్వరం ధ్వనించే అతని హృదయం ఆ పాటను వినిపించింది. కోటికోట్ల మానవ కంఠస్వరస్వరావళిని తాను విన్నాడు. ఆ సంగీతతరంగాలు కొండలకు ఢీకొని వెనక్కొస్తాయి. ప్రతిధ్వనిస్తాయి...............

(అతను వరీనియాతో ఒంటరిగా వున్నాడు. ఆమెకేసి చూసినపుడల్లా వాస్తవ ప్రపంచమంతా కరిగి మాయమౌతుంది. మాయమవగా స్పార్టకస్‌భార్య ఒక్కరితె అక్కడ మిగుల్తుంది. డేవిడ్ దృష్టిలో ఆమె ప్రపంచంలోకెల్లా అనుపమ సౌందర్య రాశి. అతి వాంఛనీయమైన స్త్రీ ఆమె. ఆమెఎడ అతనికున్న ప్రేమ అతన్ని బాధిస్తోంది. అయినా తనలో తా నెన్నిమార్లనుకోలేదు.

("స్పార్టకస్ భార్యను ప్రేమిస్తున్న నువ్వు ఎంత నీచుడివిరా! అసలు నువ్వనే వాడి వొకడుండడానికి ఆ స్పార్టకస్సే కారకుడు. అతనికి నువ్వు ఋణపడి వున్నావ్ తెలుసా? ఆ ఋణాన్ని ఎలా తీరుస్తావ్? అతని భార్యని ప్రేమించి ఋణవిముక్తి పొందాలనా. ఎంత పాపాత్ముడివిరా! ఎంత ఘోరం! నువ్వా విషయం పైకి అనక పోయినా, నువ్వావాంఛను పైకగపర్చకిపోయినా అసలు మనస్సులోనైనా, పొరపాటు నైనా ఆవాంఛ వుండడం పాపంగాదా? అదీగాక ఏమిటీ ప్రేమ. ఇదో దండుగమారి పని. నీ కేసి నువ్వు చూసుకో తెలుస్తుంది. నీ ముఖం అద్దంలో చూచుకో, ఇటువంటి ముఖం ఎక్కడేనా వుందీ? ఘోరంగా, వికృతంగా గెద్దముక్కులాంటి ముక్కు, ఆకు పచ్చని కళ్ళు, ఒక చెవిలేదు. దెబ్బలమచ్చలు ఎంత అసహ్యంగా వుందో."

(వరీనియా అతనితో అంటుంది. "నువ్వెంత తమాషా అయిన వాడి వోయ్ డేవిడ్? మీ వూరేదన్నావ్? అక్కడవాళ్ళంతా నీలాగే వుంటారా? ఇంకా నువ్వొక కుర్రాడివే అయినా ఎప్పుడూ నవ్వవు. అల్లా ఎలా గుండకల్గుతావ్!"

("నన్ను కుర్రాడనకు వరీనియా నే నంతకన్న ఎక్కువేననిచూపించా."

("అలాగా; నన్ను బుకాయించకుమరి. నువ్వొక కుర్రాడివే. నీ కొక ఆడపిల్ల అవసరం. చక్కని, చల్లని సాయంకాలపు ఘడియల్లో ఆమె నడుంచుట్టూ చెయ్యివేసి ఆమెతో నువ్వు షికారు పోవాలి. ఆమెను ముద్దుపెట్టుకోవాలి. ఆమెతోబాటు నవ్వాలి. నీకు ఆడపిల్లలే దొరకలేదా?"

("నాపని నాకుంది. ఇలాటి వాటన్నిటికీ నాకు తీరికలేదు."

("ప్రేమించడానికి తీరిక లేదూ? బలే! బలే! డేవిడ్ ఎలాటి మాటన్నావ్? ఎంత వింత."

("ఎవడూ తీవ్రంగా ఆలోచించకపోతే మన గతేంగాను?" అతను కొంచెం తీక్షణంగా సమాధాన మిచ్చాడు. "ఒక సైన్యాన్ని నడపడమంటే పిచ్చుకగూ

కట్టడమనుకున్నావా. ఇంతమందికీ ప్రతినిత్యం ఆహారం సంపాదించాలి. వాళ్ళందరికీ శిక్షణ గరపాలి. ప్రపంచంలోని పనులన్నిటికన్నా ముఖ్యమైన కార్యభారం మన భుజస్కంధాలపైనుంది. అలాంటప్పుడు ఆడపిల్లలకేసి చూసి కన్నుగొడ్తూ కూచో మంటావ్ కదూ?"

"కన్నుకొట్టమని కాదు నేనన్నది డేవిడ్! వాళ్ళని ప్రేమించమని."

"అందుకు నాకు తీరుబడిలేదు."

"తీరుబడిలేదా? స్పార్టకస్ నాదగ్గరకొచ్చి తీరికలేదనిచెప్తే నా పరిస్థితి ఎలా గుండేదంటావ్? ఇక చావడమే నయమనిపిస్తుందని నే చెప్పగలను. కల్లాకపటం లేక, ధారాళంగా వుండడంకన్న మానవుడికి కావలసిందేమీ లేదు. నువ్వు స్పార్టకస్ మానవులందరికీ అతీతు డనుకుంటున్నావని నాకు తెలుసు. అదేమీకాదు. అతనే గనుక మానవాతీతుడైతే అతన్నెవరూ లక్ష్యపెట్టక పోదురు. అతన్లో యింద్రజాల మేమీ లేదు. నాకు తెలుసు. స్త్రీ ఒక పురుషుణ్ణి ప్రేమిస్తే అతడి గురించి పూరాగా తెల్సు కుంటుంది."

ఎలాగోలాగు సాహసించి అతడామె నడిగాడు. "నువ్వతన్ని ప్రేమిస్తున్నావు కదూ, ఏం?"

"ఏమిటబ్బా నువ్వనేది? ప్రాణంకన్న హెచ్చుగా అతన్ని నేను ప్రేమిస్తాను. అతనే కనక చెప్తే చావడానికి కూడా వెనుదీయను."

"నేనూ అతనికోసం చస్తాను" డేవిడ్ అన్నాడు.

"అదివేరు. నువ్వతన్ని చూస్తుండగా, అప్పుడపుడు నేను నిన్ను పరిశీలించే దాన్ని. అదివేరు. అతను మగాడు కాబట్టి అతన్ని నేను ప్రేమిస్తున్నాను. అతను సరళ మైన వ్యక్తి. అతనిలో అర్ధంకాని విషయాలేమీ లేవు. గొంతెత్తి నన్నొక మాటయినా అనియెరుగడు. చెయ్యెత్తి కొట్టినపాపానపోలేదు. కొందరు మగాళ్ళున్నారు. వాళ్ళకి వాళ్ళయందు వాళ్ళకే విచారం. తననిచూచి తనే విచారించడంకాని తనంటే తానే జాలి పడ్డంకాని చేయడు స్పార్టకస్. ఇతర్ల బాధనుచూసి విచారిస్తాడు. ఇతరులయెడ జాలి చూపుతాడు. నువ్వతన్ని ప్రేమిస్తున్నావా అని ఎలా అడగ్గలావు. అతన్ని నేనెంతగా ప్రేమిస్తున్నానో యిక్కడ వాళ్ళందరికీ తెలుసు.

ఆ విధంగా, అంత బాధలోనూ, ఒక్కొక్కప్పుడా మల్లుడు జరిగిన ప్రతి హంశాన్ని ఖచ్చితంగా, స్పష్టంగా చూడగలిగేవాడు. తదితర సమయాల్లో అతని ఆలోచనలు అతిఘోరంగా భయావహంగా వుండేవి. యుద్ధాన్ని గురించి ఎప్పుడాలో చించినా అదో పీడకలలా తోచేది. రక్తపాతం, బాధల పెడబొబ్బలూ, హాహాకారం,

భయోత్పాతంవల్ల ప్రళయరుద్రులైన జనసందోహం, పట్టలేని భీతావహమైన మహా సంచలనంలో వున్నట్లు కన్పించేది. అతని మనోనేత్రానికి మొదటి రెండుసంవత్సరాల కాలంలోనూ ఎప్పుడో ఒకప్పుడు వాళ్ళొక విషయం గుర్తించారు. రోమను ప్రపంచం ఎంతోమంది అసంఖ్యాకమైన బానిసలతో నిండివున్నా, వాళ్ళందరూ విప్లవంలో చేర రన్న విషయమే వాళ్ళూ గ్రహించారు. సాధ్యమైనంత బలాన్ని వాళ్ళు సమీకరించు కున్నారు. కాని రోమ్ బలాలకు అంతెక్కడ. ఆ కాలంలో జరిగిన ఒక యుద్ధం జ్ఞాపకం వచ్చిందతనికి. అది సంకులసమరం; భీకరయుద్ధం. ఆ యుద్ధంలో ఎన్నో వేలమంది పాల్గొన్నారు. ఒక పగలు, ఒక రాత్రి యీ యుద్ధం ఏ విధంగా పరిణమిస్తుందా అని ఆలోచిస్తూ స్పార్టకస్, తక్కిన సైనికాధికారులు ఒకచోట కూచున్నారు. ఇత నిలా ఆలోచనల్లో, స్మృతుల్లో పడితేలుతూంటే, కేపువా పౌరులు శిలువమీద నున్న మల్లుణ్ని పరిశీలిస్తున్నారు. అతని శరీరం మెలికలు తిరిగి కొట్టుకొంటూ వుంది. నోటినుండి తెల్లని నురుగులాంటి చొంగ కారుతూంది. ప్రతి అవయవమూ బాధతో గిలగిల కొట్టు కుంటూంది. అతని నోటివెంట చొంగతోబాటు కొన్ని మాటలు గూడ వెల్వడుతున్నట్లు వాళ్ళు గ్రహించారు. వాళ్ళల్లో వాళ్ళనుకున్నారు.

"ఇంక ఆట్టేకాలం పట్టేట్టులేదు. చావు దగ్గిరబడింది."

(పొడుగాటి కొండపై వాళ్ళు మకాం చేశారు. ఆ కొండ యిరువేపులా వంపు తిరిగి వాలుగావుంది. కొండ నడిభాగాన వాళ్ళ కాల్బలాలున్నయి. ఒక మైలు పొడ గన్నా వున్నవి ఆ దళాలు. రమణీయమైన కొండచరియ ఒకటుంది. లోతులేని నది ఒకటి ఆ లోయగుండా పారుతోంది. పాములా మెలికలు తిరిగినది. పచ్చగడ్డి దట్టంగా పెరిగిన ఆ లోయలో బరువైన పొదుగులుగల ఆవులు మేస్తున్నాయి. కొంతదూరంలో వున్నాయి రోమను సైన్యాలు. సేనలమధ్య స్పార్టకస్ శిబిరముంది. ఒక ఎత్తయిన మిట్టమీద వున్న తెల్లని గుడారంలో అక్కడినుంచి చూస్తే చుట్టూరావున్న ప్రదేశ మంతా కన్పిస్తుంది. సేనానిశిబిరంలో వుండవలసిన హంగులన్నీ అక్కడుంటాయి. అక్కడ జరగవలసిన దినచర్య అంతా అమల్లో వుంటుంది. కాగితాలు, రాతసామగ్రి పుచ్చుకుని కార్యదర్శి ఒకడు సిద్ధంగావుంటాడు. ఏభైమంది వార్తాహరులు అక్కడ సిద్ధంగా వుంటారు. రణరంగంలో ఏ మూలకు వార్త పంపాల్సివచ్చినా ఆ యుద్ధాన్ని దూసుకపోయి వార్తలు చేరవేయగల సాహసులు వాళ్లు. దానిపక్క ఒకచోట ఒక ధ్వజం పాతబడి వుంటుంది. రంగు రంగుల జెండాలు పుచ్చుకుని సంజ్ఞలతో విషయా లను తెలియజేసేవా డొకడున్నాడు. ఆ పెద్ద శిబిరం మధ్య పొడుగాటి మేజాపై ఒక చిత్రపటముంటుంది.

(రెండేళ్ళ యుద్ధజీవితంలో వాళ్ళు సంపాదించిన అనుభవమిది. ఇవి బానిసల పద్ధతులు. వాళ్ళు కనిపెట్టిన యుద్ధపన్నాగాలు ఎలాగున్నవో అలాగే యివికూడా వుంటయి. ఇప్పుడా మేజాచుట్టూ సేనానాయకులు నిలబడి శత్రుసేనల బలాన్ని అంచనా వేస్తారు. సమాచారాలు సేకరిస్తారు. ఆ మేజాచుట్టూ ఎనమండుగురుంటారు. ఒకచివర స్పార్టకస్ నిలబడివున్నాడు. అతని ప్రక్కనే డేవిడ్ వుంటాడు. స్పార్టకస్ ముఖం చూసిన వాళ్ళకి అతను నలభై ఏళ్ళ వాడనిపిస్తోంది. అతని వుంగరాలజుట్టులో అక్కడక్కడ జుట్టు తెల్లబడింది. పూర్వంకన్న చిక్కిపోయాడు. నిద్ర తక్కువవడం వల్ల కళ్ళు లోతుకుపోయాయి. ఆ కళ్ళ క్రిందిభాగం గుండ్రంగా నల్లబడి వుంటుంది.

(చూసినవాళ్ళెవరైనా కాలం అతన్నందుకుంటోంది, అతనితోబాటు పరుగెడుతోంది అంటారు. సరిగ్గా చెప్పాలంటే అదికాదు. కాళ్ళు పంగటించుకొని, అతని భుజాలమీద కూచుని కాలం స్వారీచేస్తోంది. ఎందుకంటారేమో; గోదాములకొద్దీ సంవత్సరాలు, బస్తాలకొద్దీ శతాబ్దాలు చెల్లిపోతుంటాయి గదా. అంతకాలానికి ఎప్పుడో ఒకప్పుడు ఎవడో ఒకడు ఈ ప్రపంచానికి ఒక పిలుపిస్తాడు. ఎన్నో శతాబ్దాలు గడచిపోనీ, ప్రపంచం యెంతోదూరం, యెన్నో మెలికలు తిరిగి సాగిపోనీ, ఈ వ్యక్తిని మాత్రం అటువంటి వ్యక్తి నే వ్యక్తినీ మాత్రం మార్చిపోదు. ఎంతోకాలం కానేలేదు. కొద్దికాలం క్రితం అతనొక బానిస. ఫక్తు బానిస ముమ్మూర్తులా ఒక బానిస. కాని ఈ రోజున అతనిపేరు తెలీనివాడు లేడు. సర్వత్రా అతని పేరు మోగుతుంది. తా నే విధంగా తయారయ్యాడన్న విషయం కూచుని కాస్సేపాలోచించడానిక్కూడా అతనికి తీరుబడిలేదు. రెండు సంవత్సరాల క్రితం వున్నట్లులేడు యీ రోజున. అధమం, ఆ రెండు సంవత్సరాల కాలంలోనూ తనలో వచ్చిన మార్పేమిటా అని ఆలోచించడానికి కూడా తీరుబడిలేదు. ప్రస్తుతం అతను 50 వేల సైనికులున్న సైన్యానికి సర్వసేనాని. ఆ సైన్యం కొన్ని విషయాల్లో చూస్తే ప్రపంచంలో, యింతకుముందున్న, ప్రస్తుతం వున్న సైన్యాలన్నిటికన్నా ఉత్తమమైనది.

(మెరుగుపూతలు లేకుండా వున్నదున్నట్లు ఆడంబరంలేని పదజాలంలో చెప్పాలంటే ఆ సైన్యం స్వతంత్ర సాధనకోసం పోరాడే సైన్యమని చెప్పాలి. అయితే పూర్వం సైన్యాలు లేవా? లేకేం; అంతులేనన్ని వుండేవి. అవి ప్రత్యేకమైన జాతుల కోసం, నగరాలకోసం, ధనంకోసం, దేశాలను దోపిడీచేసి గొల్లగొట్టడంకోసం ఏదో ఒక ప్రాంతాన్ని, లేక దేశాన్ని తమ స్వాధీనం చేసుకోవడంకోసం పోరాడేవి. కాని యిక్కడ మరోసైన్యముంది. ఈ సైన్యం మానవస్వాతంత్ర్యం కోసం, మానవుల హక్కులకోసం, మానమర్యాదలకోసం పోరాడుతుంది. ఈ సైన్యాని కో దేశంలేదు.

ఒక నగరంలేదు. ఎందుకంటే యే దేశంలోనైనా; నగరంలోనైనా వివిధ జాతులకు సంబంధించిన ప్రజలు నివశిస్తుంటారు. కనుక, అందుకే ప్రతినగరమూ వాళ్ళదే, ప్రతిదేశమూ వాళ్ళదే. ఇక్కడి ప్రతిసైనికుడికీ బానిసత్వం వారసత్వంగా లభించింది. మానవుణ్ణి బానిసగామార్చే దానవస్వభావంగల నరపశువులయెడ యిక్కడి ప్రతివాడికీ ద్వేషం వుంది. ఈ సైన్యం తప్పక విజయం పొందాల్సిన సైన్యం. ఎందుకంటే ఓడిపోయిన పక్షంలో వాళ్ళకు వెనక్కుతిరిగిపోడానికి వంతెనలు, రహదారులు సిద్ధంగా వుండవు. పైగా వెనక్కుపోడానికి వాళ్ళకో దేశం, ఒక నగరం అంటూ ఏదీలేదు. ఏ దేశానికి పోయినా యెవరూ వాళ్ళకు రక్షణ యిచ్చి కాపాడరు. అది చరిత్రలో మార్పుతెచ్చిన క్షణం. అదో ప్రారంభం. ఒక నూతన చైతన్యం. మాటలులేని, శబ్దం లేని సంభాషణ. ఒక ఉత్పాతం. ఒక ఉల్కాపాతం. పిడుగులతో ధ్వనించి ప్రపంచాన్ని ఊపిపారేసింది. కళ్ళు మిరుమిట్లుగొల్పే సహస్ర సూర్యకాంతిని మించిన విద్యుల్లత, తన విజయం యీ ప్రపంచాన్నే మార్చే దుష్టశక్తుల ఘోరపరాజయమని గ్రహించిన సైన్యమది. అందుకే అది యీ ప్రపంచాన్ని మార్చాలి. లేదా దానికి విజయం లభించడం దుర్లభం.

(చిత్రపటాన్ని చూస్తూ నిలబడ్డ స్పార్టకస్ బహుశా యీ సైన్యం యెల్లా వచ్చిందా అని ఆలోచించియుండవచ్చు. స్థూలకాయుడైన వ్యాపారస్థుని శిక్షణకేంద్రం నుంచి తప్పించుకువచ్చిన కొద్దిమంది మల్లులగురించి కూడా అతనాలోచిస్తాడు. వాళ్ళందరినీ ఒక బల్లెంతో పోల్చుకున్నాడు. ఆ బల్లెం విసిరేసరికి యీ జీవిత మహాసముద్రమంతటా సంచలనం తరంగములై విజృంభించింది. ఓర్పువల్ల, సహనంవల్ల బానిస ప్రపంచంలో నెలకొన్న ప్రశాంతా, నిశ్చలతా ఆ బల్లెం విసరడంవల్ల ఒక్కదెబ్బలో మటుమాయమయాయి. ఈ బానిసలను సుశిక్షితులైన సైనికులుగా తయారుచేయడానికీ, వాళ్ళందరినీ ఒకరితో ఒకరు కలిసి పనిచేసేటట్లు చూడడానికీ, అందరూకలిపి ఆలోచించే పరిస్థితి తీసుకురావడానికీ యెంత అవస్థ అయిందా అని ఆలోచించాడు. కాని ఇంతాచేసేక యీ చలనం యెక్కడో ఒకచోట ఆగిపోయిందా కొంపతీసి అని ఆలోచించసాగేడు.

(ఐనా, అటువంటి ఆలోచనలకు తీరికేదీ? ఇప్పుడు ఆలోచనాతరంగాలు కావు, రణరంగంలో దూకాలి. అతని మనస్సును భయమూ, ఆందోళనా ఆక్రమించాయి. యుద్ధభూమిలో అడుగుపెట్టేముందు మనస్సెప్పుడూ ఆ విధంగానే బాధపెడుతూ వుంటుంది. తీరా ఆ యుద్ధం ప్రారంభం అయేసరికి ఆ భయమూ కనబడదు; ఆందోళనా అగుపించదు. కాని తా నిప్పుడు మరీ భయపడిపోయాడు. తన సహచరుల

ముఖాలలోకి చూసేడు. వాళ్ళెందుకంత ప్రశాంతంగా వున్నారు? వాళ్ళుకూడా తన లాగునే భయపడడంలేదా? ఎర్రనిజుట్టు తలగల క్రిక్సస్‌ని చూసేడు. అతనొక గాల్. మచ్చలున్న అతని ఎర్రనిముఖంలో నీలపుకళ్లు పొదగబడి వున్నాయి. గెడ్డందాకా, యింకా కిందుగా కూడా పచ్చనిమీసం వంపు తిరిగి వేలాడుతోంది. తన బాల్య స్నేహితుడు, స్వదేశస్థుడూ అయిన గేన్నికస్ కూడా వున్నాడు. అక్కడే కాస్టస్, ఫ్రాక్సస్‌లూ, ఉన్నతమైన భుజములు కల్గిన ఆఫ్రికావాడు నార్డో, మంచి తెలివితేటలు కల్గి సున్నితంగా కనబడే మొజార్, యూదుడైన డేవిడ్ వున్నారు. వాళ్ళెవరూ అంతగా భయపడ్డట్లు లేదే. ఐతే తనుమాత్రం యెందుకంతగా భయపడాలి?

(వాళ్ళతో కొంచెం తీక్ష్ణంగానే మాట్లాడేడు. "మనం చెయ్యాల్సిం దేదో అది చూడాలి కాని యిక్కడ నిలబడి రోజ స్తమానూ లోయ కవతల శత్రుసైన్యం ఎంతుందా అని మీనమేషాలు లెక్కెడితే వచ్చే లాభమేమిటి?"

("అబ్బో! అది చాలా పెద్దసైన్యం" గేన్నికస్ అన్నాడు. "మనం యిదివరకు చూసినవాటి అన్నిటికన్న, పోరాడినవాటి కన్నిటికన్నా అది చాలా పెద్దసైన్యం. లెక్క పెట్టనవసరం లేకుండగానే తెలుస్తోంది. అదో పది అక్షోహిణీల సేన. గాల్ నుండి యేడో దళాన్నీ, యెనిమిదో దళాన్నీ, తెప్పించారు వాళ్ళు. ఆఫ్రికానుంచి మూడూ, స్పెయిన్‌నుండి రెండూ దిగుమతి అయాయి. నేను పుట్టేక అంత సైన్యాన్ని యెప్పుడూ చూడలేదు. అద్దరిని డెబ్భైవేల మందికి తక్కువవుండరు."

(ఎవడు ఊగిసలాడుతాడా, ఎవడు పిరికిమందు నూరుతాడా అని చూస్తాడు క్రిక్సస్. ఎప్పుడూ అతని పని అదే. క్రిక్సస్ కనుక నీ అభిప్రాయ మేమిటయ్యా అని అడిగితే "ఆఁ యేముంది? యీ ప్రపంచాన్నే జయించి పారేస్తాం" అంటాడు. అతనికి ఉన్నదల్లా ఒకే ఒక నినాదం. రోమ్ ఛలో. 'ప్రతి ఒక్క యెలుకనే పట్టుకు చంపుతూ కూచోడంకన్న యీ ఎలుక కన్నాల్నే యెందుకు త్రవ్విపారెయ్యకూడదూ అంట!' అదీ అతని ప్రశ్న. "గేన్నికస్! ఖూనీ చేసేస్తున్నావ్. ప్రతినిముషం అదొక మహాసైన్యం, పోరాటానికి యిది అనువైన సమయంకాదు అంటావేమిటి ఖర్మ, నే చెప్తావిను; వాళ్ళ సైన్యం గురించి నువ్వు బెంగపడిపోవడమేమిటి అంతమంది వాళ్ళుండగా? నన్నడిగితివా యిప్పుడే, యీ క్షణమే వాళ్ళమీద దెబ్బతియ్యాలంటాను. గంట పోయాకో, వారం పోయాకో, నెల పోయాకో వాళ్ళతో దెబ్బలాడ్డమంటే నాకు పరమ అహస్యం."

(గేన్నికస్ తన వాదనను తను సమర్థించుకోబోయాడు. "పూర్వంలాగే యిప్పుడు కూడా రోమన్లు తమ సైన్యాన్ని చీల్చుతారేమో?"

("వాళ్ళల్లా చెయ్యరు" స్పార్టకస్ చెప్పేడు. "నే చెపుతున్నాగా. వాళ్ళల్లా యెందుకు చీల్చాలి? మనందరం యిక్కడే వున్నాం. అల్లాటప్పుడు ఆ పని చెయ్యరు."

(అప్పుడు ఈజిప్టుదేశస్థుడు మొజార్ అన్నాడు: "క్రిక్సస్ చెప్పినదానితో మొట్ట మొదటిసారిగా నే నేకీభవిస్తున్నా. సాధారణంగా అతను చెప్పడం, నే నవుననడం వుండదనుకోండి. కాని యీమారతను సరిగ్గా చెప్పేడు. అవతలో మహాసైన్యం వుంది. దాన్ని మనం యిప్పుడో, ఇకను యెప్పుడో ఒకప్పుడు యెదుర్కొని తీరాలి. ఇప్పుడే అయితే మంచిది. మనం యిల్లాగే కూచున్నామే అనుకోండి; వాళ్ళు మనకన్న చాలా బాగా కూచోగలరు. కూచున్నా వాళ్ళకి తిండీ గట్రా అన్నీ సరఫరా అవుతాయి. కాని మనం కూర్చున్నామంటే మాత్రం దగ్గరున్న కాస్త తిండీ గట్రా అన్నీ నిండు కుంటాయి. తరువాత మాడి చావల్సివస్తుంది. మనం యీ ప్రదేశం వదలి వెనక్కి తగ్గేమా వాళ్ళకంతకన్న కావల్సిందేముంది?"

("వాళ్ళెంతమందని నీ అభిప్రాయం?" స్పార్టకస్ ప్రశ్నించాడు.

("బోలెడు మంది. డెబ్బైవేలు."

(స్పార్టకస్ ఆలోచనాపూర్వకంగా తలవూపేడు. "బోలెడుమంది, తెగబోలెడు మంది, నువ్వన్నదే రైటు. వాళ్ళను మనం ఎదుర్కోవల్సిందే." విషయాన్ని తేలికగా కొట్టిపారేద్దామన్నట్లు స్పార్టకస్ మాట్లాడబోయాడు; కాని అతని హృదయం యెంతో బరువుగా వుంది.

(మూడు గంటలలో రోమన్ సైన్యాలను యెదుర్కొందామని వాళ్ళనుకున్నారు కాని యుద్ధం అంతకన్న ముందే ప్రారంభమైంది. ఈ సేనాధిపతులు వాళ్ళ వాళ్ళ దళాలు చేరుకొన్నారో లేదో అప్పుడే రోమన్లు బానిసల మధ్య శ్రేణిని ఢీకోవడం జరిగింది. పెద్ద వ్యూహాలూ, ఎత్తుగడలూ యేవీలేవు. బాణంలావచ్చి ఒక రోమను దళం వీళ్ళను తాకింది. దాని వెనుకనే మహాశక్తివంతమైన రోమనుదళా లనేకం వచ్చి యుద్ధానికి ప్రాణంపోసేయి. దేవిడ్ స్పార్టకస్ ప్రక్కనే వున్నాడు. సర్వసేనాని తన సైన్యాలను అదుపులోనికి తెచ్చుకోడానికే ఒకగంట పట్టింది. అంతదాకా అంతా గందరగోళమే. అప్పుడే యుద్ధం పీకలదాకా వచ్చేసింది. ఇంటి నడికొప్పు ముట్టుకుంది. పీడకల ప్రారంభమైంది. సేనాని శిబిరం తుత్తునియలైపోయింది. ఒక మహాసముద్రంలో తేలుతున్నట్లున్నారు వాళ్ళు. స్పార్టకస్ చుట్టూ పెనుతుపాను రేగింది.

(అది సమరం. తానిప్పుడా సమరంలోనే వున్నట్లు తెలుసుకున్నాడు దేవిడ్. ఎవడిమటుకు వాడు, శత్రుసైన్యంలో యెవడినో ఒకడిని యెంచుకుని యెంతో అంత

యుద్ధం చేసేస్తున్నాడు. అందుకే యిదొక సంకులసమరం. ఇక యేమాత్రమూ పెద్ద సైన్యాని కొకదానికి స్పార్టకస్ నాయకుడు కాడు. సామాన్య సైనికుడు పట్టుకునే ఒక చతురస్రాకారపు డాలూ, కత్తీపుచ్చుకుని పోరాడే మామూలు సిపాయి. మతిపోయిన వాడిలా పోరాడేస్తున్నాడు. అల్లాగే ఆ యూదుడు కూడా పోరాడుతున్నాడు. వాళ్ళిద్దరూ ఒక రాయిలా గున్నారు. ఆ రాతిమీద యుద్ధతరంగాలువచ్చి ఢీకొంటున్నాయి. నురుగులు కక్కుతున్నాయి ఒకమారు వాళ్ళు ఒంటరిగా ఉండిపోయినపరిస్థితి యేర్పడింది. అప్పుడొక వందమంది వాళ్ళకి సహాయంగా వచ్చారు. డేవిడ్ స్పార్టకస్ వంక చూస్తాడు. ఆ రక్తం వెనుక, చెమట వెనుక థ్రేషియన్ సరదాగా నవ్వుతున్నాడు.

("ఎంత భీకరయుద్ధం!" అతను గట్టిగా మాట్లాడుతున్నాడు. "డేవిడ్! ఎటువంటి ఘోరయుద్ధం! ఈ యుద్ధం ముగిసి స్వచ్ఛమైన సూర్యోదయ అరుణకాంతిని చూడడానికి మనం బ్రతికి వుంటామోయ్? ఏమో ఎవడెరుగును?"

(అతనికీ యుద్ధం అంటే యెంతో యిష్టమని డేవిడ్ యెరుగును. ఎంత వింతయిన మనిషి! యుద్ధాన్ని బానిస విముక్తికోసం సాగే సంకులసమరాన్ని అతనెంతగా ప్రేమిస్తాడు! బెబ్బులిలా పోరాడుతున్నా డతను. అతను పాడేపాటలలోని వీరయోధుడిలా పోరాడుతున్నాడు.

(తను కూడా ఆ విధంగానూ, అంత భయంకరంగానూ పోరాడుతున్నాడని అతనెరుగడు. బల్లెం స్పార్టకస్‌కు తగలాలంటే ముందు తను చావాలి. అంతవరకూ అతని శరీరం గోడలా అడ్డుతూనే వుంటుంది శత్రు శస్త్రాలను. అలసట యెరుగని పులిలాగున్నాడు. అతని చేతిలో కత్తి పులిపంజాలాగుంది. ఎప్పుడూ స్పార్టకస్‌ను వదలిలేడు. స్పార్టకస్‌ను అత నంటిపెట్టుకుని వుండటం చూస్తే వాళ్ళిద్దరి శరీరాలు అతుక్కుపోయాయా అనిపిస్తుంది. తను చేస్తున్నదేదో అంతమటుకే అతను చూడగలడు. స్పార్టకస్‌ను చూడగలడు. అంతేకాని తక్కిన మహాయుద్ధం, తనచుట్టూ దావానలంలా వ్యాపించిన మారణయుద్ధాన్ని అతను చూడలేదు ఎరుగడు. తనూ, తన స్పార్టకస్ యిదే అతని గొడవ. అది చాలు. రోమన్లు కూడా యెరుగుదురు స్పార్టకస్ యిక్కడే వున్నాడని. అందుకే యెంతోకాలం కష్టపడి నేర్చుకున్న వివిధ కవాతు ప్రదర్శనా పద్ధతులను, అవి యిక్కడ యెందుకూ పనికిరావు కాబట్టి దూరంగా నెట్టి, మూకఉమ్మడిగా అతని సైన్యాలమీద పడ్డారు. పడి బానిససైన్యాలను చీల్చి చెండాడి స్పార్టకస్ మహారాక్షసుని కుత్తుక నుత్తరించి పీడ వదుల్చుకుందామన్న పట్టువిడవని పట్టుదలతో సంకులసమరం సాగిస్తున్నారు. ఆ రాక్షసుడిని కింద పడెయ్యాలి. చంపాలి. అతని తల నరకాలి. అదీ వాళ్ళ ముందున్న కర్తవ్యం.

వాళ్ళ నోటివెంబడి వచ్చే బూతుకూతలు స్పష్టంగా, దగ్గరగా వినవస్తున్నవి. డేవిడ్ అది విని శత్రువులు చాలా సమీపంలో ఉన్నారనుకున్నాడు. ఆ బూతుకూతల మోత రణగొణధ్వనిని మించిపోయింది. బానిసలకు కూడా తెలుసు స్పార్టకస్ తమతోబాటే యిక్కడే వున్నాడని; ఉండడమే కాదు పోరాడుతున్నాడని. మరొక వైపునించి వాళ్లు నేల యీనినట్లు వచ్చిపడుతున్నారు; రణరంగం మీదకు చొచ్చుకొస్తున్నారు. శత్రుశ్రేణులలోకి జొరబడుతున్నారు. స్పార్టకస్ పేరును బానిసలొక పతాకంలా యెగరేస్తున్నారు గాలిలో. అది రెపరెపలాడుతూ ఆ వాతావరణం అంతటా తన ప్రభావాన్ని కనబరుస్తోంది. ఆ చుట్టుప్రక్కల యెంతో విశాలమైన ప్రదేశాన్నది ఆక్రమించింది. స్పార్టకస్! ఆమాట మైళ్ళదూరం వినిపిస్తోంది. అక్కడి కొక అయిదు మైళ్ళ దూరంలో ప్రహరీగోడల మధ్య ఒక మహానగరం వుంది. ఆ నగరం యీ యుద్ధఘోషకు కంపించిపోయింది.

(వినడం అనే క్రియను డేవిడ్ ప్రయత్నపూర్వకంగా చెయ్యడమే లేదు నిజానికి. కాని అతని చెవులే యేవేవో వినేస్తున్నాయి. అతని పోరాటం యేదో, యెదురుగా ఉన్నదేదో అతనికి తెలుసు. అంతే. పెదవులు తడి ఆరిపోతున్నాయి. అతనిలో శక్తి క్షీణిస్తోంది. యుద్ధం మరింత భీకరస్వరూపం దాల్చింది. మరీఘోరంగా తయారయింది. రెండుమైళ్ళ పొడుగున యెటుచూచినా యీ యుద్ధమేననీ, అంతటా యిది వ్యాపించిందనీ అతని కేం తెలుసు? రెండు రోమన్ దళాలను క్రిక్సస్ చావగొట్టి తరిమి పారేసిన సంగతికూడా అతనికి తెలియదు. తనభుజం, తనచేతిలోని ఆ కత్తీ, ప్రక్కన స్పార్టకస్ సురక్షితంగా వున్నాడా లేడా అన్న సంగతీ - యింతమటుకే అతనికి తెలుసు. మోకాలంతయెత్తున ఒత్తుగాపెరిగిన మెత్తనిగడ్డిలో తను నడిచేవరకూ ఆ కొండదిగువ దాకా తమ సైన్యం రోమన్లను తరుముకొచ్చిన సంగతి అతనికి తెలియనేతెలియదు. వాళ్ళాలోయలో వున్నారు. అక్కడ నదిలో యిరుపక్షాలవారూ వున్నారు. మోకాలులోతు నీళ్ళలో వాళ్ళు నిలబడి పోరాడుతున్నారు. నదిలో నీరు ఎఱ్ఱని రక్తంలా ప్రవహిస్తోంది. సూర్యుడు అస్తమించాడు. ఆకసమంతా ఎఱ్ఱవారింది. చీకటిపడి పోరాటం కొద్దిగా తగ్గినట్టు అనిపించినా యుద్ధం మాత్రం ఆగలేదు. చల్లని చంద్రకాంతిలో బానిసలు నీటిలో తలలుముంచుతున్నట్లు స్పష్టంగా కనిపిస్తోంది. అదేపనిగా నీళ్ళు తాగుతున్నారు. త్రాగకపోతే వాళ్లు జీవించడం కష్టం.

తెల్లవారింది. రోమన్లదాడి విఫలమైంది. ఇంతకుపూర్వం యెవరైనా యీ బానిసలవంటి యుద్ధప్రియుల నెదిరించారా! ఎంతమందిని చంపినాసరే కేకలతో, పెడబొబ్బలతో మరో యింతమంది తయారు. వాళ్లు మనుష్యులుకారు. మనుష్యుల్లా పోట్లాడనే

పోట్లాడరు. క్రూరజంతువులలా విరుచుకుపడతారు. కత్తితో పొడిచి పొట్టలోని పేగులను పైకితీసి చంపినా, కిందపడి కూడా కాళ్ళు పట్టుకు కరిచి యమయాతన పెడతారు. వాళ్ళ నొదుల్చుకోవాలంటే కిందపడ్డవాడినైనాసరే పొడిచిపొడిచి చేతులు పీకేవరకూ పొడిచి మరీ చంపాలి. మామూలుగా మరొక మనిషే అయితే ఆమాత్రం ఈమాత్రం దెబ్బతగిలితే కిందపడి పాకుకుంటూ యుద్ధరంగంనుంచి దూరంగా పోతాడు. కాని యీ బానిసలో ప్రతి చుక్కరక్తమూ పోయేవఱకూ, శరీరంలోని ప్రతి అణువూ శక్తి నశించేవరకూ పోరాడుతూనే వుంటారు. మరొకరెవరైనా అయితే చీకటిపడ్డాక యుద్ధానికో దణ్ణంపెట్టి పోతారు. కాని యీ బానిసలకు పగలూలేదు, రాత్రీ లేదు. విరామం లేకుండా అదేపనిగా పోట్లాడడమే వాళ్ళపని.

(ఈ విధంగా ఆలోచించగా రోమన్లలో భయం వ్యాపించింది. ఈ భయానికి విత్తులు పూర్వమెన్నడో చల్లబడి వున్నాయి. ఇప్పుడవి మొలకలెత్తుతున్నాయి. బానిసలంటే భయం. బానిసలతోపాటే జీవిస్తారు. కాని బానిసలను నమ్మరు. వాళ్లకూడా యీ సంఘంలోనే వున్నారు. కాని అదే సంఘానికి బైటనున్నారు. ప్రతిరోజూ వాళ్లు చిరునవ్వు నవ్వుతూనే ఉంటారు. కాని ఆ నవ్వువెనుక విపరీతమైన ద్వేషం వుంది. వాళ్ళెప్పుడూ నిన్ను చంపడానికి ఆలోచిస్తూ ఉంటారు. వాళ్ళకు ద్వేషం పుట్టిల్లు. ఆ ద్వేషంలోనే పుట్టి, పెరిగి వృద్ధిచెందుతారు. దేనికోసమో వాళ్ళు నిరీక్షిస్తారు; మరీ నిరీక్షిస్తారు; ఇంకా నిరీక్షిస్తారు. వాళ్ళది అనంతమైన ఓరిమి. అపారమైన జ్ఞాపకశక్తి, యుద్ధం జరుగుతుండగా ఆలోచించడమే కష్టం. కాని ఆలోచించడానికి అవకాశం వచ్చినపుడు ముందుగా రోమన్ల మెదడులో మెదిలిన ఆలోచన లివే. ఇప్పుడా ఎత్తు ఫలిస్తుంది.

(వాళ్ళు అలసిపోయారు. డాళ్లు పట్టుకోడానికీ, కత్తులు మోయడానికీ కావలసిన కనీస శక్తికూడా వాళ్ళల్లో లేదు. కాని యీ బానిసలకు మాత్రం బడలిక అనేది లేదు. ఏం చేస్తున్నాం అనే ఆలోచనకూడా నశిస్తుంది. ఇక్కడొక పదిమంది బానిసలు తయారౌతారు. అక్కడో వంద. వంద వెయ్యిగా మారుతుంది. వెయ్యి పదివేలవుతుంది. అక్కడి కొండల్లోనుంచీ, ప్రతి రాతినుంచీ, ప్రతి చెట్టు కొమ్మలోంచీ, మనుష్యులు పుట్టుకొస్తున్నారా అన్నట్లుంది. రోమన్ సైన్యాలు భయాందోళనలకు దాస్యం వహిస్తాయి. ఆ భీతిలో వాళ్ళు కాళ్ళకు బుద్ధిచెప్పడం లంకించుకున్నారు. పారిపోయే సైనికుల్ని పట్టుకొని భగవద్గీత వినిపించబోయారు కొందరు సైనికోద్యోగులు. సైనికులా ఛాందసపు ఉద్యోగులను చంపిపారేశారు. భయంతో అరుస్తూ, రొప్పుతూ, రోజుతూ, పడుతూలేస్తూ బానిసల బారినుండి తప్పించుకు పారిపోతున్నారు. వాళ్ళను

వెన్నంటి తరుముకొస్తున్నారు బానిసలు. నడుం విరిగి వీపులమీద గాయాలతో వేలకొద్దీ రోమన్ సైనికులు చాపచుట్టలులా పడివున్నారు. కొంత దూరంవరకూ నేల కనబడదు. ఎటుచూచినా యీ నిహతులైన సైనికుల కళేబరాలే!

(క్రిక్సస్, తదితరులూ స్పార్టకస్‌ని చూడ్డానికొచ్చేసరికి అతనిప్రక్కనే యూదుడు కూడా వున్నాడు. చచ్చి పడివున్న శవాలమధ్య పడుకుని స్పార్టకస్ నిద్ర పోతున్నాడు. కత్తి చేతబట్టిన యూదు డా ప్రక్కనే నిలబడి వున్నాడు. "అతన్ని పడుకోనివ్వండి" అంటాడు యూదుడు. "ఇదో ఘనవిజయం. పాపం అతన్ని పడుకో నివ్వండి."

అదే ఘనవిజయంకోసం పదివేలమంది బానిస వీరులను బలిదానం చెయ్యాల్సి వచ్చింది. కాక రోమన్ సైన్యాలకు అంతెక్కడ. ఇది పోతే మరికొన్ని సైనికదళాలు సిద్ధం - యింతకన్న పెద్దవే.)

# 7

తనకు ప్రాణావసానకాలం సమీపిస్తోందని తెలిసినపిమ్మట మల్లునికి దేనియందూ ఆసక్తిలేకుండా పోయింది. శిలువ వేయడమన్నది యెంతో గొప్ప పద్ధతి, చాలా మంచిది అని గట్టిగా నమ్మిన ఒక పదిమందీ, కూడూ గూడూలేక బేవార్సుగా తిరిగే ముష్టివాళ్ళు కొందరూ తప్ప అక్కడ యింక ప్రేక్షకు లెవరూ లేరు. కేపువాలో ప్రజలకోసం యెన్నో వినోదప్రదర్శనా లివ్వబడతాయి; కాని యీ ముష్టివాళ్ళను అక్కడికి చేరనిచ్చే దెవరు? ప్రస్తుతం కేపువాలో గుర్రపు పందేలు జరగడం లేదన్నమాట నిజమే కాని అక్కడి రెండు రంగస్థలాలలోనూ యేదో ఒక కార్యక్రమం అంటూ ఉండకుండా వుండదు. సంవత్సరానికి కనీసం మూడువందల రోజులయినా మల్లయుద్ధ ప్రదర్శనాల నేర్పాటు చేయగలమని గర్వించే కేపువాధనాఢ్యులకు ఊళ్ళో యే వినోదమూ లేకుండా చేయడమంటే ససేమిరా సరిపడదు. పైగా కేపువా యాత్రాస్థలం. అక్కడ యెప్పుడూ చాలామంది యాత్రీకులుంటారు. మంచి నాటకశాల ఒకటుందక్కడ. వేశ్యావృత్తి అక్కడ పెద్దయెత్తున జరుగుతుంది. వేశ్యావాటికలలో ఎంతో సువిశాల సుందర భవనా లున్నది అక్కడనే. రోమ్‌లో యీ కాముక వ్యాపారం బహిరంగంగా జరగడానికి ఒప్పుకోని రోమన్లు కేపువాలోమాత్రం యెంత పెద్దయెత్తున జరిగినా ఫరవాలేదంటారు. అనకపోయినా ఆచరణలో ఆమోదించిపారేస్తారు. ఈ వేశ్యాగృహాలలో అభిరుచికి ప్రథమస్థానం లభించింది. అందుకే ప్రపంచంలో యివి అగ్రస్థానానికి వచ్చినవికూడా. ప్రపంచంలో యెన్ని దేశాలు, యెన్ని జాతులు ఉన్నాయో అన్నింటికీ సంబంధించిన

మదవతులున్నారక్కడ. కేపువా పట్టణంయొక్క పేరుప్రతిష్ఠలు కాపాడడానికీ, పెంచడానికీ, యీ వేశ్యలకు పడుపువృత్తిలో ఆధునిక పద్ధతులలో చక్కని తర్ఫీదు యివ్వబడుతుంది. అత్తరువు బజార్లూ,స్నానశాలలూ,భోగ్యవస్తువులు లభ్యమయ్యే అంగళ్లూ, జలక్రీడాస్థలాలూ ఒకటేమిటి; యెన్నెన్నో వున్నాయక్కడ.

అందువల్లనే చావడానికి సిద్ధంగావున్న ఒకబానిస వాళ్ళల్లో ఆసక్తిని రేకెత్తించలేక పోయాడు. అదికూడా ఒక వింతే. ఐనా యింతకన్న వింత మరొకచోట ఉండగా దీన్ని చూస్తూ కాలం వృధాచెయ్యడానికి యెవరికి మనస్కరిస్తుంది? ఏరివేత పద్ధతిని ఏర్పాటు చేయబడ్డ మల్లయుద్ధాలలో యెంతోమంది మల్లులను జయించిన జగజ్జెట్టిని యిక్కడ శిలువవేయడం జరిగింది కనుక చూడవచ్చారు కాని, మరొక సాధారణ బానిసనే కనుక శిలువవేస్తే వీళ్ళు ఒక్కమారు కూడా కన్నెత్తి చూద్దురా? "కేపువాలోని రోమన్ పౌరులందరికీ" అని ప్రారంభమై ఆ ఊళ్ళోఉన్న కొద్దిమంది యూదులలోనూ ముగ్గురు ప్రముఖ యూదు ధనవంతుల సంతకాలతో అంతమైన ఒక కరపత్రం వ్రాయబడి పంచిపెట్టబడింది. తమ మాతృదేశంలో అన్నిరకాల విప్లవశక్తులూ రూపుమాపబడినవనీ, అసంతృప్తి తుడిచిపెట్టబడిందనీ వాళ్ళు పేర్కొన్నారు. అంతేకాదు; యీ అంగసంస్కారపద్ధతి యూదులలోనే కాక యీజిప్షియన్లలోనూ, ఫోయినీషియన్లలోనూ, పెర్షియన్లు చాలామందిలోనూ సాంప్రదాయసిద్ధంగా వస్తున్న విషయమేనని కూడా సవినయంగా మనవి చేసుకున్నారు. పైగా ప్రపంచంలో శాంతి సమృద్ధులను సాధించి, సక్రమ పరిపాలనాపద్ధతిని నెలకొల్పిన రోమన్ మహాసామ్రాజ్యాన్ని వ్యతిరేకించడమన్నది యూదుల రక్తంలోనేలేని వైపరీత్యంగా పేర్కొని త్రోసిపారేశారు. ఆ విధంగా అందరిచేతా నిరాకరింపబడిన మల్లుడా శిలువమీద అవమానంతో, విషాదంతో, బాధతో అవసాన దశలో నున్నాడు. అక్కడున్న సైనికులకుగాని, కొద్ది మందిగా ఉన్న ప్రేక్షకులకుగాని అతనేమంత ఆసక్తిజనకంగా కన్పించలేదు. ఒక ముసలిది మాత్రం చేతులు మోకాళ్ళ చుట్టూవేసుకుని ఆ శిలువవైపే తదేక దీక్షతో చూస్తూ కూచుంది. ఉబుసుపోక సైనికు లామెను యేడిపించడం ప్రారంభించారు.

"అందాలరాసీ" అందులో ఒకడామెతో అంటున్నాడు: "అక్కడా మనిషిని పెట్టుకుని యేమేం కలలు కంటున్నావు తల్లీ?"

"అతన్ని కిందకు దింపి నీ కివ్వమంటా వేమిటి?" మరొకడు ప్రశ్నించాడు. "అటువంటి చక్కని యువకుడితో కాలంగడిపి యెంతకాలమయిందంటావు?"

"చాలాకాలమయింది?" ఆమె గొణిగింది.

"ఆఁ! పక్కలో పడుకున్నాడంటే వాడో దున్నపోతులా కుమ్మేస్తాడు నిన్ను. చాలాబాగుంటుంది ఏమంటావ్ ముసలమ్మా?"

"ఏం మాటలురా మీవి!" అన్నదామె. "ఏం మనుషులురా మీరు! అల్లాగేనా ముసలిదానితో మాట్లాడడం?"

"ఓ మహాతల్లీ క్షమించు, వేడుకుంటున్నాం" అని ఒకరి తరువాత ఒకరు ఆ సైనికులంతా వంగి ఆమెకు వేళాకోళంగా నమస్కరించారు. అక్కడున్న కొద్దిమంది ప్రేక్షకులూ యీ తమాషా చూస్తూ చుట్టూ మూగారు.

"ఎందుకీ దొంగదణ్ణాలు? బూటకం. నేను మీకు ఛండాలంగానే కనబడచ్చుకాని మీరు నాకన్న చెత్తవెధవలు. నా మురికితనం కడుక్కుంటే పోతుంది; మిమ్మల్ని పుటంవేసినా మీ కుళ్ళు వదలదు."

వాళ్ళు తిట్టినా ఆమె తిట్టటం మాత్రం వాళ్ళకు యిష్టంలేదు. తమకున్న అధికారాన్ని చూపించాలనుకున్నారు. వాళ్ళకళ్ళల్లో మరింత కాఠిన్యం మెరిసింది.

"ఓయ్ ముసలమ్మా! ఒళ్ళుదగ్గరపెట్టుకో కొంచెం" ఒకడన్నాడు. "నోటికి కొద్దిగా తాళంవెయ్యి తెలిసిందా?"

"మీరు మీ యిష్టం వచ్చినట్లంటే నా యిష్టం వచ్చినట్లు నేనంటా."

"అయితే సరే; కాని వెళ్ళి స్నానం చేసిరా. ఇంత ఛండాలంగా, అసహ్యంగా పట్టణ ద్వారందగ్గర నిలబడబోకు. నిన్ను యీ విధంగా చూడడం మాకు యిష్టంలేదు. నువ్వుకూడా ఒక దృశ్యాన్ని సృష్టిస్తున్నావు."

"ఔను. ఒక దృశ్యాన్నే." ఆమె పండ్లికిలించింది. "నన్నుచూస్తే ఒక దృశ్యం చూస్తున్నట్లుంది కదూ? భయంకరమైన దృశ్యం ఔనా! రోమన్లెటువంటి ప్రజలు? ప్రపంచమంతటికీ పరిశుభ్రమైనవాళ్ళు కదూ? రోజులు తరబడి స్నానం చెయ్యకుండా, మీలాగనే యెందుకూ కొరగాకుండా, రోడ్లమ్మట తిరుగుతూ, జూదం ఆడుతూ, రంగ స్థలాలలో ప్రొద్దుగడిపే రోమన్లు లేరా? ఎంత పరిశుభ్రమైన వాళ్ళు—"

"ముసలమ్మా చాలు చాలు; నోరు ముయ్యి."

"అబ్బే యేమీచాలదు. నేను స్నానం చెయ్యలేను. నే నో బానిసను. బానిసలు స్నానశాలలో పనిచెయ్యడానికేగాని వాటిలో స్నానం చెయ్యడానికి పనికిరారు. పైగా నేను ముసలిదాన్ని. మీ మూలాన్నే నా ఒళ్ళు గుల్లయిపోయింది. దాన్ని మీరింకేమీ చెయ్యలేరు. ఈ యెండలో నామానాన్న నేను యెవరిజోలికీ పోకుండా కూచున్నాను. అదికూడా మీ కిష్టంలేదా? రెండురోజులకోమాటు నా యజమానియింటికి పోతా. అతనో పిడికెడు మెతుకులు పడేస్తాడు. భూమి దున్ని పంట పండించేది బానిసలు. పంటకోసేది

బానిసలు. దాన్ని వండేది బానిసలు. దయా, ధర్మబుద్ధితో విచ్చంపడేస్తే తినేది బానిసలు. నే నీ రోడ్లమీద తిరుగుతుంటాను. ఇక్కడ ఉన్నది యేది బానిసలచే తయారుచేయ బడ లేదు? మీరంటే నాకు భయమనుకున్నారేమో, కాండ్రించి మీ ముఖంమీదే వుమ్మేస్తా.''

ఈ సమయానికే క్రాసస్ ఏపియన్ ద్వారంవద్దకు తిరిగి వచ్చేడు. రాత్రి పోవాల్సిన నిద్ర పొద్దునకు వాయిదావేసిన వాళ్ళకి బాగా నిద్ర పట్టదు. క్రాసస్ నిద్ర కలత నిద్ర అయింది. ఎందుకయ్యా మళ్ళీ యీ శిలువవద్దకు వచ్చావు అని యెవరైనా అడిగి ఉంటే యేమీ తెలియదన్నట్లు భుజాలెగరేసును. అది అతని కలవాటు. నిజానికి అత నెరుగును. ఎందుకు తను తిరిగి ఆ చోటికి తిరిగివచ్చాడో? క్రాసస్ జీవితంలోని ఒక గొప్ప శకం యీ కడపటి మల్లుని చావుతో అంతం కాబోతోంది. క్రాసస్‌ని జనం ఒట్టి ధనవంతుడుగానే కాక బానిసల తిరుగుబాటు నణచిన సేనానిగా జ్ఞాపకం వుంచుకుంటారు.

చెప్పడానికయితే అది చాలా సులభంగా కనిపిస్తుందేకాని చెయ్యడం వచ్చేసరికి మాత్రం తాతలు దిగొస్తారు. తన బొందిలో ప్రాణం ఉన్నంతవరకూ యీ బానిస విప్లవం గురించి, అతనికున్న స్మృతులనుంచి విడివడి తనను తా నూహించుకో లేడింక. ఆ స్మృతులలోనే జీవిస్తాడు. ఆ స్మృతుల అలలే అతన్ని జోకొట్టి నిద్ర పుచ్చుతాయి. క్రాసస్ యీ ప్రపంచం వదలి వెళ్ళేదాకా స్పార్టకస్‌కు వీడ్కోలివ్వలేడు. అందుకే తన శత్రువైనా చావబోతున్న యీ విరోధిని మరొక్కమారు చూచుకుపోదామని వచ్చాడతను.

షిఫ్టు మారింది. మరొక కెప్టెన్ ద్వారంముందు పహరాకాస్తున్న సైనికులపై అధికారం చెలాయిస్తున్నాడు. అతనుకూడా క్రాసస్ నెరుగును. నిజానికి అతన్ని కేపువాలో చాలామంది యెరుగుదురు. రెట్టించిన వినయవిధేయతలతో కెప్టెన్ సేనానితో మాట్లాడుతున్నాడు. వీలయినంత యెక్కువగా సేనానికి ఉపయోగపడాలని అతని అవస్థ. అంత తక్కువమంది జనం ఆ మల్లుడి చావును చూస్తున్నందుకు తను విచారిస్తున్నట్లూ, అది తన బాధ్యతే అయినట్లూ, ఆ బాధ్యత సక్రమంగా నిర్వహింపబడ నందుకు క్షమించమనీ ప్రార్థించాడు; ఎవరో చూడకపోవటంలో యితని బాధ్యత యేమిటో!

''అతని ప్రాణం చాలా త్వరగాపోతోంది'' అతనంటున్నాడు. ''అదే ఆశ్చర్యంగా వుంది. మొండిఘటం అనుకున్నా. మూడురోజులైనా బ్రతక్కపోతాడా అనుకున్నాం మొదట. తీరాచూస్తే రేపుదయంలోపుగా చచ్చేలాగున్నాడు.''

“నీ కెల్లాతెలుసు?” క్రాసస్ అడిగాడు.

“తెలియడానికేముంది? శిలువెయ్యడం నేనెన్నోమార్లు చూసేను. అన్నీ ఒకేలా గుంటాయి. పెద్దపెద్ద రక్తనాళాలగుండా మేకులుపోయి అవి తెగితే మాత్రం త్వరగా చస్తారు. ఇతనికి అట్టే రక్తం కారడం లేదు. అతనికి బ్రతకాలని లేనట్లుంది. బ్రతకాలని లేకపోతే మాత్రం త్వరగా చస్తారు. అల్లా వీలౌతుందని మీ రనుకోరు కదూ?”

“నాకేం ఆశ్చర్యం కల్గలేదు” క్రాసస్ అన్నాడు.

“తమకు కలగదనే నే ననుకున్నా. నే నూహించగలను మీ రిటువంటి వెన్ని చూసి....”

ఆ సమయంలో సైనికు లా ముసలిదాని మీద చెయ్యి చేసుకున్నారు. ఆమె కేకలు సేనానికి వినపడ్డాయి. క్రాసస్ అక్కడికి వెళ్ళేడు. ఒక్క క్షణంలో విషయ మంతా గ్రహించాడు. కోపంగా సైనికులతో అన్నాడు:

“అబ్బ ఎంతటి మహావీరులు! వదలండోయ్ ముసలిదాన్ని.”

అతని మాటలతీరుకు వాళ్ళు జడిసేరు. ఆమెను వదలిపెట్టారు. అందులో ఒకడు క్రాసస్‌ను గుర్తుపట్టి తక్కినవాళ్ళ చెవులో వూదేడు. అప్పు డా కెప్టెన్ కూడా వచ్చి వాళ్ళ నదలించాడు. “ఇదేనా మీరు చెయ్యాల్సిన పని?”

“అది మమ్మల్ని బూతులు తిడుతోంది.”

“పొండి మీ రిక్కడినుంచి” అక్కడ చూస్తూ నిలబడ్డ సోమరిపోతులతో అన్నాడు కెప్టెన్. వాళ్లు వెనకడుగు వేసేరు. ముసలిది కళ్ళదోలా పెట్టి క్రాసస్‌ని చూసింది.

“సరీ; మహాసేనానే నాకు రక్షకుడయాడన్నమాట” అంది.

“నువ్వెవరువు ముసలమ్మా?” క్రాసస్ అడిగేడు.

“గొప్పవాడివి నాయనా; నీ పాదాలమీద సాష్టాంగం వెయ్యమంటావా? ముఖం మీద వుమ్మమంటావా?”

“చూసేరా? చూసేరా? మేం చెప్పలేదూ?” సైనికుడొక డరిచాడు.

“సరే ముసలమ్మా, నీకేం కావాలి?” క్రాసస్ అడిగాడు.

“నా మానాన్న నన్ను బ్రతకనిస్తే అదే పదివేలు. సత్పురుషు డొకడు ఘోరంగా ఖూనీ చేయబడుతుంటే చూద్దామని వచ్చాను. అతను చస్తుంటే నే నిక్కడ కూచొని చూస్తాను. అతనికి నేను ప్రేమను అర్పిస్తాను. నాయనా!

నువ్వెన్నటికీ చావవు అని నే నతనితో చెప్తాను. స్పార్టకస్ ఎప్పుడూ చావలేదు. అతడు మృత్యుంజయుడు!"

"ఏం ముసలమ్మ, నువ్వేం మాట్లాడుతున్నావో నీకు తెలుసా?"

"ఏం: నేనేం మాట్లాడుతున్నానో నీకు తెలియడం లేదా మార్కస్ లిసినియస్ క్రాసస్? నేను స్పార్టకస్ గురించి మాట్లాడుతున్నా. నువ్వెందు కిక్కడికి వచ్చావో నాకు తెలుసు; మరెవరికీ తెలియదు. వాళ్ళెవరికీ తెలియదుకాని నాకు మాత్రం తెలుసు. ఏం మనకు తెలియదంటావా?"

ఆ చెత్తగొట్టు ముసలిముండని దూరంగా యీడ్చిపారెయ్యండని కెప్టెన్ సైనికుల కాజ్ఞాపించాడు. వాళ్ళని ఆగమని క్రాసస్ కోపంగా సంజ్ఞ చేసేడు.

"ఆమెనేం చెయ్యొద్దని చెప్పలేదు? మీ కున్న ధైర్యం అంతా ముసలిదానిమీదే ప్రదర్శనం చెయ్యకండి. అంత ధైర్యమే ఉంటే మిమ్మల్ని సరిహద్దుసేనలలో చేరుస్తాంలెండి. ఒక ముసలిదానినుండి నన్ను నేను కాపాడుకోగలను. మీవంటి ధైర్యవంతుల సహాయం అడిగే స్థితికి నే నింకా రాలేదు."

"నువ్వు భయపడిపోతున్నావు" ఆ ముసలిది నవ్వుతూ అంది.

"నా కెందుకు భయం?"

"మేమంటే మీకు భయంలేదూ? మీకు ఎంతో భయం! అందుకే నువ్విక్కడకు వచ్చావు. అతను చస్తాడో లేదో చూడ్డానికి వచ్చావు. ఆఖరి బానిస విప్లవకర్తకూడా చచ్చేడా లేదా అన్నది, నిర్ధారణ చేసుకుందుకుగాను వచ్చావు. ఆరి దేవుడా! కొద్దిమంది బానిసలు పాపం మిమ్మల్నెంత బాధ పెట్టేసేరు? అతను చచ్చిపోయాడే, కట్టు యింతటితో ఆగుతుందంటావా యిది? అసలు దీని కెప్పుడైనా అంతమనేది ఉందా మార్కస్ లిసినియస్ క్రాసస్ మహాశయా?"

"నువ్వెవరు ముసలమ్మా?"

"నే నొక బానిసను" ఆమె సమాధాన మిచ్చింది. ఇప్పు డామె మరింత చిన్నపిల్లలా తయారయింది. మరింత వృద్ధాప్యంతోబాటు చిలిపిచేష్టలు కూడా యెక్కువవుతాయి.

"నావంటి వారిలో ఒకడైన యితన్ని చూస్తూ కూమందుకు నీకు తోడు లేక పోలేదు. నీవు ఏకాకివి కావని తెలియచెయ్యటానికీ, మనస్సుకు కొంత ఊరట కల్గించడానికీ నే నిక్కడకు వచ్చాను. కేపువా నిండా నావంటి ప్రజ లెంతోమంది వున్నారు. కాని వాళ్ళకు భయం. అతనికోసం యేడవడానికే నే నిక్కడకు వచ్చాను. స్పార్టకస్ మాకు చెప్పేడు. కదలండి, కదలి స్వాతంత్ర్యసముపార్జన కావించండి అని. కాని

మాకు భయం. మేం చాలా బలమైనవాళ్ళమే. మా సంఖ్య చాలా హెచ్చే. కాని మేం ముక్కుతూ, మూలుగుతూ పిరికితనంతో పారిపోతాం." ఆమె ముసలి కళ్ళల్లోంచి కన్నీరు కారింది.

"నన్నేమైనా చేస్తావా నువ్వు?" ఆమె ప్రాధేయపూర్వకంగా అడిగింది.

"ఏమీచెయ్యను ముసలమ్మా. అక్కడ కూచుని నీ మానాన నువ్వు యేడవాలంటే యేడు."

ఆమెవైపొక నాణెం విసిరి ఆలోచిస్తూ నడిచివెళ్ళేడు. శిలువదాకా వెళ్ళేడు. ఆ శిలువపై ప్రాణాన్ని కోల్పోతున్న పల్లుడ్ని చూస్తూ ముసలిదాని మాటలను గురించి ఆలోచిస్తున్నాడు.

# 8

ఆ పల్లుని జీవితంలో నాలుగుదశలున్నాయి. బాల్యం సంతోషంతో కూడిన అజ్ఞానపు దశ. అతని యౌవనం జ్ఞానంతో, విచారంతో, ద్వేషంతో నిండింది. అతను స్పార్టకస్ సైన్యంలో చేరి విప్లవంలో పాల్గొన్నది ఆ దశలోనే. ఉద్యమం విఫలమైనదని అతను తెలుసుకున్నప్పుడు ప్రారంభమైనది నిరాశాదశ. ఇప్పు డా నిరాశ హతాశయై పోయింది. నిరాశాదశ అంతరిస్తోంది. అతను మరణిస్తున్నాడు.

పాటుపడడమే అతని ఆహారం. కాని అతనిప్పుడేమీ పాటుపడలేదు. అతనిలో జీవితం మహోగ్రస్వరూపం దాల్చుతోంది. ప్రపంచపు క్రూర పదాఘాతాలను తట్టుకోవడమే అతని జీవితం. ఒక మనిషికీ, మరొక మనిషికీ ఉన్న సంబంధ మేమిటి అని అతని జీవితం నిరంతరం ఘోషించింది. కొందరు ప్రతిదాన్నీ ముందు వెనుకలాలోచించకుండా ఒప్పేసుకుంటారు. కొందరు దాన్ని పరిశీలించి సంతృప్తి చెందేవరకూ ఒప్పుకోరు. అతను స్పార్టకస్‌ను కలుసుకునేదాకా దేన్నీ అంగీకరించలేదు. అప్పుడు, అతన్ని కలుసుకున్నమీదట జీవితం జీవించ తగ్గదే, ప్రయోజనం ఉన్నదే అనే విషయాన్ని అంగీకరించాడు. స్పార్టకస్ జీవితం ప్రయోజనమైనది. అది ఉత్కృష్టమైనది. అతనితో ఉన్న మనుష్యులు ఉత్కృష్టమైనవాళ్లు. ఇప్పు డీ శిలువపైన వేలాడుతున్నప్పుడు కూడా, మరణానికి భరణంగా తననిక్కడ మేకులేసి దిగగొట్టినప్పుడు కూడా నా ఉద్యమం ఎందుకు విఫలమైంది అని ప్రశ్నించుకున్నాడు. అతని ఆలోచనల గందరగోళంలో ఆ ప్రశ్నకు సమాధానంకోసం హడావిడిగా వెతికింది. కాని ఆ ప్రశ్నకు సమాధానం దొరకలేదు.

క్రిక్సస్ చచ్చిపోయాడను దుర్వార్త వచ్చినప్పుడు తను స్పార్టకస్ ప్రక్కనే వున్నాడు. క్రిక్సస్ మరణమే అతని జీవితతర్కం. క్రిక్సస్ ఒక కలనంటిపెట్టుకుని వున్నాడు. ఆ కల యెప్పుడు, యెక్కడ అంతమయిందో, యెల్లా అసాధ్యమైపోయిందో స్పార్టకస్‌కు తెలుసు. క్రిక్సస్ కలలుకన్నది, అతని ఆవేశం, అంతా ఆ రోమ్‌ని సర్వ నాశనం చేయాలని. కాని యింతలో ఒక పెనుభూతంలాటి క్షణంవచ్చి నిలబడింది మహాభయంకరంగా. ఆ క్షణంలోనే స్పార్టకస్ తెలుసుకున్నాడు తాము రోమ్‌ని ధ్వంసం చేయలేమనీ, రోమ్ తమనే ధ్వంసం చేస్తుందనీ. అది ప్రారంభం మాత్రమే. ఇరవై వేలమందిని నడిపించుకొని కదనరంగంలో క్రిక్సస్ ప్రవేశించినప్పుడే అది అంత మయింది. ఇప్పుడు క్రిక్ససూలేడు; అతని సైన్యమూలేదు. క్రిక్సస్ చచ్చిపోయాడు. అతని మనుష్యులూ చచ్చిపోయారు. నవ్వుతూ, సంతోషంతో అరుస్తూ వుండే చెట్టంత మనిషి క్రిక్సస్ యికలేడు. అతను మరణించాడు.

(ఈ వార్త వచ్చినప్పుడు డేవిడ్ స్పార్టకస్ ప్రక్కనే వున్నాడు. సైన్యం అంతా చావగా మిగిలిన ఒకే ఒక సైనికుడు యీ వార్త మోసుకొచ్చాడు. అటువంటి వార్తలు మోసుకొచ్చేవాళ్ళు వార్తలనే కాదు మృత్యువును, విషాదాన్ని మోసుకొస్తారు. స్పార్టకస్ వింటాడు. డేవిడ్ వైపు తిరుగుతాడు.

("అది విన్నావా?" అత నడిగేడు.

("విన్నాను."

("క్రిక్సస్ చచ్చిపోయాడనీ, సేనలన్నీ చచ్చిపోయాయనీ విన్నావా?"

("విన్నాను."

("ప్రపంచంలో అంత చావుందా? మృత్యువు అంతగా వుందా?"

("ప్రపంచం చావుతో నిండి వుంది. నీతో నాకు పరిచయం కలుగక పూర్వం ప్రపంచమంతటా ఉన్నదల్లా ఆ చావే."

("ఇప్పు డీ ప్రపంచమంతటా ఉన్న దీ చావే" స్పార్టకస్ అంటున్నాడు. అతను మారిపోయాడు. ఇప్పు డతనువేరు. పూర్వపు స్పార్టకస్ కాలేడింక. జీవితంతో అతనికుండే అమూల్యమైన సంబంధం యింకేమాత్రం అతనిలో లేదు. నరకసన్నిభ మైన న్యూబియా ఎడారిలోని బంగారపు గనులలో పని చేసినప్పుడూ ఆ సంబంధం వుండేది. రంగస్థలపు టిసుకనేలమీద కత్తి చేతబట్టి, దిగంబరుడుగా పోరాడవలసి వచ్చినపుడూ వుండేది. కాని యిప్పుడు అతనిలో జీవితానికీ, మృత్యువుకూ సంఘర్షణ యేర్పడింది. మృత్యువుదే పైచేయి అయింది. అతని కళ్ళల్లో, ముఖంలో యేమీలేదు. ఏ భావమూలేదు. ఆ భావశూన్యత లోంచి కన్నీరువచ్చి అతని ముఖంమీద కాలువలు

కట్టింది. స్పార్టకస్ యేడుస్తుండగా చూడడం డేవిడ్‌కి యెంతటి ఘోరమైన, హృదయవిదారకమైన విషయమో! ఏడుస్తున్న స్పార్టకస్! డేవిడ్ కొక ఆలోచన వచ్చింది. స్పార్టకస్‌ను పిలచి నేను నీకు స్పార్టకస్‌గురించి చెప్పనా అని అడుగు దామనిపించింది.

(అతనికేసి చూసినంతమాత్రాన నిజంగా నువ్వతన్ని చూడలేవుకాబట్టి, అతన్ని చూసినంతమాత్రాన అతన్ని తెలుసుకోలేవు కాబట్టి, అతనిగురించి చెప్పాలి. అతన్ని చూస్తే కనిపించేదేమిటి? పగిలిన పెద్దముక్కు, పెద్దనోరు, గోధుమరంగు చర్మం, దూరదూరంగా ఉన్న కళ్ళు, యివితప్ప యింకేమీ కనబడదు. అయితే అతన్నిగురించి తెలుసుకోవడం ఎలాగ? అత నొకొత్తరకం మనిషి. అంతా అంటారు అతనొక పురాణ గాధలలోని వీరునివంటివాడని. కాని స్పార్టకస్‌తో సరిపోల్చడానికి ఆ వీరులు చేసిన ఘనకార్యాలేమిటి? బానిసకు కొడుకై పుట్టిన బానిసకన్న బానిసవీరుడు కాగలడా? అయితే యీ మనిషి యెక్కడనుంచి వచ్చాడు? ద్వేషం, అసూయ అన్నవి లేకుండా అతనెలా బ్రతకగలిగేడు? ఒక మనిషిని తెలుసుకోవాలంటే అతనికున్న కోపాన్ని ద్వేషాన్ని చూస్తే తెలిసిపోతుంది. అత నెటువంటివాడో, అతని స్వభావమెటువంటిదో. కాని యితనో? ఇతనిలో కోపంలేదు, ద్వేషంలేదు. ఇతనొక ఉదాత్తపురుషుడు. జీవితంలో యెప్పుడూ తప్పుచేయనివాడు. అతను నాకన్న తేడాగా వుంటాడు - మా అందరికన్న తేడాగా వుంటాడుకూడా. ఫలానా విధంగా మనం తయారవాలి అని మాలో సంకల్పం కల్గినప్పటికే అతనా విధంగా తయారయి వున్నాడు. మేమెవరమూ అతనివంటివారం కాదు. అతను మమ్మల్ని అధిగమించాడు. కాని యిప్పుడతను యేడుస్తున్నాడు.

("నువ్వెందుకు యేడుస్తున్నావు?" డేవిడ్ అడిగేడు. "మాకు చాలా కష్టంగా వుంటుంది. నువ్వెందుకు ఏడుస్తావు? మనం అంతా చచ్చేదాకా వాళ్ళకు నిద్ర పట్టదు."

("నువ్వెప్పుడూ యేడవవా?" స్పార్టకస్ అడుగుతాడు.

("మా నాన్నను శిలువకు మేకులేపి దిగగొట్టి చంపినప్పుడు నే నేడ్చాను."

"ఐతే నువ్వు మీ నాన్నకోసం యేడవకు; నేను క్రిక్సస్‌కోసం ఏడవడం మానేస్తా" స్పార్టకస్ అంటాడు. "మనందరికోసం నే నేడుస్తున్నా. ఎందుకిలా జరిగిందా అని యేడుస్తున్నా, మనం యేం తప్పుచేసాం? మొదట్లో నాకు అనుమానమే ఉండేదికాదు. నా జీవితం అంతా బానిసలు సంఘటితపడి ఆయుధాలు పుచ్చుకొని శక్తివంతులయే క్షణంకోసం ధారవోసేను. అప్పుడు నా కే సందేహమూ కలుగలేదు. అల్లా

టప్పుడు మనం యెందుకు విఫలమయాం? ఓడిపోయాం? కామ్రేడ్ క్రిక్సస్ నువ్వెందుకు చచ్చిపోయావు? ఎందుకు నువ్వెందుకు మొండిపట్టుదల చూపించావు? ఎందుకు ఇప్పుడు నువ్వు పోయావు. మెరికల్లాంటి నా మనుష్యులంతా చచ్చిపోయారు!"

(యూదుడంటాడు "చచ్చినవాళ్ళు పోయారు. ఇంక ఏడవకు!"

(కాని స్పార్టకస్ భూమిమీద పడిపోయాడు; చాపచుట్టలా పడ్డాడు. ముఖం మట్టిలో పొర్లాడింది. మట్టిలో ముఖం పొర్లాడుతుండగానే అతనరిచాడు! "వరీనియాను పంపించండి. ఆమెను తీసుకురండి నా దగ్గఱకు. ఆమెతో చెప్పండి నేను భయపడి పోయానని; ఆమెతో చెప్పండి నన్ను మృత్యువు వశపర్చుకుంటోందని.")

# 9

చచ్చిపోయే ముందా మల్లుడికి ఒక్క క్షణంపాటు అన్నీ స్పష్టంగా కనిపించాయి. కళ్ళు తెరిచాడు. ఇప్పుడతను దృష్టి నిలుపగలిగాడు. కాస్సేపు అతనికి యేమీ బాధ అనిపించలేదు. అతనిచుట్టూ ఉన్నవన్నీ స్పష్టంగా చూసేడు. అదుగో అదే ఏపియన్ మార్గం. గొప్ప రోమన్ రోడ్డు, రోమ్ తాలూకు ఘనత. దాని రక్తప్రవాహం. ఉత్తరంగా ఆ మహానగరం వరకూ పోయే రాచబాట. అదుగో మరొకవైపు ఆ నగర కుడ్యం; ఆ ఏపియన్ ద్వారం. విసుగెత్తిపోయిన ఒక డజనుమంది నిర్జీవసైనికులున్నా రక్కడ. ఆ రోడ్డు కొక చివర సోమరిపోతుతనానికి అపరావతారాలు లాగున్న కొద్దిమంది రోమన్లున్నారు. జనసంచారం తక్కువగా వుంది. ఉండీ, ఉడిగీ ఒక బండి చప్పుడు చేసుకుంటూ పోతుంది. ఔనుమరి; యిప్పుడీ రోమన్లంతా స్నానశాలల్లో వుంటారు. ఆ రోడ్డుకావల యెంతో దూరంలో నీలంగా సముద్రంలా కనపడిం దతనికి. ఆ సముద్రం ఒక చల్లని మందమారుతాన్ని పంపింది. ఆ గాలి యితని ముఖాన్ని పలకరించి వెళ్ళిపోయింది. ఆగాలి చల్లగా మెల్లగా ప్రేయసి తన మృదుహస్తాలతో ప్రియునిముఖాన్ని లాలనగా తాకినట్లు తాకి వెళ్ళిపోయింది.

ఆ రోడ్డు ప్రక్క పెరిగిన గుబురైన ఆకుపచ్చని పొదలతని కంటబడ్డాయి. తల విరబోసుకున్న మహావృక్షాలు కన్పించాయి. ఉత్తరంగా కొండ లగుపడ్డాయి. ఆ కొండలలోనే తప్పించుకుపోయిన బానిసలు దాక్కుంటారు. నడినెత్తిమీద నున్నాడు సూర్యుడు. కళ్ళు దించి చూసేసరికి ఒంటరిగా ఒక ఆడది శిలువకు కొద్ది గజాల దూరంలో కూచుని అతనివైపే పదే పనిగా చూస్తూ ఏడుస్తూ ఉన్నట్లుగా కనిపించింది.

"అదేమిటి? ఆమె నాకోసం యేడుస్తోందా?" మల్లుడు తనలో తాననుకున్నాడు. "నువ్వెవరు ముసలమ్మా? ఇక్కడ కూచుని నా కోసం యేడుస్తావేం?"

ప్రాణం పోతున్నట్లు అతనికీ తెలుసు. అతని మనస్సిప్పుడు స్పష్టంగా వుంది. కొంచెంసేపటిలో తన ప్రాణం పోతుంది కదా అనీ, అప్పు డీగాయాల బాధ, స్మృతుల బాధ తప్పుతుంది కదా అనీ అతను సంతోషించాడు. ప్రతి మనిషికీ ఖచ్చితంగా వచ్చి తీరే శాశ్వతపు నిద్రతప్ప అప్పు డింకేమీ వుండదు. చావును నిరోధించడానికి అతనిం కేమీ ప్రయత్నం చెయ్యడు. తను కళ్ళు మూసుకుంటేసరి తన ప్రాణం త్వరగా, సులభంగా తన శరీరాన్ని వదలిపోతుందని భావించాడు.

అతనప్పుడు క్రాసస్‌ని చూసేడు. అతన్ని గుర్తుపట్టేడు. వాళ్ళిద్దరి చూపులూ కలుసుకున్నాయి. రోమన్ సేనాని శిలాప్రతిమలా నిటారుగా, నిశ్చలంగా నిలబడ్డాడు. అతన్ని కాళ్ళనుంచి ముఖంవరకూ తెల్లని టోగా కప్పుతోంది. అందమైన అతని తల రోమ్‌యొక్క శక్తికీ, ఘనతకూ చిహ్నంగా వుంది.

"అయితే నే చస్తుంటే చోద్యం చూడటానికి యిక్కడ నిలబడ్డావన్న మాట క్రాసస్." మల్లుడనుకున్నాడు. "కడపటి మల్లుడు శిలువపై చస్తుంటే చూడ్డానికొచ్చా వన్న మాట. అయితే ఒక బానిస చస్తున్నాడు. చస్తూ తన ప్రాణావసాన దశలో ఒక ధనవంతుడి ముఖం చూస్తున్నాడు."

పూర్వం యీ క్రాసస్‌నే చూసిన ఒక సంఘటన జ్ఞప్తికి వచ్చింది మల్లుడికి. అప్పుడు స్పార్టకస్‌కూడా జ్ఞాపక మొచ్చాడు. అంతా అయిపోయిందనీ, యింకేమీ లేదనీ వాళ్ళందరికి తెలుసు. అదే అంతిమపోరాటమని తెలుసు. స్పార్టకస్ వరీనియాతో చెప్పేడు తనుపోతున్నట్టు. ఆమె యెంతగానో బ్రతిమాలింది తనతో వుండమని. అయినా అతనుండలేదు. ఆమెతో చెప్పి వచ్చేశాడు. అప్పుడామె గర్భవతి. ఈ రోమన్లు తమపై దాడిచేయకముందే ఆమె బిడ్డను కంటే బాగుండునని అతనాశిం చాడు. వరీనియానతను వదలి వెళ్ళినప్పటికి యింకా పురుడురాలేదు. అప్పుడు డేవిడ్‌తో అన్నాడు.

"నేస్తం! ఇక నే నెన్నటికీ నాకు పుట్టబోయే బిడ్డను చూడలేనుకదూ? అందుకే నా విచారం, మరెందుకూ కాదు. నా కళ్ళతో నా బిడ్డను చూసుకోలేక పోతున్నానుకదా అనే నేను విచారిస్తూ వుంటాను."

స్పార్టకస్‌కోసం బానిసలు తెల్లని గుర్రాన్నొకదాన్ని తెచ్చారు. అప్పుడు యుద్ధం వాళ్ళ వాకిట్లో వుంది. ఎటువంటి గుర్రం అది! అందమైన పర్షియా గుర్రం. మల్లె పువ్వులా తెల్లగా వుంది. అది స్పార్టకస్‌కు తగిన గుర్రం. అన్నిరకాల మానసిక వ్యథలనూ అత నిప్పుడు జయించాడు. అతని అప్పటి మానసికపరిస్థితి కృత్రిమమైనది కాదు. నిజంగానే అత నెంతో సంతోషంగా, యువకుడిలా యెంతో శక్తి ఉత్సాహాలతో

వున్నాడు. ఈ ఆరునెలల్లోనూ అతని తల నెరపింది. ఇప్పుడు మన కా తెల్లనిజుట్టు బదులతని ముఖంలో తొణికిసలాడే యౌవనం కనిపిస్తుంది. అందంగా ఉండని అతని ముఖం యెంతో అందంగా మారింది. ఈ మార్పు అందరూ గ్రహించారు అతనికేసి చూసేవారు. చూసినా మాట్లాడలేక పోయేవారు. ఆ తెల్లగుర్రాన్ని అతనివద్దకు తీసు కొచ్చారు.

"కామ్రేడ్స్! మీరీ అమోఘమైన గుర్రాన్ని నాకు కానుకగా సమర్పించదలచి నందుకు నన్నభినందించనీయండి." ఇవీ అతనన్న మాటలు: "ముందు నేను మిమ్మల్ని అభినందిస్తున్నా. హృదయపూర్వకంగా అభినందిస్తున్నా." అప్పుడతను ఒరనుండి మెఱుపులాటి కత్తిని తీసేడు. అప్పుడాకత్తి తళుక్కున తృటికాలంలో గుర్రం మెడ మీదనుండి హృదయకోశంలోకి దూసుకుపోయింది. ఆ కత్తి పట్టుకుని వేలాడి అతనా గుర్రాన్ని చీల్చేడు. అది మోకాళ్ళమీద పడిపోయి గిలగిలా కొట్టుకుని బాధతో సకిలించింది. ఇటూ అటూ దొర్లి చచ్చి పడిపోయింది. అతను వాళ్ళ కెదురుగా నిలబడ్డాడు. క్రొన్నెత్తురు నిండినకత్తి అతని చేతిలో వుంది. ఎవడికీ యేమీ బోధపడలేదు. భయంతో, ఆశ్చర్యంతో కళ్ళు వప్పచెప్పి చూస్తున్నారు. అతనిలో యింకా యే మార్పూ రాలేదు, అల్లాగే వున్నాడు.

"ఒక గుర్రం చచ్చింది," అతనన్నాడు. "గుర్రం చచ్చినందుకు యేడవదలచు కున్నారా మీరు? మనం మానవజీవితం కోసం పోరాడుతాం కాని జంతువులకోసం కాదు. రోమన్లు గుర్రాలను ప్రేమిస్తారు. మనుష్యులను ద్వేషిస్తారు. ఇప్పుడు మనం చూడాలి; యీ యుద్ధరంగంనుంచి యెవరు బ్రతికి బయటపడతారో, రోమన్లా? మనమా? మీరిచ్చిన కానుకకు కృతజ్ఞత తెలిపాను. ఆ కానుక నిజంగా చాలా బాగుంది. కాని నా కిప్పుడటువంటి కానుక అనవసరం. మీరు నన్నెంతగా ప్రేమిస్తున్నారో దానివల్ల బాగా తెలిసిందనుకోండి. మీ యందున్న ప్రేమ నా హృదయాన్ని నింపింది. నేను మిమ్మల్ని యెంతగా ప్రేమిస్తున్నానో చెప్పటానికి ప్రపంచంలోని భాషలేవీ చాలవు. మన జీవితాలన్నీ ముడిపడి పోయాయి. ఈ రోజు మనం ఓడిపోయినా, మానవజాతి యెన్నటికీ మరచిపోని మహత్కార్యం సాధించిన వాళ్ళమయాం. నాలుగు సంవత్సరాల బాటు రోమ్‌ను యేకధాటిగా ప్రతిఘటించ గలిగాం. అవి నాలుగుయుగాలే. రోమను సేనలు వచ్చినప్పు డెపుడూ మనం వెన్నిచ్చి పారిపోలేదు. ఈ రోజుకూడా మనం రణ రంగంవదలి పారిపోం. నేనొక పంచకల్యాణి గుర్రమెక్కి పోరాడాలనికదూ మీ ఉద్దేశ్యం? గుర్రాలు రోమన్లకే వుండనివ్వండి. నేను నా సోదరుల సరసను నిలచి పోరాడుతా. ఈనాటి యుద్ధంలో మనంగెలిచామా మనకు లెక్కలేనన్ని గుర్రాలు

వస్తాయి. అప్పుడు మనమా గుర్రాలను యుద్ధరథాలకు కట్టి యుద్ధభూమికి ఆహూతి చెయ్యవద్దు. వాటికి నాగళ్ళుకట్టి మరింతభూమి సాగులోనికి తెద్దాం. మనం ఓడి పోయామా - సరే ఓడినవాళ్ళకు గుర్రాలెందుకు?''

అప్పుడతను వాళ్ళని కౌగలించుకున్నాడు. తన పూర్వపు స్నేహితులందరినీ కలుసుకుని కౌగలించుకుని పెదవులపై ముద్దెట్టుకున్నాడు. డేవిడ్‌ను సమీపించినప్పు డత నన్నాడు: "నేస్తం, జగజ్జట్టీ! ఈ రోజుకూడా నువ్వు నా ప్రక్కనే వుంటావా?''

"ఎప్పుడూ నీ ప్రక్కనే వుంటా.''

శిలువమీద వేలాడుతూ క్రాసస్‌కేసి చూస్తున్నప్పు డా మల్లుడు తనలో అను కున్నాడు: 'ఒక్క మనిషి యెంతచెయ్యగలడు?' అప్పు డత నింకేమీ విచారించలేదు. తను స్పార్టకస్ ప్రక్క నిలబడి అతనితోబాటు పోరాడినవాడు. తన కెదురుగా ఇప్పుడు నిలబడ్డ యీ మనిషి గుర్రాన్నదలించి బానిససైన్యంలోకి చొచ్చుకుపోవడానికి ప్రయ త్నించినప్పుడు తను అతనితోబాటే యుద్ధం చేసేడు. స్పార్టకస్‌తోబాటు తానూ అరిచాడు.

"మా దగ్గరకురారా క్రాసస్; వచ్చి మేమిచ్చే శుభకాంక్షల నందుకో.''

పెద్దవడిసెలనుండి వచ్చిన రాయి ఒకటి తనకు తగిలేవరకు తను దెబ్బలాడు తూనే వున్నాడు. తను బాగానే పోరాడాడు. స్పార్టకస్ చావును చూసే దౌర్భాగ్యం తనకు కలుగనందుకు సంతోషించాడు. స్పార్టకస్‌కాక తనే శిలువపై వేలాడే యీ సిగ్గుచేటయిన అవమానాన్ని పొందినందుకు కూడా యితను సంతోషించాడు. అతని కింకా విచారమూలేదు; బాధాలేదు; ఆందోళనాలేదు. స్పార్టకస్ ముఖంలో తాండవించిన అనిర్వచనీయానందం అతనికి జ్ఞప్తికి వచ్చింది. తనుకూడా యిప్పుడు స్పార్టకస్ అయాడు. ఎందుకంటే తనకుకూడా స్పార్టకస్‌కు తెలిసిన జీవితరహస్యం తెలుసును కనుకనే. క్రాసస్‌కి చెపుదామనుకున్నాడు. పెదవులు కదిపేడు. క్రాసస్ శిలువవగ్గరగా వచ్చి నిలబడ్డాడు. అక్కడ నిలబడి చావబోతున్న మల్లుడ్ని చూస్తున్నాడు. పెదవులు కదిలేయేకాని మల్లుని నోటివెంబడి మాటలు రాలేదు. అప్పు డా మల్లునితల వాలి పోయింది. పట్టు తప్పిపోయింది. శేషమైన కాస్త శక్తీ అతని శరీరంనుండి బైటికి పోయింది. పంచప్రాణాలలోనూ మిగిలిన కాస్త ప్రాణమూ పైకి పోయింది. అతను చచ్చిపోయాడు.

క్రాసస్ అల్లాగే నిలబడిపోయాడు. ముసలమ్మ అతనిపక్కనే వచ్చి నిలచింది. "చచ్చిపోయాడు'' అందామె.

"అవును అన్నాడు'' క్రాసస్.

వెనక్కి తిరిగి ద్వారం వైపు పోయాడు. కేపువా వీధులగుండా నడిచి పోయాడు.

## 10

ఆ రాత్రి క్రాసస్ ఒక్కడూ భోజనం చేసేడు. అతనికోసం యెవరేనా వస్తే యింట్లోలేడనే సమాధానం యివ్వబడింది. అతని మనస్సు సరిగాలేదు. ఆ సంగతి అతని బానిసలు గుర్తించారు. సాధారణంగా అతనికి మనస్సు బాగుండదు. అప్పుడు బానిస లంతా యింట్లో చప్పుడుచెయ్యకుండా జాగ్రత్తగా నడుస్తారు. పనిచేస్తారు. వాళ్ళల్లో వాళ్ళు గుసగుసలాడుకుంటారు. ఇతని చిరాకుకు అనుగుణ్యంగా తమ ప్రవర్తన మార్చుకుంటారు. భోజనం చెయ్యకముందే యించుమించు చౌక ద్రాక్షసారా ఖర్చు చేసేడు. భోజనంతోపాటు ఒరొకటి ఖాళీచేసి భోజనమయాక ఒకచోట కూచుని గాజు కూజాడు యీజిప్ట్ ఖర్జూరపు సారా పని పట్టించసాగేడు. ఒంటరిగా, చిరాకుగా, ఆత్మ ద్వేషంవల్ల కలిగిన నిరాశతో అతను కూచుని తెగత్రాగేడు. తప్ప త్రాగేడు. కాళ్ళు నిల బడవు. శరీరం స్వాధీనంలోలేదు. తూగుతూ, తూలుతూ పడకగది ప్రవేశించాడు. బానిసలొచ్చి మంచంమీద చేర్చేరు.

ఏదియెల్లావున్నా సుఖంగా నిద్రమాత్రం పట్టింది. ఉదయం లేచేసరికి అతనిలో క్రితం రాత్రి ఉన్న ఆందోళనాలేదు, చిరాకూలేదు. మబ్బువిడిన స్వచ్ఛమైన ఆకాశం లాగుంది అతని మెదడు. తలనొప్పి పోయింది. రాత్రి తనకేవైనా దుస్స్వప్నాలు కల్గేయో, లేదో అన్న జ్ఞాపకంకూడా ఉండి బాధించలేదతన్ని. రోజుకి రెండుమార్లు స్నానంచెయ్యడం అతని కలవాటు — నిద్ర లేచిన వెంటనే ఒకమారు, మధ్యాహ్నం భోజనంచేసేముందొకసారీ. ఎంతోమంది రోమన్ ధనవంతులలాగనే అతనుకూడా స్నానశాలలకు హాజరవడం అన్నదొక రాజకీయవిషయంగా పరిగణించేవాడు. రాజ కీయ కారణంగానే దాని ప్రాముఖ్యత గుర్తించాడు. కేపువాలో కూడా అతనికొక స్వంత స్నానశాల వుంది. నేలమట్టానికి క్రిందుగా యిటుకలతో కట్టిన పన్నెండడుగుల చదరం అది. ఎప్పుడూ కావలసినంత వేడినీరూ, చన్నీరూ కూడా అందులో లభ్య మవుతుంది. అతనెక్కడున్నా అక్కడ స్నానాల యేర్పాట్లు ఖచ్చితంగా వుండాలి.

పని చేయించుకుని స్నానం ముగించాడు. పదునైన కత్తికి తన గడ్డం స్వాధీనం చేసినప్పుడతను చాలా సంతోషించేవాడు. చంటిపిల్లలలా యేదో ఆనం దాన్ని పొందేవాడు. కత్తి తెగుతుందేమోనన్న భయమూ, తెగదులే అనే నమ్మకమూ రెండూ పెనవేసుకుని అతనిలో కనిపించేవి. తరువాత తల మర్దన చెయ్యడం

లాటి తంతు జరిగేది. తన జుట్టు చూసుకున్నప్పుడల్లా అతనిలో గర్వం పొడసూపేది. కాని యిది త్వరలో ఊడిపోతుం దేమోనన్న భయం ఆ గర్వాన్ని మింగేసేది.

నీలం దుస్తులు ధరించాడు. అలవాటుప్రకారం తెల్లని బూట్లు తొడిగాడు. వీటిని యెంత అవస్థపడ్డా తిరిగి తెల్లని తెల్లదనం తీసుకురావడం కష్టం కనుకనూ, రెండు మూడు రోజులు వేసుకు తిరిగినంతవరకు మాత్రాన యెంతో ఫట్టి వీటి కంటుకుం టుంది కనుకనూ, యీ గొడవంతా యెవడు పడతాడని యీ బూట్లు తయారుచేయించ డానికి నలుగురు బానిసలను ప్రత్యేకం నియమించి, మంచి పనివా డొకడిని వాళ్ళమీద మేస్త్రీగా వేసేడు. ఖర్చు కొంచెం అయినా ప్రయోజనం లేకపోలేదు. నీలం దుస్తులూ, క్రింద తెల్లని బూట్లూ ఉంటే చూడ్డానికి యెంతో బాగుంటుంది. అందులో అనుమానం లేదు. కొద్దిగా ఫలహారంచేసి పల్లకీలో తన యువమిత్రు లున్నచోటికి బయలుదేరాడు. హెలీనాతో ఆ విధంగా ప్రవర్తించినందుకు కొంచెం సిగ్గుపడ్డాడు. ఆందోళన చెందేడు. అయినదేదో అయింది. తను వాళ్ళకి వూరంతా చూపిస్తానన్నాడు. దానికీ, దీనికీ సంబంధం యేమిటి?

హెలీనా మేనమామతో అతనికి కొద్దిగా ముఖపరిచయం లేకపోలేదు. ఈ యింటికి అంతకుపూర్వం రెండుమూడు పర్యాయాలు వచ్చాడు తను. అందువల్లనే ద్వారపాలకుడైన బానిసతనికి నమస్కరించి లోనికాహ్వానించి గృహస్తు తన బంధువులతో కలిసి భోజనంచేస్తున్న చోటికి నేరుగా తీసుకెళ్ళేడు. ఇతన్ని చూడగానే హెలీనా ముఖం యెర్రబడింది. తన పూర్వపు సహజ ముఖభావా లంతరించాయి. కైయస్‌కి మాత్రం యితని రాకవల్ల సంపూర్ణమైన సంతోషం కలిగింది. పిల్లల మేనత్తకూ, మేనమామకూ కూడా యితని రాక సంతోషాన్ని కలుగచేసింది. గొప్ప రోమన్ సేనాని తన రాకవల్ల కల్గచేసిన మహద్భాగ్యాన్ని వాళ్ళు హర్షించకుండా వుండ లేకపోయారు. అందుకే వాళ్ళు గౌరవభావాన్ని ప్రదర్శించారు. క్లాడియా మాత్రం క్రాసస్‌ని నిశితంగా చూసింది. ఆ చూపులో ఒకరకమైన ద్వేషం, కొంతమటుకు దుర్మార్గం కనిపించాయి.

"ఈ వేళ యేం చెయ్యాలో మీరు ముందే అనుకోకపోతే," క్రాసస్ చెప్పు తున్నాడు: "అత్తరువులు తయారుచేసే మా కర్మాగారంలో మీకు ఆతిథ్యం యివ్వ దలిచాను స్వీకరించండి. కేపువా వచ్చి అత్తరువుల కర్మాగారం చూడకుండా వెళ్ళడం హాస్యాస్పదం. అందులోనూ కేపువా అంటే మల్లులూ, అత్తరువులూకాక యింకేముంది."

"రెండూ గమత్తుగా కలిసేయి" క్లాడియా నవ్వింది.

"మేమేం చెయ్యాలో యింకా అనుకోలేదు" హెలీనా అంది.

"ఆ మాటల అర్థం యేమిటంటే మేం యిదివరకే యేదో అనుకున్నామని. కాని మీరొచ్చి పిలిచారు కాబట్టి అదంతా పక్కకు పెట్టేస్తున్నాం."

కైయస్ తన చెల్లెలువైపు తీక్షణంగా, కోపంగా చూసేడు. పెద్దవాళ్ళకు కూడా యిదే ఆహ్వానమని కైయస్ అన్నాడుకాని, వాళ్ళు రామన్నారు. ఆ వృద్ధులకు అత్తరువు కర్మాగారా లేమంత క్రొత్తవికావు. సెంట్లు యెక్కువగా వాసన చూస్తే తనకు తలనొప్పికూడా వస్తుంటుందని ఆ యింటావిడ చెప్పింది.

కొద్దిసేపటికి వాళ్ళక్కడనుంచి బయలుదేరారు. పాతకేపువా గుండా వాళ్ళ పల్లకీలు పోతున్నాయి. అక్కడ వీధులు యిరుకుగాను, అద్దెకొంపలు ఇంకా ఎత్తుగానూ వుంటాయి. నిజానికి పట్టణ గృహనిర్మాణానికి విధింపబడ్డ కట్టుబాట్లే స్వల్పం. ఆ స్వల్పమైన కట్టుబాట్లుకూడా ఇక్కడ నిర్లక్ష్యం చెయ్యబడ్డాయి. చంటిపిల్లలు యిటుకలూ; అవీ పేర్చేస్తే ఎంత అర్థంలేకుండా వుంటుందో అల్లాగే వున్నాయి ఈ అద్దెకొంపలు. ప్రొద్దుటయినా సరే ఆ వీధుల్లో చీకటిగానే వుంటుంది. బురదతోనూ, యిళ్ళల్లోంచి బైటకుపారేసిన చెత్తతోనూ నిండిన రోడ్లు. నానాచెత్తా రోడ్లమీద వుండి కుళ్ళుతూవుంటుంది. పోతున్నకొద్దీ యీ చెత్తతాలూకు కుళ్ళువాసనతో, కర్మాగారంలో తయారవుతున్న సెంట్లవాసన కలిసి విచిత్రమైన ఒక కలగాపులగపు వాసన తయారౌతుంది.

"చూసేరా మా కర్మాగారాలు యిక్కడెందుకుంటాయో తెలిసిందీ? యిక్కడే ఉండడంవల్ల ఒక ప్రయోజనం నెరవేరడం లేదు మరీ?" అన్నాడు క్రాసస్.

ముస్తాబైన పరిశుభ్రంగా కనబడే బానిసలిక్కడ కనబడరు. పల్లకీల సంఖ్య కూడా చాలా తక్కువ. ఇవన్నీ ధనవంతులు నివసించే ప్రాంతాలలోనే తప్ప ఇక్కడ కనబడడం అరుదు. మురికిగా, అర్థనగ్నంగా కనిపించే పిల్లలు తూము కాలువల దగ్గర ఆడుకుంటున్నారు. చెత్తడబ్బాలున్నచోట చింకిబట్టల పేదస్త్రీలు యెవరైనా పారేసిన ఆహారపదార్థాల అవశిష్టాలు దొరుకుతాయేమోనని వెదుకుతున్నారు తమ అదృష్టాన్ని తల్చుకుంటూ. వీధిగుమ్మాల్లో కూచుని కొందరుస్త్రీలు తమ బిడ్డలకు పాలిస్తున్నారు. కొత్తరకం భాష వాళ్ళ పెదవులనుండి వినవస్తోంది. కిటికీలనుండి యేం వండుతున్నారోకాని వింతవాసనలు బయల్వెడలుతున్నాయి.

"ఎంత ఘోరమైన ప్రదేశం!" హెలీనా ఆశ్చర్యపోయింది. "నిజంగా యీ నరకకూపంనుంచే అత్తరువులు తీస్తారేంటి కొంపతీసి?"

"అవును. అంతే, ప్రపంచంలోని మరే యితర పట్నంలోనూ తయారుచేయ నంత మేలురకం అత్తరువులు యీ కుళ్ళులోనే తయారవుతున్నాయి. ఇక్కడ సిరియన్లు, యీజిప్షియన్లు, గ్రీకులు, యూదులు అన్ని రకాల వాళ్ళూ వున్నారు. బానిసలనుపెట్టి మా కర్మాగారాలు నడిపిద్దామని ప్రథమంలో ప్రయత్నించాం. కాని లాభంలేదు. వాళ్ళా? దేవాంతకులు. పనైతే చేస్తారు కాని, చేసినపని తగలెయ్యరని హామీయేది? బానిసకి పనితాలూకు పర్యవసానం యెల్లాఉంటుందో అన్న ఆలోచనేవుండదు. వీడికో నాగలో, సుత్తో, కొడవలో, పారో యేదో ఒకటివ్వండి. ఏంచేస్తాడో మీకే తెలుస్తుంది. అవి నయమే, తగలేద్దామన్నా అంత సులభంకాదు. కాని నెయ్యమని సిల్కు, అత్తరువులు తయారుచెయ్యమని గాజుకూజాలో యివ్వండి; వాడు వాటిని నిమిషంలో తగలెయ్యక పోతే అడగండి. ఇంక మా కార్మికులా—వాళ్ళకి పని చెయ్యాలనే కుతూహలం యెక్కడినుంచొస్తుంది? పదిపందున్నారనుకోండి; తక్కిన తొమ్మండుగుర్నీ ప్రభుత్వం ఉట్టిపుణ్యాన తిండిపెట్టి మేపుతుంటే, వాళ్ళంతా వెళ్ళి జూదంకొంపల్లోనో, స్నానశాల ల్లోనో, రంగస్థలాలలోనో నిర్విచారంగా కాలక్షేపం చేస్తోంటే ఆ ఒక్కడూ మాత్రం ఎందుకు పని చేస్తాడంటారు. కావాలంటే సైన్యంలో చేర్తారు. అదృష్టం బాగుంటే యేపైనా కొల్లగొట్టుకోవచ్చు. అక్కడకూడా రానురాను యీ బర్బరులకోసమే వెత కాల్సివస్తోంది. మేమిచ్చే జీతంరాళ్ళకోసం మాత్రం మనవాళ్ళు వచ్చి కార్మికులుగా చస్తేచేరరు. పూర్వపు గణాలూ, జాతులూ వాటి వ్యాపారం మొదలైనవన్నీ మనం నాశనంచేశాము. అదైనాపోవాలి; లేదా యీ కర్మాగారాలైనా లేకుండాపోవాలి. ఇందులో యేదో ఒకటే సాధ్యమౌతుంది. మేమా గణాలను నాశనంచేసి వీటిని ప్రవేశపెట్టాం. అందువల్లనే సిరియన్లనీ, యీజిప్షియన్లనీ, గ్రీకులనీ—వీళ్ళందరినీ యిక్కడ చేర్చడానికి వీలయింది. పోనీ, వాళ్ళయినా పనిచేస్తారా అంటే అదీలేదు. పౌరసత్వం లభించేదాకా కొంత డబ్బు సంపాదించడం, ఆ డబ్బుతో పౌరసత్వం కొనుక్కుని పనిమానెయ్యడం. ఆఖరుకిదంతా యెల్లా తేలుతుందో చెప్పలేం. ఉన్న పరిస్థితి చెప్పాలంటే ఫ్యాక్టరీలు మూతబడుతున్నాయి కాని తెరువబడడం మాత్రం శూన్యం!"

వాళ్ళు కర్మాగారాన్ని సమీపించారు. ఆ అద్దె కొంపలమధ్య తక్కువ యెత్తులో కర్రతో కట్టారు దాన్ని. నూటయాభై అడుగుల చదరంగా వుందది. కొన్ని కొన్ని చెక్కలు పోయాయి. కొన్ని చెక్కలు చెదబట్టాయి. చాలా పొగ గొట్టాలు కనిపిస్తున్నాయి. కర్మాగారంలో ఒకవైపున సరుకులు నింపడానికి వీలుగా యెత్తయిన అరుగుకట్టేరు. దాని దగ్గరగా సరుకుతో నిండిన బళ్ళెన్నో నిలబడి

వున్నాయి. ఆ బళ్ళల్లో యేవేవో చెట్టుబెరడులూ, పళ్ళతట్టలూ, మట్టిపాత్రలూ వున్నాయి.

కర్మాగారం ముందుకొచ్చాయి పల్లకీలు. పెద్దపెద్ద దారుగవాక్షాలు తెరువబడ్డాయి. మొదటిసారిగా యీ కర్మాగారాలేమిటో తెలుసుకున్నారు క్లాడియా-హెలీనాలు, ఆ కర్మాగారం ఒక పెద్ద షెడ్డులాగుంది. పెద్దపెద్ద కర్రదూలాలు పైకప్పును మోస్తున్నాయి. కప్పుకూడా చాలా మటుకు దెబ్బతింది. దానివల్ల మరింత గాలీ, వెలుతురు లోపల ప్రవేశించడానికి వీలయింది. కార్ఖానాలో చాలావేడిగా వుంది. ఎర్రగాకాలే పెద్ద పెద్ద మూకుడు లున్నాయక్కడ. పొడుగాటి మేజాలమీద యేవేవో మట్టిపాత్రలూ మరగ బెట్టిన పదార్థాలూ ఉన్నాయి. బట్టీలనుండి పైకిపోతున్న యెన్నో వంపులుతిరిగిన గొట్టా లున్నాయి. ఏదో అర్థంకాని కలలాగుందంతా. ఆ ప్రదేశమంతా అత్తరువుల వాసనలతో నిండివుంది.

ఆగంతకు లక్కడి కార్మికుల్నికూడా చూసేరు. శరీరదార్ఢ్యంలేని ఆ కార్మికులు రాగిరంగులో తేలారు. మాసిన గడ్డాలతో పట్టుమని గోచీగుడ్డ కూడా లేకుండా వాళ్ళక్కడ బట్టీలలో పనిచేస్తున్నారు. పొయ్యిలు రాజేస్తున్నారు; మేజాలదగ్గర వేటినో తరుగుతున్నారు; పళ్ళ తొక్కలు తూస్తున్నారు; చెక్కలపై బెరళ్ళు తీస్తున్నారు; చిన్నచిన్న వెండిగొట్టాలనిండా తయారయిన సెంట్లునింపి వాటిని కాలిన లక్కతో మూస్తున్నారు.

కార్ఖానా మేనేజరు ఆవ్‌లూస్‌ని క్రాసస్ వీళ్ళకు పరిచయం చేసేడు. అతనికి మర్యాదవాచకాలు కాని, వంశ గౌరవాన్ని తెలియచేసే మరే పేరుకాని లేదు. అతను సేనానినీ, అతిథుల్నీ ఆహ్వానించాడు. ఆ ఆహ్వానంలో భయం, జాగ్రత్త, దురాశ ప్రతిధ్వనించాయి. అతనికి క్రాసస్ కొద్దిగా చెయ్యితడిపేసరికి అతను మరింత ఆసక్తితో, ఉత్సాహంతో వీళ్ళ నా కార్ఖానా చుట్టూ తిప్పనారంభించాడు. కార్మికులు పూర్తిగా పనిలో నిమగ్నమైవున్నారు. వాళ్ళ ముఖాలలో తీక్ష్ణస్వభావం, కాఠిన్యం, నిర్లక్ష్యం కన్పించాయి. వాళ్ళు ముఖాలిటు తిప్పి ఆగంతకులవైపు చూచినప్పుడు వాళ్ళ ముఖాల్లో మార్పు స్పష్టంగా కనిపించింది. ఇక్కడ వాళ్ళు చూసిన వాటన్నిటిలోకీ యీ కార్మికులే వింతగా, విపరీతంగా కనిపించారు క్లాడియా, హెలీనా, కైయస్‌లకు. అటువంటి మనుష్యులుంటారని వాళ్ళకు తెలియదు. అసలు నిజంగా యింకెక్కడా ఉండరేమో! వాళ్ళు బానిసలు కారు; రోమన్లు కారు; రైతాంగం దివాలా తీస్తున్న యీ రోజులలో కూడా కాస్త కాస్త భూములు దున్నుకుంటూ బ్రతుకులు వెళ్ళబుచ్చుతున్న ఆమాయకపు రైతులు కారు. వీళ్ళకీ తక్కిన

వాళ్ళందరికీ తేడా వుంది. ఎంతో తేడా వుంది. ఆ తేడా చూస్తుంటేనే మతి పోతోంది.

"ఇక్కడ మేం బట్టీబద్ధతి అవలంబిస్తాం. అందుకు నిజంగా యీజిప్షియన్ల నభి నందించవలసిందే. కాని వీళ్ళు దాన్ని చేతివృత్తిగానే ఉంచగలిగారు గాని పెద్దయెత్తున ఉత్పత్తిచేసే పద్ధతి చెయ్యలేకపోయారు. ఈ నిర్మాణ కార్యక్రమం అంతా రోమ్ నెత్తిన పడింది" అన్నాడు క్రాసస్.

"ఔను, పూర్వం యిల్లా తయారుచేసే వారు కాదా?" కైయస్ అడిగాడు.

"అప్పే యిల్లా లేదే. అప్పుడు స్వతస్సిద్ధంగా తయారయిన సువాసన ద్రవ్యాలే కాని యీ వండిన అత్తరువులూ అవీలేవే. ప్రకృతి ప్రసాదించినదేదో అదేతప్ప యింత అభివృద్ధి యేదీ! కర్పూరం, పునుగూ, జవ్వాజీ, కస్తూరీ మొదలైనవన్నీ చూస్తే తెలిసిపోతోంది. కత్తులతో చెట్లమీద నాటగా వచ్చిన జగురుపదార్థం వంటిదే కర్పూరం. అల్లాగే జంతువులవల్ల లభ్యమయ్యేవి కొన్ని. అంతేకాని వాళ్ళకివి తయారుచేసే పద్ధతులు తెలియవు. అసలు ప్రాచ్యదేశాల్లో కర్పూరం చెట్లు, విరివిగా నాటిస్తారని విన్నాను. చాలామటుకు సువాసన ద్రవ్యాలు వెలిగించడానికి వీలుగా వుండేవే. అప్పుడు కదా యీ యీజిప్షియనులు బయలుదేరి యీ బట్టీలు కనిపెట్టినది. బట్టీలు సెంట్లకేకాక సారాలకు కూడా పనికొచ్చాయి. త్రాగుడుకు అడ్డుత్రోవ తొక్కించినదే యీ బట్టీ."

కొన్ని బల్లలమీద యేవేవో తరుగుతున్నారు. క్రాసస్ వాళ్ళందర్నీ అక్కడకు తీసుకువెళ్ళాడు. అక్కడొక కార్మికుడు నిమ్మతొక్కలు ఉల్లిపర కాగితాలంత పల్చగా తరుగుతున్నాడు. ఒక తొక్కతీసి వెలుతురులో చూపిస్తూ క్రాసస్ అన్నాడు:

"జాగ్రత్తగాచూస్తే మీకు దీన్లో నూనె వున్నట్లు కన్పిస్తుంది. దీనికెంత సువాసనుందో మీకు తెలియనే తెలుసు. ఒక్క నిమ్మతొక్కలేకాదు నారింజ కాని య్యండి, తక్కిన చెట్ల బెరళ్ళు అదీ కానియ్యండి, అన్నిటికీ ఇదే పద్ధతి. ఈ మాదిరిగానే తరిగి సారం పిండుతారు. నాతోకూడా వస్తే—"

ఒక పెద్ద గాడిదగ్గరకు వాళ్ళను తీసుకెళ్ళేడు. ఆ గాడిమీద పెద్దకుండలో యీ తొక్కలు వండుతున్నారు. ఆ కుండమీద లోహపు సిబ్బి మూతవేసి మేకులతో బిగించారు. రాగిగొట్టాలు మెలికలు తిరుగుతూ దాన్లోంచి పైకిపోతున్నాయి. ఆ గొట్టాలమీద నీటిజల్లే యేర్పాటు చేసేరు. ఆ గొట్టం మరొక కొన వేరొక పాత్రలోకి పోతోంది.

"బట్టీ అంటే యిదే" క్రాసస్ వివరిస్తున్నాడు. "తొక్కలైనా, చెక్కలైనా వీటిలోనే మరిగిస్తాం. వీటినుంచి నూనె వేరుపడేదాకా మరిగిస్తూనే వుంటాం. అప్పుడా నూనె మరిగి ఆవిరై గొట్టాలగుండా పోతుంది. ఆ పోతున్న ఆవిరి ద్రవ్యంగా మార

డానికి గొట్టాలమీద నీళ్ళు జల్లుతారు. దాంతో ఆ చివరవున్న పాత్రలో అమూల్యమైన అత్తరువు తయారవుతుంది. కుండలోంచి పైకొచ్చేసే నీరంతా వేరే జాగ్రత్త చేస్తాం. అది చల్లబడ్డాక నీటిమీద నూనెపదార్థం కొంత తేలుతుంది. ఆ నూనె కూడా అత్తరువే. అత్తరువు వెండిగొట్టాలలో పదిలపరచి తక్కిన నీటిని భోజనాలవద్ద ఉపయోగించే మంచినీటికింద అమ్ముతాం. ఆ నీటికికూడా యెంతో కమ్మని సువాస నుంటుంది.''

''అయితే మనం తాగేవి ఆ నీళ్ళే అని కాదా మీరనేది'' క్లాడియా ఆశ్చర్య పోయింది.

''అంతేమరి. దాంట్లో మరికొంత మరగబెట్టిననీరు కలుపుతారు. కాని అది తాగడం ఆరోగ్యకరమే. ఈ నీళ్ళకుకూడా అత్తవులకూ సెంట్లకూ మల్లేనే యే రుచి కావాలంటే ఆ రుచి తెస్తారు. ఆపళంగానే ఉంచితే ఆ నీళ్ళు స్నానాని కుపయోగిస్తారు.''

హెలీనా తనవైపు చిరునవ్వు నవ్వుతున్నట్లు చూసేడు క్రాసస్. ''ఏం, నేను నిజం చెప్పడంలేదనా నీ వుద్దేశ్యం?''

''అబ్బే! మీ కెన్ని విషయాలు తెలుసునా అని ఆశ్చర్యపోతున్నా; అంతే. ఏదైనా యెల్లా తయారుచేయబడుతుందో మొదటిసారిగా తెలుసుకునేముందు యేదెల్లా తయారౌతుందో యెవరికీ తెలియదనుకునేదాన్ని.''

''తెలుసుకోటం నా విధి'' క్రాసస్ చెప్తున్నాడు. ''నేను చాలా ధనవంతుణ్ణే. నే నది చెప్పడానికి సిగ్గుపడను. కొంతమందికి సిగ్గు ఎందుకో నాకు తెలియదు. నేను ప్రతినిత్యం ధనార్జనగురించే ఆలోచిస్తుంటాననీ, అందుకోసమే పనిచేస్తుంటాననీ నన్ను చాలామంది హీనంగా చూస్తారు. అదీ నాకు తెలుసును. నాకేం విచారంలేదు. పైగా మరింత డబ్బు సంపాదించడమంటే నాకు మహాసరదా. మన మిత్రులు కొందరున్నారు. వాళ్ళకి తోటలమీద డబ్బు చేసుకోవచ్చుననే భ్రమవుంది. నాకల్లాకాదు. నా కో యుద్ధాన్ని కట్టబెట్టేరు. దాన్ని తగలెయ్య. అదేం యుద్ధమోకాని జయించడానికొక్క మహానగరమూ లేదు; వల్లకాడూ లేదు. బానిసలతో యుద్ధమట. ఎర్రని ఏకాణీ కాని, గోచీగుడ్డకాని లేనివాళ్ళతో యుద్ధం. పాంపికి మాత్రం లాభసాటి యుద్ధం యిచ్చారు. నాకు మాత్రం యిదే అంటగట్టారు. అందుకే కొన్ని రహస్యాదాయాలు అట్టేబెట్టుకొన్నా. ఆ విధంగా డబ్బొచ్చేవాటిలో యీ కార్ఖానా ఒకటి. ప్రశస్తమైన అత్తిరువుతో నించిన ఆ వెండిసీసా ఒక్కొక్కటి దాని యెత్తున్న బంగారానికి పదిరెట్లు వెలయిచ్చినా రావు. ఈ కార్మికులా? వీళ్ళు యిక్కడున్నదల్లా బంగారంగా మార్చేస్తారు. ఆఖరుకి

వీళ్ళు కూడా బంగారమైపోతారు. వాళ్ళ తిండి గొడవా, కొంప గొడవా మన కక్కరలేదు."

"కానీ" కైయస్ అనుమానించాడు. "వీళ్ళు కూడా ఆ స్పార్టకస్‌గాడిలా చెయ్యగలరేమో—"

"ఏమిటీ కార్మికులు తిరగబడ్డమా?" క్రాసస్ నవ్వుతూ, తలాడిస్తూ వ్యతిరేకత తెల్పేడు. "అసంభవం. ఎన్నటికీ కార్మికులు తిరగబడరు, వాళ్ళేం బానిసలనుకున్నా వేంటి: స్వేచ్ఛాజీవులు తెలుసా? వాళ్ళిష్టం వచ్చినప్పుడిక్కడికి రానూవచ్చు; కష్టంగా వుంటే పోనూవచ్చు. అదీకాక వాళ్ళకి తిరుగుబాటు లేవదియ్యవలసిన అవసరమేమిటి?" షెడ్డంతా ఒక్కమారు కలయజూచాడు క్రాసస్, ఎవడి ముఖంలోనైనా భవిష్యద్విప్లవ సూచనలు కనిపిస్తాయేమోనని. "అబ్బే, నిజం చెప్పాలంటే బానిస యుద్ధం జరుగుతున్నప్పుడు కూడా మా కార్ఖానాలు పనిచేస్తూనే వున్నాయి. వీళ్ళకీ ఆ బానిస వెధవలకూ సంబంధమేలేదు; పోలికాలేదు."

అయినా ఆ చోటు వదలివెళ్ళేక కూడా కైయస్ మనస్సులో కలవరపాటు లేకుండాపోలేదు. వాళ్ళపనివాళ్ళు చేసుకుంటూ నిశ్శబ్దంగా ఉండే యీ వింత గడ్డాల మనుష్యులు అతనికి భయాన్నీ, సందేహాన్నీ కలిగించారు. ఎందుకోమాత్రం అతనికి తెలియరాలేదు.

## ఏడవ భాగం: రోమ్‌కు గ్రాఘూస్, సిసిరోల తిరుగుప్రయాణం, త్రోవలో వారి సంభాషణ, స్పార్టకస్ కన్నకల, దానిని గ్రాఘూస్‌కు తెలియు చేయబడ్డ విధమూ.

---

క్రైయస్, క్రాసస్, ఆ యిద్దరు వనితలూ, ఏపియన్ మార్గాన దక్షిణంగా కేపువాకు ప్రయాణం సాగించకముందే సిసిరో, గ్రాఘూస్ లిరువురూ ఉత్తరాభి ముఖులై రోమ్‌కు బయలుదేరేరు. సలేరియా భవనం నుండి కొద్దిదూరం ప్రయాణం చేస్తే చాలు రోమ్ చేరుకోవచ్చు. అస లా నగరపు పొలిమేరలోనే సలేరియా భవన ముందని చెప్పొచ్చు. దూరంలేదుకదా అని తాపీగా ఒకరి పల్లకీప్రక్క మరొకరి పల్లకీ పోనిస్తూ ప్రయాణం సాగిస్తున్నారు. నగరంలో పేరుప్రఖ్యాతులు గడించుకొని ఒక రాజకీయశక్తిగా పరిణమించిన గ్రాఘూస్‌యందు అనుగ్రహాన్ని కటాక్షిస్తూ తెచ్చి పెట్టుకున్న గౌరవాన్ని ప్రకటించాడు సిసిరో. అదీకాక నిజం చెప్పాలంటే గ్రాఘూస్ యొక్క రాజకీయదర్పాన్ని గుర్తించకపోవడం ఎవరికయినా కష్టమే.

ఏ ఒక్కరితోనూ శత్రుత్వం కలుగకుండా చూసుకుంటూ, యితరుల మంచిని సంపాదించడమే వృత్తిగా పెట్టుకున్న ఏ వ్యక్తికయినా ఒకరకమైన సంఘ సంసర్గ స్వభావం అలవడితీరుతుంది. గ్రాఘూస్ ఎంతోమందిని కలుసుకున్నాడు. అంతమంది లోనూ అతనంటే యిష్టంలేని వాళ్ళు బహుకొద్ది. అతనికికూడా యెవరియందూ అనవ సరమైన కోపంలేదు. కాని యీ సిసిరో మాత్రం అపరిమితంగా అసహ్యించుకో తగ్గవాడు. సిద్ధాంతమూ, కార్యసిద్ధీ వీటిలో సిద్ధాంతాలను వెనక్కునెట్టి అభీష్టసిద్ధియం దాసక్తిచూపే తెలివిగల యువకులలో యితనొకడు. అదేవిధంగా గ్రాఘూస్ కూడా అవకాశవాదాన్నే చేబట్టిన వాడయినా యేవో కొన్ని సిద్ధాంతాలయం దతనికున్న గౌరవమే అతన్ని సిసిరో నుండి వేరుచేసింది. తను నమ్మిన సిద్ధాంతాలే తనకు యిబ్బందిగా తోస్తే వాటిని తనే నమిలిమ్రింగిన రకమే యితను కూడా. సిసిరోకి తానొక భౌతికవాదిననే ఉద్దేశ్యం వుంది. కాని యింత భౌతికవాదీ కూడా మానవుడి లోని మర్యాదను గుర్తించి గౌరవింప నిరాకరించేవాడు. అందుకే గ్రాఘూస్‌కన్న యేమంత యథార్థవాది కాలేకపోయాడు. ఆ నిరాకరణవల్లనే లావుపాటి యీ వృద్ధుని

లోని సౌమ్యంగా కనిపించే దుర్జనత్వం అప్పుడప్పుడితన్ని దెబ్బ తినిపించేది. అసలు నిజం చెప్పాలంటే అందరికన్న గ్రాఛూస్ యేమంత దుష్టుడుకాడు. తన అభిలాషకు అడ్డుతగిలే ఆత్మవంచన నతడు కొంచెం బలంగా ప్రతిఘటింపగలిగేవాడు.

అదీకాక గ్రాఛూస్, సిసిరోని అవసరమైనదానికన్న తక్కువగానే అసహ్యించు కున్నాడు. ఒకలా చెప్పాలంటే సిసిరో ఒక మహాగందరగోళం. ప్రపంచం మారు తోంది. తన జీవితకాలంలోనే యీ రోమ్‌కే కాదు సర్వప్రపంచానికీ ఒక మార్పు సంభవిస్తోంది. దీన్ని గ్రాఛూస్ గమనించాడు. ఆ మార్పునకు సిసిరో అగ్రదూత. దయాదాక్షిణ్యాలు వీసమెత్తులేకపోయినా కుయుక్తులతో కూడిన తెలివితేటలుగల యువ కుల తరానికి, తరహాకు చెందినవాడు సిసిరో. గ్రాఛూస్ కూడా నిర్దయుడుగా ఉండక పోలేదు; కాని ఆ నిర్దయలోనే కొంచం కరుణ, క్రియలో శూన్యమయినా భావంలో నైనా సానుభూతి, కొద్ది జాలీ యివన్నీ వుండేవి. కాని యీ యువకులలో యితరుల దుస్థితికి విచారమూ జనించదు; సానుభూతీ పొడసూపదు. ఎటునుంచీ కారుణ్యం జొర నశక్యమయిన సందులేని కవచాలు ధరిస్తారు కాబోలు వీళ్ళు. సిసిరో బాగా చదువు కున్నవాడు. ఉన్నత కుటుంబాలతో బాగా పరిచయం కలవాడు. కనుకనే సంఘంలో యితనంటె కొంత యీర్ష్య కూడా కల్గుతుంది. దానికితోడు అతనిలోని విశిష్టమైన నిర్దయకూడా యీర్ష్యకు హేతువు కాకపోలేదు. తను యే యే విషయాలలో బలహీ నంగా వున్నాడో ఆ యా విషయాలలో సిసిరోకి చెప్పుకోతగ్గ బలంవుంది. అందుకే అతనియందు గ్రాఛూస్‌కి కొంచెం అసూయ. ఈ విషయం గురించే అతని భావాలాలో చిస్తూ ఉండిపోయినై.

"నిద్రపోతున్నారా?" సిసిరో మెల్లిగా ప్రశ్నించాడు. పల్లకీ ఊపువల్ల జోల కొట్టినట్లు నిద్రపోతున్నాడేమో అనుకున్నాడు సిసిరో.

"అబ్బే ఏదో ఆలోచిస్తున్నా."

"ముఖ్యమైన దేశవ్యవహారాల గురించా?" ప్రశ్నించాడు సిసిరో. ఎవరో అమా యకుడైన సెనేట్ సభ్యుడ్నొకడ్ని నాశనం చేసేందుకే గ్రాఛూస్ ఆలోచిస్తున్నాడని తనలో నమ్ముతూ పైకిమాత్రం యథాలాపంగా అడిగేవాడిలా ప్రశ్నించాడు.

"అబ్బే, ఏమంత ముఖ్యవిషయం కాదు. నిజం చెప్పాల్సివస్తే ఒక పూర్వపు గాధ గురించి, చాలా పాతకథ. పూర్వపుకథ లన్నిటిలాగానే చాదస్తంగా కూడా ఉంటుంది."

"అదేమిటో నాకు చెప్తారా?"

"తప్పకుండా నీకిది విసుగు పుట్టిస్తుంది."

"ఈ మాట్లాడలేని దృశ్యాలు మరింత విసుగు పుట్టిస్తాయి."

"అదొక నీతిని బోధించే కథ. అటువంటి వాటికన్న విసుగుదలను వినిపించ కదలిక వుండవు. సిసిరో మనకీ నీతికథలు జీవితంలో ఉపయోగపడతాయంటావా?"

"చంటిపిల్లలకవి బాగానే వుంటాయి. నా కిష్టమైన కథ బహుశా నా దూరపు బంధువుకు సంబంధించినదై ఉంటుంది. గ్రాఛీమాత గురించి."

"అబ్బే నీకు సంబంధించి వుండదు."

"ఔనా, నాకప్పుడు ఆరేళ్ళుంటాయనుకుంటా. నా ఏడో ఏట నే నా ప్రశ్న వేసేను."

"ఏడోయేట అంత అల్లా వుండివుండవు" గ్రాఛూస్ చిఱునవ్వు నవ్వేడు.

"ఉన్నాననే నా నమ్మకం. ఒక వంశవృక్షాన్ని కొనితెచ్చుకోనందుకు నువ్వంటే నా కిష్టం."

"అది మిత వ్యయంవల్ల వచ్చినదే కాని గొప్ప సుగుణమేమీ కాదులే."

"ఆ కథేమిటి మరి?"

"అది వినడానికి నువ్వు మరీ పెద్దవాడవవుతావేమోనని నాభయం." "చెప్పి చూస్తేసరి" సిసిరో అన్నాడు. "నీ కథలు నాకెప్పుడూ ఆశాభంగం కల్గించలేదు."

"వాటిలో అర్థం లేకపోయినా?"

"వాటిలో యెప్పుడూ అర్థం లోపించలేదే? ఆ అర్థవిశేషాన్ని వెతికి పట్టుకో గల తెలివితేట లుండాలికాని."

"అయితే నాకథ చెప్తా" గ్రాఛూస్ నవ్వేడు. "ఒక్కగానొక్క కొడుకునేకన్న ఒక తల్లిగురించి యీకథ. పొడుగ్గా, అందమైన అంగసౌష్టవంకల్గి సౌందర్యవంతుడైన పుత్రుడు. తల్లి పిల్లల్నెలా ప్రేమించాలో అలాగే ఆమె అతడ్ని ప్రేమించేది."

"తన ఘోరమైన వాంఛలకు నన్నొక ఆటంకంగా తలచేది మా అమ్మ."

"ఎప్పుడు ధర్మం నాలుగుపాదాలా నడిచేదో ఆ కాలంలో యీ కథ జరిగిందనుకుందాం. ఈతల్లి తన కొడుకును ప్రేమించింది. అతనిలో యవ్వనం పొడసూపింది. అప్పు డతను ప్రేమకలాపాల్లో దిగాడు. ఎంత దుర్మార్గురాలో అంత అందంగానూ ఉండే ఒక స్త్రీ నితడు ప్రేమించాడు. ఈ కొడుకునామె యెప్పుడూ కన్నెత్తి చూడలేదు. ఒక్కమాటు కూడా అతన్నిచూసి చిరునవ్వు నవ్వదు. ఆమె కళ్ళెప్పుడూ అతనివైపు తిరిగి తళుక్కుమనలేదు. ఆమెతల యితనివైపెప్పుడూ వూగలేదు. ఏమీలేదు."

"నాకూ ఒకమా టటువంటిదే తటస్థపడింది" సిసిరో అన్నాడు.

"అతను ఆమెకోసం, విరహతాపం చెందాడు. అదృష్టవశాత్తూ ఆమెను కలుసుకున్నప్పు డతనామెతో తా నామెకొరకై కట్టించబోయే రాజప్రాసాదాల గురించీ, ఆమెకోసం తెచ్చి యీయబోయే సకలైశ్వర్యాల గురించీ తెగచెప్పేసేడు. ఆమెకు యివన్నీ అయోమయమైన కట్టుకథలలా కన్పించి వాటియందు తనకేమీ ఆసక్తిలేనట్లు వ్యక్తంచేసింది. వాటన్నిటికీ బదులొక చిన్నకానుక సమర్పించమంది. అది అతనికి లభ్యంకావడం యేమీ కష్టమైన పనికాదు."

"ఉట్టి కానుకేనా?" సిసిరో అడిగేడు.

గ్రాఘూస్‌కి కథ చెప్పడం అంటే సరదా. ఆ ప్రశ్న విని తలపంకించాడు. "ఔను, ఉట్టి కానుకే. ఆ యువకుడిని అతని మాతృహృదయాన్ని తెచ్చి యిమ్మన్న దామె. అతను తెచ్చాడు. బాకుతో తన తల్లి గుండెకాయను తానే కోసి తీసుకొచ్చాడు. తను చేసినదానికి తానే భయావేశపూరితుడై అందమైన, దుర్మార్గమైన ఆ ప్రేయసి కోసం ఒక అరణ్యంలోపడి పరుగు పరుగున పోయాడు. పరుగెడుతున్న అతని కాలి కొక చెట్టువేఱు తగిలింది. పడిపోయాడు. అప్పు డతనిచేతిలోని మాతృహృదయం దూరంగా పడిపోయింది. ఒక అందాలరాసి ప్రేమను కొనగల ఆ గుండెకాయను తిరిగి తీసుకొనేందు కతను వంగినపు డా గుండెకాయ అతనితో 'కొడుకా! కొడుకా! పడ్డప్పుడు నీ కాలికేం దెబ్బ తగులలేదుకద' అన్నదట మెల్లగా." పల్లికీలో వెనక్కానుకొని చేతి వేళ్ళకొనలను కలుపుతూ ఆలోచనసాగించాడు గ్రాఘూస్.

"అయితే?" సిసిరో అడిగాడు.

"అంతే, ఏముంది? ఏమీ అర్థంలేని నీతికథ అని ముందేచెప్పాగా?"

"క్షమా? అయితే అది రోమన్ కథకాదు. రోమన్లకు క్షమ చాలా తక్కువ. ఏమైనా యీమె గ్రాఖీమాత మాత్రంకాదు."

"క్షమ కాదు, ప్రేమ."

"ఆహా(?"

"ఏం? నీకు ప్రేమయందు నమ్మకంలేదా?"

"అన్నిటినీ అధిగమించగల సర్వోత్కృష్టతను సాధించడ మనేనా? అదేమీ లేదు. అదీ రోమన్ల లక్షణంకాదు."

"ఐతే చావే నీతో. సిసిరో! యీ భూమిమీద ఉన్న ప్రతిదాన్నీ, ప్రతి విషయాన్నీ యిది రోమన్లది, రోమన్లది కానిదిది అనే లిస్టులు తయారుచేయగలవాయేం?"

"చాలామటుకు," సిసిరో సంతృప్తిగా చెప్పేడు.

"కొంపదీసి ఆ పనిలో నీకు సంపూర్ణ విశ్వాసంకూడా కుదిరిం దేమిటి నాయనా?"

"నిజాని కదేం లేదనుకో" సిసిరో నవ్వేడు.

'హాస్యరసం నీరసించినవాడే వీడు' తనలో అనుకున్నాడు గ్రాఘూస్.

నవ్వాల్సిన అవసరం వచ్చింది కనుక నవ్వేడుకాని నిజంగా నవ్వగలిగేనా? పైకిమాత్రం అతనితో అన్నాడు: "రాజకీయాలనుండి విరమించవలసిందిగా నీకు సలహా యివ్వదలచుకొన్నాను."

"సరే?"

"నా సలహా నీకు శిరోధార్యం అనికాదు. అది నీమీద ఏమీ పనిచెయ్యదని తెలుసు."

"మొత్తంమీద నేను రాజకీయాల్లో నెగ్గుకురాలేననికదూ నువ్వనుకొనేది?"

"కాదు. అల్లా యెందుకంటాను? కాని నువ్వెప్పుడైనా యేమిటిదంతా అని యీ రాజకీయాలనుగురించి ఆలోచించిన పాపాన పోయావా?"

"ఆ పాపాన పోలేదుకాని రాజకీయాలంటే మాత్రం మహాగొడవ అనీ, అదేమీ అంత పరిశుభ్రమైన పని కాదనీ నేనెరుగుదును."

"పరిశుభ్రమైనదనుకో, అపరిశుభ్రమైన దనుకో, కాని నా జీవితం యావత్తూ రాజకీయవేత్తగా గిడిపాను" అన్నాడతను. అంటూ 'అతను నన్నసహ్యించుకుంటు న్నాడు. అతనికి నే నొకటి అందిస్తే అతను నాకు మరొకటి అందిస్తాడు. ఎవడికో ఒకడికి నేనంటే యిష్టంలేదన్న సంగతి ఒప్పుకొందుకు యెందుకింత బాధ?' అను కున్నాడు.

"పేర్లను జ్ఞాపక ముంచుకోగల ప్రతిభ నీలో వుందని విన్నాను. నీ కో లక్ష మంది పేర్లు కంఠస్థంగా వచ్చునంటారు నిజమేనా?"

"రాజకీయాల గురించి మరొక భ్రమ. ఏదో కొద్దిమంది పేర్లు నే నెరుగుదును లక్షమందేం కాదు."

"హానిబాల్, అతని సైన్యంలోవున్న ప్రతి సైనికుడ్నీ పేరు పేరునా పిలిచే వాడని విన్నాను."

"అవును మరి. స్పార్టకస్‌కుకూడా అటువంటి జ్ఞాపకశక్తినే ప్రసాదిద్దాం మనం. మనకన్న యేదో ఒకప్పుడు బలవంతులుగా వున్నారు కాబట్టే యితరులు మనపై విజయం సాధించగలిగేరన్న విషయం మనం చస్తే ఒప్పుకోంగా. చరిత్రలో వ్రాయబడ్డ చిన్న, పెద్ద అబద్ధాలంటే ఎందుకు నీకంత ఆసక్తి?"

"అవన్నీ అబద్ధాలేనా?"

"చాలామటుకు" ఇప్పుడు గ్రాఖూస్ పిడుగులు పడుతున్నట్లు మాట్లాడు తున్నాడు. "చరిత్ర అంటే మోసం, దురాశల వివరణ—నమ్మశక్యంగాని కల్పిత గాథలు. అందుకే నేను నిన్ను రాజకీయా లంటే యేమిటి మహాశయా అని ప్రశ్నించా. సలేరియా భవనంలో వుండగా యెవరో అన్నారు. స్పార్టకస్ సైన్యంలో ముఠా రాజ కీయాలు లేవని. వాటికి అక్కడ స్థానంలేదు."

"నువ్వొక రాజకీయవేత్తవు కాబట్టి చెప్పుచూద్దాం. రాజకీయవేత్త అంటే యెవరో?" సిసిరో నవ్వేడుకూడా.

"ఒక పచ్చి దగాకోరు," సూక్ష్మంలో సమాధానాన్ని యిమిడ్చేడు గ్రాఖూస్.

"పోనీలే మనసువిప్పి మాట్లాడనైనా మాట్లాడేవు." "నాలో ఉండే ఒకేఒక్క అమూల్యమైన లక్షణం అదే. రాజకీయవేత్తలోని ఆ లక్షణాన్నే నిజాయితీ అని భ్రమిస్తారు అమాయకప్రజలు. చూసేవూ మనమొక రిపబ్లిక్కులో ఉన్నాం. అంటే యెంతోమందికి యేమీలేదనీ, యే కొద్దిమందికో అవసరమైనదానికన్న అన్నీ కొల్ల లుగా ఉన్నాయనీ దానర్థం. అంతేకాదు, బాగా కలవాళ్ళు తమ కలిమిని సంరక్షించు కోవాలి. అందుకని మన నాహ్వానించిన ఆంటోనియస్ క్రైయస్‌వంటి భూస్వాముల ఆస్తిపాస్తుల్ని రక్షించేందుకు యీ యేమీలేనివాళ్లు ప్రాణాలకు తెగించడానికైనా సిద్ధంగా ఉండాలి. మనకు బానిసలున్నారు. ఈ బానిసలకు మనమంటే అయిష్టం. అందువల్లనే బానిసల బారినుండి మనని బానిసలు రక్షించలేరు. బానిసలకు మనమంటే ఇష్టంవుంటుందనే భ్రాంతిలోమాత్రం మనం ఛస్తే పడకూడదు. బానిసలను కొను క్కొని వాళ్ళచేత చాకిరీ చేయించుకుంటూ అదేసమయంలో వాళ్ళవల్ల యే ప్రమాదమూ జరుగకుండా చూసుకోవాలంటే బానిసలను కొనుక్కోలేని వాళ్ళనుకొందర్ని మనం నియమించుకోవాలి. మృత్యువు పిలిచినాసరే హాజరవగల్గాలి వాళ్ళు. వాళ్ళే మనలనూ, మన ఆస్తిపాస్తులనూ సంరక్షించాలి. అటువంటి రెండులక్షలమందిని కవచాలతో కప్పి, చేతిలో కత్తిపెట్టి యే యితరదేశానికయినాసరే, యెన్ని వందలమైళ్ళయినాసరే కాళ్ళరిగేలా కవాతుచేసుకుంటూపోయి ఛండాలంగా, అసహ్యంగా బ్రతుకుతూ రక్తపు ఊబిలలో మునిగి యీదులాడ గలగాలివాళ్ళు. ఆ విధంగా వాళ్ళు యితర దేశాలతో యుద్ధం చేస్తేనే మనం యిక్కడ సురక్షితంగా, సకల సదుపాయ సౌకర్యాలతోనూ సౌఖ్యంగా వ్యక్తిగతసంపదలనూ, భాగ్యభోగ్యాలనూ వృద్ధిచేసుకుంటూ బ్రతకగలం. నిజానికి స్పార్టకస్‌తో పోరాడ్డానికిపోయిన సైనికులకు బానిసలకన్న రక్షించుకోతగ్గదీ,

కాపాడుకోతగ్గదీ యేమీలేదు. అయినాసరే ఆ బానిసలతోనే యుద్ధంచేసి వేలాదిగా సమసిపోయారు. ఇంకా స్పష్టంగా చెప్పవచ్చు. బానిసలతో పోరాడి చచ్చిన రైతులు భూస్వామ్యవ్యవస్థ ఫలితంగా తమతమ భూములనుండి లేవకొట్టబడి తరుమబడ్డారు. కనుకనే గత్యంతరంలేక సైన్యంలో చేరేరు. బానిసలచే వేయబడే యీ తోటలపద్ధతి వల్ల ఆ రైతులు దివాలాతీసి కటికదరిద్రులయారు. పోనీ నువ్వే ఆలోచించు సిసిరో! పరాక్రమవంతుడయిన రోమన్ సైనికుడికి బానిసలు నెగ్గితేపోయేదేమిటి? పోయేదేదో పూర్వం పోనేపోయింది. పైగా ఆ బానిసలవల్ల వీళ్ళకెంతో లాభంకూడా వుంది. ఎందుకంటావేమో ఆ బానిసలకు వీళ్ళెంతో అవసరం. వాళ్ళల్లో మన రోమన్ రైతులవంటి పనివాళ్ళు చాలినంతమంది లేరు. అందరికీ సరిపోయేభూమి వుంది. మన సైనికుడు కలగనే అతని చెక్కపొలమూ, చిన్నయిల్లూ వాళ్ళు నిజంగాయిస్తారు కూడా. అయినాసరే అతను బానిసలను నమ్మడు. అంతటితో ఆగడు. వాళ్ళతో యుద్ధంచేసాడుకూడా. చేసి తనకు తెలియకుండా తానే తనకలలను భగ్నంచేసు కుంటాడు. ఎందువల్ల? మనం చెప్పేంకాబట్టి. కొవ్వెక్కిన మనిషొకడు దిండ్లమ ర్చిన పల్లకీలో పడుకొని ప్రయాణం చెయ్యడానికని అతనా విధంగా పోరాడుతాడు. నేనన్న దానిలో నిజంవుందని ఒప్పుకోవా?"

"నువ్వన్నమాటలే కనుక సామాన్యుడెవడైనా అనివుంటే యీ పాటికి అతన్ని శిలువేసి ఉండేవాళ్ళం."

"సిసిరో! సిసిరో!" గ్రాచూస్ నవ్వేడు. "అదొక బెదిరింపా? లావుగా కొవ్వెక్కిన నా వృద్ధశరీరం శిలువ నలంకరించ తగదులే. నిజాన్ని చూడ్డానికి నీకెందు కంతభయం? కావాలంటే యితరులకు యీ అబద్ధమేచెప్పి ఒప్పిద్దాం కాని, మనం సృష్టించిన అబద్ధాలను మనమే నమ్మాలాయేం?"

"నువ్వన్నట్లే కానీ. కాని నువ్వొక ప్రధానమైనవిషయం మరచిపోతున్నావు. ఒకమనిషి వేరొకడిలా వుంటాడా? వుండడా? నీ చిన్న వుపన్యాసంలో తర్కం దెబ్బతిన్నది అక్కడే. మనుష్యులంతా ఒకటే అనే ధ్వని నువ్వు చెప్పినదానిలో వుంది. ఆ నల్లగా కనబడేవన్నీ కాకులే అంటావేమిటి? అయితే యిదేమిటీ పంచమ స్వరం వినిపిస్తోంది? కాకినోట పంచమ స్వరం వింటామా? అది కోకిల. అదీ కాకిలాగే వుంటుంది దూరంనుంచిచూస్తే. ఉప్పూ, కప్పురం పైకి ఒకేలాగున్నా రుచులలో తేడావుంది. అల్లాగే పురుషులలో పుణ్యపురుషులు అంటే ఉత్కృష్టమైన వాళ్ళు లేరా? ఉన్నారు. వాళ్ళే అతిమానవులు. వాళ్ళే సంఘంలోని నిగ్గు. భగ వంతుడు వాళ్ళ నా విధంగా సృష్టించాడా లేక పరిస్థితుల ప్రభావం వాళ్ళ నా విధంగా

తయారుచేసిందా అన్న విషయ మప్రస్తుతం. వాళ్ళే పరిపాలించే యోగ్యతకలవాళ్ళు. ఆ యోగ్యత ఉందికాబట్టే వాళ్లు పాలకులు. ఇంక మిగిలినవాళ్ళా? వాళ్ళని గొర్రెల్లా అనుసరించడమే వీళ్ళపని. చూసేవా? నువ్వు కొన్నివిషయాలు సూత్రీకరించావు. కాని వాటిని వివరించుకోడంలోనే వుంది పస. సంఘంయొక్క చిత్రణకూడా కొంత వరకు చేసేవు. కాని వాస్తవం కనుక నీ చిత్రణ ప్రకారమే ఉండివుంటే ఒక్క రోజులో యిదంతా కూలిపోవును. నీ వైఫల్యమంతా యేమిటంటే నీకు తర్కంతో నిండిన గందరగోళాన్ని వివరించుకోలేకపోవడమే. గజిబిజిగా ఉన్న నీ భావాలను సమకూర్చుకోలేక పోవడమే."

"అబ్బే, సమకూర్చుకోగలను" తల ఊపేడు గ్రాఖూస్.

"అబ్బ! నువ్వే?! నీ అంతట నువ్వే?"

"సిసిరో! నే నో వెర్రివెధవ ననుకుంటున్నావా? ఎంతో ప్రమాదకరమైన యెంతో దీర్ఘమైన జీవితాన్ని నే ననుభవించా. ఇంకా ఉన్నత స్థితిలోనే వున్నాను. రాజకీయవేత్త అంటే యెవరు అని నువ్వడిగేవు. రోమ్ అనే మతిలేని యింటికి అతను సిమెంటులాటివాడు. తనంతట తానుగా కులీనుడు అన్నిపనులూ చెయ్యడు. అందులోనూ యీ పని అసలు చెయ్యలేడు. ఎందుకంటే మొదటిది అతనుకూడా నీలాగనే ఆలోచించడం ప్రారంభిస్తాడు. రోమన్ పౌరుల దగ్గరకెళ్ళి మేం ఉత్కృష్టులం, పురుషులలో వుండే పుణ్యపురుషులం, మీరు మమ్మ అనుసరించాల్సిన గొర్రెలు అంటే వాళ్ళకు రుచించదు. పైగా అరికాలిమంట తలకెక్కుతుంది. అదీకాక వాళ్లు గొర్రెలూ కారు, మనం సర్వోత్కృష్టులమూ కాము. అది నీకు కొద్దిరోజుల్లోనే తెలుస్తుంది. రెండోది రోమన్ పౌరుడితో కులీనుడికి ఏమీ సంబంధం వుండదు. అందుకే అతని మనస్తత్వం అణుమాత్రమూ తెలియదు. నువ్వే చేసుకో అని ఆ కులీనుడికీ, భూస్వామికీ యీ గొడవ వదిలేస్తే నువ్వన్నట్లే యిదంతా ఒక్కరోజులోనే కూలిపోక తప్పదు. అందుకే అతను నీలాటి వాళ్ళవద్దకు వస్తాడు. నిర్హేతుకమైన దానినుండి హేతువును సృష్టిస్తాం మేము. ధనవంతులకోసం చావడమే మహత్కార్య నిర్వహణగా మేం ప్రజలకు నచ్చచెప్తాం. తాంత్రికులం మేము. భ్రమల వల పన్నుతాం. అది అవివేకులకు, సామాన్యులకు చస్తే అర్థంకాదు. మేం ప్రజలతో అంటాం— మీరే శక్తి అని. మీలో ప్రతివాడి ఓటూ రోమ్ తాలూకు బలం; దాని ప్రతిభ. ప్రపంచంలో మీరొక్కరే నిజమయిన స్వేచ్ఛాజీవులు. మీ వ్యక్తిగత స్వాతంత్ర్యంకన్న అమూల్యమైనది లేదు. మీ నాగరికతకన్న విలువైనదేదీలేదు. మీరు దాన్ని అదుపాజ్ఞలలో వుంచుకుంటారు. మీరే ఆ శక్తి. అది విని వాళ్ళు మా అభ్యర్థులకు వోట్లు కురిపిస్తారు.

మేం ఓడిపోతే విచారిస్తారు. మేం విజయం పొందితే తామే విజయం పొందినట్లు సంతోషిస్తారు. మేం వాళ్ళతో చెప్తాం మీరు బానిసలు కారు. స్వతంత్రజీవులు. మీ ఓటే రాజ్యాంగాన్ని నడిపిస్తుంది అని. బానిసలు కానందుకు గర్విస్తారు. ఔన్నత్యం పొందినట్లు భావిస్తారు. జీవితంలో యెంత లోతుగా దిగజారి పోయినాసరే, తూము కాలువగట్లపై పడుకున్నాసరే, రోజస్తమానూ రంగస్థలాలలోని బల్లలపై పొర్లాడి ప్రజలు దయదాల్చి యిచ్చే బిచ్చపు మెతుకులు తింటూ భ్రూణ హత్యచేసే దౌర్భాగ్యానికి దిగజారినా సరే, పుట్టింది మొదలు చచ్చేవఱకూ ఏ ఒక్కరోజూ చెయ్యడానికి పనిలేకపోయినాసరే బానిసలం కాదుకదా అనే ఉపశమనం వాళ్ళకుండేలా చేస్తాం. స్వతహాగా వాళ్ళుకూడా ఛండాలంగా ఉన్నాసరే బానిసలను చూచినప్పుడుమాత్రం తమకేదో గొప్ప హోదా, విశిష్టత, నాగరికత ఉన్నట్లు అహంభావం చెందితీరుతారు. మేం కదా యావత్ప్రపంచమూ చూసి అసూయచెందే రోమన్ పౌరులం అని సంతోషిస్తారు. ఇది నా విచిత్రమయిన కళ, సిసిరో! ఇదే రాజకీయం. రాజకీయాలనుమాత్రం చిన్న చూపు చూడకు సుమీ!"

# 7

ఆ సంభాషణ సిసిరో, గ్రాఛూస్‌లను మరింత యెడంగా తీసుకుపోయింది. గ్రాఛూస్‌కి సిసిరో అంటే మరింత అయిష్టం ప్రబలింది. రోమ్‌కు కొద్దిదూరంలోవున్న మొదటి పెద్ద శిలువ వాళ్ళకగుపించింది. ఆ శిలువకింద కొద్ది దూరంలో కునికిపాట్లు పడుతున్న ఒక స్థూలకాయుడ్ని చూపించి సిసిరో "ఆ మనిషి వాటంచూస్తే ఒక రాజకీయవేత్తలాగున్నాడే" అన్నాడు.

"నిజమే. అతను నా పాతస్నేహితుడు." గ్రాఛూస్ పల్లకీల నాపవలసిందిగా సంజ్ఞచేశాడు. అతిప్రయత్నంమీద తన శరీరాన్ని పల్లకీనుంచి బైటకీడ్వగలిగాడు. కూచుని కూచుని వున్న తన కాళ్ళు నొప్పులు తీరుతాయికదా అని సిసిరో అక్కడే అటూయిటూ పచారుచేస్తున్నాడు. సాయంత్ర మవుతోంది. నల్లనిమేఘాలు ఆకాశాన్ని కప్పినై. సిసిరో వాటికేసి చూపించాడు.

"నీకు వెళ్ళాలని ఉంటే ప్రయాణంకానీ" గ్రాఛూస్ అన్నాడు. సిసిరో అంటే అతనికి మోజులేదు సరికదా మహా అయిష్టం. చిరాకు పొలిమేరలో ఉన్నా డతను. సలేరియా భవనంలో ఉన్న ఆ ఒకటిరెండు రోజులూ అతనికేమీ రుచించలేదు. నోరు పాడుకావడంతప్ప మిగిలిందిలేదు. ఏమిటి చెప్మా యిల్లాగుంది? అని అత నాశ్చర్యపోయాడు. వృద్ధాప్యంవల్ల అజాగ్రత్త పెరగడంలేదుకద.

"నే నాగుతా" అని చెప్పి సిసిరో పల్లకీపక్క నిలబడి పితానంకింద కూర్చుని ఉన్న వ్యక్తివైపు నడుస్తున్న గ్రాఘూస్‌ను పరిశీలిస్తున్నాడు. నిజానికి యీ పేటల లోనూ, రాజకీయ వేత్తలలోనూ విచిత్రమైన ప్రజాస్వామ్యం ఉంటుంది. వాళ్ళ ప్రపంచమే వేరు.

"ఈ రాత్రే" గ్రాఘూస్ అనడం విన్నాడు - సిసిరో.

పితానంకింద మనిషి తల ఊపేడు.

"సెక్టస్!" గ్రాఘూస్ అరిచేడు. "నేనేం యివ్వదలుచుకున్నానో చెప్పనే చెప్పాను, నే చెప్పినట్లు చేస్తావా చెయ్యి. చెయ్యవూ నే బ్రతికున్నంతకాలం, నువ్వు బ్రతికున్నంతకాలం నీ ముఖంచూడను, నీతో మాట్లాడను. ఈ కుళ్ళుతున్న మాంసం చూస్తూ కూచున్న మనం యింక బ్రతికే దెంత కాలంలే."

"క్షమించు, నే చెయ్యలేను గ్రాఘూస్."

"ఎందుకీ క్షమాపణలు? నే చెప్పినట్లు చెయ్యి."

గ్రాఘూస్ తన పల్లకీ యెక్కేడు. వాళ్ళిద్దరికీ జరిగిన సంభాషణ గురించి సిసిరో ప్రశ్నించలేదు. కాని నగర సింహద్వారం సమీపిస్తుండగా మాత్రం విపరీతంగా తన కొడుకుని ప్రేమించిన తల్లి గురించి గ్రాఘూస్ చెప్పిన కథను జ్ఞప్తికి తెస్తూ సిసిరో అన్నాడు :

"మంచి తమాషాగా వుందా కథ. కాని ఏదో కొంత మరిచిపోయినట్లున్నావు యెక్కడో."

"అబ్బే, సిసిరో నువ్వెప్పుడైనా ప్రేమించావా?"

"కవిత్వంలోలా ప్రేమించలేదనుకో. కాని ఆ కథ——"

"కథా? ఎందుకది చెప్పేనంటావు? ఎందుకో ఒకందుకు చెప్పివుంటా. నా కేజ్ఞాపకం లేదుసుమీ."

పట్నంలోకి పోయాక వాళ్ళు విడిపోయారు. గ్రాఘూస్ యింటికి చేరుకునేసరికి సంధ్యచీకటి అలముకుంటోంది. దీపం పెట్టుకొని స్నానం చెయ్యాల్సొచ్చింది. ఒక అతిథికోసం నిరీక్షిస్తున్నాను కాబట్టి భోజనానికి కొంచెం ఆలస్యం వుంటుందని తన బానిసకు చెప్పాడు. పడకగది చీకట్లలోకి గుడ్డిగా చూస్తున్నాడు ఆలోచిస్తూ. మృత్యువు అతన్ని తడుతోంది. ఈ చీకటి గురించి పూర్వపు రోమన్ ఆర్యోక్తి ఒకటుంది, చావుకి కాస్త చోటుచెయ్యి అని. తను ప్రేమించిన స్త్రీ పక్కన శయనించితే తప్ప లేకపోతే అంతే. గ్రాఘూస్ యెప్పుడూ అటువంటిది ఎఱుగడు, తనూ బజారులో ఆడాళ్ళని కొన్నాడు. ఈ దుష్టుడైన ముసలి గ్రాఘూస్ అదే చేసేడు. సంతోషంతో,

యిష్టంగా యే స్త్రీ తన పొందు వాంఛించింది? తను కొన్న స్త్రీలతో తనకు నిజమైన, హృదయపూర్వకమైన సంబంధమున్నట్లూ, వాళ్ళకు తనతో తప్ప మరెవరితోనూ సంబంధంలేనట్లూ, అందువల్ల తను నిజంగా వాళ్ళకి నాథుడే అన్నట్లూ కొంచెంసేపు అనుకుని చూసేడు కాని, అత ననుకొన్నట్లు వాళ్ళతో అతని కా నిజమైన హృదయ పూర్వక సంబంధంలేదు. ఏదో తప్పనిసరి సంబంధం తప్ప.

బూటకపు ప్రేమికులను చంపిన పిమ్మట ఒడెస్సెస్ పగ తీర్చుకునే ఒడెస్సే మహాగ్రంథంలోని భాగం జ్ఞాపక మొచ్చింది అతని కప్పుడు. మహాకావ్యాలలోని ప్రతి పుటలోని సారాంశాన్నీ విడమర్చి చెప్పగల గ్రీకు గురువువద్ద శుశ్రూషచేసేపాటి భాగ్యం గ్రాఘూస్‌కు బాల్యంలో కల్గలేదు. ఇతరుల సహాయం లేకుండా తమంతటతామే చదువుకుని విద్యావంతు లయేవారిలా గ్రాఘూస్ ఆ ఉద్గ్రంథాలను చదివి తన కర్థమయి నంతమటుకు బోధపరచుకున్నాడు. అందుకే అటువంటి ప్రేమికులతో కాముక వ్యాపారం సల్పే బానిస స్త్రీలయందు ఒడెస్సేకున్న భయంకరమైన, అమానుషమైన ద్వేషం అతని కర్థంకాక గాభరా పడేవాడు. తను చంపిన ఆ కపటప్రేమికుల శవాలను మోసుకువచ్చి బయటపడేసి భోజనాల చావడి నేలపై బడ్డ రక్తపు మరకలను కడిగి వెయ్యమని ఆ బానిసస్త్రీల నత డెంతగా నిర్బంధించాడా అని ఆలోచించాడు. అప్పుడు వాళ్ళకు కూడా మరణశిక్ష విధించి తన కొడుకునే ఆ మరణశిక్ష అమలుజరపమని ఆజ్ఞాపించాడు ఒడెస్సెస్. తండ్రిని మించిన కొడుకు. ఒకేతాటికి పన్నెండు ముడులు వేసి ఒక్కొక్క ముడి కొక్కొక్క కుత్తుక వేలాడేటట్లు చేద్దామన్న భావం టెల మాఛస్‌కు తట్టినదే!

ఎందుకంత ద్వేషం? గ్రాఘూస్ ఆశ్చర్యపోయాడు. ఎందుకంత భయంకరమైన, జుగుప్సాకరమైన ద్వేషం? తనలాగే ఒడెస్సెస్ కూడా తన ఆడబానిసలతో పొందు గూడేవాడేమో. అయితే నీతివంతుడైన ఇథాకాలోని ధర్మమూర్తి యింటిలో యాభై మంది వ్యభిచారిణులైన బానిసస్త్రీలున్నారన్న మాట. ఇందుకేనా, ఇటువంటి వ్యక్తి కోసమేనా ఓరిమితో పెనిలోపియా దేశం నిరీక్షిస్త!

అయినా గ్రాఘూస్ చేసినది కూడా అదే. మరొకడితో పోయినంత మాత్రాన ఒక బానిసను చంపని నాగరికతావిశేషం కావచ్చు, ఎవరితోపోనీ నాకెందుకు అనే నిర్లక్ష్యమైనా అవచ్చు. కాని ఒడెస్సెస్‌కి బానిసస్త్రీలతో వుండిన సంబంధానికీ తన సంబంధానికీ ప్రధానంగా యేమీ తేడాలేదు. ఒకస్త్రీ యెటువంటిది అన్న ప్రశ్నతో యింతవరకూ అతనికి సంబంధంలేదు. పైగా యే విషయంలోని ప్రధాన ప్రాథమిక సత్యాన్నైనా గుర్తించగల తను యీ స్త్రీలోని యథార్థాన్ని గుర్తించలేకపోతున్నట్లు

చెప్పేడు సిసిరోతో. కాని తమాషా యేమిటంటే యిన్నాళ్ళకు, యిప్పటికి మనిషి అనిపించుకోగల ఆడది ఒకర్తె కనిపించింది. ఉన్న కష్టం అల్లా ఆమెను వెతికి పట్టుకోడమే.

ఒకదాసీ తలుపుతట్టింది. సంగతేమిటని గ్రాఘూస్ ప్రశ్నించగా అతను భోజనానికి పిలిచిన అతిథి వచ్చినట్లు చెప్పింది.

“అయితే ఒక్కక్షణంలో వస్తున్నా. అతనికేం కావాలో అన్నీ చూడండి. చినిగిన బట్టలతో అతను చూట్టానికి అసహ్యంగా కనబడవచ్చు. ఐనాసరే అతన్ని చులకనగా చూసేరంటే చావగొట్టేస్తా తెలిసిందా. చేతులూ కాళ్ళూ కడుక్కుందుకు వేడి నీళ్ళివ్వండతనికి. మంచి పళ్ళని టోగా కూడా యివ్వండి. అతని పేరు ఫ్లేవియస్ మార్కస్. పేరుపెట్టి పిలిచి మర్యాదగా చూడండి నే వస్తున్నా.”

మొదటి శిలువవద్ద పడిగాపులు పడుతూ కూచునివుండే యీ స్థూలకాయుడు శుభ్రంగా తయారయి సోఫాలో కూచున్నాడు. తన బానిసలు తను చెప్పినట్లు చేసినట్లు అతన్ని చూడగానే తెలిసిపోయింది. గ్రాఘూస్ ఆ గదిలో ప్రవేశిస్తుండగా గడ్డం పాముకుంటూ కూచున్న ఫ్లేవియస్ “వీటన్నిటికీ తోడు యీ గెడ్డం కూడా గీయిస్తే” అంటుండగా—

“నాకు చాలా ఆకలిగా వుంది. ముందు భోజనం చేయడమే మంచిది. ఈ రాత్రికిక్కడుండు ఫ్లేవియస్. ఉదయాన్నే మన మంగలి వస్తాడు. వాడిచేత పనిచేయించుకుని హాయిగా స్నానంచేసి, శుభ్రంగా భోజనంచేసి విశ్రాంతి తీసుకుంటే బాగుంటుంది. మంచిబట్టలూ, జోళ్ళూ యిస్తాలే; మనిద్దరిసైజూ ఒకటే; నా బట్టలు నీకు సరిపోవచ్చు.”

వాళ్ళిద్దరూ ఒడ్డూపొడుగూ ఒకేలాగ వుంటారు. చూసినవాళ్ళు యిద్దరూ అన్నదమ్ములేమో అనుకుంటారు.

“వాడిచ్చిన పనిలేనిపాటు వదలి, నా దగ్గరనుండి ఋణమో, పణమో పొందినందుకు సెక్టస్‌గాడు నిన్ను కేకలేస్తాడని మాత్రం భయపడకు.”

“నీకేం; చెప్తావు కబుర్లు. నువ్వుచెప్పక యింకెవరు చెప్తారులే” ఫ్లేవియస్ అసంతృప్తితో కలిసిన మూల్గుధ్వనించింది. “నీకు రోజులు బాగుపడ్డాయిలే గ్రాఘూస్. సంపద, సౌకర్యం, మర్యాద, గౌరవం, అధికారం, నీకేం? జీవితం పాలమీద మీగడలా వుంది నీమటుకు. కుళ్ళుతున్న బానిస శవాన్ని దగ్గరపెట్టుకుని పడిగాపులు కాస్తు వచ్చే పోయేవాళ్ళు దమ్మిడీ, ఏగానీ యిస్తారుకదా అని లేనిపోని కాకమ్మకథలన్నీ అల్లి అబద్ధాలాడుతూ కూచోడం యేమంత గర్వించదగ్గ ఘనకార్యమనీ?

అడుక్కు తినడం యింతకన్న కొంచెం అసహ్యకరమైనదే కావచ్చు. కాటికి కాళ్ళు చాచుకు కూచున్న నాకు యేదో కాస్త సహాయంచేసేడు సెక్టస్. ఇప్పుడు మళ్ళీ అతనిదగ్గఱకు వెళ్ళాననుకో. మళ్ళీ యే ముఖం పెట్టుకుని నాదగ్గఱకు వచ్చావు? ఫో! ఫో! నీ రక్షకుడు, హితుడు, ఆ గ్రాఛూస్‌దగ్గఱకే ఫో అంటాడంటావా కాదా? నువ్వంటే అతనికి కిట్టదు నీతో కలిస్తే నేనన్నా కిట్టదు."

"వీడి కిట్టడంతో యెవడికి లెఖ్ఖోయ్" గ్రాఛూస్ అన్నాడు.

"సెక్టస్ ఒక కప్పవెధవ, బొద్దింకగాడు. వాడికి నువ్వంటే కోపం వస్తుందనేనా నువ్వనేది? రానీ. వాడో చవకబారు పేటరాజకీయవేత్త. నే చెప్పిందిచెయ్యి. ఈ ఊళ్ళోనే నీ కోమంచి గుమస్తా ఉద్యోగం యిప్పిస్తా, నాలుగురాళ్ళు వెనకేసుకోవచ్చు. ఒకళ్ళను దేహీ అని అడగనక్కర్లేకుండా యే గొడవాలేకుండా బతకొచ్చు. అమ్మా, బాబూ, అనుకుంటూ ఆ సెక్టస్‌గాడిసేవ చెయ్యనక్కర్లేదు."

"నావల్ల ఉపయోగం ఉందన్నప్పుడు, తగలేసినంతమంది స్నేహితులుండేవారు నాకు. అప్పుడంతా మనవాళ్ళే. అందుకేలే చివరికి సందులలో పందిలా బ్రతకాల్సిన గతిపట్టింది."

"నువ్వు చెప్పినట్టేకట్టు, నువ్వు నా కిప్పుడుపయోగిస్తావు." అతన్ని మధ్యలో ఆపి గ్రాఛూస్ చెప్పుకుపోయాడు. "ఈ మూలగడం మాని తినడం ప్రారంభించు. దాన్ని తగలెయ్యి, రాకరాక అదృష్టంవస్తే యేదో చెప్పినట్లు సిరి రా మోకాలడ్డుతానంటావేమిటోయ్, అసలు నీ కెందుకా భయం?"

తిండీ, ద్రాక్షరసమూ ఫ్లేవియస్‌ను మెత్తబరిచాయి. పంచభక్ష్య పరమాన్నాలతో సుష్టుగా మృష్టాన్నం భుజించిన ఫ్లేవియస్ చల్లని, తీయని ద్రాక్షసారా సేవించి సోఫాకు జేర్లపడి కాళ్ళు చాచుకుని సుఖంగా కూచున్నాడు. అతని పెదవులపై చిఱునవ్వు గోచరిస్తుంది. అతని పెద్దబొజ్జ నెమ్మదిగా, తాపీగా పైకి లేస్తూ, పడుతూ వుంది.

"గ్రాఛూస్! ఐదేళ్ళ యీమధ్యన యెప్పుడూ యిటువంటి భోజనం చెయ్యలేదంటే నమ్ము. మంచి తిండికనక వుంటే వేరేమందు అక్కర్లేదు. అదే సరైన మందు. తస్సాదియ్యా యెటువంటి తిండోయ్! ప్రతిరోజూ యిల్లా తింటున్నావన్నమాట. బలేవాడివే. నా కేముందిలే, నేనో ముసలిపందిని అంతే, ఇంతకూ యిదంతా అనుభవించడానికి నువ్వర్హుడివేలే. అసలు తెలియక అడుగుతా; కోపగించుకుందుకు నాకున్న హక్కేమిటి? గుడ్డు. నువ్వేదిచెప్తే అది చెయ్యడానికి సిద్ధంగావున్నా. ఇంకా నాకు కొద్దిమందితో పరిచయం వుంది. కొద్దిమంది రౌడీలు, దొంగముండా కొడుకులు,

కొంతమంది వ్యభిచారిణులు, కులస్త్రీలు నన్నెరుగుదురు. ఐనా నీ అంతట నువ్వు మరొకడి సహాయం అపేక్షించనక్కర్లేకుండా యేపని చేసుకోలేవని నన్ను పిలిపించావు. నాకు చేద్దామనే వుందనుకో."

"మరికొంచం ద్రాక్షరసం కానీ చెప్తా" అంటూ ద్రాక్షరసం నింపిన గ్లాసు నతని కిచ్చి గ్రాఛూస్ చెప్పాడు: "ఫ్లేవియస్! నీలో కొన్ని మంచిలక్షణాలు వున్నాయని నా అభిప్రాయం. రోమ్‌లోవున్న ప్రతివాడినీ యెరిగి, మనుష్యుల ఆత్మలతో శరీరాలతో, బాధలతో వర్తకం చెయ్యగల నిపుణులు లేరనా నిన్ను పిలుస్తే. గొడవ చేసేవాడు నాకెందుకు? అనుకున్నది గొడవలేకుండా సజావుగా జరిగిపోవాలి."

"నేనేం గొడవ చెయ్యనే"—ఫ్లేవియస్ అన్నాడు.

"నాకు తెలుసు నువ్వు చెయ్యవని. అందుకే నిన్నుపిలిచాను. నాకోసం ఒక ఆడదాన్ని నువ్వు చూసిపెట్టాలి. డబ్బుకు వెనకతీసేరకం కాదు మనది. ఎంతైనా సరే, ఆమెనుమాత్రం తీసుకురావాలి. దీనికి బోలెడుఖర్చు వున్నదని నాకుతెలుసు."

"అదెటువంటి ఆడది చెప్మా? వీళ్ళని తగలెయ్య తొంబలు, తొంబలుగా వున్నారీ ముండలు బజారులో అమ్మకానికి. ఈ బానిసయుద్ధం అంతమయే సరికి వీళ్ళకి లెక్కేలేదు. నీ కెటువంటిది కావాలంటే అటువంటి దాన్నే తీసుకొస్తా. మొగాడిముఖం చూడని కన్యకావాలన్నా, కులట కావాలన్నా, లావుపాటిది, సన్నపాటిది, పొడగరిదాన్నీ, పొట్టిదాన్నీ, నల్లదైనా, తెల్లదైనా ఎటువంటిది కావాలంటే అటువంటిదాన్ని తీసుకురాగలను. ఎటువంటిది కావాలంటావు?"

"ఎటువంటిదీ కాదు," గ్రాఛూస్ నెమ్మదిగా అన్నాడు. "నా క్కావాల్సింది ఒకర్తే వుంది."

"బానిసేనా?"

"అవును."

"ఎవరది?"

"ఆమెపేరు వరీనియా. స్పార్టకస్ భార్య."

"ఆఁ—" ఫ్లేవియస్, గ్రాఛూస్‌ని వెదుకుతున్నవాడిలా చూసేడు. ఒక గుక్కెడు ద్రాక్షసారా త్రాగేడు. "ఆమె యెక్కడుందంటావు?" అతన్నడిగేడు.

"నాకు తెలియదు."

"ఆమెను తెలుసా?"

"తెలుసు, తెలియదు. ఆమెను నేనై యెప్పుడూ చూడలేదు."

"ఆఁ—"

"ఆఁ యేమిటోయ్. నీ ఆఁ తగలెయ్య. సోదె చెప్పేవాడిలా 'ఆఁ' అని సాగదీస్తా వేమిటి?"

"ఏదో ఆలోచించి చెప్దామని అల్లా అంటుంటాను."

"ఏదో చేసిపెట్తావుకదా అని నీకు డబ్బిద్దామనుకున్నాను. కాని వినోదంగా ఆలోచించే తమాషా చెయ్యగలవని కాదు. నాకేం కావాలో నీకు తెలుసు."

"ఒక ఆడది కావాలి నీకు. ఆమె ఎక్కడుందో తెలియదు. ఎప్పుడూ నువ్వు చూడనూలేదు. పోనీ యెల్లాగుంటుందో తెలుసా?"

"తెలుసు. పొడుగ్గా వుంటుంది. మంచి అంగసౌష్టవం కలదే కాని, సళాకులా వుంటుంది. ఎత్తయిన రొమ్ము. జర్మను జాతిది. జర్మనువాళ్ళకుండేలాగే ఒట్టి గడ్డిలాటి జుట్టు, నీలపుకళ్ళు, చిన్నచెవులు, ఎత్తయిన నుదురు, చిన్నదికాని నిడుపైన ముక్కు, లోతుగా వుండి దీర్ఘంగా చూచేకళ్ళు, కింది పెదవి కొంచెం పెద్దదేమో అనిపిస్తుంది. వచ్చీరాని లాటినుభాష మాట్లాడుతుంది. చాలామటుకు రానట్లే నటిస్తుంది. థ్రేషియన్లు మాట్లాడినట్లుగా మాట్లాడుతుంది గ్రీకుభాష. ఆమెకు రెండు మూడు నెలల క్రితమే ఒక కొడుకు పుట్టాడు. వాడీపాటికి చచ్చేవుంటాడు. పిల్లాడు చచ్చినా పాలుంటాయిగా, పిల్ల చచ్చినా పురిటికంపు పోదంటారు. ఏమంటావ్?

"పోనూవచ్చు. ఆమె వయస్సెంత?"

"నాకు సరిగా తెలియదనుకో. 23, 27 మధ్య ఉండొచ్చు. సరిగ్గా తెలియదు."

"అది కూడా చచ్చిందేమో."

"చస్తే చావనూవచ్చు. అదికూడా నువ్వు తెలుసుకోవాలి. చచ్చివుంటే చచ్చినట్లుగా ఋజువు చెయ్యగలగాలి. కాని చచ్చిపోయిందనుకోను. ఆత్మహత్య చేసుకునే రకంకాదు. అటువంటిదాన్ని సులభంగా చంపెయ్యరు."

"ఆత్మహత్య చేసుకోదని నీకెల్లా తెలుసు?"

"నాకు తెలుసు అంతే. అదెల్లా, యిదెల్లా అంటే చెప్పలేను కాని నాకు తెలుసు."

"స్పార్టకస్ ఓడింపబడిన తరువాత అతని మకాంలోని పదివేలమంది స్త్రీలనూ, పిల్లలనూ బందీలుగా తీసుకురాలేదూ?"

"ఇరవై రెండువేలమందున్నారు వాళ్ళు; కాని అందులో పన్నెండువేల మందిని సైనికులు కొట్టేసేరు. దీనివల్లే సైన్యాలకపవాదు వచ్చింది. దాన్ని కప్పిపుచ్చుకోడానికి యుద్ధసమయంలో దోపిడివల్ల వచ్చిన తన భాగాన్ని ప్రభుత్వ ఖజానాలకు యిచ్చేశాడు క్రాసస్. ఇదేమంత ఘనకార్యం కాదులే. ఎందుకంటే అప్పుడితనికి ఆ దోపిడీలో

వచ్చిన భాగమే అతిస్వల్పం. కాక బానిసయుద్ధంలో దోపిడీచేస్తే లభించేదేముందిలే. పైగా ఈ మహానుభావుడు చేసిన మరొక ఘనకార్యమేమంటే తానై ఒక్క బానిసనైనా తీసుకోకపోవటం, బజార్లో చవగ్గా దొరికేటప్పుడు కక్కుర్తిపడి పేరుపోగొట్టుకోవడం యెందుకు?"

"ఆ ఆడాళ్ళలో వరీనియా వుందా?"

"ఉండొచ్చు; ఉండకపోవచ్చు. ఆమె వాళ్ళ నాయకుడి భార్య. అందుకే బానిస లామెను కాపాడ్డానికి ప్రత్యేకశ్రద్ధ తీసుకున్నారేమో."

"ఏమోకాని, యేదో సమానత్వం అంటూ యేడిసినవాళ్ళు ఒకళ్ళ విషయంలో ఒకలాగ, మరొకళ్ళ విషయంలో మరొకలాగ జాగ్రత్త తీసుకుంటారా?"

గ్రాఛూస్ తనగ్లాసులోని ద్రాక్షసారా పూర్తిచేసి ఒక వేలితో అతనికేసి చూపిస్తూ అడిగాడు: "నీ కీపని చెయ్యాలని వుందాలేదా? ఇదేమీ మాటలతో అయ్యేపని కాదు. దీనికోసం కష్టపడాలి తెలుసా ఫ్లేవియస్."

"అదంతా నాకు తెలుసు. ఎంతకాలంలో యిది జరగాలంటావు?"

"మూడు వారాలు."

"ఆ, అదీ, అబ్బే"—ఫ్లేవియస్ నిస్సహాయుడిలా చేతులుచాచేడు. "అంత కొద్దికాలంలో యిటువంటిపని సాధ్యపడుతుందీ? కేపువాకి, సిసిలీకి, సిరాకూస్‌కు ఒక చోటికేమిటి ఆఖరుకు స్పెయిన్‌కు, ఆఫ్రికాకుకూడా మనుష్యులను పంపి గాలించాలి తెలుసా. నా కష్టంకూడా ఆలోచించాలి. కాని యింత తక్కువకాలం నిర్ణయిస్తే యెలా?"

"ఎంత ఆలోచించాలో అంతా నేనాలోచించా. ఎల్లాగైతే అల్లా కానీ. ఆ సెక్టస్‌గాడి దగ్గరకే పోయి వాడుపెట్టే ముష్టిమెతుకులు తిని బ్రతుకు."

"చంపేసేవు గ్రాఛూస్, అంత కోపమేమిటయ్యా నీకు? ఎంతమందినో కొనాల్సి వస్తుందనుకో. నువ్వు చెప్పిన వర్ణనకు మమ్మూర్తులా సరిపోయే జర్మన్ స్త్రీలెంతో మంది వున్నారు."

"చాలామందే వున్నారని నాకు తెలుసు. కాని నాకు కావలసింది నా వర్ణనకు సరిపోయిన జర్మన్ స్త్రీ కాదు; నే చెప్పినట్లుండే వరీనియాయే కావాలి."

"ఆమె నాకు కనపడిందే అనుకో. అయితే యెంత ధర యిచ్చి కొనమంటావు?"

"అవతలివాడు యెంతధర అడిగితే అంత. ఎంతయినా సరే, నేనేమీ అనను."

"సరే గ్రాఘస్ ఖరారు. ఆ సారా మరో గ్లాసుడు పోయించు." సారా పోయ బడింది. సోఫాకి జేర్లబడి త్రాగుతూ తనకీ పని కల్పించిన గ్రాఘస్‌ను పరీక్షగా చూస్తున్నాడు ఫ్లేవియస్. "నాకు నేర్పు వుంది. ఏమంటావ్ గ్రాఘస్?"

"లేకేం, ఉంది."

"కాని నేను బీదవాడిగానే ఉండిపోయాను. నే ముట్టినదల్లా మట్టి ఐపోయింది. దానికేంగాని నిన్నొకటి అడగదలుచుకున్నా. నీకు చెప్పాలని లేకపోతే మానెయ్యి; కాని కోపం తెచ్చుకోకు."

"అడుగు."

"ఇది నీకెందుకు గ్రాఘస్?"

"ఇంతట్లోనే నాకు కోపం వస్తుందనుకుని భయపడ్డావా? మేం యిద్దరమూ పొందుకూడాల్సిన సమయం ఆసన్నమైంది. సమయం మించిందనికూడా చెప్పవచ్చు. ఆమె యేమీ యెలనాగజవ్వనీకాదు; నేనేం పిక్కలాటి యువకుణ్ణికాదు. ఇంక ఆలస్యం యెందుకూ అని."

# 3

ఈనాడున్నన్ని రకరకాలయిన మార్పులు లేక నాటి ప్రపంచం కొంచెం చిన్న దేమో అనిపిస్తున్నది. అనుకున్న మూడు వారాల గడువూ పూర్తికాకుండానే పని విజయవంతంగా ముగిసిందని చెప్పడానికని ఫ్లేవియస్ తిరిగి వచ్చాడు. చేతులోపడ్డ నాణెం హృదయాన్నే మార్చగలదు అనికదా ప్రతీతి. పూర్వంలా కాక ఫ్లేవియస్ మంచి దుస్తులు ధరించి నీటుగా, గోటుగా తయారయాడు. కష్టమైన కార్యాన్ని నేను కదా అతిసులభంగా సాధించగల్గిన మొనగాడిని అన్న అహంభావం అతనిలో పూర్తిగా వుంది. గ్రాఘస్‌తో కూచుని ద్రాక్షసారా సేవిస్తూ తనకు తెలిసిన సమాచారమంతా తమాషాగా, మజాగా చెప్పుకుపోతున్నాడు. నిజంగా దీన్ని సహించగలగడం గ్రాఘస్‌కు మహా కష్టమనిపించింది.

"ఎంత గొడవో ఆలోచించు" మొదలెట్టేడు ఫ్లేవియస్.

"అంత గొడవైన పనీ రొట్టెకు రేవేంటి లెమ్మని యేదో ఒకచోట ప్రారంభం చేశా. మొదట, బానిసయుద్ధంలో కొల్లగొట్టిన వస్తువులు పంచుకున్న సైనికోద్యోగుల వద్ద సమాచారం సేకరించడానికి పూనుకున్నాను. నా ఉద్దేశ్య మేమిటంటే యీ వరీనియాయే కనుక మంచి అంగసౌష్టవం వుండి అందంగా ఉన్నదే అయితే ఆమె యే పెద్ద ఉద్యోగి దగ్గరో ఉంటుంది కాని అటువంటిదాన్ని మామూలు సిపాయిగాడికి

అందనివ్వరని. ఈ విధంగా బానిసలను యెవడిమటుకువాడు స్వంతఆస్తికింద జమ కట్టెయ్యడం చట్టవిరుద్ధమే. పైగా యీ ఉద్యోగులు ఒకళ్ళా యిద్దరా? ఏకంగా అయిదు వందలమంది ఉన్నారు. ఇంక వీళ్ళ సంగతేమిటయా అని అడిగితే నాలుగింట మూడు పాళ్లు నోళ్ళు మెదపరు. పోనీ ఆ మాట్లాడినవాళ్ళయినా ఆకుకి అందకుండా పోకకు పొందకుండా యెందుకూ ఉపయోగంలేని కబుర్లు చెప్తారు. అవున్లేమరి; చట్టవిరుద్ధంగా పని జరిగినపుడు యిదీ యథార్థం అని యెవడు చెప్తాడులే. చూసేవా ఎంతకష్టమో? ఎల్లాగయినా అదృష్టం మనవైపుంది. కొందరికి జ్ఞాపకం ఉంది. బానిసలు ఓడిపోయారన్న వార్త చేరేసరికి వరీనియా నొప్పులు పడుతోంది. అప్పుడే నువ్వుచెప్పిన పిల్లాడు పుట్టేడు. ఆ పిల్లాడిని క్షణంవదలక అంటిపెట్టుకు కూచునేదని జ్ఞాపకమున్నవాళ్ళు చెప్పేరు. ఆమె వరీనియా అనీ, స్పార్టకస్ భార్య అనీ వాళ్ళకి తెలియదు. ఆ బానిసలది పట్నం అంటావో, పల్లె అంటావో, మకాం అంటావో యేదో ఒకటి దానిమీదకి క్రాసస్ ఒక అశ్వదళాన్ని పంపించాడు. బానిసలోడిపోయిన వెంటనే ఆ దళం వెనక సైనికులుకూడా వెళ్ళేరు. బానిస స్త్రీలుకాని, అక్కడున్న పదమూడు పధ్నాలుగేళ్ళ వాళ్ళుకాని యెవరూ మనవాళ్ళని ప్రతిఘటించలేదు. గాభరాయెత్తిపోయారంటే నమ్ము. వాళ్ళకి తెలిసింది బానిససైన్యం తుడిచిపెట్టుకు పోయిందని. యుద్ధానంతరం సైనికు లెలా వుంటారో నీకు తెలియదా? బానిసలతో యుద్ధమంటే మాటలతో పనికాదు. యుద్ధం అంటే యీ కవాతులు చెయ్యడమూ కాదు; సర్కస్సులోవేసే కోతిగంతులూ కావు. వాళ్ళు—"

"చంపుతున్నావు. సైనికుల అప్పటి మనస్తత్వాన్ని సింహావలోకనం చెయ్యమని యెవ డేడిసేడు. అవసరమైన విషయాలు చెప్తే బాగుంటుందను కుంటా."

"అబ్బే. పరిస్థితి వర్ణించుకొచ్చానంతే; అప్పుడు మన సైనికులు కోపంతో మండిపోయారు. కాబట్టే మొదట్లో యెంతోమంది బానిసలను అనవసరంగా, మతి లేకుండా చంపేసేరని చెప్తామనే ఆ గొడవ ప్రస్తావించాను. వరీనియా కప్పుడే పురుడొచ్చింది. ఆఁ! కాక, బానిస బిడ్డడు నిలువెత్తునా పోసిన బంగారమంత విలువైనవాడా యేం? తెలియ కడుగుతా! వాళ్ళు చెప్తుంటే నా కొక సంగతి తెలిసి పోయింది. ఒక సైనికుడా పిల్లాడిని ఒక కాలు పట్టుకుని గుడారం రాటకేసి కొట్టి చంపుదామని పైకెత్తేసరికి క్రాసస్ అడ్డుపడి ఆ సైనికుడిని ఒంటిమీద తెలివి లేకుండా చావకొట్టేడట. క్రాసస్ అల్లా చేసేడని చెప్తే ఎవడైనా సందేహిస్తా డంటావా?"

"ఎవడైనా క్రాసస్‌గురించి సందేహిస్తాడా లేదా అన్న సంగతి నా కనవసరం. ఇంత పట్టిబుర్రేమిటోయ్ ఫ్లేవియస్? నీకు వరీనియా కనిపించిందా? ఆమె నాకు లభించే అవకాశం ఉందా? ఆమెను నువ్వు కొన్నావా లేదా?"

"కొనలేకపోయాను."

"ఏం?" గ్రాఛూస్ పెద్దగా గర్జించాడు. ఊహించుకోలేనంత కోపంతో లేచి నిలబడ్డాడు. పర్వతంలాటి యీ మనిషి ఫ్లేవియస్‌ను సమీపించేసరికి అతను కుర్చీలో వెనక్కి తగ్గి హడలిపోతూ కూచున్నాడు. గ్రాఛూస్ అతని కంఠం దగ్గిర చొక్కాలోకి చెయ్యిపోనిచ్చి చొక్కా బట్టుకుని ఒక వుండలా చుట్టి చేత్తో పుచ్చుకుని ముందుకూ వెనక్కూ వూపుతూ అరిచాడు. "ఏం? ఏరా పనికిరాని పందీ? అది చచ్చిందా బ్రతికే వుందా? నన్ను బోల్తా కొట్టించడానికి చూసేవంటే నీ పుచ్చె కుళ్ళుకాలవలోపడి దొర్లు తుంది తెలుసా?"

"ఆమె చావలేదు."

"ఓరి మట్టిబుర్రా! రసహీనపుగుల్లా? ఆ బుర్రలో వున్నా గొర్రె పేడా? దాన్నెందుకు కొనలేదూ అంటే?" ఫ్లేవియస్‌ను వదిలేసేడు కాని అక్కడే నిలబడ్డా డింకా.

"తగ్గు మహాశయా! తగ్గు!" ఫ్లేవియస్ కూడా గట్టిగా అరవడం ప్రారంభించాడు. "నువ్వు నన్నోపని చెయ్యమన్నావు. అది నే చేసుకొచ్చా. గ్రాఛూస్! నీ కున్నంత డబ్బు నాకు లేకపోవచ్చు. అంతమాత్రంచేత నోటికొచ్చినట్లు మాట్లాడ్డానికి నీ కున్న హక్కేమిటి? నేను నీ బానిసనుకాను. ఇప్పటికే యేమిటిరా భగవంతుడా యిల్లా తగులబడ్డానా అని అర్థంకాక నే నేడుస్తుంటే మరింత యేడ్పించడం నీ కేమన్నా బాగుందీ?"

"క్షమించాలి పొరపాటే."

"ఆమెను అమ్మడానికి యెవరూ సిద్ధంగా లేరు. కాబట్టే కొనలేకపోయా, అంతే."

"ధరెంత?"

"ధరాలేదు, గిరాలేదు. ఆమె క్రాసస్ దగ్గరుంది. వాడింట్లోనే ఉంది. దాన్నెవరూ అమ్మదలుచుకోలేదు. నేనేమీ ప్రయత్నం చెయ్యకుండా చవట వెధవలా సిద్దన్న అద్దంకి వెళ్ళనూ వెళ్ళాడు రానూవచ్చా డన్నట్లు చేసుకొచ్చాననా నీ అభిప్రాయం? క్రాసస్ కేపువాలో ఉన్నాడు. నే నతని యేజంట్లతో వ్యవహారం కదిపాను. వరీనియా గురించి సంభాషణ వచ్చేసరికి వాళ్ళ మూతులు బిగుసుకు పోయేవి. ధర యింతని కాని, యింత

ఉండొచ్చునని కాని, అమ్మేతారనికాని యేమీ చెప్పరు వాళ్ళు. వాళ్ళ చేతులు తడిపాను. దానికీ వాళ్ళు లొంగలేదు. దీన్ని తప్ప ఆ యింటిలోని మరే బానిసముండ నయినాసరే యివ్వగల యేర్పాట్లు చేస్తామన్నారు. ఈ మధ్యే క్రాసస్ చక్కని యీజిప్షియన్ గుంట నొకదాన్ని కొన్నాట్ట. ఎలాగో అల్లాగ దాన్నేనా యివ్వగలంకాని యీ వరీనియా గురించి ఆశ వదులుకోమంటారువాళ్ళు."

"అల్లాటప్పుడు వరీనియా అదే అనిగాని, ఆమె క్రాసస్ యింట్లోనే వుందని కాని రూఢిగా యెల్లా తెలిసింది?"

"క్రాసస్ బట్టలూ అవీ సర్దే బానిస నొకదాన్నడిగాను. క్రాసస్‌కి కుటుంబకలత లేవీలేవనీ, అతని యింట్లో అంతా సజావుగా సాగిపోతోందనీ అనుకుంటారేమో. ఏమీ లేదు. వీడింకా యెందుకు బ్రతికున్నాడురా బాబూ అని బాధపడే కొడుకొకడూ, వేరే కాపురం ఉంటూ యేదో శుభముహూర్తం చూచుకుని మొగుణ్ణి గొంతుకోసి చంపుదామన్న దృఢనిశ్చయం గల భార్యా, యిది అతని కుటుంబ వరుస. బలే గొడవలే. సమాచారం సంపాదించగలిగాను కాని వరీనియాను సంపాదించలేక పోయాను."

"క్రాసస్ ఆమె నెందుకు కొన్నాడో తెలుసుకోలేక పోయావా? వాడి కెందుకో అది?"

ఫ్లేవియస్‌కి కొద్దిగా నవ్వొచ్చింది. "తెలుసుకోకేం. క్రాసస్ ఆమెను ప్రేమించాడు!"

"ఏమిటీ?"

"నిజమే. మహాసేనాని ప్రేమలోపడ్డాడు."

అప్పుడు గ్రాఘూస్ నెమ్మదిగా, బరువుగా, ఖచ్చితంగా అన్నాడు. "ఫ్లేవియస్! ఈ విషయం పైకి పొక్కినట్లు నాకు తెలిసినా మనిద్దరంకాక మూడోవాడెవడైనా యీ మాట చెప్పుకొంటున్నట్లు నా చెవినిపడ్డదా చూసుకో యేం చేస్తానో నిన్ను; శిలువకు వేలాడ దీయిస్తా."

"నీ అసాధ్యంకూల. యేమిటీ మాటలు? నీ యిష్టం వచ్చినట్లు చేసెయ్యడానికి నువ్వేమైనా భగవంతుడివా?"

"కాదు కాదు మన రోమన్ కులీనులు - వెర్రివెధవలు - వాళ్ళనుకున్నట్లుగా నేననుకోను యీ భగవంతుడిని గురించి. నా కే దేవుడితోనూ దూరపు సంబంధంకూడా లేదు. రోమను రాజకీయవేత్తలందరికీ ఆ భగవంతుడితో యెంత సంబంధం ఉందో నాకూ అంతే వుంది. ఒక మంచి శిలువ తయారుచేయించి దానికి నిన్ను వేలాడ

తీయించగల శక్తికూడా వుంది నాకు. ఈ విషయం గురించి యెవడికైనా వుప్పందిందా నీగతి అంతే; తెలిసిందా?"

# 4

మర్నాటి మధ్యాహ్నం పట్నంలోని స్నానశాలకు బయలుదేరేడు గ్రాఘస్. ఆ రోజులలో స్నానశాలకు పోవడం, ప్రత్యేకం యేదో ఒక రాజకీయ ప్రయోజనం సాధించడానికన్నమాట. దానికి ఫలితంకూడా లేకపోయేదికాదు. నానాటికి యీ స్నానశాలలే రాజకీయ, సాంఘిక ప్రాముఖ్యత నందుకుంటున్నాయి. మేజస్ట్రేటులు, సెనేటర్లు యిక్కడే తయారయేవారు. లక్షలాదిధనం చేతులుమారేది. అదే వ్యాపారసంస్థ. అదే రాజకీయ చర్చల వేదిక. కొన్నాళ్ళకొకమారయినా అక్కడికి పోవడమనేది ఒక ఆచారమైపోయింది. గ్రాఘస్ ఆ ఆచారాన్ని తరచు పాటించేవాడు. ఆ స్నానశాలలలో ఒకటీమధ్యనే నవీన పద్ధతులలో కట్టబడింది. మరో రెండు పూర్వం కట్టినవే అయినా బాగానే ఉన్నాయని అతని అభిప్రాయం. స్నానశాలలలోనికి పోడానికయే ఖర్చు సామాన్యునికి అందుబాటులో ఉండనిదే అయినా అక్కడికి చాలామంది పోయేవారు. ఈ హోదా అన్నది సంఘాన్ని తరగతులుగా చీల్చుతుంది. ఈ తరగతులలో హోదాలేని అలగాజనం స్నానశాలలకుపోయే అవకాశం కలిగి ఉండేవారేకాదు.

వాతావరణం ఏమాత్రం బాగున్నట్లు తోచినా రోమన్లంతా యింకా సాయంత్రం పడుతోందనగానే యిళ్ళు వదిలి బైటికొచ్చేస్తారు. చవకగా బానిసలు లభించడంవల్ల అంతకన్న ఎంతో ఖరీదైన రోమన్‌కార్మికుల సంఖ్య క్షీణించసాగింది. కాని వాళ్ళు కూడా 'స్వతంత్రులు' కనుక మధ్యాహ్నం ఒంటిగంట అయేసరికి బైటికొచ్చేస్తారు. ఈ విధంగా యెంత యెక్కువగా బైటికొచ్చేసి యెక్కువకాలం ఊరిమీదే గడిపితే అంత యెక్కువగానూ ప్రభుత్వమూ, ప్రజలూ పెట్టే బిచ్చపు మెతుకులు తిని బ్రతకొచ్చు. మధ్యాహ్నం స్వతంత్రుని వినోదసమయం. ఆ సమయమే రోమన్ పౌరునికి క్రీడోత్సవకాలం.

నూటికీ కోటికీ ఒకమాటు గుర్రపుపందాలు చూడ్డం తప్ప గ్రాఘస్‌కి ఇంకేమీ ఆసక్తిలేదు యీ ఆటలంటే. ఒక విషయంలో గ్రాఘస్, అతని సమకాలికులందరితో పోల్చిచూస్తే, ఎంతో తేడాగా కనిపిస్తాడు. ఇద్దరు మనుష్యులు దిగంబరులుగా, యిసుకలో నిలబడి, ఒకరినొకరు రక్తం కాలువలుకట్టి ప్రవహించేదాకా కత్తులతో చీల్చుకుంటూ, మాంసం ముద్దలు తెగి శరీరాలకు వేలాడేవరకూ కోసుకుని జుగుప్సాకరంగా పోరాడటం అతను చూడలేదు. అతని కా ప్రదర్శనం చూడ్డం ఆసక్తి మాట

అటుంచి, అసలదంటే అతనికెంతో అసహ్యం. ఒకమనిషి వలలో గింజుకుంటుంటే మరొకడొక త్రిశూలంతో అతని కళ్ళల్లో పొడిచి, పొట్టలో పొడిచి బాధపెడుతుంటే, బాధలో అరుస్తుంటే చూడడం అతనికేమీ సరదాగా ఉండదు. అప్పుడప్పు డెప్పుడైనా యీ గుర్రప్పందాలే చూచి ఆనందించేవాడు. మళ్ళీ యీ రథాల పందేలంటే అతనికి చెడ్డవిసుగు. రథాలు బాగా పరిగెత్తాయా లేదా అన్నదికాక రథచోదకులమధ్య శారీరక మైన పోటీగా తయారయి, యెవరో ఒక చోదకుడి తల పగిలేదాకానో, యెముకలు విరిగేదాకానో ప్రేక్షకులువేసే కేకలూ, యిచ్చే పిచ్చి హుషారూ యిదంతా చూస్తే అతనికి చెడ్డచిరాకు. అతను తక్కిన వాళ్ళకన్న మెత్తని స్వభావం కలవాడనికాదు. కాని యీ పిచ్చి అతనికి నచ్చదు. పోనీ నాటకాలంటే ఆసక్తి ఉందా అంటే అదీ లేదు. ఈ నాటకాలెందుకో అతనికి ఆలోచించినా తెలియలేదు. తప్పనిసరై, ఊళ్ళో పెద్దలంతా వెళ్ళాల్సిన సమయం వచ్చినప్పుడు మాత్రం నలుగురితోబాటూ తను కూడా నాటకం హాలులో ఒక కుర్చీలో కూలబడతాడు; అంతే.

మెలికలు తిరిగి, యిక వీటికి అంతులేదా అని తోచే మురికి రోమన్ రోడ్ల వెంబడి నడిచిపోవడం అంటే అతనికి సరదా. రోమ్, తనరోమ్, తను ప్రేమించే తన మాతృమూర్తి రోమ్—అతని భాషలో అతని భావం వ్యక్తం చేయాలంటే మాత్రం రోమ్ ఒక కులట అని చెప్పాలి. ఆ కులటగర్భంలోంచి యితనొచ్చాడు. రోమ్ మురికి రోడ్ల మీద పడి దొర్లమని యితన్నామె ప్రసవించింది. కులటయినా, మరెవరైనా ఆమె అతని మాతృమూర్తి. అందుకే అతనామెను ప్రేమిస్తున్నాడు. ఆమె కూడా యితన్ని ప్రేమిస్తూనే ఉంది. ఒక తల్లి గురించిన పూర్వపుకథ నా సిసిరోకి యెందుకు చెప్పేదో యెల్లా చెప్పగలడు? ముందు సిసిరో రోమ్‌ను ప్రేమించగలగాలి. దుష్టమైన దుర్మార్గమైన స్వభావం కలదీ రోమ్ అని తెలిసి మరీ ప్రేమించగలగాలి.

ఈ దుష్ట దుర్మార్గ స్వభావమే రోమ్‌కు తెలుసు. "నేను నాటకాని కెందుకు పోవాలి?" మేధావియైన స్నేహితుడి నొకప్పు డితడడిగాడు. "మన వీధులలో మన కళ్ళముందు ప్రత్యక్షంగా జరిగేదానిలో ఒక వెయ్యోవంతైనా ఆ నాటకరంగంమీద చూపించగలరూ?"

అవును, ఆ రోడ్లమీద చూడవలసింది వుంది. "ఇల్లా చూస్తూ యెన్నిమార్లు తిరగాలో యీ రోడ్లమీద?" అతననుకున్నాడు. ఆ రోజు దైవ, పితృ కార్యాలు చేసే టంత శ్రద్ధతో కానిచ్చా డీ రోడ్డు పర్యవేక్షణ కార్యక్రమం.

మొదట కూరల మార్కెట్టులోకి పోయాడతను. మరో గంటలో కొట్లు మూస్తారు. అక్కడ అంగళ్ళలోని ఆడాళ్ళు చెవులు గింగురుపెట్టేలా అరుస్తూ కేకలేస్తూ

అమ్ముతున్నారు. ఏవేవో బేరాలు సాగిపోతున్నాయి. లోపలికి పోవాలంటే వాళ్ళందరినీ నెట్టుకుని తోసుకుని మరీ వెళ్ళాలి. కాని గ్రాఖూస్ నెమ్మదిగా వీలయినంతవరకూ ఎవరినీ నెట్టకుండా పోతున్నాడు. మందమారుతంలో మహారాజశీవితో మెల్లిన కదిలే పెద్ద యుద్ధ నౌకలా పోతున్నా డతను. రోమ్ ఆరగించే ఆహారం లభ్యమయేచోటు యిదే. ఎన్నో రకాల పెరుగులున్నాయిక్కడ. రాతిలా కరుడుకట్టిన నలుచదరపు పెరుగుబిళ్ళలు, కోస్తేకాని తెగని పెరుగు యిక్కడ దొరుకుతుంది. ఉడకబెట్టిన చేపలూ, బాతులూ, పందిమాంసం ముక్కలూ, గొడ్డుమాంసం చట్టలూ, గులాబీరంగుగా కనబడుతున్న వేలాడే గొర్రెమాంసం ముద్దలూ, ఆఖరుకి ఉప్పు చేపలూ, ఘాటుగా కమ్మగా వాసన వేసే ఊరగాయలూ, ఒకటేమిటి యెన్నో వున్నాయి. సబైన్ కొండలనుండి ఎగుమతి అయిన యెన్నోరకాల నూనెలతో నిండిన జాడీలూ, గూనలూ, గాల్ దేశంనుండి వచ్చిన మంచి మంచి రుచికరమైన మాంసపు చట్టలూ, యెక్కడబడితే అక్కడే వేలాడే పేగుల పోగులూ, బాగా వండిన జంతువుల నాలికలూ, పచనమయాక కర్ర గిన్నెలలో పెట్టిన లేత పశుమాంసమూ యేవేవో యెన్నెన్నో వున్నాయక్కడ.

కాయగూర లమ్మేచోట అతను తచ్చాడాడు. మొన్న మొన్నటివరకూ, ప్రతి రోమనురైతూ తన పొలంలో కాయగూరలు పండించేవాడు. నేలమీద ఆకుపచ్చని వేదికలలా కనబడే రకరకాల పాదులుపెట్టి అనేకములైన కూరలు పండించేవాడు. అప్పుడు రోమ్ యెన్నిరకాల శాకపాకా లారగించిందని! ఆ రోజులు గ్రాఖూస్‌కు బాగా జ్ఞాపకమున్నాయి. అందులోను నానాటికి బజారులో కూరలుతగ్గి వాటిధరలు హెచ్చయి పోవడం చూస్తున్నకొద్దీ ఆ రోజులు మరీ జ్ఞాపకం వస్తాయి. కాని యిప్పుడో? భూస్వాములకు బార్లీ, వరి, గోధుమ యిటువంటివాటితో పనిలేదు. ఇదే కావాలనిలేదు. బాగా డబ్బు సంపాదించగల వాణిజ్యపు పంటలైతేసరి. ప్రజల ఆహారంగురించి కన్న తమ ధనాశకాహారం దొరుకుతుంటేసరి; వాళ్ళకుచాలు. అల్లా లాభాలు సంపాదించడమే వాళ్ళ విధి. అందుకే యిప్పుడు కాయగూరలు సామాన్య మానవుని అందుబాటులో లేకుండాపోయినై. ఐనప్పటికీ మేటలుమేటలుగా ఉన్న ముల్లంగిదుంపలూ, ఎర్రగా తెల్లగా కనిపించే తీపిదుంపలూ, అరడజను రకాల ఆకుకూరలూ, జీవం ఉన్నట్లగుపించే తోటకూరకాడలూ, అనేకరకాల చిక్కుళ్ళూ, కాయధాన్యాలూ, కర్బూజాపళ్ళూ, కేబేజీపువ్వులూ, రంగురంగుల రకరకాల కూరలూ, ఆఫ్రికానుండి వచ్చిన పచ్చని నిమ్మకాయల రాసులూ, ఎర్రని దానిమ్మపళ్ళూ, యాపిల్‌పళ్ళూ, అత్తిపళ్ళూ, అరేబియానుండి దిగుమతి చేసుకున్న ప్రశస్తమైన ఖర్జూరమూ, యీజిప్టునుండి వచ్చిన ద్రాక్షపళ్ళూ వగైరా యెన్నో అక్కడ లభ్యమవుతాయి.

"వీటిని చూస్తుంటే యెంత హాయిగా వుంటుందో!" అత ననుకున్నాడు.

యూదులపేట చివరనుండి అతను పోతున్నాడు. వాళ్ళతో అతనొక రాజకీయ వేత్తలాగనే వ్యవహరించేవాడు. ఈ యూదులెంత గమ్మత్తయినవాళ్ళో! ఎంతోకాలంగా రోమ్‌లో వుంటూవుండికూడా వాళ్ళ భాష వాళ్ళు మరచిపోరు. వాళ్ళ దేవుడ్ని వాళ్ళు పూజించక మానరు. అవే గడ్డాలతో, పొడుగాటి చారలవస్త్రాలు కప్పుకొని తిరుగుతారు. వాతావరణం యెల్లాగున్నా అవే దుస్తులు. కోర్టులలోనూ, క్రీడలలో, ఉత్సవాలలో వాళ్ళు సాధారణంగా కనబడరు. ఎప్పుడోకాని రోడ్లమీద కూడా తిరగరు. ఎక్కడా కనిపించరు వాళ్ళపేటలలో తప్ప. వినయం వుట్టిపడుతున్నట్లుగా, ఆత్మవిశ్వాసంతో, ఒంటరిగా వుండే యీ యూదులే "కార్తేజికన్న యెన్నో రెట్లధికంగా రోమ్ తాలూకు జీవరక్తాన్ని పీల్చెయ్యగిలరు" అనుకునేవాడు వీళ్ళను చూసినప్పుడల్లా.

తిన్నగా సరళరేఖలా పోతున్న ఒక పెద్ద వీధిలో అతనున్నా డిప్పుడు. పట్టణ పటాలమొకటి బూట్లచప్పుడు చేసుకుంటూ పోతోంది. ఒక దుకాణం యెదుట, రోడ్డు ప్రక్క నిలబడి ఆ పటాలాన్ని చూస్తున్నాడు. ఏ పటాలం వెళ్ళినా దానివెనుక చంటి పిల్లలుపడి పరిగెత్తడం మామూలు. అత నిటూఅటూ చూస్తాడు. ఇక్కడొక అరేబియావాడు, అక్కడో సిరియావాడు, మరొక సబేరియన్, యితరదేశస్థు లక్కడ నిలబడి రోమన్ బలాల బూట్లచప్పుడు వినేవారు.

అంబరచుంబితా లనదగిన యెత్తయిన అద్దెకొంపలు దాటి నడిచిన గ్రాఘూస్‌కి తోటలూ, తెల్లని పాలరాతి ముఖద్వారాలూ, చెట్లవరుసల మధ్య నుండడంవల్ల చల్లగా, హాయిగా ఉండే బాటలూ కనిపించాయి. ఒకచోట కొందరు పాచికలాడుతున్నారు. అది ఆనాటి జూదం. రోమ్‌కున్న జబ్బే జూదం. ఆ జబ్బులో యీ జూదం అన్నది సంధి లక్షణం. ప్రతి మధ్యాహ్నం జూదగాళ్ళక్కడ గుమిగూడతారు. పాచికలు నేలమీద పడి దొర్లినచప్పుడు వినిపిస్తుంది. "ఏయ్! అష్టపడు, నాలుగుపడు, ఛీ! యిదా? అఁ! అల్లాగ. ఏది, ఏది? మరో అష్ట. ఓరి దీన్ని తగలెయ్య! పడమ్మ! పడు, నా తల్లి పడు" — ఈ విధంగా యెన్ని రకాలుగానో యెన్నో రసాలు భావాలు కురిపిస్తుంటా రక్కడి జూదగాళ్ళు. వాళ్ళే నిర్జీవమైన పాచికలతో మాట్లాడుతారు. వాదిస్తారు. బ్రతిమాలుకుంటారు. తిడతారు. నిరాశతో వాటికేసి దిగులుతో చూస్తారు. వాళ్ళ జీవితాలనే తారుమారుచేస్తూ అవి దొర్లుతుంటే వాటిని చూస్తూ అనేక రకాలుగా ప్రవర్తిస్తారు. వాళ్ళకొక స్వంతభాష ఉంది. అది వాళ్ళకే తెలుసు. వాళ్ళే అర్థం చేసుకోగలరు. అసలు దాన్ని వాళ్ళే అనుభవంమీద తయారుచేసారు. కొత్తగా

జూదంలో ప్రవేశించినవాడికిగాని ఆ భాష విలువా, దానిలోని భావ విశేషమూ బోధపడదు. రోడ్డే నివాసంగాగల రౌడీలూ, కేడీలూ ఉద్యోగాలు వదిలివచ్చి ఖాళీగా పడివుండే మాజీ సైనికులూ, యెక్కడబడితే అక్కడే మన కగుపించే పధ్నాలుగు, పదిహేనేళ్ళ ఆడపిల్లలూ కనిపిస్తారక్కడ. వాళ్ళ తాత తండ్రుల లాగనే మురికికూపాలలో పుట్టి, బిచ్చం మెతుకులు గతికి జీవిస్తూ, అన్నిటి కన్న ఛండాలమైనది నిర్లక్ష్యంగా, యేమీ కానట్లు, పెద్ద లెక్కలేనట్లూ వ్యభిచరిస్తారా ఆడపిల్లలు. ఒక గ్లాసుడు సారా యెవరు పోస్తే వాడితో, ఒక యెర్రని యేగాణి యెవడు చేతిలో పడేస్తే వాడితో, యెక్కడబడితే అక్కడ సిగ్గూ, లజ్జా లేకుండా వ్యభిచరిస్తారీ గుంటలు. ఇది చాలా నీచమనీ, హేయమనీ, అమానుషమనీ తనూ, తనలాటి పెద్దలు కొందరు ఒకప్పుడనుకున్నారు. కాని యిప్పుడు, యీ రోజున దీన్ని గురించి అనుకోవడం ఎల్లా ఉన్నా ఆలోచించడానికే వీలులేదు. ఇది చెడ్డది అని చెప్పడానికి అసలే వీల్లేదు. చెడ్డదైనప్పుడెందుకు చెడ్డదని చెప్పడానికి వీల్లేదని అడుగుతారేమో; దీనికన్న మరొకటి మంచిదిగా యేదిస్తే అబ్బాయ్! యిది చెడ్డది, అది చూడెల్లాగుందో అని చెప్పచ్చు. ఎంతోమంది ఉత్తమవంశజు లనిపించుకు తిరిగేవాళ్ళే, వివాహితులైనప్పటికీ తక్కువ కాకుండా అధమం ఒక డజనుమంది బానిసస్త్రీలతో పొందుగూడడమే తమ పుంస్త్వానికి ఒక నిదర్శనమనీ, శృంగార శాస్త్రాధ్యయనంలో తమకు పాండిత్యం ఉన్నదని నలుగురూ అనుకునేందుకు వీలవుతుందనీ భావించి నీచంగా ప్రవర్తిస్తుండగాలేంది దీనికొచ్చిందా? రోమ్‌లో నీచమైన దేదీ తప్పు కానే కాదు; నీచమైనదనే కాదు యేదీ తప్పులేదు ఆ మాట కొస్తే.

గ్రాఖూస్ అనుకున్నాడు: "ఈ ప్రపంచం క్రమతః నాశనమైపోతోంది; అంత రించిపోబోతోంది. కాని యెవ్వడూ యేమిటిల్లాగుంది? ఇదేమిట్రా భగవాన్ యిల్లాగై పోతోంది? అని ఆలోచించేవాడుకాని, అనుకుని ఒక్కక్షణం బాధపడేవాడు కాని లేక పోయాడేమిటి చెప్మా! ఇది చాలా నెమ్మదిగా క్షీణిస్తోంది. ఎంతోకాలంనుండి నెమ్మదిగా, మెల్లిగా క్షీణించుకొస్తోంది. ఇంకెంతకాలానికో క్షీణిస్తుంది. కాని మానవుడి జీవితకాలం తక్కువ."

అప్పుడప్పుడా పాచికల జూదాన్ని కూడా చూసేవాడు. చిన్నప్పుడీ పాచికలు తనచేతిలోంచి కూడా దొర్లేవి. ఆ సంగతే జ్ఞాపకమొచ్చిందతనికి. బిచ్చం మెతుకులు తిని బ్రతకడమంటే చచ్చుపని. ఆత్మగౌరవంకల వ్యక్తికైనా సరే యేవేవో కొన్ని-నీతి అనండి మరేమనండి-కట్టుబాట్లుంటాయ్. పైగా అతనొక స్వతంత్రుడనుకోండి.

అటువంటి లక్షణాలు కలవాడికి బిచ్చపుమెతుకులు గొంతులో అడ్డుపడి ఆత్మగౌరవం దెబ్బతింటుంది. ఈ బిచ్చం మెతుకుల ఆహారంకన్న అటువంటి వాడికి నిరాహారమే సరియైన ఆహారం.

అతనిప్పుడు స్నానశాలవైపు పోతున్నాడు. జాగ్రత్తగా ఆలోచించి ముందే వేసేడు పథకం. ఆ రోజే, అదే సమయానికి క్రాసస్ కూడా అక్కడికి వస్తాడని యెక్కడుంది? రాకపోవడానికే అవకాశం యెక్కువ. ఇతను ముందు ప్రవేశించిన వాటిని మస్తాబుగదులంటారు. అక్కడ బట్టలేసుకోవడం, తీసేసుకోవడం, తలదువ్వుకోవడం, ఒకటేమిటి? ఉన్నత కులజుల అలంకరణ కార్యక్రమమంతా కొనసాగుతుంది. ఇతను వెళ్ళేసరికి క్రాసస్ కూడా అక్కడే వున్నాడు. రిపటలాంటి తన పొడుగాటి శరీరాన్ని చూసుకుందుకొక నిలువుటద్దాని కెదురుగా నిలబడ్డాడు. చుట్టూవున్న యెన్నో అద్దాల్లో అతని నగ్నశరీరం ప్రతిబింబిస్తోంది. వద్దనుకుని ముఖం తిప్పేసుకున్నా కనిపిస్తోంది. ఇక్కడ మనకు ఒకేవర్గపు ప్రజలు కనిపిస్తారు. ఇక్కడే ఆ వర్గపు మనుష్యులలోని గమత్తయిన పిచ్చివేషాలన్నీ చూడచ్చు. ఇదొక రాజకీయపు గదుల పెట్టె. ఇంకా బాగా చెప్పాలంటే కలగూరగంప. ఆఁ-ఏదో కొద్దిమంది ఉన్నత కులస్థులను చూసినంతమాత్రాన ఆ వర్గమంతా యిల్లాగే వుంటుందంటా రేమిటని మీరడగవచ్చు. ఆ కొద్దిమందీ మనం రోమన్ ఔన్నత్యం అనే దేన్నిభావిస్తామో దానికి ప్రతినిధులు. కావాలంటే చూడండి; ఇక్కడికి వచ్చేవాళ్ళల్లో రోమ్‌నే పునాదుల్లోకి కదిల్చిపారెయ్యగల రాజకీయశక్తులున్నాయి; కోట్లకు పడగలెత్తిన ధనవంతులు, అంతర్జాతీయ వర్తకానికి మూలవిరాట్టు లనదగిన వ్యాపారస్తులూ, వార్డు రాజకీయవేత్తలూ, బానిస వ్యాపారులూ, వోట్లగారడీచేసి యెన్నికల ఫలితాలను తారుమారుచేయగల నేర్పరులూ, పైకి మర్యాదస్తులుగా కనిపించే రౌడీ పెద్దమనుష్యులూ, ముఠానాయకులూ, ముఖ్యులైన సెనేటర్లు కొందరూ, ఒక రిద్దరు మల్లశిక్షణ, ప్రదర్శనశాలల యజమాన్లూ, ఒకప్పటి రాజకీయ సలహాదార్లయిన వాళ్ళూ, న్యాయాధిపతులూ, కొద్దిమంది నటులూ, ఎంతో కొంత ప్రాముఖ్యంవున్న సైనికోద్యోగులూ సాధారణంగా అక్కడ కనిపిస్తూ వుంటారు. మరేప్రాముఖ్యతా లేకపోయినా ప్రజాస్వామ్యానికి ప్రాతినిధ్యం వహిస్తున్నారని చెప్పబడే యెందుకూ కొరగాని కటికి సోమరిపోతులు కూడ ఆ స్నానశాలలలో దేవుళ్ళాడుతూ వుంటారు. వీళ్ళను చూసుకునే సామ్రాజ్యవాద రోమ్ గర్విస్తుంది. అందుకే యీ రోమ్ పరిపాలకులు-అంటే ప్రపంచ పాలకులన్నమాటేగా-సామాన్యజనంతో అంత కలిసికట్టుగా, విచ్చలవిడిగా ఏమీకానట్లు ఎల్లా తిరుగుతారా అని ప్రాచ్యదేశాధిపతు లాశ్చర్యపోయేవారు.

మధ్యమధ్య క్రాసస్ నొకకంట కనిపెడుతూ ఒక బల్లమీదకు తన శరీరాన్ని చేర్చేడు గ్రాఛూస్. ఒక బానిస తనబూట్లు విప్పుతున్నాడు. ఈలోగా కొందరతనికి నమస్కరిస్తే అందుకొని ప్రత్యభివందనం చేస్తున్నాడు. కొందర్ని చూసి తలూపుతున్నాడు; కొందరికొక చిరునవ్వు పారేస్తున్నాడు. ఇక్కడొకమాట, అక్కడొక మాట వదుల్తున్నాడు. ఏదైన సలహా యివ్వాల్సివస్తే, యెవరైనా వచ్చి అడిగితేనే క్లుప్తంగా తెగేసి చెప్తున్నాడు. స్పెయిన్‌లో గొడవల గురించీ, ఆఫ్రికా రాజకీయ పరిస్థితి గురించీ, ఇటలీకి ధాన్యాగారమనదగిన యీజిప్టు తటస్థంగా యెందుకుండాలో, పాలస్తీనాలో యెడతెరపి లేకుండా యెప్పుడూ కావాలని గిల్లికజ్జా పెట్టుకొంటున్న యూదుల గురించి అవసరమైనప్పుడు, తన అభిప్రాయం కోరబడినప్పుడు మాత్రం యీ మూలనుంచి ఆ మూలకు వ్యాఖ్యానాలు విసిరిపారేస్తున్నాడు. బానిసల ధరతగ్గి వర్తకం పాడవుతోందని భయపడుతున్న వర్తకులకు ధైర్యవచనాలు చెప్పాడు. గాల్‌లో సైనిక తిరుగుబాటుకు కుట్రలు జరుగుతున్నవన్న పుకారును ఖండించిపారేసేడు. ఇంకా నగ్నంగానే వుండి, కులుకుతూ దినం గడుపుతున్న క్రాసస్ నొకకంట కనిపెట్టడంమాత్రం మానలేదు.

గ్రాఛూస్ దుస్తులు బానిసలు విప్పుతున్నప్పుడు క్రాసస్ అక్కడ నిలబడలేకపోయాడు. తనూ దిగంబరుడే కాని యీ గ్రాఛూస్ దిగబరత్వంముందు తన దిగంబరత్వాన్ని నిలపడానికి అతనికసహ్యం వేసింది. గ్రాఛూస్ టోగావిప్పారు; పర్వతమంతమనిషి మరీ స్పష్టంగా కనిపిస్తున్నాడు. కాని చొక్కా తీసేసినప్పుడు మాత్రం స్థూలకాయుని విషాదకరమైన నగ్నస్వరూపం మరీ జాలికలిగిస్తోంది. పాపం గ్రాఛూస్ తన శరీరాన్ని చూసి తానే సిగ్గుపడ్డాడెందుకో.

కూచుని విశ్రాంతి తీసుకునేందు కుపయోగపడే వెచ్చగా వుండే గదులలోకి వాళ్ళిద్దరూ వెళ్ళారు. కూచుందుకూ, పడుకునేందుకూ బల్లలూ, చాపలూ అవి వున్నా యక్కడ. కాని సాధారణంగా అంతా స్నానాలకుండీల దగ్గరనుండి యిక్కడిదాకా పచార్లు చేస్తుండడమేకాని యెవరూ పడుకోరు. పాలరాతి చప్టాలతో, చిత్రవర్ణాలతో, శిల్ప ప్రతిభావిలసిత విగ్రహ సముదాయంతో, కళ్ళకింపుగా, విశాలంగా వున్న యీ వసారానుండి చిన్న చన్నీటి చెఱువు దగ్గరకైనా పోవచ్చు; నులివెచ్చని నీటితో నింపిన చెరువువద్దకైనా పోవచ్చు; బాగా వేడిగావున్న నీటితోనిండిన చెరువుకూ పోవచ్చు; ఆవిరిగదులకూ పోవచ్చు. తిరిగి వీటన్నిటినుంచీ కసరత్తు శాలలకు పోవడానికీ, మర్దనగదుల కెళ్ళడానికీ మార్గాలున్నాయి. తోటలలోని విహారస్థలాలలో తిరగొచ్చు. స్నానశాలలో ఒక భాగమైన గ్రంథాలయాల్లోకి పోవచ్చు. ఈ స్నానశాల

ల్లోని సౌకర్యాలన్నీ పొందాలనుకుంటే గంటలతరబడి యే పనీ లేకుండా ఖాళీగా వుండే వాళ్ళకుకాని వీలవదు. గ్రాఘుస్ చన్నీటి చెరువులో మునిగి, ఆవిరిగదిలో ఓ అరగంట మర్దన చేయించుకుందుకు పోయేవాడు. అంతటితో అతనికి సంతృప్తి కల్గేది.

ఇప్పుడు మాత్రం తన అలవాటు మార్చుకున్నాడు. క్రాసస్ పద్ధతుల కనుగుణ్యంగా వుండాలి. ఇప్పుడతను పెటుకుమాటలు, పెళసరి సమాధానాలు, వ్యంగ్య ధోరణి అన్నీ మరిచిపోయాడా అనిపించుతుంది. బట్టలు లేకుండా, వదులుగానే ఆడే కండలుగల శరీరంతో, లావుగా సేనాని ప్రక్క నడుస్తున్నాడు. సేనాని యెప్పుడూ కులాసాగా ఆకర్షణీయంగా కనబడతాడు. అల్లా కనబడేలా చేసుకోవడం అతని నైపుణ్యం.

"వంతెనలేస్తున్నారోయ్." ఎప్పుడూ కలుసుకోని ఇద్దరు రాజకీయవేత్తలు కాని, ఉన్నతవర్గానికి చెందిన వ్యక్తులు కాని కలిసినప్పుడు ప్రజలనుకునే మాటలివి. పూర్వం వారిరువురిమధ్యా అఖాతమంత తేడా వుండినట్లూ, యిప్పుడా తేడా లేకుండేందుకై ఆ అఖాతంపై ఒక వంతెన నిర్మిస్తున్నట్లూ వాళ్ళనుకునే సాంకేతిక పరిభాష అది. అందులోనూ క్రాసస్, గ్రాఘుస్ లిరువురుకీ యీ రకమైన అమరికే ప్రజ లెరుగరు. క్రాసస్ మాత్రం చూస్తున్నాడు దీన్లోంచి రాబోయే చిత్రమేమిటా అని. 'అతని ఉద్దేశ్యం యేమైతేకానీ, అది బయటపడకమానదు' అనుకున్నా డతనిలో అతను. కొంచెం వేళాకోళంగా రాజకీయవేత్తని ప్రశ్నించాడు. "ఈజిప్ట్ విదేశ వ్యవహారాలమీదా, వాటిమీదా తమరెప్పటి నుంచి సర్వజ్ఞత్వం వహిస్తున్నారు?"

"నేనింతకు పూర్వం అన్నమాటల గురించా? అబ్బే, ఏంలేదు. ఊరకేవుండడ మెందుకని అతిసాధారణమైన విషయాలే దొర్లించా. పెద్దవాళ్ళన్నాక ఆ మాత్రం మాట్లాడొద్దా వెధవదీ? అదీకాక పేరు రావడంయెల్లా?" ఇదేమిటి గ్రాఘుస్ యింతగా మారాడు? అతనో కొత్త గ్రాఘుస్.

"అన్నీ తెలుసునన్న పేరేనా?"

గ్రాఘుస్ నవ్వేడు. "నువ్వు యీజిప్టు వెళ్ళలేదూ?"

"లేదు. పేరుకోసం వెళ్ళినట్లు నటించను కూడా."

"బాగు, బాగు. క్రాసస్ నాకు తెలియకడుగుతా; మనం యెందుకొకరి మీదొకరు దెబ్బతీస్తూ, పోట్లాడుకుంటూ, కొట్లాడుకుంటామా అని. స్నేహితులుగా వుండటానికి అభ్యంతరమేముంది? మనిద్దరికి ఒకరి స్నేహం మరొకరి కుండడంవల్ల ఎంతో ఉపయోగం కదా?"

"నేనూ అల్లాగే అనుకుంటూవుంటాను. నాకూ వుంది ద్వేషం. అదీకాక స్నేహానికికూడ ఒక ధరవుంది?"

"నిజమే?"

"నిజంగాక, నా స్నేహం నీకెందుకింత విలువైనదిగా కనబడింది? డబ్బా? నీకు కావలసినంత వుంది."

"అబ్బే డబ్బు నాకో లెఖ్ఖా?"

"నాకోలెక్కే. సరే డబ్బుకాక మరేమిటి?"

"నీ దగ్గర వున్న ఒక బానిసను నేను కొనదలిచా" గ్రాఘూస్ గొణిగాడు. అమ్మయ్య ఎల్లాగో ఒకలాగు వూడిపడింది అసలు సంగతి.

"నా వంటమనిషి కావాలా? తీసుకో. లేకపోతే పల్లకీబోయీలు కావాల్నా? అడది కాదుకద కొంపతీసి. మీ యింట్లో స్త్రీలు తప్ప యింకెవరూ లేరని విన్నాలే."

"దుంపతెగ. నీకు తెలుసయ్యా నాకేం కావాలో" గ్రాఘూస్ యీ మాటలు హెచ్చుస్థాయిలో అన్నాడు: "నాకు వరీనియా కావాలి."

"ఎవరూ?"

"వరీనియా. ఎందుకులే యీ ముసుగులో గుద్దులాట?"

"ఈ గుద్దులాట తమరు ప్రారంభించినదే కాని నేను మొదలెట్టినది కాదు మహాశయా! అయినా తమకీ సంగతులన్నీ యెవరు చేరేస్తున్నారు?"

"సంగతులు నాకు తెలుస్తునే వుంటాయి" గ్రాఘూస్ క్రాసస్‌ని పరిశీలనగా చూశాడు. "చూడు క్రాసస్, చూడు డొంకతిరుగుడు మనకిష్టంలేదు. బేరమూవద్దు, బెట్టూవద్దు. సూటిగా చెప్పేస్తున్నా. ఒక బానిసకోసం యింతకు మున్నెన్నడూ రోమ్‌లో యెవ్వడూ చెల్లించనంత ధర నే నిస్తా పదిలక్షల సెస్టెర్‌సస్, పదిలక్షల బంగారు నాణాలు ఖంగున చెల్లిస్తా. ఇప్పుడు కావాలంటే యిప్పుడే నిలబడ్డపాటున యిచ్చేస్తా. వరీనియాని మాత్రం నాకియ్యి."

క్రాసస్ చేతులు ముడుచుకున్నాడు. "అది మంచి ధరేలే, బలేధర, మించితే దొరకనిధర. అంతడబ్బు కనిపిస్తే మహాకావ్యాలు వ్రాయవచ్చు, వ్రాస్తారు, వ్రాస్తున్నారు కూడా. వెయ్యి సెస్టెర్‌సస్‌కే పసిదబ్బపళ్ళలాంటి రొమ్ములున్న నక్కల్లాంటి గుంటలు బజార్లో దొరుకుతుంటే పీలగా వుంటే జర్మనుదానికోసం ఏకంగా పదిలక్షలు పెట్టేవేంటి బాబూ. ధరైతే బాగానే వుందనుకో. కాని అంతడబ్బు నీ దగ్గర ఊరికే, ఉట్టిపుణ్యాన కొట్టెయ్యడానికి నాకు మనస్సొప్పుతుందంటావా? నలుగురూ క్రాసస్ దొంగవెధవ అనుకోరూ?"

"ఎందుకీ నాటకం?"

"నాటకం నీతోనా? మహాత్మా గ్రాఘస్! నాటకమాడేది నువ్వు కాని నేనుకాదు. నీకు నేను విక్రయించగలిగినదేదీలేదు."

"బాగా ఆలోచించి చెప్పేనుసుమీ ఆ ధర చూచుకో."

"నేనూ బాగా ఆలోచించే నీకు సమాధానం చెప్పాను."

"అయితే రెట్టింపు చేస్తున్నా" గ్రాఘస్ గుర్రుపెడుతున్నాడు.

"ఇరవై లక్షలు."

"అబ్బా! రాజకీయాల్లో అంతడబ్బు యిరుక్కుపోయిందనుకోలేదు నేను."

"తీసుకో, మాను, యిరవై లక్షలు."

"చిరాకెత్తిస్తున్నావు" అని క్రాసస్ గిరుక్కున తిరిగి వెళ్ళిపోయాడు.

# 5

"వరీనియా! వరీనియా! లే అమ్మా, బట్టలేసుకో. మేం నీకిప్పుడు బట్టలు కట్టబెట్టాలి, బాబుగారింటికొచ్చే వేళయింది. ఆయనతోబాటు నువ్విప్పుడు భోజనం చెయ్యాలి. వరీనియా! మమ్మల్ని చంపుకు తింటావేం తల్లీ?"

"నాకు మిమ్మల్ని చంపుకొని తినాలనిలేదే."

"లేదేమో. కాని నువ్వు మమ్మల్ని చంపేస్తున్నావ్. నేనూ ఒక బానిసనే అంటావ్. అందుకేలాగుంది నీకోసం నలుగురు బానిసలు పడిగాపులు పడుతూ కూచోవాలిలాగుంది. నువ్వూ మాలాటి బానిసవే. ఎంతో దౌర్భాగ్యం అనుభవించానని చెప్తావు. బానిసగా వుండడమంటే యేమిటో నీకు కొత్తకాదుగద. ఒకవేళ అయితే అవచ్చులే. ప్రపంచాన్నే జయించిపారేస్తున్న స్పార్టకస్‌తో ఉన్నప్పుడు నువ్వు బానిసత్వం గురించి పూరాగా మరిచిపోయి వుండవచ్చు. అప్పుడు నువ్వొక మహారాణివి. ఏం వరీనియా? అందుకు——"

"ఇక నన్ను చంపకండి. ఎందుకల్లాగంటారు? నేను మీకు యెప్పుడైనా దూరంగా వున్నానా?"

"నువ్వుండక్కర్లేదు, బాబుగారే వుంచుతారు. ఆయనకి కావాలన్నప్పుడు మాలో యెవర్నో ఒకర్ని తీసుకుపోయేవాడు. అంతలో నువ్వు తయారయావు వరీనియా! ఇప్పుడాయనకు నువ్వంటేనే ప్రేమ. అందుకేలే, నువ్వు మమ్మల్ని చంపుకు తినేది కూడా. ఆయ ననుకొన్నట్లుగాని నీకు బట్టలు తొడగకపోతే మా తోలొలిచేస్తాడాయన. నీకేం? కొరడాదెబ్బలు తగిలేది నీకా మాకా?"

"నన్నూ కొట్టనీ!"

"ఊఁ కొట్టనీ, కొట్టనీ, ఈ కళ్ళకు రెప్పలేం దూరంకాదు. అదీ చూస్తాం."

"సరే కానియ్యండి" ఆమె వాళ్ళతో అన్నది. "ఇప్పుడు నేను పిల్లాడికి పాలిస్తున్నా. పాలివ్వడం అయిపోనివ్వండి. అప్పుడు బట్టలు వేసుకుంటా, మీ రే బట్టలు వేసుకోమంటే అవి. ఎల్లా వేసుకోమంటే అలా వేసుకుంటా. మిమ్మల్ని నే నింకేమీ బాధపెట్టను. కాస్త పిల్లాడికి పాలిచ్చేదాకా ఆగండి."

"ఎంతసేపేంటి?"

"ఎంతోసేపా? చూడండి వీడికేసి. తాగడం తగ్గించేస్తున్నాడు. మహా అయితే ఓ అరగంట, నే వచ్చేస్తా. వీడు పడుకుంటాడుకూడా. అప్పుడు మీరేం చెప్తే అది చెయ్యకపోతే ఒట్టు. ఏ బట్టలు వేసుకోమంటే అవే వేసుకుంటా."

అప్పుడు వాళ్ళామెను వదిలివెళ్ళేరు. అందులో ముగ్గురు స్పెయిన్‌వాళ్లు, మరొకర్తె సబైన్‌జాతికి చెందినది. ఋణబాధపడలేక తనతల్లి తనను బానిసగా అమ్మేసిన విషయం ఆమె హృదయంలో గాలంలాగుండిపోయింది. గాయమయింది. వరీనియా అటువంటి బాధల నర్థంచేసుకో గలదు. తనవాళ్ళే తన నమ్మేయడమంటే యెంత విచారగ్రస్తమైన విషయమో తెలుసా? అది తలుచుకున్నప్పుడల్లా యెంతకోపం వస్తుందనీ? ఈర్ష్య, అసూయ, క్రోధం, బాధ వీటితో నిండిందా యిల్లు. ఆ యింటి నిండా కాపురమున్నా యవి.

బిడ్డకి పాలిస్తూ మృదువుగా, మెల్లిగా, హాయిగా జోలపాడింది. పాలు త్రాగడం అయింది. పిల్లాడు నోరు కదపడం తగ్గించాడు. పెదవులు అక్కడే, అల్లానే తెరచుకుని తల్లి రొమ్ముకి బుగ్గ నాన్చుకొని అమాయకంగా, హాయిగా నిద్రపోతున్నాడు. పిల్లాడు పాలు గట్టిగా, వేగంగా త్రాగుతున్నప్పుడు తన శరీరమంతటా ఒక విద్యుత్ప్రవాహం వ్యాపించి పరుగెడుతున్నట్లనిపించేది ఆమెకు. కొద్ది కొద్దిగా వాడి కడుపు నిండుతుంటే అల్లా అనిపించడంకూడా తగ్గేది. శిశువు పాలు త్రాగుతుంటే యెంత హాయి!

కావాలంటే త్రాగుతాడు కదా అని మరోవైపిచ్చింది. త్రాగడం ప్రారంభిస్తాడు కదా అని అతని గుండెలు నిమిరింది. కాని ఆ పాలు చాలు. తల్లి ఒడిలో నిద్ర పోయాడు. కళ్ళు మూసుకున్నాడు బిడ్డడు. కడుపు నిండిన పిల్లల ముఖాలలో యెంత సంతుష్టి, మాటలలో చెప్పలేని యెంత నిర్వికారం తొణికిసలాడుతాయో! శిశువుని ఉయ్యాలలో పడుకోబెట్టి జాకెట్టు బొత్తాలు సరిచేసుకుంది.

వంగి కొడుకును చూస్తూ నా బిడ్డ యెంత అందమైనవాడో అనుకుంది. లావుగా, ఆరోగ్యంగా, పుష్టిగా బుల్లి బుల్లి చేతులూ, చిట్టి పాదాలూ, కల్గిన తన బిడ్డ

యెంత అందంగా వున్నాడో! అతని జుట్టు నల్లని పట్టు. నీలాల కళ్ళు, తండ్రి కళ్ళల్లా అవి యింకా నీలంగా వుంటాయి. ఆ జుత్తు గురించి చెప్పనే అక్కర్లేదు. అది యెదుగుతే, ఆ నల్లని పట్టుజుట్టు పొడుగైతే వంపు వంపులుగా నల్లని ఉంగరాలైనా తిరుగుతుంది; పచ్చగా పొడుగ్గానైనా వుంటుంది.

కొద్దిసేపటిలో సులభంగా నిద్రపోయాడు. తన శిశువు ప్రపంచమే సక్రమమైనది, సరియైనది. క్లిష్టంకాని సాధారణ జీవితసూత్రాలచే పరిపాలింపబడే సజీవప్రపంచమది. తక్కిన ప్రపంచాలన్నిటికన్న చిరంజీవియైనది.

బిడ్డను వదిలి తనకోసం నిరీక్షిస్తున్న బానిసలవద్దకామె వెళ్ళింది. అనేక రకాల దుస్తులు తొడగటానికి, ఆమె నలంకరించడం కోసం ప్రత్యేకం నలుగురు బానిసలు, యిదంతా భోజనకాలంలో బాబుగారు చూసి సంతోషించడానికే, తన బట్టలూడతీస్తుంటే ఆమె మాట్లాడకుండా నిలబడింది. ఆమె శరీరాన్ని వాళ్ళు తుడుస్తున్నారు. ఆమె శరీరం యింకా అందంగానే ఉంది. పాలతో నిండిన బరువైన పాలిండ్లామె చక్కదనాన్ని మరింత హెచ్చవేస్తున్నాయి. ఒక దుప్పటికప్పి ఆమెను మంచంమీద పడుకోబెట్టేరు. ఒక బానిస ఆమె ముఖాన్ని మెరుగుపెడుతోంది. నాటకాలంకరణకున్నంత తంతు యధేచ్ఛగా సాగిపోతోంది.

మొదట తెల్లనిపౌడరద్దేరు. చేతులకూ, ముఖానికీ, నుదుటికీ అంతటా అద్దేరు. శరీరానికి బాగా పట్టుకునేలా మర్దనచేశారు. అప్పుడు గులాబీరంగుగా ఉన్నదేదో బుగ్గలకీ, యెర్రని యెరుపు పెదవులకీ పట్టించారు. నల్లని కాటుకలాటిముద్ద నొకదాన్ని కనుబొమల కంటించి తీర్చిదిద్దేరు. దానితో వాళ్ళనుకున్న ముఖం తయారయింది.

అది పూర్తికావచ్చాక కూచోబెట్టి జుట్టుపని పట్టించారు. బొమ్మలలో ఉండేటట్లు చక్కని వంపులుతిరిగే ముడివేశారు. మెత్తని, ఒత్తయిన ఆ పొడుగాటి జుట్టుకు సువాసన తైలాలు పట్టించి రిబ్బన్లతో ముడివేశారు.

దుస్తులయాక నగలు. భావరహితమైన చూడ్కులు నిగిడిస్తూ, పాలిపోయిన ముఖంతో నగ్నంగా ఆమె నిలబడింది వినయంగా. ఆమె తలమీద దగద్ధగియమానంగా మెరిసే కిరీటం పెట్టేరు. బంగారపు దుద్దులు తగిలించారు. మెడలో జిగినీగొలుసులాంటి గొలుసు వేసేరు. ఆ బంగారపు గొలుసులో గోమేధికాలు పొదిగారు. ముంజేతికి అందమైన బంగారుగాజులూ, కాలికి పట్టీలూ తగిలింపబడ్డాయి. రోమ్ అంతటికీ ధనవంతుడని చెప్పుకోదగిన వ్యక్తి తన భార్యకుకాదు, తన మనస్సుకు నచ్చిన ఒక బానిసకు కావించిన అలంకరణ యిది. దేదీప్యమానంగా వుంది ఈ అలంకరణ. ఆమె నలంకరించడం

కోసం నియమింపబడిన పేదరాసి పెద్దమ్మలా నలుగురు బానిసలకూ యీ మెయందు జాలి కలగలేదంటే ఆశ్చర్యానికి తావెక్కడ? చూడు, ఒక మహాసామ్రాజ్యపు సిరిసంపదల నన్నిటినీ చేరిపించి, నిలువెత్తునా నగలుగా యెల్లా అలంకరించుకొందో? ఆమెయం దెవరికైనా జాలి కల్గడానికీ, ఈర్ష్య కలగకపోవడానికీ తావుందీ?

ఆ కాలంలో పట్టుకూడా యేమంత విలువైనదికాదు. మోజంతా భారతదేశంలో నేయబడ్డ నూలువస్త్రాలమీదనే వుండేది. సాలెపట్టులా అతిసున్నితంగా చక్కగా వుండే భారతీయ చేనేత వస్త్రాలకే విలువ హెచ్చుగా వుండేది. వాటిముందు పట్టు బలాదూరుగా వుండేది. అటువంటి ఖరీదైన బట్టల నామె ధరింపచేసేరు. ఇన్ని బట్టలూ తొడగడం తన శరీరం అంతా, వంపులన్నీ పైకి కనబడేలా చెయ్యడంకోసమేననీ, అల్లా తన శరీరం పైకి కనిపిస్తూనే వుంటుందనీ వరీనియాకు తెలుసు. ఆ నగ్నత్వమే ఆమెకు భయం కల్గించేది, నీచమనిపించేది. ఆ బట్టల అందాన్ని చెడగొడుతూ పాలు కారుతుంటే ఆమె సంతోషించేది.

లేత పచ్చరంగుగల పట్టు శాలువ ఆమె కప్పుకొన్నది. ఆమె శరీరాన్నీ బట్టలనూ యీ శాలువ కప్పేసింది. భోజనానికి ఆమె వచ్చినపుడల్లా క్రాసస్ అనేవాడు.

"ప్రేయసీ వరీనియా! నీ చక్కని శరీరాన్ని అల్లా కప్పేసుకుంటావెందుకు? ఆ శాలువ తొలగించరాదా? దానికిందనున్న బట్టలవెల పదివేల సెస్టర్‌సెస్ తెలుసా? ఇంకేమీ చెయ్యలేకపోయినా దాన్ని చూసేనా సంతోషించనీ." ఆమె భోజనాలహాలులో ప్రవేశించినపుడల్లా మాటిమాటికీ యివే మాటలంటూ అతనామెవంక అదేపనిగా వెర్రిగా చూస్తూ ఉండిపోయేవాడు. రోజూలాగా ఆమె యీనాడుకూడాను శాలువ తొలగించిం దతనికోసం.

"నన్ను గాభరా పెట్టేస్తున్నావ్" క్రాసస్ అన్నాడు. "నువ్వు నన్నెంతో గాభరా పెట్టేస్తున్నావ్. దెయ్యంలాటి ఆ బేటియాటస్‌గాడితో సిస్ ఆల్‌పైన్ గాల్‌లో ఒక రాత్రి గడపవలసిన భాగ్యం - దౌర్భాగ్యమే అనుకో - నాకు లభించింది. అతను నీ గురించి వర్ణించాడు. నువ్వో బ్రహ్మరాక్షసివని చెప్పేడు. ఎవడికీ లొంగని పెంకెఘటాల కుండవలసిన లక్షణాలన్నీ నీలో మూర్తీభవించాయని వర్ణించాడు. తీరాచూస్తే నువ్వు యెంతో వినయంగా చెప్పినదల్లా చేసిపారేస్తున్నావు. ఆ లక్షణాలేం కనబడవు."

"అవును."

"నీలో యీ మార్పు యెల్లా వచ్చింది అని ఆశ్చర్యపోతూ ఉంటా. నాతో చెప్పడం నీకోలెక్కేమిటిలే!"

"నాకు తెలియదసలు. అందుకే చెప్పలేను."

"నీకు తెలుసు. పోనీ కాని యీవేళ రాత్రి ఓహో! ఎంత చక్కగా కనిపిస్తున్నావు నువ్వు! మంచి దుస్తులు ధరించి, యెంతో చక్కగా అలంకరించుకొని - అవునుకాని వరీనియా యిల్లా యెన్నాళ్ళని? నిన్ను నేనెంతో మర్యాదగా చూస్తున్నాను లేదా? విచారందోవ విచారంది. కాని దీనితో ఆ ఉప్పుగనులను పోల్చిచూడు. నీ కొడుకు నమ్మితే మూడువందలొస్తుంది. అమ్మి నిన్నుప్పుగనులకు పంపితే బాగుంటుందంటావా?''''

"బాగుండదు."

"ఇల్లా మాట్లాడ్డం నాకే అసహ్యంగా వుంది" అన్నాడు క్రాసస్.

"ఏం? బాగానే వుంది. నీకల్లా బాగుందనితోస్తే అల్లా మాట్లాడొచ్చు. నేను మీ ఆధీనంలో వున్నా?"

"నిన్ను నా ఆస్తిగా మార్చుకుందామని కాదు నాకున్నది. నిజం చెప్పాలంటే నేనే నీ ఆధీనంలో వున్నా. ఒక పురుషుడు తను ప్రేమించిన ఒక స్త్రీని పొందినట్లుగా నిన్ను పొందుదామని వుంది నాకు."

"నేను నిన్నాపలేనే — ఈ యింటిలోని యే బానిసా నిన్ను ఆపలేనట్లే నేను కూడా నిన్నాపలేను."

"ఏం మాటలు!"

"ఏం? ఉన్నదున్నట్లు మాట్లాడితే అంతకష్టంగా ఉందా? రోమ్‌లో యిదికొత్తా?"

"వరీనియా! నిన్ను బలాత్కారం చెయ్యడం నా ఉద్దేశ్యం కానేకాదు. మామూలుగా బానిసలతో ప్రవర్తించినట్లే నీ సందర్భంలోకూడా ప్రవర్తిద్దామని నాకు లేనేలేదు. అవుననుకో - నా కిక్కడ బానిస స్త్రీలుకూడా ఉన్నమాట వాస్తవమే. ఎంతమంది స్త్రీల ననుభవించానో నాకే తెలియదు. నీ దగ్గర దాచడం యెందుకు? నా నిజస్థితి నీకు తెలియాలనే నా కోరిక. నువ్వే నన్ను ప్రేమించినట్లయితే నా ప్రవర్తననే మార్చుకోగలను. నాలో క్రొత్తదనం, ఒకమార్పు, ఔన్నత్యం కల్గడం జరుగుతుంది. ప్రపంచమంతటికీ ధనవంతుడ నంటారు నన్ను; కాకపోవచ్చు. కాని నువ్వే నన్ను ప్రేమిస్తేనా మనిద్దరమూ కలిపి యీ యావత్ప్రపంచాన్నీ, జయించగలం, పాలించగలం."

"ప్రపంచపరిపాలన నా కనవసరం" వరీనియా చెప్పింది. ఆమెగొంతు నిర్జీవంగా సత్తుమీద కొట్టినట్లు భావరహితంగా వుంది. అతనితో యెప్పుడు మాట్లాడినా ఆమె అల్లాగే వుంటుంది.

"నీ ప్రేమకు పాత్రుణ్ణి కాగలిగితే నేను మరో మనిషిగా నూతనత్వం పొందలేనని నీ యభిప్రాయం!"

"నాకు తెలియదు. అసలు నా కదంతా అనవసరం?"

"నీ పిల్లాడి గురించి వస్తేమాత్రం అవసర మొస్తుందా రాదా? అల్లా పాలు కార్చుకుంటూ కూచోపోతే పాలిచ్చే దాది నొకదాన్ని చూచుకోరాదూ?"

"పసికందు పేరుచెప్పి భయపెట్టచూస్తావేం యెప్పుడూ? ఆ పిల్లాడుకూడా నీ ఆస్తి. నేనూ అంతే. నా పిల్లాడిని చంపుతానని బెదిరిస్తే భయపడి నేను నిన్ను ప్రేమిస్తాననా?"

"పిల్లాడిని చంపుతానని బెదిరించలేదే."

"నువ్వు—"

"పోనీలే వరీనియా. ఎప్పుడూ మనపని యిల్లా మాట్లాడుకోవడమే. పోనీ భోజనం కానీ, నేనూ తినాలి. భోజనం కూడా పెట్టిస్తున్నా. ఇదంతా నాకేం లెక్కలేదనుకుంటావేమో కొంపతీసి. ఈ భోజనానికైన ఖర్చుతో ఒక భవనం కొనుక్కోవచ్చు. పోన్లే కాని తిందూ. తినిచూడు. ఈ వేళ జరిగిన గమత్తయిన సంగతొకటి చెప్పనా. నీకైనా గమత్తుగా కనిపిస్తుందది. మరికొంచెం తిను."

"నాక్కావలసిందేదో నేను తినగలను."

"ఆఁ-ఈవేళ మంచి గమత్తొకటి జరిగింది చెప్తానన్నానుకాదూ? స్నానశాల దగ్గర గ్రాఛూస్ లోపలికొచ్చాడు. నేనంటే వాడికి బ్రహ్మాండమైన ద్వేషం. ఎంత ద్వేషమో అంతద్వేషం. విచిత్రమేమిటంటే నాకు వాడంటే యెప్పుడూ అసహ్యం లేనేలేదు. మతిమండినట్లుంది—అసలు వాడెవరో తెలియదుగా. అతనో ప్రముఖ సెనేట్ సభ్యుడు. అతనికి రోమ్‌లో గొప్ప రాజకీయ ప్రాబల్యం వుంది-యిప్పటి సంగతి యెల్లాగున్నా ఒకప్పుడైనా వుండేది. ఇప్పుడా ప్రాబల్యం దెబ్బతినేస్తోందనుకో. సందుల్లో పుట్టి పెరిగి ఓట్ల వర్తకంవల్ల పెద్దవాడయిన నీచుడు. పందియనుకో. పందే వాడికన్న యెంతో నయమేమో అనిపిస్తుంది. ఏమీ సున్నితంలేని మనిషి. ఆత్మ గౌరవం కాస్తయినా లేనివాడు. తను కూచున్న ఉన్నతాసనమే క్రమేపీ కరిగిపోయి మాయమయేదాకా అల్లా చూస్తూనే కూచుండిపోయే నిస్సహాయుడు. నన్నేదో అడుగుతాడని ముందు వాడు వస్తుంటేనే పసిగట్టేశా. కొవ్వెక్కిన శరీరాన్ని అతికష్టంమీద యీడ్చుకుంటూ పచారు చేసి చేసి తటపటాయించి ఆఖరుకి నా దగ్గరకొచ్చి అసలు విషయం కక్కేసేడు. నువ్వు కావాలిట వాడికి. అమ్మితే యెంత డబ్బు కావాలంటే అంతా యిచ్చేస్తాడట. నాలుగు దులిపేసరికి ధర రెట్టింపు చేసేసేడు. ఏమిటో వాడి పట్టుదల మాడ. నేనుమాత్రం వాడిని పూజించాననా? నాలుగూ దులిపేశా. అదో లెఖ్ఖా ఆ మొండిఘటానికి—"

"పోనీ నన్నిమ్మెయ్యలేకపోయావా?" వరీనియా ప్రశ్నించింది.

"వాడికా? ఆ కొవ్వెక్కిన పందిని నువ్వోమారు చూడాల్సింది. వాడూ, వాడి రూపం ఒకవేళ నీకు అదికూడా లెఖ్కలేదా?"

"ఏదీ లెఖ్కలేదు."

కంచం ముందుకి తోసి ఆమెకేసి తెల్లబోయి చూశాడు. గ్లాసులో వున్న ద్రాక్ష సారా పూర్తిగాతాగి, మరో గ్లాసుడు పోసుకొని అదికూడా ఖాళీ చేశాడు. ఒక్క నిమిషంలో ఊహించుకోలేనంత విపరీతమైన కోపం వచ్చింది. ఆ కోపంలో చేతిలోని గ్లాసును గదిలో నెక్కడికో విసరిగొట్టేడు. కష్టంమీద కోపాన్నణచుకొని తిరిగి మాట్లాడ్డం ప్రారంభించాడు.

"నన్ను నువ్వెందుకంతగా అసహ్యించుకొంటావు?"

"నిన్ను ప్రేమించాలి లాగుందేం క్రాసస్?"

"ఔను. స్పార్టకస్ తన జీవితకాలమంతటిలోనూ యెంత గింజుకున్నా ఇవ్వలేని సౌఖ్యం నేనిప్పుడు నీకిస్తున్నాను. కాబట్టి నన్ను నువ్వు ప్రేమించి తీరాలి."

"ఏమీ యివ్వలేదు నువ్వు."

"ఏం? ఏదివ్వలేదు? ఆ స్పార్టకస్ ఏమైనా భగవంతుడా?"

"అతను భగవంతుడేంకాదు" వరీనియా సమాధానమిచ్చింది. "అత నో మామూలుమనిషి. నిష్కల్మషమైన మనిషి. అతనో బానిస. బానిసంటే యెవరో నీకు తెలుసా? నువ్వు బానిసలమధ్యనే బ్రతికావింతకాలమూను."

"ఏ పల్లెటూళ్లోనో, పొలంలో పనిచేసే బానిసకు నిన్నప్పగిస్తే అతన్ని ప్రేమించి అతనితో బ్రతకగలవా?"

"నేను స్పార్టకస్‌నే ప్రేమించగలిగాను. ఇంకెవరినీ ప్రేమించలేదు; ఇకముందు ప్రేమించలేను. ఐనాసరే పొలంలో పనిచేసే బానిసతో బ్రతకగలను. కొంతమటుకైనా అతను స్పార్టకస్‌లాగుంటాడు. స్పార్టకస్ గనులలో పనిచేసిన బానిస అనుకో. కాని ఫరవాలేదు. నేనూ అతిసామాన్యమైనదానిననే నీ ఉద్దేశ్యం. నిజానికి నే నంతే కూడా. అంతేకాదు. నే నొక్కొక్కప్పుడు చాలా మూర్ఖంగా వుంటుంటాను. ఒక్కొక్కప్పుడు నువ్వేం చెపుతున్నావో కూడా నాకు తెలియదు. స్పార్టకస్ నాకన్న కూడా చాలా సామాన్యంగా వుండేవాడు. నీతో పోలిస్తే అతనొక చంటిపిల్లాడే, స్వచ్ఛమైనవాడు."

"స్వచ్ఛమైనవాడంటే నీ ఉద్దేశ్యం?" ఇంకా కోపాన్నణచుకుంటూనే అడిగాడు క్రాసస్. "నీ దగ్గరనుంచి యిలాటి చెత్త చాలా వచ్చింది. స్పార్టకస్ మానవ సమాజానికే శత్రువు. కసాయి వృత్తిగల హంతకుడు. రోమ్ సృష్టించిన ప్రతి మంచిపనికీ,

అందమైనదానికీ విరోధి. ప్రపంచానికే శాంతిభిక్ష పెట్టినది రోమ్. మానవ నాగరికతను వృద్ధిచేసింది. ఈ చెత్తగొట్టు బానిసకు తెలిసిందేమిటి? నాశనంచెయ్యడం, తగల పెట్టడంతప్ప వీడికున్న జ్ఞానం యేమిటి? ఈ బానిసలకు నాగరికతను గురించి అణు మాత్రమైనా తెలియకపోవడంవల్ల యెన్నెన్ని భవనాలు తగలబెట్టబడి బూడిదపాలు చేయ బడ్డాయో తెలుసా? ఎన్నివేలమంది చచ్చారో తెలుసా? రోమ్‌తో యుద్ధం వెలగబెట్టిన ఆ నాలుగేళ్ళలోనూ యీ బానిసలు సాధించగలిగిందేమిటి? ఈ చెత్తగొట్టుసరుకు స్వేచ్ఛను కాంక్షించడంవల్ల ప్రపంచంలో యెంత దౌర్భాగ్యం, ఎన్ని కష్టాలు కల్లోలం సంభ వించాయో తెలుసా? స్వేచ్ఛ—ఇల్లు తగలెయ్యడానికి స్వేచ్ఛ సర్వనాశనం చెయ్య డానికే స్వాతంత్ర్యం.''

ఆమె మౌనంగా తల వాల్చుకుని నేలను చూస్తూ అల్లానే కూర్చుండిపోయింది.

''ఏం? సమాధానం చెప్పవేం?''

''నీకేం చెప్పాలో, యెలా చెప్పాలో నాకు తెలియడంలేదు. నీ ప్రశ్నలే నా కర్థంకావు.''

''నువ్వు చెప్పేవు కనుక విన్నాను కాని, యీ ప్రపంచంలో మరెవరటువంటి మాటలు పేలినా చంపేసేవాడిని. ఏం మాట్లాడవేం? స్పార్టకస్ యేదో స్వచ్ఛమైనవా డన్నావు. ఏమిటా స్వచ్ఛం? నేనేం అంతకన్న స్వచ్ఛంగాలేనా?''

''నీ గురించి నాకు తెలియదు'' వరీనియా అంది. ''నీ గొడవే అర్థం కాదు. అసలీ రోమన్లెవరినీ నే నర్థం చేసుకోలేదు. స్పార్టకస్ ఒక్కడి గురించే తెలుసు నాకు.''

''సరేకాని అతను స్వచ్ఛమైనవా డెల్లాగయాడు?''

''తెలియదు. నాలో నేనే అతనెల్లా స్వచ్ఛమైన వాడయాడనుకొంటూ ఉంటాను. అది నీకు తెలియదేమో? బహుశా అత నో బానిస కావడంవల్లనేమో. అంతగా బాధల ననుభవించడం వల్లకావచ్చు. బానిస యెల్లా బాధపడతాడో పాపం నీ కేం తెలుసు? నువ్వెప్పుడూ బానిసవు కావు.''

''మరి స్వచ్ఛం అంటావేమిటి?''

''నా కతను స్వచ్ఛమైనవాడే. ఒక్క చెడ్డపనీ చెయ్యలేదతను.''

''అయితే తిరుగుబాట్లు లేవదీసి, సంక్షోభం వ్యాపింపజేసి, ప్రపంచానికి నిప్పంటించడం కూడా మంచిపనే అంటావా? అందుకేలాగుంది మీవాడు మహా స్వచ్ఛ మైనవాడయాడు?''

''మేమేం ప్రపంచానికి నిప్పంటించలేదే! మాక్కావలసిందల్లా మాస్వాతంత్ర్యం. మా క్కావలసిందల్లా మేం శాంతియుతంగా జీవించగలగడమే. మీరు మాట్లాడుకునే

మాటలు యేవేవో పెద్ద పెద్ద విషయాలు నాకేం తెలియవు. నాకు చదువూ సంధ్యా యెవరూ చెప్పించలేదు. మీ భాష కూడా నాకు సరిగ్గా రాదు. నువ్వేదైనా చెప్తావంటే నాకు చాలా గాభరాగా వుంటుంది. నాకు తెలుసు. మా యిద్దరికీ కావలసింది స్వేచ్ఛ."

"మరి మీరు బానిసలు."

"అవును. అయినంతమాత్రాన కొందరు బానిసలుగానూ, మరికొందరు స్వతంత్రులుగానూ యెందుకుండాలీ అని?"

వాదనలో ఆమెను లొంగదీసుకునేందుకు క్రాసస్ మరింత మృదువుగా ఉపక్రమించాడు. "వరీనియా! ప్రస్తుతం నువ్వు రోమ్‌లో వున్నావు. నా పల్లకీలో కూచో బెట్టి నిన్ను నే నీ ఊరంతా తిప్పాను. అంతులేని, పరిమితులులేని రోమన్‌శక్తిని నువ్వు స్వయంగా చూసేవు. రోమనురోడ్లు ప్రపంచం అంతటా సాచుకొనివున్నాయి. రోమన్ సైనికదళాల నాగరికత పొలిమేరలలో నిలబడి అజ్ఞానతిమిరాల దుష్టశక్తుల బారినుండి ప్రపంచాన్ని రక్షిస్తాయి. సర్వోత్కృష్టమైన రోమన్ సెనేట్ యొక్క అధికారదండాన్ని చూసి ప్రపంచం గడగడలాడుతుంది. ఎక్కడ నీళ్ళు కనిపిస్తే అక్కడ రోమన్ నావికాదళాలు గస్తీతిరుగుతుంటాయి. మా దళాలను కొన్నింటిని బానిసలు నిర్మూలం చెయ్యగా చూసేవు. కాని రోమ్‌లో ఆ జాడలు కాస్తయినా కనిపించాయా? ఎల్లా చూసినాసరే, యే కారణం దృష్ట్యా ఐనాసరే పురాతన సామ్రాజ్యాలేవీ సరిపోల్చదగని రోమన్ మహాసామ్రాజ్యాన్ని, కొద్దిమంది యేమీచేతకాని బానిసలు లేవదీసిన అర్ధరహితమైన వ్యర్థవిప్లవాలవల్ల నిర్మూలం చెయ్యగలరన్న సంగతి నువ్వసలు కలలోనయినా ఊహించుకోగలవా? రోమ్ శాశ్వతమైనది, అనంతమైనది. ఆపాటి నీ కర్థంకాదూ? మానవు డూహించగల జీవిత పద్ధతులలో రోమన్ పద్ధతి సర్వోత్కృష్టమైనది. ఆ పద్ధతే చిరకాలంగా, యెల్లకాలమూ ఉండిపోతుంది. ఇదే నువ్వర్థం చేసుకోవాలని నా కోరిక. ఆ స్పార్టకస్ గురించి యింక నువ్వేడవకు. చరిత్ర స్పార్టకస్‌కు యివ్వవలసిన స్థానం యివ్వనే యిచ్చింది. అతనికి తగినట్లు బుద్ధి చెప్పింది. నీ బతుకు నువ్వు బతుకికింక, అంతే."

"నేను స్పార్టకస్ గురించి యేడవను. స్పార్టకస్ గురించి అసలెవ్వరూ యేడవరు. ఎవరూ స్పార్టకస్‌ను మరచిపోరు కూడా."

"ఆహా! వరీనియా! వరీనియా? ఎంత మూర్ఖంగా వున్నావు నువ్వు! అప్పుడే స్పార్టకస్ ఒక దెయ్యం అయిపోయాడు. రేపా దెయ్యమూ మిగలదు. ఇంక పదేళ్ళయాక యీ స్పార్టకస్ యెవడో యేమిటో యెవరికీ జ్ఞాపకముండదు. ఎందుకు జ్ఞాపకముండాలి? ఏపాటి ఘనకార్యం చేసేడని అతని పేరు జ్ఞాపకముంచుకోవాలి ప్రజలు? బానిస యుద్ధాల

కో చరిత్రంటూ వుండేడిసిందా? అదీకాక స్పార్టకస్ ఒక నిర్మాణాత్మక శక్తి కాదు. అతనొక వినాశనకారి. ప్రపంచం నిర్మాతలనే జ్ఞాపక ముంచుకొంటుంది తెలుసా?"

"ఆశను నిర్మించాడతను."

"వరీనియా! చిన్నపిల్లలా మాట్లాడుతావేం? ఆశను అతను నిర్మించాడూ? ఎవరి కోసం ఆ ఆశ? ఆ ఆశ లేవీ యీవేళ? ఆ ఆశ లంతరించిపోయాయి. అడుగంటి పోయాయి. నుసైపోయాయి. బలవంతుడు బలహీనుడిని పరిపాలించడంకన్న యీ ప్రపంచంలో మరేమీలేదని నీకు తెలియదా? వరీనియా! నిన్ను నేను ప్రేమిస్తున్నా. నువ్వు బానిసవుకదా, నా యిష్టం వచ్చినట్లు చెయ్యొచ్చుననే ధీమాతో కాదు. బానిసవని తెలిసికూడా ప్రేమిస్తున్నా."

"అయితే"—

"కాని స్పార్టకస్ స్వచ్ఛమైనవాడు" అతను ఘాటుగా వేళాకోళం చేసేడు. ఆ మాటలో కోపంకూడా వుంది.

"అవును. స్పార్టకస్ స్వచ్ఛమైనవాడే."

"అదేచెప్పు. స్పార్టకస్ ఎలా స్వచ్ఛమైనవాడో చెప్పు నాకు."

"చెప్పలేను. నీ కర్థంకాని విషయాలు నీతో యెల్లాచెప్పను?"

"అతన్ని అర్థంచేసుకోవాలని ఉంది నాకు. అతనితో పోరాడాలి. బ్రతికుండగా అతనితో నేను పోరాడేను. చచ్చాకకూడా అతనితో నేను పోరాడాలి."

ఆమె తల ఊపింది. "నన్నిల్లా చంపి తినకపోతే అమ్మిపారెయ్యకూడదా? నన్నెల్లా ఉపయోగించుకోవాలనుందో అల్లా ఉపయోగించుకుని మాట్లాడకూరుకోరాదా? నా మానాన్న నన్నెందుకు బ్రతకనివ్వవు?"

"ఒక చిన్నవిషయం చెప్పమంటున్నాను వరీనియా! అంతే. అసలు ఆ స్పార్టకస్ అనేవాడొకడుండేవాడా? అతన్ని గురించి నా కెవరూ ఏమీ చెప్పరేం కర్మ."

"నేను చెప్పాను"—అని ఆమె అర్థోక్తిలో ఆగింది. అతను మరింత మృదువుగా అన్నాడు.

"చెప్పు వరీనియా, చెప్పు. నేను నీతో స్నేహంగా ఉంటా. నాతో చెప్పడానికే అల్లా భయపడతావేం?"

"భయపడ్డం లేదు. స్పార్టకస్‌ని చూసేక మాత్రం నాకు భయమనేది కలగ లేదు. కాని అతనిగురించి చెప్పడం కష్టం. నువ్వతనో కసాయివాడనీ, హంతకుడనీ అంటావు. కాని నిజానికి అందరికన్న అతనే మంచివాడు. గొప్పవాడు."

"అయితే చెప్పు. అతనెల్లా గొప్పవాడో, యెందుకంత మంచివాడో చెప్పు.

నువ్వల్లా అనుకుందు కతనేం చేసేడో అర్థం చేసుకుందామని ఉంది నాకు. ఒకవేళ అర్థం చేసుకోగలిగితే నేనూ, ఆ స్పార్టకస్ అంతవాడిని అవచ్చుగా మరి."

"ఈ గొడవ మాట్లాడేదాకా వదిలేలా లేవు. కాని నే నే భాషలో నీకు బోధ పరచగలనో నాకే తెలియడంలేదు. బానిసలలో ఆడాళ్ళూ, మొగాళ్ళూ మీలాగుండరు. బానిసలలో మొగాడూ, ఆడదీ సమానులు. మేమంతా ఒక్కలాగా పనిచేస్తాం. దెబ్బలు తినడంలోకూడా ఆడదీ, మొగాడూ అనే తేడా ఉండదు. ఒక్కలాగే చస్తాం. అందర్నీ ఊరూ పేరూ లేని వల్లకాట్లోనే పూడుస్తారు. మొదట్లో మొగాళ్ళతోబాటే మేముకూడా యీటెలు కత్తులు పుచ్చుకొని యుద్ధంచేసాం. స్పార్టకస్ నా సహచరుడు. మేమిద్దరమూ ఒకటే. ఇద్దరమూ కలిసిపోయాం. అతని శరీరంమీద యెక్కడయినా ఒక గాయం వుంటే దాన్ని నేను మెల్లగా తాకితే చాలు, ఆ గాయం నా శరీరంమీద ఉండేది. మే మిద్దరమూ యెప్పుడూ సమానులమే. అతని ప్రాణస్నేహితుడు క్రిక్సస్ చచ్చిపోయి నప్పుడు నా తొడమీద తలపెట్టుకుని చిన్నకుర్రాడిలా వెక్కి వెక్కి యేడ్చాడు. ఆరో నెలలోనే నెల తక్కువ పుట్టుక పుట్టి నా మొదటిపిల్లాడు చచ్చిపోయినప్పుడు నేనూ అల్లాగే యేడ్చాను. అతను నాకు ఊరట కల్గించాడు. బ్రతికుండగా అతను మరొక ఆడ దాని ముఖం చూడలేదు. మొదటిసారి అతను నన్ను కౌగలించుకున్నప్పుడు నాకు భయమేసింది. నే నసలు చెప్పలేకపోతున్నాను. ఏదో ఒక గమ్మత్తయిన భావం నాలో ప్రవేశించింది. ఇక నే నెన్నటికీ చావను, నా ప్రేమ శాశ్వతమైనది. ఇంక నన్నేదీ బాధించలేదు. నేను అతనిలాగానే అయాను. అతనుకూడా కొంచం నాలాగయాడు. మా యిద్దరిమధ్యా రహస్యాలు లేవు. మొదట్లో నా ఒంటిమీద మచ్చలు చూస్తాడేమో నని భయమేసింది. అప్పుడే నాకు తెలిసింది, మచ్చ లున్న చోట్లుకూడా చర్మం వున్న ప్రదేశంవంటివేనని. అతను నన్నెంతో ప్రేమించాడు. అతనిని గురించి నీకేం చెప్ప గలను నేను? మీరందరూ అతనొక మహారాక్షసుడన్నారు. కాని అతను రాక్షసుడేం కాడు. అతనో మామూలు మనిషి, ప్రేమతో నిండిన సహృదయుడతను. మృదువైన, సరళమైన, ధారాళమైన స్వభావం కలవాడు. తన సహచరుల నతడు హృదయపూర్వ కంగా ప్రేమించేవాడు. వాళ్ళొకరి నొకరు కలుసుకున్నపుడల్లా ఒకరి నొకరు ఆప్యా యంగా కౌగలించుకుని ముద్దెట్టుకునేవారు. మరి మీరో? మీ రోమన్లు ఆప్యాయంగా సోదర మానవులయెడ వాత్సల్యం చూపిన సంఘటన లసలు నా కగుపించలేదు. ఒక మొగాడితో మరొక మొగాడు ఆడదానితో ప్రవర్తించే పద్ధతిని ప్రవర్తించడం చూసేం. కాని నిజమైన సోదరభావంకాక, కృత్రిమమైన చెడ్డ పద్ధతులు మీవి. స్పార్టకస్ ఎప్పు డేది చెప్పినా నా కది అర్థమయేది. కానీ, నీ ఉద్దేశాలు నాకు బోధపడవు. అసలీ

రోమన్లు మాట్లాడేదేదీ నాకు బోధపడదు. బానిసలు వాళ్ళల్లోవాళ్ళు కొట్టుకుని జగడమాడినపుడు వాళ్ళందరినీ స్పార్టకస్ పిలుస్తాడు. వాళ్ళంతా ఒకేమాటు యేదేదో మాట్లాడేస్తారు. అప్పుడు మాట్లాడతాడు స్పార్టకస్. అతని మాటలు వాళ్ళు శ్రద్ధగా వింటారు. వాళ్ళు చెడ్డపనిచేసినా ఇకముందు పొరపాట్లు రానివ్వకూడదనీ, మంచి పనులే చెయ్యాలనీ దృఢమైన సంకల్పంకల్గి ఉండేవారు. అది వాళ్ళల్లో బలీయంగావుండేది. వాళ్ళందరూ ఏదో ఒకమహత్తరమైనదానిలో భాగస్వాములుగా ఉండేవారు. వాళ్ళే ఆ భాగాలుగా కనపడేవారు. వాళ్ళంతా ఒకరిలో మరొకరు యిమిడివున్నట్లు ఒకరు మరొకరు విడదీయలేని భాగమైనట్లు అవినాభావ సంబంధంతో బ్రతికేవారు. మొదట్లో వాళ్ళు కొల్లగొట్టినవాటి నుండి కొన్నింటిని దొంగిలించేవారు. వాళ్ళందరూ అవినీతి, దొంగతనం, మోసం, దౌర్భాగ్యం నిండిన సంఘంలో పుట్టి పెరిగినవారే కాబట్టి, ఆ దుష్ప్రభావం వాళ్ళమీద పనిచేస్తోందనీ, త్వరలో ఆ లోపాలు సవరించుకోవడం సులభం అనీ చెప్పేవాడతను. అందరికీ చెందిన సమిష్టి గోదాములకు తాళాలుండేవి కావసలు. తలుపులు కూడా తెరిచే వుంచేవారు. వాటిలో సరుకు యెవరూ దొంగలించనేలేదు. వాళ్ళ కవసరమైనవన్నీ వాళ్ళ కీయబడుతున్నాయన్న సంగతి గ్రహించాక దొంగిలించిన సరకులు యెల్లా ఖర్చు పెట్టాలోకూడా వాళ్ళకు తెలియనప్పుడు దొంగతనం పూర్తిగా మానేశారు. పేదరికంతో, ఆకలితో బాధపడవలసి వస్తుందేమోనన్న భయం వాళ్ళల్లో నశించింది. స్పార్టకస్ నాకు చెప్పేవాడు, భయంవల్లనే మనుష్యులు చెడుపనులు చేస్తారని. మనుష్యుల అవసరాల దృష్ట్యా వాళ్ళకున్న ఆస్తి నంతటినీ, వస్తుసముదాయమంతా సమానంగా పంచుకోవడం వల్ల, సోదరత్వంవల్ల, మనుష్యుల మనస్సులు మారి వాళ్ళెలా అందంగా, ఆనందంగా మంచిగా తయారవుతారో నాకు ప్రత్యక్షంగా చూపించాడు స్పార్టకస్. నే చూశానది. అటువంటి జీవితంలోని ఆనందాన్ని అనుభవించాన్నేను. ఎల్లాగోమరి నా స్పార్టకస్ ఎప్పుడూ అలాగే ఉండేవాడు. అందుకే వాళ్ళందరికీ అతను నాయకుడయ్యాడు. అందుకే వాళ్ళంతా అతను చెప్పినట్లు వినేవారు. వాళ్ళు కసాయివాళ్ళూ కారు, హంతకులూ కారు. మానవులుగా బ్రతకనేర్చిన, బ్రతికిన సాధారణ మానవులువాళ్ళు. అందుకే నువ్వు నన్ను బాధించలేవంటాను. అందుకే నేను నిన్ను ప్రేమించలేను." "పో యిక్కడ్నుంచి" క్రాసస్ అరిచాడు. "నా కంటి కగపడకుండా పో! ఓరి దీన్ని తగలెయ్యా!"

## 6

తిరిగి ఫ్లేవియస్‌ని పిలిచాడు గ్రాఖస్. ఇద్దరికీ వృద్ధాప్యం రావడంతోబాటు గమ్యస్థానంకూడా ఒకటే అయింది. స్థూలకాయాలు రెండూ ఒకేలాగున్నాయి. అన్న

దమ్ములకున్న పోలికలలోకూడా కొంత తేడా ఉండొచ్చుకాని, వీళ్ళిద్దరిలోనూ బాగా పోలికలున్నాయి. ఇద్దరికీ ఒకరి గొడవ మరొకరికి తెలుసు. ఫ్లేవియస్ జీవితంలోని వైఫల్య వృత్తాంతం సొంతంగా తెలిసినవాడు గ్రాఛుస్. ఫలితం శూన్యమేకాక ఎదురు తిరిగినప్పుడుకూడా విజయం పొందినవారిలాగనే ప్రవర్తిద్దామనే ప్రయత్నం నూటికి నూరుపాళ్ళు ఉండేది ఫ్లేవియస్‌లో. చేష్టకుచేష్టా వీసంవాసి తేడా లేకుండా వాళ్ళని అనుకరించేవాడు. చివరకు పాపం శుద్ధ అనుకరణగా మిగిలిపోయాడు. వంచకుడు కాలేకపోయాడు. వంచకుల ననుకరించడమేతప్ప స్వతహాగా వంచకత్వం అలవర్చుకో లేకపోయాడు. చూస్తున్నాడు. ఈ గ్రాఛుస్ యింతగా మారిపోయాడేమిటి చెప్మా అనిపించింది ఫ్లేవియస్‌కు. పూర్వపు గ్రాఛుస్ కానేకాడు. ఆ గ్రాఛుస్ మాయమై పోయాడు. ఇంక తిరిగిరానిపద్ధతిలో మాయమయాడు. ఎంత భయంకరమైన మార్పు వచ్చేసింది యితనిలో అనుకున్నాడు. అనుకోవడంవల్లనే అతనిలో తనకొక రక్షకుడు, పోషకుడు, కనిపించాడు. కాని ఆ రక్షకుడిప్పుడు ఆత్మరక్షణ చేసుకోలేని దైన్యావస్థలో ఉన్నాడు. ఏదో ఒకటి జరగబోతోంది. సరే, కానీ!

"ఏమిటి సంగతి?" ఫ్లేవియస్ అడిగాడు. "తిరిగి నామీద దండయాత్ర ప్రారంభించకేం బాబూ. అది వరీనియాయే. నిర్ధారణైపోయింది. స్పార్టకస్ పెళ్ళాం. ఇంకేంకావాలి నీకు?"

"ఎందుకా భయం నేనంటే?" గ్రాఛుస్ అడిగాడు. "నాకు సాయపడ్డ మనుష్యులమీద నేను దండెత్తుతానా? ఏమిటి అర్థంలేని భయం?"

"నాకు నువ్వంటేనే భయం" ఫ్లేవియస్ నిస్సహాయుడిలా మాట్లాడేడు. "ఇంకేం చెయ్యమంటావో అని భయపడుతున్నాను. పట్నం పటాలాలు నీ చేతిలో ఉన్నాయి. రౌడీలముఠాలు, ఎందరో గూండాలు నీ చెప్పుచేతల్లో ఉన్నారు. నీ చేతికింద ఉన్న పేటలలో నువ్వేంచెప్తే అది చేస్తారు అందరూ. అటువంటప్పుడు వాళ్ళచేతే యెందుకు చేయించుకోకూడదు? బ్రతికిచెడ్డ నే నొక్కణ్ణే కనిపించానేమిటి నీకు? నే నో చౌకబారు చిల్లర ఓట్ల వర్తకుడిని. నీ కెందరో స్నేహితు లున్నారు. వాళ్ళల్లో యే ఒక్కడ్ని పిలిపించినా ఔను. ఎందుకు పిలిపించుకోకూడదు?"

"పిలిపించలేను, ఈ విషయంలో అసలు పిలిపించలేను."

"ఏం?"

"ఎందుకో నీకు తెలియదూ? ఆ ఆడది కావాలి నాకు. వరీనియా కావాలి. ఆమెను కొనడానికి ప్రయత్నించాను. ఆమెనిస్తే పది లక్ష లిస్తానన్నాను. క్రాసస్ ఒప్పుకోలా. దాంతో రెట్టింపు డబ్బిస్తానన్నాను. నన్ను తిట్టి నా ముఖం ముందే నవ్వేడు."

"అమ్మ నాయనో! అయ్యబాబో! యిరవై లక్షలే!" అంత డబ్బు గురించి ఒక్కమాటాలోచించినంతమాత్రాన ఫ్లేవియస్ శరీరం కంపించిపోయింది. "ఇరవై లక్షలు! అంటే ఒక చిన్న సంచిలో యీ ప్రపంచాన్నే యిమిడ్చిపారెయ్యొచ్చన్న మాట. అంత డబ్బేడిస్తే యీ ప్రపంచాన్నే కొని పారెయ్యొచ్చు. అంత డబ్బు తీరాచేసి ఒక ఆడదానికోసం తగలేస్తావన్నమాట. అరే బాబూరే గ్రాఘూస్! తెలియ కడుగుతా, అసలు నీ కది యెందుకు? నీ రహస్యా లేవో తెలుసుకుందామనే కుతూహలం కాదు. నువ్వు నన్నొక పని చెయ్యమన్నావు. ఎందుకో చెప్పకపోతే నే నిక్కడనించి పోతా. ఆమె నీ కెందుకు కావాలీ అన్నది నే తెలుసుకుతీరాలి."

"ఆమెను నేను ప్రేమిస్తున్నా" బద్ధకంగా గ్రాఘూస్ మాట్లాడేడు.

"ఏమిటీ!"

గ్రాఘూస్ తల ఊగింది. అతనిలో పూర్వపు దర్జా యేమయిపోయిందో, అతని కళ్లు యెఱ్ఱబడ్డాయి. కంట్లో నీళ్లు తిరిగినై.

"నాకేం బోధపడలేదు. ప్రేమా! ఏమిటోయ్ యీ ప్రేమ? పోనీ యే ఆడదయినా నీ హృదయాన్ని సుకుమారంగా స్పృశించిందా ఒక్కమారైనా? నీకు పెళ్ళీ లేదు, పెటాకులూలేదు. ఇరవై లక్షలు, ముందూ వెనకా లేకుండా, తగలేసేటంతగా ఒక బానిస గుంటను ప్రేమించేస్తున్నా నంటావు. యేమిటో నా కేం అర్థం కావడంలేదు."

"నీ కర్థమవాలా యేం?" రాజకీయవేత్త గొణిగాడు. "నీ కర్థంకాదులే. ఎల్లా గౌతుంది. నేను నీకో ముసలాడిలా, కొవ్వెక్కిన, అచ్చోసిన ఆంబోతులా కనబడవచ్చు. నువ్వేమనుకో. నే నెన్నడూ మానవత్వం అనేది ఉన్న ఆడదాన్ని చూడలేదు. మన రోమన్ స్త్రీలలో యెంతమందిలో మానవ లక్షణాలున్నాయో చెప్పు. వాళ్ళంటేనే నాకు భయం. వాళ్ళంటే నాకు పరమసహ్యం. మనమే వాళ్ళని అల్లా తయారుచేసి ఉండొచ్చు. నాకు తెలియదు.ఆమె ముందు మోకరిల్లి నన్నొక క్షణకాలం లక్ష్యపెట్టమని నే నర్థిస్తా. క్రాసస్ అంటే ఆమె కిష్టంఉందో లేదో నాకు తెలియదు. అతనికామెయం దేముందో నాకు తెలుసుననుకో. అతనంటే ఆమె లక్ష్యమేమిటి? అతనే ఆమె భర్తను నాశనం చేసినవాడు. స్పార్టకస్‌ను నిర్మూలనం చేసినవాడే వాడు. అతన్నామె అసహ్యించుకోకుండా యెల్లా గుండగలదు?"

"ఆడవాళ్ళుండగలరు" ఫ్లేవియస్ అభిప్రాయపడ్డాడు. "క్రాసస్ దాని ధర మరింత పెంచేస్తాడు. దాంతో నువ్వు హడలిపోతావు!"

"అబ్బే! అదే జరగదోయ్ ముసలిశివా!"

"అదుగో, మళ్ళీ ప్రారంభించావు గ్రాఘూస్!"

"అయితే వెర్రివెధవలా మాట్లాడకు. ఆమె నాక్కావాలి. డబ్బెంతవుతుందో తెలుసా?"

"అయితే అంతా తగలేస్తావన్నమాట—"

"ఓ!"

"దీని ఫలితం యెల్లా వుంటుందో కాస్త వూహించావా?" ఫ్లేవియస్ జాగ్రత్తగా అన్నాడు. "నా గురించికాదు. దాన్నికాని తీసుకొచ్చి పారేశానంటే యీజిప్టు పోయి ఆ డబ్బెట్టి నాక్కావలసినంతమంది చక్కని బానిసగుంటల్ని కొనుక్కుని కాలు మీద కాలేసుకుని జమీందారులా కాలం గడిపెయ్యగలను. కాని నీ గురించే అనుమానం. నువ్వు గ్రాఛూస్‌వి, ఒక సెనేటరువి. రోమ్‌లో నువ్వొక బలమైన రాజకీయశక్తివి. నువ్వు యెక్కడికీ పారిపోలేవు. దానితో నువ్వేం చెయ్యదలచుకున్నావు?"

"వాటన్నిటితోనూ నాకు సంబంధంలేదు."

"లేదూ? క్రాసస్ యేం చెయ్యగలడో నీకు తెలియదూ. వాడిదగ్గర యెవడి యెత్తులూ పారవు. వాడి నెవరూ జయించలేకపోయారుకూడా. వాడిదగ్గరనుంచి ఏ ఒక్క వస్తువునీ యెవరూ తీసుకురాలేరు. క్రాసస్‌తో నువ్వు పోట్లాడగలవూ? వాడు నిన్ను సర్వనాశనంచేస్తాడు. చచ్చేదాకా సర్వనాశనం చేస్తాడు. నిన్ను నిర్మూలం చేసేస్తాడు."

"వాడంత పెద్దవాడనే నేమిటి నువ్వనుకొనేది?" గ్రాఛూస్ నెమ్మదిగా అడిగాడు.

"ఉన్నదున్నట్లు చెప్పమంటావూ? ఇరవై లక్షలన్నది నేను కలలో కూడా చూడలేదు. నిజం చెప్పాలంటే వాడు నిన్ను పూర్తిగా మంట గలిపేస్తాడు."

"ఏదో ఒకలా నా గొడవ నే పడతా" గ్రాఛూస్ అనేసేడు.

"నీ గొడవేదో నువ్వుపడ్డాక మిగిలేదేమిటో నీకు తెలుసా? ఇరవై లక్షలంటే మాటలుకాదు. దాన్ని వాడింటి నుండి తప్పించి తీసుకురావడానికి అంతా ఖర్చుపెట్టేమే అనుకో. అదేంకాదు, ఉన్నది తగలెయ్యడం నిముషం. ఒక దమ్మిడీ సంపాదించడం కష్టంకాని తగలెయ్యడం యెంతసేపూ? పోనివ్వయ్యా దీన్ని తీసుకొచ్చావనుకో. తీరా తీసుకొచ్చాక అది నా ముఖంమీద ఉమ్మెయ్యదన్న నమ్మకం యేది? ఉమ్మదని చెప్ప గలవా? స్పార్టకస్‌ని క్రాసస్సే నాశనం చేసేడనుకో. కాని అతన్ని పనికి నియోగించేందుకు కపటనాటకమాడిన వాడివి నువ్వేగా. ఆ పనంతా యెవరు చేసేరంటావ్?"

"నేనే" గ్రాఛూస్ ఒప్పుకొన్నాడు.

"నువ్వేమరి. అందుకే అడుగుతున్నా. రాబోయేదేమిటో నీకు తెలుసా అని."

"ఆమె రాబోతోందిగా—"

"దానికి నువ్వేం యివ్వగలవు? ఏమిటి? ఏ బానిసకయినా ఒక్కటే కావాలి. అదివ్వడానికి నువ్వు సిద్ధంగా వున్నావా?"

"ఏమిటదీ?"

"నీకు తెలియదాయేం?" తిన్నగా సమాధానం చెప్పకుండా ఫ్లేవియస్ అంటున్నాడు.

"ఇదంతా నువ్వెందుకాలోచించవూ?"

"ఓహో ఆమె స్వాతంత్ర్యం గురించేనా?" గ్రాఘాస్ నెమ్మదిగా అడిగాడు.

"నీతోబాటే వుంటే స్వాతంత్ర్యంకాదు. నువ్వుకూడా లేకుండా అందరినీ యీ రోమ్‌వదలి వెళ్ళగల స్వాతంత్ర్యమన్నమాట. అంటే క్రాసస్‌గాడికి కనపడకుండా పోగలస్వేచ్ఛ అన్నమాట."

"ఆమెకు స్వేచ్ఛనిస్తే నాకొక రాత్రినిస్తుందంటావూ?"

"ఒకరాత్రి యివ్వడమేమిటి మహాత్మా?"

"అంటే ఒకరాత్రి ప్రేమ—కాదు. కాదు. ప్రేమకాదు, గౌరవం, మర్యాద లాలన కాదు కాదు అదీకాదు. ఈ విధంగా చెప్తే బాగుంటుందేమో కృతజ్ఞత. అంటే ఒకనాటి రాత్రి కృతజ్ఞత చూపాలి అంతేచాలు."

"ఎంత వెర్రిబాగులాడివోయ్ నువ్వు!"

"ఇక్కడ కూచుని నిన్ను పేలనిస్తే నేను మరింత వెర్రిబాగులాడినవడం తథ్యం" గ్రాఘాస్ చెప్పాడు. "అయితే అవనూవచ్చు—కాకపోనూవచ్చు, క్రాసస్ గాడితో విషయం తేల్చిపారేస్తా. కాని నువ్వొక పనిచేసి పెట్టాలి. అన్నమాట తు.చ. తప్పకుండా అమలుపరచే రకం అని ఆమెను నమ్మించగలగాలి. మాటమీదే బతుక్కొస్తున్నాను నేను. ఆ సంగతి రోమ్ అంతకీ తెలుసు. అని ఆమెను నమ్మించగలవా నువ్వు?"

ఫ్లేవియస్ తల పంకించాడు.

"ఆమెను తీసుకొచ్చిన తరువాత రోమ్‌నుంచి దూరంగా తీసుకుపోడానికి అన్ని యేర్పాట్లూ నువ్వే చెయ్యాలి సుమీ."

"ఎక్కడికి తీసుకుపోవాలి?"

"ఆఖరుకి సిస్ ఆల్పైన్‌గాల్కైనా తీసుకుపోవాలి. అక్కడ ఆమె సురక్షితంగా వుండగలదు. రేవులు కాపలాకాయాలి. దక్షిణంగాపోయే రోడ్లన్నీ కూడా కాపలాకాయాలి. ఉత్తరంగా గాల్‌దేశానికిపోతే ఆమెకు మరీ నయం. ఆవిడ జర్మన్ జాతికి చెందినదేగా, కావాలంటే జర్మనీకే పోవచ్చు."

"అంతా బాగానేవుంది కాని ఆమెను క్రాసస్ యింట్లోంచి తీసుకురావడంయెల్లా?"

"అదో పెద్దసమస్య కానేకాదు. వారానికి మూడురోజులు క్రాసస్ పల్లెప్రాంతాలకు పోతాడుగా. అప్పుడు కొంచెం భగవంతుడిచ్చిన బుర్రనుపయోగించి కొద్దిడబ్బు ఖర్చుచేస్తేసరి పని జరిగిపోతుంది."

"ఇదంతా ఆమెకు రావాలని యిష్టం వుంటేనేగా."

"ఆ మాత్రం తెలియదనే?" ఫ్లేవియస్ తనకూ తెలివి లేకపోలేదన్నట్లు చెప్పాడు.

"ఆమెతో కూడా ఒక పిల్లాడుంటా డనుకుంటా. ఆ పిల్లాడికి కూడా సదుపాయాలు జరగాలి."

"అవును."

"ఆ యిరవై లక్షలూ ముందే బజానా యిచ్చెయ్యమంటావా? ఏం?"

"ముందే చెల్లించడం మంచిదనుకుంటా" ఫ్లేవియస్ అన్నాడు. తన మిత్రుని పట్ల అతను కొంచెం జాలిగా వున్నాడు.

"ఓ యిప్పుడే తీసుకో. డబ్బిక్కడే వుంది. నగదు చెల్లించెయ్యమంటావా లేక అలెగ్జాండ్రియా బ్యాంకుకొక డ్రాఫ్టివ్మంటావా?"

"నగదే కావాలి" ఫ్లేవియస్ అన్నాడు.

"సరే అదే రైటు. నన్ను నమ్మించి మోసం చెయ్యడానికి ప్రయత్నం చెయ్యకుసుమీ. దగా చేసేవంటే తగినశాస్తి జరుగుతుంది!"

"చంపేస్తున్నావ్ గ్రాఛూస్! నీ మాటకున్నంత విలువా వుంది నా మాటకి."

"సరి."

"ఇంతకీ యిదంతా యెందుకు చేస్తున్నావో మాత్రం దురూహ్యంగా వుంది. పురాణాల్లో వున్న ప్రతి చిల్లరదేముడి సాక్షిగానూ చెప్తున్నా యిదంతా యెందుకో యేమిటో నాకేం తెలియడంలేదు. ఒకవేళ ఇదంతా జరిగితే ఆ క్రాసస్‌గా దూరుకోడం మాత్రం కల్ల. అల్లా కాదనుకొని నువ్వన్నావంటే అతన్ని తప్పు అంచనా వేసేవన్న మాట."

"క్రాసస్ గురించి నాకు బాగా తెలుసు."

"నిన్నింకా జగద్రక్షకుడే కాపాడాలి. అల్లా అనుకోడం నాకిష్టంలేదనుకో. కాని అల్లాగే అనుకోవలసివస్తోంది."

## 7

ఒక కల కన్నది వరీనియా. ఉత్కృష్టమైన రోమన్ సెనేట్ తనను విచారణ చేస్తున్నట్లుగా కల. అక్కడే వాళ్ళు కూచున్నారు. ఆ శిష్టసభా భవనంలో ప్రపంచాన్ని

అవిచ్ఛిన్నంగా పరిపాలిస్తున్న పెద్దమనుష్యులంతా కూచున్నారు; ఆ ఉత్తమాసనాలలో, టోగాలు ధరించి. క్రాసస్ ముఖానికీ వాళ్ళందరి ముఖాలకూ యెంతో సారూప్యం వుంది. అందమైన పొడుగాటి, కఠినమైన ముఖాలు, హావభావ ప్రకటనలదగ్గర నుంచి ఆ కూచోడం దగ్గరనుంచి, అల్లా కొద్దిగా ముందుకు వంగడం అయిష్టాన్ని సూచించే భయంకరమైన ముఖాలలో ద్యోతకమయే ఆ విశ్వాసం, ఆ ధీమా అన్నీ వాళ్ళశక్తినీ, అధికారాన్నీ ప్రతిఫలిస్తూనే ఉంటాయి. ఇనుమడింపచేస్తూనే వుంటాయి. వాళ్ళశక్తికి మరింతశక్తిని కలుపుతూనే వుంటాయి. వాళ్ళే శక్తి, వాళ్ళే ప్రాబల్యం కలవాళ్ళు. ఈ ప్రపంచంలో వాళ్ళముందు నిలబడగలిగేదేదీలేదు. అర్ధచంద్రాకారంగా ఎత్తుగా వున్న కప్పుగల సెనేట్ భవనంలో తెల్లని పాలరాతి ఆసనాలలో కూచునివున్న వాళ్ళందర్నీ చూస్తే చాలు హడలిపోతారు.

వాళ్ళసమక్షాన, వాళ్ళకళ్ళెదుట నిలిచి తను, వరీనియా, తన స్పార్టకస్‌కి వ్యతిరేకంగా సాక్ష్యం యివ్వాలిట. ఇదీ ఆమె కలలోని భాగమే. ఆమె సన్నని నూలుబట్టలు కట్టుకొనివుంది. అదేపనిగా పాలు కారిపోతూనేవున్నాయన్న సంగతి ఆమెకు బాధ కలిగించింది. ఇంక వీళ్ళామెను ఊరికే అదేపనిగా ప్రశ్నలు కురిపించి ఊదరకొట్టేస్తున్నారు.

"స్పార్టకస్ ఎవరు?"

విచారణ అక్కడ్నించి ప్రారంభమయింది. ఆ ప్రశ్నకు ఆమె ఆలోచించి సమాధానం చెప్పే యీలోపున మరోప్రశ్న ఆమెను ఉక్కిరిబిక్కిరి చేసిపారేసింది.

"అతను రోమ్‌నెందుకు సర్వనాశనం చెయ్య తలపెట్టాడు?"

పోనీ దీనికైనా సమాధానం చెప్దామనుకొనేలోపున శరవేగంలో మరోప్రశ్న:

"చేతికి దొరికిన వాళ్ళందర్నీ అతనెందుకు హత్యచేశాడు? ఇది రోమన్ న్యాయశాస్త్రానికి విరుద్ధమైనదన్న విషయమని కూడా అతనికి తెలియదా!"

అప్పుడు వాళ్ళను వ్యతిరేకిద్దామనుకొని రెండు వ్యతిరేక పదాలుచ్చరించిందో లేదో అప్పుడే వచ్చింది మరోప్రశ్న మహావిసురుగా.

"ఎందుకతను ప్రతిమంచి విషయాన్నీ అసహ్యించుకొని ప్రతి చెడ్డదాన్ని ప్రేమించాడు?"

అప్పుడు కూడా ఆమె చెప్పడానికే పూనుకొంది. కాని యింతలో ఒక సెనేట్ సభ్యుడు లేచి ఆమె రొమ్ములవైపు చూపించి అడిగాడు.

"ఏమిటది?"

"పాలు."

ఇప్పుడు ప్రతిగౌరవనీయుడైన సభ్యుని ముఖంలోనూ కోపం తాండవిస్తోంది. కణకణ మండే మహాక్రోధం. భయంకరమైన క్రోధాగ్ని ప్రతివాది ముఖంలోనూ ప్రజ్వరిల్లింది. పరిస్థితి మరింత భయంకరంగా మారింది. వాతావరణం తదనుగుణ్యంగా వుంది. అప్పుడు యెందుకో కాని, యే కారణమూ లేకుండా ఆమెలోని భయం అంతరించిపోయినట్లా కలలోనే ఆమె భావించింది. ఆ కలలోనే ఆమె తనలో అనుకుంది.

"స్పార్టకస్ నాతో వుండబట్టే నా భయం పోయివుంటుంది."

ఆమె తల తిప్పి చూసింది. అదీ సంగతి. ఆమె ప్రక్కనే నిలబడివున్నాడు స్పార్టకస్. ఆ పోరాటకాలంలో సాధారణంగా అతను ధరిస్తువుండే దుస్తులే అప్పుడు కూడా ధరించాడు. ఎత్తైన బూట్లు, బూడిదరంగు చొక్కా, తలమీదొక టోపీ, చేతిలో ఆయుధాలేవీలేవు. యుద్ధసమయంలో తప్ప మరెప్పుడూ దగ్గర ఆయుధాలుంచుకో కూడదని అతని నియమం. ఏ విధమైన ఆభరణాలుకాని, ఆఖరుకి ఉంగరాలు కాని యేమీలేవతనికి. గడ్డం నున్నగా ఉంది. దగ్గరగా కత్తిరించబడ్డ జుట్టు.

అతనిచూపే చాలు. ఆ చూపులో యెంత సౌమ్యం; యెంత నిశ్చయాత్మకబుద్ధీ కనిపిస్తున్నాయో! ఆమె కలలోనే జ్ఞాపకం తెచ్చుకుంటుంది: అతనెప్పుడూ అల్లాగే చూస్తాడు. స్పార్టకస్ యెవరిని కలిసినా వాళ్ళల్లో యీ సౌమ్య ధారాళస్వభావాన్ని ప్రతిపాదించి తీరతాడు. అది అతని మహిమ. కాని తనలోమాత్రం ఆ చూపులే మరొక భావాన్ని కల్గిస్తాయి. అతన్ని చూసినపుడల్లా ఆమెలో సంతోషం జాలువారుతుంది. వికసిత కుసుమపరాగంలా నలుదిక్కులకూ పోతుందా సంతోషం. తెల్లని పూలవెన్నెలలా వ్యాపిస్తుంది. అతను వెళ్ళిపోతే ఆ పువ్వు ముడుచుకుపోతుంది, వాడిపోతుంది. బాధతో తల వాలుస్తుంది. ఒకనాడతనితో ఆమె అతని శిబిరంలోనే వుంది. అధమం ఒక యాభైమందైనా అతనికోసం నిరీక్షిస్తున్నారు బయట. అతను వచ్చాడు. వాళ్ళతో ఏవేవో వ్యవహారాలు మాట్లాడుతుంటే ఆమె అతని ప్రక్కనే నిలబడింది. అతన్ని పరకాయించి చూసింది. ఆమెకు సంతోషం హెచ్చింది. అతని ప్రతిమాటా, ప్రతికదలికా ఆమెలో సంతోషాన్ని వృద్ధిచేసేవి. ఇంకామె భరించలేకపోయింది ఇంత సంతోషాన్ని ఆమె తనలో యెల్లా అట్టే పెట్టేసుకోగలదుమరి? ఎల్లా యిముడ్చుకోగలదు? ఇంక భరించలేక ఆమె ఆ గుడారాన్ని వదలి బైటకు వెళ్ళింది. తనొక్కర్తే ఒంటరిగా వుండగలిగిన చోటుకుపోయింది.

ఇప్పుడామె కా కలలో అటువంటి భావమే కల్గింది.

"ఇప్పుడేం చేస్తున్నావు వరీనియా?" అతనడిగాడు.

"వాళ్ళు నన్ను ప్రశ్నిస్తున్నారు."

"ఎవరు?

"వాళ్ళు" అని ఆమె సెనేట్ సభ్యుల్ని చూపించింది. "వాళ్ళు నన్ను హడల గొట్టేస్తున్నారు." పాలరాతి ఆసనాలలో ఆసీనులైన రాతిగుండెలుకల గౌరవనీయులైన ఆ సభ్యులు నిర్విణ్ణులై శిలారూపం దాల్చినట్లూ నిశ్చేష్టులై అచేతనులై కొరడు వారినట్లూ తలచింది వారిని చూసి వరీనియా.

"కాని చూసేవూ వాళ్ళే హడలిపోతున్నారు" అది అతనిలోని ప్రత్యేకత. అతనొక విషయం చూస్తాడు. దాన్ని సూటిగా సులభంగా హృదయానికి హత్తుకు పోయేలా చెప్తాడు. అతనంత సులభంగా చూడగల, చెప్పగల విషయాన్ని తను మాత్రం యెందుకు చూడలేకపోయింది! "నిజమే పాపం వాళ్లు చాలా భయపడి పోతున్నారు."

"సరే పోదాం రా వరీనియా" స్పార్టకస్ చిరునవ్వు నవ్వేడు. ఆమె నడుం చుట్టూ అతని చేయి పెనవేసుకుంది. ఆమె చెయ్యి అతని నడుంచుట్టూ వేసింది. సెనేట్ భవనాన్ని వదలి వాళ్ళు రోమ్ పురవీధుల్లో ప్రవేశించారు. వాళ్ళు ప్రేమికులు. అల్లా వాళ్ళు రోమ్ వీధులలో నడుస్తున్నారు. ఎవరూ వాళ్ళని చూడలేదు. ఎవరూ ఆపలేదు.

ఆ కలలోనే స్పార్టకస్ చెప్తాడు: "నీతో ఉన్నప్పుడల్లా యిల్లాగే ఉంటుంది. నువ్వు నాతో కూడా ఉన్నప్పుడల్లా నువ్వు నాకు కావాలనే అనిపిస్తుంది. అబ్బ ఎంతగానో కావాలి."

"కావలసినప్పుడల్లా నన్ను నువ్వు పొందచ్చుగా."

"ఔననుకో, ఔననుకో, అది జ్ఞాపకం ఉంటుందంటావా యెప్పుడూ. నీ క్కావలసిం దేదైనా యెప్పుడో ఒకప్పుడు యింకచాల్లే అనిపించవచ్చు, కాని నాకో, నువ్వు నా కెప్పుడూ కావాలి? ఇంకా యింకా మరింతగా కావాలి. నేను కూడా నీ కల్లాగే కావాలా?"

"సరిగ్గా అల్లాగే కావాలి."

"నన్ను చూసినప్పుడల్లానా?"

"ఆ అల్లాగే అనుకుంటా. నేను నిను చూసినప్పుడల్లా నువ్వు కావాలి." ఇంకొంచెం దూరం వెళ్ళేరు వాళ్ళు. అప్పుడు స్పార్టకస్ అన్నాడు. "నేనెక్కడికైనా మరోచోటికి వెళ్ళాలి. మనిద్దరమూ వెళ్ళాలి. మరోచోటికి పోయి పడుకోవాలి."

"ఒకచోటికి పోదామా? నాకో చోటు తెలుసు" కలలోనే అన్నది వరీనియా.

"ఎక్కడికి?"

"క్రాసస్ అని ఒకడున్నాడులే, వాడింటికి. నేనిప్పుడక్కడేగా ఉంటున్నది." అతనాగాడు చేతిని లాగేసుకున్నాడు. ఆమె ముఖాన్ని తనవైపు తిప్పుకొన్నాడు. ఆమె కళ్ళల్లో దేనికోసమో వెతుకుతున్నాడు. చూస్తున్నాడు. అప్పుడతనికామె బట్టలమీద పాల తడి కనిపించింది.

"అదేమిటి?" అడిగాడతను. ఆమె క్రాసస్‌గురించి చెప్పిన మాటలు మరచి పోయా డీ సందర్భంలో.

"పాలు పిల్లాడి కివ్వడానికి."

"నాకు పిల్లాడులేడే" అన్నాడు. వెంటనే భయం తన నావరించింది. ఆమెనుండి నాలుగడుగులతను వెనక్కేసేడు. అతనంతర్ధానమైపోయాడు. మాయమైపోయాడు. ఇంక కనబడడు. అప్పుడా కలకూడా మాయమైపోయింది. వరీనియాకి మెళుకువొచ్చింది. చీకటీ; ఆ చీకటిలో తనూతప్ప యింకేంలేదా గదిలో.

# 8

ఆ మర్నాడు క్రాసస్ పల్లెలకు పోయాడు. చీకటిపడుతోంది. అనుకున్న ప్రకారం వరీనియాను తీసుకొచ్చాడు ఫ్లేవియస్. అప్పుడు భోజనం చేస్తుంటాడు గ్రాఛూస్. ఒక బానిసవెళ్ళి అతనికి చెప్పింది. బైట ఫ్లేవియస్, ఒక స్త్రీ నిలబడివున్నారని, ఆ స్త్రీ చేతిలో ఒక పిల్లాడున్నాడనీ.

"అవును-అవును నాకు తెలుసు. ఆ పిల్లాడికోసం ఒకచోటు కూడా యేర్పాటు చేసేం. వెళ్ళి వాళ్ళను లోపలికి తీసుకురా." ఇంతలోనే అతనన్నాడు. "ఒద్దొద్దు. నువ్వుండు. నేనే తీసుకొస్తా." వీధి గుమ్మందాకా అతను పరుగెట్టేడనే చెప్పాలి. వాళ్ళిద్దరినీ అతనే తీసుకొచ్చాడు. అతనిలో వినయం ఉట్టిపడుతోంది. ఎంతో మంచిగా ఉన్నాడు. గౌరవనీయులైన అతిధుల్నెలా ఆహ్వానించాలో అలా ఆహ్వానించాడు.

ఆ స్త్రీ ఒక పొడుగాటి వస్త్రాన్ని కప్పుకుంది. మేలిముసుగు ముఖాన్నికూడా కప్పుతోంది. క్రీనీడగా ఉన్న గుమ్మంలో మేలి ముసుగుచే కప్పబడ్డ ఆమె ముఖం యెల్లా ఉందో అతనికి తెలియలేదు. ఇంకొక్క క్షణంలో ఆమెను పూర్తిగా చూడచ్చు. వాళ్ళని లోపలికి తీసుకొచ్చాక ఆ పిల్లాడ్ని అతనికోసం ప్రత్యేకించిన గదిలోనికైనా పంపచ్చు లేక తనకైనా యివ్వవచ్చునని చెప్పాడు. ఆమె చేతులలో ఉయ్యాలలో పడుకున్నట్లు పడుకున్నాడా పసికందు. పిల్లాడ్ని గురించి ఆమెకు అనుమానం కలిగించే

విధంగా మాట్లాడతా నేమోనన్న భయం అతనికి కల్గింది. ఏం మాట్లాడితే యేం భయ పడుతుందో అని అతని భయం.

"పిల్లల కొక గదే తయారుచేయించా. బుల్లి ఉయ్యాలొకటుంది. నీకేం కావా లంటే అది ఉంది. ఎంతో సదుపాయంగా, సురక్షితంగా ఉండగలడా గదిలో. అతని కేమీ జరగదక్కడ."

"అంతెందుకు" వరీనియా అంది. మొదటిసారిగా గ్రాఛూస్ ఆమె మాట్లాడగా విన్నాడు. మెత్తగా, మృదువుగా ఉందామె గొంతు. ఎంతో లోతునుండి మాట్లాడు తూన్నట్లు అమూల్యమైనదిగా ఉందా కంఠస్వరం. ఇప్పుడామె మేలిముసుగు తొలిగిం చింది. అతనామె ముఖాన్ని చూసేడు. నిడుపాటి ఆమెశిరోజాలు ముడివేసి ఉన్నాయి. ఆశ్చర్యమే యిది. ఆమె ముఖానికి కృత్రిమమైన రంగులేవీలేవు. అందుకే ఆమె ముఖం యెంతో అందంగా, సహజంగా, తీర్చిదిద్దినట్లు కనిపించిందాతనికి.

గ్రాఛూస్ ఆమెకేసి చూస్తూంటే ఫ్లేవియస్ అతన్ని పరిశీస్తున్నాడు. ఏమిటి దంతా అన్న సంగతి అంతుబట్టక గాభరాగా, ఆలోచనతో ముడుచుకు పోయిం దతని ముఖం. అల్లా చూస్తూ నిలబడిపోయాడు, మాట్లాడలేకపోయాడు. అక్కడ నిలబడడం కష్టం. ఆఖరుకి మాట్లాడ గలిగాడు.

"తక్కిన యేర్పాట్లన్నీ చెయ్యాలి గ్రాఛూస్, వెళ్ళి తెల్లారే లోపున తిరిగొస్తా. అప్పటికి మాత్రం నువ్వు సిద్ధంగా ఉండాలి."

"ఓ సిద్ధంగానే ఉంటా" గ్రాఛూస్ తలూచాడు.

ఫ్లేవియస్ సెలవు తీసుకున్నాడు. పిల్లాడికోసం ప్రత్యేకించిన గదిలోకి ఆమెను తీసుకెళ్ళేడు. అక్కడొక బానిస కూచుని ఉంది. ఆ బానిసను చూపిస్తూ గ్రాఛూస్ చెప్పుకుపోతున్నాడు.

"రాత్రంతా ఆమె యిక్కడే కూచుంటుంది. పిల్లాడ్ని చూస్తు కూచుంటుంది. దృష్టి మరల్చకుండా తెల్లవార్లూ కూచుని ఉంటుంది. నీ పిల్లాడికేమైనా అవుతుందేమో నన్నబెంగ నీకక్కర్లేదు. పిల్లా డేడిస్తే తక్షణం నిన్ను పిలుస్తుందది. నీకేం బెంగలేదు."

"పిల్లాడు పడుకొంటాడు లెండి" వరీనియా చెప్పింది. "మీరు చాలా దయగా ఉన్నారు. వాడికేం ఫరవాలేదు."

"అసలు పిల్లాడి యేడుపే వినబడదు. ఏడుస్తాడని అనుమానం తగిలేసరికే యిది నిన్నొచ్చి పిల్చుకెళ్తుంది. నీ కాకలిగా ఉందా? ఏమైనా తిన్నావా?"

"నేనేం తినలేదు. అలా అని ఆకలీలేదు." వరీనియా అంది. పిల్లాడ్ని పడుకో బెట్టింది. "ఏమీ తినాలనిలేదు; ఎవరికంటా పడకూడదు. ఎవరైనా చూస్తారేమోనని

భయంతో గాభరాగా వచ్చేసాం. కలలో ఉన్నానా అనిపిస్తోంది. మొదట్లో అతన్ని నమ్మడానికి అనుమానం వేసింది. ఎవరో ఏమిటో, కాని తరవాత నమ్మకం కుదిరింది. నా భయమేమిటంటే యెప్పుడో ఒకప్పుడు హఠాత్తుగా మెళుకువచ్చి యీకల కరిగిపో తుందేమోనని."

"పోనీ నే భోజనం చేస్తా. నువ్వుకూడావచ్చి కూచో, నీకూ యేమైనా తినాలని పించచ్చు."

"అల్లాగే కూచుంటా."

వాళ్ళు భోజనాలగదిలోకెళ్ళేరు. ఆతని కెదురుగా వరీనియా కూచుంది. గ్రాఘూస్ యెప్పటిలా చేర్లబడి కూచోలేదు. బిర్రబిగుసుకుని, వరీనియామీద నిల్పినకళ్లు కదప కుండా అల్లాచూస్తు ఉండిపోయాడు. ఏమి గాభరాలేక, అనుమానాల ఆలోచనలులేక, భయాలు సందేహాలులేక తనజీవితంలో తనకెన్నడూ అనుభవంలోలేని మహదానందాన్ని తాను పొందినట్లు భావించాడు గ్రాఘూస్. అది సంతృప్తి. తన గడచిన జీవిత కాల మంతటిలోనూ యీ సంతృప్తి తానెన్నడూ పొందలేదు. అన్యదేశీయం. ఈ ప్రపం చంలో తనకు బాధకలిగించే విరుద్ధాలన్నీ మటుమాయమయినట్లు భావించాడు. తన యింట్లో తాను తను ప్రేమించిన రోమ్‌లో ఆశ్చర్యకరమైన రోమన్ పేటలలోని ఒక పేటలో యిన్నాళ్ళకుకదా సుఖాన్ని చూడగలిగాను అనుకున్నాడు. ఆమెపట్ల అతనిలో ప్రేమ వెల్లువలై జనించి ఝరీవేగంతో ఆమెవైపు పోతున్నట్లు భావించాడు. తన జీవి తంలో తానెన్నడూ యెరుగనిది ప్రేమ. ఇప్పుడతనికా ప్రేమ ఆశ్చర్యకరంగా జనిం చింది. స్పార్టకస్ భార్య వరీనియా యందు కల్గింది ప్రేమ! ఏమిటో ఆశ్చర్యంగా ఉందతనికి. దానికి కారణమేమై ఉంటుందా అన్న మానసికతత్వ విచారణలో పడలే దతను. అంత ప్రేమా తనలో ఉన్నదన్న సంగతి ఆతనెరుగును. ఇంక యెందుకు అకారణ కారణాన్వేషణం?

ఆహారం గురించి మాట్లాడేడు గ్రాఘూస్. "క్రాసస్ యింట్లో భోజనం చేసేక నేచేసే భోజనం చాలా స్వల్పంగా కనబడచ్చు నీకు. పళ్ళూ, ఉడకబెట్టిన మాంసమూ, చేపలూ తప్ప యింకేమీ తినను, ఒక్కప్పుడెప్పుడైనా యేదో ఒక పిండివంట చేయించుకుంటా ఈవేళ బాగా వండిన పిట్ట మాంసం తింటున్నాను. నీళ్ళు కలిపిన ద్రాక్షసారా——"

*ఆమె యీ మాటలేవీ వినడంలేదు. అనూహ్యమైన గ్రాహ్యశక్తితో అతనామె నడిగాడు. "నీ కేమీ అర్థం కావడంలేదుకదూ. రోమన్లం అస్తమానూ యీ తిండి గురించే మాట్లాడుతుంటే నీకేమీ బోధపడదు యేం?"*

"ఏమీ బోధపడదు" ఆమె అంగీకరించింది.

"ఎందుకు బోధపడదో నాకు తెలియదు. మా జీవితాలు యెంత శూన్యమైనవో అన్న విషయం మే మెప్పుడూ మాట్లాడుకోం. ఎందుచేతంటే యేదో ఒక చెత్త తీసుకొచ్చి మా జీవితాలనిండా నింపేస్తాం. బర్బరులు ప్రకృతిసిద్ధంగా, సహజంగా కావించే యీ తినడం, త్రాగడం, కామించడం మొదలైన స్వల్ప విషయాలనుండి బ్రహ్మాండమైన కర్మకాండనూ, ఒక తతంగాన్నే మహోత్సవాన్నీ సృష్టించాం మేం. ఆకలి గురించి యెప్పుడూ మాట్లాడతాం కాని మాకు పట్టుమని ఆకలివేసిన పాపానపోదు. దప్పిక గురించి మాట్లాడతాంకాని అది మాకు అనుభవంలో ఉండదు. ప్రేమను గురించి మాట్లాడుతాం కాని ప్రేమించి అంతులేని సరికొత్త కల్పనలతో, విశ్వామిత్ర సృష్టిచేస్తూ, యెంతో వక్రబుద్ధితో సహజమైన వాటికి ప్రత్యామ్నాయంగా యెన్నెన్నో కృతకమైన వాటిని సృష్టిస్తాం. సహజమైన సంతోషానికి బదులు కృత్రిమమైన వినోదాన్నారాధిస్తాం. ప్రతి వినోదమూ కొన్నాళ్ళకు పాతబడిపోతుంది. అది పాతబడ్డాక మరొక కొత్తది, యింకా యింకా వినోదమైనది మరింత ఆవేశజనకంగా ఉండేది కనిపెడతాం. మతి పోగొట్టుకొనేటంత పశుత్వం పొందుతాం మేము. ఆ మతిహీనత మాలో పెచ్చు మీరుతుంది. నేన్నది నీకేమైనా బోధపడుతుందా?"

"కొంతమటుకు బోధపడుతోంది" వరీనియా సమాధాన మిచ్చింది.

"వరీనియా! నిన్ను నే నర్థంచేసుకోవాలి కూడా. ఇదంతా ఒక కలేమోనని నువ్వెందుకు భయపడుతున్నావో కూడా తెలుసుకోవాలి. అవవలసినదంతా అయింది. నువ్వు ఒప్పుకుంటే ఆ క్రాసస్ నిన్ను పెళ్ళాడును కూడా. రోమ్ అంతటికీ అతను గొప్పవాడు. వాడి అధికారమూ, శక్తీ, పలుకుబడీ నమ్మశక్యం కాదంటే నమ్ము. ఈజిప్టు నవాబులు తెలుసా నీకు?"

"తెలుసు."

"ఆఁ—ఆ నవాబుకున్న అధికారంకన్న క్రాసస్‌కే యెక్కువుంది. ఈజిప్టురాణీకన్న నువ్వు గొప్పగా ఉండచ్చు. నీకిది సరదాగా ఉండదా!"

"స్పార్టకస్‌ని చంపినవాడితోనా?"

"ఆ. కాని ఆలోచించు. అతను తానై వ్యక్తిగతంగా చంపలేదు స్పార్టకస్‌ని. అతనికి స్పార్టకస్ యెవరో తెలియదు. అతనియందు వ్యక్తిగత ద్వేషమూ లేదు. నేనూ ఆ పాపంలో సమభాగినే. కాని స్పార్టకస్ చచ్చిపోయాడు. నువ్వు బతికున్నావు. క్రాసస్ యివ్వగలిగినది నీకొద్దా?"

"నాకొద్దది" వరీనియా అంది.

"నీక్కావలసిందేమిటి వరీనియా?"

"స్వాతంత్ర్యం కావాలి నాకు," ఆమె చెప్పింది. "ఇంకెప్పుడూ యీ రోమ్‌ను చూడనవసరంలేని పద్ధతిలో యిక్కడ్నించి పోవాలని ఉంది నాకు. రోమ్ పీడ నాకు విరగడైతే అదే చాలు. నా కొడుకు స్వతంత్రుడుగా పెరగాలని ఉంది నాకు."

"స్వతంత్రం అంటే అంతయిదెందుకు?" గ్రాఘూస్ యథార్థంగానే గాభరా పడ్డాడు, ఆమె స్వతంత్ర్యేచ్ఛను చూసి. "ఎందుకీ స్వాతంత్ర్యం? ఆకలితో అలమటించడానికా స్వాతంత్ర్యం. ఒకడిచేతిలో దారుణంగా చావడానికా యీ స్వాతంత్ర్యం. ఇల్లూ వాకిలీ లేకుండా పోడానికా యిది? రైతుకూలీగా పొలంలో రెక్కలు ముక్కలు చేసుకుచావడానికా యీ స్వాతంత్ర్యం? దేనికి?"

"దాన్ని నేనేం చెప్పలేను. క్రాసస్‌కికూడా చెబ్దామనే ప్రయత్నించా. కాని అతనికెల్లా చెప్పాలో, యే భాషలో చెప్పాలో తెలియలేదు. నీక్కూడా యేం చెప్పాలో తెలియడంలేదు" అంది వరీనియా.

"నువ్వు రోమ్ నసహ్యించుకుంటావు వరీనియా! నేను రోమ్‌నే ప్రేమిస్తాను. రోమ్ నా ప్రాణం, నా జీవితం, నా మాతృమూర్తి, నా సర్వశ్వం-రోమ్ ఒక కులటే కావచ్చు. కాని రోమ్ వదిలి నేనొక్కక్షణం బతకలేను. అదీ నాకు తెలుసు. నువ్విల్లా కూర్చున్నావా - నా శరీరం అంతా ఆ రోమ్ ఆవహించి ఉంది. కాని నువ్వు దాన్నసహ్యించుకుంటావు. స్పార్టకస్‌కూడా రోమ్ నసహ్యించుకునేవాడా?"

"అతను రోమ్‌ను వ్యతిరేకించేవాడు, రోమ్ అతన్ని వ్యతిరేకించింది. నీకు తెలుసుగా?"

"రోమ్‌ను నిర్మూలం గావించి దానిస్థానంలో అతనేం నిర్మించదలచుకున్నాడు?"

"బానిసలూ, యజమానులూ అనే తేడా లేకుండా, ప్రజలంతా కలసి మెలసి శాంతియుతంగా, సోదరత్వంతో మనగల ప్రపంచాన్ని కోరాడు స్పార్టకస్. రోమ్‌లోని మంచినంతటినీ తీసుకుని మనం చుట్టూ ప్రహరీగోడలు లేని మహానగరాలు నిర్మిద్దామని చెప్పేవాడు. అప్పుడు ప్రజలంతా శాంతి సౌహార్ద్ర సమతాభావాలతో బ్రతుకుతారు, అప్పుడీ ప్రపంచంలో యుద్ధాలనేవే వుండవు. దౌర్భాగ్యం వుండదు. కష్టాలు కాపురం చేయవు."

గ్రాఘూస్ చాలాసేపు నిశ్శబ్దంగా ఉండిపోయేడు. వరీనియా అతన్ని నిర్భయంగా, యేమిటీ వింత అన్నట్లు చూసింది. మేరు పర్వతమంత ఉన్న యీ వ్యక్తి నామె నమ్మదలిచింది. తానెందరినో రోమన్లను చూసింది. కాని యితనిలో వాళ్ళందరి లక్షణాలు లోపించాయా అనుకొంది. ఇతనెంతో తేడాగా కనపడ్డాడు. విచిత్ర మేమి

టంటే యితనిలో నిజాయితీకేమీ కొదువలేదు. కాని అదికూడా విచిత్రంగానే ఉందని పిస్తుంది. స్పార్టకస్‌ను కొంతవరకైనా జ్ఞప్తికి తెచ్చుకుందు కుపయోగపడే యేదో గుణవిశేషమొకటి అతనిలో కనిపించింది. అది ఫలానా అని ఆమె తెలుసుకోలేక పోయింది. అది శారీరకమైనదికాదు. ఒక్కొక్క వ్యక్తిలో ఒక్కొక్క విధంగా కన బడే ఛాందస స్వభావమూగాదు. అతని ఆలోచనా పద్ధతిలోనే ఉందా పోలిక, కొన్ని సమయాల్లో - కొన్ని సమయాల్లో మాత్రమే—స్పార్టకస్ చెప్పినట్లే కొన్ని విషయా లని తను కూడా చెప్తాడు.

తిరిగి మాట్లాడ్డాని కుపక్రమించే ముందు చాలా మౌనంగా ఆలోచిస్తూ కూచున్నాడు గ్రాఛూస్. ఆమె చెప్పి క్షణంకూడా కానట్లూ, వరీనియా అన్నదానికి వెనువెంటనే సమాధానమిస్తున్న వాడిలా అందుకొని ఆమె చెప్పిన దానిమీద వ్యాఖ్యా నించాడు.

"అయితే అదన్నమాట స్పార్టకస్ స్వప్నం, కొరడాలూ, కొరడా దెబ్బలూ లేని మహాభవనాలు, మట్టిపాకలూ అనే తేడాలేని మరో ప్రపంచాన్నతడు సృష్టించ పూనుకొన్నా డన్నమాట, యెవడికి తెలుసు! నీ కొడుక్కేం పేరు పెట్టేవు వరీనియా?"

"స్పార్టకస్, మరింకే పేరు పెట్టగలను."

"స్పార్టకస్ అనా, ఓ బాగుంది, దివ్యంగావుంది. ఆ పిల్లాడు పొడుగ్గా బలంగా, ఆత్మవిశ్వాసంతో పెరిగి పెద్దవాడవుతాడు, అప్పుడు నువ్వతనికి తండ్రిగురించి చెప్తావు కదూ?" గ్రాఛూస్ అమాయకంగా ప్రశ్నించాడు.

"ఆ చెప్తాను."

"ఎల్లా చెప్తావు? ఎల్లా బోధించగలవు? నీ కొడుకు పెరిగే ప్రపంచంలో స్పార్టకస్‌లాటివాడు మరొకడుండడే? అలాంటప్పుడు అతని తండ్రి ఎంత సౌమ్యంగా, స్వచ్ఛంగా ఉండేవాడో నువ్వెల్లా చెప్పగలవు?"

"స్పార్టకస్ సౌమ్యంగా, స్వచ్ఛంగా ఉండేవాడని నీ కెల్లా తెలుసు?"

"దాన్ని తెలుసుకోవడ మన్నది అంత కష్టమా?" గ్రాఛూస్ ఆశ్చర్యపోయాడు.

"కొందరి కా విషయం తెలియడం, కొంద రా విషయాన్ని తెలుసుకోవటం చాలా కష్టం. నా కొడుక్కి నేనేం చెప్తానో తెలుసా! బహుశా నీ కర్థమవుతుందను కుంటా. వాడికి నే నో స్వల్పమైన విషయం చెప్తా. తన జీవితకాలమంతా అతను దుర్మార్గాన్ని వ్యతిరేకించాడు. ప్రతిఘటించాడు. రాజీలేని మార్గంలో దుర్మార్గంతో ప్రతి నిత్యమూ పోరాడేడు. అదే నే చెప్తా."

"అయితే అతను స్వచ్ఛమైనవాడెల్లా అయాడు?"

"నే నేమంత తెలివైనదాన్ని కాదు. కాని అల్లాగుంటేనే స్వచ్ఛమైనవాడు కాగలడని నా ఉద్దేశ్యం" వరీనియా చెప్పింది.

"ఐతే యిది మంచీ, యిది చెడూ, యిది సన్మార్గం, యిది దుర్మార్గం అని స్పార్టకస్ కెల్లా తెలిసేది?" గ్రాఘూస్ ప్రశ్న.

"అతనిలాటివాళ్ళ కేది మేలు చేస్తుందో అది మంచిది. ఏది హాని చేస్తుందో అది చెడ్డది."

"ఓహో" గ్రాఘూస్ తల ఊపుతూ అన్నాడు.

"స్పార్టకస్ కన్న కలలు కనడానికీ, అతని ఆలోచనాపద్ధతి కల్గడానికీ నాకు వయస్సు మళ్ళింది. లేకపోతేనా, నా కీయబడ్డ జీవితకాలంలో, నే నేంచేసేనో వాటి నన్నిటినిగూర్చి విపరీతంగా కలలు కనేసేవాడినే. ఒక్క జీవితం, ఎంత చిన్నదిగా, యెంత నిరర్ధకంగా, యెంత నిష్ప్రయోజనకరంగా ఉందో అది. అదొక క్షణంలా, మెరపు మెరసినట్లుగా వుంటోంది. ఇక దీంట్లో మతీ, శ్రుతీ ఏమున్నట్లగుపించదు. మనిషి పుట్టేడు. గిట్టేడు. పెద్దలావాటి శరీరాన్ని పెట్టుకుని నే నిక్కడ కూచున్నాను. ఔనుకాని స్పార్టకస్ చాలా అందంగా ఉండేవా డేమిటి?"

అతని యింట్లో ప్రవేశించాక మొదటిసారి ఆమె చిఱునవ్వు నవ్వింది. చిఱు నవ్వల్లా బిగ్గఱగా నవ్వడం ప్రారంభించింది. అల్లా నవ్వగా కళ్ళవెంబడి నీళ్లొచ్చాయి. టేబిలుమీద ముఖం పెట్టుకుని యేడవడం మొదలెట్టింది.

"వరీనియా! వరీనియా! నే నేమైనా అన్నానా?"

"ఏమీలేదు" ఆమె లేచి కూచుని రుమాలుతో ముఖం తుడుచుకుంది. "నువ్వన్న దానికేం కాదు. స్పార్టకస్‌ను నే నల్లా ప్రేమించాను. అతనేం మీ రోమనల్లవంటివాడు కాడు. నా జాతిలోని మొగాళ్ళలాటివాడు కాడు. అతనొక థ్రేషియన్. విశాలమైన ముఖం; బల్లపరుపుగా కనబడే ముక్కూ. అతన్నొకమాటు మేస్త్రీ కొట్టాడులే. అందుకే అతని ముక్కు పగిలింది. కొందరనేవారు ఆ ముక్కువల్లనే అతని ముఖం గొఱ్ఱె ముఖంలా కనిపించేదని. కాని నామటు కతనెల్లా ఉండాలో అల్లా వున్నాడు. అంతే."

వాళ్ళిద్దరిమధ్యా అఖాతా లంతరించిపోయాయి. వొంగి, ఆమె చేతిని తన చేతిలోకి తీసుకున్నాడు గ్రాఘూస్. అతని జీవితంలో అతనెప్పుడూ ఏ స్త్రీకీ అంత చేరువగా, యే స్త్రీ యందూ అంత నమ్మకంతో లేడు. "వరీనియా! వరీనియా!" అతనన్నాడు. "నాలో నేనేమనుకున్నానో నీకు తెలుసా? ప్రేమతో నిండిన ఒక్కరాత్రి ననుభవిద్దామని, ముందనుకున్నాను. మళ్ళీ నా అంతట నేనే కాదనుకున్నా. ఒక్కరాత్రి నీ గౌరవ

మర్యాదలు పొందితే చాలనుకున్నా. చివరకు నా క్కావలసిందల్లా నువ్వొక్క రాత్రి కృతజ్ఞతతో నాతో గడపటం. కాని నిజానికి నువ్వంతకన్న హెచ్చే యిస్తున్నావుగా.''

''అవును,'' వరీనియా మనస్సు విప్పి మాట్లాడింది. అప్పుడతను పూర్తిగా తెలుసుకున్నాడు. ఆమెలో మాయా మర్మమూలేదని, మనసులో ఉన్నదేదో సూటిగా నిర్భయంగా చెప్పడమే కాని పరొకటామెకు చేతకాదని. ఆమెచేతి నాప్యాయంగా ముద్దెట్టుకున్నాడు, ఆ చేతి నామె తనవైపు లాగేసుకోలేదు.

''నా క్కావలసిందదే. ఉదయంవరకూ, యిల్లాగే నాతో మాట్లాడుతూ కావాలంటే కొద్దిగా ద్రాక్షసారా త్రాగుతూ, ఆకలిగా ఉంటే ఏదైనా కాస్త తింటూ, ఇల్లాగే కూచుంటావా నాతో? నీకు చెప్పాల్సిందెంతో ఉంది నాకు. తెల్లారేదాకా యిల్లానే కూచుంటావా, అప్పుడు ఫ్లేవియస్ రథాలు తీసుకొస్తాడు. నువ్వు యెప్పటికీ రోమ్‌ను వదలి వెళ్ళిపోవచ్చు. అల్లా చేస్తావా వరీనియా?''

''నాకూ చెయ్యాలనే ఉంది,'' అన్నదామె.

''నేను నీకు కృతజ్ఞత చూపించే ప్రయత్నం చెయ్యను. ఎందుకంటే అసలా కృతజ్ఞత నీకెల్లా తెలియజెయ్యాలో నాకు తెలియదు కనుకనే!''

''కృతజ్ఞత చూపించడానికి యిందులో యేముంది?'' వరీనియా అంది. ''నేను తిరిగి సంతోషం పొందగలననుకోలేదు. కాని నువ్వు నన్ను చాలా సంతోషపెడుతున్నావు. స్పార్టకస్ పోయాక యిక నాకు నవ్వు రాదనుకున్నాను. ఇంక బ్రతుకొక యెడారికాక మరేమిటి అనుకున్నా? అన్నిటికన్న ముఖ్యమైనది జీవితమే అని అతను చెప్పేవాడు. అప్పటికీ యిప్పటికీ అదే నాకు బోధపడలేదు. ఇప్పుడు నాకు నవ్వుదామనిపించింది. ఎందుకో తెలియదు కాని నవ్వుదామనే వుంది.''

# 9

నిత్యకృత్యాలకు దూరంగా, మనుష్యులింకా నిద్రావస్థలో నున్నప్పుడు, జీవితపు పోటు పాట్లింకా ప్రారంభంకాక పూర్వం, సూర్యోదయమింకా రెండు గంటల కొతుందనగా ఫ్లేవియస్ తిరిగొచ్చాడు. పనిమనిషి యేమీ మాట్లాడకుండా అతన్ని గ్రాఛస్, వరీనియాలున్న గదిలోకి తీసుకెళ్ళింది. అలసటవల్ల గ్రాఛస్ ఒక కుర్చీలో కాళ్ళుపాఅజాపుకుని కూచున్నాడు. అతని పాలిపోయిన ముఖంలో సంతోషం లేకపోలేదు. వరీనియా మంచంమీద కూచుని పిల్లాడికి పాలిస్తోంది. ఫ్లేవియస్‌ను చూసి గ్రాఛస్ పెదవిపై వేలు పెట్టుకుని మాటాడవద్దని సంజ్ఞచేసేడు.

మౌనంగా నిలబడ్డాడు ఫ్లేవియస్. అతని ప్రయత్నం లేకుండానే, అతనికి తెలియకుండానే వరీనియా యొక్క సౌందర్య మతన్నాకర్షించింది. అద్భుతమైన ఆమె సౌందర్యం అతన్ని కట్టిపారేసింది. దీపకాంతిలో కూచుని బిడ్డకు పాలిస్తున్న వరీనియా యెప్పటిదో పూర్వకాలంనాటి రోమ్‌ను జ్ఞప్తికి తెస్తుందెందుకనో!

పాలివ్వడం పూర్తయాక బిడ్డను దుప్పటితో కప్పింది. గ్రాఘూస్ ఆమెకెదురుగా నిలబడ్డాడు. ఆమె చాలాసేపు అతనివైపు చూసింది.

"రథంమీద పోతేనే మంచిదనిపించింది నాకు" ఫ్లేవియస్ వాళ్ళతో అన్నాడు. "ఎంత త్వరగా యెంతదూరం పోగలిగామా అన్నదే చూసుకోవాలి మనం. ఒక రథంలో పరుపులూ, దుప్పట్లూ, శాలువలు ఉన్నాయి! మనం వెంటనే పోవాలి. ఇప్పటికే యెంతో ఆలస్యమయింది. 'ఆలస్యా దమృతమ్ విషం' అన్నారు పెద్దలు."

ఇతని మాటలు వాళ్ళు విన్నట్టులేదు. స్పార్టకస్ యొక్క అందమైన భార్య వరీనియా, లావుపాటి రాజకీయవేత్త గ్రాఘూస్ వీరిద్దరూ ఒకళ్ళనొకళ్ళు చూసుకుంటూ అల్లాగే నిలుచుండిపోయారు. పనిమనిషివైపు తిరిగి వరీనియా అంది:

"ఒక్కక్షణం పిల్లాడిని తీసుకుంటావూ?"

పనిమనిషి పిల్లాడ్నెత్తుకుంది; వరీనియా, గ్రాఘూస్‌వద్దకు వెళ్ళింది. అతనామెవైపు వంగేడు. ఆమె అతన్ని ముద్దెట్టుకుంది. లాలించింది.

"ఇంక నేను చెప్పాలనుకుంటున్నా" వరీనియా అంటోంది: "నువ్వు నా విషయంలో ఎంతో మంచిగా ఉన్నందుకు నీకు నా కృతజ్ఞత, నువ్వు నాతో కనుక రాగలిగితే నేను నిన్ను బాగా చూడటానికి ప్రయత్నిస్తా."

"చాలు వరీనియా! ఆ మాటే చాలు."

"వస్తావా గ్రాఘూస్?"

"నేను నిన్ను బాగా ప్రేమిస్తాను. కాని నేను రోమ్‌వదలి వెళ్ళలేని నిస్సహాయుడ్ని. రోమ్ నా తల్లి, నా తల్లి ఒక కులటే. కాని నిన్ను మినహాయించితే నేను ప్రేమించగలిగిన దామె నొక్కర్తెనే. పైగా నేనొక ముసలాడ్ని. ఏమోయ్ ఫ్లేవియస్! నేనే కనుక ప్రయాణం తలబెడితే నా శరీరంపట్టే రథం దొరుకుతుందంటావు? ఒకవేళ పట్టినా గుర్రాలు మొయ్యగలవా నన్ను? వెళ్ళిరా అమ్మ వరీనియా."

"ఇప్పటికే బోలెడాలస్యమైందని ముందే చెప్పా" ఫ్లేవియస్ చిరాకుగా అన్నాడు. "అప్పుడే యీ గొడవ యెంతలేదన్నా ఓ యాభై మందికి తెలిసిందని చెప్పచ్చు. పెదవి దాటితే పృథివిదాటుతుంది! ఎవళ్ళకీ యిది తెలియదనీ, దీన్నిగురించి యెవరూ చెప్పుకోరనీ అనుకుంటున్నారాయేం?"

"ఆమెను జాగ్రత్తగా చూడు" గ్రాఘూస్ చెప్పాడు. "ఫ్లేవియస్! యిప్పుడు నువ్వొక ధనవంతుడివి. ఇంక నీకు రాజోపచారాలకు వేటికీ లోటుండదు. నా కీ ఒక్కపనీ చేసిపెట్టు. ఆమెనూ, ఆ పిల్లాడ్నీ జాగ్రత్తగా దించిరా. వీళ్ళని ఉత్తరంగా ఆ ఆల్ప్స్ పర్వతాలవరకూ తీసుకుపో. అక్కడి లోయలలో నివసించే గాల్ రైతులు కల్లాకపటమూ లేని అమాయకులు. కష్టపడి పనిచేసి ఒకళ్ళగొడ వక్కర్లేకుండావాళ్ళ మానాన వాళ్ళు బ్రతికే సాధారణ రైతులు. వాళ్ళతో యీామె కాలం గడపగలదు. ఆల్ప్స్ పర్వతాల చేరువుకు పోయేదాకా వాళ్ళను వదలకు, త్వరపడుమరి, గుఱ్ఱాల్ని బాదెయ్యి. కావాలంటే చంపెయ్యి, కొత్తవి కొనుక్కోవచ్చు. ఎక్కడా ఆగకండి, ఏం? ఫ్లేవియస్, చేస్తావా యిది?"

"నీతో అన్నమాట నే నెప్పుడేనా తప్పేనా?"

"లేదులే. వెళ్ళిరామరి."

వాళ్ళను సాగనంపేందుకు గుమ్మందాకా వెళ్ళేడు గ్రాఘూస్. వరీనియా పిల్లాడ్నెత్తుకుంది. అతను గుమ్మంలో నిలబడ్డాడు. ఉదయకాంతి తెలుపెక్కుతోంది. వాళ్లు రథాలలో కూచున్నారు. గుఱ్ఱాలు చురుగ్గా వున్నాయి. చప్టామీద అవి కాళ్ళతో ధ్వని చేస్తున్నాయి.

"వెళ్ళిరా వరీనియా!" అతనామెతో అన్నాడు.

అతనివైపామె రుమాలూపింది. జనసంచారంలేని ఆ సన్నని రోడ్డుమీద గుర్రపు డెక్కల ధ్వని, రథచక్రాల టకటక ధ్వనీ చుట్టుప్రక్కవాళ్ళకు నిద్రాభంగం చేశాయి. వాళ్ళ ప్రయాణం సాగిపోతోంది.

గ్రాఘూస్ తన ఆఫీసుగదిలో కెళ్ళేడు. ఒక పెద్ద కుర్చీలో కూలబడ్డాడు. బాగా అలసటగా వుంది. కళ్ళు మూసుకున్నాడు. కాని నిద్రపట్టలేదు. సంతృప్తి యింకా అల్లానే ఉండిపోయింది. కళ్ళుమూసుకుని ఆలోచన లిటూ అటూ పోనిచ్చాడు. ఎన్నెన్నో జరిగిపోయాయి. వీటినిగురించి తలపోసేడు. తన తండ్రి ఒక బీదవాడు. జోళ్ళు కుట్టుకుని పొట్ట పోషించుకునేవాడు. ఆ రోజులింక రావు. ఆ రోజుల్లో రోమన్లంతా కష్టపడి పనిచేసేవారు. ఆ కష్టం వాళ్ళల్లో స్వాతిశయాన్ని కల్గించేది. వీధులలో తను రాజకీయా లభ్యసించాడు. రౌడీమూకల కొట్లాటలూ, ఓట్లనమ్మడం, కొనడం, జనసమూహాలను యెల్లాపడితే అల్లా తిప్పుకొని ఉపయోగించుకోగలగడం యివన్నీ జ్ఞాపకమొచ్చాయి. ఆ రోజుల్లోకూడా యింత జరుగుతున్నా, స్వతంత్రబుద్ధికల నిజాయితీ ఉన్న రాజకీయ వేత్తలు కొందరు లేకపోలేదు. రైతులను భూములనుండి వెళ్ళగొట్టి, చౌకగా లభించే బానిసలచే వ్యాపారపంటలు పండించి లాభాలార్జించడమే పరమావధిగా పెట్టుకొన్నవారి

నా రాజకీయవేత్తలు వ్యతిరేకించేవారు. అసలా పద్ధతికే స్వస్తిచెప్పి పటిష్టమైన, ఒడుదుడుకులులేని ఆర్థిక విధానంకోసం పోరాడేవారు. శిష్టసభలలోను న్యాయ స్థానాలలోనూ, బహిరంగంగా కూడా వాళ్ళు ధైర్యంగా తమ వ్యతిరేకతను చాటేవారు. ప్రజలకు విజ్ఞప్తి చేసేవారు. ఒక్కొక్కప్పు డుద్రేకపూరితులై గర్జించేవారు. అన్యాయాన్నీ దౌర్జన్యాన్నీ ప్రతిఘటించేవారు. గ్రాఛూస్ వాళ్ళనర్థం చేసుకోగలిగాడు. చేసుకున్నాడు. వాళ్ళ మాటలలోని న్యాయాన్నీ వాళ్ళ ఉద్యమంలో నిజాయితీనీకూడా అర్థం చేసుకున్నాడు. అతని గొప్పతనం అదే. కాని యెవరెంతచేసినా వాళ్ళ పోరాటం రక్తపుటేరులలో ముంచబడుతుందనీ, పూర్తిగా విఫలమౌతుందని కూడా అతనికి తెలుసు.

చరిత్ర ఒక గడియారంలాటిది. దాన్నెవరూ వెనక్కు తిప్పలేరు. ఆ గడియారం యెప్పుడూ ముందుకే పోతూవుంటుంది. ప్రజల స్వేచ్ఛాస్వాతంత్ర్యాలకు భంగంవాటిల్లుతున్నదని, ప్రజల న్యాయమైనహక్కులు భుక్తమౌతున్నాయని గ్రహించి పోరాడినవాళ్ళను నాశనం చెయ్యవలసిందని చెప్పి తనముతాల నతడు పంపేడు. న్యాయబుద్ధికల, నిజాయితీకల సిద్ధాంతాలుకల రాజకీయవేత్తల నతడు చంపించాడు.

ఇప్పుడు దాన్నిగురించే ఆలోచించాడు, కాని విచారించలేదు. అయ్యో? పాపం అని జాలికూడా కల్గలేదు. ఎందుకదంతా? అల్లా జరిగిందా? అని ఆలోచించసాగేడు. ఆదిమానవుడు సర్వస్వతంత్రుడు. కొండలలో గుహలలో నివసించిన ఆదిమానవులు స్వేచ్ఛనే అనుభవించారు. కాని నానాటికి సాంఘిక రాజకీయార్థికవ్యవస్థలు క్లిష్టతరమై పోయి పూర్వం అనుభవించిన స్వేచ్ఛలను మానవుడు కోల్పోయాడు. ఈ విధంగా స్వేచ్ఛలు హరింపబడకూడదని ఆ రాజకీయవేత్తలు మానవుని పూర్వస్వాతంత్ర్యం కోసం పోరాడేవారు. అయితే ఈ పూర్వస్వాతంత్ర్యమనేది ఒకటుందా అసలు? ఆదిమ మానవుడు స్వేచ్ఛాజీవియగునా? ఇప్పుడే తనయిల్లు వదలి ఒకర్తె వెళ్ళింది. ఆమెలో స్వతంత్రేచ్ఛ నిప్పులారాజుకుంది. దావానలమై వ్యాపించింది. అందుకే తనకొడుక్కి స్పార్టకస్ అని నామకరణం చేసింది. ఆ కొడుకు తన కొడుక్కి కూడా స్పార్టకస్ అన్నపేరే పెట్టొచ్చు. అసలెప్పుడయినా బానిసలకు బానిసత్వంవల్ల సంతృప్తి కలుగుతుందీ? అతనికేమీ సమాధానం దొరకలేదు. అందుకు విచారించలేదు కూడా. సంపూర్ణమైన బ్రతుకు బ్రతికేసేడతను. అందుచేత ఆ బెంగకూడా లేదు. చరిత్ర ప్రపంచాన్నొక బ్రహ్మాండమైన ఊపూపిపారేసింది. ఆ ఊపులో అతనొక క్షణంమాత్రమే, రెప్పపాటు కాలం మాత్రమే. అదే అతనికి ఊరట కల్గింది. తను ప్రేమించిన రోమ్ సహనశక్తి కలది. ఎప్పటికీ అది సహించగలదే. భయమనేది లేకుండా, వ్యత్యాసాలు లేకుండా ప్రజలు జీవించగల పరిస్థితులు కల్పించడంకోసం స్పార్టకస్ అనేవాడే కనుక తిరిగి

వచ్చి రోమ్‌నగరపు గోడలు పగలగొట్టడమే సంభవి స్తే రోమ్‌యొక్క చెడు యెల్లా ఉన్నా దాన్ని మనసారా ప్రేమించిన గ్రాఛూస్‌వంటి వాళ్ళెందరో ఉండేవారనీ అతనికి తెలిసితీరుతుంది.

ఇప్పుడతను స్పార్టకస్ కన్నకలను గురించి ఆలోచించాడు. అది నిజమేనా? సజీవమైనదేనా? నిలబడగలదేనా? దుర్మార్గాన్ని వ్యతిరేకించి పోరాడిన వ్యక్తులు స్వచ్ఛంగా, స్వార్థరహితంగా వుంటారని వరీనియా చెప్పినది నిజమేనా? అటువంటి వాళ్ళను తానెప్పుడూ చూడలేదు. స్పార్టకస్‌ను అతనెప్పుడూ చూడలేదు. కాని వరీనియా నతనినెరుగును. ఇప్పుడు స్పార్టకస్‌లేడు. వరీనియాకూడా లేదు. అదొక కల. ఆ కలలో అతను వరీనియాయొక్క విజ్ఞానపు సరిహద్దులను మాత్రమే స్పృశించగలిగేడు. కాని అతని కటువంటి అనుభవం యిదివఱకు లేదు. ఇక వుండ బోదు.

అతని పనిమనిషి వచ్చింది. ఆమెవైపేదో కొత్తగాచూశాడు. "ముసలమ్మా యేం కావాలి?" అతనామెను నెమ్మదిగా అడిగాడు.

"స్నానానికి రావచ్చు బాబూ."

"నేనీవేళ స్నానం చెయ్యనే" అతనామెతో చెప్పేడు. అది విని ఆమె గాబరా పడడం విస్మయం పొందడం చూసి ఆశ్చర్యపోయాడు. "చూడు ముసలమ్మా ఈ వేళంతా మారిపోయింది;" చెప్పుకుపోయాడు. "ఆ బల్లమీద వరసగా సంచులున్నాయి. దాస్యత్వ విమోచనా పత్రాలున్నాయి. నా బానిసలందరికోసమూ పెట్టేనవి. ప్రతి సంచి లోనూ యిరవై వేల సిస్టెర్‌సర్ లున్నాయి. నువ్వొకటి తీసుకో. మన బానిసలందరికీ తలొకటీ ఇయ్యి. అప్పుడు మీరంతా యిక్కడ్నించి పొండి. మరొకమాట మాటాడ కుండా వెంటనే చెప్పినదేదో చెయ్యి ముసలమ్మా."

"నాకేం అర్థంకాలేదు బాబూ."

"కాలేదా? నువ్వెందు కర్థం చేసుకోలేవు? నేనంతా స్పష్టంగానే చెప్పాకదా. మరోభాషలోకూడా మాట్లాడలేదు. మీకు స్వేచ్ఛలభించింది. ఈ డబ్బుకూడా వచ్చింది. నామాట వినకపోతే మిమ్మల్నెప్పుడైనా నేను వదిలేశానా?"

"ఔనుబాబూ మరి మీ కెవరు వండిపెడతారు? మీ గురించి యెవరు శ్రద్ధ చేస్తారు?" ముసలిది అమాయకంగా అడిగింది.

"చచ్చుప్రశ్న లేం వెయ్యకు, నే చెప్పినట్లు చెయ్యి."

వాళ్ళు వెళ్ళేసరికో యుగం పట్టినట్లనిపించింది గ్రాఛూస్‌కు. బానిసలుపోయాక యిల్లంతా నిశ్శబ్దంగా ఉంది. కొత్తగా, వింతగా నిశ్శబ్దంగా వుంది. సూర్యుడుద

యిస్తున్నాడు. వీధుల్లో జనసంచారమూ, బళ్ళ చప్పుడూ వినిపిస్తున్నాయి. కాని గ్రాఘస్ యింట నిశ్శబ్దం తాండవించింది.

తిరిగి తన ఆఫీసుగదిలో కెళ్ళేడు, బీరువాతలుపులుతీసి దాన్లోంచి చిన్న స్పానిష్ కత్తి నొకదాన్ని తీసాడు. దానిపిడీ, ఒరా చాలా అందంగా తయారుచెయ్యబడ్డాయి. ఆ కత్తి తనకొక పవిత్రకార్య సందర్భంలో బహూకరించబడింది. ఏ సందర్భంలో యిచ్చారా అన్న దతనికెప్పుడూ జ్ఞాపకంరాదు. ఇది ఆశ్చర్యకరమైనా కాకపోయినా అతనికా తెలివితేటలే నిశితాసియని అతననుకోడంమాత్రం ఆశ్చర్యకరమైనదే!

ఒరలోంచి కత్తి పైకితీసేడు. మొన చూసేడు. చాలా వాడిగా ఉంది. కుర్చీలో కూచుని ఒకచేతిలో బొజ్జ నిమురుకుంటూ ఆలోచిస్తున్నాడు. తనను తానే చంపుకోడమా అనుకుని నవ్వుకున్నాడు. అదేమంత గౌరవమైన పని? గౌరవం మాటటుంచి పరమ ఛండాలమైన పని. రోమన్ పద్ధతిలో యీ కత్తితో తనను తాను పొడుచుకోగల సాహసం తనకుందా అని అనుమానించాడు. తనకాబలం వుందీ? ఏదో ఒకచోట కాస్తంత పొడుచుకుని ఒకటో, అరో నరంతెగి రక్తం కారుతుంటే ఆ రక్తంలోపడి పొర్లుతూ సహాయంకోసం అరిచే పరిస్థితి రాదని యెల్లా చెప్పగలడు. హత్య చెయ్యడం మానవజీవితంలో యెటువంటిదో! తనిన్నాళ్ళూ యెప్పుడూ ఒక కోడిపెట్టను కోసిన పాపానకూడా పోలేదు.

అదేం ధైర్యానికి సంబంధించిన విషయం కాదని, అప్పుడతననుకున్నాడు. ఎప్పుడో అప్పుడతను చావంటే వెరిచేవాడు. చిన్నప్పుడే దేవుడ్ని గురించి శిల్పచాతుర్యంతో చెప్పే కథల నసహ్యించుకుని వేళాకోళం చేసేవాడు. పునర్జన్మ సిద్ధాంతాన్ని కొట్టిపారేసేడు. అతను చెయ్యవలసినదేదో నిర్ధారణ చేసుకున్నాడు. కాని గౌరవంగా చేసి బైటపడతానా లేదా అన్న అనుమానమే అతన్ని బాధించింది.

ఇల్లా ఆలోచిస్తు ఆ కుర్చీలో నిద్రపోయేవాడే కాని వీధితలుపు విరిగి చెక్కలయేటంత గట్టిగా బాదుతున్నారెవరో. దాంతో అతనికా నిద్రమత్తు వదిలింది. తలుపు చప్పుడు విన్నాడు.

"ఎంతగీర!" అతననుకున్నాడు. "ఎంతగీరరా నీకు క్రాసస్! మనిషి కుండాల్సినంత కోపం ఉందే నీకు. యుద్ధంలో నువ్వుపట్టుకున్న దా న్నీ ముసలాడు తస్కరించి నిన్ను తనచుట్టూ తిప్పించుకున్నాడనేనా! కాని నువ్వామె నసలు ప్రేమించావూ! స్పార్టకస్‌ను మేకులేసి శిలువకు దిగగొడదామనుకున్నావుకాని అతను దొరకలేదు, చచ్చిపోయాడు. ఇప్పుడేమో ఆ వరీనియాను పాదాక్రాంతం చేసుకుందామనీ, నీ కాళ్ళ దగ్గిర పడి పొర్లేలా చేసుకుందామనీ అనుకున్నావు. అదీ కుదరలేదు, ఓరి క్రాసస్!

మూర్ఖపువెధవా! ఎల్లాటి తప్పుడు ముండాకొడుకువిరా నువ్వు! అయినా నీలాటివాళ్ళ వేలే రోజులు. దాంట్లో అనుమానంలేదు."

కత్తికోసం చూసుకున్నాడు. కనబడలేదు. కిందకు దిగి వెతికాడు. కుర్చీ కింద పడింది. కత్తిమొన గుండెలకెదురుగాపెట్టి అన్చి పట్టుకుని మోకాళ్ళమీద నిలబడి ముందుకు వాలాడు. కత్తి శరీరంలో దిగబడింది. నొప్పివల్ల బాధవల్ల గట్టిగా అరిచాడు. ఇంకా ముందుకిపడ్డాడు. కత్తి శరీరంలోకి బాగా దూసుకుపోయింది.

తలుపు విడగొట్టి క్రాసస్ లోపలికి ప్రవేశించేసరికి గ్రాఛూస్ ఆ విధంగా కనిపించాడు. అతన్ని వెల్లకిలా పడుకోబెట్టడానికి సేనాని తన బలమంతా ఉపయోగించాల్సి వచ్చింది. రాజకీయవేత్త ముఖం పండ్లికిలించుకొని వికృతంగానే కనిపించింది.

ఆగ్రహంతో అసహ్యంతో క్రాసస్ యింటిముఖం పట్టాడు. ఈ గ్రాఛూస్ నసహ్యించుకున్నంతగా తాను మున్నెన్నడూ యెవరినీ, దేనినీ అసహ్యించుకోలేదు. ఏం లాభం గ్రాఛూస్ చావనేచచ్చాడు. వాడ్నింక తను చెయ్యగలిగిందేమీలేదు.

క్రాసస్ యింటికిపోయేసరికి తనకోస మో అతిథి వేచివున్నాడని చెప్పేరు. యువకుడు కైయస్ అతనికోసం కూచున్నాడు. జరిగినదేమో కైయస్ యెఱుగడు. ఇతను వెళ్ళగానే కైయస్ తానిప్పుడే కేపువానుండి వచ్చినట్లూ, రాగానే తన ఇష్టుడైన క్రాసస్‌ను చూడ్డానికని యింటికైనా పోకుండా నేరుగా యిక్కడికే వచ్చేసినట్టూ చెప్పాడు. చెప్పినవాడూరుకోక క్రాసస్ ఛాతీమీద చేత్తో తడుతూ, నిమురుతూ అతనికి దగ్గరగా నిలబడ్డాడు. అప్పుడు క్రాసస్ అమాంతంగా అతన్ని క్రిందపడేశాడు.

మరో గదిలోకి పరిగెట్టుకునివెళ్ళి పెద్దకొరడా ఒకటి పట్టుకొచ్చాడు. ముక్కులోంచి రక్తం కారుతుంటే గాభరాగా, భీతితో, బాధతో లేచి నిలబడబోతున్న కైయస్‌ని ఆ కొరడాతో చచ్చేలా బాదేడు; కుక్కని కొట్టినట్టు కొట్టాడు.

కైయస్ 'బాబో' 'నాయనో' అని అరిచాడు. అల్లా అతనరుస్తూనే వున్నాడు. క్రాసస్ మరీ గట్టిగా కొడుతూనే వున్నాడు. చివరికతని బానిసలే క్రాసస్‌ని కొట్టకుండా పట్టుకోవలసి వచ్చింది. పడుతూ, లేస్తూ, తూలుతూ బైటపడ్డాడు కైయస్. నొప్పితో, కొరడాతో కొట్టాడుకదా అన్న ఆత్మాభిమానంతో, చిన్నపిల్లాడిలా యేడ్చాడు కైయస్.

# ఎనిమిదవ భాగం: వరీనియాకు స్వేచ్ఛాప్రాప్తి.

గ్రాఘుస్‌తో చేసుకున్న ఒడంబడిక ఫ్లేవియస్ సక్రమంగా అమలుపరిచాడు. గ్రాఘుస్ సంతకంతోవున్న నిరాక్షేపణీయమైన అధికారపూర్వక అనుజ్ఞాపత్రాలు పుచ్చుకొని బయలుదేరారు. వాయువేగ మనోవేగంతోపోతున్నాయి రథాలు. మొదట ఉత్తరాభిముఖంగా సాగిన ప్రయాణం ఆ తరువాత తూర్పుదిక్కుగా సాగిపోతున్నది. ప్రయాణపు తొలిరోజంతా వరీనియా నిద్రపోయింది. పసిబిడ్డని హృదయానికిహత్తుకుని పడుకుంది. కేసియా రాజమార్గం ప్రయాణానికెంతైనా బాగుంటుంది. ఎత్తుపల్లాలు లేనందున యెంత వేగంగా పోయినా బళ్ళకు కుదుపుండదు. మొదటిరోజు మధ్యాహ్నంవరకూ కనికరంలేకుండా గుర్రాల నదిలించారు. చావబాదేశారు. మధ్యాహ్నానికి గుర్రాల్ని మార్చి అక్కడినుంచి కొంచెం నెమ్మదిగా, సావకాశంగా పోనిచ్చారు వాటిని. చీకటిపడేసరికి వాళ్ళప్పుడే రోమ్ వదలి నూరుమైళ్ళకు పైగా ప్రయాణంచేశారు. చీకటిలో గుర్రాల్ని మరొకమారు మార్చారు. వెన్నెల వచ్చింది. చల్లని వెన్నెలలో ప్రయాణం సాగుతూనేవుంది. మైలు తరువాత మైలు వాళ్ళు క్రమిస్తునే వున్నారు.

ఎన్నోమార్లు కాపలా సైనికులు వాళ్ళ నటకాయించారు. సోదాచేశారు. కాని శిష్టసభాముద్రతో సెనేటర్ గ్రాఘుస్ సంతకం చేసిన అనుజ్ఞాపత్రాలే వాళ్ళ దబాయింపు నరికట్టేవి. రథం కొద్దిగా యిటూ అటూ ఊగుతోంది వేగంవల్ల. ఆ రాత్రి వరీనియా చాలాసేపు, రథంలో నిలబడింది. పిల్లాడు ముఖపల్లు దిండ్ల మధ్య దుప్పటిమీద హాయిగా నిద్రపోతున్నాడు. అందమైన రోమన్ వంతెనలకింద శబ్దంతో ప్రవహించే నదీఘోష ఆమెకు వినిపించేది. ప్రపంచమంతా సుషుప్త్యావస్థలో ఉంది. వాళ్ళు మాత్రం పోతున్నారు.

తెల్లారుతుండనగా చంద్రుడస్తమించాడు. వాళ్ళు రోడ్డు వదలి ప్రక్కనేవున్న పచ్చిక బయలులోనికి పోయారు. గుర్రాలను విప్పి వాటికి నీరు పట్టారు. కొద్దిగా యెంగిలిపడ్డాక వాళ్ళుకూడా కంబళ్ళు పరుచుకుని నిద్రపోయారు. వరీనియాకు నిద్ర పట్టడం కష్టమైంది. అలిసిన రథచోదకులకు మాత్రం నడుం వాల్చారో లేదో నిద్ర

పట్టేసింది. కాస్త కునుకు పట్టిందో లేదో ఫ్లేవియస్ వచ్చి లేపేసే దేమిటా అనిపించిందామెకు. గుర్రాలను పూన్చుతున్నంతసేపూ ఆమె పిల్లాడికి పాలిస్తూ కూచుంది. వాళ్ళ బడలిక యింకా తీరకపోవడంవల్ల ఆ చోదకులు వణుకుతూ పనిచేసేరు. ప్రాతఃకాలపు మసకవెలుతురులో ప్రయాణం తిరిగి సాగింది. కొంతసేపటికి వాళ్ళకొక ప్రహరీగోడలు కల పట్టణం కనిపించింది. దాన్నికూడా వాళ్ళు దాటిపోయారు. ఉదయమంతా గుర్రాలను దయాదాక్షిణ్యాలు లేకుండా బాదేరు. దాంతో ప్రయాణం శరవేగాన్ని మించింది. ఈ ఎడతెరపిలేని ప్రయాణం వరీనియాకు కష్టమే అనిపించింది. చాలామార్లు వాంతి చేసుకుంది. తిన్నదంతా కక్కేస్తే పిల్లాడికి పాలుండవేమోననే భయం ఆమెను బాధించింది. కాని సాయంత్రం అయేసరికి ఫ్లేవియస్ ఆమెకు వెన్నా, పాలూ పట్టుకొచ్చి యిచ్చాడు. అవైతే కక్కేసుకోనక్కర్లేదు. కడుపులో నిలుస్తుంది. ఆకాశం మబ్బు పట్టి ఉన్నందున ఆ రాత్రికి ప్రయాణం నిలిపివేశారు.

తిరిగి, ఉదయం కాకమునుపే ప్రయాణం సాగిపోయింది. వీళ్ళు పోతున్న రోడ్డును ఖండించుకుంటూ మరొకరోడ్డు అడ్డంగా యెక్కడికో పోతోంది. వీళ్ళక్కడి కొచ్చేసరికి మధ్యాహ్నమయింది. ఇప్పుడు వాళ్ళు వాయువ్యంగా ప్రయాణం చేస్తున్నారు. సూర్యాస్తమయకాలం, ఆ సాయంసంధ్యలో హిమావృతమైన ఆల్ప్స్ పర్వతాగ్రాల శోభను మొదటిసారిగా చూసింది వరీనియా. తెల్లనివెన్నెల ఆనాటి ప్రయాణానికి సౌలభ్యం చేకూర్చింది. గుర్రాలను చావగొట్టనక్కర్లేకుండానే ప్రయాణం సాగిస్తున్నారు. ఆఖరుసారి గుర్రాలను మార్చడానికని ఆగేరు వాళ్ళు. తెల్లవారుతోందనగా వాళ్ళు ప్రధాన రాజమార్గం వదలి మట్టిరోడ్డుకు మళ్ళారు. ఆ రోడ్డు తూర్పుదిక్కుగా పోతోంది. పోయి పోయి అదొక చక్కని లోయ ప్రవేశించింది. సూర్యోదయమయింది. ఉదయభానుని అరుణకాంతిలో ఆ లోయ మరింత మనోహరంగా, శోభాయమానంగా కన్పించింది వరీనియాకు. లోయకు సరిగ్గా మధ్యభాగంలో ఒక సెలయేరు ప్రవహిస్తోంది. ఇరువైపులా యెత్తైన పర్వతాలున్నాయి. అక్కడికి ఆల్ప్స్ మరింత చేరువ.

రోడ్డు బాగుండక పోవడంవల్ల ప్రయాణవేగం దెబ్బతింది. మట్టిరోడ్డుమీద కుదుపు ఎక్కువైంది. పిల్లాడిని గట్టిగా పట్టుకుని వరీనియా దిండ్లమీద కూర్చుంది. ఒక కత్రవంతెన మీదుగా ఆ బాట కొండపైకి పోతోంది. ఇదివరకే ఆ రోడ్డుమీద బళ్ళు వెళ్ళిన గాళ్ళు పడివున్నాయి. వాటిగుండా యీ రథాలు నెమ్మదిగా అతి కష్టంమీద మెలికలు తిరిగిన రోడ్డు వెంబడి పోతున్నాయి. అంతా యెగుడే అవటంమూలాన గుర్రాలకు చాలా ప్రయాసగా ఉంది. పొలాలలో వంగి పని చేసుకుంటున్న గాల్

రైతులీ అందమైన రథాలను పనులాపి తలెత్తి చూసేవారు. ఆ బలిష్టమైన గుర్రాలు వాళ్ళ దృష్టిని మరీ ఆకర్షించేవి. ఊళ్ళున్న దగ్గర రోడ్డు పొడుగునా చింపిరితలలతో పిల్ల లీ అసాధారణ దృశ్యాన్ని చూసి అమాయకమైన ఆశ్చర్యాన్ని వెలిబుచ్చేవారు.

మధ్యాహ్నం గడిచింది. ఇకపైని రోడ్డు సాగడంలేదు. ప్రయాణం సాగడం కూడా కష్టమే. అప్పటికి వాళ్ళు కొండలమీదకొచ్చారు. అక్కడి కా లోయ స్పష్టంగా, దగ్గరగా కనిపిస్తోంది. విశాలమైన యీ లోయలో అక్కడక్కడొక చిన్న ఊరు కని పిస్తుంది. అక్కడక్కడ తాటాకుకొంప లగుపిస్తాయి. చిన్న చిన్న అడవులు కనిపి స్తాయి. ఎన్నో సెలయేళ్ళక్కడ వింతస్వరాలాలపిస్తున్నాయి. ఎక్కడో దూరంగా ఔనో కాదో తెలియకుండా ఒక పట్టణం కనిపిస్తున్నట్లు తోస్తోంది. ఆ పట్టణం వాళ్ళకు పశ్చిమంగా ఉంది. వాళ్ళా కొండ దిగుతున్నారు. ఉత్తరాభిముఖంగా ఆల్ప్స పర్వత ప్రాంతాలవైపు పోతున్నారు. అక్కడకు పర్వతాలు చాలా దూరంగానే ఉన్నాయి.

కొండెక్కడం ఎంత కష్టమో దిగడం కూడా అంతే కష్టం. ఎప్పటికప్పుడు కాళ్ళు వెనక్కుతన్నిపెట్టి నడుస్తేనే కాని గుర్రాలు పోలేవు. దానికి తోడా రోడ్డు యెన్నో వంపులు తిరిగి, మెలికలు తిరిగి ప్రయాణానికి సుకరంగాలేదు. కింద నున్న లోయను వాళ్ళు సమీపించేసరికే చీకట్లు కమ్ముకున్నాయి. చంద్రోదయమయేదాకా ప్రయాణం వాయిదా వేసారు. వెన్నెట్లో వాళ్ళొక ఘడియ ప్రయాణం చేసి విశ్ర మించారు. ఉదయాన్నే ప్రయాణం సాగించారు. ఇక్కడ రోడ్లేవీ బాగుండ లేదు. అన్నీ మట్టిరోడ్లే. అన్నీ బాగులేనివే. పోయి పోయి ఆల్ప్స పర్వత ప్రాంతంలో ఆగారు.

ఇక్కడే ఫ్లేవియస్ వరీనియావద్ద సెలవు పుచ్చుకున్నాడు. ఒక రోడ్డుమీదామెను దించాడు. అక్కడికి దగ్గరలో యేవీ కనబడడంలేదు. పొలాలూ, తోటలూ తప్ప మరింకేవీ కనుచూపుమేరలో లేవు.

“వెళ్ళొస్తా వరీనియా”అన్నాడతను. “గ్రాఛూస్‌కి నేనేం వాగ్దానం చేసేనో అది నిర్వర్తించాననే నా నమ్మకం. అందువల్ల యేదోకొంత సొమ్ము చేసుకోగలిగా నను కుంటా. ఇక జన్మలో మనిద్దరంకూడా ఆ రోమ్‌లో అడుగుపెట్టం. ఇకమీద ఆ ఊరు మనకు పనికిరాదు. నువ్వు, నీ చంటిపిల్లాడు కూడా సంతోషంగా, హాయిగా బ్రతకా లని కోరుతున్నా. ఈ రోడ్డమ్మటే ఒక మైలుదూరం పోయావంటే నీ కో గ్రామం తగులుతుంది. నడిచివెళ్ళడమే మంచిది. ఈ గుర్రాలూ, రథాలూ అట్టహాసమంతా చూస్తే వాళ్లు గాభరాపడిపోతారు. ఈ సంచిలో ఓ వెయ్యి సెస్టెరసస్ ఉన్నాయి. వీటిని

తీసుకో. ఒక కొంప కొనుక్కోనేందుకూ, యేడాదికి సరిపోయే తిండిగింజలు కొనుక్కోనేందుకూ యీ సొమ్ము చాలు. ఇక్కడి రైతులు అమాయకులు, మంచివాళ్ళు. ఈ కొండలుదాటి నీ స్వదేశానికి పోవాలని వుంటే ఆ రైతులే నీకు కావలసిన సహాయం చెయ్యగలరు. నన్నడిగితే నువ్వా కొండలన్నీ దాటివెళ్ళడం, తీరా వెళ్ళేక నీ వాళ్ళంతా యెక్కడున్నారో తెలియకపోవడం, నానాఅవస్థలూ పడడం మంచిది కాదంటా. మీ జాతివాళ్ళు ఒక్కచోట వుండరు. ఏడాదికొకచోటికి చొప్పున దేశద్రిమ్మరులై తిరుగుతారు. వాళ్ళని కనుక్కోడంకూడా కష్టమే. అదీకాక యీ కొండలలో చిత్తడినేల హెచ్చు. పిల్లాడి ఆరోగ్యం దెబ్బతింటుంది. ఒకరోజులో అయే పనికాదు. ఇక్కడే యెక్కడో అక్కడ కాలక్షేపం చెయ్యడమే మంచిది. ఏమంటావ్ వరీనియా? ఇక్కడికేగా తీసుకురమ్మని నువ్వన్నది?"

"ఇక్కడికేలే ఫ్లేవియస్. నీకు నేను కృతజ్ఞురాల్ని" అందామె.

అప్పుడా రథాలు వెనక్కు తిరిగి వచ్చిన త్రోవనేపోయాయి. వరీనియా పిల్లాడి నెత్తుకుని అక్కడ నిలబడింది. రథాలు పోతుంటే వెనకాల ధూళి రేగుతోంది. మేఘాలు క్రమ్మినట్లెగురుతోంది. ఒక కొండప్రక్కనే రోడ్డు మళ్ళింది. రథాలుకూడా అటు తిరిగేయి. అవింక కంటి కగుపించడంలేదు. అవి రేపిన ధూళి యింకా గాలిలో యెగురుతూనే ఉంది. అవి కనబడకుండా పోయేవరకు వరీనియా వాటిని చూస్తూనే ఉంది.

అప్పుడా రోడ్డువారే ఒకచోటామె కూర్చుని పిల్లాడికి పాలిచ్చింది. తరువాత ఆ రోడ్డుమీద నడచి ఫ్లేవియస్ చెప్పిన పల్లెవైపు వెళ్ళింది. అది వేసవి. ఆనాటి ఉదయం చల్లగా, మనోహరంగా ఉంది. బ్రహ్మాండమైన వినీలాకాశంలో ఒకమూల సూర్యుడుదయిస్తున్నాడు. సూర్యుని రాకను పక్షుల సంగీతం ఆహ్వానిస్తోంది. మేల్కొంచిన తుమ్మెదలు ప్రతీ పుష్పంమీద వాలుతున్నాయి. మధుపానం కావిస్తున్నాయి. వాటి విజయానికి అవే సంతోషిస్తూ అక్కడి వాతావరణమంతా తమ ఝుంకార గానంతో నింపేయి.

వరీనియా సంతోషించింది. స్పార్టకస్‌తో ఉన్న సమయాల్లోకూడా ఆమె సంతోషించింది. కాని యిప్పటి యీ సంతోషం ఆనాటి సంతోషంతో తులతూగేది మాత్రం కాదు. అతను తనకొక అమూల్యమైన జీవిత రహస్యాన్ని తెలియచేశాడు. మానవుని ఉనికి అన్నదెంత ఫలప్రదమో, దాన్నెలా ఫలప్రదం చేసుకోవాలో అతనే నేర్పాడు. అందుకే అతను తన నెచ్చెలి. అంతేకాదు గురువు. తనింకా బ్రతికే ఉంది. తనొక్కర్తేకాదు, తన భవిష్యత్తును సుఖప్రదం చెయ్యగల తన ముద్దుబిడ్డ కూడా

ఉన్నాడు. ఇద్దరూ యిప్పుడు స్వతంత్రులే. అందుకే ఆమెలో ఒకమాదిరి సంతృప్తి జనించింది. అందుకే ఆమెలో ఆశ పొడసూపింది. ఆకాంక్ష మొలకలెత్తింది.

# 2

వరీనియాయొక్క జీవిత శేషం యీ విధంగా గడిచింది. ఆమె మిగిలిన వృత్తాంతమిది. ఏ ఆడదైనా ఒంటరిగా బ్రతకలేదు. ఆమె నివాస మేర్పరుచుకున్న ఆ గ్రామంలో గాల్ ప్రజలు బ్రతుకుతున్నారు. అందరూ రైతులు. అందులో ఒక రైతు భార్య పాపం ప్రసవకాలంలో చచ్చిపోయింది. వరీనియా కతను తల దాచుకుందుకు చోటిచ్చాడు. బహుశః ఆ రైతుల కామె తప్పించుకుని పారివచ్చిన బానిసని తెలిసుండొచ్చు. ఆమె ఆరోగ్యంగానే ఉంది. ఆమెలోని నిరాడంబరత్వాన్నీ, ఆమె ఆరోగ్యాన్నీ ప్రజలు మెచ్చుకున్నారు. అందుకే ఆమెను వాళ్ళు ఆదరించారు.

ఆమె యింటి యజమానికూడా అందరిలాగా బ్రతుకుతున్న ఒక అమాయకపు రైతు. అతనికి చాలమంది సాధారణ రైతులలాగనే వ్రాయడం, చదవడం వగైరా యేమీ రావు. అతను స్పార్టకస్ కాడు. కాని స్పార్టకస్‌కీ అతనికీ చాలా దగ్గర పోలికలు లేకపోలేదు. వాళ్ళు మాట్లాడుకునే భాష ఆమెకు సులభంగా వచ్చేసింది. లాటిన్‌భాషే వాళ్ళ వాడుకభాష. కాని దాన్లో గాల్ భాషలోని పదాలు విరివిగా దొర్లు తుంటాయి. తన జాతి ఆచార వ్యవహారాలకూ, యీ జాతి వాటికీ యేమంత తేడా లేదు. భూమి దున్నటం, పంట పండించటం వాళ్ళ ప్రధాన వృత్తి. తనజాతి ప్రజలూ అంతే. ఆ పండినపంటలో కొంతభాగం మత పీఠాలకూ, భగవంతునికీ, మరి కొంత భాగం రోమన్ మహాసామ్రాజ్యానికి చెందిన పన్నులవాళ్ళకీ; మిగిలిందేదో తమకీ లభించేది. వాళ్ళు బ్రతికినన్నాళ్ళు బ్రతికి చచ్చేవారు. సంతోషంతో నాట్యం చేసేవారు. జానపదగీతా లాలపించేవారు. యెక్కువగా విచారంతో దుఃఖించేవారు. పెళ్ళాడేవారు. అతి సామాన్యమానవుని జీవిత పరిభ్రమణ లెలా గుండేవో అల్లాగే వాళ్ళ జీవితాలు కూడా దొర్లిపోయేవి.

ప్రపంచం బ్రహ్మాండమైన మార్పులకు లోనవుతోంది. కాని, ఆ బ్రహ్మాండమైన మార్పులేవీ ఈ గ్రామంలో కనపడవు. ఆ మార్పు లీ గ్రామం సరిహద్దులను కూడా ముట్టలేవు. ఈ గ్రామం ఆ మార్పులను గుర్తించదు; వాటివల్ల యిక్కడ యేదీ మారదు.

వరీనియాకు పిల్లలుపుట్టారు. ఏటా కాన్పులు; ఏడుగురు పిలలు పుట్టేరు. వాళ్ళతోబాటే బాలుడైన స్పార్టకస్‌కూడా పెరిగాడు. పొడుగ్గా బలిష్టంగా వుంటాడతను.

అతని యేడోయేట తల్లి అతని తండ్రి గురించి చెప్పింది. తండ్రి యేం చేసేడో కూడా చెప్పింది. కొడుకు కొంత బాగా అర్థం అవుతుందనుకోలేదామె. అందుకే కొడుకూ తను చెప్పినదంతా పూరాగా అర్థం చేసుకున్నందు కాశ్చర్యపడింది. ఈ ఊళ్ళో యెవరూ అంతకు పూర్వం యీ స్పార్టకస్ పేరే వినలేదు. ప్రపంచాన్ని ఊపి పారేసే సంఘటన లెన్నో జరిగాయి కాని యీ ఊళ్ళో మాత్రం వాటి ప్రభావం శూన్యం. బహుశా అవి యీ గ్రామం పొలిమేరలనుండే దొలగిపోయేవేమో? తన పిల్లలందరికీ పెరిగి పెద్దవాళ్ళయేముందు వరీనియా యీ కథనే చెప్పింది. ఎన్నో మార్లు చెప్పేది. ఒక సామాన్యమానవుడు, అంతకన్న అధమం ఒక బానిస, దౌర్జన్యానికీ, బానిసత్వానికీ వ్యతిరేకంగా యెంత వీరోచితంగా పోరాడేడో, బలసంపన్నమైన రోమ్ నేవిధంగా నాలుగేళ్ళబాటు మంచినీళ్ళు త్రాగకుండా గడగడలాడించి పారేసేడో, అతని పేరంటేనే హడలి చచ్చేస్థితి తీసుకురాగలిగాడో ఆమె కళ్ళకు కట్టినట్లు చెప్పేది. అనంతమైన న్యూబియా ఎడారిలో ఒంటరిగా పడియేడ్చే దౌర్భాగ్యపు గనులగురించీ, స్పార్టకస్ ఆ గనులలో యెంత అవస్థపడ్డదీ ఆమె చెప్పింది. రోమన్ రంగస్థలాలలో యిసుకలో నగ్నంగా నిలబడి కత్తిచేతపట్టి సోదరప్రాణితో యేవిధంగా అతను పోరాడవలసి వచ్చేదో చెప్పింది. అతనిలోని సహృదయత గురించీ శాంత, సౌమ్యస్వభావం గురించీ కూడా చెప్పేది. ఆ కథలు చెప్పేటప్పుడామె తను నివసిస్తున్న ఆ గ్రామంలోని సాధారణ రైతులతో అతన్నిపోల్చి చెప్పేది. స్పార్టకస్ అనుచరులను గురించి చెప్పేటప్పుడు గ్రామంలోని యెవరినో ఉదాహరణగా తీసుకునేది. దాంతో వాళ్ళకతని బాధలు, గాథలు హృదయానికి హత్తుకునేలా బోధపడేవి. ఈ కథలు చెప్తున్నంతసేపు ఆమె భర్త ఆశ్చర్యంతో వినేవాడు. ఆమెకింత జీవితానుభావం ఉన్నందుకూ సక్రమంగా ఈర్ష్య చెందేవాడు.

వరీనియా తన జీవితశేషం కాలుమీద కాలేసుకుని గడపలేదు. సూర్యోదయం నుంచి సూర్యాస్తమయంవఱకూ నడుంవంచి పనిచేసేది. కలుపుతియ్యడం, కోతల కెళ్ళడం, యిళ్ళూడ్చడం, నూలువడకడం, బట్టలు నేసుకోడం అన్నీ చేసేది, చెయ్యాల్సొచ్చేది. ఆమె సుకుమారగాత్రం గట్టిపడింది. చక్కని శరీరచ్ఛాయ మాయమై ఆమె చర్మం ఎండకి నల్లబడింది. ఆమె యెప్పుడూ తన అందాన్ని కాపాడుకుందుకు ప్రయత్నించలేదు కూడా. గతాన్ని గురించి ఆలోచించినప్పుడల్లా ఆమెలో సంతృప్తి జనించేది. జీవితం తన కిచ్చిన అమూల్యానుభవాని కామె కృతజ్ఞత చూపేది. స్పార్టకస్ పోయినందుకామె విచారించలేదు. స్పార్టకస్‌తో ఆమె జీవితం ఒక మధుర స్వప్నమై, మధురస్మృతియై నిలచింది.

తన పెద్దకొడుకు యిరవైయోయేట ఆమెకు జ్వరమొచ్చింది. మూడురోజులయాక చచ్చిపోయింది. ఆమె సుఖంగా ప్రాణం వదిలేసింది. చచ్చేముందు తీసుకోవడంకాని, బాధపడటంగాని యేమీ లేకుండా హాయిగా ప్రాణం వదిలింది. ఆమె భర్తా, పిల్లలూ విచారించారు; భూమిలో పాతిపెట్టారు.

ఆమె చచ్చిపోయాక యీ గ్రామంలో మార్పులు రాసాగాయి. పన్నులు పెరగటం ప్రారంభించాయి. ఇంకా పెరగటానికొక అంతమనేది లేకపోయింది. ఎండలు తీక్షణంగా కాసేయి. వర్షాలు లేవు. భరించలేని వేసవి వచ్చింది. దాని వెన్నంటి రోమన్ సైనికులొచ్చారు. పన్నులు చెల్లించలేని కుటుంబాలన్నింటినీ చేర్చారు. ప్రతివాళ్ళకీ మెడకొక గొలుసు తగిలించారు. స్వగ్రామంనుంచి పంపించేశారు. రోమన్ బానిస వర్తకులకు వీళ్ళు లాభాలు చేకూర్చాలి.

పన్నులు చెల్లించలేనివాళ్ళంతా ఈ పద్ధతికి లొంగలేదు. యువకుడైన స్పార్టకస్ అతని తమ్ములూ, చెల్లెళ్ళూ మరికొందరూ కలిసి వాళ్ళ గ్రామానికి ఉత్తరంగావున్న అడవులలోనికి పారిపోయారు. ఆ అడవులు ఆల్ప్స పర్వతాల వఱకేకాక పర్వతాలలోనికికూడా వ్యాపించి ఉన్నాయి. వాళ్ళక్కడ ఆకులూ, అలములూ తిని బ్రతికేవారు. అప్పుడప్పుడు జంతువులను వేటాడేవారు. ఐనాసరే యెవరైనా తమ పూర్వపు భూములమీద భవనాలు నిర్మిస్తే నిర్మాణం అంతా పూర్తయేవఱకూ ఆగి, ఆ భవనాలను తగలబెట్టి వాటిలోని సామగ్రి కొల్లగొట్టి తెచ్చేవారు.

అప్పుడా అడవులలో సైనికులుకూడా ప్రవేశించారు. ఆ సైనికులతో పోరాడేందుకు రైతులుకూడా యీ పలాయితులకు తోడ్పడేవారు. పారి వచ్చిన బానిసలందరూ వీళ్ళతో కలిసేవారు. ఆ విధంగా సర్వకాల సర్వావస్థలయందూ అణగార్తులు పీడకులపై సాగించే యుద్ధం జరుగుతూనే ఉండేది. ఒక్కొక్కప్పుడు వాళ్ళు సైనికుల చేతిలో ఓడిపోయేవారు. మరొకప్పుడు వీళ్ళే పర్వతాలు దిగి మైదానాల్లో ప్రవేశించి రోమన్ భవనాలు తగలబెట్టడం, లూటీ చెయ్యడం మొదలైనవి చేసేవారు.

ఈ విధంగా బ్రతికి, స్పార్టకస్ కొడుకు స్పార్టకస్ చచ్చిపోయాడు. తన తండ్రివలెనే స్వాతంత్ర్య సమరంలో, పోరాటంలో చచ్చిపోయాడు. అతను కొడుకులకు చెప్పిన కథలలో నిజం పాలు తక్కువ వుండేది; స్పష్టంగాకూడా ఉండేవికావా కథలు. కథలు, గాథలయాయి. ఆ గాథలే వాళ్ళకు చిహ్నాలయాయి. పీడితులు పీడకులపై సాగించే యుద్ధం కొనసాగుతూనే ఉంది. అదొక అఖండజ్యోతి. ఒక్కొక్కప్పుడా జ్యోతి విశ్వమంతా నిండి వెలుగొందేది. అనంత విశ్వమంతా జ్యోతిర్మయమయేది. ఒకొక్కప్పుడదే జ్యోతి కరదీపికలా చిన్నదిగా వెలిగేది. కాని ఆ జ్యోతి

యెల్లప్పుడూ వెలుగుతూనే ఉండేది. అదేవిధంగా స్పార్టకస్ పేరుకూడా రూపుమాసి పోలేదు. ఆ పేరు వంశపారంపర్యంగా తండ్రులు కొడుకులకూ కొడుకులు తమ పుత్రులకూ పెట్టేరా లేదా అన్నది ప్రశ్నే కాదు. అది సంఘంయొక్క సమిష్టి ప్రయోజనాల దృష్ట్యా సాగించబడ్డ పోరాటంద్వారా ఒక తరంవారు మరొక తరంవారికి ప్రసాదించిన వారసత్వం, హక్కు.

ఒకరోజొస్తుంది. ఆనాడు రోమ్ సర్వనాశనం కావించబడుతుంది. ఒక్క బానిసలే కాదు; బానిసలు, రైతులు, కూలీలు, బర్బరులు అందరూ ఒక్కటవుతారు.

సంఘంలో చాలామంది యెల్లప్పుడూ తమ శ్రమశక్తిని ధారపోసి సృష్టించిన సంపదనంతనూ యే కొద్దిమందో భుక్తంచేసుకుని మానవజాతిని దోపిడీచేసినంత కాలమూ, ఈ స్పార్టకస్ పేరు జ్ఞాపకముంటూనే వుంటుంది; ప్రతిధ్వనిస్తూనే వుంటుంది. భయంవల్లనో, శక్తిహీనతవల్లనో ఒక్కొక్కప్పుడా పేరు గుసగుసల లోనే ఉండిపోవచ్చు. కాని అదే పేరు మరొకప్పుడు రణన్నినాదమై దిక్కులు పిక్కటిల్లేటట్లు, విశ్వమంతా కంపించేటట్లు ప్రతిధ్వనించవచ్చు.



